

శ్రీమదాంధ్ర వాల్మీకి

# వచన రామాయణము

## యుద్ధ కాండము

శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



రచయిత్రి శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

పతిదేవులు (పరమపదవాసులు) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లతో

Published by

**www.pravachanam.com**

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిస్టర్డ్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)

శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.



వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు

తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు.

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.

ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.



(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక



# యుద్ధకాండము



పరిష్కర్త


శ్రీ వింజమూరి శేషఫణి శర్మ



ముద్రణా సహకారం

pravachanam.com బృందం

# యుద్ధకాండము

**శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతవ**



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్. టి.పి.ఎస్.వి. రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్స్

**ముద్రిక ప్రింటర్స్**, విజయవాడ.

# ......నివేదన......

శ్రీ సకల భువన సామ్రాజ్య లక్ష్మీనారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తి చేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమలపెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమపదవాసులు శ్రీమాన్ వేంకట రాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్ర శాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లు గారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్ష జ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకట నరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తరకాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆధ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధాకృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ–ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము' లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు – లీల దంపతులును, 'సుందరకాండము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య – భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు – విజయలక్ష్మీ దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారికి సర్వ హక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా సంపుటీకరణములైన 'సన్మార్గదర్శనము', 'ఆత్మజ్ఞానమునకాధారము', 'అహం వేద్మి' మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచవలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృప జేసినందున ఆమె మఱియు ఆమె

కుటుంబము తరపున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'pravachanam.com' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగునుగాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి. ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామ చంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ఌ ముందుమాటలు ఢ

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృత మైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే. వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియై యున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావు గారిచే రచింపబడినది. కనుక దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించుచుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాల స్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తల పైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్ లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచనలిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయీభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము, శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీ నారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

**(సం) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారి రుద్రవరము)**

శ్రీరామ శ్శరణం మమ

# అభినందనము

శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞాన వైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రత యగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

‘‘సీతాయాశ్చరితం మహత్’’ అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పు కొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థ ప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము

నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము – కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మిక మైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష–విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో – గ్రాంథికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు – వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండా ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠక లోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింప చేసిన ధన్యచరిత, మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీ సంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

26-12-1989



శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః

# ఆశీస్సు

**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖా పేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుష శేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనములేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షా ప్రేక్ష మగుట చేతనున్నూ – ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాసముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతః ప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్చరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।**
**వేదః ప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, “కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్” అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**“మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయాశ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యము లగునటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

(సం) **మొలుగు రామానుజాచార్యులు**

**ముగ్గుళ్ళ**

## విషయసూచిక



శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమ త్సమేత
శ్రీరామ చంద్ర పర బ్రహ్మణే నమః
శ్రీ శారదాయై నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర వాల్మీకి వచన రామాయణము

(శ్రీవావిలికొలను సుబ్బారాయ ప్రణీతమైన పద్యకావ్యమునకు వచనము)
శ్రీమతి యస్.టి.పి.వి. సీతమ్మగారు

ది. 16.6.85 ప్రారంభం

# యుద్ధకాండము

**ఓ శ్రీహరీ ! నిన్ను ప్రపత్తిచేయు వారి పాపములు హరించువాడా! దయయే ప్రధానముగా గలవాడా! శత్రువులకు భయము కలిగించు వాడా! తాపములను హరించువాడా! బ్రహ్మశివులచే నుతింప బడువాడా! భూ పుత్రిని రంజింపజేయువాడా! రాజువైన ఓ రామ చంద్ర ప్రభూ!**

# మొదటి సర్గము

## శ్రీరాముడు హనుమంతుని ప్రశంసించుట:

తామర రేకుల వంటి కన్నులు గల రాముడు అగ్ని వలె నెఱ్ఱనైన ముఖముగల హనుమంతుడు ఆ విధముగా ఉన్నదున్నట్లుగా చెప్పిన మాటలను విన్నవాడై సంతోషముతో నిండిన మనస్సు గలవాడై యతనితో నిట్లనెను. ఇతరులకు మనస్సులోనైన చేయనూహింపరాని యసాధ్యమైన యిట్టి మహాకార్యమును మహాత్ముడైన హనుమంతుడు నెరవేర్చెను. ఇతనికి భూమండలమున సాటి యెవ్వరైన గలరా? ఈ వాయుపుత్రుడు గాక గరుత్మంతుడును వాయుదేవుడును తప్ప వేరొకరికి ఆ సముద్రము దాటుట శక్యమా? (గరుత్మంతుని, వాయుదేవుని గలిపి చెప్పుటచే వారిద్దఱొకయెత్తనియు, హనుమంతు డొక్కయెత్తనియు అర్థము) దేవతలకు గాని, యక్ష రాక్షసులకు గాని గొప్ప సర్పములకు గాని తేరిపార చూడరానిదియు, రావణునిచే పాలింప బడినదియు, లక్ష్మీ సంపన్నమైనదియు, అగు లంకను గొప్పనైన ధైర్యలక్ష్మితో ప్రవేశించుటెక్కడ? ప్రవేశించినను ప్రాణములతో తిరిగి వచ్చుట యెక్కడ? మునుపెన్నడైన నిట్టిది చూచితిమా? ఈ విధముగా విక్రమము బలము శౌర్యము గలిగిన మహాత్ములతో పోల్పదగిన వాడు గాకున్నచో రాక్షస సైన్యముచే కాపాడబడుచు తేరి చూడరానిదైన లంకను ఈ విధముగా ప్రవేశింప గలడా? ప్రస్తుతింప దగినట్లుగా సూర్యపుత్రుని యాజ్ఞను వాయుపుత్రుడు నెరవేర్చెను. తగిన విధముగ తన బలపరాక్రమములను చూపెను. తన యజమాని మిగుల కష్టమైన పని నాజ్ఞాపింపగా భక్తితో ఆపనిని చేయుటయేకాక తనకు చెప్పనిదైనను దానికి సంబంధించిన పనిని గూడ చేసికొని వచ్చినట్టి భృత్యశ్రేష్ఠుని పురుషోత్తముడని సజ్జనులు చెప్పుదురు. తన స్వామిచే నియోగింపబడియు, తనయజమాని కిష్టమైనదని తెలిసియు తనకు చెప్పలేదుగదాయని ఎక్కువ పనిని చేయని భృత్యుడు మధ్యముడని బుద్ధిమంతులచే చెప్పబడును. యజమానిచే నియోగింపబడియు, ఆ కార్యమును చేయశక్తి గలిగియుండియు భృత్యుడు శ్రద్ధలేనివాడై చేయక చెడగొట్టినచో పెద్దలాతనిని పురుషులలో నధముడని యందురు. అందుచే తనయొక్క ఆత్మగౌరవము చెడకుండ వాయుపుత్రుడైన హనుమంతుడు తన రాజైన

సూర్యనందనుడు సంతసించునట్లు తనకు నియోగింపబడిన కార్యమును నెరవేర్చెను. అంతేకాక రఘువంశమును, నన్ను, లక్ష్మణుని, సీతజాడ దెల్పుటచే నిందతో చావకుండ రక్షించి ధర్మమును నిలబెట్టెను. ఇటువంటి మిక్కిలి ప్రీతికరమైన వార్తను తెలియజేసిన వాయుపుత్రుని కార్యమునకు బాగుగా సరితూగగల ప్రియకార్యమును ఇంచుకంతయును చేయలేకుంటినని నేను విచారించుచుంటిని. నా హృదయమునకు గలిగిన ఈ వ్యాకులత్వము నాకున్న సర్వ ధనము నిచ్చినను పోదు. నేను ధనవంతుడనుగాను. ఇంక నీకు నీ యుపకారమునకు దగిన ప్రత్యుపకారమునే నిచ్చుట ఏ విధముగా చేయగలను, ఓ మహాత్ముడవైన మారుతాత్మజా! దానికి బదులుగా నాయొక్క కౌగిలిని గ్రహింపుము (హనుమంతుని శ్రద్ధాభక్తులకు తనకు గల ధనమంతయు నిచ్చినను, ప్రపంచ మంతయు నిచ్చినను మోక్షమిచ్చినను సరి కాజాలదు. కాన భక్తునకు తననే సమర్పణ చేసికొనెను. కృష్ణుడు గోపికలకు చెప్పిన వాక్యము స్మరించునది.) అని పులకించిన శరీరము గలిగి గద్గద కంఠముతో పలికి ఇనవంశజుల కాభరణము వంటివాడగు రాముడప్పుడు తనకప్పగించిన కార్యమును నెరవేర్చిన వాడును మహాత్ముడును అగు హనుమంతుని మనసార గట్టిగా కౌగిలించెను. అట్లు కౌగిట జేర్చి రఘురాముడు మఱల మనస్సులో నించుక యాలోచించి సూర్యపుత్రుడగు సుగ్రీవుని జూచి సుగ్రీవా! జానకిని వెదకుపని పూర్తియైనది గాని ఆ సముద్రమును తలంచుకొనగా మనస్సు జల్లు మనుచుండెను సుమా. తరింపరాని యా సముద్రము నీ సమస్త వానరులును దాటి దక్షిణపు తీరమున కెట్లు చేరెదరో సాటిలేని బలముగల సుగ్రీవా! నీ వొక్కయుపాయమును చెప్పుము. ఆ జనక రాజపుత్రి యుండెడు చోటును, ఆమె వార్తలను ఇంపుగా మీరు చెప్పగా నేను వింటిని గాని ఓ వానరులారా! ఇందఱము నాసముద్రము నెట్లు దాట సమకూరగలదో చెప్పుడు. అని పలికి శత్రువులను సంహరించు వాడును మహా భుజుడును అగు రామచంద్రుడు విడువకుండగా తనను దుఃఖము బాధించుచుండగా హనుమంతునితో ఆలోచించెను.

★★★

# రెండవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరాముని కుత్సాహంబు గలుగ భాషించుట:

అట్లు దుఃఖముచే తపించుచున్న దశరథ నందనుని చూచి సుగ్రీవుడు శోకమును పోగొట్టునట్టి మంచి మాటలతో నిట్లనెను. ఓ రాజపుత్రా! ఏలనయ్యా! ప్రాకృతుని వలె నిట్లు సంతాపమును పొందెదవు? కృతఘ్నుడు సన్మైత్రిని దూరముగా నెట్టివేయునట్లు నీ వీ దుఃఖమును విడిచి పెట్టుము. నీ వింతగా సంతాప పడుటకు తగిన కారణమేమియును కనబడుట లేదు. పగవాని నివాసము తెలిసినది గదా. బలముచే సముద్రమును దాటి లంకను చుట్టుముట్టి ధైర్యముతో నీ విరోధిని సంహరించి విజయమును పొందగలము. ఇట్లు నీవు కలత చెందనేల? బుద్ధి మంతుడవు. శాస్త్రములు తెలిసిన వారిలో శ్రేష్ఠుడవు. ఆలోచింపగా పండితులలో నుత్తముడవు. ప్రాజ్ఞులచే కీర్తింపబడు వాడవు.

నీ విట్లు శోకముచే కృశింపదగునా? యోగీంద్రులు తమ ప్రయోజనమునకు హాని కలిగించు పనులను విడచునట్లు నీవును మనస్సు నుండి వ్యధను విడిచిపెట్టుము. శోకించుట, దైన్యముతో నుండుట, కార్యమును నాశనము చేయును సుమా. అతి వేగముగా సముద్రమును దాటి నీ విరోధులైన రాక్షసులు సగ్గిసముగ్గిసలుగా లంకయందు బాధ నొందునట్లుగా వానరవీరులు వారినందఱిని గగ్గోలుపడ జేసెదరు. చూడుము. ఉత్సాహమువీడిన వాడై దీనుడై శోకముతో కృశించు మానవుని పనులన్నియు చెడును. అతడెల్లప్పుడు వీడని వ్యసనములను పొందుచుండును, రామచంద్రా! నేను చెప్పుమాట చాల దృఢమైనది సుమా. ఈ వానర వీరులు బుద్ధి కుశలత గలవారు. అందఱును వీరులు. పరాక్రమము గలవారు. సాహసము జూపువారిలో శ్రేష్ఠులు. ఓరాజ చంద్రా! నీ కొఱకు పనిచేయుటలో మంచి యుత్సాహముతో నున్నారు. మంటలలో దూకమని చెప్పినను వెనుదీయరు. వీరి సంతోషము చూడగా వీరి యుద్ధోత్సాహము తెలియుచున్నది. ఇది యదార్థము. నాయూహయు నదియేసుమా. పాపాత్ముడైన రావణుని యుద్ధ రంగమున సంహరించి యే విధముగ నైనను జానకీ దేవిని తేవలయును. ధైర్యము వహింపుము. ఇక నే విధముగా సముద్రమునకు సేతువు కట్టగలమో, లంకను చూచుటెట్లో ఆ విధముగా ఆలోచించి చేయుము. మన మా లంకను జూచినంతనే వాడు చచ్చినట్లు

తలంపుము. సేతువును నిర్మింపకుండ ఆ సముద్రమును దాటుట దేవతలకైనను శక్యము గాదు. అట్లు సేతువును గట్టినచో వానరులు సముద్రమును దాటుటయు శత్రువులను సంహరించుటయును చేసినట్లే నిశ్చయించుకొనుము. వానరులు కామరూపులు. యుద్ధము నందు శౌర్యము చూపువారు. కలహమనిన జంకు లేని వారు. కాన ఓ రాజ చంద్రా! కార్యమును నాశనముచేయు నట్టి బుద్ధి యందలి కలతను వదలి పెట్టుము. లోకమునందు దుఃఖమెప్పుడైనను శౌర్యమును నశింపజేయును. కనుక నీకు కలత తగినది కాదు. శౌర్యమే ముఖ్యముగా గల జనులు కార్యములందు బలమును, ధైర్యమును, సంతోషము నెప్పుడును విడువరుసుమా. లోకమునందు స్థిరమైన బలముగల నిన్ను బోలిన మహాత్ములు మనోవ్యాకులత నెప్పుడును సహింపరు. మంచి జరిగినప్పుడుగాని చెడు జరిగినప్పుడు గాని మనోధృతిని వీడరు. శోకము సర్వకార్వ నాశకమని తెలిసికొన్న వారై దైన్యమును విడచిపెట్టి యెల్లప్పుడు ధైర్యగుణమునే కొని యాడుచుందురు. నీవో బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు. నిర్మలమైన మనస్సు గలవాడవు. శాస్త్రములు చదివినవారిలో మిక్కిలి శ్రేష్ఠుడవు. ఎదురులేని విక్రమము గలవాడవు. ఓ రాజేంద్రా! ఇప్పుడు అగ్నిహోత్రుని విధముగా మా వంటి బంధువులతో హితులతో శత్రు సంఘమును వేగముగా చేరదగును గాని విచారించుట కిది సమయము కాదు సుమా. విల్లును బాణములును చేత ధరించిన నీకు మూడు లోకములందును ఎదురుగా నిల్చి పోరగలవానిని చూడలేదు. వానరులా! బలసమన్వితులు. వారు పూనుకొని చేయు నేకార్యమైనను చెడిపోదు. గొప్ప సముద్రము నేవిధముగనైన దాటి నీవు వేగమే నీ ప్రాణేశ్వరిని చూచెదవు గాక. కాన ఓ రామభద్రా! దుఃఖమును విడువుము. నీ మనస్సునందు దుఃఖమునకు బదులుగా క్రోధమును వహింపుము. కోపవంతుని జూచి రాజులు నిశ్చేష్టులై మందభాగ్యులై గడగడ వణకెదరు సుమా. మాతో గలసి నీవిప్పుడు సముద్రమును దాటు విధానమెట్టిదో ఆ పద్ధతిని నీ మనస్సునందు సూక్ష్మబుద్ధితో నాలోచింపుము. మన సేనలు సముద్రపు దక్షిణ తీరమును చేరినట్లైనచో విరోధులు నాశనమైనట్లే తలంపుము. ఈ వానరులు రాళ్లను వృక్షములను వర్షించి యుద్ధమునందు శత్రువర్గమును గూల్చెదరు. ఆ వరుణాలయము(సముద్రము) నెటులైనను దాటవలయును. అంతవఱకే కష్టము. విరోధియైన రావణాసురుడు యుద్ధమునందు సంహరింప బడినట్లే తలంచెదను సుమా. రామచంద్రా! అనేకములైన మాటలెందులకు? ఏవిధముగానైనను నీకు విజయము కలుగును. శుభము గలిగించు లక్షణములను చూచుచుంటిని. నామనస్సు మిక్కిలిగా సంతోషసముద్రమున తేలుచున్నది.

★★★

# మూడవ సర్గము

## శ్రీరాముడు లంకయందలి దుర్గములను హనుమంతు నడగుట:

అని సుగ్రీవుడు చెప్పిన యుక్తియుక్తములగు మాటలను పరమార్థవిదుడైన జానకీపతి చక్కగా గ్రహించి వాయుపుత్రా! ఓహనుమా! నీవు నీ కనులార రావణుని పురవీధులన్నియు జూచితివి కదా. ఆ లంకయందెన్ని దుర్గములున్నవి? బలమెంత మాత్రము? నా తపోబలము చేత గాని, సేతువుచేత గాని, వాడిగలిగిన అగ్ని వంటి బాణములచేత సముద్రము నెండించి గాని ఏ తీరుగనైనను సాగరమును దాటుటకు నేను సమర్థుడను. నీ వా రాక్షసుని భవనము యొక్క ద్వారములు, దుర్గములు మొదలైన రహస్యములను చెప్పుము. నీవు తీరుబాటుగా సర్వమును తిరిగి చూచితివి. నీ వన్ని విధముల నేర్పరివి గదా. ఆంజనేయా! అని రామభద్రుడు తన్ను ప్రశ్నింపగా హనుమంతుడు దేవా! వినుము. లంకయొక్క మహిమయు, దుర్గముల దార్ఢ్యమును, బలసమూహముల యొక్కయు వాహనములయెక్కయు మహిమను, సౌధముల యొక్క యేర్పాటును, సముద్రమును, భయంకరములైన రహస్య కర్మములును, మహాబలవంతుడయిన సురవిరోధి యొక్క శక్తియు ననెడి వేద్యములైన సర్వ విషయములను విన్నవించెదను. రాజ చంద్రా! మిక్కిలి గొప్పదై, ఏనుగులచే, గుఱ్ఱములచే సంకులమై, గొప్పగొప్ప రథములు గలదై, ఎల్లెడల రాక్షసులచే నిండినదై చతురంగ బలములచే నాల్గువైపుల కాపలా కాయబడుచున్నదై నాల్గు ద్వారములు గలదై ఆయింద్ర విరోధియైన రావణుని పట్టణము విరాజిల్లుచున్నది. అందలి ద్వార ప్రదేశము లందు రాక్షసులచే నిర్మింపబడిన యశ్మ యంత్రములు (ద్వారప్రదేశమునకు పై భాగమున శిలలు పేర్చి శత్రువుల మార్గమున దాని క్రిందకు రాగానే వారిపై అది పడునట్లు చేయు యంత్రములు.) చాల గలవు. మణులు పొదిగిన బంగారు ఆభరణము లనేకముగా ధరించిన భయంకరులగు రాక్షసులతో నిండినదై ఆ పురము చూచుటకు శక్యము కానిదై యుండును. ఆ పురము చుట్టును మహాభయంకరములైన మొసళ్లతో గూడిన యగాధములైన యగడ్తలు గలవు. వాని పై యంత్రములతో వేయుటకు తొలగించుటకు వీలు కలిగిన వంతెనలు నాల్గు ద్వారముల ముందు గలవు. మహాగృహ పంక్తులతో గూడిన యా పలక వంతెనలు శత్రువులు వచ్చునపుడు పట్టణమును రక్షించును. వానిని యంత్రముల శక్తిచే పరిఖలలో విడుచుచుందురు. అవి అరుగులును,

బంగారుస్తంభములును గలిగి గట్టివై ప్రకాశించుచుండును. వానిలో నొక వంతెన కదలింపరానిదై దృఢమై యుండును. అది శత్రువులెదురుగా వచ్చినచో మతిమంతుడైన రావణునిచే స్వయముగా మిక్కిలి జాగ్రత్తతో సేనలతో రక్షింపబడు చుండును. నదీ పర్వత వన కృత్రిమ దుర్గములు అన్యప్రవేశమున కసాధ్యములైనవి యా నగరమును పరివేష్టించియున్నవి. ఆ కారణముచే అది దేవతలకైనను ప్రవేశింపరానిదై యున్నది. సముద్ర తీరమునందు నావలు వెళ్లుటకైనను మార్గములేనిదై వార్తలనందించుటకైనను ప్రవేశము లేనిదై పర్వతముపై అమరావతి వలె ఆ లంకానగర మొప్పుచున్నది. ఏనుగులతో గుఱ్ఱములతో నిండినదై శ్రేష్ఠమైన యంత్రములు, అనేక విధములైన పరిఘలు, శతఘ్నులు గలదై ఇతరులకు జయింపరానిదై దశముఖునిచే పాలింపబడుచున్నది. రామచంద్రా! అందు తూర్పు ద్వారమును రక్షించువారు పదివేల మందియుందురు. వారు ఖడ్గములు ధరించిన మహాబలవంతులు. శూలములను ధరించినవారు, యుద్ధవిశారదులు, పరాక్రమవంతులు జయింపరాని వారునగు పది వేలమంది దక్షిణద్వారమును రక్షించుచుందురు. సుశిక్షితులైన యోధులు మహా విక్రమవంతులు చతురంగబలములతో గూడి పడమటి దిక్కు ద్వారము నెల్లప్పుడు రక్షించుచుందురు. సర్వాస్త్రములందును నేర్పుగలవారు ఉత్తర ద్వారమున నెల్లవేళల నిలచియుండెదరు. లక్షమంది శ్రేష్ఠులైన యోధులు గుఱ్ఱములను ఏనుగులను వాహనములుగా గలవారు రాక్షసరాజునకు గౌరవింపదగినవారు నగరమధ్య భాగమునందు రక్షించుచుందురు. ఆ పట్టణమునంతను మధ్యాహ్నసూర్యులవలె వెలుగొందువారు, మాంసభక్షకులునైన రాక్షసులు ఒక కోటిమంది యెప్పుడును కాచుచుండెదరు. నే నావంతెన లెల్లను చెడగొట్టితిని. ఆ బలమునందు నాల్గవవంతు సైన్యమును నాశనము చేసితిని. అగడ్తలను పాడుచేసితిని. వానియొక్క చక్కని రూపములను చెడగొట్టితిని. ఎచ్చట చూచినను నిప్పుడు రాక్షసరాజు పట్టణమున చెడిపోయినవే కనిపించును. రామచంద్రా! ఏవిధముగనైన సముద్రమును దాటినచో లంకాపట్టణము వానరకోట్లచే పాడైన దనియే నమ్ముము. రాజచంద్రా! అంగదుడు, ద్వివిదుడు, ఋక్షధ్వజుడు, నీలుడు, మైందుడు, పవనుడు, నలుడు మాత్రము సముద్రమును దాటిన చాలును. బలమంతయు నెందులకు? వీరు రాక్షసరాజుపట్టణమున ప్రవేశించి పర్వతములను, వనములను పాడుచేసి, తోరణములను విరుగ గొట్టి ప్రాకారములను తుక్కు తుక్కు చేసి, సౌధములను దుమ్ములో గలియునట్లు చేసి వచ్చెదరు. అందుచే వారిని పంపించుము. రామా! ప్రయాణమునకై మంచి ముహూర్తమును నిర్ణయింపుము.

★★★

# నాలుగవ సర్గము

## శ్రీరాముడు వానరసేనలతో లంకపై దండయాత్ర వెడలుట:

అని హనుమంతుడు చెప్పు మాటలను వరుసగా విని రాము డిట్లనెను. హనుమంతా! నే నా దానవరాజు పట్టణమును నాశనము చేసెదను. చూచుచుండుడు. ఇది నిజముగా చెప్పుచున్నాను.ఇదియే మంచి ముహూర్తము ప్రయాణము చేయుటకు. పద్మమిత్రుడాకాశ మధ్య మందున్నవాడు. ఇది విజయముగలిగించు ముహూర్తము. (హనునుంతుడు తొలుత సముద్రమును దాటి సంధ్యాకాలమున లంకలో ప్రవేశించి సీతను వెదకి కనుగొని రాక్షసులతో యుద్ధము చేసి యింద్రజిత్తుచే పట్టుపడునప్పటి కరుణోదయమయ్యెను. రావణదర్శనము, లంకాదహనము మరునాటి యుదయమున జరిగెను. వెంటనే సముద్ర లంఘనము, కపులతో సమాగమము, మధువన ప్రవేశము శ్రీరామదర్శనము ఆనాటిపది, పదకొండు గంటల లోపలనే జరిగెను. 12 గంటలకు అభిజిత్లగ్నమున దండయాత్ర వెడలుట.) ఇటువంటి మంచి ముహూర్తము దాటిపోకుండగా మనము బయలుదేరినచో వానర నాయకా! మన విరోధియైన రావణుడు జానకిని వెంట నిడుకొని ప్రాణములతో నెక్కడికి వెళ్లగల్గును? ఓ సూర్య పుత్రా! నా యీ దండయాత్ర వార్తను విని నా ప్రియురాలగు సీత బ్రతుకునందాస యేర్పరుచుకొనునుగాక. వ్యాధి పీడితుడు చేతి కందిన విషము త్రాగి మరణమునకు చేరువలో నున్నను అమృతమును పానము చేసినచో బ్రతుకుపై ఆశ జనించును గదా. కనుక ఈ సమయమందు వృధాగా కాలయాపనము చేయుటెందులకు? ఓ సూర్యపుత్రా! నేడుత్తరఫల్గుణీ నక్షత్రము. రేపు చంద్రుడు హస్త యందుండును, కాన నేడే సకల సేనలతో గలిసి ప్రయాణమగుట లెస్సగదా. శ్రేష్ఠములు శుభకరములునైన శకునము లెన్నియో తోచుచున్నవి. మనకు మేలు కలుగగలదు. నిజముగా నేను రాక్షసరాజును సంహరించి జానకిని తెచ్చెదను సుమా. నా కుడి కన్నదరుచున్నది. శత్రువులను పారద్రోలి విజయమును పొంది జానకిని తీసికొని మన మేయపాయము లేని విధముగా రాగలము. ఆలస్యమెందులకు? త్వరగా ప్రయాణమై వెళ్లుట కిదే సమయము. అని పల్కి సుగ్రీవుడును లక్ష్మణుడును తన్నధికమైన ప్రీతితో సేవించుచుండగా నీతికోవిదుడగు రామచంద్రుడు

మఱలనిట్లనెను. సుగ్రీవా! వేగముగా నూరువేల వానరులను గొప్పబలము, శౌర్యము గల వారిని సేనాపతియగు నీలుని వెంట ముందుగా మార్గశోధనమునకై పంపుము. ఓ నీలుడా! శ్రేష్ఠములైన ఫలములతో కందమూలములతో నిండి, సుఖము గలిగించు చల్లని నీళ్లు గలిగి శ్రేష్ఠములైన మధువులు గలిగిన మార్గము వెంట ఈ వానర సేనలను నడపింపుము. జాగ్రత్తగా వినుము. దురాత్ములైన విరోధులు నీళ్లయందును మూలికలు పండ్లు మున్నగు వానియందును విషమును బెట్టియుందురు. రాక్షసులు మార్గములలో పొంచి యుందురు. జల దుర్గములందు, కొండలందు, అడవులందు, గోతులందు, బిలములందు వైరులు కనబడకుండ దాగియుండెదరు గాన వానర సంఘములు పైకెగిరి, చూడవలసియుండును. బలము శౌర్యముగల మనవారందఱును ఘోరమైన యుద్ధము చేయవలసి యుండును. బలహీనులెవ్వరైన నున్నచో కిష్కింధకు బంపి వేయుము. గట్లు తెగి ప్రవహించు నేరులవలె ఎలగోలు బలము(మార్గశోధనకై ముందు పోవు సేన)ను నూరువేలమందినిముందుగా బంపుము. గజుడు, గవాక్షుడు, గవయుడు ఆవులలో ఆబోతుల విధమున ముందుగా నేగుదురు గాక. ఋషభునితో ఈ వానరసేనను దక్షిణపు ప్రక్క రక్షింప బంపుము. మదించిన యేనుగువంటి బలము గల గంధమాదనుడు వానరబలములతో, ఉత్తర దిక్కును రక్షించుగాక. సర్వసైన్యములును సంతోషముతో గూడినవై వచ్చుచుండగా నేను ఐరావతమునెక్కి వచ్చు నింద్రుని వలె హనుమంతునిపై నెక్కి సైన్యమధ్యమందు వెళ్లెదను. ఓ సైన్యాధిపతీ! సార్వభౌమమను దిగ్గజము నెక్కి వచ్చు కుబేరునివలె అంగదునిపై నెక్కి లక్ష్మణుడు వచ్చుగాక. సేన నడిమి భాగమును సుషేణుడును, జాంబవంతుడును వేగదర్శియు రక్షింతురు గాక. రామచంద్రుడిట్లు చెప్పగానే సుగ్రీవు నాజ్ఞచే వానరులు గుహలలో నుండి పర్వత ప్రదేశముల నుండి భయంకరముగా భూమ్యాకాశములు నిండునట్లు బయల్వెడలిరి. అట్లు రామచంద్రుడు సుగ్రీవుడు లక్ష్మణుడు తోడురాగా అతి వేగముగా దక్షిణ దిశాభిముఖముగా సైన్యసమేతుడై బయలుదేరెను. వారి వెనుక ఏనుగుల వంటి వారైన (కోతులు) వానరులు, వేలును, లక్షలును, కోటులుగా సంతోషముతో నిండినవారై గంతులు వేయుచు, గర్జనలు చేయుచు, నెగురుచు, దుముకుచు, మొగ్గలు వేయుచు, ఫలములు తిని తేనెలు త్రావుచు నడచిరి. వారిలో నొక డొకని త్రోయును. ఒకనిని వేరుకడు పైకెత్తును. ఒకడు వేళాకోళము చేయును. ఒక డాతనిని పట్టి పెనగులాడును. ఒక్కడు వానిపై నెక్కును. ఒకనినొకడు త్రోసికొని నేల మీద పడిపోవుదురు. నేనే

రావణుని త్రుంచెదను. నేనే రావణుని వధించెదను. రాక్షస కోట్లనునేనే చంపుదును అని వానరులందరూ రాముని యెదుటనే వాదములాడ జొచ్చిరి. కుముదుడు, నీలుడు, ఋషభుడు సైన్యమునకు ముందుగా మార్గ శోధనమునకై వెడలిరి. బలవంతులైన వానరులు సేవించుచుండగా రామలక్ష్మణులు, వానర రాజగు సుగ్రీవుడు సేనామధ్యమున వెడలుచుండిరి. శతవలి యను నతడు వృక్షములయందు సంచరించు పదికోట్ల వానర సమూహముతో సర్వ సైన్యములను రక్షించుచుండెను. పరిచారకులు వేనవేలుగా చుట్టునుండి రాగా పనసుడు, అర్కుడు, గజుడు, కేసరుడు ప్రక్కల నుండి కాపాడుచుండిరి. జాంబవంతుడు అధికమైన శక్తితో కోతుల సేనతో మధ్యభాగమును రక్షించుచుండెను. వారికి సహాయముగా సుషేణ బలముఖులుండిరి. రామచంద్రుడు ముందుగా తరలి వెళ్లుచుండగా సేనా నాయకుడైన నీలుడు వానర సైన్యమును నాల్గు వంకల ప్రమాదము లేకుండగా అతిమెలకువతో రక్షించుచుండెను. వానరులను తొందర పెట్టుచు రంభుడు, దధీముఖుడు, రభసుడు, ప్రజంఘుడు మొదలైన కపులు వరుసలుగా వెళ్లుచు యెదుట గొప్పదైన సరస్సులు, వనములతో గూడిన సహ్యాపర్వతమును గాంచిరి. భయంకరమైన క్రోధము గల శ్రీరామునియాజ్ఞ ననుసరించి వానరసమూహములు గ్రామములను జనపదములను పంట పొలములను సమీపింపక భయముతో వెడలు చుండిరి. సముద్రము వంటిదై, సముద్రఘోష వంటి ధ్వనిగలదై వానర సైన్యమప్పుడు రామునకిరుప్రక్కల వేగవంతమైన అశ్వసైన్యమువలె నడచుచుండెను. వానరసమూహములచే పరివేష్టింప బడిన వారై రాజపుత్రులప్పుడు శ్రేష్ఠమైన గ్రహములతోను నక్షత్రములతోను గూడిన చంద్ర సూర్యులవలె ప్రకాశమానులై కనిపించుచు వెళ్లుచుండిరి.

## లక్ష్మణుడు శుభ శకునములను శ్రీరామునితో జెప్పుట:

అట్లు తారాపుత్రుడైన యంగదుని భుజములపై నెక్కి లక్ష్మణుడు సీతానాధునితో నిట్లనెను. అన్నా రాక్షసనాధుని జంపి అతని చేత దొంగిలింపబడిన వైదేహిని మఱల నీవు తేగలవు. చూచితివా! కార్య సిద్ధిని సూచించుచు ఆకాశమునందును, భూమి యందును శుభ శకునములు కనబడుచున్నవి. అనుకూలముగా వాయువులు మృదువుగా మన సైన్యములకు సంతోషము కలుగునట్లు వీచుచున్నవి. మృగముల, పక్షుల సమూహములు మృదు మధుర ధ్వనులలో ప్రకాశించుచు అరచుచున్నవి. అన్ని దిశలును ప్రసన్నములై యున్నవి. సూర్యుడు స్వచ్ఛముగా వెలుగుచున్నాడు. వేదవిదుడు, నిర్మలుడు ప్రకాశమానుడు

నయిన శుక్రుడు నీ కనుగతుడై (వెనుక వైపున) నున్నాడు. సప్తర్షి మండలము ప్రకాశముతో ధ్రువమండలమునకు ప్రదక్షిణము చేయుచున్నది. మనకు ప్రపితామహుడయిన త్రిశంకుడదిగో ఆకాశమందున పురోహితుడై మంచి ప్రకాశముతో వెలుగొందుచున్నాడు. మన ఇక్ష్వాకుల నక్షత్రమైన విశాఖను చూడుము. ఆకాశమున మిక్కిలి ప్రకాశముతో వెలుగుచున్నది. ఇవి యన్నియు మనకిట్లు నిరుపద్రవ సూచకములుగా నుండగా, శత్రువుల కెట్లున్నవో వినుము. నిరృతి దైవతమైన మూల నక్షత్రము ధూమకేతువుచే వ్యాపింప బడియుండుటచే నిది రాక్షసులకు చేటు కలుగునని తెల్పుచున్నది. ఏ విధముగా జూచినను వారికి నాశనము చేరువలోనేయున్నది. మృత్యువు సమీపించిన వారి నక్షత్రము మరణ కాలమును దెలుపుచు గ్రహపీడితమగుచుండునని యందురు. ఇప్పుడు శత్రువులందిట్టి స్థితి కనిపించుచున్నది. సరస్సులందు నీరు నిర్మలమైయున్నది. వనములన్నియు పుష్పములతో నిండి ఘుమ్మ ఘుమ్మని కమ్మని గాలులు వీచుచున్నవి. వృక్షములు ఋతువుల ననుసరించి పుష్పించి యున్నవి. తారకామయ మనెడు దారుణమైన యుద్ధము నందు దేవసేనవలె మన యుగ్రమయిన వానర సేన వెలుగుచున్నది కాన మనకు జయము తథ్యము. ఇందు సందేహము వలదు. అని శుభ శకునములను దెల్పుచు తనయన్న యొక్క మనస్సునకు సంతోషము కలుగునట్లు సుమిత్రా నందనుడు పల్కగా విని రామచంద్రుడు సంతోషమును పొంది వానరసేనలను వేగముగా నడిపించెను.

## కపి సేనలు ప్రయాణమై పోవుట:

మబ్బుల సమూహ మాకసము నంతను గప్పిన విధముగా మహాభయంకరమైన యా వానరసేనలు పర్వతములు అడవులతో గూడిన దక్షిణ దిక్కు నంతయును గప్పి వేయగా గొప్ప నైన వారి చేతుల కాళ్ల దెబ్బలచే భూమి నుండిన ధూళులు సూర్యుని కాంతిని నశింపజేయుచు ఒక్కమారుగా సమస్త జగత్తును మ్రింగి వేసినట్లుండెను. వానర సమూహములు ఎడతెగకుండ దాటుచుండుటచే యేరులు పూర్వపు మార్గములు కప్పివేయబడుటచే ప్రక్కదారుల వెంట ప్రవహింపజొచ్చెను. స్వచ్ఛమైన జలముతోగూడిన సరోవరములను, వృక్షములతో నిండియున్న పర్వతములను సమముగా నున్న భూ ప్రదేశములను, మంచి పండ్లతో నొప్పుచున్న వనములను క్రమముగా నడ్డముగాను, నడుమను, వానిక్రిందను, ప్రక్కలను వానరులు ప్రయాణము చేయుచు వెళ్లుచుండెను. అట్లు సంతోషము, బలము, వీర్యము గలవారలై యౌవనోద్ధతితోను పరాక్రమముతోను

గర్జించుచు వాయువేగముతో వానరసైన్యము వెళ్లుచుండగా అందు కొందఱు వానరులు కిలకిలమని యరచుచుండిరి. మరికొందఱు గంతులు వేయుచుండిరి. ఇంక కొందఱు గోల చేయుచుండిరి. తమ తోకలను నేలమీద జాడించి కొట్టుచు, కొండల నెగిరి దాటుచు, భూమి కదలిపోవునట్లు పాదములతోగొట్టుచు, పెద్ద పెద్ద బొబ్బలు పెట్టుచు, చెట్లను విరుగ గొట్టుచు, తమ తొడల వేగముచేత అందమైన లతలను నలగ గొట్టుచు, ఆ వానర సేనలు, నూర్లను, వేలును, లక్షలును, కోట్లునుగా భూమి యంతయును నిండగా, సుగ్రీవుని రక్షణలో ఎప్పుడెప్పుడు రాముని పత్ని యొక్క నిర్బంధమును తొలగింతమన్న కోరిక మనస్సులను తొందర పెట్టుచుండగా రాత్రింబవళ్లు నిలువకుండగా వెళ్లెను. అట్లు వెళ్లి వెళ్లి చెట్లతో నిండి దుర్గమైనదియు, మృగములతో నిండినదియు నయిన సహ్యపర్వతమును, మలయపర్వతమును, దట్టమైన అడవులను, ప్రవాహములను చూచుచు వెళ్లుచుండగా వానరులచే విరుగ గొట్టుబడినవై తమాల వృక్షములు నేల గూలినవి. ఊడుగ చెట్లును త్రుంచుచు, మామిడి చెట్లును విరుచుచు, జువ్విచెట్లను ఖండించుచు, పొగడ చెట్లను, నేరేడు చెట్లను త్రుంచుచు ఇంచుకయును భయములేని వారై వానరులు వెళ్లుచుండిరి. ఆ యడవులందుండు చెట్ల సమూహములు వాయువుచే గదలింప బడినవై వానర సమూహముల మీద మంచి సువాసనలుగల పుష్పముల నందంగా గురియించినవి. సుందరములై సుగంధ యుక్తములైన వనములలో, చందనమువలె చల్లనై, సుఖస్పర్శ గలదై మందమారుతము తుమ్మెద గుంపుల మధుర గానముతో వీవసాగెను. గాలి వేగముచే గదలిన ఈ ధాతువుల ధూళులతో పర్వతము వానర సేనలను గప్పుచుండెను. ఆ మలయ పర్వతమునందు గేదంగి, పద్మ కాష్ఠము, తినాసము, ఉలిమిరి, చంద్ర, కడగొట్టు, మామిడి, కాంచనము, ప్రబ్బలి, ఎఱ్ఱగోరింట, చూర్ణకము, వావిలి, పొగడ మొదలగు వృక్షములు వికసించిన పూలతో నిండియుండెను. అట్లు గంతులు వేయుచు వానర శ్రేష్ఠుల రాపిడి చేత అనేకములైన అడవి చెట్లు వాడి ప్రకాశము చెడినవై పుర్వతములందు కలగలడువడి యుండెను. పర్వతములమీద నున్న బావులును గుంటలును చల్లని నీటిచే నిండి యున్నవై చక్రవాకములు, కారండవములచేతను ప్రకాశించుచుండెను. పెద్దపులులు, సింహములు, ఎలుగుబంట్లు, చిరుతపులులు, దున్నపోతులు, వరాహముల గుంపులు నేత్రపర్వము గావించుచుండెను. పద్మములు, సౌగంధికములు. నల్ల, తెల్ల కలువలు మొదలగు పుష్పములతో నొప్పుచున్న కొలనులు కనిపించెను. పర్వతసాను ప్రదేశములందు పక్షులు చాలా శ్రావ్యముగా విపరీతముగా కూయజొచ్చెను. అట్టి ప్రదేశములందు వానరులు

తనివి తీరునట్లు విహరింప జొచ్చిరి. మార్గ శ్రమ తీరునట్లు దోసిళ్లతో నీళ్లు త్రావుచు, నీళ్లయందు పడి యాడుచు, సంతోషముతో ఒకరిపై నొకరు నీరు చల్లుకొనుచు, తమ తలలను నీట మధ్యముంచుచు, ఒక్కింతయును భయము లేకుండ ప్రవాహపు టొడ్డుల నెక్కుచు, పండ్లను తినుచు తేనెలు కుండలతో త్రావుచు, వృక్షములను, లతలను, పాడు చేయుచు, పర్వతములను పగుల గొట్టుచు వానర సంఘములు తిరిగెను. చెట్లు చేమలు లేని ఎత్తు ప్రదేశములందు కొందఱు వెళ్లగా, తేనెలు త్రావిన మత్తుచే చెట్ల నీడలందు కొందఱు విశ్రమించిరి. కొందఱు హేలగా పడుచు లేచుచు నుండిరి. ఎచ్చట చూచిన వానరసమూహములే నిండియుండుటచే భూమియంతయు పండిన దట్టముగా నున్న వరిచేను వలె నుండెను. ఇంద్రసమానుడైన రాముడు మహేంద్ర పర్వత శిఖరము నెక్కి మొసళ్లు చేపలు గల సముద్రమును జూచెను. మలయ పర్వతము, సహ్యపర్వతము దాటి దక్షిణ ముఖముగా వనములు, పర్వతములు దాటి సముద్ర సమీపమున నున్న తెల్లని మేట ప్రదేశమును సమీపించెను.

## శ్రీరాముడు కపిసేనతో సముద్రతీరమును జేరుట:

అప్పుడు శ్రీరామచంద్రుడు వానర రాజును జూచి సుగ్రీవా! మన మీ సముద్ర తీరమును చేరవచ్చితిమి. ఇంక ఆవలి తీరమును మన కపిసేన చేరవలెనన్న గంభీరమైన యీ సముద్రము నేదైన గొప్ప యుపాయముచేత గాని వేఱొక విధముగా దాటుటకు శక్యము గాదు సుమా. ఇది వఱకు మన కందఱకు గలిగిన విచారమే మఱల చిగురు తొడిగినది. ఇంక కాలయాపనము యోగ్యము గాదు సుమా. ఇప్పుడొక్క యుపాయము చేయవలసియున్నది గాన నీ వాలోచించి యే విధముగా చేయదగునో నిర్దేశింపుము. సుగ్రీవా! వానర సైన్యమునంతయు ఇచ్చటనే నిలచి యుండుట కాజ్ఞాపింపుము. ఇచ్చట నున్న వానర సేన ఏ పని గల్గినను ఒక్కడైనను సేనను వీడి వెళ్ళరాదు. వీరిలో శూర శ్రేష్ఠులు దాగియున్న విరోధులను వారి విధమును గుర్తింపగలరు గాన వారు వెడలవచ్చును. అని చెప్పగా లక్ష్మణుని సహాయముతో సుగ్రీవుడు వానరసేనల నెల్లను సముద్ర తీరమున నున్న వనమునందు నిలుచుట కాజ్ఞాపించెను. అపారమైన యా వానరసేన అప్పుడు, తియ్యని తెల్లని నీరు గల వేఱొక సముద్రమాయను నట్లా లవణసముద్ర తీరమున ప్రకాశించుచుండెను. సముద్రఘోషను మించిన కలకలము గల వానర సైన్యము సుగ్రీవు నాజ్ఞచే మూడు విభాగములుగా విడిసెను.

## సముద్ర వర్ణనము:

ఆ సముద్రము చాల దూరమున పారము గలదై రాక్షసులతో గూడినదై, క్రూరములైన మొసళ్లతో నిండినదై నిశారంభమున భయంకరమైనదై, నురువులనెడు నవ్వుచేతను, తరంగముల నృత్యముచేతను ఒప్పునదై, చంద్రోదయ సమయమున పొంగుచున్నదై, చంద్ర ప్రతిబింబముల కదలికలు గలదై, తిమి తిమింగిలాదులతో నిండినదై ప్రచండ వాయువులచే ఇటునటు గొట్టబడుచున్నదై ప్రకాశించుచున్న పడగలుగల సర్ప రాజములచేత శోభించుచున్న మొసళ్లు మొదలుగా గల జలజంతువులతో గూడినదై, పర్వతములతో గూడినదై పయనించుటకు శక్యముగాని మార్గములు గలదై యొప్పుచున్న సాగర శ్రేష్ఠమును వానర శ్రేష్ఠులు చూచిరి. మొసళ్ల చేతను సర్పసమూహముల చేతను నిండి గాలిచే చెదర గొట్టబడి పడుచు లేచుచునున్న అనేక తరంగములు వృద్ధి పొందుచున్నదియు, ప్రకాశించుచున్న నీటిచే అగ్నిచూర్ణము చల్లబడినట్లున్నదియు, గొప్ప సర్పములు గలదియు, రాక్షసులకు నివాసమై నదియు, మిక్కిలి భయంకరమైనదియు, పాతాళవాసులకు మార్గమైనదియు, ఆకాశము వలె విశాలమైనదియు, ఇది సాగరము, ఇది యాకాశము అని చెప్పరానిదియు, ఆకాశము సమద్రమందు గలసినదో, సముద్ర మాకాశమందు గలిసినదో యనునట్లు నక్షత్రమణులతో గూడినదియు గొప్పనైన మేఘములు కదలుచున్నవో పెద్దపెద్ద యలలు కదలుచున్నవో ఖేదమేర్పరింప రానిదియు, ఒకదానితో నొకటి గొట్టుకొని విరుగుచు మఱల పెద్దగా పెరిగి గుభాలున గొట్టుకొనుచు భేరుల వలె మ్రోగుచున్న అలలు గలదియు నగు సముద్రమును వానరులు విచిత్రముగా చూచిరి. వేగముగా వీచుచున్న గాలులచే అల్లకల్లోలమయిన తరంగములలో నున్న రత్నరాసులచే శబ్దించుచున్నదియు, జలజంతు సమూహములచే కలంపబడినదియు, అత్యధికమైన గాలులచే నెగుర గొట్టబడి ఆకసమున నాట్యమాడు తరంగములు గలదియునగు సముద్రమును కపిసంఘము లన్నియు ఆశ్చర్యముతో జూచెను. భయంకరమైన బరువైన ధ్వని చేతను, తిరిగి తిరిగి వచ్చు అలలచేతను, నురగలచేతను ఆ సముద్రము, కల్లు ద్రాగి దొరలుచున్న పిచ్చివాని వలె ఆవానర సమూహములకు గన్పించెను.

★★★

# ఐదవసర్గము

## శ్రీరాముడు సీతను దలచి దుఃఖించుట:

నీలుడు నాయకుడుగా గల యా వానర సైన్యము సముద్రపు టుత్తర తీరమున విడిసెను. అట్లున్న యా సైన్యమును శాస్త్రోక్త విధి ననుసరించి మైంద ద్వివిదులు విడువక యేమరు పాటులేక కాచుచుండిరి. అట్లు సముద్ర తీరమున యుక్తమైన విధముగా విడిసిన సేనలను చూచి రామవిభుడు తన చెంతనున్న లక్ష్మణునితో గొప్ప ఆర్తితో నిట్లనెను. లక్ష్మణా! లోకమందెవ్వరికైన నానాటికి దుఃఖము తగ్గుచుండును సుమా! నాకన్నో భూపుత్రి లేకపోవుటచే దుఃఖము మఱిమఱి పెరుగుచుండెను. నా కాంత నాకు దూరమై పోయినదని వగచుటలేదు, దొంగిలింప బడినదని విచారించుట లేదు. తామర రేకుల వంటి నేత్రములు గలిగిన సీతకు వయస్సు తరిగి పోవుచున్నదని యే నా మనస్సునందు దుఃఖము గలుగుచున్నది. ఓ మారుతమా(గాలి) నీవు వేగముగా సీత యున్న చోటునకు పొమ్ము. ఆ పువ్వు వంటి శరీరము గల సీతను ముట్టికొని తిరిగి వచ్చి నన్ను స్పృశింపుము. చంద్రుని ద్వారా ఆమెను చూచెదను. (నేనుచంద్రుని చూచెదను. సీతయు చంద్రుని జూచును. ఆ మార్గమున నేను సీతను జూచెదను. అట్లే గాలి యిరువురను తాకుటచే నిరువు రొకరి నొకరు స్పృశించినట్లైనది.) నీవలన నాకు కోమలాంగి యైన సీతను తాకిన భాగ్యము కలిగినట్లగును. నా కట్టి భాగ్యము గలుగునా? అక్కటా! రావణుచేత చిక్కువడి యా రాజముఖియైన సీత నన్ను దలంచి హా! జీవిత వల్లభా! యని వచించుచు, ఆర్తితో విలపించుచున్న వచనములు నామనస్సు నందు తలంచినచో నా సర్వావయవములు విషము పూసినట్లుడుకు చున్నవి. (గోవిందా! యని ద్రౌపది యరచినప్పటివలె ప్రపన్నుల యార్తి భగవంతుడు సహింప లేడు. దీనదయాళుడు గావున ఆ స్మరణము ఋణముగా నెంచుకొని యది తీర్చువఱకు పరితపించుచుండును.) భార్యను విడిచి యుండుటచే మన్మథజ్వరపీడితుడనైన నా దేహమెంతయో దహించుకొని పోవుచున్నది. ఓ లక్ష్మణా! నేను నిన్ను విడిచి ఇప్పుడీ సముద్రము నందు మునిగి నిద్రించెదను. నీటి యందు శయనించిన నన్ను మన్మథుడెట్లు దహింపగలడు తామరరేకుల వంటి కన్నులు గల సీతయు నేనును ఒక్క భూమియందే

నిలచి యుండుట చేతనే నేనెట్లో జీవింప గలుగుచున్నాను. గాని నేనేవిధముగా ఆ కాంతను జూడ గలుగుదునోగదా. ఓ నిర్మలమైన నడవడి గలవాడా! నిండుగా నీరున్న మడిప్రక్క నున్న కేవలము నీరులేని పొలముక్రింది యూట నీటిచేత వలె వాయుపుత్రుడు చూచి వచ్చి జానకి జీవములతో నున్నదని చెప్పుటచే నేను విని జీవించి యుంటిని సుమా. సోదరా! గొప్ప విరోధులను జంపి విజయలక్ష్మిని వలె తామర రేకుల వంటి నేత్రములు గల జానకిని నేనెన్నడు పొందగలనో కదా! వ్యాధి బడ్డవాడు ఇష్టమైన రసాయనముల నాస్వాదించినట్లు ఆ సీతాదేవి ముఖ పద్మము నెత్తి ఆశతీరునట్లధరామృతము నెన్నడు గ్రోలెదనో గదా! బలిసినవై యిఱుకుగా నున్న తాటికాయలను బోలియున్న ఆ పద్మాక్షి కుచములు నన్నెన్నడు కౌగిట నలరించునో గదా. తలంచిన కంపము గలుగుచున్నది. నా వంటి వానిని ప్రాణనాధునిగా పొందియుండియు, ఆ వంకర ముంగురులు గల సీతాదేవి అనాధ వలె రాక్షస స్త్రీల నడుమ కాచు దిక్కులేక బాధ పడుచున్నదిగదా. జనకుని కూతురట. దశరథ మహారాజు కోడలట. నాకు పత్నియట. ఇట్టియా స్త్రీరత్నము రాక్షస స్త్రీల నడుమ నిద్దుర నెట్లు పొందుచున్నదో గదా. నల్లని మేఘములగుంపులను చీల్చుకొని వెతికి వచ్చి కనిపించు శరత్కాలపు చంద్రకళవలె ఆ క్రూరాత్ములైన రాక్షసులను ధిక్కరించి సీతాపతి యెప్పుడు బైటకు వచ్చునోగదా. చంచలములైన లేడి కన్నుల వంటి కన్నులు గలదైన జానకి స్వతస్సిద్ధముగనే తాను చాల సన్ననైనది. అందులో నిప్పుడు భరింపరాని దుఃఖముచేతను, దేశము గాని దేశము నందుండుట చేతను, కాలమనుకూలింపని దగుటచేతను, అత్యధికముగా నుపవాసములు చేయుటచేతను ఆమె యిప్పుడు మఱెంతగా కృశించి యుండునో గదా. ఆ దేవతల విరోధియైన రావణుని సంహరించి భూపుత్రిని సంతోషముతో తెచ్చుటెన్నడోగదా. దేవతా స్త్రీలనుబోలిన నా సీతాదేవి పరమ సాధ్వి. నాయందుండు స్నేహముచే నా కంఠమును గ్రుచ్చి కౌగిలించుచు సవిరళముగా ఆనంద బాష్పములను విడుచుటెప్పుడో కదా. స్త్రీలలో శ్రేష్ఠురాలైన ఆభూపుత్రుని వీడుటచే గలిగిన ఈ గొప్ప వ్యధను మాసిన వస్త్రమును విడిచిన విధముగా విడిచి సుఖములను పొందెడు భాగ్యమెప్పుడు కల్గునో గదా. అని దుఃఖించుచుండగా సాయంసమయమున తన తేజస్సుని విడిచి సూర్యడస్తమింపగా లక్ష్మణు డావిచారమును దీనత్వమును విడుచునట్లు నెమ్మదైన మాటలతో నూరడింపగా, ఆ రాజ శ్రేష్ఠుడగు రాముడు పద్మాక్షియగు నా సీతనే తలంచుచు దుఃఖ సముద్రమునందు మునుగుచు భక్తితో సంధ్యనుపాసించెను.

★★★

# ఆఱవ సర్గము

## రావణుడు మంత్రులతో ఆలోచించుట:

అక్కడ లంకా పట్టణమునందు రావణుడు దేవేంద్రునితో సమానుడైన వాయుపుత్రుడు లంకలో చేసిన భయము కలిగించునట్టి పనులు తలంచి సిగ్గుపడి ఆ రాక్షస సభయందు నేలవంక జూచుచు వీరులైన రాక్షసులతో నిట్లనెను. ఓ రాక్షస వీరులారా! ఒక్క వానరుడు ఇతరులు ప్రవేశంపరాని లంకా నగరమున ప్రవేశించి నన్ను లెక్కచేయక భూపుత్రిని జూచి పెద్దదైన గోపురమును నేల బడగొట్టి రాక్షస సంఘములను సంహరించి పట్టణమును మహాఘోరముగా క్రోధముతో కాల్చివేసెను గదా (ఎక్కటి = అసహాయుడై హనుమంతుడు తిరిగిపోయిన నాటి వృత్తాంతము) ఇకనేమి చేయువాడను? ఇంక మార్గమేది? మీకును నాకును మేలే విధముగా కలుగును? ఏమి చేసినచో ఈ కార్యము చక్కబడును? రాముని విషయమున నెట్లు ప్రవర్తించిన మేలు కలుగును? ఆలోచించి మీ యభిప్రాయమును దెల్పుడు. మంత్రులతో ఆలోచించి చేసిన పని జయప్రదమగునని పెద్దలు చెప్పుదురు. ఈ జగత్తు నందు మూడు తెగల మనుష్యులు గలరు. వారలు ఉత్తములు, మధ్యములు అధములు అను వారలు. వారి యొక్క గుణములను దోషములను వరుసగా జెప్పెదను వినుడు. ఓరాక్షసులారా ! సుఖమునందు దుఃఖమునందు సమమైన భావము గల బంధువులతోను స్నేహితులతోను, తన మేలు కోరువారితోను తనమనస్సునకు నచ్చిన మిత్ర సంఘముతోను, నిర్మలమైన బుద్ధితో వేయి విధములుగా ఆలోచించి ఫలితమును దైవాయత్తముగా నెంచి కార్యమును చేయు వానిని సజ్జనులుత్తముడందురు. దైవమే నాకు శరణ్యమని నమ్మి ఒక పద్ధతిగా కార్యమును తానొక్కడే చేయ ప్రయత్నించు వానిని మధ్యముడని ప్రాజ్ఞులు చెప్పుదురు. ఆ కార్యము నందున్న గుణ దోషములను విచారింపక, దైవము నాశ్రయించుటయను ఆలోచనయే చేయక ఒక పనిని చేయబూని దానిని పూర్తి చేయక వదలు వానిని అధముడని యందురు. ఈ మూడు విధములు పురుషులందు వలెనే ఓరాక్షసులారా మంత్రాలోచనములు కూడ ఉత్తమ మధ్య మాధమ భేదములతో నొప్పుచున్నవి. వాని లక్షణములను తెలియజెప్పెదను వినుడు. మంత్రులందఱును శాస్త్ర

దృష్టితో ఆలోచించి ఆసక్తిని వీడక ఐకమత్యము వహించి నిర్ణయించునదియే ఉత్తమమైన మంత్రమని పెద్దలు చెప్పుదురు. ఏదైన కార్యమును గురించి ఆలోచించునప్పుడు మొదట వేర్వేరు అభిప్రాయములను వెలిబుచ్చియు చివఱ కందఱు ఏకాభిప్రాయమును పొందినచో దానిని మధ్యమమందురు. ఒకరి యభిప్రా యమునొక రంగీకరింపక ఎవఱికి వారు తాను పట్టిన పట్టు వీడక ఐకమత్యమున శ్రేయస్సు లేదని చెప్పిన దానిని బుధులు అధమమని యందురు. మీరందఱు చాలా బుద్ధిమంతులు మేలైన కార్యమును నిశ్చయించి యీ విధముగా చేయవచ్చునని మీరెరింగించుదనియే నాయభీష్టము. వేల కొలది వీరులైన వానర శ్రేష్ఠులతో గూడి రఘురాముడు భయంకరముగా లంకను ముట్టడించును. ఇది నిజము సుమా. ఆ రఘురాముడు సోదరునితోను సైన్యము తోడను గూడిన వాడై యుక్తమైన పరాక్రమముతో సముద్రమును జలరహితముగా చేసియో, మఱేదైన తన అద్భుతశక్తిని చూపియో అవలీలగా సముద్రమును దాటి వచ్చును. కాన మనలంకాపురి సేనలకు శుభము గలుగు నొక యుక్తిని చెప్పుడు.

★★★



# ఏడవ సర్గము

## రాక్షసులు రావణుని పరాక్రమమును పొగడుట:

అని రావణుడు పల్కిన మాటలు విన్నవారై యాదానవులందఱు మనస్సునందు తమ బలమును, శత్రు బలమును, కొంచెమైనను గుర్తింపజాలక, మిక్కిలి బుద్ధిహీనతతో నీతి దూరులై చేతులు జోడించి యిట్లు పల్కిరి. భూమి యందవినీతులైన మంత్రులు గదా రాజుల పాలిటి శత్రువులు. ఓ రాక్షసేంద్రా ! ఈ విధముగా విషాదము నొంద నేల? పట్టిసములు, పరిఘములు, శక్తులు, శూలములు మున్నగు మహాయుధములు గల మహా సైన్యము, నీకు గలదు గదా. నీవు భోగవతి యందు సర్పముల నాశనము చేసితివి. గైలాస నివాసియు యక్ష సైన్యముతో గూడినవాడును అయిన కుబేరుని నీ దర్పముతో నోడించితివి. ఆ ఈశ్వరుని స్నేహము చేసి కీర్తి పొంది కోపమున దిక్పాలురను జయించితివి. యక్షులను పట్టుకొని కళవళ పడజేసితివి. వారిని కొట్టి వధియించి కైలాస పర్వతమునందు ప్రకాశించుచున్న విమానము నిచ్చటకు దెచ్చితివి. అటువంటి నీకు మూడు లోకములందును సాటియైన వారున్నారా? భయముచే మయుడను దానవరాజు నీ సఖ్యమును గోరి తన కన్నకుమార్తెను నీకు భార్యగాదెచ్చియిచ్చెను. రసాతలమునందు యుద్ధమున సర్పరాజులగు వాసుకిని, జటిని, శంఖుని, తక్షకుని గెల్చి శౌర్యముతో జయము పొందలేదా? దానవ రాజు, బలముచే గర్వించిన మనస్సుగలవాడు కుంభీనసి యొక్క భర్త, మహావీరుడు అయిన మధుడనువాడు నీకు వశపడలేదా? యుద్ధమందు సమస్త దిక్పాలుర గర్వమడంచి నీవు దేవలోకమును బ్రవేశించి బలాసురవిరోధియైన యింద్రుని జయించలేదా? బలవంతులు, ధనవంతులు, శౌర్యవంతులు అక్షయులునగు దానవులను ఒక సంవత్సరము యుద్ధమున నిలువరించి పోరి గెలువలేదా? మాయలలో నేర్పరి యని కీర్తినంద లేదా? పరాక్రమవంతులును, ఎదురులేని భుజ బలముగలవారును అగు వరుణుని పుత్రులను సైన్య సమేతులను నీ బాహు పరాక్రమముచే రణరంగమున గెలువలేదా? ప్రఖ్యాతి గలిగిన శాల్మలీ వృక్షముతో ప్రకాశించునదియు, భయంకరమైన మృత్యు దండమను మొసళ్లతో గూడి నదియు, కాల పాశములనెడు గొప్పతరంగములు గలదియు, యముని

కింకరులనెడి సర్పములుగలదియు, అగు యముని సేనాసముద్రమును ప్రవేశించి మృత్యుదేవతను తిక మిక జేయలేదా? జగత్తు ఆశ్చర్యము చెందునట్లుగా జయము పొందలేదా? దేవేంద్రసమానులును, ప్రఖ్యాతి నొందిన బలపరాక్రమ వంతులును అయిన క్షత్రియు లీభూమియందు అడవి వృక్షముల వలె నుండగా, వాటిని నరుకు ఖడ్గము వలె నీవు నీ బాణములచే చీల్చబడిన శరీరములు గలవారినిగా చేయలేదా? ఆ మంచి వంశములందు పుట్టిన పరాక్రమవంతులగు రాజులకీ రాముడు యుద్ధమున సాటి వచ్చునా? మనుష్యులే ఆహారముగాగల రాక్షసులకు రాజైన ఓ రావణా! బాధనొందక యూరకుండుము. ఇంద్రజిత్తొక్కడే వానర కోట్ల నెల్లను నాశనము చేయును. మృత్యువునే సంహరించువాడైన మహేశ్వరుని యక్షముచే ప్రసన్నుని జేసి ఎవ్వరికిని లభ్యములు కాని యపూర్వములైన వరములను పొంది అతడెల్లరను ఆనందింపజేయలేదా? శక్తితో మరములనెడు ఆయుధములే చేపలుగాగలదియు, పరచుకొనిన ప్రేవుల ప్రోవులే నాచుగాగలదియు, ఏనుగులనెడు తాబేళ్లుగలదియు, గుఱ్ఱముల నెడి కప్పలు గలదియు, ఆదిత్యులు రుద్రులు ననెడు పెద్ద మొసళ్లగలదియు, వాయువులు, వసువులు ననెడి పెద్ద సర్పములచే భయము గల్గించునదియు, రధ, గజ తురగములనెడి జలప్రవాహము గలదియు, పదాతి సైన్యమనెడు ఇసుకమేటలు గలదియు అయిన దేవ సైన్య మనెడు మహా సముద్రమును పారద్రోలి, ఇంద్రుని బంధించి యీ లంకకు తీసుకొని వచ్చి దేవశ్రేష్ఠుడైన బ్రహ్మ యాజ్ఞచే విడిచిపెట్టిన శూరుడు గదా యీతడు. కావున యిట్టివాడగు నీ పుత్రుని అఖండపరాక్రమవంతుడైన యింద్రజిత్తుని వానర సైన్యయుక్తముగా రామలక్ష్మణులను యమాలయమునకు బంప ననుజ్ఞయిమ్ము. వారలనతడు నాశనము చేయును. ఒక ప్రాకృతుడు ఆ విధముగా లంకకుచేటు దెచ్చెనే యని మనస్సునందు కలత చెందకుము. రాముని జయించెదవు సుమా.

★★★

# ఎనిమిదవ సర్గము

## ప్రహస్తాదులు తమతమ పరాక్రమము రావణునితో చెప్పుట:

అంత సైన్యాధిపతియు నల్లని మేఘమువంటివాడును, అణపరాని తీక్ష్ణమైన పరాక్రమముగలవాడును అగు ప్రహస్తుడు చేతులు జోడించి ఓ రాక్షస రాజా! యేల యీచింత? రాక్షసులు, దేవతలు, సర్పములు, పిశాచములు అయినను నీ దగ్గరకు చేర రాలేరనగా ఇంక వానరుల సంగతి చెప్పవలెనా? మమ్ముల నెవ్వడెదిరింపగలడు? మమ్ముల నెవ్వడును గెలువలేడని మేమీ విధముగా నేమరుపాటున నుండుటచే ఆ విధముగా ఆ వానరుడు వంచన చేసి తిరిగి వెళ్లగలిగెను. కానిచో ఆ వానరుని యముని గృహమున కతిథిగా పంపి యుండువాడను గానా? సముద్రముచే చుట్టబడిన ఈ భూమియందంతటను, పర్వతములు వనములతో గూడ ఎల్లచోట్లను వానరుడను వాడు లేకుండ చేసెదను. ఆజ్ఞనిప్పింపుము. ఇప్పుడే వేగముగా వెళ్లెదను. కోతుల చేత ఏవిధమైన ప్రళయము రాకుండ కాపు పెట్టెదను. సీతాపహరణ రూపమైన నీ యపరాధముచేత నీకావంతయెనను కష్టము కలుగబోదు. అని చెప్పగానే క్రోధము నొందిన దుర్ముఖుడను (మనుజాశనుడు) రాక్షసుడు ఇట్లు పల్కెను. ఒక కోతి దుర్బుద్ధితో పురము నందున్నవారికిని, అంతఃపుర స్త్రీలకును, దేవేంద్రునినే బంధించి నట్టి మీ బలవంతుడగు రాక్షసరాజునకును అగౌరవమును గలుగజేసెను. దీనిని సహింపదగునా? ఈ నిమిషమున నే నొక్కడనే వానర సంఘమును ఆకాశమున కెగ బ్రాకినను, సముద్రమునందు దీనముగా దూరినను నాగ నివాసమగు పాతాళమున కేగినను విక్రమముతో పట్టి చంపివేసెదను. అని పల్కగానే మహా బలశాలియగు వజ్రదంష్ట్రడను రాక్షసుడు రక్తమాంసములలో కలుషితమైయున్న తన పరిఘను చేత బట్టి బొబ్బలు పెట్టుచు నిట్లు పలికెను. తపస్సు చేసికొను ఆ వాసురుని తో నేమి పని ? గొప్పనైన శక్తితో రాముడుండగా అతని తమ్ముడగు లక్ష్మణుడుండగా, వానరరాజగు సుగ్రీవు డుండగా ఆ వానరుతోనేమి? నేనొక్కడనే లక్ష్మణ సుగ్రీవ సహితుడైన రాముని నిప్పుడే పరిఘుతో నామ రూపములు లేకుండగా అణచివేసెదను. కోతులన్నియు అదరి చెదరి పోవునట్లు తపింపజేసెదను. రాజేంద్రా! వినుము నే నపాయము లేని యుపాయము

చెప్పెదను. గొప్పనైన బుద్ధి కుశలతతో యుక్తులను చెప్పువాడే శత్రువినాశమును చేయజాలును. పరాక్రమవంతులను, కామరూపధరులును అగు యుద్ధము చేయుట యందు నేర్పుగలిగిన రాక్షస శ్రేష్ఠులను వేలమందిని ఎన్నికచేసి వెంటనే సిద్ధము చేయదగును. వారలు మానవ రూపములు ధరించి సూర్యవంశ సంభవుడైన రాముని జేరి నీ సహోదరుడైన భరతుడు మమ్ములనంపినాడు. శుభాకారుడైన భరతున కేదియో అవసరమైన కార్యము కలిగెను గాన నిన్ను పురంబు చేర వెంటనే బయలుదేరమనె నని చెప్పగా అతడు సేనతో మరలి పోవును. ఆ సమయమున విండ్లు, బాణములు, ఖడ్గములు గదలు ధరించిన వారలమై యాకాశమున గుంపులుగా గూడి వానర సైన్యమును రాళ్ల వర్షమును గురియించి సంహరింపవచ్చును. ఈ విధముగా మేము పన్నిన మాయలలో చిక్కి ఆ రామరాజును అతని సోదరుడును యముని సన్నిధికి చేరబోయెదరు. అంతట మనకు పీడ పోవును, అని చెప్పగా అప్పుడు కుంభకర్ణుని కుమారుడు గొప్ప దర్పము గలవాడగు నికుంభుడ నెడువాడు గొప్ప రోషమును పొందిన వాడై లోకములను తపింపజేయగల రావణాసురుని జూచి గొప్ప గంభీరమైన మాటలతో నిట్లనెను. మీరందఱును రాక్షసరాజును సేవించుచు నిచ్చటనే యుండుడు. నేనొక్కడనే అమిత పరాక్రమముతో వారందఱిని వరుసగా శరీరములను చీల్చి పంపెదను. యుద్ధమునందు సోదర సహితుడగు రాముని, హనుమంతుని, వానరరాజును, తక్కినవానరుల నొక్క నిమిషములో చీల్చి చెండాడెదను. అనగా అప్పుడు పర్వతాకారుడైన వజ్రహనుడను రాక్షసుడు క్రోధము పొంగుచుండగా పెదవులను నాకికొనుచు తన పరాక్రమము తేటపడునట్లు వేగముగా నిట్లు పలికెను.

ఇది యెక్కడి జోలి మీకు? వెళ్లుడు. మనస్సులో చింతలను వీడుడు. యధేచ్ఛగా మీ పనులను చేసికొనుడు. తృప్తియగు నట్లు మాంసమును భుజింపుడు, మధువు త్రాగుడు. ఇష్టమైన యాటలాడుకొనుడు, నేనొక్కడనే వేగముగా రాఘవుని, అంగదుని, వాయుపుత్రుని, వానర రాజును సంహరించెదను.

## రభ సాదులు విజృంభించి పలుకుట:

అని పల్కగా అంత యజ్ఞహుడు, నికుంభుడు, రభసుడు రశ్మికేతుడు, సూర్య శత్రుడు, సుప్తఘ్నుడు, మహోదరుడు, అగ్నికేతుడు, దశాననుడగు రావణుని పుత్రుడైన ఇంద్రజితుండు, సాటిలేని వాడగు ప్రహస్తుడు, అతికాయుడు, విరూపాక్షుడు, ఉగ్ర

ధూమ్రాక్షుడు, దుర్ముఖుడు, వజ్రదంష్ట్రుడు మున్నగు రాక్షసులు, పట్టిసములు, శూలములు, ప్రాసశక్తిపరశ్వథపరిఘులు, ఖడ్గములు విల్లమ్ములు మున్నగు ఆయుధములను ధరించి త్రిప్పుచు, చెలరేగి మిడిసిపడుచు, మండిపోవుచు రాక్షసరాజుతో నిట్లు పల్కిరి. ఈ నగరమును గాల్చిన యా నీచుడైన హనుమంతుని, సోదర సమేతుడైన రాముని వానరరాజును నిప్పుడే నేనే వధింతును, నేనే ద్రుంచెదను. నేనే నేనే అని చేతులతో ఆయుధములు పూని బీరములు పల్కుచున్న రాక్షస కోట్లను తమ తమ యాసనముల నుండునట్లు మరలించి విభీషణుడంజలి ఘటించి తన సోదరునితో నిట్లు నెను.

★★★



# తొమ్మిదవ సర్గము

## విభీషణుడు రావణునకు రాజనీతి దెలుపుట:

అన్నా ! వినుము. సామము దానము భేదము అను మూడుపాయముల చేతను కార్యము సిద్ధింపనిచో విక్రమముచేత దానిని సాధింపవలెనని నీతి దెలిసిన ప్రాజ్ఞులు పలికెదరయ్యా! రాజ్య తంత్రములయందు విరక్తిబూనిన వానియందును, ఇంద్రియలోలుడై జాగరూకత కోల్పోయిన వానియందును, దైవసహాయము లేనివాని యందును, అర్భకుని మీదను, భయపడు స్వభావం గలవాని యందును మంత్రులతో విమర్శించి యాలోచించి దండోపాయమును బూనినచో జయము సిద్ధించును. మనస్సు నందైనను అజాగ్రత్త లేని వాడును, జయము నొంద గోరుచున్నవాడును, భయంకరమైన బలముగలవాడును, యుద్ధరంగమందు తేరి చూడరానివాడును, మహా పరాక్రమవంతుడును, శత్రువులను జయించినవాడును అగు ఆ రామభద్రుని ఘన పరాక్రమముతో జయింపబూనుట ఎట్లు పొసగును? భయంకరమైన నదీనదముల యధిపతియైన సముద్రమును దాటి ఒక వానరుడు అరరే! ధీరతతో ఇంత దుష్కరమైన కార్యమును చేయగలుగునని యెవ్వడైనను మనస్సునందు తలంచెనా? బలమెన్ననో లెక్కింపరానిది గదా. శత్రువుల శౌర్యము కూడ నట్టిదే. అట్టిచో కేవలమలక్ష్యముగా అట్టిట్టు పలుకుట తగునా? ఓ రాక్షస నాయకులారా! ఆ రాఘవుడి రాక్షస రాజునకేమి యపకారమును సల్పెనో స్పష్టముగా దెల్పుడు. ముందు ముందుగా నితడే ఆ రాజ చంద్రుని భార్యను వన మధ్యముల నుండి దొంగిలించి తెచ్చెను గదా. అన్యాయమైన పని ఎవ్వనిదో విరోధమునకు కారకులెవ్వరో మీరలే చెప్పుడు. ఈ రాముడే గదా మునుపు ఆ ఖర రాక్షసుని సంహరించినందురేమో. ముందుగా ఆ మాంసభక్షకుడే యుద్ధమునకై పోయి ఆయనపై బడెను గదా. ఈ భూమియందున్న ప్రాణులందఱును తమకున్న బలముతో తమ్ము దాము రక్షించుకొనుట తగదా? అది దోషమా? మీరలే చెప్పుడు. ఇతరుల భార్యను హరించుట యెప్పుడైనా నెంతయో అపకీర్తిని గలుగజేయును. పాపమును వృద్ధి చేయును. ఆయువును అర్థమును హరించి వేయును. పూర్తిగా నాశనము చేయును. కాన ఓ పుణ్య చరిత్రా! ఆలోచించి చూడగా జానకీదేవి

కారణమువలననే ఎల్ల వారలకు గొప్పభయం సమకూరినది. ఇది నిజము. ఇందుకు తగిన కార్యమామెను విడచి పెట్టుటయే. కలహము కొఱకై యేదేనొక పనిని చేయుటయే మంచిదని పల్కెదవేని యుద్ధమే నీకు నిజముగా నభీష్టమైనచో సీత లంకలో నున్నను, లేకున్నను నొక్కటియే. శ్రేష్టమైన పరాక్రమము గలవాడు, ధర్మాచారముగా నడుచువాడు నగునట్టి రామచంద్రునితో నిష్కారణముగా విరోధము తగినదా? కాన శ్రీరామునకు సీత నప్పగించుము. శ్రేష్ఠమైన మణులతో నిండినదియు యేనుగులు గుఱ్ఱములు గలదియు నగులంక విరోధుల బాణములచే కొట్టబడకుండగా ముందుగానే శ్రీరామునకు సీతనప్పగింపుము. భయంకరము తిరస్కరింపరానిదియు నగు వానరసైన్యము మన పట్టణమును ముట్టడింపకమునుపే ఒప్పుగా ఓ తండ్రీ! సీతను శ్రీరాముని కప్పగించుము. నీవు భూపుత్రిని తిరిగి యియ్యవేని సర్వరాక్షసులతో నీ లంకానగరము వినాశమొందును సుమా. అందుచే నీవే జానకిని రామచంద్రునకు మరలా నిచ్చివేయుము. నీవు నాయన్నగారి వౌటచే చేతులను జోడించి వేడుకొందును. దయతో నన్నను గ్రహింపుము. ఓ అన్నా! నామాట ప్రకారము చేయుము. హితము, ఉచితము నైన మాట చెప్పితినిగాని ఇంకొకటి కాదు సుమా. వేగముగా భూపుత్రిని రామచంద్రుని కడకు పంపివేయుము. నీకు హెచ్చుగా మేలు కలుగును. శరత్కాలపు సూర్యుని కిరణము వంటిదియు, గట్టిదియు, వాడియైనదియు నగు ముని బాణముల సమూహము నిన్ను సంహరించు టకు రాకమునుపే సీతను విడచి పుచ్చుము. ఇంక కోపమును విడిచి పెట్టుమయ్యా! ఇది సర్వ సౌఖ్యములను నాశనముచేయును. సౌఖ్యము కీర్తి వృద్ధి చెందునట్లు భోగములను పుత్రులతోను, మిత్రులతోను, బంధువులతోను, రాక్షస సంఘముతోడను, సీతను రామ విభునకిచ్చి యనుభవింపబూనుము. అని చెప్పుచున్న విభీషణుని మాటలను విని రాక్షసరాజు వేగముగా వారందఱిని వీడి తన పరివారముతో నిజమందిరమున కేగెను.

★★★

# పదియవ సర్గము

## విభీషణుడు రావణు గృహమున కేగుట:

అటుల రావణుడు తన గృహంబు ప్రవేశించిన మరునాటి యుదయమున పరిశుద్ధమైన మనస్సుతో విభీషణుడు మరల అన్ననుద్బోధించుట కరిగెను. పర్వతము వలె నున్నతమైనదియు, చక్కని ద్వారములగలదియు, ప్రియవాదులైన శ్రేష్ఠమంత్రులచేతను బంధువుల చేతను రక్షింపబడుచున్నదియు, శంఖములు మొదలైన వాద్య విశేషములచే ధ్వనించుచున్నదియు, సంతోషము గలిగించు స్త్రీలతో నిండినదియు, తూర్యనాదములతో నిండినదియు, మదించిన ఏనుగుల ఘీంకారములతో గూడినదియు, చల్లని గాలులచే కదలుచు గల గల శబ్దించుచున్న వృక్షములతో నొప్పుచున్న రాజమార్గములు గలదియు, బంగారపు టేనుగుల విగ్రహములు గలదియు, దేవతలు గంధర్వులు నివసించు మందిరములతో సమానమైనదియు, రత్నముల వరుసలతో గూడినదై భోగవతీ పురమునందలి భవనములను పోలినదియు అయిన రావణుని మందిరమును విభీషణుడు ప్రవేశించెను. అచ్చట లంకేశ్వరుని విజయమును గోరి వేదోక్తవిధానమున మంత్రపూర్వకముగా హోమక్రియలును పుణ్యాహవాచనములు జరుగుచుండెను. రాక్షసులచే సేవింపబడుచు గొప్ప తేజస్సుతో ప్రకాశించుచు సింహాసనస్థుడైయున్న ఆ కుబేరసోదరుని దగ్గఱకు వెళ్లి విభీషణుడు నమస్కరించి ఆ రాక్షసేశ్వరుని కనుసన్నచే శ్రేష్ఠమగు బంగారు పీఠమున ఆసీనుడయ్యెను.

## విభీషణుడు రావణునకు లంకాపురంబునకు అపశకునములు పుట్టెనని తెల్పుట:

దేశకాలములను బట్టి సంచరింపగలవాడును, శుభాశుభముల నెఱింగినవాడను, అగు విభీషణుడు మంత్రుల యెదుటనే నెమ్మదిగా సాంత్వన వాక్యములచే రాక్షసరాజును ప్రసన్నుని చేసికొని సుశ్లోకమైన మాటలతో నిట్లు పల్కెను. 'అన్నా నీ పురంబునకు జానకి యెప్పుడు సంప్రాప్తమైనదో ఆనాటినుండి చెప్పరానివైన పెక్కు దుశ్శకునములు కనబడుచున్నవి. అగ్ని మంత్రయుక్తముగా హవిస్సుల నర్పించుచున్నను ప్రజ్వలింపక పొగతో కప్పుబడినవాడై యుండెను. వంట యిండ్లయందను, అగ్నిగృహములందును

వేదపఠనము జరుగు మందిరము లందును పాములు ప్రాకజొచ్చెను. హవ్య గవ్యములను చీమలు ముట్టుకొన జొచ్చెను. ఆవులన్నియు పాలులేకుండ వట్టిపోయినవి. ఏనుగులు మదములేనివై దీనస్థితితో మేత ముట్టకున్నవి. మన పురంబునందు గాడిదలకు ఒంటెలకు కంచరగాడిదలకు వెంట్రుకలు రాలిపోయినవి. ఏవిధముగా చికిత్స చేసినను మఱల వచ్చుటలేదు. అవి అదేపనిగా కన్నుల నీరు గార్చుచున్నవి. అన్ని చోట్లను కాకులు గుంపులుగా చేరి కఠినముగా అరచుచు విమానముల మీద తిరుగుచున్నవి. గ్రద్దలు చక్రాకృతిగా ఆకాశమున దిరుగుచు భవనములపై వ్రాలుచున్నవి. అహర్నిశలు నక్కలు దారుణముగా నరచుచున్నవి. క్రూరమృగములు ద్వారములపై పిడుగులు పడుచున్నట్లు ధ్వనులు చేయుచున్నవి. ఆ ధ్వనులు పురమునందు నిరంతరముగా విన్పించుచున్నవి.

## విభీషణుడు సీతాదేవిని శ్రీరామునకిమ్మని రావణునకి జెప్పుట:

అన్నా! నీకిష్టమైనచో వీనికన్నిటికిని ప్రాయశ్చిత్తముగా ఒక్కదానిని చెప్పెదను. రాజా! సీతను రామున కర్పింపుము. అజ్ఞానము చేతనో బ్రతుకుపై ఆశచేతనో యిట్లు చెప్పుచున్నానని తలంతువేని, ఆపై నాయందు దోషమెంచకుము. దేవతల హృదయములకు వ్రణము వంటివాడా! పురమునందును అంతఃపురమునందును గల స్త్రీలను పురుషులను ఈ దోషములను గూర్చి అడిగి తెలిసికొనుము. రాక్షసేశ్వరా! చూచినది వినినది సర్వము నీమంత్రులు నీకు చెప్పలేకున్నారు. అన్నా నేనును వారివలె వినిపింపకుండుట తగునా? కనుక ఓ వీరా! న్యాయాన్యాయములను ముందువెనుకలు నాలోచించి తరువాత నీయిష్టము వచ్చిన విధముగా చేయవయ్యా! అని మంత్రులందఱు వినుచుండగా విభీషణుడు తన అన్నకు చెప్పెను. హితము, మృదువు, కాలము మించివచ్చినదానికి ప్రస్తుత కర్తవ్యమును దెల్పునది, మున్ముందు సౌఖ్యమును గలిగించునది అయిన ఆ విభీషణుని వాక్యమును విని రావణుడు క్రోధమును పొంది తాను చేయదలచిన కార్యమందు ఎక్కువైన పట్టుదలతో తమ్మునితో నిట్లనెను. ఏమిరా! ఇప్పుడు నాకింత భయమేమి వచ్చినది? అది యట్లుండనీ. ఏవిధముగా జూచినను రాముడు జనకరాజ పుత్రికను జేరగలడా? దేవతలను దేవేంద్రుని కూడ గట్టుకొని యుద్ధము చేయబూనినను రాముడు నాయెదుట నిలువగలడా? అని దేవసైన్య విమర్దనుడైన రావణుడు తనకు హితము చెప్పుచున్న తమ్ముడగు విభీషణుని విడచిపెట్టి యావలకు బోయెను.

★★★

# పదునొకండవ సర్గము

## రావణుడు కొలువుకూటమునకు బ్రోవుట:

[ఇది రెండవనాటి చర్య] ఆ రావణుడు తన్ను తనహితులనాదరణము చేయుట చేతను తాను స్వయముగా చేసికొన్న సీతాపహరణమనెడు పాపము చేతను కామమోహితుడు, పతితుడు నయి అంతకంతకు నీరసించి పోవుచుండెను. ఆలోచించుటకు అర్హమైన కాలము మించిపోయినది. ఇక యుద్ధము చేయు సమయమాసన్నమైనది కనుక మంత్రులతో హితులతో మంతనము చేయదగిన అదనని అతడు భావించెను. బంగారు కిటికీలకు పగడాల సొమ్ములు దాపిన గుఱ్ఱములు పూన్చిన రథము నెక్కి మేఘములు గర్జించునట్లు శబ్దము చేయుచున్న రథములతో వెడలి వేగముగా దశకంఠుఁడు సభకు బయలుదేరి వెడలుచుండ కత్తిడాలు ధరించి ముందుగా కొందఱు భటులు పోవుచుండగా అనేకులగు వికృతవేషులు తన్ను సేవించుచుండ, రథముల మీదను, శ్రేష్ఠమైన మదపుటేనుగుల మీదను, కదను త్రొక్కుచున్న గుఱ్ఱములమీదను నెక్కి కొందఱతిరథులు వెనువెంట తన్ను సేవించి వచ్చుచుండగా నెందఱో రాక్షసభటులు పరిఘములు, గదలు, తోమరములు పరశవులు, శక్తులు మున్నగు ఆయుధములను ధరించి ఆదశముఖుని ననుసరించిరి. అంత వాద్యవిశేషముల ధ్వనులంతటను నిండెను. ఒకదానిపై నొకటిగా శంఖధ్వనులాకాశము వఱకు వ్యాపించెను. చంద్రకాంతిని మించు శ్వేతచ్ఛత్రముల కాంతితో వెలుగుచున్న రాజమార్గమును గడచి వెళ్ళుచుండ బంగారు నగిషీలు చెక్కబడిన చామరము లిరుప్రక్కల వీవబడుచుండెను. రాక్షసులనేకులు నిలబడి వినయముతో తలలు వంచి చేతులు జోడించి నమస్కరించుచుండిరి. ద్వారపాలకులు జయజయధ్వనులు చేయుచుండగా వృద్ధులు దీవించుచుండగా సూర్యసమతేజము గలవాడై అందమైన వెండి బంగారు కంబళములు, రత్నకంబళములు మొదలగువానిచే నలంకృతమయి రాత్రింబవళ్లు రాక్షసుశతములచే రక్షింపబడుచున్నదై విశ్వకర్మ నిర్మితమైన శ్రేష్ఠమగు సభాభవనమును ప్రవేశించి రావణుడు తన్నాశ్రయించిన రాజులచే సేవింబడుచున్న ఉన్నత సింహాసనమున కూర్చుండెను.

## రావణుడెల్ల రాక్షసులను సభకు రప్పించుట:

అంత అతివేగముగా పనులు నెరవేర్పగల దూతలను పిల్చి వెంటనే రావణుడు వారితో నిట్లు చెప్పెను. చాల రహస్యము ముఖ్యము ఆలోచింపదగినది యైన పని యొకటి గల్గినది. గాన మీరు వేగముగా సభకు రండని సర్వరాక్షసులను పిలిచికొని రండని చెప్పగా వారలు పురంబులోనికి వెళ్ళి ఇంటింట, తోటల, విహారస్థలముల నున్న వారందఱిని పిలచిరి. మఱియు నిద్రించు వారిని గూడ మేలుకొల్పి రాజునాజ్ఞ తెలియజేసిరి. అట్లు పిలవబడిన వారై వారందఱు కొందఱు రథముల మీదను, కొందఱు గుఱ్ఱముల మీదను కొందఱు కాల్నడకను వచ్చుచుండగా ఆ పట్టణమంతయు ఏనుగులు, గుఱ్ఱములు రథములతో నిండినదయ్యెను. ఆకాశమున పక్షులు గుంపు గూడినట్లు ప్రకాశించుచుండెను. అట్లు వచ్చిన వారలు తమ ప్రయాణ సాధనములను దూరముగా నిల్పి పాదచారులై గుహలో ప్రవేశించు మృగరాజులవలె ఠీవిగా వెళ్ళి దేవతల గర్వమణంచిన రావణుని పాదములు చేతులతో ముట్టి నమస్కరించి తమకు తగిన విధముగా మర్యాదలను పొంది కొందఱు పీఠములపైనను,కొందఱు దర్భాసనముల మీదను కొందఱు నేలపైనను రాజాజ్ఞననుసరించి కూర్చుండిరి. కార్య సరళిని నిశ్చయించుట యందు నేర్పరులైన పండితులును, సర్వమును దెలిసిన వారును, బుద్ధియే కన్నులుగా చూడగలవారును, యుక్తి గుణము గలవారును అగు మంత్రిశ్రేష్ఠు లా సభయందు నూర్లకొలదిగా నుండిరి. యోధులనేకులా యాస్థానమున నుండిరి. రాక్షసరాజ క్షేమమును గోరువాడును, మహాకీర్తిమంతుడును, మహానుభావుడునగు విభీషణుడు అప్పుడు శ్రేష్ఠమగు గుఱ్ఱములు గట్టబడిన బంగరు రథముపై వచ్చి అన్నను సమీపించి తనపేరు చెప్పికొనుచు పాదములకు నమస్కరించెను. అట్లు వచ్చిన రాక్షసులందఱు తమ తమ ఆసనములందుపవిష్టులైరి. అగరు మొదలైన పరిమళ పదార్థములను వాయువు వాన గురిసినట్లు కురిపించెను. ఒక్కడును గట్టిగా మాటలాడడు. ఒక్కడైన అక్రమ వాదనలు చేయువాడచ్చటలేడు. అందఱును ఆ రావణుని సింహాసనముపై దృష్టినిల్పి సేవించుచుండగా రావణుడు వసువులచే సేవింపబడుచున్న యింద్రుని వలె ప్రకాశించెను.

★★★

# పంద్రెండవ సర్గము

## రావణుడు రాక్షసులను సంబోధించుట:

అట్లున్న సభనంతటిని గలయజూచి రావణుడు సేనానాయకుడగు ప్రహస్తునితో నిట్లనెను. సేనాపతీ! నీవు వేగముగా వెళ్లి నాల్గు విధముల విద్య నెఱిగిన శ్రేష్ఠులైన రాక్షస వీరులనధికముగా కాపుపెట్టుము. అనగా అతడు రాజశాసనము ననుసరించి పట్టణము లోపలను వెలుపలను అన్నిచోట్లను పురరక్షణార్థము పూర్తిగా వేర్వేరు విధములుగా వీరశ్రేష్ఠులను నిల్పివచ్చి రాజా సర్వసైన్యములను అన్ని దిక్కులకు రక్షించునట్లుగా నిలువబెట్టితిని. ఇంక సందియము లేకుండ పనులు జరిగింప వచ్చునని విన్నవించెను. అతనిమాటలు విని రాజ్యహితాభిలాషియైన రాక్షసరాజు సుఖమందనురక్తిగలిగిన మిత్రులజూచి ప్రకృత కార్యమును గూర్చి వారలకు తెల్పుచు నిట్లు పల్కెను. రాక్షసులారా! ధర్మార్థకామములలో దేనిని స్వీకరింపవలెనని ఆలోచించు సమయమున దానిదాని యందు మేళ్లు, కీళ్లు, సుఖ దుఃఖములు, ప్రియాప్రియములు ఏవేని కలుగునో వానిని పూర్ణమైన బుద్ధితో ఆలోచించి నిశ్చయింపుడు. నేనెప్పుడే కార్యమును చేసినను మీరందఱు చెప్పిన పద్ధతినే నడచుచుంటిని. ఒక్కదానియందైనను చేటు గలగలేదు. ఇంద్రుడు చంద్ర సూర్యాది దేవతల ఆలోచన చొప్పున నడచునట్లు నేనును మీరలొప్పుగా చెప్పినట్లు చేసి యెన్నరాని సంపద లొందుచున్నాను గదా. మీకిది యంతయు తెలుపువలెనని యుండియు కుంభకర్ణుడు నిద్రించి యుండుటచే వెంటనే అప్పుడే చెప్పనైతిని. అతని దీర్ఘమైన ఆరునెలల నిద్ర పూర్తియైనది. గాన నిప్పుడు ఆ సర్వశస్త్రాస్త్ర కోవిదుడు మేలుకొనెను. కనుక ఇప్పుడావృత్తాంతమును చెప్పుచున్నాను. [సీతను ముచ్చిలించి తెచ్చి బందియం దుంచిన వార్త పదినెలలుగా రావణుడెవరికిని చెప్పక దాచెను]

## రావణుడు రాక్షసులతో సీతావృత్తాంతముఁ జెప్పుట:

సీతాదేవి రాముని ప్రియురాలగు పత్ని, విదేహరాజ కుమార్తె. ఈమె దండ కారణ్యముననుండగా నేను దెచ్చితిని. పుష్ప సుగంధములుగలది, మెల్లని నడకలు గలదియు నగు ఆభామిని నా శయ్యపై పరుండ నిష్టపడుటలేదు. మూడులోకములందు

వెదికినను సీత వంటి స్త్రీ లభింపదని తోచుచున్నది. సన్నని నడుముగలిగి గొప్ప పిరుదులు గలదై చంద్రబింబము వంటి ముఖము విశాలములైన కన్నులు కలిగిన బంగారు బొమ్మ వంటి సుందరియగు ఆమెను చూచినచో ఆ పద్మదళాయతాక్షిని మయుడే సృజించెనాయను తలంపు గలుగుచున్నది. యెఱ్ఱని అరికాళ్ళుగలిగి మిక్కిలి మనోహరములై పొందికగానున్న ఆ సుందరి పాదములును ఎఱ్ఱని గోళ్లును చక్కగా చూడగా మన్మథుడు మహావీరుడై నన్ను బాధింప దొరకొనును. హోమాగ్ని జ్వాలలవలెను, సూర్యకాంతివలెను వెలుగుచున్న ఆ తామర రేకులవంటి కన్నులుగల సీతనుచూచి ఓ రాక్షసవరులారా! నేను మన్మథ పరవశుడనైతిని. [ఇత్యాది వాక్యములచే రావణుడు సీతను కాముకుడై హరించెనని తెలియుచున్నది] కోపమునందు సంతోషమునందు సమముగా శోకము, తాపము గలిగించి కాంతిలేనివారినిగా జేయునట్టి మన్మథునిచే నేను కలంచబడిన మనస్సు గలవాడనయితిని. ఓ రాక్షస శ్రేష్ఠులారా! తన భర్తయైన రామచంద్రుడు వచ్చునను ఆశచే ఆమె నన్నొక సంవత్సరము గడువు వేడినది. నేనా మేలైన మాట కంగీకరించితిని. చక్కగా స్వారి చేయుటకుపయోగింపబడిన గుఱ్ఱము వలె నేను మన్మథుని బారికి చిక్కి స్రుక్కితిని. ఇది నాయొక్క స్థితి. రాక్షసశ్రేష్ఠులారా! మహాభయంకరములైన జలజంతువులతో నిండియున్న యీ సాగరమును ఆ గొప్పవానరులుగాని, రాజులు గాని ఏవిధముగా దాటగలరను కొందమన్నచో, ఆ వానరుడొక్కడే గదా మనతో గొప్పయుద్ధము చేసెను. ఎప్పుడేవిధముగా పనులు జరుగునో తెలియుట కష్టముగదా. కావున ముందు జరగబోవు విషయములను మీ బుద్ధికొలది ఆలోచించి చెప్పుడు. ఈ మానవునిచే భయముకలుగు ననుమాట లేదు సుమండీ. దేవదానవ యుద్ధములలో నేను మీయొక్క భుజబలము నాధారముగా గొనికదా జయించితిని. ఆ యుద్ధములందు గెల్పు గలిగించిన వారలు మీరే కదా. ఆ రాజపుత్రులు భూపుత్రిపోయిన విధమును తాము తెలిసికొని సుగ్రీవునితో గూడ అతని వానసైన్యమునంతయు తోడ్కొని సముద్రపు ఆవలి ప్రక్కన జేరినారు. భూపుత్రి నీయరాదు. మఱియు ఆ సీతానాధుని చంపవలయును. కాన దానికి తగిన మంచి యుక్తులను తెలియజేయుడు.

## కుంభకర్ణుడు రావణుని గోపించి పలుకుట:

రాముడు దప్ప వేరొకడు వానరసైన్యముతో సముద్రమును దాటి రాజాలడు. కనుక నాకు జయము నిశ్చయముగా కలుగును అని పల్కగా కామముచే గప్పబడిన చిత్తముగల ఆ దశకంఠుని రోదనమును విని కోపముతో మండి పోవుచున్న మనస్సుతో

కుంభకర్ణుడతనితో నిట్లనెను. రామాశ్రితుల రక్షణలో నున్న సీతను ఎవరినడిగి నీవు దొంగిలించితివి? అట్లు చేయక ముందే మమ్మడిగి యున్నచో యాముని సరస్సులో నింపబడిన యమునవలె నీ చిత్తము నిశ్చలముగా నుండునట్లు మేలైన యుక్తినొకదానిని చెప్పియుందుముగదా అట్లు చేసిన నీపని యెంతో లెస్సగా నుండును. ఇప్పుడు చింతించిన ఫలమేమున్నది? ఎవ్వడు రాజకార్యములందు మొదటనే న్యాయపద్ధతి నాలోచించి చేయునో అట్టివాడెప్పుడును తరువాత కార్యము చెడిపోయెనని మనస్సునందు దుఃఖింపడు. విపరీతములైన ఆలోచనలు చేసి నేర్పులేకుండ చేసినచో పనులు పూర్తిగా చెడుటయే గాక అపవిత్రహవిస్సులను తిన్నవిధముగా విపరీత ఫలములనిచ్చును. మొదట చేయవలసిన పనిని తరువాతను, చివఱ చేయవలసిన పనిని మొదటను చేయువానిని నీత్యనీతి విదుడని చెప్పదగునా? బలవంతుడు, సాధింపరానివాడు అని చెప్పదగినవాడు చపలత్వముతో నేపనినైనను చేసినచో ఇతరులు సులువుగా ఛేదింతురు. పక్షులు క్రౌంచ పర్వత బిలము నుండి గదా వచ్చుచున్నవి? విషముతో గూడిన అన్నమును భుజించుటవంటిదైన దుష్టమైన, అనాలోచితమైన కష్టమైన పనిని చేసితివి. అదృష్టమేమనగా శ్రీరాముడు నిన్నచ్చటనే చంపలేదు. ఎవ్వరికిని తగని చాల దుష్కరమైన పనిని చేయదలంచితివి గాన ఓ రాక్షసరాజా! నీతో బుట్టి నీతో పెరిగిన వాడనౌటచే నీతో నే నిల్వక తప్పునా? ఇక జరుగవలసిన కార్యవిధానమును చెప్పెదను. నీ విరోధులను నేను సంహరించి కార్యమును పూర్తిచేసెదను. ఇంద్రుడు, అగ్ని, సూర్యుడు, వాయువు, కుబేరుడు మున్నగు వారడ్డుపడినను వారిని సంహరింతును. చేతియందు పరిఘాయుధమును ధరించి త్రిప్పుచు తీక్ష్ణమైన దానియందు కాంతులు దిక్కులను గప్పుచుండగా కొండవంటి శరీరముతో నేను భయంకరముగా గర్జించుచుండ గొండల శత్రువైన యింద్రుడైన బెదిరిపోడా? ఒక బాణముతో నన్ను గొట్టి రెండవ బాణముతో గొట్టునంతలోనే నేను రాముని రక్తమును ద్రావెదను సుమా! దేవతలనోడించిన ఓరాజా! ఆపై సుఖములను పొందుము. రాముని సంహరించి మఱియు లక్ష్మణుని హతునొనర్చి వానర సమూహమును తినివేసి గ్రున త్రేన్చుచు నీకు గెలుపును, కోర్కె దీరగా సౌఖ్యమును గల్గునట్లు చేసెదను. సురనుత్రావుము. స్వేచ్ఛగా నీకిష్టమైన కార్యములను నిర్భయముగా జరిగింపుము. భయంకరమైన యుద్ధరంగమున మృత్యువుతో చెలిమిచేసి యమపట్టణమునకేగగా రాముడు వెంటనే గొప్పసంతోషముతో పొందు సీతాభామారత్నమును అని కుంభకర్ణుడు చెప్పగా

★★★

# పదమూడవ సర్గము

## మహాపార్శ్వుడు సీతను విడువరాదని రావణునితో జెప్పుట:

రావణుడు క్రోధమును పొంది యుండుటను గుర్తించి అతనిని శాంతి నొందించు నుపాయము క్షణములో ఆలోచించి మహాపార్శ్వుడు చేతులు జోడించి గర్వముతో నిట్లనెను. అనేక మృగములతో నిండిన వనము నందెట్లో ప్రవేశించి అచ్చట లభించిన తేనె నెవ్వడైతే త్రాగక విడుచునో అట్టి నరుని ప్రాజ్ఞులు బాలిశుడని యందురు. ఈ లోకములకు నీవే యీశ్వరుడవు. ఓ రాక్షసరాజా నీ కన్యుడీశ్వరుడు గలడా? ఓ రాక్షసేశ్వరా! శత్రువులను నాశమొందించినవాడా! భూపుత్రితో గూడి శాశ్వత సుఖము ననుభవింపుము. ఆభూపుత్రి! తనంత తానుగా ప్రేమతో నిన్ను బొందదేని ఓ సురవైరీ! నీవే కోడివలె బలవంతముగా సందేహము లేక రమింపుము. తొలుత వేగముగా నీయొక్క వాంఛ తీరినచో తరువాత క్షణమునందే భయముగలుగనీ, లేక కొంతకాలము తర్వాత భయము కలుగనీ నీవు వానినన్నిటిని సహింపవచ్చును. వజ్రాయుధమును చేత బట్టి యింద్రుడు వచ్చినను యుద్ధరంగమునందు సంరంభముతో కుంభకర్ణుడును, ఇంద్రజితుండును మేమును అతనిని జంపుదుము. ముందుగా సామము, దానము భేదము అను పద్ధతములను శక్తిలేని అల్పులు మెచ్చుచుందురు. శక్తిగలవాడు నాల్గవదియైన దండనీతినే అవలంబించును. కాన ఓ రాక్షసాధిపా! దండపద్ధతిలోనే నీ కోర్కెను పూర్తిగావించుకొనుము. ఇచ్చటికి శత్రుసమూహములు వచ్చినచో శస్త్రములతో గొట్టి సంహరింపగలము. ఇది నిజము. సందేహము లేదు. నీ యిష్టము వచ్చినట్లు సంచరింపుము అని చెప్పగా రాక్షసరాజాతని మాటల ధోరణికి మెచ్చుకొనుచు గొప్పనైన చింతతో తన మనస్సునందున్న ఆలోచన నిట్లు చెప్పెను.

## మహాపార్శ్వునితో రావణుడు బ్రహ్మ తన్ను శపించుటను దెల్పుట:

ఓ మహాపార్శ్వుడా! నా వెనుకటి వృత్తాంతమును ఎవ్వరికి తెలియని రహస్యమును వినిపింతునువినుము.బ్రహ్మను సేవించుటకైఆసత్యలోకమునకుపుంజికస్థలయనునప్సరస ఆకాశ మార్గమున వెళ్లుచు నన్నుజూచి జంకుచు ఒదిగి యొదిగి వెళ్లుచుండగా అగ్నిజ్వాల

వలె ప్రకాశించుచున్న ఆ అప్సరసను చూచి బలవంతముగా దానిపైబడి చెరచి వివస్త్రను చేసి విడువగా ఆ కోమలి నలిపిన పద్మమువలె బ్రహ్మసభకు వెడలినది. బ్రహ్మ దాని వృత్తాంతము తెలిసికొని కోపముతో నాకీ విధముగా శాపమిచ్చెను. ఓరీ! దశకంఠా! ఇది మొదలుగా నీవు మనసులో నిన్నిష్టపడని స్త్రీని బలవంతముగా గలసినచో నీతల ఆ క్షణముననే నూఱు చెక్కలై నేల వ్రాలును అని. ఈ శాపభీతిచేతనే గదా నేను భూపుత్రినాశింపకున్నవాడను. కాకున్న నెప్పుడో నాశయ్యయందా మెఱుపుతీగ వంటి దేహముగల సీతను గలిసి యుండనా? నా వేగము సముద్రము వలె పొంగునని, ఝంఝా మారుతమును బోలినదని, యుద్ధమున నంతకంతకు నుప్పొంగు నా పరాక్రమము విధమును తెలిసికొనజాలక సీతాదేవి నిమిత్తమై గొప్పవానర సైన్యముతో వానరరాజు తోడురాగా ఆ భూపుత్రికాకాంతుడు వచ్చినాడు. పర్వతగుహయందు నిదురించుచున్న సింహమును వేగముగా నిద్ర లేపు విధముగా, క్రోధించిన మృత్యువును మేలుకొల్పు విధమున, భయంకర సర్పములను బోలిన నా వాడి బాణముల నెప్పుడును గుర్తెఱుగకుండుటచే ఆ రాముడు వేగముగా నన్నెదుర్కొనుటకు వచ్చుచున్నాడు. వజ్రసన్నిభములై నావింటి నుండి భయంకరముగా వెలువడు బాణముల వర్షము వేయివిధముల తనమీద వ్యాపింపజేయుచు కోట్లకొలది కొఱవులతో ఏనుగును ఆక్రోశింపజేయునట్లు ఇంద్రుని తోడు తీసుకొని వచ్చినను ఆ రాముని యుద్ధరంగమున పరువెత్తించెదను. వేయికన్నులు గల ఆ యింద్రుడు గాని పాశహస్తుడైన వరుణుడు గాని నన్నెదుర్కొని యుద్ధరంగమున నిలువగలడా? కుబేరుని మదమణంచి లంకను హరింపలేదా? వారి సైన్యమెంత? చుక్కలను రూపుమాయజేయు ఉదయసూర్యుని వలె రూపుమాపెదను.

## విభీషణుడు సీతాదేవిని శ్రీరామున కిమ్మని రావణునకు బోధించుట:

అని యిట్లు రాక్షసరాజు పల్కుచున్న మాటలను, కుంభకర్ణుని వ్యర్థములైన అరుపులను విని, విభీషణుడు హితమును, అర్థవంతమును నగుమాట నిట్లు రావణునకు జెప్పెను. ఓ రాజా! విశాలమైన వక్షమే (భోగము) శరీరముగా గలదియు, అధిక చింతయను మహావిషము గలదియు చిరునవ్వనెడు తీక్ష్ణమైన కోరలు గలదియు, చేతి అయిదు వ్రేళ్లనెడు నైదుపడగలు గలదియు అగు సీత యనెడు మహాసర్పము నింత మేధావివి పట్టి తీసికొని వచ్చుట తగియున్నదేమో ఆలోచించి చూడుము. పర్వతసమాన దేహులును తీవ్రములయిన గోళ్లే ఆయుధములుగా గలవారును గొప్ప కోరలు గలవారలును

అయిన కోతులు భయంకరముగా రాకముందే రాక్షసరాజా! రామునకు సీత నిమ్ము. వాయువేగము గలవియు, పిడుగుల సమూహము వంటివియు నయిన రామబాణములు రాక్షసుల తలలు నరికి భూమిపై దొరలింపక ముందే సీతను రఘురామున కిచ్చివేయుము. కుంభకర్ణుడయినను, కుంభ నికుంభులైనను, ఇంద్రజిత్తే అయినను, ఆ మహోదర మహాపార్శ్వులయినను, ఈ అతికాయుఁడైనను రామునితో తలపడగలరా? సూర్యుడు నిన్ను రక్షించినను, దేవతలు గాపాడినను, గొప్పనైన దయతో ఇంద్రుడు నిన్ను తన తొడపై గూర్చుండ చేసికొనినను, మృత్యువే స్వయముగా అడ్డుపడినను, పాతాళమున దాగినను ఓ ప్రహస్తా! నిన్ను రామచంద్రుడు యుద్ధరంగమున ప్రాణముతో విడచిపెట్టడు సుమా. తెలిసికొనుము. అని చెప్పిన విభీషణుని మాటలకు ప్రహస్తుడిట్లు సమాధానము చెప్పెను. మాకు దేవతలచేత గాని, సిద్ధులచేత గాని, కింపురుషులచేత గాని, యక్షులచేత గాని, నాగులచేత గాని, మాకు భయము లేదనగా ఇంక మానవ రాజపుత్రుడైన రఘురామునిచే భయము కల్గునా? ఓ విభీషణా! ఏల యిట్లు మమ్ము వట్టి మాటలతో బెదిరించెదవు అని పల్కగా

★★★



# పదునాల్గవ సర్గము

## విభీషణుడు ప్రహస్తుని గర్హించుట:

ఆ ప్రహస్తుని మాటలను విని విభీషణుడు ధర్మార్థ కామములయందు ప్రీతి గలిగినవాడును రాజుయొక్క క్షేమమును గోరువాడును అయిన విభీషణుడు ఓ ప్రహస్తా! యిట్లనుచున్నావేమి? నీవును, కుంభకర్ణుడును ఈ మహోదరుడును రామచంద్రుని పట్ల చేయుచున్న ఆలోచనలు ధర్మమునకు విరుద్ధముగా నడుచువారికి స్వర్గము ఫలింపనట్లు సఫలములు కాజాలవు. ఓడ లేనివాడు సముద్రమును దాటదలచినట్లు కార్యదక్షుడైన సీతానాధుని నీవైనను నేనైనను సర్వ రాక్షసులైనను చంపలేము సుమా. శ్రేష్ఠమైన ధర్మముల నాచరించువాడును, ఇక్ష్వాకు వంశమున బుట్టినవాడును, మహారథుడును, రాజులలో శ్రేష్ఠుడును, కార్యములందు సమర్థుడును అగు శ్రీరాముని యుద్ధరంగమున నెదరించినచో దేవతలు కూడ నిజముగా అసమర్థులై మూఢులగుదురు గదా. పోలిక చెప్పుటకు వీలులేనివియు, ఇంద్రుని వజ్రాయుధము వంటి వేగము గలవియు, ప్రాణములు తీయు స్వభావము గలవియు నైన ఆతని బాణముల సమూహములు యుద్ధమున ఇదివఱకు నీ శరీరమున నాటకుండుటచే ఓ ప్రహస్తా! నీ విచ్చట డంబములు కొట్టుచున్నావు. ఎదిరింపరాదనియు, గొప్ప వాడి గలదియు, తీవ్రమైన వేగము గలదియు, భూతనయాపతియైన రాముని చేతినుండి వెలువడినదియు నగు బాణసమూహము వేగముగా వచ్చి నీ శరీరమును చీల్చనంత దనుక ఇట్లు నిన్ను నీవు పొగడుకొనుచు వదరుచుండుము. ఈ రావణుడు గాని, ఇంద్రజిత్తుగాని, కుంభకర్ణుడు గాని, నీవైన గాని, ఈ త్రిశీర్షుడుగాని, నికుంభ నరాంతకులు గాని, పర్వత సమానుడైన ఈ అకంపనుడు గాని, అతికాయుడు గాని సీతానాధుని కన్నుల కెదురుగా యుద్ధరంగమున నిలబడజాలరు. మీరు శత్రుసమానులై మిత్రులను పేరున, వ్యసనములచే దిరస్కరింపబడిన వాడును, క్రూర స్వభావము గలవాడును, ఆలోచింపకయే పనుల నాచరించు వాడును అగు రాక్షసరాజు పంచన రాక్షస సమూహము యొక్క వినాశనముకై చేరితిరి. ఏమని చెప్పువాడను. వేయి శిరస్సులు గలదియు, అంతము తెలియనంత శరీరముగలదియు, భయంకరాకారము

గలదియు, గొప్పబలము గలదియు నగు పామీరాజును జుట్టుకొనినది. దానినుండి రాజును మీరు రక్షింపుడయ్యా! అతనివలన అన్ని కోరికలు నెరవేరి సుఖముగా నున్న హితులందఱును చేరి రాజును శత్రుసైన్యములు వచ్చి తలవెంట్రుకలొడిసి పట్టకముందే పరిరక్షింపుడయ్యా! ప్రళయమును గలిగించు లక్ష్మణుడను సముద్రములో మునిగి శ్రీరాముడనెడు పాతాళ ద్వారములోనికి ప్రవేశింపనున్న దశకంఠుని పట్టి బలవంతముగ నైనను ప్రాజ్ఞులైన మీరు రక్షింపుడయ్యా! ఇది లంకకు, రాక్షస సంఘమునకు, రాజునకు ఎక్కువైన మేలు కలుగజేయునుగాన నాయుద్దేశము ప్రకారము సీతానాథునకు సీత నిచ్చుట తగిన పనియని తలంతును. ఎవ్వడైనను తన బలమును, నెదిరి బలమును, తనయొక్క స్థానమును, వృద్ధి క్షయములును, శత్రువుల స్థితిని తన మనస్సునందు లెస్సగా ఆలోచించి మంత్రులు తమ రాజునకు హితము గూర్పదగియుండును.

★★★



# పదునైదవ సర్గము

## ఇంద్రజిత్తు విభీషణుని దిరస్కరించి పలుకుట:

బుద్ధి యందు బృహస్పతితో పోల్పదగిన వాడగు ఆ విభీషణుని మాటలను, రాక్షసవీర ముఖ్యుడగు యింద్రజిత్తు తన తండ్రిని జూచి యిట్లు పల్కెను. తండ్రీ! ఏమిది నీ సహోదరుడే హీనమైనదియు, అనర్థకమును, భయమును గలిగించునదియు మన రాక్షసజాతికి కొంచెము కూడ తగనిదియు అగు విధముగా పల్కుచున్నాడు. వింటివా. మన వంశమునపుట్టనివాడైన నీవిధముగా పలుకునా? ఈతడు పలికినను ఎంతటి శక్తిహీనుడయినను ఇట్టి మాటలను వినునా? శౌర్యమును, గొప్పబలమును, సాహసమును, పరాక్రమమును ధైర్యమును, తేజస్సును, అధికమైన ధైర్యమును, ఇవియేవియు లేని నిర్వీర్యుడైన నీ తమ్ముడగు విభీషణుడొక్కడే ఈ శ్రేష్ఠమైన కులమునకు దుష్కీర్తిని సంపాదించుటకై పుట్టెను గదా! అని ఓ విభీషణా! పిరికివాడా! నీవు మాకు భయము నేర్పుచున్నావా? ఆ రాజపుత్రులనిరువురును మాలోని ఒక అల్పుడగు రాక్షసుడైన చంపలేడా? నీ కేల యిట్టి ప్రల్లదనపుమాటలు? లోకముల కధీశుడైన ఇంద్రుని గర్వము నశించునట్లు పట్టి నేను చెరపెట్టలేదా? దిగ్భ్రాంతి నొందిన దేవతలను తరిమివేయలేదా? విజృంభించిన నా శక్తిని జూచి గీపెట్టుచు నేలగూలిన ఐరావతముయొక్క దంతముల నూడబెరికి వానితో నరులను పారద్రోలలేదా? దేవసమూహముల గర్వము నణగలేదా? రాక్షసులకు దుఃఖమును గలిగించు గొప్ప కీర్తి నందలేదా? నీకు తెలియదా? అంతటివాడనగు నేను సాధారణులగు రాజులను బలహీనులగు మానవులను జయించుట వింతయా? విభీషణా! అని పల్కగా మహాబలశాలి యగు విభీషణుడు అజేయుడును, ఇంద్ర సమానుడను గొప్పతేజము గలవాడును అగు ఇంద్రజిత్తునుజూచి ఇంచుకంతయు జంకు లేకుండగా గొప్ప అర్థము గలిగిన మంచి మాటల నెల్లరు వినుచుండగా నిట్లు పలికెను.

## విభీషణు డింద్రజిత్తును నిందించుట:

నాయనా! నీవు బాలుడవు. ఇంకను పక్వముగాని బుద్ధి గలవాడవు. అందుచే మంత్రాలోచనమును యదార్థదృష్టితో చూచునంతటివాడవు కావు. కనుకనే నీ

వినాశము నైన తెలిసికొనక నీ యిష్టము వచ్చినట్లుగా లేనిపోని మాటల నుపన్యసించితివి. అంతమాత్రమున కార్యము తీరిపోయెనా? పుత్రుడవను నెపముతో ప్రియమిత్రునివలె కన్పించుచు రావణునకు శత్రువువై భూపుత్రికాపతి భయంకరుడని చెప్పగా ఈ మాత్రము నర్థము చేసికొనలేక దుష్టులమాటలను విందువా? ఆలోచించి చూడగా నీవు దండనార్హుడవు. అంతేకాదు. ఇటువంటి మంత్రాలోచన జరుపుచున్న సమయమున ఇచ్చటికి సాహసమే ప్రధానముగాగల బాలుని శూరుని సభలోనికి దీసికొని వచ్చిన దుష్టుడు గూడ వధింపదగినవాడే. మూర్ఖులు గూడిన కొలువులో మంత్రాలోచనము చేయదగునా? నీకు తెలివి సున్న. తీక్ష్ణత్వము నీకు స్వభావసిద్ధము. అణకువ యెట్టిదో నీ వెఱుగనే యెఱుగవు. పెద్ద తెలిసిన వానివలె తీర్పు దిద్దుచున్నావు. అల్పుడవు. అల్పబుద్ధి గలవాడవు. దుష్టుడవు. మూర్ఖుడవు. అధిక గర్వముగలవాడవు. మిక్కిలి దుర్బుద్ధి గలవాడవు. పిల్లతనము చేత ఈవిధముగా ప్రేలుచున్నావు. సీతానాథుడు ప్రయోగించు బ్రహ్మదండ సమానములు కాలాగ్ని తుల్యములును నగు బాణములును ఓర్చుకొనగలవాడెవ్వడు? ఓ రాక్షసరాజా! నా విన్నపమును కొంచెము మనస్సునందు చేర్పుము. ధనములును రత్నములును, ఆభరణ సమూహములును ప్రకాశించు మహాధనములును, విచిత్రములగు మణులును, సీతాదేవితో పాటు గొనిపోయి భక్తితో ఆ రామచంద్రున కర్పింపుము. అట్లు చేసినచో ఈ పురమునందెల్లవారును సౌఖ్యమును పొందెదరు సుమా.

★★★



# పదునాఱవ సర్గము

## రావణుడు విభీషణునకు జ్ఞాతి లక్షణములు దెల్పి నిష్ఠురములాడుట:

అని శ్రేష్ఠమైన హితవాక్యములను పల్కుచున్న విభీషణుని ముఖమును జూచి రావణుడు కాలునిచే ప్రేరేరింపబడిన బుద్ధి గలవాడగుటచే అతనిని గూర్చియిట్లు పరుషములగు మాటలను పలికెను. రోషముతో నున్న సర్పముతో నైనను తన శత్రువుతోనైనను కలిసి నివసింప వచ్చును గాని తనకు స్నేహితునివలె సంచరించెడి తన విరోధియొక్క సేవకునితో కలిసియుండుట తగదు కదా. మూడులోకములలోను జ్ఞాతుల స్వభావమంతయు నాకు తెలియనిది గాదు సుమా. ప్రతివాడును తన జ్ఞాతులకు ఆపద కలిగిన తాను సంతోషించును. గొప్ప బుద్ధిగలవాడును, ధర్మాత్ముడును అగువానిని జ్ఞాతులెప్పుడును మెచ్చుకొనరు. మఱియు సమయము గనిపెట్టి పరాభవము కూడ జేయుదురు. కలిసిమెలసి యున్నట్లే కనబడుచుందురు. క్రూరకార్యములు చేయుటకు వెనుకాడరు. తమ మనస్సు తెలియనియ్యరు. కష్ట సమయమును జూచి చంప యత్నింతురు. జ్ఞాతులెచ్చట నయినను భయము కలిగించు వారలే గదా. పూర్వము పాశహస్తులయిన మానవులను జూచి పద్మవనమునందున్న యేనుగులు కొన్ని పద్యములను వినిపించినవి. జ్ఞాతి లక్షణములు దెలియుటకై వానిని వినుము. మాకు పాశముల వలనను, నిప్పువలనను, శస్త్ర సమూహముల వలనను భయములేదు. స్వార్థపరులును, క్రూరులు నయిన దాయాదుల వలననే మాకు భయము కలుగుచున్నది. మీరు తెచ్చినట్టి యేనుగులే మమ్ము బట్టు నుపాయమును దెల్పును. ఇది నిజము. అన్ని భయములలోను జ్ఞాతిభయ మనునదే భరింపరానిది. మాకు బాగుగా దెలియును. గోవులందు భాగ్యముండుట సహజము. బ్రాహ్మణులందు ఇంద్రియనిగ్రహముండుట ప్రసిద్ధము. స్త్రీల స్వభావము చిత్తచాంచల్యము. అపకారము చేయుట జ్ఞాతికి సహజగుణము. కనుక ఓ సౌమ్యుడా! విభీషణుడా! లోకము నన్ను గౌరవించుటను, నేను సాటిలేని భాగ్యము నందుటను, నేను విరోధులందఱి తలలపై కాలుమోపుట చూచి నీ మనస్సున నోర్వలేకపోయితివా? ఓరీ రాక్షసుడా! తామరాకు నందు నీటిబిందువులు అంటియు అంటనట్లు అనార్యుడు చేయు స్నేహము కూడ అంటియు

అంటకయే యుండును గదా. వినుము. పువ్వులందలి తేనెను త్రాగిన తరువాత తుమ్మెదలు వానిని విడచిన విధముగా దుర్జనులు పని తీరిన తరువాత పూర్వమైత్రిని తలంపరుగదా. ఓ అసురుడా నిజము చెప్పుచున్నాను. తొలుత నెంతో సమయము నీటిలో స్నానము చేసినను ఏనుగు తనంత తానే తన తొండముతో తన శరీరము ముట్టి చల్లుకొనునట్లు ఖలులతో స్నేహము నిరర్థకము సుమా! శరత్కాలమందు పెద్దగా ఉరుము లురిమియు, చిన్న చినుకులను రాల్చియు భూమిని తడపజాలని మేఘములవలె ఆలోచింపగా ఆర్యులుగాని వారితోడి స్నేహమును నిస్సారము, నిష్ఫలము గదా. ఓ అసురా! ఈ విధముగా వేరొకడెవడైన మాట్లాడినచో ఒక్క నిమిషములో వాని శిరస్సు భూమిపై దొరలకుండునా? కులపాంసనుడా! ఛీ. పొమ్ము నాయెదుట నుండుటకు నీవు తగినవాడవుగావు.

## విభీషణుడు సభ విడిచి మింటికెగసి రావణునకు హితము దెల్పుట:

అని పరుషముగా రావణుడు పల్కిన మాటలను విని న్యాయవాదియైన విభీషణుడును గదను చేత ధరించినవాడై నలువురు రాక్షసులతో గలసి ఆకాశమున కెగిరి శ్రీమంతుడగునాతడు అన్నతో నిట్లనెను. నీవు నాకు అన్నవు. అంతేగాక రాజువు కూడ కదా. అందుచే నీ యిచ్ఛ వచ్చినటు లేవిధముగ నైనను మాటలాడుము. మాన్యుడవు. పెద్దవాడవు. తండ్రితో సమానమైన వాడవు. అయినప్పటికి నీవు ధర్మమైన మార్గమున నడవకుండుటయు, నీ అసత్యములును, మిక్కిలి ఆపదలను గొనితెచ్చు నీ నిష్ఠురములైన పల్కులు నే నొకింతయినను భరింపజాలనుసుమా. నీ హితమును కోరిన వాడనై విశదముగా నీకు సునీతిని తెలియజేసితిని కాని అది నీ మనస్సున కెక్కునా? కాలునకు వశమైనవాడును, అజితేంద్రియుడును మంచిని గ్రహింపజాలడు గదా. ఎల్లప్పుడును ఇష్టములైన మాటలను చెప్పువారు సులభముగా లభింతురు. కాని అప్రియమైనను మేలును గూర్చునట్టి మంచి మాటను చెప్పెడువాడను, వినెడి వాడును అరుదుగా నుందురు గదా! రాక్షసరాజా! కాలిపోవుచున్న యింటిని విడువ మన సొప్పని యట్లు సర్వభూతములను నాశనము చేయునదైన యమపాశమునకు చిక్కువడిన నిన్నుపేక్షింపజాలను. నూతనమైన బంగారు అగ్రము గలిగి, మండుచున్న అగ్నివలె భయంకరమైన రాఘవుని యొక్క బాణములు నిన్ను భూమిపై గూల్చుటను నేను చూడజాలను. గొప్ప మగటిమి గలవారైనను, మహాబలవంతులైనను, అస్త్రశస్త్రములయందు నేర్పరులైనను యమునిచే పట్టుపడిన వేళ యిసుకతో గట్టిన సేతువుల వలె భూమియందు నశింతురు. అన్నవు గదా యని

మేలుకోరి చెప్పిన నా మాటలు మన్నించవైతివి. ఇక రాక్షస సహితమైన లంకను క్షేమముగా కాపాడుకొనుము. సుఖముగా నుండుము. నీకు మేలు కలుగుగాక. నిన్ను విడచి గొప్పదైన సౌఖ్యమును పొందెదను. ఇకపోయి వచ్చెదను. నీ శ్రేయస్సు కోరి ఎంతగా చెప్పినను నా మంచి మాటలు నీ మనస్సునకు రుచింపకున్నవి. విపరీతకాలము వచ్చి ప్రాణములు పోగొట్టుకొనువారల కిట్టివి రుచించునా?

★★★



# పదునేడవ సర్గము

## విభీషణుడు నలువురు మంత్రులతో శ్రీరాము నొద్దకు పోవుట:

అని పరుషములైన వాక్యములను విభీషణుడు తన సోదరుడైన రావణునితో చెప్పి వెంటనే మంత్రులతో గలిసి జానకీ నాథుడున్న చోటు చేరెను. మేరు పర్వసమానమైన రూపము గలిగి ప్రకాశించు మెరుపుదీగవలె ఆకాశమున మెరయుచున్న అతనిని భూమిపైనున్న వానరులు పరీక్షగా చూచిరి. తనతో ఐదుగురై వచ్చుచున్న వారిని జూచి చతురుడైన సూర్యపుత్రుడాలోచించుచు హనుమంతుడు మొదలైన వానరులతో నిట్లనెను. వానరులారా! చూడుడు. నలువురు మంత్రులు తన్ను గొలువ ఈ రాక్షసుడు మనలను జంపుటకై సకల సాధనములతో వచ్చుచున్నాడు. ఇది నిజము. అని చెప్పగా వానరరాజు మాటలు చెవి సోకగనే కొండలను చెట్ల సమూహములను గైకొని వానరులిట్లనిరి. ఓ దేవా! ఈ దుర్మార్గుల నిప్పుడే వేగముగా సంహరింప నాజ్ఞాపింపుము. ఈ అల్పతేజస్కులు క్షణములో ప్రాణములు వీడి నేలబడుదురు చూడుము.

## విభీషణుడు తనరాక శ్రీరామునకు దెలుప వానరులను వేడుట:

అని వానరశ్రేష్ఠులు తమలో తాము చెప్పుకొనుచుండగా వేగముగా విభీషణుడు సముద్రపు టుత్తరతీరమునకు వచ్చి ఆకాశముననే నిలబడి ఆ కోతులందఱును, సూర్యపుత్రుని జూచి ఉదారమైన వాక్కులతో తన వృత్తాంతము నిట్లు జెప్పెను. రాక్షసుడును, దుర్వృత్తుడును రాక్షసరాజును అయిన రావణునకు నేను సాక్షాత్తుగా సోదరుడను సుమండీ! ఈ భూమియందు విభీషణుడను పేరున తెలియబడుచున్న వాడను. భూపుత్రి దండకాటవియందు జనస్థానమందుండగా రావణుడామెను హరించెను. జటాయువును సంహరించెను. ఆ మందగమనను తన యంతిపురిలో నిర్బంధించెను. రాక్షసస్త్రీలను కాపలా పెట్టి వారిచే ఆమె దుఃఖించునట్లు పరుషములగు మాటలను పల్కించెను. ఆ రక్కసునకు నేను చాల మారులు రామునకు సీతనిమ్మని హేతుయుక్తములైన నెమ్మదైన మాటలతో ఎంతగానో చెప్పితిని. కాలము దాపురించిన వానికి ఎంతటి మేలైన మందుకూడ పని చేయనట్లు, నేనెంత మంచిమాటలు చెప్పినను కొంచెమైన మనసున కెక్కించుకొనడుగదా.

నన్ను పరుషములైన మాటలతో నొప్పించి ఒక బంటును చూచిన విధముగా అమర్యాద చేయగా, ఆలుబిడ్డలను వదలి వేగముగా ఇచ్చట రామచంద్రుని శరణు జొచ్చితిని. ఓ వానరశ్రేష్ఠులారా! ఆ జగద్రక్షకుడైన, పరమ మహాత్ముడైన రఘుసత్తమునితో నా స్థితిని వేగముగా దెల్పరయ్యా! [ఈ విభీషణ శరణాగతి అభయప్రదానము ఉత్తర పీఠిక యందు విపులముగా చర్చితములు] అని విభీషణుడు చెప్పగా

## సుగ్రీవుడు రామునకు విభీషణుని రాక దెలిపి రాక్షసుల నమ్మరాదనుట:

సుగ్రీవుడు వేగముగా వెళ్లి లక్ష్మణుని యెదుట శ్రీరామునితో తత్తరపడుచు నిట్లనెను. రామా! తనపేరు విభీషణుడట రావణాసురనకు తమ్ముడట. తాను నలువురు మంత్రులతో వచ్చి నిన్ను శరణవేడుచున్నాడు. రామచంద్రా! మంత్రాలోచనమందును, వ్యూహములు పన్నుటయందును, రాజనీతి యందును, గూఢచారులను నియోగించుట యందును, వానరుల యెడ రాక్షసులయెడ నీవప్రమత్తుడవై యున్నచో జయము కలుగును. మఱియు రాక్షసులు కామరూపులు. వికారమైన స్వరూపము గలవారు. శౌర్యము గలవారు. అపకార పరాయణులు. అని తెలిసికొనుము. కన్నులకు కనబడకుండ తిరుగుచుందురు. వారినెన్నడును నమ్మరాదు. రావణాసురున కీతడు వేగులవాడై వచ్చెనేమో రాజనీతిజ్ఞుడై తానే స్వయముగా మనలో నుండి సమయము కనిపెట్టి మనలను చంపుటకై వచ్చెనేమో కదా. తన స్నేహితులు పంపిన సైన్యమును, వనములందుండు వారి బలమును వేతనముపై నియమించుకొన్న సేనలను, మూలబలమును నమ్మవచ్చును గాని శత్రువుల బలమును నమ్మరాదు. స్వతస్సిద్ధముగా తాను రాక్షసుడట, రాక్షసరాజునకు ప్రియుడైన తమ్ముడట. శత్రుపక్షము నుండి వచ్చినాడట. వీనిని నమ్మవచ్చునేమో ఆలోచించి చూడుము. ఓ రఘువీరా! వినుము. విభీషణుడు దశవదనుని చారుడు. ఆతడు వక్రబుద్ధితో పంపగా ఇచ్చటికి వచ్చియుండును. నీవీతని నమ్మితివేని మాయచే మనల జంపుట తథ్యము. వీనినిప్పుడే మృతుడగునట్లు చేయుటయే తగినపనియని నాకు తోచుచున్నది సుమా. రాజచంద్రా! ఉపాయశాలి యగు శత్రువు తన శత్రుసేనలో ప్రవేశించి ఏమాత్రము సందేహము కలుగకుండ సంచరించుచు ఏదో సందు దొరకగనే శత్రువులను పూర్తిగా సంహరించును. గుడ్లగూబల సమూహమును కాకి సంహరించు రీతిగా సంహరించును. కనుక ఎట్లైనను విరోధులను నమ్మరాదు. క్రూరుడైన రావణాసురుని తమ్ముడైన వీనిని సేవకులతో గూడ క్రూరముగా చంపుటయే ఆలోచింపగా తగిన పని అని తోచుచున్నది.

అని సూర్యపుత్రుడు సంరంభముతో పల్కిన వాక్యములను విని పురుషశ్రేష్ఠుడగు రాముడు తన యెదుటను ప్రక్కల ఉన్న హనుమంతుడు మొదలైన వానరశ్రేష్ఠులను జూచి ప్రీతితో ఇట్లనెను.

## శ్రీరాముడు విభీషణు విషయమై కపులయభిప్రాయమడుగుట:

వానరులారా! ఈ వానరరాజు ఆ రాక్షసరాజు తమ్ముని గురించి తాను యుక్తి యుక్తముగా పల్కిన పలుకులను మీరందఱును వినియున్నారు గదా. గొప్పకార్యము నిర్ణయింప వలసినప్పుడు ఒక హితుడు మాటలాడిన తరువాత తక్కిన ప్రాజ్ఞులగు హితులు మాటలాడకుండుట తగదు కదా. కనుక ఈ సందర్భమున మీ మీ భావములను తెలియజేయుడని కోరగా వానరశ్రేష్ఠులు దానిని గురించి మనస్సునందాలోచించి ఒకరితో నొకరు చర్చించుచు తమ అభిప్రాయమును రామునికిట్లు తెలియబల్కిరి. ఓ మహాత్మా! మూడులోకములందును నీకు తెలియనిది ఇంచుకయును లేదు సుమా. మా యందున్న స్నేహము చేతను గౌరవము చేతను మమ్ములను ప్రశ్నించితివి. అంతే. ఓ అపార పరాక్రమవంతుడా! నీయందు ఏపనినైనను పరీక్షించి చేయు లక్షణము, స్నేహితుల మాట నాదరించుట, ధర్మగుణము, బలము, దృఢశౌర్యము, సత్త్వము, జ్ఞానము ప్రకాశించుచున్నవి. నీ మంత్రులందఱును బుద్ధిమంతులు పనులు నెరవేర్చుటయందు గొప్ప నిపుణత గలవారలు నగుటచే ఒక్కొక్కరు తమతమకు తోచిన హితమును హేతుయుక్తముగా శ్రేష్ఠమైన విధముగా చెప్పదగును.

## అంగదాదులు వారి వారి అభిప్రాయములను దెల్పుట:

అని పల్కగా విని వాలి పుత్రుడగు అంగదుడు రామచంద్రునితో విభీషణుడు విరోధుల స్థలము నుండి వచ్చి యుండుటచే అనుమానింపదగినవాడు. చప్పున నమ్మదగదు. శత్రువులు తమ నడవడిని కప్పిపుచ్చి సమయమును జూచి దెబ్బతీయుదురు. అట్టి ద్రోహులను నమ్మినచో ఎంతయో అనర్థము గల్గును గదా. కావున అట్టివారిని ఏదైన నొక కార్యము నందు నియోగించి వారి ప్రవర్తనను తెలిసికొని గుణవంతుడైనచో వానిని గ్రహింపవచ్చును. దుర్మార్గమైన ఆలోచన గలవాడైనచో వీడదగును. చాల దోషములున్నచో విడువదగును. గుణవంతుడైనచో వానిని చేపట్టవచ్చును. అను మాటలను విని శరభుడు ఇట్లనెను. నెమ్మదైన విధముగా ఆ రాక్షసుని చిత్తమును పరీక్షించుటకు సూక్ష్మబుద్ధులైన

వేగులను నియించి వారాతని చర్యల నన్నిటిని తెలిసికొని వచ్చినచో ఓ మానవ నాయకా! అనుమానము తొలిగి పోయినచో వానిని పిమ్మట అనుగ్రహింపుము. అనగా జాంబవంతుడు గుణయుక్తము దోషరహితము అయిన మాటనిట్లు చెప్పెను. రామా! రావణుడుమాత్సర్యము గలవాడు. విరోధము సాధించువాడు. అతని వీడి ఈ విభీషణుడు నిష్కారణముగా నిన్ను చేరవచ్చెను. ఇది దేశకాలోచితము కాదు కాన నితని నమ్మవలదు సుమా అనగా మైందుడు నీత్యనీతులను సమముగా నాలోచించి ఇట్లనెను. ముందుగా విభీషణుని సమీపించి ముచ్చటడగ మధురమైన మాటలతో అతని విధమును రావణుని మాటల తీరును తెలిసికొని దుష్టుడో సజ్జనుడో తెలిసికొని తరువాత తగిన విధముగా చేయవచ్చును. అనగా అంతట సంస్కార సంపన్నుడు, అందఱు మంత్రులలో శ్రేష్ఠుడు అయిన హనుమంతుడు ప్రశస్తమైన రీతిగా అర్థయుక్తములు మధరములు ప్రియములు మితములునైన మాటలనిట్లు పలికెను.

## విభీషణుని గ్రహింపవచ్చునని హనమంతుడు చెప్పుట:

ఓ రామా! నీవు మతి మంతులలో శ్రేష్ఠుడవు. కార్యములందతి కుశలుడవు. వాక్కులందు నేర్పుగలవాడవు (మహావాగ్మివి). నిన్ను మించి ఆలోచించి చెప్పుటకు ఇంద్రుని గురువైన బృహస్పతి కూడ చాలడు గదా. వాదించుట యందుగాని చక్కగా మాటాడుటయందుగాని నేర్పరినని నాయొక్క తర్కనైపుణ్యము చూపదలపలేదు. ఇతరుల మతముల నణచి నావాదమునే గెలిపింప వలెనను తలంపలేదు. ఎల్లర కన్న నేను గొప్పవాడనను గౌరవమును పొందు కాంక్ష లేదు. నా మాటల నేర్పును చూపించుట కిదే సమయమని యెంచలేదు. రాక్షసుని యందుండు పక్షపాతమున గాదు. నీకు సలహా చెప్పి గురువునగుదునని యాశచే గాదు రాజశ్రేష్ఠా! దశరథరాజ తనయా! శ్రీరామా! ఉన్నమాట చెప్పుచున్నాను. అర్థమును అనర్థమును కనుగొనగా నీమంత్రులు పలికిన విధమునందు ఒక్క దోషమున్నదని నా మనస్సునకు తోచుచున్నది. అది గ్రహించుట కిప్పుడు సాధ్యము కాదు. పనులందు నియోగించకుండగా తటాలున పనివాని తనము తెలియదు గదా. అట్లు పనులందు నియోగించుట కూడ దోషమే అని తోచుచున్నది. చారులను బంపి తెలిసి కొనుడని కొందఱు చెప్పిరి. అది నిరర్థకమైనది సుమా. దూరపు పనికైనచో చారులను ప్రయోగించెదరు గాని చేరువ పనికి వారలేమి చేయగలరు. ఈతడు అనువుగాని దేశకాలములందువచ్చెననుమాటకునాతలంపుఏమనగారాక్షసరాజుయొక్కదౌష్ట్యమును

నీయొక్క శౌర్యమును మనస్సునందు గుర్తెరిగి గుణవంతులలో శ్రేష్ఠుడవగు నిన్ను తగిన వేళనే ఇట్లు చేరవచ్చెను. ఈతని బుద్ధికిది తగిన పనియేగదా. తగని సమయమెట్లగును? అతనికి పరిచయములేని వాని నెవ్వనినైన పంపి ప్రశ్నింపమని చెప్పిరిగదా. ఈ పద్ధతియందు గూడ నా భావమునకు ఒక దోషము తోచుచున్నది పరిచయములేని వాడొకడు ప్రశ్నలు వేయుటకు ప్రారంభించినచో శ్రేష్ఠమయిన మనస్సు గలవానికి అవశ్యము సందేహము తోచక మానదు. అప్పుడేవిధముగా జెప్పిన యేమగునో యని సరియైన సమాధానము చెప్పజాలడు. ఇట్లు సరిగాని ప్రశ్నలు వేయుటచే దుర్మార్గము లేని మిత్రుడును దూషింప దగినవాడగును. మాటలందు తాను సమర్థుడనని తలంచువాడు తన ప్రజ్ఞ బయల్పడునట్లు తన యభిప్రాయము తెలియబడకుండ పలుకును. ఆ మేటరి మాట నెరుంగ వచ్చును గాని మనస్సు తెలియరాదు. కనుక ఆ యుక్తియు నిరర్థక మనియే తలంతును. రాఘవా! ఆతడు మాటలాడునప్పుడు పరికించి చూడగా దుష్టబుద్ధితో మాటలాడుచున్నట్లు తోచుటలేదు. శ్రేష్ఠ గుణములు గలవాడా! ప్రసన్నమైన ముఖము గల యితడు ఇప్పుడు వంచకుడైనచో ఇంత నిబ్బర మాటలందొక్క దోషమైనను కనిపించుట లేదు. రూపమైనచో ఏ రూపము కావలెనన్న ఆ రూపము మార్చుకొనవచ్చును గాని అంతర్గతమైన భావమును మాత్రము మార్చుటకు శక్యము కాదు. ముఖము ఎట్లైనను భావమును బయటపడునట్లు చేయును. కాన సంశయించుటకు తగిన కారణమేదియును లేదు. పార్థివోత్తమా! ఈతనని మంచి మనస్సుతో గ్రహింపదగును. దేశకాలములను ఆలోచించి పనిని బాగుగా చేసినచో దాని ఫలము అధికముగా వెంటనే కనిపించును. ఓ గొప్పమహిమ గల రామా! నీకు నేను చెప్పదగినవాడనా! రామా! నీ గొప్ప నైన ఉద్యమమును, రాక్షసరాజు యొక్క దుర్మార్గమును, ఇంద్రపుత్రుడైన వాలిని వధించి వానరరాజ్యమును సుగ్రీవునకిచ్చుటయు తానిదివరకే వినియుండుటచే తానుకూడ రాజ్యమును పొంద నిన్ను వేడుకొనుటకై సీతానాథా! నీయొద్దకు మనఃపూర్వకముగా వచ్చియున్నవాడు. దీనినంతయు ఆలోచించి వీని సాధుగుణమును నా శక్తికొలదిగా చెప్పితిని. రామా! బుద్ధిమంతులలో ఉత్తముడవు నీవు. శేషించిన కార్యమును నీవే ఆలోచించి చేయుము. [విభీషణుని యందుండు పక్షపాతముతో చెప్పెనని యభిప్రాయము పుట్టకుండుటకై హనుమ తనకును సీతాదేవికిని విభీషణుడు చేసిన సహాయమును ప్రస్తావించిన వాడు గాడు]

★★★

# పదునెనిమిదవ సర్గము

## శ్రీరాముడు వానరులతో విభీషణుడు గ్రాహ్యుడని చెప్పుట:

అని వాయుపుత్రుడైన హనుమంతుడు చెప్పిన నీతి యుక్తములైన మాటల నాలకించి గొప్పనైన బుద్ధి, శక్తియందు ప్రసిద్ధుడైన రామచంద్రుడు ప్రసన్నమైన చిత్తముగలవాడై (ఒకడైన విభీషణుని గ్రహింపవచ్చునని చెప్పెను గదా యని ప్రసన్న చిత్తుడాయెను) వారలతో తన ఆశయము నిట్లు తెల్పెను. ఓ వానరశ్రేష్ఠులారా! వినుడు. మీరు నా శ్రేయస్సును కోరువారగుటచే నేనును విభీషణుని గూర్చి నాయొక్క అభిప్రాయమును కొంత చెప్పెదను. మైత్రిగోరి తనంత తానుగా వచ్చినవానిని ఎప్పుడైనను నేను చేపట్టక వీడువాడను గాను. వానియందేదైనను కించిత్తు దోషముండినను సజ్జనులకు దానిని గర్హించుట తగిన పని గాదు అని చెప్పిన రాముని మాటలను విని సుగ్రీవుడు తిరిగి దానిని విమర్శించి నిశ్రేయస్కరమైన వినయోక్తులతో నిట్లనెను. ఈతడు దుష్టబుద్ధిగలవాడైనను, కాకున్నను ఈతనిచే కాగల కార్యమేమున్నది? వీడెవ్వరికి కావలసినవాడగును. ఇట్టి కష్టదశయందు అన్నను వదలి వచ్చినవాడు ఏ సమయమునైన నెవ్వనినైన ఎడబాయకుండునా? పరులను ఈత డాదుకొనగలడా? అనగా రామచంద్రుడు వానరులను జూచి ముఖమున మందహాసము చిందుచుండగా ప్రేమతో తమ్ముని వంక జూచి యిట్లనెను. శాస్త్రములు తెలయనివాడై ఆర్యులను వృద్ధులను సేవింపని వాడైనచో ఇట్టి ప్రతిభాయుక్తములగు మాటలను వచింప గల కుశలత్వ మెవ్వరికైన కలుగునా? ఒక ధర్మసూక్ష్మము గలదు. ఇది రాజులందఱిలో నుండుట స్పష్టమే. చెప్పెదను వినుము. ఒకే కులమందు పుట్టిన తన తరువాతివారు తనకు శత్రువులు. కష్టములు వచ్చినప్పుడు ఒకరికొకరు ద్రోహము చేయుచుందురు. కనుక విభీషణుడు నన్ను ఇచ్చట చేరవచ్చెను. కానియెడల నిర్మల మనస్సులుగల స్వకులజులు తమ కులమునందలి సజ్జనులను గౌరవింతురు. అయినను రాజులు సాధారణముగా మిక్కిలి నిర్మలమైన వారిని కోపింతురు. విరోధిని చేరవచ్చుట న్యాయముగాదని నీవు చెప్పితివి. శాస్త్రపద్ధతి చెప్పెదను వినుము. వానికి మన మెవ్వరమును జ్ఞాతులము కాము గదా. అతడు స్థిరమతితో రాజ్యకాంక్షతో వచ్చినవాడు. వారిలో గూడ బుద్ధిమంతులుండరాదా? అందుచే

విభీషణుని గ్రహింపవచ్చును. శూరులలో శ్రేష్ఠులను శుద్ధమైన మనస్సులగల వారును అయినవారిలో ఒక్కప్పుడు బేధము సంభవించును. గావుననే యిట్టి చర్చ. ఆ కారణమున బుట్టిన భయము కలవాడగుటచే ఇతడు వారినుండి విడివడి నన్ను చేర వచ్చినాడు. అందువలన విభీషణుని గ్రహింపదగియున్నది. సోదరులందఱు భరతుని సాటికారు (పరోక్షముననున్న భ్రాతలలో నని యర్థము). తండ్రికి నన్ను బోలిన పుత్రుడుండునా? స్నేహితులలో నీయట్టి స్నేహితుడులేడు. నాయనా! లోకములో ఇది యదార్థమయ్యా! అని చెప్పుచున్న రాముని వాక్యములను విని లేచి ప్రజ్ఞాధనుడైన సుగ్రీవుడు లక్ష్మణునితో గలిసి వినయముతో రామచంద్రునితో నిట్లనెను. క్షమావంతులలో శ్రేష్ఠుడైన ఓ రామచంద్రా! ఈ రాక్షస శ్రేష్ఠుడగు విభీషణుని రావణుని వేగులవాడని తెలిసికొనుము. ఇతని నేవిధముగా చంపవలెనో నీవాలోచించుట యుక్తము. వక్రబుద్ధిగలిగిన రావణుడు పంపగా వచ్చినవాడు సుమావీడు. మనము నమ్మియున్నచో మాయలు చేసి మనము ఏమరుపాటుగ నున్నప్పుడు నిన్నో నన్నో మఱి నీ ప్రేమాస్పదుడైన తమ్మునినో వధించును. ఓ సచ్చరిత్రుడా! అందుచేత ఇతనిని మంత్రులతో గూడ సంహరించుటే తగియున్నది. అని చెప్పి ఊరుకున్న సుగ్రీవుని మాటలాలకించి మఱియొక్క సారి ఆలోచించి శుభప్రదమైన మాటలతో సీతానాథుడు సుగ్రీవునితో నిట్లనెను.

## శ్రీరాముడు సుగ్రీవునకు శరణాగత రక్షణము కర్తవ్యంబని చెప్పుట:

ఈతడు దుష్టబుద్ధి గలవాడైనను దుష్టుడు కాకున్నను ఈతనిచేత రవంతయైన కాదగిన దేమున్నది? వీ డేవిధముగను నా వారికి గాని నాకు గాని కీడు చేయుటకు శక్తుడు కాడు. ఓ సూర్యనందనా! నేను చెప్పునది నమ్ముము. ఈ అఖిల జగత్తునందును యక్షులయందును, దానవులందును రాక్షస పిశాచ సంతతులందును అవసరమైనచో నెవ్వనినైన నిముషములలో మృత్యువు నొందునట్లు గోటికొనచే చిమ్మివేయనా? [ఇది రాముని సర్వసంహారశక్తిని, అతి మానుషత్వమును దెల్పుచున్నది] మిత్రమా! వినలేదా? బోయవాడొకడు తన ప్రేయసిని చంపినను, ఆకలితో ప్రాణములు పోవునని బాధనొందుచు రక్షార్థియై రాగా మగపావురము వానికి తన శరీరమాంసమునిచ్చి కాపాడలేదా? వానరశ్రేష్ఠా! కాన నాబోటి వానికి శరణాగతులను విడచుట న్యాయమా? పూర్వము కణ్వుడనుముని యొక్క పుత్రుడు కండుడను పరమ తపోధనుడు చెప్పిన గాథలను వినుము. అవి యెంతయో ధర్మనిష్ఠితములు సత్యము హితము గలిగినవి. సూర్యపుత్రా

వానిని వినిపించెదను. చేతులను జోడించి దీనముగా దయపుట్టునట్లు 'నీ మరుగు చేరితిని రక్షించుము' అనుచు ప్రార్థించువాడు విరోధియైనను కరుణయే తనకు ప్రధానగుణముగా గలగినవాడై వానిని చంపరాదు. శత్రువులను శరణుపొందినవాడు ఆర్తినొందినవాడైనను దర్పితుడైనను అట్టి శత్రువును శాస్త్రములందు విశ్వాసము గలవాడు తాను నాశనము పొందియైనను కావవలెను. భయముచే గాని, అజ్ఞానముచే గాని, ప్రతిఫలాపేక్షచే గాని తన శక్తిగొలది శరణాగతుని రక్షింపనిచో వాడు ఇహమునందును పరమునందును నశించును. తాను చూచుచుండగ తనను శరణు పొందిన వాడు ఇతరునిచే చచ్చెనేని ఆ అనాధుడు తన్ను రక్షించని పాపాత్ముని సుకృతముల నెల్లను గైకొని యేగువాడు. కాన దయగల పురుషుడు శరణాగతుని రక్షింపకున్న దుర్భరమైన పాపము తప్పక కల్గును. నరక ఫలము, అపకీర్తియు తప్పక వచ్చును. తన శరీర బలమును వీర్యమును తప్పక నశించును. కాన మంచి కీర్తి స్థానమైనదియు ధర్మమును స్వర్గఫలమును కలుగజేయునదియగు ఆ కండు మహర్షి వాక్యముననుసరించెదను.

## శ్రీరాముడు విభీషణున కభయమిచ్చుట:

ఒక్కసారి నీవాడనని యెవ్వడైనను నన్ను శరణువేడెనేని సర్వభూతజాలములకును నేను దయతో అభయము కలుగజేసెదను. ఇది నాకు వ్రతము. పొమ్ము. ఇక లెమ్ము సూర్యపుత్రా! [సుగ్రీవ విభీషణులు సమానదశ యందుండుట చేతనే గాక, సుగ్రీవున కింకను విభీషణుని పట్ల సందేహము కలదేమో యనియు, పోనని చెప్పునేమో యనియు అతని మనసు శోధించుటకును, తనయందు సందేహించి యితరులను బంపెనని సుగ్రీవుడు సందేహింపకుండుటకును రాముడు సుగ్రీవునే పంపెను.] వాడు విభీషణుఁడైనను, ఇష్టపడి వచ్చిన రావణుడే అయినను వినుము నే నభయ మిచ్చితిని. వాని నిటు తీసుకొని రమ్మనగా (శ్రీరాముని వ్రత మెఱిగిన సీతాదేవి నీవు రామునే శరణు వేడుము ఆయన నిన్ను రక్షించును అని రావణునకుపదేశించెను. శ్రీరాముడును రావణుడు వచ్చినచో రక్షించినచో రక్షించెదనని చెప్పెనుగాని రావణుడు శరణు కోరక చెడిపోయెను. శ్రీరామ రావణుల మంత్రాలోచన తారతమ్యమును గమనింపుడు] దయాగుణము గలిగిన రఘువీరునిచే ప్రబోధింపబడినవాడై సమ్మతినొంది వానరరాజు రామునితో ఇట్లనెను. జగదీశ్వరా! ధర్మ పద్ధతి నెరిగినవాడా! లోకమునకు సౌఖ్యము కలిగించుట యందధికమైన ఆసక్తి గలవాడా! రఘువంశ శ్రేష్ఠుడా! ఇట్లు ఆర్యులచే నుతింపబడిన మాటలను పల్కుట బుద్ధిమంతులకు

సమ్మతమైన సత్యమార్గము ననుసరించుటయు, మహా సత్వముతో గూడిన ప్రభావమును, తేజోధికత్వమును గలిగిన ప్రాజ్ఞశ్రేష్ఠుడవగు నీకిది యేమి విచిత్రము? రఘునాయకా! నాకును అంతరాత్మ ఈతడు పరిశుద్ధడనియే స్పష్టముగా చెప్పుచున్నది. ఇతని భావము చూడగా అది నిజమనిపించుచున్నది. నీయొక్క యుక్తియుక్తములైన వాక్కులను బాగుగా చూచితిని. ఈతని యెడ కల్మషము ఏదియులేదు. ఇతడు లోపలను వెలుపలను ఎంతయో పవిత్రుడు. కనుక ఇప్పుడే మేధావియగు ఈ విభీషణుడు నీ మిత్రత్వమును బొంది మమ్ము గలిసి మాతో సమానుడై యొప్పుగాక. అని పల కగా సంతోషముతో సుగ్రీవుని మాటలను విని కీర్తిశాలి యగు రాముడు వేగముగా వినతాపుత్రుడైన గరుత్మంతుని స్నేహమును పొందిన ఇంద్రునివలె దశవదనుని సోదరుడైన విభీషణుని స్వీకరించెను.

★★★



# పందొమ్మిదవ సర్గము

## విభీషణుడు శ్రీరామ పదంబులమీద పడి తన్ను నివేదించుకొనుట:

అంతట రామచంద్రు డభయ మిచ్చుటను చూచి రావణ సోదరముడెంతో విజ్ఞత గలవాడగుటచే తన మనస్సు సంతోషముతో పొంగుచుండ భూమి వంక జూచుచు శిరము వంచి నమస్కారము చేయుచు తన ఆప్తులైన నలువురు మంత్రులతో ఆకాశము నుండి వేగముగా దిగివచ్చి శరణు కోరుచు రాముని పాదములపై బడెను. ఇట్లు వేగముగా తన నల్వురు మంత్రులతో గూడి ధర్మబుద్ధిగలవాడును, శరణుకోరువాడును నై పాదములపై బడి ధర్మబద్ధము ఉచితము హర్షము కల్గించునది యైన మాట నిట్లనెను. ఓ రామభద్రా! నేను రావణుని తమ్ముడను. అతడు నన్నవమాన పెట్టుటచే నేను తెగించి సకల భూతలములకు శరణ్యుడవైన నిన్ను చేర వచ్చితిని. నిన్ను శరణు బొందితిని. మానవ శ్రేష్ఠుడా! మిత్రులను, లంకను, సంపదను వదలితిని. నాయొక్క సుఖ జీవితము రాజ్య భోగములును నీ యధీనములు. [విభీషణుడు శరణుజొచ్చుటకు కారణము రాజ్యకాంక్షయా మోక్షకాంక్షయా అనునది ఉత్తర పీఠికయందు చర్చింపబడినది] అని పలుకుచున్న విభీషణుని వాక్యములను విని స్నేహముతో దరించి సాంత్వన వచనములు పల్కుచు జానకీభర్త రాక్షససైన్యము యొక్క బలాబలములను తెలియజెప్పమనగా

## విభీషణుడు శ్రీరామునకు రాక్షసబలంబుఁ దెల్పుట:

మిక్కిలి పరిశుద్ధమైన నడవడి గలిగిన రామునితో విభీషణుడిట్లనెను. 'ఓ దేవా! రాజనందనా! భక్తులకు ఆనందము నిచ్చువాడా! వినుము. ఆ బ్రహ్మవలన వరములను పొందుటచే దశకంఠుని యుద్ధములో దేవతలకును, రాక్షసులకును, తక్కిన భూత సంఘములకును వధించుట శక్యము కాదు. ఆ రావణాసురుని తమ్ముడు యుద్ధరంగమున ఎదురులేని శౌర్యము గలవాడు మొక్కవోని తేజస్సు గలవాడునగు కుంభకర్ణుడు. అతడు నాకు అన్న. ఇంద్రునికి యుద్ధమున ఎదురు నిల్చువాడు ప్రహస్తుడను సేనాని కలడు. అతని పేరు వినియుందువేమో ఆ వీరుడు కైలాసమున మణిభద్రుని నోడించెను. ఇంద్రజిత్తు

యుద్ధమున ఛేదింపరాని కవచము గలవాడై ఎక్కువైన నిగ్రహముతో అగ్నిహోత్రుని యందు హోమము చేసి అతని యనుగ్రహముచే మాయమై కనిపించకుండ ఉండి మనుష్యులను చంపువాడు. రావణునితో సమానమైన పరాక్రమము కలవాడు. మఱియు లోకపాలకులతో సమానులైన మహాపార్శ్వుడు, అకంపనుడు, మహాబలశాలి యగు మహోదరుడు ననువారలు తమ పరాక్రమముచే దేవతలను జయించిన వారు అతని సేనాపతులు. కోరిన రూపములను ధరింపగలవారును క్రూరమైన బలము గలవారును, మాంస భోజులును అయిన పదివేల కోట్ల రాక్షసులు లంకయందు గలరు. అదిగో వారల బాసట తోడనే రావణుడు దేవతలను భంగపరచెను. అని ఈ విధముగా చెప్పుచున్న రాక్షసవంశ దీపకుడగు విభీషణుని పలుకుల నాలకించి సర్వమును మనస్సునందు ఆలోచించి రాము డీవిధముగా బలికెను. విభీషణా! దురాత్ముడైన రావణుని చరిత్రను సర్వమును నీవిప్పుడు నిపుణతతో తెల్పుటచే నిశ్చల మనస్సుతో గ్రహించితిని. వినుము. ఆ రావణుని, పుత్రునితో మిత్రులతో మంత్రులతో సహ గొప్ప రణమందు సంహరించెదను. పాతాళమున దాగినను, ఆ బ్రహ్మ మరుగు జొచ్చినను బ్రాణములతో విడువను సుమా! ఓ పాపరహితుడా! సత్యముగా నిన్నా రాక్షస రాజ్యమునకు పట్టము గట్టెదను. పరమ పవిత్రుడవైన ఓ విభీషణా! నా తోబుట్టువులపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. రావణుని పుత్రులతో మిత్రులతో బలములతో సహ సంహరింపక నేనయోధ్యా పట్టణమును ప్రవేశింపను. అని చెప్పగా విని భక్తితో విభీషణుడు చేతులు జోడించి ఓ గొప్పకీర్తి గల రామచంద్రా! నా శరీరమునందు ప్రాణములుండునంత వఱకు శత్రు సైన్యమునందు ప్రవేశించి లంకను వినాశము చేయుటకును, రాక్షస సమూహమును సంహరించుటకును గొప్పనైన సహాయమును చేసెదను.

## శ్రీరాముడు విభీషణునకు పట్టాభిషేక మొనర్చుట:

అనుచున్న విభీషణుని కౌగిలించుకొని లక్ష్మణునితో రఘుచంద్రుడిట్లనెను. ఓ మానద! సాగరజలములను తెమ్ము నా అనుగ్రహముతో వేగముగా ఈ విభీషణుని రాక్షసరాజ్యశ్రీకి అభిషిక్తుని జేయుము. అనగా సొంపుగా వానరసమూహ మధ్యమున రాజాజ్ఞననుసరించి లక్ష్మణుడు విభీషణునావిధముగానే పట్టాభిషిక్తుని జేయగా ఆ శ్రీరామచంద్రుని కరుణా విశేషమునకు వానరులు మేలు మేలని మెచ్చుకొనుచు కేకలు వేయదొడగిరి. అంత సుగ్రీవుడును వాయుపుత్రుడును విభీషణునితో నిట్లు పల్కిరి. ఈ

సముద్రమును వానరసేనలతో దాటుటెట్లో ఒక ఉపాయమును జెప్పమనగా విభీషణుడు ఓ సూర్యనందనా! ఈ మహోదధి పూర్వము సగర పుత్రులచే త్రవ్వబడినది. కాన రాఘవుడు శరణుకోరినచో ప్రాజ్ఞుడైన సముద్రుడు మన కార్యమును నెరవేర్చును. అనగా సుగ్రీవుడు వెళ్లి సీతానాధునితో ఆ వార్త చెప్పగానే ఆతడు సంతోషించి కార్యముల యందు దక్షుడయ్యును పూచికతో గౌరవించు కొఱకై తమ్మునితో వానరరాజుతో ఇట్లనెను. ఆ విభీషణుని వాక్యము నాకు సమ్మతము గానే యున్నది. నీకును వానరరాజునకును సమ్మతమైనచో చెప్పుడు. వానరరాజు విద్వాంసుడు. నీవు మంత్రజ్ఞులలో శ్రేష్ఠుడవు. మీరు యోచింపుడు. అనగా రాఘవేంద్రునితో వారిట్లనిరి. కాలమునకు దగిన మాట అతడు చెప్పగా అది మాకెందులకు రుచింపకుండును? లంకకు సేతువును గట్టక ఏ విధముగా చేరగలము. ఇక ఆలస్యమెందులకు? సేనాసమూహముతో సముద్రము దాటుటకు తగిన యుపాయమును చేయుమనగా సీతానాధుడు హోమవేదికయందుండు అగ్నిజ్వాల వలె దర్భశయ్యయందు పరుండెను.

★★★



# ఇరువదవ సర్గము

## శార్దూలుడు రావణునితో శ్రీరాముడు కపులతో సముద్రము నొద్దున దిగియుండు వార్త చెప్పుట:

అక్కడ శార్దూలుడను రావణుని చారుడు సుగ్రీవుని సైన్య విధము నంతయును తేరిపార జూచి అతివేగముగా వెళ్లి రావణుని జూచి 'రాక్షసరాజా! ఇదిగో కోతులు కొండముచ్చులు ఎలుగుబంట్లు గల సైన్యము మన పురముపై బడుటకు వేగముగా పొర్లి వచ్చినది. ఇంతయని చెప్పుటకు వీలుకానిదై మిక్కిలి గాంభీర్యము గలదై సముద్రమునకు ప్రతినిధిగా గొప్ప మహిమతో నొప్పుచున్నది. పంక్తిరథుని పుత్రులిద్దఱు రామలక్షణులను పేర్లు గలవారు ఉత్తమమైన ఆయుధములు ధరించి సీతను జేరుటకై సముద్రతీరమున దశయోజనముల మేర వ్యాపించియున్న గొప్ప సైన్యముతో నిలిచియుండిరి. రాజా! వేగముగా తగిన దూతలను సర్వమును ఆమూలాగ్రముగా ఎరుగునట్లుగా పంపించుము. నాకు జూడగా ఈ సమయమున సామమో, దానమో, భేదమో తగియున్నదని శార్దూలుడు చెప్పిన మాటలను విని కార్యమును గూర్చి ఆలోచించి నిర్ణయించుకొనని వ్యగ్రతతో

## రావణుడు శుకుని సుగ్రీవునొద్దకు రాయబారమంపుట:

రావణుడు కార్యజ్ఞుడైన శుకుడను వానిని సమీపమునకు బిలిచి ఇట్లనెను. నీవు వేగముగా వెళ్లి నెరపుచెందక నా మాటగా సుగ్రీవునితో మంచిమాటలతో నిట్లు చెప్పుము. ఓ సుగ్రీవా! నీవు మహాబలాఢ్యుడవు. ఋక్షరజసుని పుత్రుడవు. గొప్ప రాజవంశమున బుట్టినవాడవు. నీవు సీతానాధునితో స్నేహము చేసిన కాగల లాభమేమున్నది? అతనిని విడిచినచో ఒక నష్టము కలదా? నీవు నాకు సోదరుడవు. పూర్వము మనకున్న స్నేహము నిప్పుడు తలంపుము. ఓ ప్రాజ్ఞుడా! రాముడనెడు రాజపుత్రుని భార్యను నేనపహరింపగా సుగ్రీవా! నీకేమి నష్టము గల్గినది? మనకు విరోధమెందులకు? తిరిగి నీ పురమునకు పొమ్ము. వానర వీరులేవిధముగను ఈ నగరమును చేరలేరు. వానరనాధా! ఇది నిజము. గంధర్వ సమూహమైనను చేరలేరు. ఈ నరులును వానరులును వచ్చువారలా? అని రాజు

చెప్పిన మాటలను విని శుకుడాకాశమున గ్రద్దవలె నెగిరి వెళ్లి వెళ్లి ఆకసమునేయుండి పద్మమిత్రుని (సూర్యుని) పుత్రుడైన సుగ్రీవునితో ఆ రాక్షసరాజు యొక్క మాటలన్నియు క్రమము తప్పక చెప్పగా కోపముతో బడ దన్ని ఒకరిని మించి యొకరు పిడికిళ్లతో విడువక మర్దించుచుండగ బాధపడుచు వాడు ఓ కాకుత్థ్సుడా! దూతను వధింపరాదు. నన్ను జంపకుండ ఈ కపులను వారింపుము. రాజు చెప్పిన మార్గమున జెప్పక తన ఇచ్ఛ చొప్పున చెప్పిన దూత వధింపదగిన వాడని చెప్పుదురు. నేను నారాజు విధించిన రీతిగనే చెప్పితిని ఇది దోషమా? రామా! అనగా ఆర్తితో ఆ దూత చేయుచున్న పరిదేవనమును విని రామచంద్రుడు ఆ దూతను చంపకుండగా వాని రెక్కల యీకలు లాగి విడిచిన దీనతతో ఆకాశమునకెగిరి భయము వీడనివాడై వానరరాజుతో ఇట్లనెను. శ్రీయును బుద్ధియును బలమును గలవాడా! భయంకర పరాక్రమము గలవాడా! వానరరాజా! లంకాపురమున కేగి రాక్షసరాజుతో నీ మాటగా ఏమని చెప్పవలెనో చెప్పుము. అనునంత

## సుగ్రీవుడు రావణునకు ప్రత్యుత్తర మంపుట:

అట్లు చెప్పుచున్న దూతను జూచి వానరరాజిట్లనెను! ఓరీ! దూతా! రావణునితో నిట్లు చెప్పుము. ఏ విధముగా జూచినను రావణా ! నీవు నాకు మిత్రుడవు కావు. ఇష్టమైన వాడవు కావు. ఉపకారివి కావు. కావున మాంసభక్షకులగు రాక్షసులకు రాజువగు ఓ రావణా! దయ చూపదగినవాడవైనను గావు. యదార్థముగా రామునకు నీవు విరోధివి. రామునకు నేను స్నేహితుడను. రాక్షసరాజా! రామునిచే నీవును యుద్ధమందు వాలి విధముగనే వధింపబడగలవు. నిన్ను, నీ జ్ఞాతులతో, స్నేహితులతో, బంధువులతో, పుత్రులతో గూడ యుద్ధమునందు విడువక వధించెదను. ఇది అబద్ధము గాదు. లంకను సర్వమును వానరసైన్యమును బంపి ఒక్క నిమిషములో శ్మశానమును చేసెదను. నీ దుడుకుదన మిక చెల్లదు సుమా! రాక్షసరాజా! ఎందైనను చెడుగు ఒప్పునా? పాతాళమున దాగినను, ఇంద్రుని ప్రార్థించి సహాయముగా దెచ్చికొన్నను, సూర్య కిరణములందు దాగినను దుర్మార్గమున నడచువాడా! సీతానాథుడు విడువడు. భూమికి బలిగా నీ కంఠములను నఱికి పడవేయును. సీతానాథుడు కోపించినచో ఆ పాతకిని రక్షించువాడు బ్రహ్మాండమునందు రాక్షస పిశాచ దేవతాసంఘములో నెందైనను నేను చూడలేదు సుమా. రాత్రించర నాథా! వదిలిపోయిన దేహము గలవానిని, ముసలి వానిని, బలములేని వానిని జటాయువును పొడిచి చంపితివి. అది నీ చెడుతనమే కాని పరాక్రమమా? రాక్షసా!

చూచుటకు నీయొద్ద శౌర్యము కనిపించునా? కట్టా నీవు రామచంద్రుడు చూచుచుండగా గాని మఱియు లక్ష్మణుని సన్నిధిని గాని భూపుత్రిని దొంగలించితివా? అట్టి నీ దుర్మార్గపు బనివలన గలుగు హాని నూహింపవైతివి. మహాత్ముడును, మహాబలవంతుడును, శచీపతి (ఇంద్రుడు) మున్నగువారికి కూడ జయింపరానివాడును అగు రఘుశ్రేష్ఠుడిని నేమిగా దలంచితివో గదా. ఆ రాజును నీపాలిటి యమునిగా దలంపుము. అనగా వేగముగా తారాపుత్రుడైన అంగదుడు తానా వానరరాజుపై చూపు నుంచి ఆకాశమున శుకుని చూపుచు ఇట్లు చెప్పెను. వానరరాజా! ఇతడు చారుడు గాని రాయబారి యని చెప్పరాదు. దొంగచూపులతో తూచినట్లుగా మన బలముల నచ్చట నుండియే తెలిసికొనుచున్నాడు. వీనిని లంకకు పోనీయరాదనగా సుగ్రీవుని యాజ్ఞతో వానరులు వానిని కట్టియు అతికఠినముగా గొట్టియు హింసించుచుండగా వాడు దేవుళ్లాడుచు వికటమైన గోలతో మొఱ పెట్టదొడగెను. ఓ రామా! రామా! నీవే గతి. ఈ వానరశ్రేష్ఠులు చంపుచున్నారయ్యా! కరుణతో నన్ను కాపాడుము. ఓ రాజపుత్రా! నా కనుగ్రుడ్లను పీకిరి. నా రెక్కలను నరికిరి. ఈ గొప్ప ఆర్తిచే నేను మరణించినచో చెప్పుచున్నాను వినుము నేను పుట్టునది మొదలు రాత్రింబవళ్ళును ఇంతదనుక చేసినట్టి దుష్టకార్యముల పాపము నిన్ను చెందగలదు సుమా. అనగా ఆ విలాపము నాలకించి రాముడు అతనిని చంపకుడు. అతడు దూత గదా. చంపుటకు తగునా? అని పల్కగా ఆ వానరు లతనిని చంపక విడిచిరి. అంతట ఆ భూపుత్రీభర్త సముద్ర తీరమునందు దర్భశయ్యయందు శయనించిన వాడయ్యెను.

★★★



# ఇరువది యొకటవ సర్గము

## శ్రీరాముడు ధర్భశయనమున బరుండుట:

రామచంద్రుడు పూర్వము జిగిజిగి మెఱుపుల బంగారు తొడవులతో అలంకరింపబడినదియు, బంగరు కేయూరములు శ్రేష్ఠములగు ముత్యాల భూషణములతో నొప్పుచుండినదియు, పుణ్యస్త్రీ జనములచే పలుమారు నలుగు పెట్టబడినదియు, చందనము, అగురు ప్రభృతి సుగంధ ద్రవ్యములతో గూడినదియు, రక్తచందనముతో అలంకరింప బడునదియు, పడకయందు చంద్రబింబము వంటి ముఖము గల జానకీదేవి తలకు తలగడయై శోభనొందినదియు గంగాజలమునందు తక్షకుని మేనివలె నున్నదియు, దీనుల ఆర్తిని దీర్చునదియు, యుద్ధమున శత్రువులను దుఃఖపెట్టునదియు, కాడిమ్రానువలె దీర్ఘమైనదియు, సుకుమారమై ఆప్తులను సంతోష పెట్టునదియు, సాగర పర్యంత భూమికి ఆశ్రయమైనదియు, గొప్పనైన బాణములను సంధింప సమర్థమైనదియు, దృఢముగా నారి లాగి విడుచుటచే చర్మమూడి కాయలు కాచినదియు, కీర్తికరముగా వేలువేలుగా ఆలమందలను దానము చేసినదియు, సర్పము పడగ విధముగా భయంకరమైనదియు, సంహారకమైనదియు అగు తన కుడిచేతిని దిండుగా నిడుకొని తూర్పు ముఖముగా ఆ సముద్ర తీరమున దాటు విధమో లేక మరణమో ఈ రెండింటి యందొకటి నిజమని నిశ్చయించుకొని ఆ వీరుడు మౌనియై శయనించెను. ఇట్లు సముద్రమును ప్రార్థించుకొనుచు పరుండగా మూడు రాత్రులు గడచినవి. మందబుద్ధి యగుటచే ఆ నదీపతి రామునకు దర్శనమొసగడయ్యెను.

## శ్రీరాముడు సముద్రునిపై నాగ్రహించుట:

[శ్రీరామ నామమును స్మరించుచుఁదన్ను దాటఁబూనిన హనుమంతుని సముద్రుడు గౌరవించి, తనకు శరణాగతుడైన శ్రీరాము నుపేక్షించుటచే భగవంతుని కంటె భగవన్నామమే శ్రేష్ఠమని ఫలదమని ఏర్పడుచున్నది]

అంతట రాఘవుడు రక్తనేత్రుడై సాగరశ్రేష్ఠుని మీద కోపమును పొందినవాడై తన ప్రక్కనున్న సుమిత్రాపుత్రుడైన లక్ష్మణునితో ఇట్లనెను. 'లక్ష్మణా! ఈ సాగరుడు దర్శన

మీయకున్నాడు ఎంతటి గర్వమో చూచితివా? ఇటువంటి మలినాత్ముని వేడుటయే కీర్తి హీనత గదా. ఓర్పు, శమము, ఆర్జవము, మృదువులు, ప్రియములు నయిన మాటలు దుర్జనుల యందు చూపించినచో వారలు సచ్చరిత్రులను లెక్క చేయక అశక్తుడని ఆ మూఢుడు మనసునందు తలంచును. తన్నుదాను అందఱిని బాధించువానిని చూచి జనులు సత్కారములతో తృప్తినందించుచుందురు. సామముచేత కీర్తి కలుగదు. సామమునందు కీర్తి లేదు సుమా. ఓ సౌమిత్రీ! యుద్ధరంగమున జయమైనను జగత్తునందెందైనను సామముతో లభింపదు సుమా. నేను క్షమాగుణము వహించుటచే ఈ జలరాశి నన్ను శౌర్యహీనుని వలె చూచుచున్నాడు. ఇట్టివాని యెడల గొప్ప క్షమ చూపుట తగదు. లక్ష్మణా! నా బాణ వర్షము చేత నశించిన మొసళ్లు తాబేళ్లు గలవానినిగా, నిరోధింప బడిన నీరు గల వానినిగా దర్పమును వీడినవానినిగా చూచెదవు గాక. తమ్ముడా! ఏనుగుల తొండములు, పాముల పడగలు, చేపల శరీరములు నా బాణములచేత ఛిన్నాభిన్నములై సముద్రమున తేలియాడుటను చూచెదవు. సోదరా! కడు వాడియైన బాణములచే ఈ సముద్రమును చేపల ముత్తెపుచిప్పలు శంఖములు మొదలగువాని సమూహములతో గూడ ఇంకించెదను. యుద్ధమున గాని మెత్తదనము చేత ఈతడు కనబడడు సుమా. సౌమిత్రీ! [సుమిత్ర పుత్రుడా! అని సంబోధించుటచే సుమిత్ర నా విషయములో నీవెట్లు నడుచుకొనవలెనని బోధించెనో దానిని స్మరించి మాఱుమాట చెప్పక విల్లు ఇమ్మని భావము] ధనువు నిటు తెమ్ము. గొప్ప సర్పములను బోలిన నా బాణ సమూహములచే ఈ సాగరమునిదే సంక్షోభిల్లచేసెదను. కపిసమూహము కాలినడకనే వెళ్లునట్లు చేసెదను. ఇంక ఆలస్యమెందులకు? కోపముతో ఒడ్డులతిక్రమించి భూమిపై పొంగిపొరలి పోవునట్లు దీనిని క్షోభింపజేసెదను.

### శ్రీరాముడు సముద్రునిపై బాణములు వైచి క్షోభిల్లఁజేయుట:

సోదరా! ఈ సాగరుని గతి ఏవిధముగా నుండునో చూడుము అని తన కన్నులు జేగురు రంగు దాల్చగా ధనువు తీసుకొని ప్రళయకాలాగ్ని వలె మండుచు హస్తమున ధనువును గట్టిగా బట్టి వేగముగా లాగి బాణ సమూహమును ఇంద్రుని వలె వేయగా అగ్నిజ్వాలలతో భయంకరములైన బాణములు చరచర వెళ్లుచు సాగరమును కలత చెందించుచు వేగముగా లోపల ప్రవేశింపగనే సర్ప సమూహములు భయపడెను. వేగముగా మొసళ్ళు తాబేళ్ళు మొదలగు జల చరములతో గూడిన జలములు పెనుగాలి తాకిడితో గొప్పధ్వనితో చాల ఘోరమైన స్థితిని పొందినవి. పొగలతో నిండిన తరంగము

లుప్పొంగినవి. ఆ సాగరుడు సుడులు తిరుగుచు తిరగ బడుచు బుడబుడ మను శబ్దముతో మోత్తబడెను. వేగముగా వచ్చు శరాగ్నులచే కన్నులు మొగములు మండుచుండగా పాతాళ నివాసులైన పన్నగులును డీలుపడి భయము నొందిరి. చేపలు, మొసళ్లు, తాబేళ్లు మొదలగు వానితో గూడి వింధ్యమందర పర్వతములంత అలల సమూహములు వేలకొలదిగా ఆకాశమంటునట్లుగా ఎగిరినవి. సముద్రము అడుగు వఱకు అల్లకల్లోలమైనది. ఎన్నడును లేనటువంటి కోప వేగమును పొంది సీతానాధుడు కోదండమును బట్టి గొప్ప గొప్ప నిశ్వాసములను విడుచుచుండగా అన్నా! మానుము మానుమనుచు సమీపించి సౌమిత్రి ఆపన్నులను ఆర్తులను రక్షింప సమర్థుడైన రాముని చాపమును సంభ్రాంతి నొందిన మనస్సుతో పట్టుకొనగా

★★★



# ఇరువది రెండవ సర్గము

## శ్రీరాముడు సముద్రునిపై బ్రహ్మాస్త్రమును వేయబూనుట:

జానకి భర్త దారుణమైన మాటలతో సాగరునిట్లనెను. నాయొక్క గొప్పనైన వాడియైన తీవ్రములైన బాణముల సమహములచే నిన్ను తగలబెట్టి యెండించి ఒక్క త్రుటిలోపల రసాతలము వఱకు దుమ్ము రేపెదను చూడుము. ఇంక నీవు జీవించెదవా? ఓరీ! సాగరా! నీ రూపు మాపెదను. నాయొక్క చాపము నుండి వెలువడు వాడియైన బాణ వర్షముచే సర్వవానర సేనలు ఈ క్షణమునందే కాలినడకతో ఆవలి యొడ్డు చేరునట్లుగా నా వీర్యమును జూపెదను. రాక్షసులకు నివాసమైన వాడా! లేకున్న నీ మనస్సునందు సాటిలేని నా బలపరాక్రమముల నెట్లు ఎఱిగెదవు. కానిమ్ము రా అని చెప్పుచు బ్రహ్మదండ సమానమైన బాణమును వింటియందు తొడిగి పద్మముల వంటి కన్నులు గల రాముడు బ్రహ్మాస్త్రము నభిమంత్రించి రోష తీవ్రుడయి వేగముగా అల్లెత్రాటి నాకర్ణాంతము లాగగా పర్వత సమూహములు సంచలించెను. చిమ్మచీకట్లు గ్రమ్మి దిక్కులల్లాడెను. ఆకాశము బీటలు తీసినది. సూర్యుడు, చంద్రుడు, చుక్కలు తమ మార్గములు తప్పినవి. ఏరులు, సరస్సులు క్షోభించినవి. ఉల్కల సమూహములు లెక్కలేనన్ని గొప్పధ్వనితో నేలమీద వ్రాలెను. ఆకాశమున మేఘములు పెనుగాలులును విపరీతమయినవి. జంతువులన్నియును పెద్ద మూర్ఛలను పొందినవి. ఒత్తుగా చీకట్లు చిమ్ముచున్న ఆకాశమున సూర్యుని కిరణములు వ్యాపించి దిగ్భ్రాంతిని గలుగజేయుచు కొరువుల వరుసలు వెలుగుచున్నట్లుగా కాంతి కలిగెను. పెనుగాలి మేఘ సమూహముల నెగుర గొట్టచు మహా భయంకరమై వృక్షములను విఱుగ గొట్టెను, పర్వత శిఖరముల నెగురగొట్టెను. భయంకరములైన పెద్ద ధ్వనులను చేయుచు మేఘములు భూమిపై మంటలతో గూడిన పిడుగులను గురియించుచుండెను. ప్రాణి కోటి యెల్లను దైన్యముతో బెక్కొట్టెను. భయపడి జంతువులు నేలపైబడి కదలక మెదలక యుండెను. కనబడని ప్రాణులేవో ఘోరారవములు చేసినవి. సాగరము జల చరములతో సహా వెతను పొందెను.

## శ్రీరామునకు సముద్రుడు ప్రత్యక్షమగుట:

సముద్రుడు చెలియలికట్టను వీడి ఒక యోజనము దూరము లోపలికి పోయెను. మృదువైన దయగల రాముడు బాణమును విడువడయ్యెను. అప్పుడు నీటినుండి మేరుగిరి నుండి సూర్యునివలె సముద్రుడు వెడలివచ్చెను. అతడు దీప్తముఖములైన సర్పములతో గూడియున్నవాడును, బంగారు ఆభరణములు ధరించినవాడును నైయుండెను. అతని యెదపై ఒంటిపేట హారము నడుమ ఎఱ్ఱనికాంతితో కౌస్తుభమణితో సమానమైన కాంతిగల పతకము మెరయుచుండెను. ప్రకాశించువైఢూర్యము వంటి దేహచ్ఛాయ గలవాడు. ఎఱ్ఱని మాల్యములను వస్త్రములను ధరించినవాడై, పద్మపత్రములవంటి నేత్రములు కలవాడై, దివ్య పుష్పముల మాలికలచే నలంకరింపబడిన శిరస్సు గలవాడై, తనయందు బుట్టిన రత్నములు ధరించి ప్రకాశించువాడై, హిమపర్వతమువలె నానా ధాతువులతో గూడినవాడై ఎగసి పడుచున్న తరంగముల సమూహము గలవాడై కాలికా వాయువుచే కల్లోలమునందినవాడై, ఎగసిపడుతున్న మొసళ్లు గలవాడై, తనయందు దిరుగుచున్న రాక్షసులు సర్పములు గలవాడై వీరవరుడైన సాగరుడు అస్త్రమును చేతబూని యున్న రాముని జేరి చేతులు జోడించి రామభద్రా! అని సాదరముగా బిలిచి అప్పుడిట్లనెను. భూమి, ఆకాశము, వాయువు, అగ్ని, జలము శాశ్వతమార్గమైన తమ స్వభావము నేమియు తప్పవు గదా అట్లే నేనును అగాధము, దాట శక్యము గానిది అను నా స్వభావమును తప్పరాదు గదా! సౌమ్యుడైన రాఘవశ్రేష్ఠా! నీ కిది చేయదగని కార్యము. తెలియునట్లు తెల్పితిని. కామముచే గాని లోభము మొదలగు ఇతర కారణములచే గాని భయముచేత గాని ఓ భూపతీ! నేను మొసళ్లు చేపలు మొదలగు జల చరములకు నిలయమైన నా నీటిని ఏ సమయమందైనను స్తంభనము చేయరాదు గదా! ఐనను నీ వానర సైన్యమంతయును ఈ సాగరమును దాటుదాక మొసళ్లు మొదలగు జలచరములు ఎటువంటి బెడదలు కలుగజేయకుండ కాపాడెదను. వీలయినంత నీ వానరసేన దాటుటకు స్థలము నొసగెదను. ఇక నీ కోపమును మానుము ప్రభూ! అనగా ఆ సాగరునితో రఘురాముడిట్లనెను.

## శ్రీరాముడు బ్రహ్మాస్త్రమును ద్రుమకుల్యముపై విడుచుట:

సాగరా! నాచే నెక్కుపెట్టబడిన ఈ శరము అమోఘమైనది. కాన దీనినెచ్చట విడువమందువో చెప్పుము. అనగా ఆ గొప్ప యస్త్రమమును జూచి సాగరుడు

రామచంద్రునితో నిట్లనెను. ఓ రామయ్యా! నాయందు ద్రుమకుల్య యని ప్రఖ్యాతి చెందిన ఒక ప్రదేశము కలదు. అది నీవలెనే ప్రఖ్యాతి చెందిన ప్రదేశము. అచ్చట భయంకరాకారులు మహాపాపాత్ములు నగు దైత్యులు నివసించుచు ఎల్లప్పుడును నా జలములను ద్రావుచున్నారు. ఆ కుటిలాత్ముల స్పర్శ భరింపలేకున్నాను. నీ అమోఘమైన శరమున వారలను నిర్మూలము గావింపుము. అని పల్కగా రాఘవుడు సాగరుడు చూపిన చోటున మండుచున్న అగ్నిబాణమును వేయగా ఆ బాణము పడిన చోటు మరుకాంతారమను పేరు గాంచెను. ఆ బాణము చివఱ గ్రుచ్చబడిన రంధ్రము ద్వారా రసాతలము నుండి రభసముతో నీళ్ళు పై కెగజిమ్మెను. ఆ నూతికి వ్రణకూపమని పేరు వచ్చినది. అందుండి వచ్చు జలము సముద్రముతో సమానముగ నుండును. ఆ బాణ శ్రేష్ఠము భయంకరమైన ధ్వనితో భూమిని త్రవ్వుకొనుచు బోయినందునచ్చటి గుంటల జలము లెండిపోయినవి. అంత రఘురాముడు ప్రేమతో ఆ మరుకాంతారమునకు ఒక వరమిచ్చెను. పచ్చని పచ్చికలతో, ఫల మూల రసాదులతో, సుగంధములైన ఔషధములతో నొప్పి రోగ రహితమై విరాజిల్లునట్లు వరమిచ్చెను. ఆ వర ప్రభావముననే ఆ భూమి శుభ ప్రదేశమయ్యెను ఇట్లు తన గర్భము భూనాధుని చేతి తీవ్రవైన శరముచే దహింపబడగా సముద్రుడు సకల కళావిశారదుడగు రామునితో మఱల నిట్లనెను. రామచంద్రా! విశ్వకర్మ పుత్రుడు, తండ్రితో సమానమైనవాడు, అతని వరశక్తిచేతను విద్యలచేతను ప్రఖ్యాతి చెందినవాడు రాఘవా! ఈ నలుడు సేతువు గట్టుట కుత్సహించును గాక. దాని భారమును నేను వహించెదను.

## నలుడు సేతువు నిర్మించుట:

అని పల్కి సాగరుడు అదృశ్యుడైనంత నలుడు రామచంద్రా! సాగరుడు చెప్పినది నిజము. ఈ మహోదధి యందు నేను నాతండ్రి వరము చేత సేతువును గట్టువాడను. లోకమునందు దండోపాయ మొక్కటియే పురుషుల కుత్తమమైనదని తలంచెదను. కృతజ్ఞత లేని వారియందు శమమైనను దానమమైనను స్వాంతమైనను నిష్ప్రయోజనము కదా. తామరల వంటి నేత్రములు గలవాడా! దండింతువను భయమున గదా ఈ భయంకరమైన సాగరము నా సేతుబంధనమును జూడగోరి తన లోతు చూపగలిగెను. పూర్వము మందర పర్వతమున నా జననికి విశ్వకర్మ అన్నివిధముల నాతో సమానుడగు పుత్రుని బడయగలవని వరమిచ్చెను. వారిరువురికి ఔరస పుత్రుఁడనై జన్మించితిని. శిల్పపు బనుల యందలి నేర్పున నేను తండ్రితో సమానుడను. ఈ జలధి పల్కిన మాటలచే నా వరశక్తి జ్ఞాపకము వచ్చినది.

రాఘవా! ఈ సాగరుడు దీనిని నీయెదుట చెప్పకున్నచో నాయొక్క సామర్థ్యమును నేనే చెప్పికొనుట భావ్యము కాదు కనుక నేను మాటలాడక యూరకుండెడివాడను. ఓ రాజవర్యా! నేనుసముద్రజలములందు సేతువునుకట్టెదను. ఈవానరసమూహములుపట్టుదలతోనాకు సాయపడవలయును అని చెప్పగా ఆ రాజేంద్రుని ఆజ్ఞను పొంది వానరేశ్వరు లెల్లరును వెళ్లి అడవులనుండి చెట్లను పెళ్లగించుకొని వడివడిగా సముద్రపు గట్టునకు దెచ్చిరి. మద్దిచెట్లు, అశ్వకర్ణములు, సప్తపర్ణములు, ధవములు, వంశములు, కుటజములు, తాలవృక్షములు, తిలకార్జునములు, తినిశములు, బిళ్వములు, పువ్వులతో నున్న కర్ణికారములు, అశోక వృక్షములు, మామిళ్లు, వకుళములు, చంద్రలు, దాడిమములు మొదలైన తీగలు, వేమలు, కొబ్బరిచెట్లు మొదలగువాటిని వానరులు మొదళ్ళతోను, మొదళ్లు లేకుండగా విరిచియు ఇంద్రధ్వజమును పెల్లగించి గొప్ప యంత్రములపై బెట్టి సాగరము నొద్దకు దెచ్చిరి. గుభీల్, గుభీల్, గుభీల్ మనునట్లుగా కొండలను దభాలున పడవేయగా జలచరములు తల్లడిల్లినవి. గభీలున ఆకాశమునకు ఎక్కువగా ఎగయుచుండెను. నూఱామడల పొడవైన త్రాళ్లను కొందరు వానరులు పట్టుచుండిరి. కొందఱు కఱ్ఱలను చేతలందు ధరించిరి. కొందఱు పర్వతములను సమముగా సర్దిరి. గడ్డిచేతను, కఱ్ఱలచేతను కొండలచేతను కొందరు శ్రీరామచంద్రునాజ్ఞతో సందులు బిగించుచుండిరి. పరువులెత్తువారును, పర్వతమును బట్టి భయంకరముగా పెకలించువారును, మోసి తెచ్చువారును నేనే ముందు నేనే ముందనుచు వచ్చువారును, సముద్రములో వేయువారునై వానరులుండగా ఆ ధ్వనులు విశేషమై పెద్దగా నుండెను. రామాజ్ఞతో వానరములు సహాయపడగా నలుడు మొదటి దినమున సముద్రములో పదునాలుగామడల సేతువును గట్టెను. సంతోషముతో గొప్ప బలముతో ఆ కోతుల గుంపు రెండవ దినమున ఇరువదామడల సేతువు నిర్మించెను శౌర్యముతో మూడవ దినమున ఇరువది యొక్క ఆమడల సేతువును గట్టెను. ఆశ్చర్యము గలుగునట్లు నాల్గవ దినమున నలుడు వానర వీరుల సహకారముతో అతని తండ్రియగు విశ్వకర్మ నిర్మించెనాయనునట్లు ఇరువది మూడామడల సేతువును నిర్మించెను. ఆకాశమున పాలపుంతను బోలుచు సముద్ర మధ్యమున నిర్మితమై యొప్పుచున్న ఆ సేతువును జూచుచు ఆకాశసంచారులు ఆకాశమున నిలిచి ఆశ్చర్యపడుచుండిరి. పది యోజనముల వెడల్పును నూఱు యోజనములు పొడవును గలిగి యొప్పుచున్న ఆ దుష్కరమైన సేతువును జూచి సకల భూతములు ముక్కున వేలుంచుకొని ఆశ్చర్యపడి అద్భుతంబిది, ఇది రోమముల

నిక్కబొడుచుకొనునట్లు గగుర్పాటు గలిగించునది, ఇది ఇతరులెవ్వరు సాధింపలేనిది, ఇది ఊహించుటకు శక్యముగానిది అని వెఱగందుచుండగా వానరులు గంతులు వేయుచు గర్జించుచుండిరి. కోటివేల వానరులు సూటిగా సేతువు నిర్మించి ఆవలి తీరమునకు చేరిరి. విభీషణుడు తాను మఱికొందఱు మంత్రులు గదాపాణియై శత్రువులను సంహరించుటకు ముందు నడిచెను. ఎంతో విశాలమై తోపుడు పట్టినట్లు నునుపు కలిగి సమానముగా నున్న ఆ సేతువు వారధి మధ్యలో పాపిట తీర్చినట్లు కనుపట్టెను.

## శ్రీరామ లక్ష్మణులు కపిసేనతో సేతువు దాటుట:

అప్పుడు సుగ్రీవుడు రామునితో నిట్లనెను. రామచంద్రా! మీరు హనుమంతుని, లక్ష్మణుడు తారాపుత్రుడైన అంగదుని ఎక్కినచో వారు వేగముగా గరుత్మంతుని వలె సముద్రము నాకాశమార్గమున దాటింతురనగా అట్లే దశరథపుత్రుడు లక్ష్మణునితో గలిసి విల్లు ధరించి సూర్యపుత్రుడు వెంట వచ్చుచుండగా సైన్యము ముందు నడువసాగెను. అంత కొందఱు కపులు అతని ప్రక్కల వచ్చుచుండగా కొందఱు వానరులు తమ శక్తిని ప్రకటించుచు నీటిలో నీదుచురాగా, మఱికొందఱు గరుడుని వలె వేగముగా ఆకసమునటంచు రాసాగిరి. ఆసమ్మర్థములో కొందఱికి మార్గమే లేకుండెను. అందఱును ఇట్లు వెళ్లుచుండగా ఆ సేనలయొక్క ధ్వనులు నలుదిక్కుల నిండి ఆ సముద్రఘోష నంతయు నిమిషములో మ్రింగివేసెను. ఆ కపిసేనలిట్లు దాటి పండ్లు, దుంపలు గల సమతులమున సేనానాయకుని ఆజ్ఞచొప్పున నెమ్మదిగా దిగిరి. ఆ రఘురాముడు ఎవ్వరును చేయజాలని కార్యమును చేయుటను సంభ్రమమొందుచు చూచుచు తమ మనస్సులు సంతోషముతో పొంగుచుండగా దేవతలు, సిద్ధులు, ఋషులు, చారణులు రఘురాముని దగ్గఱకు వచ్చి శుభప్రదములైన జలముల చేత అభిషేక మొనర్చి శత్రువులను సంహరించి సముద్రపర్యంతమున్న ఈ భూమినంతను అపారమైన వత్సరములు పాలింపుమని ఎక్కుడు భక్తితో మఱల మఱల పూజించిరి.

★★★

# ఇరువది మూడవ సర్గము

## శ్రీరాముడప్పుడు తోచిన శకునముల తెఱగు లక్ష్మణున కెఱింగించుట:

సర్వనిమిత్తముల నెఱిగిన శ్రీరాముడు అప్పుడు కనిపించుచున్న శకునములను జూచి తన సోదరుని కౌగిలించుకొని ఇట్లనెను. పెద్దవైన సరస్సులు కలిగి ఫలములతో నున్న వనమును జూచి; దానియందీ వానరసైన్యమును వ్యూహము దీర్చుట శ్రేయస్కరము గదా లక్ష్మణా! బలవంతులైన వానరులు రాక్షసులను నాశనము చేయునదియు మహాభయంకరమును నైన ప్రళయము రానున్నది. దుమ్మురేపుచు వేగముగా గాలులు వీచుచున్నవి. పర్వతశిఖరములు వణకుచున్నవి. భూమి కంపించుచున్నది. చెట్లు విరిగి నేలబడుచున్నవి. చూచితివి గదా. భయంకరమైన రాక్షసాకారములు గలిగి కఠినములై క్రూర ధ్వనులు గలిగిన మేఘ సమూహములు ఘోరముగా ఉత్పాత సూచికముగా రక్తములతో గూడిన వృష్టిని గురియించుచున్నవి. సంధ్యాకాలము కుంకుమరంగుతో భయంకరముగా ఉన్నది. సూర్యుని యందొక నల్లని చుక్క కనిపించుచున్నది. ఆ సూర్యుని నుండి మండుచున్న ఒక యగ్ని మండలము నేల వ్రాలినది. భయంకరమైన మృగములు, పక్షులు సూర్యుని జూచి ఎల్లయెడల దీనముగా అరచుచున్నవి. చంద్రుడు రాత్రులందు తన తేజము నశింపగా నలుపు ఎఱుపు రంగులు కొనల వ్యాపించగా ప్రళయ కాలమునవలె విపరీతమైన విధముగా భూమికంతటికిని తాపము గలిగించుచున్నాడు. సూర్యుని చుట్టు పరివేషము హ్రస్వమై, తీక్ష్ణమై, ఘోరమై యొప్పుచున్నది. దాని విధము చూచితివా? చుక్కలు మలినములై తప్పక దీని మూలమున లోక వినాశమయ్యెడునని తెలియజేయుచున్నవి. కాకులు, గ్రద్దలు వేగముగల్గిన డేగలును మిక్కిలి అల్పములైన పక్షులు తమను తరముచుండగా ఆరాట పడుచున్నవి. అంతటను నక్కలు వ్యాపించి తిరుగుచు, పరువెత్తుచు కీడును తెలియజేయుచు భయంకరముగా రొద చేయుచున్నవి. వీనియొక్క ఫలితములను చూడగా భూమియంతయు రక్తమాంసములతో నిండింపబడును. ఇది నిజము. కాన మనము దేవతావిరోధియైన రావణుని పట్టణము నిప్పుడే సర్వ వానర

సైన్యములతో వెళ్లి ముట్టడింతమని చెప్పుచు మేటి మొనగాడైన రాముడు చేతితో విల్లు ధరించినవాడై లంక దిక్కుగా వెళ్లెను. యుద్ధావేశరసముతో నిండియున్న రఘురాముని వెంట సుగ్రీవుడు విభీషణుడు మిగిలిన వానరసేనలు శత్రువులను మర్దింపవలెనను నిశ్చయము గలవారై వెళ్లిరి. వారి భక్తియు, శక్తియు వారి ప్రతాపములను, వారి చర్యలను, వారి ధైర్యమును సీతారమణుడు చూచి తన మనస్సునందు సంతోషించెను.

★★★



# ఇరువది నాలుగవ సర్గము

## శ్రీరాముడు లంకలోని ధ్వని విని సీతను దలంచి దుఃఖించుట:

సముద్రము వలె అపారమైన వానరబలము యొక్క ధాటిని గొప్పవేగమును భరింపలేక భూమి భయముచే పీడింపబడినదై వణక జొచ్చినది. ప్రకాశించు చుక్కలతో నొప్పుచున్న శరత్కాల రాత్రి చంద్రునిచేత తామరరేకుల వంటి కన్నులు గలిగిన రామచంద్రునిచే వానరబృందము మిక్కిలి ప్రకాశించెను. లంకలో అత్యధికముగా మృదంగముల భేరుల నాదములు వానర సంఘమునకు వినవచ్చెను. ఆ గొప్పధ్వనులు వానరుల చెవుల బడగానే వారును ఎక్కువైన సంతోషముతో పొంగి అధికమైన అసూయతో ఆ ధ్వనిని మించి పోవునట్లు భయంకర ధ్వనిని చేయగా అది ఘోరమైన పెద్ద మేఘముల గర్జవలె భయంకరమైన లంకలో నున్న రాక్షసులందఱి చెవుల బడెను. శ్రేష్టమైన చిత్రవిచిత్రమైన జెండాలు గల ఆ లంకానగరమును జూచి జానకీపతి తన భార్యను తలంచి పాపాత్ముడైన దశముఖునిచే బంధింపబడిన రోహిణివలె అంతులేని మనోవ్యధచే బాధింపపడుచున్నదై ఈ నగరమునందు చిన్నబోయి యున్నదిగదా. అని వేడి నిట్టూర్పు విడిచి తమ్మునితో రాముడిట్లనెను. లక్ష్మణా! లంకను చూచితివా? ఈ పట్టణమెంత గొప్పగా నున్నది. ఔరా! ఆకాశము నంటుకొన బోవుచున్నదో యనునట్లు, విశ్వకర్మచే మానస సృష్టిగావింపబడినట్లు పర్వత శిఖరమునం దొప్పుచున్నది. చూచితివా? విమానముల వరుసలతో భూమికి దిగివచ్చిన తెల్లని మేఘములతో గూడిన ఆకాశమో చైత్ర రధము వలె. మ్రోయుచున్న తుమ్మెదలు పక్షులు గల ఉద్యానవనములతో మనోహరమై యొప్పుచున్నది. పుష్పములందు తేనెలు త్రావి మత్తైన తుమ్మెదలు, మదించిన పక్షులు, ఆడుకోకిలల గానములు గల ఆ వనములను చల్లని గాలి ఊయలూచుచుండెను.

## శ్రీరాముడు సేనల వ్యూహము దీర్చుట:

అని చెప్పుచు జానకీపతి సేనను శాస్త్ర పద్ధతిగా విడదీసి ఆ సైన్యమందు నీలునితో అతని సేనతో అంగదుడు నిలువవలెను. ఋషభుడు తన సేనతో కుడి ప్రక్క నిలువవలెను. మదించిన ఏనుగును బోలిన గంధమాదనుడు తానెడమప్రక్కన నిలువవలెను. శౌర్యముతో

వేగదర్శి, సుషేణుడు, బ్రహ్మపుత్రుడగు జాంబవంతుడు, ఈ ముగ్గురును సైన్య సమేతముగా గర్భమును రక్షించుటకు నిలువ వలెనని ఆజ్ఞనిచ్చి రామచంద్రుడు తానును లక్ష్మణుడును తలయందు నిలిచిరి. లోకము యొక్క వెనుక భాగమును వరుణుడు గాచునట్లు వానరరాజును, మహాబలవంతుడునైన సూర్యపుత్రుడగు ఆ సుగ్రీవుని వానరసేన యొక్క వెనుకభాగమును రక్షింప నియోగించెను. మేఘములతో నిండిన ఆకాశము వలెనున్న వానరసేన వృక్షములు పర్వత శిఖరములు గైకొని చెలరేగి రావణుని పురమును నుగ్గుచేయుటకు పర్వతముల చేతను చెట్లచేతను పిడికిళ్ల చేతను కళావిహీనమగునట్లు నలగగొట్టవలెనని రోషముపొందిన చిత్తములతో తలంచుచుండెను.

## శుకుడు రావణునితో తాను పోయి వచ్చిన వృత్తాంతమును చెప్పుట:

శ్రీరాముడప్పుడు సూర్యపుత్రునితో రావణ చారుడైన శుకుని విడిచి పెట్టమనగా అతడు విడిచి పంపివేసెను. [శుకుని ముందే విడిచిన అతడు సేతుబంధ విషయము సేనా విషయము రావణునకు జెప్పిన నతడు సేతు బంధమునకు విఘ్నము కలిగింపనెంచునని యిన్ని దినములీ శుకుడు వానరుల నిర్బంధములోనే యుంచబడి యిప్పుడు విడువబడెను] ఆ శుకుడు భయముచేత అవయవములు కంపించుచుండ రావణుని యొద్దకు వెళ్లెను. రాక్షసరాజు నవ్వుచు శుకా! ఏమిది? ఱెక్కలేమైనవి? కత్తిరించిన విధముగాఁ దోచుచున్నది. దుర్మార్గులు, చపల చిత్తులు నైన వానరుల చేతిలో జిక్కితివా ఏమి? అనగా ఆతడు లోన భయము చెందుచు రావణునితో ఇట్లు చెప్పెను. రాక్షసరాజా! నేను నీవు పంపగా వెళ్లి సాగరము నుత్తర తీరమును జేరి నెమ్మదిగా సుగ్రీవునితో నేర్పున నీవు చెప్పిన విధముగా చెప్పగా వెంటనే అతిశయించిన కోపముతో వానరశ్రేష్ఠులందఱును నన్ను ద్రోసిరి. కూలబడునట్లు తన్నిరి. నేను గోలపెట్టుచుండగా విసరి నేలపై బడనేసిరి. కాళ్లతో త్రొక్కిరి. గద్దరితనముతో వానరులు నన్ను చంప దలంచిరి. అందున్నవారలకు సహజముగా కోపము ముక్కుమీదనే యుండును. నన్ను మాటాడనీయరు. నేను చెప్పుదానికి బదులు చెప్పరు. మీది మీదికి వచ్చెదరు. ఖరాసుర విరోధి, విరాధుని వధించినవాడు, అరిభయంకరుడైన కబంధుని పాలిటి యముడు నయిన ఆ రాముడు సుగ్రీవునితో గలిసినవాడై సేనతో సీతాదేవిని జేరవచ్చెను. సాగర జలములందు సేతువును గట్టెను. ఉప్పు సముద్రమునుదాటి ముట్టడించెను. రాక్షస సంఘమును సంహరించుటకు విల్లు చేతబట్టెను. బలవంతుడైన రఘునాధుడదిగో రాక్షసనాధా! పర్వతముల వంటి, మేఘములవంటి గొప్ప శరీరములు

గలిగిన క్రోతులు కొండమ్రుచ్చుల సైన్యము వేనవేలుగా భూమినంతను నాక్రమించెను. వానరులకు రాక్షసులకు దేవదానవులకు వలెనే సంధి కుదరదు. ఆ గండు క్రోతులు మన లంక లగ్గపట్క ముందే సీతనిచ్చివేయుటో లేక యుద్ధము చేయుటో ఆలోచించి నిశ్చయింపుము. ఓ ఉద్దండమైన తేజము గలవాడా! ఆలస్యము చేసినచో కార్యము తప్పించవచ్చును సుమా అని చెప్పగా

## రావణుడు సీతనీయనని శుకునితో తన పరాక్రమమును దెలుపుట:

దోషముతో నెఱ్ఱబడిన నేత్రములు గలవాడై రాక్షసరాజు ఓరీ! శుకా! వినరా! దేవతలు రాక్షసులు గూడి వచ్చి యుద్ధమందు నన్నెదిరించినను, జన సమూహములతో లోకము లన్నియును సంక్షోభించినను శుంఠా! తిరిగి జానకిని భర్తయొద్దకు మఱల పంపబోను సుమా! పరిమళయుతమైన పుష్పములతో గూడిన వృక్షములమీద వ్రాలెడి తుమ్మెదల వలె నాయొక్క వాడియైన బాణ పరంపరలా రాముని మీద వ్రాలుట ఎన్నడో గదా! నా అమ్ముల పొదిలో నున్న బాణ సముదాయము వింటినుండి వెలువడి ఆ రాముని ఉల్కలు మదపుటేనుగును వలె ఎక్కువగా నొప్పించుట యెప్పుడోగదా. ఉదయించు సూర్యుడు జగత్తునందున్న పదార్థముల తేజస్సును హరించు విధముగా రామునియొక్క బలములను నేను యుద్ధమునందు హరించెదను ఏల కలత చెందెదవు? సముద్రము వంటి శౌర్యము వాయువుయొక్క వేగమును నాకున్నవని ఆ మానవునకు తెలియదు. తెలిసియున్నచో యుద్ధమందు నన్నెదిరింపఁ దలుచునా? నా అమ్ములపొదిలో శయనించుచున్న నా బాణములు అతి కఠినములని ఱెక్కలు గల విషసర్ప సమూహములని తానెఱుగడు. నా ములుకుల నెఱిగినచో నన్నెదిరింప రాముడేల వచ్చును? నారియొక్క మ్రోత గలదియు, దెబ్బతిన్నవారి యార్తనాదములు గలదియు, వారించుటకు శక్యముగాని బాణ వేగపు ధ్వనులు గలదియు బాణాగ్రముల చేత మ్రోగింప బడునదియు అగు నా ధనువనెడి వీణ చేతబూని శతృసేన వినునట్లుగా నేను రణరంగమనెడి రంగస్థలమున నేర్పుతో విహరించెదను జూడరా శుకా! రాముడిదివఱకు రణరంగమున నన్నెదిరించి ఎఱుగడు. నా అమితమైన పరాక్రమమును శక్తిని ఇప్పుడు తాను మనస్సున తెలిసికొనగలడ ఏల బెదిరెదవు? వేయికన్నులు గలిగిన దేవతల రాజు వచ్చినను పాశహస్తుడై వరుణుడే పడద్రోసికొని వచ్చినను, దండము ధరించి ఆ యముడే యిటు వచ్చినను, ధనాధీశుడగు కుబేరుడే ఎదిరించినను నాకింతయైనను చెడుగును చేయజాలరురా ఓరీ పిరికివాడా!

★★★

# ఇరువది యైదవ సర్గము

## రావణుడు శుకసారణులను వానరసేనను పరికించి రమ్మనుట:

పొమ్ము అని వానిని పంపివేసి తరువాత రావణుడు, సారణుడు, శుకుడు అను మంత్రి శ్రేష్ఠులను చూచి భయంకరమైన క్రోధ గర్వము లావేశించిన మనస్సుగలవాడై సరభసముగా నిట్లు పల్కెను. ఓ మంత్రి శ్రేష్ఠులారా! మునుపెప్పుడును విన్నది గాదు. గొప్ప సముద్రమునందు గొప్పయెత్తున సేతువును దశరథ ప్రియపుత్రుడగు శ్రీరాముడు నిర్మాణము చేయగా వానరులు సముద్రమును దాటి మనపై బడ వచ్చినారట. ఇది నిజమని తలంపబోను. సముద్రమెక్కడ? సేతువుగట్టుటెక్కడ? అదియును గాక వానరసైన్యమును లెక్కించుట అవసరమైన కార్యమునగాన మీరు వెళ్లి మారువేషములతో మిమ్మెవ్వరు జూడకుండ వానరసేనలో బ్రవేశింపుడు. వానరులయొక్క శౌర్యమును సేన పరిమాణమును తెలిసికొనుడు. రాముని మంత్రులలో సుగ్రీవుని హితులలో ముందుండువారు మహాపరాక్రమవంతులు నైన వానరులెవ్వరో తెలిసికొని రండు. వానరుల సేనా నివేశమును సముద్రమున సేతు నిర్మాణమును చూచి అది నిజమో కాదో తెలిసికొని రండు. ఓ నా మంత్రులారా! రాముడు చేయు ప్రయత్నమును, ఆ మానవుని బలమును, అతని ఆయుధశక్తిని, లక్ష్మణుని పరాక్రమమును ఆమూలాగ్రముగ దెలిసికొని రండు. అని ఆజ్ఞాపింపగా ఆ శుకసారణులాలోచించి వానరవేషములను దాల్చి వెళ్లి ఆ వానరసేనను జూచి శరీరము గగుర్పొడువగా దిగ్భ్రమ జెంది లెక్కపెట్ట శక్యముగాక పర్వతములందును, గుంటలందును, కందరములందును, గుహలందును, సముద్రతీర ప్రదేశములందును, తోటలందును గలవారిని, దాటిన వారిని, దాటుతున్న వారిని, దాటనున్న వారిని చూచి కడు లెక్కింప శక్యము గాని ఆ వానరుల బలమును పూర్తిగా ఎఱుగలేక తిరుగుచుండ వారిని తెలిసికొని వెంటనే విభీషణుడు వారలను పట్టి కట్టి ఆ రాక్షసులను రాముని ముందఱ నిలబెట్టెను.

## విభీషణుడు శుకసారణులను బట్టి రామున కప్పగించుట:

ఆ రాక్షసులు ఆర్తిని జెంది ప్రాణముల మీది ఆశను వీడి చేతులు రెండును జోడించి యిట్లనిరి. దశకంఠుని ఆజ్ఞమేరకు నీ బలముయొక్క శౌర్యమును, వీర్యమును

తెలిసికొనవచ్చినారమయ్యా! ఓ జానకీపతీ! మమ్ము చంపిన చంపుము. రక్షించిన రక్షింపుము. అని వేడగా ఆ మాటలను విని నవ్వుచు సమస్త భూతముల హితమును గోరునట్టి రాముడిట్లనెను. ఓ రాక్షసులారా! మీరు సర్వసైన్యమును చూచినచో, రావణుడు మీకు నియమించిన కార్యమును మీరు పూర్తిచేసినచో యథేచ్ఛగా వెళ్లిపొండు. పూర్తిగా చూడకున్నచో తిరిగి వెళ్లి మీ యిష్టము వచ్చిన విధముగా చూచి వెళ్లుడు. మీరు ఒంటరిగా వెళ్లి చూచుటకు భయపడెదరేని విభీషణుడు మీకన్నియును చూపించును. ప్రాణభీతిని మానుడు. ఆయుధరహితులై దొరికిపోయిన దూతలను రహస్యముగా జంపుట న్యాయపద్ధతి కాదు. మీరలిచ్చట ఆశ్చర్యపడ నవరసము లేదు. [ వేగులవారు శిక్షకు పాత్రులే యయినను వాస్తవ విషయమును మీరు రావణునకు దెలిపిన అతడు తన్ను శరణుజొచ్చునేమో యని దయాసముద్రుడైన రామభద్రుని తలపు ] విభీషణా! శత్రు రహస్యములను భేదింప వచ్చినవారు, రాక్షసరాజు చారులు అయిన వీరిని విడువుము. బాధింపకుము. అని పలికి రామభూపతి వారలతో నిట్లనెను. ఓ రాక్షసులారా! ఈ విధముగా చెప్పుడు. రాక్షసాధిపా! నీ వేబలమును సైన్యము, బంధువులు సమస్తమైన వానియొక్క చేవను నీ యిష్టము వచ్చిన విధముగా చూచుచుండగనే నాశనము గావించెదను. దారుణమైన వజ్రాయుధమును పాకశాసనుడు దానవులపై ప్రయోగించు విధముగా నాయొక్క భయంకరమైన యాగ్రహమును నీ సేనలపై తెల్లవారగనే నిరంతరముగా వేగముగా ప్రయోగించి ద్వారతోరణ ప్రాకార సహితముగా లంకను నాశనము చేసెదను చూడుము రావణా! అని మీ రాజుతో చెప్పుడని వారలను విడిపింపగా వారు జయజయ ధ్వనులతో ధర్మవత్సలుడగు రాముని కీర్తించిరి. అంత వారలు వెళ్లి రావణుని చూచి ఇట్లు పల్కిరి.

## శుకసారణులు రావణునితో సీతను రామున కిమ్మని చెప్పుట:

ఓ రాక్షసరాజా! నీ ఆజ్ఞ ప్రకారము మేము వెళ్లి వానరబలములందు సంచరించుచుండగా విభీషణుడు మమ్ము బట్టి దయాళుడైన ఆ రాముని యొద్ద నిల్పగా ఆ మహాతేజస్వి చంపదగిన వారలమైన మమ్ము విడిపించెను. ఆ మహా పరాక్రమశాలి విధమునంతయు నేమని చెప్పగలవారము. వీరులు, అస్త్ర విద్య యందు నేర్పరులు, అతి పరాక్రమవంతులు దిక్పాలకులతో సమానులు నయిన నలువురు నొక్క చోట చేరిరి. శ్రీరాముడును, లక్ష్మణుడును దేవేంద్ర సమాన విక్రముడగు సూర్యసుతుడు సుగ్రీవుడు, విభీషణుడు అను వీరలే మన పురమును సమూలముగా పెల్లగింప సమర్థులు. తక్కిన

వానరవీరులు మాట యట్లుండనిమ్ము. ఆ రాముని వివిధమైన అస్త్ర సంపదయు మూర్తి విశేషము చూడగా చూడగా అతనొక్కడే మన లంక అంతయును చిన్నచిన్న గులకరాళ్లవలె చేసి భూమిపై పడవేయ గల సమర్థుడు. తక్కిన ముగ్గురెందులకు? రాముడు, లక్ష్మణుడు, వానరరాజు అతని పాలనలో నున్న సేన ఇంద్రాది దేవతలకైనను జయింప శక్యము గాదు. నూఱామడల పొడవును పదియామడల వెడల్పును గల సేతువును ధైర్యముతో దాటి మన సముద్రతీరమున వానరసైన్యమంతయును విడిసియున్నది. వారధిని దాటిన దాటుచున్న సైన్యముయొక్క అంతమును కనుగొనలేము. సంతోషముతో విజృంభించిన వానరసేనతో యుద్ధము చేయ తలపడుట తగిన పనిగాదు. శాంతము వహించుటయే తగును. రామభూపాలునకు జనకరాజపుత్రి నప్పగింపుము. ఇది నీకు శుభమును కలుగజేయును.

★★★



# ఇరువది యాఱవ సర్గము

## రావణుడు శుకసారణులతో ప్రాసాదమెక్కి వానరసేనలను చూచుట:

అని ఈ విధముగా హితకరములగు మాటలను భయములేక చెప్పిన మంత్రియగు సారణుని జూచి రావణుడిట్లు పలికెను. ఓ సారణా! ఇలు కాఱులు పల్కెద వేల? రాక్షసులు దేవతలు ఒక్కటై ఎదిరించినను ఈ జగములన్నియు నాకు భయము కలిగింప జూచినను భూపుత్రి నిచ్చుట యన్నది లేదు. నమ్ముము. ఆ వానరులకు దొరికిపోయి వారలు చక్కగా మర్దింపగా భయపడినవాడవై ఈ విధముగా సీతనిమ్మని కొఱగాని మాటలను ప్రేలుచున్నావురా పిఱికివాడా! ఓరీ! ఎవ్వడురా నన్ను రణరంగమున జయించు శత్రువు? రమ్ము చూతము అని పల్కుచు ఆ దేవశత్రువు మంచువలె తెల్లనిదియు అనేక తాళవృక్షముల ఔన్నత్యము గలదియు ఆకాశమునంటుచున్నదియు నగు ఒక అబ్బురమైన మేడను మదిలో రోషము పొంగుచుండగా నెక్కి పర్వతములందును, వనములందును సాగరమందును వానరులతో నిండిన ప్రదేశమును, అపరామును లెక్కించుటకు శక్యముగానిదియునైన గొప్పవానర సైన్యమును చూచి సారణునితో నిట్లనెను. సారణా! వానరసైన్యములో నున్న వీరులలో గొప్పబలము గలవారు శూరులలో శ్రేష్ఠులు, ముందు నడుచు వారు, ప్రఖ్యాతి చెందినవారు కార్యసాధనయందు నేర్పుగలవారు ఎవ్వరు? వానర రాజెవ్వరి మాట వినును? ఆ వానర బలమందు ప్రధానులెవ్వరు? సేనాధిపతులపై యధిపతులెవ్వరు? ఇవి అన్నియు నాకెఱిగింపుమురా! అని తన్నడుగుచున్న దశగ్రీవునకు సారణుడు వానరసైన్యములో నున్న గొప్పవారిని గూర్చి యదార్థమైన విధముగా ఇట్లు చెప్పెను.

## సారణుడు రావణున కంగదాదుల నెఱిగించుట:

రాజా! అల్లనే లంకఎదుట గొప్ప గర్జనలతో మన లంకను కూకటివేళ్లతో పెళ్ళగిలి అదురునట్లుగా చేయగల భయంకరమైన వానరులు నూఱువేలు తన్ను భక్తితో సేవించుచుండగా ఆ సేనలకు ముందుగా నున్నవాడే రాజా! సేనాపతి. వానరులలో ముఖ్యుడు. నీలుడను పేరు గలవాడు. మహాబలశాలి. భూమిపై అటునిటు తిరుగుచు చేతులనెత్తి క్రూరములైన చూపులతో క్రోధముచే కట్టబడినవాడై లంకను చూచుచు తడవ

తడవకు గర్జించుచు తోకతో నేలను బ్రద్దలగునట్లు కొట్టుచున్న పద్మకేశరములవంటి ఛాయగలవాడు పర్వతశృంగమువలె నున్నవాడు చూచితివా? అతడే అంగదుడు. వానరరాజు అతనిని వానరరాజ్యమునకు యువరాజుగా నిల్పెను. నిన్నుచూచి యుద్ధమునకు పిల్చుచున్నవాడు చూచితివా? వాలికి తగిన పుత్రుడు. సుగ్రీవునకు ప్రేమపాత్రుడు. అతడు ఇంద్రునికై వరుణుని విధముగా రామునకై రణము చేయును. ఈతని బుద్ధి విశేషముననే గదా! వాయుపుత్రుడు రామునకు ప్రియము చేయవలెనను మనస్సుగలవాడై మహావేగవంతుడు వెదకి సీతను గాంచగలిగెను. యుద్ధమందు కాఠిన్యము గలవాడగునితడు గొప్పసేనలతో గూడి జయింపరానివాడై ఓ రాక్షసాధిపా! జై యనుచు నీతో యుద్ధము చేయుటకు వచ్చెను. ఆ వాలిపుత్రుని వెనుకగా వానరబలముతో బ్రకాశించువాడే పెద్దపులితో సమానమైన బలము గలవాడగు నలుడు. బాహుబలశాలురు, చందనవన నివాసులు నయిన వేయికోట్ల ఎనుబది లక్షల వానరశ్రేష్ఠులు ఎల్లప్పుడు నీతని సేవించుచుందురు. దేవతలకు భయంకరుడైన ఓ రావణా! ఇతడే సేతువును గట్టినవాడు. అతని సైనికులను జూడుము. నిన్ను జూచి అరుపులతో దిక్కులెల్ల నిండింపజేయుచు క్రోధము నిండిన మనస్సులతో చివాలున లేచి భయము కలిగించు విధముగా తమ శరీరము నధికముగా బెంచి విదిలించుచు మహావేగముతో నీపై దుముకునట్లు గనబడుచున్నారు. వారు సాహసులు. వారిని జూచితివా? శ్వేతడనువాడు వెండికొండతో పోలిక చెప్పదగినవాడు. లోకములందు ప్రసిద్ధి వహించినవాడు. భయంకర పరాక్రమము గలవాడు. చపలచిత్తముగలవాడు కాని బుద్ధి కుశలత గలవాడు. వేగముగా సుగ్రీవుని సమీపించి వెనుకకు వెళ్లి సైన్యము నంతను ఉత్సాహపరుచుచు ఒకరీతిగా ఏర్పాటు చేయుచున్నాడు. చూడుము రాక్షసరాజా! అదిగో అతడు కుముదుడనువాడు. గోమతీ తీరమందున్న సంకోచమను పర్వము పూర్వము నివాసముగా గలవాడై వృక్షచరుల రాజ్యమునేలువాడు. వేనవేలుగా వానరులు మనస్సులతో తన్ను గొల్చుచుండగా విరాజిల్లుచున్న మహావీరుడు. అతని పొడవైన తోక యందు పసుపు తెలుపు నీలములైన పెద్దవైన వెంద్రుకలున్నవి. రోషము గలవాడు. కీర్తిశాలి. శత్రుపురములను దహించుటయందు ఆసక్తి గలవాడు. చండుడనువాడు ఓ శత్రుసంహారా! అతనిని జూచితివా స్థిరమైనవాడు. పెద్దకన్నులు గలవాడు. ధైర్యశాలి. సింహసమానుడు. చూపుతో నీ పురమును తగులబెట్టునట్లు ఉప్పొంగుచు చూచుచున్నవాడు. కష్ణగిరి, విధ్యపర్వతము, సహ్యాద్రి సుదర్శన పర్వతము మున్నగు పర్వత ప్రదేశములందు సంచరించు ఈ వానర

శ్రేష్ఠుడు అమిత శౌర్యము గల రంభుడు. రాక్షసరాజా! వీరులు, శూరులు, రణమున నెదిరింప శక్యముగానివారు చండులు, ప్రచండమైన పరాక్రమముగలవారు క్రూర స్వభావులు అయిన ముప్పదికోట్ల వనసంచారులు యుద్ధమందు ఉత్సాహముగలవారై కోరికతో ఇతనిని గొల్చుచున్నారు. చెవులు నిక్కబెట్టి శరీరమును బెంచుచు మాటిమాటికిని క్రోధముతో శరీరము వణుకు చుండ తోకపై నిలబెట్టుచు అడ్డచూపులు చూచుచు దారుణముగా గర్జించుచున్న ఆ వానరుని చూచితివా? ఓ ఇంద్ర మర్దనా! వాడే శరభుడనువాడు. యుద్ధరంగమునుండి పాఱిపోవడు. వేగమున అందఱిని మించినవాడు. గోళ్లతో పర్వతములను చీల్చివేయును. మృత్యువునైన ఎదిరించి పోరాడును. భయమున ఓడిపోడు. సాల్వేయ పర్వతమునందు నివసించును. వీరాగ్రణియైన ఆ శరభుని సైనికులు ఆటలాడువిధముగా శత్రు సైన్యములను మర్దించువారు. పది లక్షల ఆ వానరులు లంకను శౌర్యముతో నాశనము చేయ గోరుచున్నారు. పెనుమేఘమాకాశమును వ్యాపించినట్లు దేవతల మధ్యలో వెలుగు ఇంద్రునివలె గర్జనలతో యుద్ధకాంక్షతో యొప్పుచున్నవాడే ఏవిధమైన భయము లేనివాడు మహాబలవంతుడు నైన పనసుడనువాడు. రాజా! వీనిని ఏబది లక్షల వానరశ్రేష్ఠులు యూథములు నిర్మించుటలో నేర్పరులు శౌర్యవంతులలో నుత్తములు సేవింతురు. ఇతడు పారియాత్రమను పర్వతమున నివసించువాడు. సముద్ర తీరమున రెండవ సముద్రము వలె నున్న భయంకరమైన సేనకే ప్రకాశమును గలుగ జేయుచు దుర్దుర పర్వతవలె నున్నవాడే వినతుడను వానరుడు. అఱువది లక్షల వానరులు గొలువగా పర్ణాస యను నది నీరు త్రాగువాడు. కలహంబునకు నిన్ను పిల్చుచున్న ఆతడే క్రోధనుడను వానరుడు. ఇతని యొద్ద వేనవేలు వీరులు గలరు. తోపురంగువాడు. తోడివారిని హేళన చేయువాడు. సూర్యునివంటి తేజస్సుగలవాడు. గవయుడను వానరుడు. డెబ్బది లక్షల కోతులు గర్వము గలవారు తన్ను కొలుచుచుండగా నీపై కోపముతో దబ్బున మీద పడి ఒక దెబ్బ తీయవలెనని ధైర్యముతో నిలబడిన వానిని చూచితిరా మీరలు. వీరలు ఎదిరింపరానివారు, ఎదుటి బలమును హరించువారు. కావలసిన రూపము ధరించువారు. విపరీతమైన వేగము గలవారు యూథములకు నాయకులు. వీరినెల్లప్పుడు సైన్యములు విడువకుండ కొలుచుచుందురు.

★★★

# ఇరువది యేడవ సర్గము

## సారణుడు రావణునకు హరాదియూథనాథుల నెఱిగించుట:

ఇక రాముని నిమిత్తముగా ప్రాణములనైనను కోలుపోవుటకు సిద్ధముగ నున్న మిగిలినవారిని గూర్చి చెప్పెదను వినుము. నునుపు గలిగి చాల పొడవు గలిగి కావిరంగును, తెలుపును, పుసుపును, నలుపును, మఱియు చాల రంగులుగల వెంట్రుకలు తోకపై నిలబడియుండ కొన్ని నేలపై వ్రాలి సూర్య కిరణముల వలె ప్రకాశించుచున్నవి. వాడు హరుడను వానరుడు. అతడు యూథములకు నాయకుడు. వృక్షములను చేతబట్టి లంక ప్రాకారముల నెక్కుటకు ప్రయత్నము చేయుచున్న వీరందఱును సూర్య సుతుని సైన్యములోనివారే! అంజన పర్వతమో, నీలమేఘముల సంఘమో యన్నట్లుగా యుద్ధమందు బెదురులేనివారును, యదార్థమైన పరాక్రమముగల వారును పర్వత గుహలందును, నదీ తటము లందును నున్నవారై నీపై బడుటకు జంకక దూకుచున్న యెలుగుబంటి యోధులను చూడుము రావణా! గర్జించుచున్న మేఘములచే పరివేష్టింబడిన వరుణ దేవునివలె ఎలుగుబంట్లు కొలువగా జయింపరానివాడై భయమనునది లేనివాడై భయంకరములైన కన్నులు, భయంకరమైన శరీరము గల్గియున్న ఆతనిని జూచితివా? అతడు ఋక్షవంతమని ప్రఖ్యాతి చెందిన పర్వతమున నివసించి నర్మదా నదీజలములను ద్రావును. భల్లూకములకు రాజు సుమా. ధూమ్రుడనుపేరున పిలువబడువాడు. వాని తమ్ముడు పర్వతమోయనునట్లు వెలుగుచున్నాడు [ఇతడు జాంబవంతుడు] ఆకారమున అన్నతో సమానుడయ్యును చటుల పరాక్రమమున అతనికంటె శ్రేష్ఠుడు. సేనాపతుల సేనాపతి. వానిని చూడుము. ఈతనికి సమానుడు లేడు. యుద్ధమున ప్రచండుడు. గురుల సేవించెను. దేవాసురుల యుద్ధములందు ఇంద్రునకు సాహాయ్యము గావించి అనేక వరములను బొంది పెంపుగావించినవాడు. యమునైనను ఎదిరించి యోడించును. వీనిసేన పర్వతముల మీద నిలిచి పడద్రోయుచున్న శిలలను చూడుము. రాక్షసరాజా! ఒత్తుగా రోమములు గలిగి రాక్షసులకు పిశాచములకు సమానమగుచు ధూమధ్వజుడగు అగ్నివంటి తేజస్సుగలవారై ఆ గొప్పసేనలు తిరుగాడుచున్నారు చూచితివా? అల్లదే

దంభుడు. ఇంద్రుని నుపాసించును. యదార్థమైన పరాక్రమము గలవాడు. దారుణమైన తొందరతో విజృంభించువాడు, యుద్ధమునందు ఈదుచున్నట్లు తిరుగును. ఎవని వేగపునడకకు ఆమడ దూరమునున్న పర్వతములు అప్పుడే ప్రక్కకున్నట్లగునో, ఎవడు సంతోషముతో నిల్చినప్పుడు ఒక యోజనపుయెత్తుగా ప్రకాశించునో, ఎవని ఆకారమునకు భూమియందలి నాల్గుకాళ్ల జంతువులలో పెద్దది కానరాదో, ఎవడు పూర్వము ఇంద్రుని యుద్ధమున నెదిర్చి ఓడిపోవుటను మాట ఎఱగడో, ఈ వానరులందఱికిని ఎవడు పితామహుడో, అట్టి మహాక్రోధముగల వాడును, సేనాధిపతులకు కూడ అధిపతి యయినవాడును, గొప్ప నాదము చేయువాడును అగు సన్నాదుడను వానిని జూచితివా? మహాబలదర్పములగలిగిన ఓ దశకంధరా! రాక్షసరాజా! ఇతనిని జూడుము. గంధర్వ స్త్రీయందగ్నిదేవునకు జన్మించినవాడు. దేవాసుర సంగ్రామమునందు దేవతలకు తోడుగావెళ్లి తన ఆధిక్యమును చూపినవాడు. విక్రమమునందు ఇంద్రునితో సమానుడు. ఈ యూథనాథాగ్రేసరుని క్రథనుడందురు. ఏ పర్వతమందున నేరేడు చెట్టును యక్షరాజగు కుబేరుడు సేవించునో ఎందునీ సవతి సోదరుడగు కుబేరుడు హాయిగా ఎల్లప్పుడు సంచరించునో, ఎచ్చట కిన్నరులగుంపులు యథేచ్ఛగా విహరింతురో ఆ పర్వతశ్రేష్ఠమునందీతడు నివసించును. ఈతను తన్ను తాను పొగడుకొననివాడు. కోటి సహస్రంబులు వానరులు తన్నుగొలువ తనసేనలతో లంకను సమూలముగా పెకలించి తనప్రతాపము తెలియునట్లు నేలమట్టముగా జేయ దలంచుచున్నాడు. జాహ్నవీతీరమందు ఏనుగుల వానరుల పూర్వ విరోధమును మనస్సునందు తలంచి ఏనుగుల గుంపులను బెదరించుచు, చెట్లచే గజములను, గజములచే చెట్లను, పర్వతములచే చెట్లను నాశనము చేయుచు, ఉశీరబీజగిరియందున సంతోషమున గంగయొద్దున సంచరించు నట్టి ఈ వానరపతి ప్రమాథియను పేరుగలవాడు. ఒక కోటి కపులు తన్ను గొలుచుచుండగా నితడు యూథపతియై స్వర్గమును ఇంద్రుడువలె ఆ పర్వతమును మహాబలశాలియై యేలుచుండును. దేవ వీరుల మదము నణంచిన ఓ రాక్షసరాజా! వీని సైనికులు బల పరాక్రమములలో శ్రేష్ఠులు. ఎన్నరాని మదముతో నున్నవారలు. ఈతని సైన్యమిదిగో వాయువు చేత ఎగురగొట్టబడిన ఎఱ్ఱని ధూళులచే కప్పబడినదయి అతి సంరంభముతో సాగుచున్న కఠినతరమైన వానరసైన్యము గండు గొండంగులతో గండు శూరులలో శూరుడునైన ఈతడు గవాక్షుడనెడువాడు. హెచ్చైన బలముతో కాటుకవలె నున్న

ముఖములు గల కొండముచ్చులొక కోటి అతనిని గొలుచుచున్నవి. ఎచ్చట తుమ్మెదలు హెచ్చుగా రొదసేయుచుండునో, ఏ గిరి సర్వర్తుఫలములతో పలు రంగులతో విరాజిల్లునో దేని నెల్లప్పుడు సూర్యుడు ప్రదక్షించుచుండునో, ఏది తన నాశ్రయించిన మృగ పక్షితతులను తన కాంతితో నిండించునో దేనియందు దేవతలు, ఋషులు వీడక వసించు చుందురో, ఏది యెల్లప్పుడు కోరిన ఫలముల నధికముగ నిచ్చుచుండునో, ఎందు తేనెసొన లెల్ల యెడల గురియుచుండునో అట్టి సుందరమైన మేరు పర్వతమునందు కేసరియను వానరుడుండును. ఈతడు గండరగండడు. శూరులలో అరువది వేల స్వర్ణ పర్వతముల నడుమ మేరువు మేటియై రాణించును. అచ్చట తెల్లగా పచ్చగా నల్లగా ఎఱ్ఱగా నొప్పు ఆకృతులతో మిక్కిలి వాడియైన గోళ్ళను, కఠినమైన కోరలు గలిగి, పెద్దపులులవలె క్రోధము గలవారై సింహములవలె నాలుగు కోఱలు గలవారై సూర్యునివలె ప్రకాశించుచు, విషసర్పములను బోలి మదించిన ఏనుగులను మించి, పొడవైన తోకలతో మదించిన ఏనుగులను బోలి, కొండలవంటి వారై గుండ్రమైన ఎఱ్ఱని నేత్రములు గలిగి మెరయుచు, ఈ లంకను సమూలముగా నాశనము చేయ సమకట్టిన వానరశ్రేష్ఠుల నడుమ విజయమును కోరియున్న వానరుడు శతవలి యనువాడు. ధైర్యవంతుడు. ప్రతిదినము సూర్యుని నుపాసించును. బలవంతుడు, శూరుడు పౌరుషము గలవాడు. రామచంద్రునకు ప్రియము గావించుటకై ప్రాణము తీపు అనుమాట తలపడు. లంకను పాడు చేయుటకు ఉవ్విళ్ళూరుచున్నాడు. గజుడు, గవాక్షుడు, నీలుడు, గవయుడు, నలుడు, వీరిలో నొక్కక్కడు దశకోటి సైన్య సమేతులైనవారు. ఓ రాక్షసరాజా! వింధ్య పర్వతమునందలి వానరుల లెక్కింప తరము కాదు. అందఱును అమితమైన పరాక్రమము గలవారు. అందఱు పర్వత సమానములైన శరీరములు గలవారు. అందఱును క్షణములో పర్వతములను పొడి చేయ సమర్థులు.

★★★

# ఇరువది యెనిమిదవ సర్గము

## శుకుడు రావణునకు మైందాదుల నెఱిగించుట:

సారణుడు చెప్పిన మాటలను విని శుకుడు పూర్తిగా చెప్పదలంచి ఆ రావణునకు సముద్రతీరమున నున్న వానరసైన్యమును దూరమునుండియే చూపించి ఇట్లు చెప్పెను. హిమవత్పర్వతమున నున్న మద్ది చెట్లో, మందాకినీ నదీ తీరమున నున్న మఱ్ఱి చెట్లో మత్తెక్కి తిరుగుచున్న గజ శ్రేష్ఠములో యనునట్లు సాధింపరానివారు, గొప్ప బలవంతులు కామరూపధరులు, దేవదాన సదృశులు, యుద్ధమున దేవతల వంటివారు అయిన వానరులు ఇరువది యొక్క కోటి వేలు, వేయి శంఖములు, బృందశతములు వీరందఱు కిష్కింధయందుండువారు. సుగ్రీవుని మంత్రులు. దేవతలకు గంధర్వులకు బుట్టినవారు. ఇంద్రవిరోధీ! వీరందఱును యుద్ధమునందు శత్రువులకు భయము పుట్టించువారలు. రాజా! వారలను చూడుము. నివారింపరాని పరాక్రమము గలవారు, చాల కాకారులు బ్రహ్మయాజ్ఞచే అమృతమును తనివి తీర క్రోలిన వారు, వీరు మైందుడు ద్వివిదుడు ననువారలు. నిన్నును, నీ పట్టణమును మొదలంట గూల్పగ చూచుచున్నారు. వారి ప్రక్కన పర్వతసమానులు సముఖా, సుముఖులనువారు యమధర్మరాజు పుత్రులు. వీరును తండ్రివలెనే అపార బలవంతులు. నీ లంకను పరీక్షగా చూచుచున్నారు. ఈతడు మదించిన ఏనుగువలె నున్నవాడు కోపముతో సముద్రమునైన కలచగలవాడు వాయుపుత్రుడని పేరుగాంచినవాడు. కోసరికి పుత్రుడై ప్రకాశించువాడు. కోరిన రూపమును ధరింపగలవాడు బలరూపములతో ఠీవిగా నున్నవాడు. వాయువువలె నివారింపరాని వేగము గలవాడు. వానరులందఱి కన్నను శ్రేష్ఠమయినవాడు. దర్పముతో సముద్రమును దాటినవాడు. భూపుత్రిని, నిన్ను చూచి మాటాడిన వాడు. తిరిగి ఇప్పుడిచ్చటికి వచ్చినవాడు. చూచితివా? వాడే హనుమంతుడనువాడు. వాడు చిన్నపిల్లవాడై యున్నప్పుడే నా ఆకలిదీర మ్రింగెదనని తలచి చివుక్కున ఆకాశమున మూడువేల ఆమడలెగిరి లోకలోచనుడగు సూర్యుని జేరకయే పర్వత శిఖరముపై పడుటచేత ఇతని హనువు(దవడ) చీలిక అయ్యెను. ఈ గొప్ప మగటిని గలవాడు దానివలననే హనుమంతుడను పేరున కీర్తిచెందెను గదా.

హనుమంతుడు, హనుమంతుడు, హనుమంతుడు అని ఇతని ఆప్తులు పిలుచుచుండుటచే విని తెలిసికొంటిని. ఇతని బలమును, గొప్పనైన మహిమను, రూపమును చెప్పశక్యము గావు. ఱివ్వున పైన పడి ఇప్పుడే ఉవ్వెత్తుగా లంకనంతను మహ్హాని ఎగురగొట్టు వలెనని ఇతడు మదముచే దలచుచున్నాడు. ఇతడీ పనికి తగినవాడనియే నేను తలంచుచున్నాను.

## శుకుడు రావణునకు రామలక్ష్మణులను జూపుట:

తామరుల వంటి నేత్రముల గలవాడు, నల్లనైన దేహము గలవాడు, శ్రేష్ఠమైన గుణములు గలవాడు, గొప్ప విక్రమముతో విహరించువాడు, శూరులలో శ్రేష్ఠుడు, మంచివారలకు శరణమైనవాడు, సూర్యవంశజుల యందతిరథుడు, పౌరుషముచే పేరుగాంచినవాడు, ధీరులకంటె ధీరుడు, వేదవేదాంగ విజ్ఞానముగలవాడు, ధర్మమునకొకే ఒక ఆశ్రయమైన వాడు, ధర్మము ననుసరించి నడుచువాడు, బ్రహ్మాస్త్రము మొదలైన అస్త్రమంత్రములందు పాండిత్యము గలవాడు, బాణములచేత ఆకాశమునైన బ్రద్దలు చేయగలవాడు, పర్తములనైనను పిండిచేయగల సమర్థుడు, మహా క్రోధమును పొందిన మృత్యుదేవతను పోలిన వాడు, గొప్ప పరాక్రమమున ఇంద్రునితో సమానుడు, ఎవని భార్యయైన సీతాదేవిని నీవు జనస్థానము నుండి తెచ్చితివో అట్టి దశరథమహారాజ పుత్రుడైన రాముడు వాడే సుమా. ఓ రాక్షసరాజా! అతడే నీతో యుద్ధము చేయపూనినవాడు. ఆయన సోదరుడు, అన్నకు సరియైనవాడు, ఎడమ ప్రక్కనున్నవాడు, మేలిమి బంగారమువలె మెరుగు లీనుచున్నవాడు, నల్లని యుంగరములు చుట్టిన వెంట్రుకలు గలవాడు, ఎఱ్ఱతామరలను పరిహసించు కన్నులు గలవాడు, నిక్కి పెద్దనైన విశాలమైన ఎదగలవాడు, ఎల్లప్పుడు అతనికి బహిః ప్రాణమైనవాడు, పూనుకొని ఎవ్వరికిని యుద్ధమున గెల్వ శక్యముగానివాడు, కోపము నిండిన హృదయము గల్గినవాడు, ఈతనిని లక్ష్మణుడని పిలిచెదరు. అన్నకు మిక్కిలి ప్రేమపాత్రుడు మఱియును ప్రాణ సమానుడు. సమస్తమైన అస్త్రశస్త్రములయందు నేర్పు గలిగినవాడు. బలవంతుడు, మేధావంతుడు, మహాపరాక్రమము గలవాడు. రాక్షససంఘము నెల్లను యుద్ధమున తానొక్కడే సంహరింపవలెనని మహారోషముతో కుతూహలపడుచున్నాడు. రామునకు స్నేహితుడై రాముని నాశ్రయించిన వాడై కుడిప్రక్క నిలిచియున్నవాడు. తన నాశ్రయించిన రాక్షసులతో గూడియున్నవాడు రాక్షసరాజైన విభీషణుడు. నీ యొక్క సోదరుడు. రాక్షసరాజా! ఇతడు లక్ష్మీసంపన్నుడు రాజులకు రాజుయైన శ్రీరఘురాముని చేత లంకాపట్టణమునకు

పట్టాభిషిక్తుడై సంతోషము చెందినవాడై దర్పముతో యుద్ధమందు నీతో తలపడనున్నాడు. ఆ కోతుల నడుమ కొండవలె నున్నవాడు. వానర సంఘములకు రాజైన సుగ్రీవుడు. బుద్ధియందు, తేజస్సునందు, కీర్తిజ్ఞానములందు, కులమునందు, పర్వతములను హిమపర్వతము వెలిగించునట్లు కపివరుల నేలువాడు. యుద్ధమున వెన్ను జూపని శౌర్యవంతుడు. కొండలతో చెట్లతో నున్న వనములు పర్వతముల వరుసలే దుర్గములుగా గల కిష్కింధయొక్క గుహలో వానరసైన్యాధిపతులును మంత్రులును తన్ను గొలవగా ప్రకాశించువాడు. సుకుమారమైన నూరు పద్మములు గలదియు నైన హేమమాలికను తాల్చినవాడు. యుద్ధమందు వాలిని జంపి భూపుత్రిపతియైన రాముడు తారాదేవిని, స్థిరమైన వానర రాజ్యమును, ఈ హారమును ప్రేమతో సుగ్రీవున కిచ్చెను.

## శుకుడు వానరసేనా సంఖ్యను రావణునకు దెల్పుట:

లక్షను నూటిచే హెచ్చింపగా కోటియగును ఆ కోట్లు లక్ష అయినచో శంఖమన బడును. ఆ శంఖములు లక్షయైనచో మహాశంఖమనబడును. అది లక్షయైన బృంద యను పేరున చెప్పబడును. అటువంటివి లక్షయైన పద్మమనెదరు. అది లక్షయైనచో మహాపద్మమనబడును. అది లక్షయైన ఖర్వమను పేర బిలిచెదరు. మఱియు నది లక్షయైనచో మహా ఖర్వమనబడును. అది యొక వేయి యైన సముద్రమందురు. అది లక్షయైనచో ఓఘ మనెదరు. అది లక్షయైన మహౌఘమందురు. రాక్షసరాజా ఇది గణిత శాస్త్రజ్ఞులు చెప్పునట్టి గణన విధానము. ఇక ఇచ్చట నున్న వానర బృందమును లెక్కించి చెప్పెదను వినుము. వేయికోట్లు, వంద శంఖములు, వేయి మహాశంఖములు, నూరు బృందములు ఒక వేయి మహా బృందములు, పద్మములు వంద, వేయి మహాపద్మములు, ఒక వంద ఖర్వములు, ఒక వంద సముద్రములు, వంద ఓఘములు, కోటి మహౌఘములు గలిగి మహా సముద్రమువలె విజృంభించుచున్న సైన్యమును విభీషణుడు మంత్రులతో గూడ తన్ను తగిన విధముగా బలిసి యుండగా సూర్యపుత్రుడైన సుగ్రీవుడు నీతో యుద్ధమునకై ఎదురు చూచుచున్నవాడు. రాక్షసరాజా! అతడు సులభముగా ఓడింపబడడు. మహాబలవంతుడు. చలించని బల పరాక్రమములు గలవాడు. మండుచున్న గ్రహ గోళములవంటి సైన్యముతో నున్నవాడు. అతనిని, అతని సైన్యమును విమర్శించి చూచి ఆపై మనకెట్లు ఓటమి గల్గకుండునో ఎట్లు శత్రువులను గెలుతువో ఆవిధముగా ప్రయత్నముచేయుము.

★★★

# ఇరువది తొమ్మిదవ సర్గము

## రావణుడు శుక సారణులను నిందించుట:

శుకుడిట్లు తెల్పగా శూరులైన వానర సమూహమును, రామ భూవిభుని సమీపమున నున్న తన సోదరుని, మహా వీర్యవంతుడు, రామునకు కుడిభుజము వంటి వాడగు సుమిత్రానందనుని, గొప్ప విక్రమముగల వానరరాజును జూచి గుండె ఝల్లుమనగా ఒక్కింత క్రోధము చిత్తము నావహింపగా, దశముఖుడు వెలవెలబోవుచు వినమ్రులైన ముఖములు గలిగి నిలుచున్న శుక శారణులను జూచి రోషముచేత గద్గదమై కఠినమైన మాటలతో ప్రతాపమును తెలియజేయుచు ఇట్లనెను. నేర్పుతో ఆగ్రహము నను గ్రహము చూపగల రాజుతోడ నే నిరంతరము వాని సొమ్ము దినుచు వానికప్రియములైన మాటలను చెప్పుట తగియున్నదా? మీ తెలివి తేటలిట్లు బూడిదయై పోయినవేమి? మీరలా నాకు నీతులు చెప్పు పెద్దవారలు. ఇట్లు పలుకుట తగియున్నదా? యదార్థము వచ్చియున్న శత్రువులు మనకు ప్రతికూలురు గదా. వారిని సమీపించి వారి ప్రతాపము బయలు పడునట్లు వారికి స్నేహితులవలె వారిని పొగుడుచున్నారు. మీకిది తగియున్నదా? సమయాసమయము లెఱుగ వలదా? శ్రేష్ఠగుణములు గలిగిన గురువులను, వృద్ధులను, మహాచార్యులను మొదటి నుండి శ్రద్ధాభక్తులతో సేవించి తృప్తి నందించితిరి. దానివలన ఏ యుపయోగమును కలుగక పోయెనుగదా. రాజ్యమేలు రాజులను కొల్చు పద్ధతులను మీర లెఱుగ జాలక పోవుటచే మీ చదివిన చదువంతయును నిష్ప్రయోజన మైపోయెను గదా. మీరు తెలుసుకొని యున్నను అనుభవమునకు రాకపోవుటచే ఫలితమేమియు కలుగదు గదా. బలువైన శాస్త్రజ్ఞానము యొక్క బరువును ఊరకే మోసి తిరుగుట కనిపించుచున్నది. మీయట్టి మూఢులైన మంత్రులను గట్టుకొని దేవుని దయవలన ఎట్టులో రాజ్యమును చేయుచు దేహమందు ప్రాణములను ధరించి యిట్లున్నాను. నా నాలుక ఏ శుభమును గాని అశుభమునుగాని పలుకునో అది మీకు కలుగజేయు సమర్థుడనని మీరెఱుగరా? ఇట్లు కఠినమైన మాటలను నన్ననుటకు తలపెట్టుటకు ఏమిరా మీ మనస్సులందు మృత్యుభయము లేకున్నదా? కారుచిచ్చు చుట్టబెట్టిన అడవియందలి చెట్ల సమూహము నిలిచియుండ వచ్చునుగాని ఈ భూమి యందు ప్రభువు కోపమునకు పాత్రుడైన అపరాధి

యొక్క శరీరము నిలువబోదు గదరా! శత్రుపక్షమును పొగడుచున్న పాపులగు మిమ్ము నాయొక్క కోపమనెడి మహాగ్నికి ఆహుతిగా చేయనా? మీరలిదివఱకు చేసియున్న మేలులను తలచి మది మృదుత్వమందుటచే బ్రదికితిరి. మీరు దుర్మార్గ వర్తనులు వెడలిపొండు ఛీఛీ నా సమీపమున నిలువకుడు. మీరు చేసిన మేలు తలంచి నేను మిమ్ము సంహరించుటకు చాలనైతిని. కాని మీరు నామేలు మరచి నా ప్రేమకు దూరస్థులగుటచే నశించిన వారయితిరి. అని యిట్లు దశకంఠుడు పలుకగా ఆ మంత్రులు సిగ్గుచే తలలు వంచినవారై వినయముతో జయ జయ శబ్దములు చేయుచు వేగముగా సభనుంచి వెడలిరి.

## రావణుడు శార్దూలాదులను శ్రీరాముని చర్య కనుగొని రా బంపుట:

అంత రావణుడు తన సమీపమున నున్న మహోదరుడను వానితో ఎంతయో నీతి తెలిసిన సత్ప్రవర్తనులైన గూఢచారులను అతివేగముగా పిలువబంపుమనగా వాడు ఎంతో బుద్ధిమంతులైన వేగులవారిని రాక్షసరాజు ముందట నిలబెట్టగా వారలు జయశబ్దపూర్వకముగా వినయముతో చేతులు జోడించి నిలబడగా, నిర్భయులను, భక్తులును, శూరులును, నీతి కోవిదులును అయిన వారిని చూచి రావణ ప్రభువిట్లనెను. మీరలు ఇట నుండి రాఘవుడు దండు విడిసిన చోటికి వెళ్ళుడు. ఆతడు చేయుచున్న ప్రయత్న విధమును శోధించి తెలిసికొని అంతట అతడు మనస్సున మెచ్చువారి చరిత్రమును, అతని మీద ప్రీతితో నుండెడి మంత్రివర్యులు హెచ్చుచేయు ప్రయత్నమును బాగుగా తెలిసికొనిరండు. రాఘవుడు ఏ సమయమున ఎవరు తోడుగా నుండ నెట్లు నిద్రించును? ఒంటరిగా నిద్రించునో, ఎప్పుడు మేల్కొనునో, ఎపుడేమి చేయునో సర్వమును మీరు తెలిసికొని చక్కగా రావలయును. విరోధుల విధమును బుద్ధిమంతులైన చారులచే తెలిసికొని రాజు శత్రువర్గమును యుద్ధమందు తేలికైన ప్రయత్నముచే తిరస్కరించి జయించును అనగా వల్లె యని ప్రదక్షిణము చేసి నమస్కరించి శార్దూలుడు మొదలగు వారలు వేగముగా వెళ్లి తెలియరాని మారు వేషములు ధరించి రామలక్ష్మణులు విహరించుచున్న సువేల పర్వతమునకు వెళ్లి సుగ్రీవ విభీషణులతో గూడియున్న దశరథ పుత్రులను వారి సైన్యమును జూచి తెల్లబోగా విభీషణుడు గుర్తించి వేషధారులగు గూఢచారులని వానరులకు వెంటనే తెల్పి ఈ శార్దూలుడొక్కడే పాపాత్ముడని పట్టుకొని తక్కినవారిని పారద్రోలెను. వానరులు వారిని పట్టి కొట్టి వారి పొగరణగునట్లు పిండి పిండిగావించిరి. ఆ శార్దూలుని విలాపమును విని సీతానాధుడు దయదలచిన వాడై అనుచరవర్గముతో గూడ వానిని విడిపింపగా వారును వానరులదెబ్బలచే గుండెలదరగా

★★★

# ముప్పదవ సర్గము

## రావణునకు శార్దూలుడు కపులచే తాను పడిన పాటు తెల్పుట:

ఎగ యూర్పులతో దేవతల విరోధిని చేరనరిగి సువేల పర్వతమున నా జగదీశ్వరుడు వానర సైన్యముతో విడిసినాడని చెప్పగా, రావణుడును రాముడు మిక్కిలి దగ్గరగా వచ్చెననుచు ఒకింత తత్తరమును జెంది ఆ వేగుల వానితో నిట్లనెను. శార్దూలా! నీ శరీరకాంతి ఇదివరకటి విధముగా లేదు. కందియుంటి వేల? చాల నలిగియున్న వాడవు. క్రోధముతో నున్న విరోధులకు చిక్కలేదు గదా! అనగా భయకంపితమైన చిత్తముతో వాడు మెల్లమెల్లగా నిట్లనెను. ఓరాజా! కోతులలో వేగు తీయుట యనగా ముప్పుతో గూడినపని. వారు మొక్కవోని బలముగలవారు. అమితమైన విక్రమము గలిగిన వారలు. అదియును గాక రాముని రక్షణలో నున్నవారు సుమా. వారిని చేరరాదు. ఏమని అనరాదచ్చట. ఇక నా వానరుల నేమని ప్రశ్నించెదము? దారుల యందందటను పర్వత సమానులైన కోతులు కాచుచున్న వారలు. నేను నెమ్మదిగా వెళ్లితినో లేదో నన్ను తటాలున విభీషణుని మంత్రులగు రాక్షసులు గట్టిగా వేగముగా బట్టుకొనిరి. క్రోధము చెందినవారై కొట్టిరి. ఆ వానరులు నన్ను పాదములతో దంచిరి. చేతుల వ్రేళ్ల గోళ్లతో అధికముగా నొప్పించిరి. పిడికిటిపోటులతో పిండి పిండిగ గొట్టిరి. పండ్లచే శరీరమున గాట్లు పెట్టిరి. ఉక్కిరిబిక్కిరగునట్లు, బాధ చెందునట్లు నన్ను మర్దించిరి. నన్ను బట్టి నాల్గు వైపులకు ద్రిప్పిరి. పరిహసించితిరి. నిందించిరి. త్రిప్పిత్రిప్పి వారలు నన్ను శ్రీరాముని కడకు దెచ్చిరి. నేను నెత్తురులు కాలువలు గట్టుచున్న శరీరముతో భయపడుచున్న మనస్సుతో కాపాడమని రాముని పాదములపై బడితిని. ఆ సీతానాధునిచేత రక్షింపబడి యెట్లో బ్రతికి బైటపడితిని. వానరసైన్యముచే పర్వతములతో చెట్లతో సముద్రమును నిండించి జానకీపతి గరుడ వ్యూహముతో వానర సమూహము తన్ను సేవింపగా ధనుర్ధారియై మనలంకాపురము ముందఱ నిలిచెను సుమా! ఇంద్రవిరోధీ! నన్ను విడిచిపెట్టి లంకమీద తన దృష్టిని నిలిపెను. ఆ వానర సమూహము మనపై యుద్ధమునకు రాకముందే యుద్ధము చేయుటో, జానకి నిచ్చుటో యేదో యొకటి చేయుము అని చెప్పగానే

## శార్దూలుడు రావణునకు కపుల బలపరాక్రమములు దెలుపుట:

ఆ మాటలను విని రాక్షసరాజు శార్దూలునితో నొక గొప్ప వాక్యము నిట్లు పలికెను. దేవతలు గంధర్వులు దైత్యదానవులు విక్రమముతో వారందఱు నొక్కటై ఎదిరించి వచ్చినను, అన్నిలోకములచే అధికమైన కీడు మూడినను సీత నిచ్చుట లేదు. ఇదియే నా సిద్ధాంతము సుమా. ఇది యట్లుండనిమ్ము. ఆ వానరుల బలములందు తిరిగి చూచి వచ్చినవాడవు గదా! శూరులెక్కడ నున్నారు? వారెట్టి ప్రభావము గలవారలు? అందు వారివారి బల పరిమాణము లెట్టివి? అందు బలవంతులెవరు? ఆ వానరు లెవ్వరి పుత్రులు? ఎవ్వరి మనుమలు? తెలియజేయుము. విరోధుల బలము తెలిసినచో వారి బలమేవిధముగా నున్నదో సర్వము తెలిసికొని అటు పైన చేయదగిన పని నాలోచించెదను. యుద్ధము చేయగోరువారికి శత్రువుల బలాబలములు తెలియవలసి యున్నది అని రావణుడు పల్కగానే దేవతావిరోధియగు రావణుని జూచి ఉత్తమచారుడగు శార్దూలుడు పర్వత సంచారుల విషయము నిట్లు చెప్పెను. ఋక్షరజసుని పుత్రుడు వానరరాజు సుగ్రీవుడు. అతనిని యుద్ధమందు గెలువ శక్యముగాదు. గద్గదుని పుత్రుడు ఎలుగుబంట్లరాజు. అతడే జాంబవంతుడని ప్రశస్తిని పొందినవాడు. ధర్ముని పుత్రుడు వీర్యమే ధనముగా గలవాడు. ధర్మాత్ముడు గొప్పబలవంతుడు సుషేణుడను వాడు. సౌమ్యుడు చంద్రునికి పుట్టినవాడు దధిముఖుడనువాడు. బ్రహ్మదేవుడే అపర మృత్యువులుగా భూమియందు వానరుల రూపమున సుముఖ దుర్ముఖులను శూర శ్రేష్ఠులను వేగదర్శియన్నవానిని సృష్టిచేసెను. రాక్షసరాజా! అగ్నిహోత్రుని పుత్రుడు నీలుడు శౌర్యముగలవాడు సేనానాయకుడును. నీ పుత్రుడు మొదలైన రాక్షసుల నెవ్వడు సహాయమెవ్వరును లేకుండగనే సంహరించెనో ఆతని తండ్రి బృహస్పతి పుత్రుడగు కేసరి యుద్ధరంగమున మహాప్రబలుడు. వాయుపుత్రుడు హనుమంతుడు గొప్ప విక్రమము గలవాడు. బలవంతుడు ఈతడు అంగదుడు పర్వత విరోధియైన ఇంద్రుని మనుమడు. యౌవనము నందున్నవాడు. ఓ రాక్షసరాజా! మైందుడును ద్వివిదుడును మహా మహిత శౌర్య సంపన్నులు. అశ్వినీ దేవతల పుత్రులు. వైవస్వతుని (యముని) పుత్రులు గజుడు, గవాక్షుడు, గవయుడు, గంధమాదనుడు, శరభుడు ననువారు. యమునితో సమానమైన వారు. శౌర్యవంతులు శ్రీమంతులైన దేవతల కుమారులు రణరంగమున పోరాడ సమర్థులు. సాటిలేనివారు ధీరులు పదికోట్ల వానరులు గలరు. ఇక తక్కినవారిని గూర్చి చెప్పజాలను. సింహసదృశ శరీరులు, అక్షయమైన

బలసంపన్నులు, దశరథుని పుత్రులు. రాక్షసరాజా వారిలో పెద్దవాడైన రాముడు ఒక్కడే త్రిశీర్షుని ఖరుని సంహరించిన గండర గండడయ్యా! అల విరాధుని, కబంధుని యమలోకమున కతిథులుగా పంపించిన రాముడు యముని వంటివాడు. విక్రమమున రామ విభునితో జగములందు ఒక్కడైనను సరిపోలు వాడులేడు. జనస్థానము నంతయును నాశన మొనర్చిన ఆ పౌరుషశాలి యొక్క గుణములను చెప్పుటకు తగినవాడే లోకము లన్నింటియందును గనరాడు. ఓ రాక్షసరాజా! ఇది తథ్యము సుమా. ఏనుగువంటివాడు. నివారింపరాని విక్రమముగల వాడు రాముని సోదరుడు. ఆ వీరుని కరకు బాణము బారి బడి బలవంతుడైన విరోధియైనను బ్రతకనేరడు సుమా. శ్వేతుడును, జ్యోతిర్ముఖుడును ప్రఖ్యాతి చెందిన బలముగలవారు సూర్యపుత్రులు. వరుణునిపుత్రుడు హేమకూటుడను వాడు. నలుడు విశ్వకర్మ తనయుడు. వానరవీరులలో శ్రేష్ఠుడగు సుదుర్ధరుడు వసుపుత్రుడు సుమా. రాక్షసులందెంతయో శ్రేష్ఠమైనవాడు నీ సోదరుడగు విభీషణుడు దాశరథులకు హితుడు సుమా. ఈ విధముగా వానర సేనల విధమంతయు తెలియజెప్పితిని. వారి సువేలాద్రియందున్నవారు. ఇక తక్కిన కార్యమును దీర్ప అంతటికిని నీవే దిక్కు రాక్షసరాజా! అని అపసర్పులుఁ వేగులవారు చెప్పిరి.

★★★



# ముప్పది యొకటవ సర్గము

## రావణుడు విద్యుజ్జిహ్వుని రాముని శిరస్సు చాపము గల్పింప నాజ్ఞాపించుట:

వేగుల వారావిధముగా అక్షయబలములతో రాముడు సువేలాద్రి మీద విడియుటను చెప్పగావిని ఇరువది భుజములుగల రావణుడు గుండె జల్లుమనగా నొక్కింత భయపడి మఱల ధైర్యముతో మంత్రులతో నిట్లనెను. మంత్రులారా! నీతిశాస్త్రము లెఱిగిన నేర్పరులారా! మీరందఱు వేగముగా ఇచ్చటకు రండు. వేవేగముగా ఆలోచించు సమయమిప్పుడు సంప్రాప్తించినది. అనగా వారందఱు నచ్చటికి రాగా వారితో ఆలోచించి వారిని బంపి తన భవనమునకు వెళ్ళి అచ్చటకు మహాబలవంతుడు, మాయలు పన్నుట యందు నేర్పుగలవాడు మహామాయావియైన విద్యుజ్జిహ్వుని బిలిపించి అతనిని జూచి ఇట్లనెను. విద్యుజ్జిహ్వా! భూపుత్రిని మోసము చేయవలెను. వీసమంతయైనను భేదము లేకుండ శ్రీరామచంద్రుని తలను బాణముతోగూడిన అతని వింటిని మాయచేత కల్పించి నేనున్న చోటునకు దెమ్ము అనగా అతడు అటలే యనగా కొన్ని సొమ్ములతనికి బహుమతిగా నిచ్చి అతనిని బంపించి తాను జనకసుతాదర్శన కాంక్షతో అశోకవనము ప్రవేశించెను. అచ్చట దీనురాలని, నేలవంక జూచుచున్న దానిని, తీవ్రమైన శోకముచే బాధింపబడుచున్న దానిని, దైన్యము నందదగని దానిని, పతివ్రతను, నేలపై గూర్చున్న దానిని, భయంకర రాక్షసస్త్రీల నడుమ నున్నదానిని, తన భర్తనే తలంచుచున్నదానిని, అందమైన సీతను చూచి దగ్గరకు వెళ్లి అమితమైన సంతోషమును గలిగించు సంగతి యేదియో ఆ పద్మాక్షికి చెప్పు విధముగా ధీరుడై యిట్లు పల్కెను.

## రావణుడు సీతకు శ్రీరామాదులు హతులైరని చెప్పుట:

ఓ సీతా! నన్ను చేపట్టుటకు నిన్నెంతయో బతిమాలుకొంటిని గదా. చింతాకంతయైనను నా మాటను వినక ఎవ్వనిపై నీ మనస్సు నుంచి నన్ను ఛీఛీ యంటివో అట్టి నీ ప్రాణనాధుడు నీ ప్రియుడు ఖరదూషణహంతయైన రాముడు యుద్ధమునందు చంపబడెను. ఓ సీతా! నీ యేడుపే నీ భర్తను సమూలముగా నాశనము చేసెను గదా.

నీయొక్క తల క్రొవ్వును మూలమట్టముగా ఊడగొట్టితివి గదా. నీ యిష్టము తీరునట్లుగా ఎంత యేడ్చెదవో ఏడువుము. దిక్కులేని దానవై నీవు ఏడ్చుచునైన నా హృదయేశ్వరి వయ్యెదవు. చూచుచుండుము. ఆ చచ్చినవాని గట్టుకొని ఓ అందమైన కనులు గల సీతా! యేల యేడ్చెదవు? ఇక నీ పిచ్చితనమును మానివేయుము. గౌరవముగా నా భార్యలందఱిలోనను రాణివై బ్రతుకుము. అన్నియును నాకే తెలియునని భ్రమించుదానా! పుణ్యహీనురాలా! మాత్సర్యము గలదానా! నీ సౌఖ్యమును నీవే నాశనము చేసుకొనుదానా! మూర్ఖురాలా! దుర్మతీ! వినుము వృత్రాసురుడు వధింపబడి నట్లుగా ఘోరమైన నీ భర్త యొక్క వధ విధానమును వినుము. నీ భర్త వానర సేనా సహితుడై నన్ను జంపుటకు సముద్ర తీరమునకు వచ్చెను. సూర్యుడస్తమించు సమయందు సూర్యపుత్రుడు తెచ్చిన సేననో లవణ సముద్రపు టుత్తర తీరమున చేరెను. ప్రయాణపు బడలికచే రాముడు నిద్రించెను. రాత్రివేళ నేను పంపిన వేగులవారు పరీక్షించి తిరిగి వచ్చి చెప్పగా ఆ తరువాత సేనలతో ప్రహస్తుడు విరోధులు విడిసిన చోటును సమీపించునట్లుగా మెల్లగా వెళ్లి శరములతోను, దండములతోడను, ఖడ్గములతోడను, శూలములతోడను, శక్తి చక్ర పరిఘములతోడను, ముద్గరములు తోమరములతోను నిద్రచే తూగుచున్న భయపడుచున్న కపివీరుల నందఱను వేగముగా సంహరించిరి. గుఱకలండుచు నిద్రించుచున్న రాముని శిరమును మెఱుపు మెఱసినట్లు మెఱసి ప్రహస్తుడు పెద్ద కరవాలముచే కఱకఱమని ధ్వని యగునట్లు నఱికెను. ఆకాశమున నెగురుచున్న విభీషణుని మావారలు పట్టి బంధించిరి. ఆ కోతులలో నొక కోతియై లక్ష్మణుడు దిక్కులవెంట పరువెత్తెను. వానరరాజైన సుగ్రీవుడు తెగగొట్టబడిన కంఠముగలవాడై భూమిపై పడెను. హనుమంతుడు తెగిన దవడలు గలవాడై పట్టు వదలి తన ప్రాణములను తన తండ్రియైన వాయువునందు గలిపెను. జానకీ! జాంబవంతుడు, రాక్షసులు వేగవంతములైన పట్టి సాద్యాయుధములతో మోదగా మోకాళ్లు విరిగి నేలబడగా విలపించుచు ఎలుగుబంటి గనుక దొర్లుచు ఎలుగులిడుచు (బొబ్బలు పెట్టుచు) మృతి చెందెను. రాక్షసబృందము తమ్ము బాధింపగా భయపడినవారై వగర్చుచు, ఏడ్చుచు విచారముచే క్రుంగిపోవుచు మిగుల కళవళపడుచు మృతిచెందిరి. పనసకాయను కొట్టిన విధముగా చిన్న చిన్న ముక్కలుగా చేయగా సత్తువ తగ్గి పనసుడు నెత్తుటిలో బడి దొర్లుచున్నాడు. ఓ పూబోణీ! (పువ్వు వంటి శరీరముగలది) ఇంకను భర్తకొఱకై ఏల ఎదురుచూచెదవు? వాడి బాణములచే శరీరము నీరసపడి దరీముఖుడు దరీముఖమున

(కొండ గుహయొక్క అగ్రభాగమున) చచ్చిపడెను. ఒక్కకేక కూడా వేయక కుముదుడను వాడు కుతిలపడి శరపరంపరలకు శరీరమప్పగించెను. శరీరమునుతుండె తుండెములుగా ఖండింపగా అంగదుడు దుల్లిన అంగదములు గలవాడయ్యెను. గొప్ప బలవంతులైన రాక్షసులు ఒక్కపెట్టుగా పైబడి ఇష్టము వచ్చినట్లుగా రథములను ఏనుగులను గుఱ్ఱములను మీదకు పరువెత్తింపగా ఓ జానకీ! వానరులు కొందఱు ఏనుగులు త్రొక్కగా నలిగి చచ్చిరి. కొందఱు రథములు మీద పారుటచే నజ్జు నజ్జై నెత్తురు ముద్దలైరి. కొందఱు నలిగి నలిగి ఇటు నటు బడి చచ్చిరి. కొందఱు భయముచే మృతిచెందిరి. కొందఱు పారిపోయిరి. కొందఱు ఎగిరిరి. విరిగి పడిరి. ఇకనేమని చెప్పుదును సింహముచేత గజసంఘముల వలె కొందఱు వానరులు చచ్చిరి. కొందఱు సముద్రమున మునిగిరి. కొందఱు భయముచే ఆకాశమున కెగిరిరి. వానరుల సహజ స్వభావమైన చెట్లనెక్కుట తమకు సాయపడగా కొండముచ్చులు ఎలుగుబంట్లు వృక్షములనెక్కిరి. వనములందు గుహలయందు వానరుల శవములు నిండినవి. నా సేనలిట్లు చంపగా నీభర్తయు సైన్యములును మృతిచెందిరి. ఇంక నీ కేది దిక్కు? అని చెప్పి ఆమె వినుచుండగా రాక్షసితో నిట్లనెను.

## రావణుడు సీతాదేవికి రాముని కల్పిత శిరము విల్లు చూపుట:

ఓసీ! గొప్ప క్రోధము గల విద్యుజ్జిహ్వుడు యుద్ధభూమి నుండి రాముని శిరమును తెచ్చియున్నాడు. నీవువెళ్లి ఆ రాక్షసుని నిచ్చటికి తీసికొని రమ్ము. అని చెప్పుచున్నంతలోననే రాముని శిరస్సును వింటిని తీసుకొని రావణుని యెదుట నమస్కరించి నిలబడగా రావణుడు పెద్దనాలుక గలవాడగు ఆ విద్యుజ్జిహ్వునితో నిట్లనెను. ఓరీ వేగముగా రాముని శిరస్సును సీతయెదుట నుంచుము. కన్నులార నిర్భాగ్యుడైన తన ప్రాణనాధుని చరమదశను బాగుగా చూచును అని చెప్పగా ఆ మానవ భోజి అట్లే చూచుటకు అందముగా నున్న ఆ శిరస్సును జానకి ఎదుట నుంచి తిరిగి వెళ్లగా రావణుడు రాముని శిరమును విల్లును భూపుత్రి ముందునకు ద్రోసి ఇదే జానకీ! లెస్సగా జూడుము. యుద్ధరంగమున రాత్రి మా ప్రహస్తుడు శౌర్యముతో నీ మనోహరుడైన రాముని వధించి అతని ఎక్కిడిన విల్లు తెచ్చెను సుమా. ఓ తామరల వంటి నేత్రములు గలదానా! జానకీ! ఇంక ఆలస్యమెందులకు? నాకు వశపడుము అని పల్కగా

★★★

# ముప్పది రెండవ సర్గము

## శ్రీరాముని మాయాశిరశ్చాపంబులను జూచి సీత దుఃఖించుట:

ఆ సీత ఆ శిరమును వింటిని జూచి ఆంజనేయుడు చెప్పిన సూర్యపుత్రుని స్నేహమును తలంచి యేమియు తేడాలేని ముఖమును ఆకన్నులవంటి కన్నులును, ఆ ముంగురుల వంటి ముంగురులను ఆ ముఖ పద్మము యొక్క రంగును శుభప్రదమైన ఆ చూడారత్నమును, ఆ గజరాజగమన యగు సీత చూచి తమకముతో భర్త శిరస్సని నమ్మి గొప్పనైన ఆర్తితో కురరి (గొఱ్ఱె) వలె మిక్కిలిగా ఏడ్చెను. హా కలహాశీలురాలనైన కైకా! నీ కోరిక తీరెను గదా. సూరయుంశమనెడు క్షీర సముద్రమునకు చంద్రుని వంటివాడగు రాముడు అస్తమించెను. తెగించిన దానవై వంశమును వృద్ధినందించు విత్తనమును పాడు చేసితివి. ఇంక నిర్భయముగా గుండెపై చేతులుంచుకొని సుఖింపుము. మహానుభావుడైన కాకుత్థ్సుడు నీకేమి చెఱుపు గావించెను. నాతోగూడ ఆయనను ఆ విధముగా నారవస్త్రములు గట్టించి కక్షతో అడవులందు ద్రోయుటకు ఏమి అపకారము చేసెను. అని విదేహ రాజపుత్రి గొప్పనైన తపములు వ్రతములచేసిన పవిత్రురాలు. హా అని విలపించెను. ఆ చిన్న వయస్సు కలిగిన సీత దుఃఖముచే కంపించి పోవుచున్నదై విలపించుచు నరుకబడి నేలపై వ్రాలు అరటివలె పడి మూర్ఛ మునిగి తిరిగి మెలకువ చెంది ఆ శిరస్సును తీసుకొని మూర్కొనుచు హా మహా బాహా! రణధీరా! హా మంచి వీరుడా! అయ్యయ్యో! ప్రాణనాధా నాశనమైతివా? ఇట్టి నీ చివఱి దశను నేను చూచి ఓ విక్రమమే ధనముగా గలవాడా! ఇప్పుడు వైధవ్యము నందితిని. భార్య గుణహీనురాలైనచో భర్త ముందుగా మృతినందునని పండితులు చెప్పుదురు. పొగడబడిన శీలము గలవాడా! నీవు నా పాపము చేతనే నేను బ్రతికియుండగా మృతినందితివి. పద్మములవంటి కనులు గలవాడా! నేను పాపాత్మురాల ననుటకు సందేహమా! ఆపదల మీద ఆపదలు వచ్చి వ్యథయను సముద్రమున నేను మునుగుచుండగా అండగా నిలుచుటకు తెప్పవలె పూనుకొని ప్రయత్నము చేయుచున్న నిన్ను అయ్యయ్యో! పాపపు మృత్యువు తీసికొని పోయెను గదే. ఇంతకంటే పాపముండునా? గౌరవింపదగిన రామభద్రా! ఇట్టి క్రూరమైన వార్త హృదయశల్యమై వినబడగానే సాధుశీలయైన మా అత్త కౌసల్య హా!

పుత్రా! పుత్రా! రామచంద్రా! యని దుఃఖమునందు మునిగి లేగను బాసిన గోవువలె ఎంత విచారించునో గదా! అయ్యారే! శాస్త్రవేత్తలు ఓ అసమాన పరాక్రమా! నీకు దీర్ఘాయువని చెప్పిరి గదా! ఔరా ప్రాణనాధా! వారి పల్కులసత్యము లయ్యెనే! నీవిట్లల్పాయుష్కుడవైతివి. ఓ అనఘాత్మ! నీకకాల మృత్యువెట్లయ్యెనో ఆ శాస్త్రవేత్తల కట్లే బుద్ధి హానియయ్యెను. ఇంతకును దైవతమే కారణము గదా! ఓ ప్రాణేశ్వరా! నీవు నీతిశాస్త్రములన్నియు తెలియని వాడవు కాదు గదా! ఇవి చేయవచ్చును, ఇది చేయరాదని తెలిసిన నిన్ను కనబడని విధముగా అపమృత్యువు నిద్రయను నెపమున నిన్ను మ్రింగినది. ఎంత తెలివి యున్ను దైవమున కడ్డపడుటకు శక్యము గాదు గదా! ఓ తామరరేకుల వంటి నేత్రములు గల రామా! నిర్దయాత్మురాలను, క్రూరురాలను, మహా క్రోధము గలదానను, ఘోర పాపాత్మురాలను, కాళరాత్రి వంటి దానను అయిన నన్ను నీవు చేరదీయుటచే నీకింత చేటు తెచ్చినదానను. ఓ గొప్ప బాహువులు గలవాడా! నీ ఒద్దిక చూడగా, నేను మహానిష్ఠలతో నెల్లప్పుడు వర్తించుచుండగా రామా! నీవు భూమియను ప్రియురాలిని ఆలింగనము చేసుకొని ప్రేమతో నున్నావా? నన్నిచ్చట వీడితివా? నేనెల్లప్పుడు గంధ పుష్పములతో పూజించినట్టియు నాకు ప్రియమైనదియు కనకనిర్మితమును అయిన నీ విల్లు నేడు ఓ వీరుడా! దిక్కులేకుండగా ఇట్టి గతి పట్టినది గదా. ఓ ప్రాణనాధా! నామామగారు నీపై ప్రేమగల వాడగున తండ్రితోడను, పితృదేవతల తోడను, ఇంద్రలోకమున సౌఖ్యములనుభవించుచు నున్నవాడవా? శుభ పుణ్యశీలురకు మిక్కిలి ప్రియమైనదియు, పుణ్యవంతము నయి పేరు గాంచిన నీ వంశమును నీతిశీలా! ఆకాశమున నక్షత్రరూపమున నిలిచి చూచుచున్నావా? చిన్న వయసుదాననుగదా! బాల్యమందు నీకు సంప్రాప్తించితిని గదా. వల్లభా! పతివ్రతుడు, సహధర్మ చారిణిని భార్యను, పత్నిని ఓ శుభశీలా! నన్ను చూడవేల? ఒక్క మాటయైనను పల్క వెందులకు? ఏమి కోపమా! ప్రాణేశ్వరా! ఇది నా దారుణమైన పాపమా? పెండ్లిలో నాచేయి పట్టిన నాడు నిన్ను విడువనని ప్రమాణమును చేయుట మరిచితివా? ప్రాణనాధా! నీవనుభవించు నట్టి సుఖమును దుఃఖమును సమానముగా అనుభవించెదను కనుక ఓ నీరజాక్షా! నన్ను నీతో గొనిపొమ్ము. లోక కీర్తిని గన్నవాడా! నీ ప్రాణకాంతయైన నేనిచ్చట దుఃఖించుచుండగా నన్ను వీడివెళ్లుట న్యాయమా? నాయకా! నాకు దిక్కు నీవేకదా! న్యాయమైన నడవడికలవాడా! పరలోకమునకు ఒంటరిగా వెళ్లుట తగియున్నదా? కర్పూర మిశ్రితమైన చందన గంధములతోడను క్రొత్తనైన ఆభరణముల తోడను ప్రకాశించుచు నా ఒక్కదాని యొడిలోననే (ఇది శ్రీరాముని యేక పత్నీవ్రతమును స్థాపించుచున్నది)

సుఖము చెందునట్టి నీ శరీరము అయ్యో! రాజశ్రేష్ఠుడా నేడు కాకుల గ్రద్దల పాలయ్యెనా? అగ్నిష్టోమాది యజ్ఞముల అగ్నులను పరిపూర్ణముగా తృప్తినందించి నీ వంశపూర్వులైన రాజులవలె ఆ యగ్నులచే సంస్కారమునందుట నీకు గలుగదయ్యెనే! లక్ష్మణుడొంటరిగా అయోధ్యకు వెళ్లగా కౌసల్య ఆతనిని జూచి నాయనా! వనములకు మీరు ముప్వురును కలిసి వెళ్ళితిరే? ఇట్లు ఒక్కడవే వచ్చితివేమి? తక్కిన వారేమైరని అడుగగా ఆతడప్పుడు రాత్రి నిద్రించుచుండ నీవు రాక్షసబలములచేత సైన్య సమేతముగా చంపబడుటయును, ఈ విధముగా నేను రావణుని ఇంట నుండుటయును చెప్పగా జీవితేశ్వరా! విని బిగ్గరగా యేడ్చి కంగారుపడి విలపించుచు, పలవరించుచు శరీరము జలదరింపగా ఇటునటు తిరుగుచు దైన్యముతో రోదించుచు విలపించి విలపించి గుండెపగిలి మృతిచెందును గదా. శౌర్యముతో మహిమ సముద్రుడు, ప్రేమమూర్తి, రామచంద్రుడు అల్పురాలనగు నాకొఱకై సముద్రమును గోవుపాదమంత అల్పమైనదిగా నెంచి దాటి వచ్చియును అర్థముకాని విధముగా కూలెను. ఈ దురదృష్టవంతురాలికి అటువంటి దివ్యగుణ ధన్యుడు దక్కునా? పాపినైన నన్ను తన కులపాంసని నని తెలిసికొనలేక పాపరహితుడగు రామభద్రుడు ప్రేమతో వివాహమున నన్ను పరిగ్రహించెను. నా పాపముచే రామునకు భార్యయే మృత్యువయ్యెను. భార్య చేసిన పాపము పుణ్యమే భర్తకు కీడును శుభమును గలుగుజేయును గదా. నేనేదో పూర్వ జన్మమున నిశ్చయముగా పవిత్రమైన కన్యాదానము దారుణముగా పాడుచేసియుందును. దానిమూలముననే సర్వలోకముల జనులచే పూజింపబడువాని భార్యనై యుండియు ఎన్నియో భోగములనుభవింపవలసిన సమయమున ఇట్లు ఘోరమైన దుఃఖములనెడు అగ్నులచేత మాడ్చబడుచుంటిని గదా. ఓ రావణా! నీకు మేలు కలుగును. నన్ను ఆలస్యము లేకుండా రామచంద్రుని మీద పడవైచి భార్యను భర్తను గలిపి గొప్ప మంగళకార్యము గావింపుము. రాముని శరీరముతో నా శరీరమును అతని శిరస్సుతో నా శిరస్సును సమకూర్చుము. ఆ మహితాత్మకు దేగిన గతికే నేనును వెళ్లెదను. అని కమలముల వలె విశాలమైన కన్నులు గల సీత తన హృదయనాధుని శిరస్సును ధనువును మఱి మఱి చూచి చూచి విలపించుచు ఏడ్చుచు ఆరాటమునందుచు విచారింప సొమ్మసిల్లుచుండెను.

## మంత్రులు పిలువ రావణుడు కొలువునకు బోవుట:

అంతలో ద్వారపాలకాధ్యక్షుడు వచ్చి హస్తములు జోడించి ఆర్యపుత్రా! జయము జయ మనుచు జయ శబ్దములు చేసి దేవా! ప్రహస్తుడు నీ దర్శనము గోరి తక్కిన మంత్రులతో

వాకిటియందు కాచియున్నాడు. ఓ రాజా నన్ను తన రాకను తెలియజేయుమనగా వచ్చితిని. రాజువైన నీవే చేయవలసిన ఆవశ్యకమైన పని గలదట విజయము చేయుమనగా దశముఖ డశోకవనమును విడచి సభకు వెళ్లి అచ్చట రాముడు చేయుచున్న ప్రయత్నమును విని చేయవల సిన కార్యమును గురించి ఆలోచించుచుండెను. ఇచ్చట అసోకవనమునందు రావణుడాచోటు విడచి వెళ్లిన వెంటనే చూడగా రావణుడు చూపించిన తలయు విల్లును మాయమయ్యెను. అచ్చట రాక్షసరాజు ఎల్ల కార్యములను విమర్శచేసి ఆలోచించి తనయొద్దనున్న గొప్ప సేనానాయకులతో అప్పటికి తగిన మాటలతో నిట్లనెను. స్పష్టముగా భేరీనాదములు చేయించి రాక్షస సైన్య సమూహమునందు యుద్ధ ప్రయత్నమును చేయదగును గాని యుద్ధకారణమును వారికి చెప్పబోకుడు [రావణాసురుని యుద్ధ భటులకు యుద్ధ కారణమేమియో తెలియదు. ఈ దుర్వృత్తి యిప్పటి ప్రభువులందును కననగును గదా. సత్యము చెప్పిన అన్యాయ యుద్ధమును భటులు చేయరని భయముచే రావణుడు చెప్పవద్దు అనెను.] వారందఱును అట్లేయని వారి సైన్యముల నన్నింటిని నొక్కచోట నిలబెట్టి వేగముగా ఆ విధమును యుద్ధమందు కోరికతోనున్న రాక్షస ప్రభువుతో చెప్పిరి.

★★★



# ముప్పది మూడవ సర్గము

## సరమ సీతాదేవిని సమాధానపర్చుట:

అచట ఆశోకవనమున రావణునాజ్ఞచే రక్షించునట్టి సరమయను స్త్రీ, దృఢమైన నియమములు గలది, దయగలది, తనకు స్నేహితురాలు తనచేత కాపలా కాయబడుచున్న సీత రావణునిచే వంచింపబడి భరింపరాని దుఃఖముతో తపించుచు ముగ్ధమయిన జానకి తెలివిదప్పి భూమిమీద పడి దుమ్ము గొట్టుకొని ఆడ గుఱ్ఱమువలె నుండుటను జూచి ఆమె దగ్గఱకు వెళ్లి మృదువైన మాటలతో నూరడించుచు ఇట్లు పల్కెను. జానకీ! ఊరడిల్లు మూరడిల్లుము. మాయాగాడైన రావణుని మాటలను బట్టి విచారించెదవేల? తపింపవలదు. సీతా! రావణుడిప్పుడు నీవు బెదురునట్లుగా చెప్పిన విధమును ఆపై నీవు బదులు చెప్పుటయును నే నాకాశమున కనపడకుండ ఉండి అంతయును విన్నాను. రావణుని భయముచే బయలుపడలేదు. ఓ చంద్రముఖీ! నీ కొఱకు నాజీవితమునందైనను ప్రీతినందను. ఓ పద్మముల వంటి నేత్రములు గలదానా! రాక్షసరాజిప్పుడు భయముచే బెదురుచు కంగారుగా వెళ్లిన విధమును చూచి నేను బయటకు వెల్లి యదార్థమును తెలిసికొంటిని విశదముగా చెప్పెదను సీతా! వినవమ్మా! ఓ సీతమ్మా! నిద్రపోవునప్పుడైన విజ్ఞుడైన రాముని హింసించుట సాధ్యమైన పనికాదు. [కౌసల్య కట్టిన రక్షచేతను, విశ్వామిత్రుడు దుపదేశించిన బల అతిబలలను విద్యలచేతను శ్రీరామునకు నిద్రయందైనను కీడు కలుగజాలదు] నీ భర్త అంతము నొందలేదు. చెట్లే ఆయుధముగాగల వానరులందఱు నెమ్మదిగా నున్నారు. దేవతల నింద్రుడివలె రాముడుకాపాడుచుండగా వారిని నొప్పించుట సాధ్యముకాదు. ఓ సీతా! విశాలమైన వక్షము గలవాడు పొడవై గుండ్రనైయొప్పుచున్న బలసిన బాహువులు గలవాడు, శౌర్యముగలవాడు ఎల్లప్పుడును భూమియందు ప్రసిద్ధినందినవాడు ప్రఖ్యాతి గలిగిన విల్లు ధరించినవాడు. మంచి శరీరము గలవాడు. మనోహర సౌందర్య లక్ష్మికి విధియైనవాడు. మహా గొప్పదైన బాహు పరాక్రమములుగలవాడు. నీతిశాస్త్రము తెలిసిన వారలలో శ్రేష్ఠుడనబడువాడు. సోదరుడైన లక్ష్మణునితో గూడి ప్రకాశించుచున్నవాడు. ఓ జానకీ! నీ భర్త కుశలియై యున్నాడు

సుమా. ఓ సీతా! శత్రుసైన్యములను నాశనము చేయువాడు చెప్పరాని బలసమేతుడు నగు రాముడు హింసింపబడడు సుమా. తెలివి తక్కువ పనులు చేయువాడు సర్వభూతములకు విరోధియైనవాడు మాయలను బాగుగా తెలిసిన మాయకాడు ఆ క్రూరకర్ముడు నిన్నింత దుఃఖపెట్టెను. ఇక దుఃఖములన్నియును పోయినవి. శుభము సమీపింపనున్నది. సీతా! నిన్ను జే జే యని భజించుటకు సిరి వచ్చును. ఎక్కువ సంతోషము ప్రీతి కలిగించు వార్తను చెప్పెదను. వినుము.

## సీతాదేవికి సరమ యుద్ధ సన్నాహము దెలుపుట:

ఓ జానకీ నీ భర్త వారధిని దాటి వానరసేనతో దక్షిణ తీరమును జేరినాడు. సముద్ర తీరమందున్న వానరసైన్యముచే రక్షింపబడుచు ప్రకాశించినాడు. పూర్ణమనోరథుడైన రాముని కనులార చూచితిని. తమ్మునితో గూడి యొప్పుచున్నాడు. అల్పపరాక్రములైన రావణ ప్రేరితులైన రాక్షసులు రాముడు సముద్రమును దాటినాడను వార్తను దెల్పగా దానిని విని రావణుడు తన మంత్రులతో మంత్రాంగము చేయుచున్నాడని చెప్పుచుండగా అంతలో యుద్ధమునకు బయలుదేరుచున్న సైనికుల భయంకర ధ్వనులును, దండఘట్టితములైన బేరుల ధ్వనులును వినవచ్చెను. గొప్ప ధ్వనిని వినుచు మధురమైన మాటలు చెప్పగల సరమ సీతతో నిట్లనెను. ఓ పిరికిదానా! అదిగో వింటివా? తొందరతో సాగుచున్న సమర సన్నాహములొప్పుచున్నవి. మేఘ గర్జనలతో సాటివచ్చు గంభీరమైన భేరుల మ్రోతలు అధికమగుచున్నవి. ఘీంకరించుచున్న యేనుగులను సిద్ధము చేయువారు. సన్నద్ధములైయున్న రథములకు గుఱ్ఱములను గట్టి సిద్ధపరచువారలు, జాతి గుఱ్ఱ వచ్చుచున్న రౌతులు. ప్రాసములను చేతబట్టి అట నట ఔద్ధత్యముతో మూగుచున్న పదాతులైన భటులు సిద్ధమగుచున్నారు. పురమందలి రాచబాట లన్నియు మిక్కుటమైన సేనల సంరంభముతో నిండియున్నవి సుమా. ఓ జానకీ! ధగధగ మెఱయు ఖడ్గములును, ధృఢమైన చర్మ నిర్మితములైన కవచములును, ఏనుగులు, గుఱ్ఱములు రథములు రాక్షసవీరులు ధరించిన ఆభరణములు కాంతులను ఆకాశమునందు నింపుచున్నవి. అదిగో చూడుము. నడి వేసవి కాలమందు అడవులను తగులబెట్టు కార్చిచ్చు వలె సైన్యముల దట్టమైన కాంతి అధికమై ప్రకాశించుచున్నదిప్పుడు. పద్మమువంటి నేత్రములుగల ఓ సీతా! వినవమ్మా ఘంటల ఘణఘణలు రథముల దబదబలు వినుము. ఆలకింపవమ్మా! గుఱ్ఱముల సకిలింపులు వినవమ్మా! వాద్యధ్వనులు. అది ఆయుధముల నెత్తిన రాక్షసరాజు

అనుచరులైన రాక్షసులు సంభ్రమముతో రోమములు నిక్కపొడుచు కొనునట్లు చేయు సందడి సుమా. సంతాపమును పొందకమ్మా! వ్యసనమును పోగొట్టు సంతోషలక్ష్మి నిన్ను చేరగలదు. రాక్షసులకు చెడుకాలము రాగలదు. రోషమును జయించిన వాడును, ఊహింపరాని విక్రమము గలవాడు తామరల వంటి కన్నులు గలవాడు దేవేంద్రసమానుడు నయిన నీ భర్త రావణుని వధించి నిన్నేలగలడు. విష్ణువు సహాయపడగా ఇంద్రుడు శత్రువులను వధించిన విధముగా సుమిత్రాసుతునితో గలిసి నీ భర్త రాక్షస సైన్యముల నెల్ల నాశనము చేయును. ఓ జానకీ! శత్రుంజయుడైన నీ పతి తొడపై నీవు సంతోషముతో నుండ నేను చూడకపోదునా? ఓ వెలదీ నీవు నీ భర్తను గ్రుచ్చి కౌగిలించి ఆనందబాష్పము లాతని ఱొమ్ముపై విడువక పోదువా? ఇన్ని దినముల నుండి మెలికలు బడి పాదములంటుచున్న నీ జడను నీ నాధుడు చిక్కుదీయకుండునా? చంద్రబింబమువంటి నీ నాధుని ముఖమును జూచి పాము కుబుసమును విడిచినట్లుగా నీ వ్యధనంతను విడువకుందువా? రామచంద్రుడు వేగముగా రావణాసురుని యుద్ధమందు సంహరించి ప్రియభార్యవైన నిన్ను గలిసి సౌఖ్యపడదగినవాడగు ఆతడు భోగములనెట్ల అనుభవింపగలడు. ఓ జానకమ్మా సంతోషమును పొందుమమ్మా! వర్షాకాలమున వానలు గుఱిసినచో పైరులతో నిండి భూమి అలరునట్లు వీరుడు, మహాత్ముడునైన నీ భర్తను గూడి నిండైన సంతోషమును పొందెదవు. చక్రాకారముగా తిరుగు హయమువలె మేరుపర్వతము చుట్టు తిరుగుచు దయతో జగములకు సౌఖ్యమును గలుగ జేయు నీ దైవమైన సూర్యుని విశ్వాత్మకుని శరణు పొందుము.

★★★



# ముప్పది నాలుగవ సర్గము

## సీతాదేవి సరమను రావణుని మనోనిశ్చయం బెఱిగి రమ్మనుట:

సూర్య కిరణములచేత తప్తమయిన భూమిని వర్షధారలచే చల్లపరుచు ఆకాశమువలె రాక్షసరాజుచేత మోహపెట్టబడి దుఃఖవిచారములలో మునిగిన సీతను స్నేహము యొక్క ఆధిక్యుచే సంతోషపరచి సరమ చిరునవ్వు నవ్వుచు కాలము గుర్తెరిగినదై ఇట్లు చెప్పెను. ఓ బాలా! నే నెవ్వరికిని కనబడకుండ నీ క్షేమమును, నీ మాటలను రామునకు చెప్పి తిరిగి రాగలను. ఆకాశమున నేనాధారము లేకుండగా వెళ్లునప్పుడు ఓ సీతా! నన్ను అనుసరించుటకు పక్షులరాజైన గరుత్మంతున కైనను వాయువునకై నను ఏవిధముగను శక్యముగాదు. అని సరమ చెప్పగా సీత శోకము విడిచి తియ్యనైన మాటలతో సరమతో నిట్లనెను. ఓ సరమా! నీవు ఆకాశమున నైనను పాతాళమునకైనను అలసట లేకుండా వెళ్లి రాగలవు. నా నిమమిత్తము సాధ్యముగాని కార్యమైనను వేగముగా చేయగలవు. ఓ సాధువైన బుద్ధిగలదానా! సరమా! ఒక కోరికను వినుము. నీవు నాకు మేలు చేయుటయందు నిశ్చలమైన మనస్సు గలదానవేని ఓ స్నేహితురాలా! నీవు వేగముగా వెళ్లి రావణుడేమి చేయుచున్నాడో తెలిసికొని రమ్ము. మాయగాడు, దయలేనివాడు దురాత్ముడు శత్రువు అయిన రావణుడు త్రావిన వెంటనే మద్యము మోహపెట్టినట్లు నన్ను ఆ విధముగా మభ్యపెట్టెను గదా. (రామునకు సందేశ మంపనొల్లక సరమ చనవు చెడకుండ చెప్పిన పని ఇది) కావలియున రాక్షసీ గణములు ఆదరించి బెదరించుచుండగా బెదురుచున్నదానను. ఏ వేళకేమి ఆపద వచ్చునో అని సందేహముతో చచ్చుచున్నాను. మనస్సునకు స్వస్థత లేదు. అశోకవనమున నుండుటచే అతని వలని భయముతో విలపించుచున్నదానను. వాని చరిత్రయు, వాని నిశ్చయమును కొంచెమైనను ఓ సరమా! తెలియరాకున్నది. కనుక దయతో వాని విధమునంతయును తెలిసికొని వచ్చి చెప్పుము. ఓ మంచి నడవడి గలదానా! నాకదే మహోపకారము. అనగా సరమ మంచిమాటలతో ఆమెనోదార్చి కన్నీళ్లు తుడిచి యిట్లు చెప్పెను. ఓ సీతా! నీ కోరిక యిదియే యైనచో ఇదిగో ఇప్పుడే వెళ్లి శత్రువు మనస్సును తెలిసికొని వేగముగా తిరిగి వత్తును. ఓ ముగుదా! నీవును సంతోషము నందిన మనస్సుతో నుండుము.

## సరమ సీతాదేవికి రావణుని నిశ్చయం బెరిగించుట:

అని చెప్పి సరమ రావణుని చేరబోయి ఆ దుష్టుడు మంత్రుల సమూహముతో చెప్పుచున్న విధమును, వానియొక్క నిశ్చయమును తెలిసికొని ఒక్క ముహూర్త కాలములోననే అశోకవనికి తిరిగి వచ్చి పద్మములు లేని లక్ష్మి వలనై తనరాకకై ఎదురుచూచుచున్న ఆ సీతను చేరగా ఆ సీతయు ప్రేమతో సరమను కౌగిట జేర్చి తానే కూర్చుండుటకు పీఠమునిచ్చి ఇట్లనెను. సుఖముగా శ్రమదీరునట్లు నీవిందు కూర్చుండి ఆ కఠినుడైన దుష్టని హృదయ విధము సర్వమును దెలియజెప్పుము. అని వణుకుచు అడుగుచున్న జానకీ దేవితో సరమ మంత్రులతో గలిసి రావణుడు చేసినా లోచనలను సర్వమును యదార్థముగా నిట్లు చెప్పెను. ఓ చంద్రముఖీ! వినవమ్మా! రావణుని తల్లియు, అవిద్ధుడను వృద్ధ మంత్రియు శ్రీరామచంద్రునకు సీత నిమ్మని అనేక విధముల బోధించిరమ్మా! ఇదివఱకు జనస్థానము నందు జరిగిన అద్భుతమును నిదర్శనముగా కీర్తించి చెప్పిరమ్మా! సముద్రమును దాటి హనుమంతుడు వచ్చుట, నిచట నిన్ను చూచుట రాక్షసులను సంహరించుట. మనస్సునందు దలంచిన ఇవి మానవమాత్రుడైన వాడు చేయగలిగిన పనులా అని ఆలోచింపవలదా? అనుచు బోధించినను ధనము నందాస గలవాడు ధనమును విడువనట్లు రాక్షసరాజు నిన్ను విడుచుట కిష్టపడడయ్యెను. తన ముక్కున ఊపిరి యున్నంతవఱకు ఆ మూర్ఖుడు నిన్ను విడువబోడు. త్రోసుకొని వచ్చుచున్న మృత్యువునకు లోబడిన వాడగుటచే వాని బుద్ధి స్థిరమైనది. వాడీ బెదరింపులకు బెదరువాడు కాడు. ఓ తరుణీ! తానును, ఈ రాక్షసులను చచ్చుదనుక నిన్ను రాముని కర్పింపజాలడు సుమా! ఓ అభిమానవంతురాలా! నీ భర్త వాడియైన బాణముల వరుసలచే రాక్షసరాజును సంహరించి తప్పక నిన్నయోధ్యా నగరమునకు తోడ్కొని పోగలడు. మనస్సు నందనుమానమును మానుము. అని సరమాదేవి పల్కుచున్నంతలో వానరసేనల భేరుల మ్రోతలుచే భూమి దద్దరిల్లునట్లు వినిరాగా ఆ లంకాపట్టణమున నుండు రాక్షసులెల్ల భయమునిండిన మనస్సులతో చిన్నబుచ్చుకొన్న ముఖములతో తమ రాజు చేసిన దోషమునకు తమ ప్రాణములమీద ఆశలను విడచిరి.

★★★

# ముప్పదియైదవ సర్గము

## మాల్యవంతుడు సీతాదేవి నిమ్మని రావణునకు నీతి బోధించుట:

అట్లు శంఖముల భేరులు మ్రోయుచున్న ధ్వనులు హెచ్చుగా శత్రుపురంజయుడగు రామభద్రుడు వచ్చుచుండ ఆ ధ్వనిని విని ఒక్క ముహూర్తకాల మాలోచించి మంత్రులందఱును జూచి క్రూరాత్ముడు, లోకములకు మనోవ్యథ గలుగజేయువాడు నగు రావణుడు తిట్టుచు కేకలు వేయుచు ఇట్లు పల్కెను. సైన్యములతో గూడి సముద్రమును దాటి ఆ రాజపుత్రుడు వచ్చెనని మీరందఱు చెప్పుటచే నేను చెవులతో విన్నాను. మీరందఱును భూపుత్రి భర్తయొక్క గొప్ప దర్పమును విని మౌనము దాల్చి ఒకరి మొగము నొకరు చూచుకొనుచున్నను మీరందఱును యుద్ధమునందు గొప్ప పరాక్రమము గలవారని నేనెరుగుదును. నేను మిమ్ము నమ్మి ఏమియు ఆలోచింపక ఎంతటి కార్యమునైనను చేయగలిగితిని. అని ఇట్లు రావణుడు పల్కగా రావణుని తల్లికి పినతండ్రియైన మాల్యవంతుడను రాక్షసుడు సాటిలేని విజ్ఞానము గలవాడు ఇట్లు నీతియుక్త విధానముగా చెప్పెను. రాజ ధర్మములను దెలియజేయు నీతివిద్యలందు పండితుడై నీతి ననుసరించువాడు చిరకాలము ఐశ్వర్యముతో రాజ్యమేలును. శత్రువర్గమును తన వశము చేసికొనును. సమయోచితముగా శత్రువర్గముతో యుద్ధమును గాని సంధిగాని చేయుచుండవలయును. దేవతలను జయించిన ఓ రావణా! అది తన పక్షమును వృద్ధిచేసి ఎక్కువైన సంపదలను కలుగజేయును. తన శత్రువు తనతో సమానుడైనను, తన బలము తరిగిపోవుచున్నను తాను తన శత్రువుతో సంధి చేసుకొనుట తగిన పని యగును. తన బలము పెరుగుచున్నచో ఆలస్యము చేయుట తగదు శత్రువుతో యుద్ధము చేయుటే తగిన పని. ఇది నీతి మార్గము. కనుక ఇప్పుడు నీకు రఘునాధునితో సంధి చేయుటయే తగినపని. నీకది మేలుచేయునది సుమా. ఆ సీతను దెచ్చుట చేతనే నీకును రామునకును విరోధము కల్గెను గదా. వేగముగా ఆమె నా రఘువీరునకు ఇచ్చివేయుము. అంతటితో పగ చల్లారును. అంత నీవు భయములేనివాడవై అపాయము లేని సుఖస్థితినందగలవు. దేవతలు, ఋషులు, గంధర్వులు ఎవనికి జయము గలుగవలెనని యెల్లప్పుడును కోరుచుందురో

ఆ రాజపుత్రునితో ఎందులకు విరోధము? సంధి చేసుకొనుట నీకు తగినపని. బ్రహ్మ జగత్తునందు ధర్మము నాశ్రయించిరి. రాక్షసులధర్మము నాశ్రయించెదరు. ఎప్పుడు ధర్మమధర్మమును మ్రింగివేయునో అదియే సుమా కృతయుగమనబడును. ధర్మమెప్పుడు అధర్మముచే చెడునో అదియే సుమా కలికాలమని చెప్పబడును. జగములను నీవు దిగ్విజయము చేయుచు సంహరించు సమయమున పౌరుషముచే ధర్మమును రూపము లేకుండ జేసి అధర్మమును లెక్కలేకుండ సంగ్రహించితివి. పరస్త్రీలను చెఱచుట చేత వాని వలననే కానివారు (శత్రువులు) మనకంటె బలవంతులైరి. [కృతయుగము కంటె కలియుగము దుర్బలము. కాన కలిధర్మ మాశ్రయించిన నీవు కృతయుగ ధర్మమాశ్రయించిన శ్రీరామునిచే చెడుదువని భావము] నీవు విడువక పొరపాటున అధర్మమును అభివృద్ధి చేసితివి. అందుచేత అదియే ఓ రాక్షసరాజా! మావంటివారిని గూడ మ్రింగివేయును. ఎంతో సొంపుతో అదియే దేవతల పక్షమును వృద్ధి పరచుచున్నది. ఆ రాజ పుంగవుడు ధర్మమును ఆశ్రయించుటచే దేవపక్షపాతి యగుచున్నాడు. తెలివిలేనివాడవై విషయాసక్తుడవై ఋషికన్యలను బట్టి ఏవేమియో చేసితివి. అగ్నిసమానులైన ఋషిశ్రేష్ఠులకు దానివలన కోపమమితముగా పుట్టినది. మండుచున్న అగ్నివలె అధికమైన తపస్సుచే వారు చెనకరానివారు. ఆ పుణ్యాత్ములు గొప్ప తపస్సు చేత పవిత్రమైన మనస్సు గలవారు. ధర్మమును వృద్ధిచేయుటయందు ఆసక్తి గలవారు. ఆ బ్రాహ్మణులను ముఖ్యములైన యజ్ఞములను చేసి శాస్త్రములో చెప్పిన పద్ధతిలో అగ్నియందు హోమములు చేయుచు రాక్షసులను మనస్సునందు లెక్కచేయక వేదములను పఠింతురు. తమశక్తియుడిగిన వేసవికాలపు మబ్బులవలె రాక్షసులు నలుదిక్కులకు పారిపోవుచున్నారు. వారి ముందర అగ్నినుండి పుట్టిన పొగలు పది దిక్కులయందును వ్యాపించియున్నవి. ఆ పొగ తాకుటచే రాక్షస సంఘములకు తేజస్సు నశించినది. మునులు పవిత్ర ప్రదేశములందు తీవ్రముగ తపము చేయగా అదియే రాక్షసులను బాధించుచున్నది. రాక్షసులచే, యక్షులచే, దేవతలచే వినాశము లేకుండ నీకు వరము కలదు. కాని ఇపుడు యుద్ధము చేయుటకై మానవులు, వానరులు, ఎలుగుబంటులు అమానుషమైన శౌర్యములతో లంకానగరమును ముట్టడించెను. ఇంక చేయవలసిన కార్యము నాలోచింపుము. ఈ సమయమున ఆకాశమునందును, భూమియందును పుట్టుచున్న దారుణమైన ఉత్పాతములను జూచినచో తప్పక రాక్షస సంఘములు నాశనము చెందునని తోచుచున్నది. తీవ్రమైన

గర్జనలు గల ఘోరములైన మేఘములు భయంకరముగా లంకానగరము నందంతటను వెచ్చని నెత్తురు వానలు కురిసెను. వాహనములన్నియు దుఃఖముతో కన్నీరు గార్చుచున్నవి. టెక్కెములు ధ్వంసమై రంగుమాసినవి. కాకులు, నక్కలు గ్రద్దలు లంకలో గుంపులు గూడి భయంకరమైన అరుపులతో నింపుచున్నవి. క్షుద్ర భూతములైన పూతనాదులు రాత్రులందు గృహములలో నుండు వస్తువులను దొంగిలించి స్త్రీలకు కలలలో కనబడి తెల్లని దంతములు పైకి కనబడునట్లు తగవులాడి పరిహసించుచున్నవి. బలికి పెట్టిన పిండములను కుక్కలిండ్లలో దూరి తిన సాగినవి. ఆవులు గాడిదలను ప్రసవించినవి. ఎలుకలు ముంగిసలతో గలిసి తిరుగతొడగెను. పిల్లులు పులులతో గలిసి విహరించుచున్నవి. కుక్కలు పందులు కూడి తిరుగుచున్నవి. కిన్నరులు రాక్షసులు నరులు నొక్కటైరి. పావురములు ఎఱ్ఱని పాదములును తెల్లని శరీరములు గలవై రాక్షస సంఘములకు వినాశకాలమని తెలియజేయుచున్నవి. పెంపుడు గోరువంకలు సౌధములందు వీచీ కూచీయని గోల చేయుచున్నవి. ఓడిపోయిన మృగములు పక్షులు ఒక్కమారుగా మరల యుద్ధమునకు మూగుచున్నవి. మృగములును, పక్షులును తమతమ హద్దులను దాటి సూర్యుని జూచి ఏడ్చుచున్నవి. రాక్షసరాజా! మిట్టపండ్లు గలవాడు, మిడిగ్రుడ్లు గలవాడు, వంకర శరీరమువాడు, కఠినమైనవాడు, బోడినెత్తివాడు నయిన యముడు వేలవేల ఇండ్లలో దూరి పొంచి చూచుచున్నాడు. ఇట్టి యుత్పాతములు పుట్టుచున్నవి గాన మనస్సునందు తలపోసి ఈ సమయమున చేటు కలుగని పనులు చేయుట నీకు అర్హము అని శ్రేష్ఠులైన మంత్రులలో నుత్తమ పౌరుషధనుడగు మాల్యవంతుడు ఎంతయో చెప్పియును, అతని మనస్సును పరీక్షించి అది మెత్తపడకుండుటను జూచి మాటలాడక ఊరకుండెను.

★★★



# ముప్పది యాఱవ సర్గము

## రావణుడు మాల్యవంతుని ధిక్కరించుట:

మాల్యవంతుని మాటలను విని కాలకింకరులచే కట్టుబడి యున్న వాడగుటచే అతడు చెప్పిన నీతిని హితబోధను వినక దేవతావిరోధి యెంతయో రోషము పొందినవాడై కన్నులెఱ్ఱవడగా, కనుబొమ్మలు ముడిపడగా గ్రుడ్లను త్రిప్పుచు అతనిని జూచి అందఱు వినుచుండగా ఆ దుర్బుద్ధి కండల క్రొవ్వుతో ఇట్లు పల్కెను. ఏమీ మంచిమాటలని ఏమని ఈ విధముగా కఠినములైన మాటలను హితము కాని వాటిని ప్రేలుచున్నవావు. ఏమి చూచి ఆ తుచ్ఛ మానవుని బలహహీనుని, కుత్సితుని, దరిద్రుని, వానరుల నాశ్రయించినవానిని, తండ్రిచే వెళ్లగొట్టబడి దిక్కులేక ఒంటరిగా అడవులయందు తిరుగువానిని, ఆ రాముని ఎంతో నేర్పుతో మెచ్చుకొనెదవు? అతని మహా సామర్థ్యము నేమి చూచితివో గదా. దేవతలకు గంధర్వులకు భయంకరుడును, ఉద్ధతమైన పరాక్రమము గలవాడును అగు రాక్షసాధిపతిని ఏమని బలహీనునిగా ఆలోచించితివో చెప్పుము. కన్నుకుట్టుతనమో లేక శత్రువుల ప్రోత్సాహమో, శత్రువులయందు పక్షపాతమో నన్ను నీవు పరుషములైన మాటలనుటకు గారణములైయుండునని శంకించుచున్నాను. శత్రువుల ప్రోత్సాహమే లేనిచో శాస్త్రములన్నియు పండితుడెవ్వడీవిధముగా ప్రభావవంతుడు, పరిపక్వమైన మనస్సు గలవాడు అయిన తన రాజును గూర్చి పలుకును? పద్మములేని లక్ష్మి వంటి దగు సీతను (ఆశ్రయములేని సీత నని భావము) అడవినుండి తెచ్చి ఏమి మునిగిపోయినదని ఆ రామునకు భయపడి నేను నా యిష్టమును తీర్చికొనకుండ తిరిగి ఇచ్చెదను? ఆ వానర సమేతుడు లక్ష్మణ సుగ్రీవులతో గూడినవాడు నగు రాముని యుద్ధభూమి యందు నేను గ్రద్దల పాలు చేయగా నీవే చూడగలవాడవు. ఏ వీరుని ద్వంద్వ యుద్ధమున దేవతలైనను చేరజాలరో ఆ వీరాగ్రణియైన రావణుడు యుద్ధక్రీడకు బెదురునా? నన్ను రెండుగా చీల్చినను ఎవ్వరికిని నేను లొంగువాడను గాను. నా స్వభావ దోషమిది. స్వభావము దాటుటకు శక్యముగానిది. దాట శక్యమా? సాగరమున సేతువు గట్టుటను దొడ్డగా జెప్పుచున్నావు. అది [కాకతాళీయము] తలవని తలంపుగా జరిగినది. దాని నాశ్చర్యముగా పెద్ద లెక్కగా

చెప్పుచున్నావు. భయము నందితివా? వినుము. రామభద్రుడు వానరసేనతో ఇచ్చటికి వచ్చినను శరీరముతో తిరిగి వెళ్లునా? నేను ప్రతిజ్ఞ చేసెదను. అని గర్వముతో పల్కగా విని మాల్యవంతుడు ఈ రావణుడు కోపముచే శరీరము తెలియకున్నాడని మనస్సునందు తలచి సిగ్గుతో శిరస్సు వంచుకొని యుండెను. తరువాత రావణుని ఆజ్ఞపొంది జయము పల్కి ఆ మాల్యవంతుడు తన నివాసమునకు వెళ్లెను. అంత రావణుడు మంత్రివర్గముతో విమర్శ సలిపి లంకలో అన్నిదిక్కులందును కాపుపెట్టెను.

## రావణుడు పుర ద్వారంబుల కాపుంచుట:

తూర్పుదిక్కు పురద్వారమున గొప్ప పరాక్రమము గల ప్రహస్తుని గాపుంచెను. దక్షిణ ద్వారమున మహోదరమహాపార్శ్వులను నియమించెను. పడమటి ద్వారమందు గొప్పమాయలు దెలిసినవాడును గొప్పసేనచే గొల్వబడినవాడును అయిన ఇంద్రజిత్తు నుంచెను. సారణుని శుకుని నుత్తరదిక్కు ద్వారమునందు గాపుండ బంచి తాను స్వయముగా పరిరక్షించుచుండెదనని చెప్పి మధ్యయందు గొప్పసైన్యముతో విరూపాక్షు నుంచి ఇట్లు లంకాపురమునకు నాల్గుదిక్కుల మిక్కిలి రక్షణగా తగిన విధమును చేసి దశముఖుడు తాను ధన్యుడైనట్లు విధి బలముచే తలంచెను. ఇట్లు చేయవలసిన పనులన్నింటిని వారివారికి చెప్పి వారి నందఱను వెళ్లుడని పంపి ఆ మంత్రులందఱు ఆశీర్వాదములు పలుకుచుండగా తాను సర్వసంపదలతో తులతూగుచున్న తన అంతఃపురమునకు వెడలెను.

★★★



# ముప్పది యేడవ సర్గము

## శ్రీరామునకు విభీషణుడు రావణుని సేనాసన్నాహవిధము దెల్పుట:

ఆ నరనాధుడును, వానర నాధుడును, హనుమంతుడును, జాంబవంతుడును, అంగదుడును, మైందద్వివిదులును, పనస గవాక్షులును, మఱియు లక్ష్మణుడును, సుషేణ విభీషణులును, గజుడును, నల కుముదులును కలిసి చేయవలసిన పనిని ఆలోచించుచుండిరి. అప్పుడు కపి సమూహము ఇదియే రాక్షసరాజుచే పాలింపబడు లంక. యుద్ధమున దేవతలకు నాగులకు యక్షులకు గంధర్వులకు నైన జయింపరానిది. దీనియందు రాక్షసాధిపతి యగు రావణుడు సైన్యముతో యెల్లప్పుడు సన్నిహితుడై యుండును. కాన కార్యము నెఱవేరు నుపాయము నేర్పుతో ఆలోచింపదగునని చెప్పగా నాగరికమైన పదములు గలిగి గొప్ప యర్థముతో గూడిన వాక్యములతో రావణ సోదరుడైన విభీషణుడిట్లు పల్కెను. అనలుడు, శరభుడు, ప్రఘసుడు, సంపాతి యనెడు గొప్ప తెలివి గల మంత్రిశ్రేష్ఠులు పక్షుల వేషములతో శత్రు పురమును ప్రవేశించి సైన్యములను, వానిని నిలబెట్టిన విధానమును చూచి వచ్చిరి. ఓ శ్రీరామా! వారలు చెప్పిన విధమును చెప్పెదను వినుము. తూర్పు ద్వారము పెద్ద బలములతో ప్రహస్తుడు కాపాడుచున్నాడు. దక్షిణమున మహోదర మహాపార్శ్వులుండిరి. పడమట శౌర్యముతో ఇంద్రజిత్తు నిలిచియున్నాడు. పట్టిసము, ఖడ్గము, ధనస్సు, శూలము మొదలగు ఆయుధములను ధరించిన శూరులెందరో అతని చుట్టునున్నారు. రావణుడు రాక్షస సమూహముతో గూడి ఉత్తర ద్వారమును తానే కాచుచున్నాడు. శూలములు, కత్తులు, ధనస్సులు చేతులధరించిన చాలమంది కొల్చుచుండగా పురమధ్యభాగమును విరూపాక్షుడు పాలించుచున్నాడు. విరోధి సైన్యమును పన్నిన విధమిది. ఆ పురమున ఒక వేయి ఏనుగులు పదివేల రథములు పదివేల గుఱ్ఱములు కోటిమంది రాక్షసులు గలరు. రాక్షసులెల్లరును ఆకతాయులు యుద్ధరంగమున శూరులు, రావణునిచే మెప్పుపొందిన వారలు, ఉగ్రులు. ఈ భాగములలో ఒక్కొక్కదానికి పదిలక్షల సైన్యము గలదని చెప్పిరి మంత్రులు, అని వారినెదుట నిల్పి మఱియు రఘురామునితో ఇట్లనెను. రామా! అరువదివేలమంది తనతో సమానులగు

రాక్షసులు తన్ను గొలువగా రావణాసురుడు కుబేరుని గెలిచెను. నీవు కోపగించుకొనకుము. నీకు కోపము గలిగించుటకే ఇట్లు చెప్ప సాహసించితిని. నీవును ఘనుడవు సమర్థుడవు. గొప్ప శౌర్యముతో యుద్ధమున దేవతలనైనను జయింపగలవు. ఓ రామచంద్రా! చతురంగ బలములతో విరోధులను నాశనము చేయుము అని చెప్పగా రాముడాలోచించి విరోధులను జయించుటకై ఈ విధముగా బలమునంతను విభజించెను.

## శ్రీరాముడు లంకాద్వారముల సేనలను నిల్పుట:

తూర్పుద్వారమునందు గొప్పసేనతో నీలుడు ప్రహస్తునితో యుద్ధమునకు తలపడవలెను. దక్షిణదిక్కు ద్వారమున మహోదరుని మఱియు మహాపార్శ్వని అంగదుడు తలపడి జయింపదగును. కొలువ శక్యముగాని బలముగల ఆంజనేయుడు అమితమైన సైన్యముతో వెళ్లి ఇంద్రుని జయించిన ఇంద్రజిత్తున్న పశ్చిమదిక్కున పరాక్రమముతో శత్రు పట్టణమును తాను భేదింపవలెను. మహాత్ములగు ఋషులకు దానవులకు గుండె ఝల్లుమనిపింపజేయు దుండగుడును, వరములు పొందుటచే కండకావరము గలవాడును, ప్రజల నందఱనల్లాడజేయు వాడును అగు ఆ నీచుని సంహరించు వంతు నాది గాన సౌమిత్ర సహితుడనై యుత్తరదిక్కున నేనుండెదను. జాంబవంతుడును సుగ్రీవ విభీషణులును సైన్య మధ్యమును రక్షింపవలెను. వానరులు మానవ రూపములను దాల్పరాదు. ఇది చేయవలసిన నియమము. ఇది వానర సమూహమునకు చిహ్నము. దీనినెవ్వరును, ఏ సమయమందైనను తప్పరాదు. నేనును, నా తమ్ముడును నా స్నేహితుడు రాక్షసరాజైన విభీషణుడును, అతని నల్వురు మంత్రులును మానవ రూపములతో విరోధి సైన్యమును సంహరించెదము. ఇది సిద్ధము సుమా. అని సైన్యమును నియమించియు తన కార్యమును సిద్ధింపజేసికొనుటకై దశరథపుత్రుడు మనస్సునందు తలచి పట్టణమును చూచుటకై సువేలాద్రి శిఖరము నెక్కెను.

★★★

# ముప్పది యెనిమిదవ సర్గము

## శ్రీరాముడు సుగ్రీవాదులతో సువేలాద్రి నెక్కుట:

తనతో లక్ష్మణుడు వచ్చుచుండగా శ్రీరాముడు సుగ్రీవుని, ధర్మజ్ఞుడును, తనయందనురక్తుడును, సర్వ మంత్రములు దెలిసినవాడును, విధి విధానములనెఱిగిన వాడును అగు విభీషణుని చూచి మధురమైన మాటలతో నిట్లనెను. వివిధ ధాతువులతో నున్న ఈ సువేలాద్రి పై నెక్కి అందే ఈ రాత్రి గడిపి తెల్లవారగనే నా భార్యను తీసుకొని వెళ్లిన ఆ పాపాత్ముని నివాసమును వాని వినాశమునకై చూతము. అతడెంతటి నీచుడో కదా. తన వంశమునైనను, సాధుత్వము నైనను ధర్మమునైనను మనస్సునందు తలపక ఆ దుష్టుడు జగములు తిట్టుపనిని చేసెను గదా. అతని పేరు వినబడినంతనే శరీరమంతయు మండుచున్నది. ఐనను ఒక్క దుర్మార్గుని నిమిత్తమై సర్వరాక్షసులను వధించుటెట్లో గదా. ఒక్కడు పాతకములు చేసి యమపాశముల బడును. ఆ పాపాత్ముని కారణమున అతని వంశమంతయు పాడగుచున్నది గదా. అని యిట్లు కోపవశమున బలుకుచు ముందుగా రాముడు సువేలాద్రి నెక్కెను. గొప్ప విక్రమముగల సౌమిత్రు విల్లు బాణములు దాల్చి వెంటవెళ్లెను. అతని వెనుక వానర రాజును, మంత్రులును, విభీషణుడును, హనుమంతుడును, వాలిపుత్రుడైన అంగదుడును, నీలుడు, మైందుడు, గజుడు, గవాక్షుడు, జాంబవంతుడు, హరుడు, పనసుడు, రంభుడు, కుముదుడు, శతవలి, సుషేణుడు, ఋషభుడు, దుర్ముఖుడు మొదలైన వానరులు చాలమంది వాయువేగముతో పర్వతమునెక్కిరి.

అందఱు నా పర్వతము నెక్కి త్రికూటాద్రిపై ఆకాశమునంటుచున్న కోట గోడలు, ఉత్తమమైన ద్వారములు సందడిగా తిరుగు రాక్షస సమూహములు గలిగిన లంకను వేడుకతో జూచిరి. కోటచుట్టు నల్లని రాక్షసులు మఱొక కోటయో యను నట్లుండుట చూచిరి. చూచి ఆ రాక్షసులు యుద్ధ ప్రయత్నములందుండుట చూచి వానరులు రాముని యెదుట వివిధములైన ధ్వనులతో గర్జించిరి. అధికమగు ఎఱ్ఱని వెన్నెలతో ప్రకాశించు రాత్రి

మనోహరమై యొప్పెను. [సువేలారోహణము పున్నమనాడని కొందఱును, చతుర్దశినాడని కొందఱు, దివిటీల కాంతులచే ఆ రాత్రి పున్నమివలె నుండెనని కొందఱు వ్యాఖ్యానించిరి] వానరరాజును, రాక్షసరాజును సేవించుచుండగా రాముడు నిరంతర జాగరూకుడైన లక్ష్మణుని తోడను ఎలుగుబంట్లు మొదలగు వానిచేతను సేవింపబడుచు ఆ రాత్రి సువేలాద్రిపై నివసించెను.

★★★



# ముప్పది తొమ్మిదవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణ సుగ్రీవాదులతో లంకను జూచుట:

తెల్లవారినంత ఆ వీరులు లంకయందు సమముగాను సుకుమారముగాను విశాలముగాను, అందముగాను, పొడవుగాను నున్న ఉద్యానవనములను జూచి అందఱును దాని యందమున కాశ్చర్యమునొందిరి. మద్ది, తాడి, చీకటి, సంపెంగ, అశోకము, పున్నాగము, కడిమి, అరటి, కొండగోగు, బొట్టగు మొదలైన వృక్షములతోడను, పువ్వులతో నిండిన వృక్షముల తోడను, పచ్చికబయళ్లతోడను, నల్లని వృక్ష సమూహముల తోడను పర్వత మొప్పుచుండెను. మనుష్యులు అందముగా ఆభరణములను ధరించినట్లు వృక్షములు సుగంధములను చిమ్ముచున్న పుష్పములను ఫలములను దాల్చి కంటికి తృప్తి కలిగించినవి. నందనము, చైత్రరథములవలె ఆవనమందలి సర్వ ఋతువృక్షములు తుమ్మెదల రొదలతో సర్వేంద్రియానందకరమై హర్షము కలిగించెను. అడవి సెలయేళ్లయందు భరతపక్షులు, గ్రుడ్డి కొంగలు సొంపుగా కూయుచుండ నెమిళ్లు నృత్యమాడుచుండ, తుమ్మెద నాదములు విన్పించుచుండ మదించిన పక్షుల సంచారములు, కోకిలల గానములు, పక్షుల అరుపులు, తుమ్మెదల రొదలు, బెగ్గురు పక్షుల గానములు అధికముగా కలిగిన ఆ పురోద్యానములందు చెట్లయందు వానరులు ప్రవేశించి చెలరేగి కేరుచు ఇష్టము వచ్చిన రూపములను దాల్చి విచ్చలవిడిగా అందందు తిరిగి సంతోషమును బొందిరి. ఈ విధముగా వానరలుద్యానవనముల ప్రవేశింపగా పుష్పముల క్రొత్త క్రొత్త సువాసనలతో నిండిన పిల్లగాలులు ఝుమ్మని ముక్కులకాహ్లాదము గలిగించుచు వీచినవి. వానరరాజు ఆజ్ఞతో తక్కిన వానరులు కూడ లంకాపురము మీదకు దండు వెడలిరి. ఆ లంకయంతయు వారి గర్జనలచే అప్పుడల్లల నాడెను. పాదఘట్టములచే భూమి కంపించెను. పాదముల తాకిడిచే లేచిన ధూళి అంతటను వ్యాపించెను. ఆ ధ్వనులను విని భయముచే అందలి ఎలుగుబంట్లు, అడవిపందులు, సింగములు అరచుచు దిక్కులకు పారినవి. ఎత్తైన, సమమైన, అందమైన పువ్వుల జొంపములు అంతటను నిండినవి. బంగారు వంటిదై, పక్షులకైన చేరరానిదై, మిక్కిలి నునుపై, చాల అందముగా ప్రకాశించుచున్న ఆ పర్వత

శిఖరము మనుష్యులు వూహలచేతనైనను ప్రవేశింపరానిది యన నిజముగా చేరనలవి కానిదని చెప్పనేల? అందమైన ఆ పర్వత శిఖరమునందు రాక్షసరాజుచే పాలింపబడుచున్న లంకానగరము నూఱామడల పొడవును ముప్పదామడల వెడల్పును గలదై గొప్పవైన తెల్లని మబ్బులను బోలు గోపురములతోడను, బంగారు వెండి కోటలతోడను శోభిల్లుచు, లక్ష్మీసంపన్నమైన మేడలతో విమానములతో నొప్పుచు వానకాలమునందు మబ్బులతో నొప్పు ఆకాశమువలె నొప్పుచుండగా అందు ఆకాశమునంటు కైలాస పర్వత శిఖరమువలె మెఱయుచున్న వేయిస్తంభములతో ప్రకాశించుచు నెల్లప్పుడు రాక్షసులచే రక్షింపబడుచు ఆ లంకకే అలంకారముగా నుండెడి రావణుని సౌధమును వానరులు విస్మయముతో జూచిరి. అనేక వర్ణముల ధాతువులతో గూడినదియు, అనేక రాక్షసులతో నిండినదియు, అనేకోద్యాన వనములచే ప్రకాశించునదియు, వివిధములైన పక్షుల ధ్వనులతో నిండినదియు, అనేకవిధ మృగములచే సేవింపబడునదియు పర్వతములచే పరివేష్టింపబడినదియు నైన లంకను పద్మాక్షుడగు రాముడు వానర సమూహముతో గలిసి చూచెను. దేవేంద్రనగరమును బోలు ఆ లంకానగరము సొంపును జూచి సీతాపతి ఆశ్చర్యమును పొంది సర్వమును కుతూహలముతో చూచుచుండెను.

★★★



# నలువదవ సర్గము

## సుగ్రీవుడు రావణు గోపురమునకు దాటి అతనితో పోరుట:

రెండు ఆమడల విస్తీర్ణము గల సువేలాద్రి శిఖరమునందు సూర్యపుత్రునితోడను వానర సంఘముల తోడను చుట్టబడిన వాడై రామభద్రు డన్ని దెసలను జూచుచు త్రికూట పర్వతముపై నున్న లంకను చూచుచున్నప్పుడు ఆ లంకయందొక గోపురముపై మనోహరములగు మణుల హారములను ధరించి చందనమలదిన శరీరము గలవాడై బంగారు నగిషీ గల వస్త్రములు దాల్చినవాడై మేఘమువలె నల్లని దేహముగలవాడై అందమైన విజయచ్ఛత్రము గలవాడై అందమైన వెల్లచామరములచే వీవబడినవాడై యొప్పుచున్న దుర్జయుడైన రావణుని, ఇంద్రుని ఏనుగైన ఐరావతము యొక్క దంతము దెబ్బచే కాయకాచిన యెదగలిగిన వానిని కుందేటి రక్తమువంటి ఎఱ్ఱని వస్త్రముదాల్చి సాయంసంధ్యాకాల సూర్యకాంతితో విరాజిల్లు మేఘమువలె నొప్పుచున్న వానిని వానరవీరులు, రామచంద్రుడు చూచుచుండగా, రావణుని చూచినంతటనే రోషము కలిగినవాడై వానరరాజు చివాలున తెంపు, పెంపు శౌర్యము కవియుచుండగా అట్టె ఆకసమున కెగిరి దాటెను. రావణుడున్న ఆ మేడపైకి అట్లెగిరి ఒక్క నిమిషము నిలిచి భయము లేనివాడై రాక్షసరాజును జూచి ఆ దుర్మార్గుని నొక్కపోకకైనను లెక్కచేయక కర్ణకఠోరముగా నిట్లనెను. ఓ తులువా! మూడు లోకములకు నాథుడైన రఘునాథునకు నేను స్నేహితుడను, సేవకుడను. తొలగకుము. రాముని తేజస్సు యొక్క ప్రభావముచే నేను దర్పమడంపక పోనిత్తువా? అని మీదకు దుమికి మణులతో మెరయుచున్న ఘనకిరీటము లాగి భూమిపై గొట్టి తిరిగి తన మీదకు వచ్చుచున్న సూర్యపుత్రుడైన సుగ్రీవుని జూచి రాక్షసరాజిట్లనెను. ఓ సుగ్రీవా! ఇంతకు ముందు సుగ్రీవుడవే కాని నా దృష్టిలో పడి హీనగ్రీవుడవు (మెడలేనివాడవు) అయ్యెదవు సుమా అని రోషముతో సుగ్రీవుని పట్టి విసిరి ఆవల పడవేసెను. అట్లు విసరగా బంతివలె వానరనాథుడు లేచి రావణుని తనచేతులతో త్రోసి నేల బడవేయగా వెనుకంజ వేయక అతడు లేచి సుగ్రీవునితో బాహుయుద్ధము చేసెను. వారిట్లవ లీలగ పోరాడుచుండగా హెచ్చుగా చెమట బిందువులు గురిసెను. శరీరములందు

నెత్తురులు గ్రుమ్మెను. ఒకరి శరీరము ఒకరికి తగులుచుండ తీవ్రముగా పెనుగుచు నిశ్చేష్టులై నిల్చుచు ఒకరిని విడిచి యొకరు దూరముగా వెనుకకు వెళ్లి హమ్మనుచు తాకుచు మీదకు దూకుచు క్రోధముతో పిడికిటి పోటులతోను గొప్పకఱకైన చేతి దెబ్బలతోడను, సమానమైన బలముతో, గర్వముతో అధికమైన ధీరత్వముతో పోరాడిరి. రాక్షసరాజును, వానరరాజును నెత్తురులు గారుచున్న శరీరములతోడను మనస్సులందు పుట్టిన రోషము పెట్టుచున్న తొందఱతోడను ఆ భవన గోపురము కంపించునట్లు ఒకరినొకరిని తన్నుచు, త్రోయుచు పెనుగులాడుచు, ఒకరినొకరు చుట్టుకొనుచు, ఒకరొక్కరిని లాగి క్రింద పడవేసి నేర్పుగా మీదకెక్కుచు ఒకరి శరీరము నొకరు వంచుచు చుట్టునున్న కందకము లోబడిరి. అట్లు దొర్లియు నిలువక కాశమున కెగిరి ధైర్యమును వీడక ఒక నిమిషము ఊరక నిలిచి మల్లయుద్ధవిశారదులగు వారిరువురు మరల పోరాడదొడిగిరి. ఒకరినొకరు తమ బాహుపాశములచే ఉక్కిరిబిక్కిరి యగునట్లు బిగించి పట్టుకొనుచు గొప్ప పౌరుషముతో, పులుల వలె, సింహములవలె, మదపుటేనుగులో యనునట్లు తెగించి తలపడుచు ఱొమ్ము ఱొమ్ముతో తాకుచు కలబడి ఆ గండరగండలిద్దఱు ఒక్కసారే నేలగూలుచు మరల లేచుచు పూచిన మోదుగులో బూరుగులో యనునట్లు మెఱయుచున్న శరీరములతో శ్రమలేక చక్రములవలె గుండ్రముగా దిరుగుచు ఎగిరి ఒకరియెదుట నొకరు నిలిచి తినుబండారములకై పొంచియున్న బావురు పిల్లుల విధముగా నిలుచుచు కుడినుండి ఎడమకు ఎడమనుండి కుడికి ఇంకను అనేక విధములుగా దిరుగుచు ముందునకు వెళ్లి తిరిగి వచ్చి వంకర నడకలతో బాహుశౌర్యము గనబడునట్లు పట్టుకొనుచు కొట్టుకొనుచు విడిపోవుచు ఆ బలవంతులిద్దఱు సమానముగా పోరాడిరి. తిట్టుచు, భూమిపై బడద్రోయుచు ఇట్లు ఒకరినొకరు తీసిపోక వానరరాజును, రాక్షసరాజును సమానమైన పరాక్రమముతో, ప్రఖ్యాతమైన బాహుబలముతో పోరుచున్న సమయమున రావణుడు మాయచే అనేక రావణులవలె తోచి సుగ్రీవుని పట్టుకొన తలంపగా సుగ్రీవుడతని ద్రోహబుద్ధిని గుర్తించి చిటికేసెడు నంతలో ఆకాశమున కెగసెను. ఇట్లు విజయియై, శ్రమరహితుడై వానరరాజు వేగముగా వెడలగా రాక్షసరాజు తానే వంచింపబడినవాడై అయ్యో సమయము మించిపోయెనే. తప్పిపోయెనే అని చింతించుచు సౌధోపరి తలమున ఒంటరిగా నిలబడెను. వానరరాజీవిధముగా యుద్ధపుకీర్తిని సంపాదించి రాక్షసరాజును బాధించి విశాలమైన ఆకాశమార్గమును మహావేగముతో దాటి వచ్చి క్రొత్తగావికసించిన పద్మముల వంటి

కన్నులు గల రాముని ప్రక్కన వానర ప్రముఖుల గుంపు మధ్య మందు మెల్లగా శ్రమదీరునట్లు నిల్చెను. (రావణుడు మాయాయుద్ధము చేయబూనుటచే ఓడెనని యెరుంగునది) ఈ విధముగా రావణునితో యుద్ధముచేసి తనను వానరులు సేవించుచుండగా స్నేహముతో సుగ్రీవుడు రామలక్ష్మణులకు యుద్ధోత్సాహమును గలిగించెను.

★★★



# నలువది యొకటవ సర్గము

## శ్రీరాముడు సాహసము చేయవలదని సుగ్రీవునకు బోధించుట:

అంతట శ్రీరామచంద్రుడా సూర్యపుత్రుని శరీరమందున్న యుద్ధచిహ్నములను జూచి ఆదరముతో నతని కౌగిట జేర్చి గట్టిగా పట్టుకొని ఇట్లనెను. ఓ వానరరాజా! నాతో చెప్పకుండ ఇంతటి సాహసము చేయదగునా? భూపతులు స్వయముగా నిట్టి సాహసపు బనులు చేయవచ్చునా? ఎంత సాహసమును జేసితివి. సాహస ప్రియుడవైన నీవు చేసిన పని నన్నును, వానరసేనను, విభీషణుని గూడ సందియమున మునుంగ జేసెను గదా. కటకటా! ఇటువంటి కష్టమైన కార్యమును ఇంకమీద ఆలోచింపక చేయకుము. ఒకవేళ నీకేమైన హాని కలిగినచో ఇక సీతతో నేమి పని? భరతుడెందులకు? సౌమిత్రి ఏల? శత్రుఘ్నుడెందులకు? ఇంతయేల నా శరీరమైనను నా కెందులకయ్యా! ఓ మహా పౌరుషశాలీ! నీ శక్తిని నేనెఱిగియుండియు నీవు రాకముందు నేనిట్లు నిశ్చయించుకున్నాను. ఎట్లనగా రాక్షసరాజును అతని బంధువులతో సైన్యముతో గూడ పట్టి యుద్ధమందు సంహరించి విభీషణునకు లంకా పట్టాభిషేకము చేయుటయు, ఎట్లో సమాధానపఱచి కైక పుత్రుడైన భరతుని నా రాజ్యమందు నిల్పి నా శరీరమును విడువదలంచియే యున్నాను సుమా కపీశ్వరా! అని పల్కగా వానరరాజిట్లనెను. ఓ అనఘుడా! నీ భార్య నపహరించిన దొంగ నెదురుగా జూచి మనసులో నా శక్తి నెఱిగి యుండి ఊరకుండుటకు నా మనసెట్లొప్పును రామచంద్రా! అనగా రఘురాముడు మెచ్చుకొనుచు లక్ష్మణునితో ఇట్లనెను.

## శ్రీరాముడు లక్ష్మణునకు శకునములను దెలుపుట:

సోదరా! ఫలములతో నిండియున్న వనములందు, చల్లని నీళ్లు గల చోటులను జూచి మన సైన్యమును నిలబెట్టుచు ముందుగా వ్యూహములను పన్న వలయును సుమా. బలిముఖ ఋక్ష రాక్షస సంఘముల వినాశమును, భయంకరమును, లోక నాశకరమును నయిన ప్రళయము సంభవింపనున్నది. దుమ్ము రేగుచుండగా గాలులు విసరెను. పర్వత శృంగములు వణకుచున్నవి. ఈ భూమి కంపించుచున్నది. వృక్ష సమూహములు

నేలపై బడుచున్నవి. చూచితివా? సోదరా! భయంకర రాక్షసుల వలె నున్నవియు, కఠినములైనవియు, పరుషములైన గర్జనలు గలవియు, క్రూరములును అయిన మేఘముల సమూహములు ఘోరముగా నెత్తురుతో గూడిన వానలను గురియించుచు ఉత్పాతహేతువులగుచున్నవి. కుంకుమ రంగుతో సంధ్య ఘోరముగనున్నది. సూర్యునియందు నల్లని చుక్క కనబడుచున్నది. సూర్యుని యందుండి ఒక మండుచున్న అగ్ని మండలము నేల వ్రాలెను. ఓ దండితారీ! సూర్యుని జూచి మృగములు పక్షులు అంతటను దీనమైన స్వరములతో ఘోషించెను. తేజస్సు తొలగి చంద్రుడు రాత్రులందు నలుపు ఎఱుపు కలిసిన రంగు గలిగి ప్రళయ కాలము నందువలె భూమియందంతట వికటముగా తాపమును గలుగజేయుచున్నాడు. చంద్రుని చుట్టు పరివేషము హ్రస్వమును తీక్ష్ణమునై ఘోరముగా నున్నది. దాని తీరు చూచితివా? చుక్కలు కాంతి తగ్గినవై తప్పక లోకవినాశమగునని తెలియజేయుచున్నవి. కాకులు, గ్రద్దలు, మిక్కిలి బలము గలిగిన డేగలును అల్పమైన పక్షులు తరుమగా ఆర్తినొందుచున్నవి. నక్కలంతటను కలయ పరువులెత్తుచు కీడును సూచించుచు భయంకరముగా గోల చేయుచున్నవి చూడుము.

## శ్రీరాముడు సువేలాద్రి దిగి లంకను ముట్టడించుట:

లక్ష్మణా! ఇప్పుడే మనము సేనలతో వెళ్లి లంకను ముట్టడించుట తగిన పని యని చెప్పుచు వేగముగా పర్వతము దిగి వానరశ్రేష్ఠు లెల్లరును చూచుచుండగా వారల కుత్సాహము కలుగునట్లుగా మాటలను జెప్పి కాలజ్ఞుడగు కౌసల్యానందనుడు వానర సైన్యముతో లంకకెదురుగా శంకలేక వెళ్లుచుండగా వానరరాజగు సుగ్రీవుడును, రాక్షసరాజగు విభీషణుడును హనుమంతుడు, లక్ష్మణుడు, నలుడు, జాంబవంతుడు నీలుడు వెంట వెళ్లిరి. వారి వెంట రాళ్లు, చెట్లు, కొండలు పట్టుకొని వానర సేనలు వెడలినవి. అట్లు చాలసేపు నడచి ధీరులైన అన్నదమ్ములు వనములచే ప్రకాశించుచున్నదియు, జెండాలతో నొప్పునదియు, యోధులకు జయింపరానిదియు, దేవతలకు అలవికానిదియు నగు ఎత్తైన ప్రాకారతోరణమును చేరి ముట్టడింపజేసి వానరసైన్యమును పురము చుట్టును నిలుపగా, గొప్ప బలవంతులయిన వానరశ్రేష్ఠులు రాముని ఆజ్ఞానుసారముగా నియమిత ప్రదేశములందు నిలిచియుండెను. పర్వత శిఖరమువలె ఉన్నతమైన ఉత్తర ద్వారమును సోదర సహితుడైన రాముడరికట్టెను. అచ్చట తన పురమును రక్షించుకొను ఆసక్తితో రావణుడు తగువిధముగా నుండెను. వరుణుడు రక్షించు సముద్రమును వలె

రాక్షసరాజున్న ఉత్తర ద్వారమును అడ్డగించుటకు దశరథ పుత్రుడొక్కడే తప్పనికనెవ్వరు సమర్థులగుదురు? భయంకరులు, మహావీరులు, దృఢమైన విక్రమము గలవారు నగు రాక్షసశ్రేష్ఠులు పాతాళమును దానవులు కాచునట్లు ఉగ్రులై రక్షించుచుండ ద్వారమునకు సమీపమున నున్న అరుగుల మీద యుద్ధము చేయు భటులకుపయోగపడునట్లుగా అనేక విధములైన కవచములు ఆయుధములు చాలగా నింపి యుండుటను రాముడు చూచెను. అప్పుడు వానరసేనాపతియైన నీలుడు, ద్వివిదుడు, మైందుడు తోడురాగా తూర్పు దిక్కు ద్వారమును అధికమైన సైన్యముతో నడ్డగించెను. దక్షిణ ద్వారమును గజగవాక్ష వృషభులు, గవయుడు మొదలగువారలు తన్నునుసరింపగా ఇంద్రునితో సమానమైన పరాక్రమము గల అంగదుడు తన బలములతో అడ్డగించెను. ప్రఘసుడు, ప్రమాథుడు అను గొప్ప శౌర్యము గలవారలతో గూడి హనుమంతుడు పడమటి ద్వారమును అడ్డగించెను. సుగ్రీవుడు గరుత్మంతుని వంటి బలము వేగము గల వానరశ్రేష్ఠులతో గలిసి మధ్యగుల్మమున నిలిచెను. సుగ్రీవుడున్నచోట ముప్పదియాఱుకోట్ల వానరులుండిరి. ఒక్కొక్క ద్వారమునొద్ద ఒక కోటి వానరసైన్యము చొప్పున లంకయొక్క కోట చుట్టును నిలిచిరి. ఎలుగుబంట్లు కోతుల సైన్యముతో సుగ్రీవుడు రాముడున్న చోటుకి పడమట మధ్యభాగమున నిలిచెను. యుద్ధముచేయు తలంపుతో సర్వ సన్నాహములతో వానరయోధులు వేచియుండిరి. వికృతములైన తోకలతో వికటములైన కోఱలతో వికృతములు విచిత్రములైన దేహములతో, వికృతములైన మొగములతో గూడిన వానరులు, పదియేనుగుల బలముగలవారు, నూరు ఏన్గుల బలముగలవారు, వేయి గజముల బలము గలవారు, పదివేల యేన్గుల బలము గలవారు అంతకు నూరుఱెట్లు బలముగలవారు, చెప్పుట కలవికాని బలముగలవారు, జయింప శక్యముగాని బలముగలవారు అనేక విధములుగా ప్రకాశించిరి. వారిసేనలు మూగు విధము చూడగా మిడతల దండు వచ్చిన విధముగా ఇది భూమి, ఇది ఆకాశము అని తెలియకుండనున్నది. కోట్లకొలది వానరులు కోట వాకిటకి రాగా ఇంకను కోట్ల కొలదిగా వెనుక గుంపులుగా నుండిరి. లంకలో గాలియైనను ప్రవేశింపరాని యట్లు వానరశూరుల సైన్యములు కొండలు చెట్లు చేత బట్టి పౌరుషముతో పురమును చుట్టి నిలిచిరి. ఇంద్రునితో సమానమైన పరాక్రమముతో మేఘముల వలె మెరయుచున్న వానర సైన్యమును చూచి రాక్షసులు మనస్సులందాశ్చర్యముతో అదిరిపోయిరి. గట్లు తెగిన సముద్రము పొంగి ప్రవహించినట్లు వారు వచ్చుటచే కలిగిన గొప్పధ్వని లంకాపురమునందంటతట

వ్యాపించెను. ప్రాకార తోరణ సమూహములతో, కొండలతో వనములతో గూడి లంక యంతయు కంపించెను. రామలక్ష్మణులు సుగ్రీవుడు రక్షించుచున్న వానర సైన్య సమూహము దేవతలకు రాక్షులకు గూడ తేఱి చూడ శక్యముగానిదై ప్రకాశించెను. ఈ విధమగా తన సైన్యములను తగిన విధముగా తగిన స్థలములందు తాను విడియజేసి మంత్రుల సమూహముతో గూడి మంత్రాంగము సల్పి సీతాపతి తాను చేయదగిన పనిని నిశ్చయించి రాజనీతి నెఱిగిన రాక్షస రాజు విభీషణుని సమ్మతిని బొంది పవిత్రమైన బుద్ధిగల రాముడు రాజధర్మమును తలంచుచు

## అంగదు రాయబారము:

వీరుడైన వాలిపుత్రుని జూచి, ఓ శూరవరా! నీ వెగిరి లంకను ప్రవేశించి రావణుని యొద్దకు వెళ్లి నా మాటగా భయములేని వాడవై నీయొక్క నేర్పు తెలియువిధముగా ఇట్లు చెప్పుము. “ఓరీ! రావణా! లక్ష్మి నశించినవాడా! ఐశ్వర్యము చెడినవాడా! చైతన్యహీనుడా! చావగోరినవాడా! గర్వము చేతను హోమము చేతను నీవు అప్సరసలకు గంధర్వులకు, యక్షులకు, నాగులకు, దేవతలకు, ఋషులకు, రాజుల సమూహములకు ద్రోహము గావించితివి. బ్రహ్మ వరములచేత గలిగిన గర్వము తీఱునట్టి కాలము ఆసన్నమైనది. భార్య నపహరించుటచే బాధపెట్టబడిన వాడను. నీకు శాస్తి చేయుటకై నీ లంక వాకిట యమధర్మరాజువలె నిలిచియున్న వాడను. ఏ బలమును నమ్మి మాయచే సీత నపహరించితివో అట్టి బలముతో బయలుదేరి రమ్ము. రాక్షసరాజా! నా బాణములచే చచ్చి నీవు వీరుడవైనచో దేవతలు, రాజర్షులు, మహర్షులు నివసించె స్వర్గమును స్థానముగా పొందెదవు. వీరుడవు కావేని నీ పొగరు నణచుకొని సీతను మఱల నిచ్చి నన్ను శరణుపొందుము. కాదందువేని నేను వేగముగా నా బాణ పరంపరలచే లోకమున రాక్షసులే లేకుండ జెసెదను. ధర్మచిత్తుడు రాక్షసులలో శ్రేష్ఠుడు నయిన వీభీషణుడు ఇచ్చట నన్నాశ్రయించినాడు. ఓ రాక్షసా శ్రీమంతుడగు నితడు ఆటంకము లేకుండ స్థిరముగా లంకాధిపత్యమును పొందెను. మూర్ఖులు మిత్రులుగా గలవాడా! వినుము రా! ధర్మమార్గమును విడచి పాపమునే ఆర్జించు మనస్సు గలవాడవు. స్వాతంత్ర్యము లేని మనస్సు గలవాడవై రాజ్యమును ఒక్కనిమిషమైన పాలించుటకు ఇక శక్యము గాదు. ధైర్యమును కూడ గట్టుకొని శౌర్యముతో యుద్ధమునకు వచ్చినచో నా వాడి బాణములచే మరణము నొంది పవిత్రుడవయ్యెదవు. పొగరు తొలగి నన్ను మోసగించి పక్షిరూపము నొంది

మనోవేగముతో మూడు లోకములలో ప్రవేశించితివేనియు ఓ నీచుడా! శ్రమనొందుదువే గాని అంత మాత్రముచే నా దృష్టిపథమున బడి ఘోరమైన మృత్యుముఖమున బడకుండగా ద్రోహీ! భూమియందు (బ్ర)తుక జాలవు. కాన నేను చెప్పు హితమును వినుము. నీపురమున నీవు కోరిన వనుభవింపుము. జీవశ్రాద్ధమును చేసికొమ్ము. ఓ కుమతీ! నీ ప్రాణము నాచేతిలో చిక్కినది సుమా." అని రాముడు చెప్పగానే తారాపుత్రుడైన యంగదుడు రూపము జెందిన అగ్నియో యనునట్లు ప్రతాపము తెలియునట్లుగా రావణుని గొప్ప సౌధమున వ్రాలెను. మంత్రులతో గలిసియున్న రావణుని ముఖము చూచి దగ్గరగా వెళ్లి రూపము దాల్చిన అగ్నివలె తీవ్రముగా వెలుగుచు తు.చ. తప్పకుండగా రాముని మాటలనెల్లను వినిపించెను. (ఒక్క అక్షరమైనను విడువక అని చెప్పుటకు సంస్కృతమున తు.చ. తప్పక అని వాడెదరు) ప్రఖ్యాతి గలిగిన కోసల రాజపుత్రుడు పవిత్ర చరిత్రుడు నయిన రామభూపాలునకు దూతను వాలి పుత్రుడను. ఎప్పుడైన నా పేరు వింటివా? నేనంగదుడను. పాపరహితుడగు రామచంద్రుడిట్లు చెప్పమనెను. దురాత్మా! పౌరుషము గలవాడవేని యుద్ధమునకు లేచిరమ్ము. మంత్రులు, పుత్రులు, బంధువులు, మిత్రులు మున్నగువారితో గూడ నిన్ను సంహరించెదను. లోకములు బాధలు లేనివై సుఖించునట్లు దేవతల యొక్కయు రాక్షసుల యొక్కయు, ఋషీశ్వరులయొక్కయు, నాగుల యొక్కయు, స్త్రీల సమూహములకు కంటకుడవైన నిన్ను చంపెదను. భూపుత్రుని గౌరవ పూర్వకముగా వేగముగా తీసుకొని వచ్చి అర్పించి శరణువేడవేని నిన్ను జంపి నీ రాజ్యమే విభీషణున కిచ్చెదనని చెప్పమనెను. అని చెప్పగా.

## అంగదుడు రాక్షసుల జంపి మరలి శ్రీరామునికడకు వచ్చుట:

ఆ కఠినమైన మాటలను విని కోపముచే ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడై రాక్షస రాజు ఓ రాక్షసులారా ఆ దురాలాపములు పలుకు వీనిని కొట్టుడు, త్వరగా పట్టుకొనుడు చంపుడు అని చాల సారులు పలుకగనే ఘోర రాక్షసులు నలుగురు వాలి పుత్రునిపై బడి వేగముగా పట్టుకొనగానే తన బలమును జూపదలచి వారలచే పట్టుబడినట్లుగా నటించి వారలను తటుక్కున చంకల క్రింద పట్టి నొక్కి అతడు మహా వేగముతో పక్షివలె మేడమీద కెగిరెను. అచ్చటినుండి ఆ రాక్షసులను నలువురను విసరి పారవేయగా వారు బలము నశించి చచ్చిపడిరి. రోషముతో రావణుడు చూచుచుండెను. అంత నంగదుడు పర్వతశిఖరమువలె ఎత్తైన ప్రాసాదశిఖరమును చూచి రావణుడు చూచుచుండగా పాదముల దెబ్బలచే

ఇంద్రుడు పూర్వము మంచుకొండ శిఖరమును ద్రుంచువిధముగా నేలబడదన్నెను. ఈవిధముగా వేగముగా సౌధశిఖరమును విరుగదన్ని పరాక్రమము జూపి ఓ రావణా! నేను అంగదుడను, వాలిపుత్రుడను రాముని బంటును వచ్చినవాడను అని స్పష్టముగా పలికి పెద్ద అరుపులు ధ్వనులు చేయుచు టివ్వున ఆకాశమార్గమున వచ్చి వానరులు ఉత్సాహముతో ఆనందింపగా రాక్షసవీరులు విపరీతమైన దుఃఖముతో వగచుచుండగా రామచంద్రుని ముందర మెల్లగా నిలువగా చూచి రఘువల్లభుడు మనసునందు మెచ్చుకొని యుద్ధము చేయ సమకట్టెను. తన ప్రాసాదము చెడుటకు రావణుడు రోషము అతిశయింపగా అది తన సంపద నశించుటకును తనకు నాశము వేగముగా కలుగుటుకును సూచన యని వేడినిట్టూర్పులు విడచెను. కొండవలె నున్న ఆ సుషేణుడు బలవంతులును శౌర్యవంతులు నైన వానరసేనతో రాజు నాజ్ఞ ననుసరించి చంద్రుని చుక్కల సమూహము వలె నాలుగు ద్వారములను చుట్టి వచ్చుచుండెను. వ్యూహములు దీర్చి యున్న వానర సైన్యమును ఉప్పు సముద్రమును దాటుచున్న అక్షౌహిణులను రాక్షసులు చూచి భయపడిరి. అందు వీరులు సాహసులు నైన వారు యుద్ధము చేయుట కెంతో కుతూహల పడిరి. ఎంతో ఉత్సాహముతో అస్త్రములను దాల్చి వానతోడి పెనుగాలివలె తిరుగుచుండిరి. కోటకు కందకమునకు మధ్య భాగము నంతయు వ్యాపించియున్న కోతుల సైన్యమును చూచి భయముతో ఇది వేఱొక కోటయా యని తలంచిరి. వారి యరుపులకు రాక్షస సంఘములు హాహా అనుచు అడలుచుండిరి.

★★★



# నలువది రెండవ సర్గము

## రాక్షసులు రావణునితో లంకను వానరులు ముట్టడించిరని తెల్పుట:

అంతట రాక్షసులు రాక్షస భవనమునకు వెళ్లి అతనితో వానరులు లంకనంతయు అడ్డగించినట్టి విధము నంతయు చెప్పగా అతడు కోపించి ఆశ్చర్యకరముగా రక్షణను రెట్టింపుచేసి వేగముగా సౌధము నెక్కి ఆ విధమునంతయు జూచెను. అడవులు, కొండలు లెక్కింపరాని యుద్ధలంపటులైన వానరులాక్రమింపగా భూమిని మ్రింగునట్లు వచ్చుచున్నవీరిని యుద్ధమున నేనెట్లు సంహరింతు నని మనసులో అధికముగా ఆలోచించుచు, స్థిరుడై వారి సాహసమును చూచెను. రామ భూవిభుడు కూడ కోట సమీప ప్రదేశమునకు వెళ్లి అన్నిదిక్కులయందు రక్షోవీరులచే చుట్టుముట్టబడి రక్షింపబడుచు అనేక పతాకములతో నొప్పుచున్న లంకను జూచి జానకిని తలచుకొని మనస్సులో జాలినొంది అయ్యో! లేడి కూన కన్నులవంటి కన్నులు గల జానకి నాకై చాల కృశించి శోకముతో భూమిపై బడి తపించుచున్నది గదా. హా! లలనామణీ! యనుచు ఆరాటమునొంది ఆమెయందు కృపాలుడై

## శ్రీరాముడు లంకకోటకు లగ్గలు పట్ట వానరుల కనుజ్ఞయిచ్చుట:

సకల విరోధులను ధ్వంసము చేయుడని రఘుచంద్రుడనుజ్ఞ నీయగా చేతులయందు చెట్లను భుజములపై కొండ శిఖరములను దాల్చి వానన సైన్యములు గ్రసింపబడునట్లు గర్జనలచే దిక్కులన్నియు నిండునట్లు రాక్షససైన్యమండలమును మహా ఆర్భాటముతో మార్మోనెను. పిడికిటి పోటుల చేతను, పర్వతములను పడవేయుటుల చేతను లంకనంతయు పిండిపిండిగా చేయబూని రఘురాముని కోరిక తీరునట్లు చెలరేగి జీవితములపై ఆశల ను కూడ వీడి ఇరువది చేతులు గల రావణుడు చూచుచుండగా పరాక్రమముతో కోటను లగ్గపట్టి వానరశ్రేష్ఠులు వృక్షముల పర్వతముల సమూహములతో ప్రాకారములను, తోరణములను, వనములను నాశనముజేసి, నిర్మలమైన జలముగల కందకములను, గడ్డి చేతను, కట్టెల చేతను, పర్వత శిఖరములచేతను, చెట్లచేతను, ధూళిచేతను పూడ్చివేసిరి.

లక్షలు, కోట్లు, సంఖ్యగల వానరులు కోటనెక్కి గోపురములను బడగొట్టి ద్వారములు బ్రద్దలుచేసి కోటకొమ్మలను విరిచి పడవేసి భయంకరమైన గర్జనలతో నిండించి ఎగిరి దుముకుచు సంతోషముతో అందఱును జయము శ్రీరాము విభునకు, జయము లక్ష్మణునకు, రామునిచే పాలింపబడు సూర్యపుత్రునకు జయమని ఘోషించుచుండిరి. బంగరుతోరణములు వెండికొండతో సాటివచ్చు గోపురములు రూపిమాసిపోవునట్లు బలవంతులగు వానరులు ధ్వంసము చేసిరి. వీరబాహువును, సుబాహుడును చుట్టిముట్టి ముట్టడికై కాచియుండిరి. అంతలో తక్కిన వానరులు తగిన విధముగా సైన్యమును వరుసలుగా నిల్పగా కుముదుడు తూర్పున కోటిమంది వానరులతో ప్రఘసుడు, తనసుడు తనకు తోడుగా రాగా కాచియుండెను. శతవలి తనకు ఇరువది కోట్ల వీరులు తనకు తోడుపడ దక్షిణ ద్వారమున నిలిచెను. మహాబలశాలియగు సుషేణుడు అరువది కోట్ల వానరులతో పడమటి ద్వారమును ముట్టడించి నిలిచెను. రామచంద్రుడు ఉత్తరద్వారమున తమ్ముని తోడను, సుగ్రీవుని తోను వ్యూహమును బన్నెను. కొండముచ్చులరాజు, చూచుటకు భయంకరుడైన గవాక్షుడనువాడు రామున సమీపమున నుండెను. ఎలుగుబంట్లరాజగు ధూమ్రుడు ఎలుగుసేనలు సేవించగా రామునికి మఱియొక దిక్కున నిలిచెను. మంత్రులతో గూడి విభీషణుడు గదను ధరించి రఘురాముని దగ్గరలో నిలిచెను. గంధమాదనుడు శరభుడు గజ గవాక్ష గవయులును సైన్యమున కంతకు కాపుగా అన్ని దిక్కులకు పరువెత్తి చూచుచుండిరి. అది అంతయును జూచి రావణాసురుడు విపరీతమైన ఆగ్రహమును పొందెను.

## రావణుడు రాక్షసులకు యుద్ధమునకు బోవ నాజ్ఞాపించుట:

రాక్షసులారా! యుద్ధమునకు పొండు. అని రావణుడు పల్కగా ఆ మాట వెడలినదో లేదో అరుపులు పెడబొబ్బలు అట్టహాసములు భయంకరములైన పెద్ద శబ్దములు అధికముగా చెలరేగెను. చంద్రునివలె తెల్లని ముఖభాగములు గల చర్మములతో చేసిన భేరులు బంగారు కఱ్ఱలతో బాదగా పెద్ద ధ్వనులు బయలుదేరగా భూషణములు ధరించిన నల్లని శరీరము గలవారు శంఖములూదగా కొక్కెరలతోడను, మెరుపులతోడను గూడిన మేఘ సమూహమువలె దోచెను. ఇట్లు సముద్రము పొంగిన విధముగా రాక్షస సైన్యములు ఎదుర్కొనెను. వానరులు పెద్ద శబ్దములు కొండగుహలు చరియలు మారుమ్రోగునట్లు

వారినెదుర్కొని పరాక్రమముతో యుద్ధము చేయగా రాక్షస సేనలకు యుద్ధము రాక్షసులకు దేవతలకు పూర్వము జరిగన యుద్ధమువలె ఘోరముగా సాగెను. గోళ్లే ఆయుధములు గాగల మహావీరులగు వానర శ్రేష్ఠులు కొండలు రాళ్లు చెట్లు ఆయుధములుగా గలవారై పోరగా రక్కసులు భయంకరమైన శూలపరిఘ శక్తులతో యుద్ధము చేసిరి. తమ తమ పేర్లను చెప్పికొనుచు వానర నాయకులు జయ జయ సుగ్రీవా! జయము రామా అని ఘోషించుచు విజృంభించి కోట బ్రాకుచు ప్రాకారముల మీదనున్న రాక్షసులను గోళ్లచేతను కోఱల చేతను కొండల తోడను, చెట్ల తోడను మర్దించి సంహరించి భూమిమీద పడవేయుచుండగా రాక్షసులు చెలరేగి ప్రాకారములెక్కు వానరులమీద భిండివానలములను ఖడ్గముల ను శూలములను అధికముగా గురియింపగా వానిని లెక్కచేయక వానరులు కోటనెక్కి రాక్షసులను చంపుచుండ వారు వీరిని చంపుచుండ రక్తమాంసములతో భూమినంతయు బురద వలె నుండెను.

★★★



# నలువది మూడవ సర్గము

## వానర రాక్షస ద్వంద్వయుద్ధము:

బంగారు ఆభరణములతో నలంకరింప బడిన గుఱ్ఱములును, అగ్నివలె వెలుగు ధ్వజములును, మెఱయుచున్న కవచములును, సూర్యునివలె ప్రకాశించు రథములును గలవియై రాక్షస సైన్యములు ప్రకాశించెను. రావణునికి జయముగోరి రాక్షసులును, రాముని జయముగోరి వానరశ్రేష్ఠులును రోషములతోను చూచుటకు భయంకరముగ నున్న వేషములతోను గర్జింపులు ఆకాశమును నింపుచుండగా శౌర్యములతో తలపడిరి. ఇట్లు సంకులమైన సమరము జరుగుచుండగా వాలిపుత్రుడైన అంగదుని ఇంద్రజిత్తు ఈశ్వరుని దాకు అంధకాసురిని వలె ఎదుర్కొని కలబడెను. సంపాతి యను వానరవీరుడు ప్రజంఘుని నెదుర్కొనెను. జంబుమాలియను రాక్షసుడు హనుమంతుని దాకెను. మిత్రఘ్నుడను రాక్షసుడు అమిత కోపుడగు విభీషణునితో తలపడెను. తపనుడను రాక్షసుడు గజునెదుర్కొనెను. నికుంభుడు నీలునితో తలపడెను. ఆ మహాయుద్ధములో ప్రఘసునితో వానరరాజగు సుగ్రీవుడు తలపడెను. లక్ష్మణుడు విరూపాక్షునితో పోరెను. యజ్ఞకోపుడును సుప్తఘ్నుడును, అగ్నికేతు రశ్మికేతులును తెగించి రామునితో తలపడిరి. అట్టియెడు వజ్రముష్టి మైందుని తోడను, అశనిప్రభుడు ద్వివిదుని తోడను ఎదుర్కొనిరి. ప్రతపనుడను భయంకర రాక్షసుని నలుడు కొట్టెను. ధర్మపుత్రుడైన సుషేణుడు అమిత బలము గల విద్యున్మాలిని పరువెత్తునట్లుగా ఎదిరించెను. తక్కిన వానరులు రాక్షసులును తమకెదురైన వానరులతో ఆశ్చర్యపడునట్లుగా ఘోరముగా పోరాడిరి. ఈవిధముగా శరీరము గగుర్పొడుచునట్లు అంతటను సంకుల సమరము సాగుచుండగా భూమిపై కుంతలములనెడు పచ్చికలు, మృతదేహములనెడు కట్టెలు రక్తనదులు వ్యాపించెను. అట్టి సమయమున తనకు బాధ గలిగించుచున్న వాలిపుత్రుని ఇంద్రజిత్తు గదాఘాతములచే నొప్పించెను. అట్లు కొట్టగనే పట్టరాని కోపముతో ఆ వానరశ్రేష్ఠుడు వాని రథము మీదకు దూకి వాని విల్లును పట్టి విదిలించి దూరముగా బారవైచి అతివేగముతో సూతుని తలను దేహమునుండి వేరగునట్లు నరికి గుఱ్ఱములను చావమోది రథమును నుగ్గు నూచముగ

విరిచి నేల బడవేసెను. మూడు వాడి బాణములతో ప్రజంఘుడనువాడు గొప్పబలముతో కొట్టగా సంపాతి మద్దిచెట్టుతో గొట్టి వానిని బాధించెను. యుద్ధ మధ్యమునందు నిలబడి కోపముతో తన పేరు చెప్పుకొనుచు జంబుమాలి వాయుపుత్రుని వక్షమందు పిడుగువంటి శక్తితో కొట్టగా వాయుపుత్రుడును సాటిలేని వేగముతో మెరుపువలె అతని రథము మీద వ్రాలి చేతి కొలదిగా రాక్షసుని నొక్కపెట్టుపెట్టగా వాడును రథముతో గూడ ఒక నిమిషములో చచ్చిపడెను. ప్రతపనుడను వాడు నలుని జూచి తీవ్రమైన బాణములచే శరీరమందు నెత్తురులు ప్రవహింపజేయుచు వేగముగా మీదకు వచ్చుచుండగా నలుడు వానిపై కురికి వాని కనుగ్రుడ్లను వేగముగా బెరికి వానిని సంహరించెను. చూచువారు భయపడునట్లు ప్రఘసుడు వానరసైన్యముల నధికముగా మ్రింగునట్లు మీదబడగా వానరరాజైన సుగ్రీవుడు ఆగ్రహించి చేతనున్న సప్తవర్ణమను వృక్షముచే తలచెక్కలగునట్లు మోదగా రూపము తెలియరాని విధముగా ఆ క్రూరరాక్షసుడు నేలగూలెను. లక్ష్మణుడు అక్షయ శరీరములను శత్రు హృదయము కంపించునట్లు కురిపించి యొక పదునైన బాణముతో వేగముగా విరూపాక్షుని సంహరించెను. యజ్ఞకోపుడు, సప్తఘ్నుడు, అగ్నికేతుడు, రశ్మికేతుడు అను నలువురు రక్కసులు బాణములు వరుసలతో రామచంద్రుని నొప్పింపగా రోషముతో వేగముగా రాముడు ఆ నల్వురను నాల్గు బాణములతో నరకివేసెను. విజృంభించుచున్న వజ్రముష్టియను రక్కసుని జూచి మైందుడుగ్రుడై తన పిడికిటితో పొడువగా వాడు రథముతో గుఱ్ఱములతో గూడ పిడుగుపాటున నేలగూలు పట్టణమందలి సౌధమువలె నేలగూలెను. అప్పుడు నికుంభుడు చాలా వాడియైన బాణములతో నీలుని వేగముగా గాయపరిచెను. మఱియు సూర్యుడు తన కిరణములచే మబ్బులను చెదరుగొట్టు విధముగా ఆ రాక్షసుడు తీవ్రమైన బాణములతో నొప్పించి నవ్వగా వానరవరుడైన నీలుడును దానవాంతకుడగు విష్ణువు వలె అమితమైన లాఘవముతో అతని రథచక్రముతోనే అతని రథసారథిని యముని వీటికతిథిగా బంపెను. పర్వత శిఖరమును ఎత్తి ద్వివిదుడను వాడు వేగముగా యశని ప్రభుడను రాక్షసుని మీద వేసి రాక్షస సమూహము చూచుచుండగా చెట్ల సమూహముతో వానిమీద దాడిసల్పగా వాడును వాడిగల బాణముల వరుసల చే ఆ వృక్షములను నరికి అతని రొమ్మున బాణములను నాటవేయగా ఆ వానరుడు సాలవృక్షముచే ఆ రాక్షసుని గుఱ్ఱములను రథముతో గూడ సంహరించెను. అప్పుడు విద్యున్మాలి యను రాక్షసుడు రథమునెక్కి బంగారు అలంకారము గల బాణములను వర్షమువలె గురియించుచు

సుషేణుని బాధించి గర్జించగా అతడు వేగముగా ఒక పర్వత శిఖరమును వేసి అతని రథమును ముక్కలు చేయగా కోపించి సుషేణుడు నొక బండరాతి నెత్తి అతని మీదకు ఉరుకగా అది తగలకుండ తప్పించుకొని అతడు తన గదతో వానరుని రొమ్ము సూటి చూచి క్రుమ్మగా అతడు దానిని లెక్కచేయక వేగముగా ఆ బండతో రక్కసుని రొమ్ము బ్రద్దలగునట్లు వేయగా రొమ్ము ముద్ద అయి అతడు నేలగూలెను. ఈవిధముగా వానరులు రక్కసిమూకలను ద్వంద్వయుద్ధమున యమలోకునకు బంపిరి. గదలు, పట్టిసములు, తోమరములు ఖడ్గములు మొదలగు సాధనములు విరిగి నేల నిండ పడియుండెను. అనేకవిధములైన చెల్లాచెదరై చెడిపోయిన గుఱ్ఱముల గుంపులు నేలపై పరచినట్లుండెను. విరిగిన దంతములు, తెగిన తొండములు, గలిగి పర్వతముల వంటి యేనుగులు నేలపై ప్రోగులు పడెను. రాక్షసుల వానరుల సమూహము యొక్క శరీరముల మొండెములు ముక్కలను చాలగా నుండెను. తెగిపడిన నొగళ్లును, విఱిగిన కాండ్లును, విఱిగి పడిన బండి కండ్లును అద్భుతముగా భూమియందు చెల్లాచెదురై నక్కలకు పండువగునట్లుగా పడెను. దర్పించియున్న వానరులతో గర్వించిన రాక్షసులు పోరు సల్పుచుండ దట్టముగా వానరుల రాక్షసుల మొండెములు భయంకరముగా నాట్యమాడెను. శరీరములందు ధారలై రక్తములు కారగా యుద్ధము చేయజాలక ఎప్పుడు రాత్రి వచ్చునా యని తమ మనస్సులందు తలచుచుండగా సూర్యుడస్తమించెను. వానరుల ప్రాణములకు వికాశిని యైన రాత్రి చీకటులను క్రమ్మజేయుచు కన్నులు కనబడకుండునట్లు వచ్చెను.

★★★



# నలువది నాలుగవ సర్గము

## వానర రాక్షసుల రాత్రి యుద్ధము:

ఆ గొప్ప చీకటియందు బద్ధవైరులైన బలవంతులగు వానరులకు పాపాత్ములు దుష్టులునగు రాక్షసులకును యుద్ధవ్యవసాయము ఆగక జరిగెను. ఓరీ రాక్షసుడా! పోకు పోకుము అనగా ఓహో కీశా రా రమ్ము అనగా క్రూరుని చంపుము చంపుము అనగా ఆ కూళను దిగమ్రింగుము అనగా ఓరీ! యిస్సిరో! పారుచున్నావా అనగా పారి పోనిత్తునా అనగా రారా అనగా ఈవిధముగా ఆ రాత్రి యుద్ధ భూమియందు వినబడుచుండెను. నల్లని శరీరకాంతులతోను పుటముపెట్టిన బంగారు కవచముల మెరపులతోను అప్పుడు వనౌషధులతో గూడిన పర్వతరాజముల వలె రాక్షస సమూహములు ప్రకాశించెను. ఆ దట్టమైన చీకటియందు రాక్షస కోట్లు వానరులను మ్రింగసాగెను. వానరులును విడువకుండ శత్రువుల గుఱ్ఱములను, గజముల గుంపులను, జెండాలను, టెక్కెములను తీక్ష్ణమైన కోఱలతో పట్టుదలతో ముక్కలు ముక్కలుగా చేసి దుస్సహముగా రూపుమాపిరి. రామలక్ష్మణులప్పుడు ఓర్చుకొనని వారై వింటి నారి మ్రోతలు చెవులు చిల్లులు వడ జేయుచుండ జడివాన గురిసిన విధముగా బాణవర్షము గురియించి కొలదిగా గనిపించిన విరోధులను సంహరింపగా, రాక్షసులు క్రోధముతో రథములతో మీదకు వచ్చుచుండగా గుఱ్ఱాల గిట్టల తాకిడులచే రేగిన ధూళి యిరుపక్షములవారిని గ్రుడ్డివారినిగా చెవిటివారినిగా జేసెను. వారి శరీరములందు విపరీతముగా రక్తనదులు పారినవి. కొల్లలుగా పణవముల శంఖముల వేణువుల భేరుల ధ్వనులు దిక్కులు నిండునట్లు ధ్వనించినవి. చచ్చుచున్న రాక్షసుల వానరుల నానా విధములగు పెద్ద కేకలు అన్ని దిక్కులను కఠోరముగా ఆ సమయమున హెచ్చయినవి. ఆ సమయమున యుద్ధభూమి ప్రవేశింప వీలుకానిదియు తెలియదానిదయునై అత్యధికమైన రక్తమాంసములచే బురదగా నుండి రాక్షస వానర సంఘములను హరించునదియై బాణములనెడి పుష్పహారములు గలదై యొప్పారెను.

## శ్రీరాముడు రాక్షసుల వధించుట:

ఆ రాత్రి కాళరాత్రి వలె కన్పట్టెను. అట్టి సమయమున రాక్షస శ్రేష్ఠులు గుంపులుగా గూడి వాడి బాణములను గురియించుచు తీక్ష్ణమైన తొందరపాటుతో రాముని దాకిరి. వారలు కోపముచే ఉద్రిక్తులగుటచే భయంకర శబ్దముతో ఆకాశమును బలగించుచు వారింప శక్యముగాని యట్లు రాగా ఆ గర్జనలు సముద్రములు పొంగుచున్న విధముగా నుండెను. వారలు వచ్చుటను జూచి రఘురాముడు వింటిని తెగలాగుటచే చంద్రమండలాకారమగునట్లు చేసి అల్లైత్రాటి మ్రోత చెవులు చిల్లులు వడజేయుచుండ ఆరు బాణములచే ఆరుగురు రాక్షసులను ఒక్క నిమిషమాత్రములో నరకెను. అంతటితో విడువకుండ ఆ ఖరాంతకుడు తన్నెదిరించిన దుర్ధర్షుడగు యమశత్రుని, అధికబలుడైన మహాపార్శ్వుని, మహోదరుని, మహాకాయుని, వజ్రదంష్ట్రుని, భయంకర బాహువులుగల శుకసారణులను క్రూరములు వికటములు అయిన బాణములతో కప్పివేయగా వారు చావు తప్పించుకుని పారిపోయిరి. అంతట రాముని బాణముల వరుసలు నిరాఘాటముగా సూటి దప్పకుండగా అగ్నిజ్వాలల విధముగా దిక్కులన్నిటి వెలుగజేసెను. బంగారు కాంతులు గలవియు రామనామాంకితములు అయిన ఆ బాణ సమూహములలో అగ్నియందు బడిన మిడుతల వలె రాక్షసులు చంపబడిరి. ఆధిక్యము, దక్షత గలిసి ఎంతయో వింత గలుగజేయగా, చూచుటయు, బాణములు వేయుటయు గలిసి పగవారల దాడి నడ్డగింపగా, వేషమును, రోషమును నొక్కటయి భయము గలుగజేయగా, మత్తుగాని, బడలికగాని లేక రాముడొక్కడే తీక్ష్ణమగు ఆకారముగలవాడై ఒక లక్ష్యముపై ఒక బాణమునే గాని రెండవ బాణమును గురిపెట్టడు. ఏ ప్రాణికైనను అతనిబాణము వీపున దగులదు [వెన్నిచ్చిన వానిని శ్రీరామబాణము చంపదు. కావుననే కాకాసురుడు పారి పరువెత్తుచు ప్రాణములు దక్కించుకుని శ్రీరాముని శరణుజొచ్చి బ్రతుకగల్గెను] ఒక్క బాణమైనను వృధా పోదు. బంగారు ములుకులు గలిగి ప్రకాశించు బాణముల వరుసలు వేనవేలుగా అన్ని చోటులకు వెళ్లి పరచుకొనగా ఆ రాత్రి మిణుగురు పురుగులతో నందమొలుకు శారద రాత్రి వలె కనబడెను. క్రూరులైన రాక్షసుల గర్జనలచేతను, వానరుల సమూహముల గొప్ప అరపుల చేతను ఘోరముగా నున్న ఆ రాత్రి గుండెలు పగులునట్లు ఘోరాతి ఘోరమయ్యెను. చిమ్మచీకటి వంటి శరీరకాంతులతో కొండమ్రుచ్చులు తమయరుపులు కొండలు నిండజేయుచు దొరికిన రాక్షసుల గుంపులను పట్టుకొని పట్టువిడువక చంపి తినుచుండెను.

## ఇంద్రజిత్తు అంగదుచే పరాజితుడయి మయాయుద్ధమొనర్చుట:

వానరుల దెబ్బను, రాక్షసుల ఆపదను, రామలక్ష్మణుల పరాక్రమమును జూచి ఆ ఇంద్రజిత్తు మనస్సున రోషమునొంది తన పరాక్రమము సార్థకమగునట్లు వానరులపై కలబడగా వెంటనే పరాక్రమముతో వాలిపుత్రుడవలీలగా వాని గుఱ్ఱములను సారథిని చంపివేయగా ఇంద్రజిత్తు ఇది తీరుగాదని తలంచి రథము నుండి ఉరికి మాయచే కనబడకుండ దాగగా చూచి దేవతలు ఋషులును వీరుడగు ఆ తారా పుత్రుని పొగిడిరి. ధీరుడనియు, మయాయుద్ధమందు నేర్పరి యనియు, యుద్ధమున జయింపరాని వాడనియు, జగమంతయు ఇంద్రజిత్తును గురించి తెలిసిన వారగుటచే అట్టి వీరుని నోడించుటచే ఆ వానరుని జగమంతయు మెచ్చెను. రామలక్ష్మణులును మెచ్చుకొనిరి. సుగ్రీవుడును విభీషణుడును మేలు మేలనిరి. ఈ విధముగా వానరశ్రేష్ఠుని తాకిడికి నిలువజాలక మనసులో విరోధము పెరుగుచుండగా మాయచే కనిపించకుండ వానర సంఘముపై వాడి బాణములను గురిపించి నొప్పించుచుండగా అప్పుడు రామచంద్రుడు వానర సమూహములారా! వీడు రాత్రియుద్ధము నందసాధ్యుడు. బ్రహ్మదేవుడిచ్చిన వరముల బలముచేత మూడు లోకములను పీడచెందునట్లు చేయగలవాడు. ఇప్పుడు నాకు బ్రహ్మ యొక్క మాట గౌరవింప నర్హము గాన మీరలును సుగ్రీవుని యొద్ద నిలబడి జాగ్రత్తగా నుండుడని చెప్పెను. ఇంద్రజిత్తు కోపముతో కనబడకుండ ఉండి ఆకాశమున కెగిరి జగత్తు భయమందునట్లు పిడుగుపాటును దలపింపజేయు వాడి బాణ సమూహములను జడివానవలె వానరసైన్య సంఘములపై గురిపింపగా వారలు భయమును, ఆశ్చర్యమును ఎక్కువైన తొందరపాటును పొంది దిక్కుతోచని వారై బలములు తగ్గి సొమ్మసిల్లి నేలపై బడి లేవలేక కదలలేక యుండిరి. ఎవ్వరికిని కనబడకుండ, తానెచ్చట నున్నదియు ఎవ్వరికిని తెలియనీయక శౌర్యముతో భయంకరములగు సర్పబాణముల సమూహములచే రాముని సుమిత్రానందనుడగు లక్ష్మణుని వీరత్వము తొలగునట్లు బాణములచే శరీరమునందలి అన్ని భాగముల బాధ కలుగునట్లు సాటిలేని విధముగ ఆ దశకంఠుని పుత్రుడగు ఇంద్రజిత్తు చేసివైచెను. యుద్ధరంగమున నెదురుగా నిల్చి రాజపుత్రు మద మణగింపలేక ఆ దేవతావిరోధి అప్పుడు మాయచే సంహరింపదలచి వానరశ్రేష్ఠులెల్లరు చూచుచుండగా ఆ ప్రఖ్యాతి చెందిన పరాక్రమముగల వాడు వారలను అస్త్రబద్ధులను జేయ దలంచెను.

★★★

# నలువది యైదవ సర్గము

## ఇంద్రజిత్తు శ్రీరామ లక్ష్మణులను నాగపాశబద్ధులను జేయుట:

అట్లు తనయున్న చోటు కానరాకుండ ఎచ్చట జూచినను దానే అయి మాయచే ఆకాశము నుండి పరాక్రమించుచున్న రాక్షసరాజపుత్రుని వెదకుటకె ఇంద్రనందనుని (వాలి) పుత్రుడైన అంగదుని, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుని, నలుని, సుషేణుని పుత్రులిద్దఱిని, మహాపరాక్రముడైన శరభుడను వానరుని, ఋషభుని, వినతుని, సానుప్రస్థుని, ఘనుడైన ఋషభస్కంధుని బంపగా, వారలు చెట్లను, కొండలను ఆయుధములుగా ధరించి ఆకాశమందు నాల్గువైపులను పనిబూని వెదకుచుండగా ఇంద్రవిరోధియు శౌర్యముతో రెక్కలు గలిగిన పెద్ద సర్పముల వలె ఱివ్వమను మ్రోతలే బుసలు గొట్టిన విధముగా ఒక్కుమ్మడిగా బాణముల వరుసలను ఆ వానర సమూహము వారల వేగమును అపగా ఆ వానరవీరులు ఇంద్రజిత్తును, మబ్బులచే గప్పబడిన సూర్యునివలె చూడలేరైరి. అప్పుడు రాక్షసుడు కొంచెము వ్యవధి యిచ్చినచో వీరు తెప్పరిల్లి రేని తిరిగి వీరల ముందఱ నిలుచుటకు శక్యముగాదని ఆ మానవ రాజపుత్రుల శరీరముల నిండ మెండుగ ఆగకుండ ఆ ఇంద్రజిత్తు రోషముతో గూడిన చిత్తముగలవాడై వాడియైన బాణములను వేసెను. ఆ మహాస్త్రముల దెబ్బలు తగులుటచే రక్త ప్రవాహములచే తడుపడబడిన శరీరము గలవారై పూచిన మోదుగలను బోలియున్న వారిని జూచుచు ఎఱ్ఱని కన్నులు గలవాడై పరాక్రమించి కాటుకవంటి నల్లని దేహముగల ఆ యింద్రజిత్తు అదృశ్య శరీరుడై తన అధికమైన శూరత్వము వారలెరుంగునట్లు దెల్పుచు ఇట్లనెను. మీరలా నన్నెదుర్కొను మేటి పౌరుషవంతులు? యుద్ధరంగమందు మాయచే నేను కనబడకుండ సంచరింపగా ఆ వృత్రాసురుని శత్రువగు ఇంద్రుడును నన్ను సమీపింపలేడు. చూడనైన జాలడనగా ఇక మీరు లెక్కయా? ఘోరమైన నా అస్త్రముల వరుసలచే మిమ్మిద్దఱను సంహరించెదను చూడుడు. ఇట్లు ఆ క్రూరరాక్షసుడు కోపము గలిగించు భయంకరములైన మాటలను పల్కి వింటి నారి యొక్క భయంకర శబ్దములచే విరోధులను భయపెట్టుచు శత్రువుల గర్వములను శోషింపజేయు సర్పబాణముల వరుసలను పైపై గ్రుమ్మగా జేసి

దుర్మార్గులను ద్వేషించుటయే ఆభరణములుగా గల్గిన ఆ రామలక్ష్మణులను ఈర్ష్యతో వేగముగా బాణ పాశబద్ధులను చేసెను. ఆ దుర్ణయపరుడు రాజకుమారుల శరీరములందు ఎక్కడను వ్రేలెడు సందైనను లేకుండ బాణసమూహమును నాటెను. ఆ పాటునకు చలించినవారై ఆ వీర శ్రేష్ఠులు ముడిబిగి సడలిన ఇంద్రధ్వజమును దలపించుచు కంపము జెందుచు నిబ్బరము సడలుచుండగా నిమిషమైనను కన్నులు విప్పలేక పైన వచ్చి పడుచున్న బాణములచే మర్మములు భేదింపబడుచుండ బాధజెందుచు గాయముల వెంట బుడబుడ మని రక్తములు స్రవించుచుండ మిక్కిలి కలతజెంది నలిగిరి. ఆ మహానుభావుల శరీరములందు చేతివ్రేళ్లవఱకు కూడ బాధింపబడని చీల్చబడని నాగాస్త్రములచే బంధింపబడని ప్రదేశము కానరాదు. భయపడక ఆ బాధనంతయు భరించి అట్లే నిలబడి యున్న రాముని ఎఱ్ఱని కన్నులతో గాంచి ఇంద్రజిత్తు వాడి మొనలుగలవియు బంగరు పుంఖములు గలవియు నగు భయంకరములగు బాణములను వత్సదంతము, భల్లము, అంజలికము, క్షురము, ఆశుగము, సింహదంష్ట్రము మున్నగు పేర్లు గల వివిధ రీతుల బాణములను వారిపై గురియించెను. ఆ బాణములతో వేయగా అధికమైన బాధతో ఆ సింహబలుడగు రాముడు మూడు వంపులు గలిగి అల్లెత్రాడూడిన వింటితో గూడ నేలపై శయనించెను. ఆ తామరలంటి కన్నులుగల రాముడీవిధముగా తొలుత అధికమైన బాధతో వీరశయ్యపై శరీరమును జేర్పగా అన్నయిట్లు నేలవ్రాలుట చూచి తమ్ముడగు లక్ష్మణుడు తన జీవితము నందు ఆశ వీడి బాణ సమూహములే పక్కగా పవళించెను. ఇంతలో వానరశ్రేష్ఠులందఱును ఆ రాజపుత్రులను జేరి మిక్కిలి దుఃఖమును బొందిరి.

★★★



# నలువది యాఱవ సర్గము

## సుగ్రీవాదులు బద్ధులైన రామలక్ష్మణులఁ జూడవచ్చుట:

క్రిందను మీదను చూచుచు గాయములు తగిలినవారై బాణములచే పూర్తిగా నిండిన శరీరములు గలవారై క్రిందవాలి యున్న రాజశేఖరులను వానరులు చూచుచుండగా నింతలో ఇంద్రజిత్తు బాణవృష్టియు తగ్గుచుండగా సూర్యపుత్రుడును, విభీషణుడును అచ్చటికి వచ్చి వారలను జూచి ద్వివిదుడు, అంగదుడు, హనుమంతుడు, మైందుడు, కుముదుడు మొదలైనవారితో గూడి విచారించుచు ఆ దురవస్థకు మనస్సులందు తికమకపడుచు తల్లడపడిరి.

నెత్తురు చారికలచే నెఱ్ఱవాఱిన శరీరము, గాజువారిన ముఖ కవళికలు గలవారిని, కాలు చేయి కదల్ప ఓపికలేనివారిని, మెల్లని నిట్టూర్పులు గలవారిని, వాడియైన ములుకులు లెస్సగా శరీరమందు నాటియున్నవారిని, పాముల పుట్టలవలె బుసలు కొట్టుచున్నవారిని, బాణముల పడకపై పరున్నవారిని, బంగారు ధ్వజములవలెనున్న వారిని, వీరశయనమున శయనించిన వీరులను, విక్రమము మందగించిన మానవ శ్రేష్ఠులను, కన్నీళ్లతో వానర సంఘములు వనరుచుండుట నెరుగక తెలివి తప్పి పడియున్నవారిని చూచుచు వానరులందఱు దుఃఖభారముచే వగర్చుచు, ఆకాశమును జూచుచు ఇంద్రజిత్తు జాడగానక అన్ని దిక్కులను వృథగా చూచుచుండిరి. అప్పుడు విభీషణుడు మాయలనెఱిగిన వాడు గాన మాయలందు నేర్పరియు, వరములు లభించుటచే బలము పొందినవాడును అగు తన అన్న కుమారుని అక్కడ ఒక్కచోట చూచెను.

## ఇంద్రజిత్తు శ్రీరామ లక్ష్మణులు చచ్చిరని రాక్షసులతో చెప్పుట:

తన బాణములచే బాధనొంది శరీరములు తెలియకుండ నేలయే శయనముగా వ్రాలిన సోదరులను జూచి ఇంద్రజిత్తు సంతోషించి తనవారలలో సంతోషముప్పొంగునట్లు దర్పముతో నిట్లనెను. ఎవ్వరు ఖరుని నామరూపములు లేనివానిగా జేసిరో, ఎవ్వరు దూషణుని క్రొవ్వు నడంచిరో, ఎవ్వరిని గూర్చి చింతచే నాజనకునకు రాత్రి మూడు జాములవఱకు నిద్రపట్టకుండెనో, ఎవ్వరు సర్వ వానరులతో కూడి సముద్రమునకు

సేతువు గట్టి ఇచ్చట విడిసిరో, వర్షాకాలమున ప్రవాహమువలె ఎవ్వరి పరాక్రమముచే ఈ లంక కలవరపడెనో, అట్టివారిని ఇదిగో అస్త్రబంధములచే కట్టి చంపినాడను. ఆ కట్లను దేవతలైనను ఋషులైనను సరిపడరు. ఇక తక్కిన వారి మాటలను చెప్పనేల? ఈ రాముడును, ఈ లక్ష్మణుడును, ఈ సైన్యమును చేసియున్న పౌరషమంతయు ఈ రాత్రి శరత్కాలపు దినములలో మేఘములవలె వృథాయై పోయినది.

## ఇంద్రజిత్తు వానరవీరుల నొప్పించుట:

ఇంక నిప్పుడీ వానరసంఘముల పనిపట్టెదను చూడుడు అని చెప్పుచు ఇంద్రజిత్తు యూథనాయకులను సంహరింప దలంచి తొమ్మిది వాడి బాణములచే నీలుని శరీరమున నాటునట్లేసి, మూడింటితో మైందుని, మూడింటితో ద్వివిదుని వేధించి, ఒక పెద్ద శరమును సంధించి జాంబవంతుని గుండులో నాటునట్లేసి, వేగముచే ఉద్ధతుడైన హనుమంతుని తాకునట్లు పదిబాణముల నేసి రభసముతో శరభుని గవాక్షుని భయంకరములగు రెండు బాణములతో నొప్పించి క్రోధముచే పెంచబడిన శౌర్యము గల వాడై వాలిపుత్రునిపై బాణవర్షమును గురిపించెను. అగ్ని శిఖలను మరపించు నట్లున్న బాణములచే వానరుల శరీరములనెల్ల చిల్లులు గొట్టి వానరవీరులెల్లరు అడలునట్లగా ప్రతాపముతో సింహనాదము చేసెను. ఆకాశమార్గమున నిల్చి వానరుల ప్రతాపముల నడంచి అట్టహాసము చేసి రాక్షస సంఘమును చూచి ఓ రాక్షసులారా! ఈ యుద్ధభూమియందు పడి బంధింపబడి తెలివి తప్పిన శరీరములు గల ఈ జంటనిప్పుడు చూడుడు. అనగా వారతని ఆ పనిని జూచుచు ఆశ్చర్యమును పొందినవారై, మేఘములు ఉరిమిన విధముగా బలీయమైన గర్జనలు చేసి రాజపుత్రులు యుద్ధరంగమున చచ్చిరి గదా యని తలంచుచు ఆమేఘనాధుని పూజలచే సంతుష్టి పరచిరి. కాళ్లు చేతులాడించక ఉచ్ఛ్వాసమేమియు నాడకుండా నేలమీదబడి బాధచెందియున్న ఆ అన్నదమ్ములు మృతిచెందిరని ఆ రాక్షసులు తలంచిరి.

## విభీషణుడు సుగ్రీవునకు ధైర్యము చెప్పుట:

అప్పుడు ఇంద్రజిత్తు మహా సంతోషముతో లంకలో ప్రవేశించెను. ఆ రాజపుత్రుల విధమును జూచి సుగ్రీవుడెంతో దుఃఖించెను. కనుగొలుకుల నుండి వానవలె అశ్రువులు కారగా శోకముచే తపించుచున్నవాడై చింతతో ముఖము వెలవెలబోవుచుండ అతనితో విభీషణుడిట్లు పలికెను. వానరరాజా! ప్రాకృతునివలె నీవిట్లు దిగులుచెందతగునా? దుఃఖించుట మానుము. కనుల వెంట నీరుగార్చుట మానుము. యుద్ధములన నిట్టివే కదా.

యుద్ధములందు నిశ్చయముగా తానే గెల్చెదనని నమ్మవచ్చు నటయ్యా? నీ మనస్సున ధైర్యమును వహించి గతిలేకయున్న నన్ను ఇప్పుడు ఓదార్పుము. ఓ రుమానాధా! మనకు భాగ్యశేషమేమయిన నున్నచో అనఘులు, గొప్ప శౌర్యము గలవారు, మహాత్ములు అయిన రామలక్ష్మణులు మూర్ఛనుండి తేరుకొనగలరు. ఎల్లప్పుడు సత్యధర్మ నిరతులైన వారి కెందును అకాలమృత్యు భయము లేదని చెప్పి నీళ్లతో తడిసిన చేతితో అతని నేత్రములను తుడిచెను. మంత్ర జలములు తీసికొని మంత్రముల యందు నేర్పరియగు విభీషణుడు సుగ్రీవుని నేత్రయుగ్మమును ప్రోక్షించి తిరిగి ఆ సమయమునకు తగిన మాటలను అతని తొట్రుపాటును తొలగించుటకై ఇట్లు పలికెను. ఈ విధముగా నీవు దిగులు చెందవలసిన సమయము కాదు. దుష్కాలమున చూచుట అతి స్నేహము గలవారికి ఓ సూర్యపుత్రా! మరణహేతువగుచుండును. కావున సర్వార్థములను నశింపజేయగల అధైర్యమును విడిచిపెట్టుము. ఓ వానరవీరా! రామచంద్రుడే తమగతి యని తలంచిన సైన్యమంతను తలపవయ్యా! కాదేని రఘునాధులు మూర్ఛమునిగి యున్నంతవఱకు అతనిని కాపాడుట మరువకు మయ్యా! ఆ రాజశ్రేష్ఠులు తిరిగి మేలుకొన్నచో మన ఆపదలెల్లను తీర్పగల సమర్థులయ్యా! నాగపాశబంధనములు శ్రీరామునకు ఇంచుకంతయైనను బాధను కలిగింపలేవు సుమా. ఇది నిజము. మరణించెదరేమో యని భయము వలదు. మరణించు వారలకు ముఖమునందు ఎప్పుడు నిట్టి కాంతి కలుగదు గదా. కాన నేను సర్వ కార్యములను సరిపెట్టువఱకు ఓ సుగ్రీవా! మనస్సునందు ఊరడిల్లుము. వానర సంఘము నూరడింపుము. ఈ వానరులందఱును వికసించిన కనులుగలవారై భయము పెరుగుచుండగా నా ప్రక్కకు చూచుచు ఒకరి చెవులందొకరు ఏమో గుసగుసలు పోవుచున్నారు. పారిపోవ యత్నించుచున్నారు. వీరిని నివారింపుము. వాడిన పూదండను వీడునట్లు వానర సమూహము భయము వీడునట్లు బుద్ధి చెప్పుము. అని విభీషణుడీవిధముగా వానరరాజు నూరడిల్లునట్లుగా చెప్పి మఱియు పారిపోదలంచు వానర సమూహమునకు వారు భయపడకుండునట్లునయ వాక్యములచే నూరడించెను.

## ఇంద్రజిత్తు రావణునితో తాను శ్రీరామలక్ష్మణులను నాగపాశబద్ధులను జేసి వధించితినని చెప్పుట:

అక్కడ ఇంద్రజిత్తు తనను సర్వరాక్షససేనలు పరివేష్టింపగా వేగముగా లంకలో ప్రవేశించి తన తండ్రియైన రావణునకు రఘువంశజులగు సోదరులను చంపితి

నని చెప్పగా గ్రక్కున సింహాసనము నుండి ఉరికి భళిరే యని మెచ్చుకొని కుమారుని శిరస్సును మహానందముతో మూర్కొని కౌగిట జేర్చుకొని రావణుడు శ్రీరాఘవుల వధ విధమునంతయు వినవ లెనని కోరిక గలవాడు కాగా ఇంద్రజిత్తు సంతోషముతో నాగపాశ బంధనములచే వారలు చేష్టలు లేని వారగుటయు కాంతిహీనులగుటయు యదార్థముగా జరిగినదానిని సర్వమును వినిపించగా దశవదనుడు ఉత్సాహమును బొంది రాఘవుని వలన పుట్టిన భయమును విడచి తనపుత్రుని మిక్కిలిగా శ్లాఘించెను.

★★★



# నలువది ఏడవ సర్గము

## హనుమదాదులు శ్రీరామ లక్ష్మణులను గాచియుండుట:

అచ్చట హనుమంతుడు, అంగదుడు, నీలుడు, గవాక్షుడు, గవయుడు, గజుడు, సుషేణుడు, కుముదుడు, నలుడు బ్రహ్మపుత్రుడగు జాంబవంతుడు, పృథువు, రంభుడు, శతవలి, శరభుడు, గంధమాదనుడు, ఋషభస్కంధుడు మొదలగువారు తన కార్యము నెరవేర్చుకొని యింద్రజిత్తు లంకలోనికి వెళ్లగనే రాజపుత్రుల చుట్టు నిల్చి దుఃఖించుచు జాగ్రత్తగల మనస్సులు గలవారై రక్షించుచుండిరి. తక్కిన వానరులందఱు వృక్షములను చేతబట్టుకొని గడ్డిపరక కదలినను రాక్షసులని భయముచెందుచు దిక్కులన్నిటిని, ఆకాశమును, భూమిని కలయ జూచుచుండిరి.

## రావణుడు రాక్షసస్త్రీలతో సీతాదేవికి రామలక్ష్మణులను చూపించమని చెప్పుట:

అచ్చట రావణుడు తన పుత్రుని బంపి సీతాదేవికి కాపలాగా ఉన్న రాక్షసస్త్రీలను బిలిపింపగా త్రిజట మొదలయినవారు వచ్చి నిలబడగా సంతోషించిన మనస్సుతో స్త్రీలతో ఇట్లనెను. ఓ రాక్షసకాంతలారా! రామలక్ష్మణులు ఇంద్రజిత్తుచే చచ్చిరని భూపుత్రితో సంతోషముతో చెప్పి ఆమెకు నమ్మిక పుట్టునట్లు యుద్ధరంగమున పడియున్నవారిని చూప ప్రయత్నమున ఆ సీతను పుష్పకముపై నెక్కించి వేగముగా తీసికొని వెళ్లి అంతయును చూపింపుడు. ఎవ్వని ఆసరాను నమ్మి పద్మములవంటి కనులు గల సీత మదమెక్కినదై తాను నన్ను గవ్వకైనను లెక్క చేయకున్నది. ఆమె భర్త రాముడు సోదర సహితుడై యుద్ధమున చచ్చెను. ఇంక సీత దుఃఖమును, సంశయమును, ఆశను వీడి ఆ సుందరి సర్వాభరణములను అందముగా అలంకరించుకొని నన్ను చేరును గాక. ఇప్పుడు కదా తమ్మునితో గూడ భూమిపై ప్రాణములు లేక పడియున్న భర్తను చూచుటచే ఆశను విడిచినదై సీత తన విపరీత స్థితి, తన కితర గతి లేకుండుటయు తెలియగలదు. ఇప్పుడు భర్తయందు అపేక్షను వీడిన మనస్సుతో నన్ను తప్పక స్వీకరించును. పొండు అనగా వారలట్లే తొందరగా పుష్పకమును దెచ్చి దీనురాలై నాథునికై శోకముచే హెచ్చుగా తపించుచున్న

దుఃఖమున మునిగియున్న సీతను అందెక్కించి యుద్ధరంగమునకు తోడ్కొని వెళ్లిరి. ఆ సీతాదేవి త్రిజటతో గలిసి అచ్చట భూమిపైన వానరసేనలు సర్వము నశించిన విధమును చూచెను. లంకాపురమున సంతోషముతో రావణుడు అన్నిచోట్లను జయపతాకముల నెత్తించెను. ఇంద్రజిత్తు రాఘవులను సంహరించెనని ఎల్లచోట్లను వేగముగా బ్రకటించెను.

## సీతాదేవి పుష్పకమున నుండి రామలక్ష్మణులఁజూచుట:

అచ్చట సీత ఉప్పొంగుచున్న రక్కసి మూకలను దుఃఖించుచున్న రామలక్ష్మణుల ప్రక్కల నున్న వానరులను స్మృతి తప్పి బాణముల వరుసలపై పడియున్న రామలక్ష్మణులను, నేలవ్రాలిన ధనస్సులను అందము చెడియున్న రూపములను, జారిపోయిన బాణములను, చీలికలైన కవచములను, చెడిన నేర్పులు మార్పుచెందిన మోములు, దుమ్ముచే నిండిన శరీరములును గలిగిన పద్మముల వంటి నేత్రములు గల రామలక్ష్మణులను అగ్నిపుత్రులగు కుమార విశాఖులను బ్రోలినవారిని సోదరులను సాటిలేని దేవతలతో సమానమైన ప్రభావము గలవారిని భర్తను, లక్ష్మణుని దీనాత్మురాలై చూచుచునే ఈ గొప్పమహిమగల వారలు ఎట్టు లిట్లైరని వితర్కించుచు కన్నుల నీరుగార్చుచు దుఃఖసముద్రమున మునిగి ఈ విధముగా విలపించెను.

★★★



# నలువది ఎనిమిదవ సర్గము

## నాగపాశ బద్ధులైన రామలక్ష్మణులఁజూచి సీత దుఃఖించుట:

రామచంద్రా! నన్ను పుత్రుల గనెదవనియు, భర్తలేని దానను గాననియు బ్రాహ్మణులును శాస్త్రములు నెఱిగిన వారును చెప్పియున్నారే! రాముడు మృతిచెందుటచే ఆ జ్ఞానులు అబద్ధమును చెప్పిరి గదా. నూరుయజ్ఞములు చేసిన సోమయాజికి భార్యనగుదునని సత్రయాగవరునకు పత్నినగుదునని కీర్తి చెందెదనని చెప్పియుండిరి. రాముడు చంపబడుటచే ఆ జ్ఞానులు అనృత మాడిరి గదా. బుద్ధిమంతులైన దైవజ్ఞులు బ్రాహ్మణులు నేను వినుచుండగా నన్ను గూరిచి యనేక శుభ సమూహమును చెప్పియుండిరి. రాముడు చంపబడుటచే ఆ జ్ఞానులు అబద్ధము చెప్పినట్లే కదా. సాటిలేని పరాక్రమమున గలిగిన రాజచంద్రునకు భార్యనై సుఖించెదనని పుణ్యాత్మురాలినని చెప్పిరే. అయ్యో! రాముడు చంపబడుటచే జ్ఞానులు అబద్ధమాడిరి గదా. పాదములందు ఏ స్త్రీకి ఇట్టి పద్మరేఖలు మొదలుగాగల మంచి చిహ్నములుండునో ఆ స్త్రీ రాజునకు పత్నియై సంపదలతో గూడి పట్టాభిషేకమును బొందును అక్కటా నా దురదృష్టమిట్టి దగుటచే అవి యన్నియు నిరర్థకములై నాశనమయ్యెనే. స్త్రీలు ఏ లక్షణములున్నచో భూమియందు సౌభాగ్యములేని వారలై వైధవ్యమును పొందుదురో ఆ దుష్ట చిహ్నములం దొక్కటైనను లేని దానను. నన్నిట్టి దుస్థితి పొందుటెట్లో గదా! క్షేమకరమైన లక్షణములు పద్మచిహ్నములు ఉండియు ప్రయోజనము లేక పోవుటెట్లో కదా దైవమా! సమములై, నలుపులై సున్నములైనవి కురులు, కనుబొమ్మలు రెండు కలిసికొనలేదు. రోమము లేనివై గుండ్రములై యున్నవి పిక్కలు. పలువరుస ఎడములేక కలిసి యున్నది. కణతలు, కన్నులు, హస్తములు, పాదములు, తొడలును సీలమండలును ఎత్తుగా గలవు. స్నిగ్ధములు, గుండ్రములు సమములునై యున్నవి గోళ్లు పెద్దవైన స్తనములు ఒకదానికొకటి ఒరయుచున్నవి. చనుముక్కులణగి యున్నవి. నాభి ప్రక్క భాగములు ఉబ్బుగా గలిగి లోతు గలిగియున్నది. ప్రక్కలును రొమ్మును ఎత్తైయున్నది. నా అవయవకాంతి మణివలె ప్రకాశించునది. రోమములు మృదువులై యుండుట అరికాళ్లును కాలివ్రేళ్లును బాగుగ భూమిపై

అనుట అనునవి శుభప్రదమైన గుర్తులని నన్ను గూర్చి పెద్దలు చెప్పిరి. నా హస్తములు పాదములు ఎఱ్ఱనై ఎడములేనివై యవధాన్యమపు కాంతి గల్గినవై యున్నవి. మొగము చిఱునవ్వుగలిగియున్నది. ఇవియన్నియు ఉత్తమ కన్యాలక్షణములని యెఱుక గల బ్రాహ్మణ సంఘములు తెలిపెను. బ్రాహ్మణులు నే సామ్రాజ్యమందు భర్తతో పట్టాభిషేకమును పొందగలనని పలికిరి. అది అంతయు వ్యర్థమయ్యెను. నా భాగ్యహీనత చేత వారల వాక్యములు భంగమందెను. జనస్థానమున వెదకి నాయునికిని సాధించి సముద్రమును బంధించి చివఱకు నా ప్రాణేశ్వరుడును మఱదియు గోష్పాదమున (రాక్షసులతో యుద్ధము గోష్పదమున దాటుటవలె సులభమైనదని భావము) బాధింపబడిరి కదా. వరుణాస్త్రము, వాయువ్యబాణము, పవాకాస్త్రము బ్రహ్మశిరోనామకాస్త్రము, ఇంద్రాస్త్రము మున్నగు అస్త్రములన్నియు వీరలెరిగిన వారలే. మఱియు రాముని కంటికి కనబడి మనోజవము గలిగిన వాడైనను శత్రువు ప్రాణములతో వెళ్లలేడే. అట్టి మహావీరులను, ఇంద్రసమానులను మాయా ప్రభావముచే ఇంద్రజిత్తు చుట్టిముట్టి దిక్కులేని నాకు దిక్కయిన రాముని, లక్ష్మణుని యుద్ధరంగమున సంహరించెనే. ఇక నేమని తలపగలను. శ్రీరాముడు తమ్మునితోగూడ యుద్ధభూమియందు చంపబడి పడియుండుట చూడ కాలమునకు ఏదియు భారమైన పనిగాదనిపించుచున్నది. జగత్తునందు మేలును కీడును కలుగజేయ దైవమే కారణమైయుండును. రామునికై అంతగా విచారింపను. లక్ష్మణునికై అంత వగవను. నా జననికై దుఃఖింపను. నా మాత్రమునకై ఏడువను. గొప్ప తపస్సంపన్నురాలైన కౌసల్యాదేవికై దుఃఖపడుచున్నదానను. (ఇప్పటి అత్తలు కోడండ్రు దీనిని గమనింపవలెను) ఎప్పుడు ఈ అరణ్య వ్రతము పూర్తియగునో, రామునితో గూడ సీతను, లక్ష్మణుని ఎప్పుడు కనెదనో యని మనస్సునందామె తలంచుచుదారుల వెంట ఎదురుచూచుచుండును గదా అని

## త్రిజట సీతాదేవికి సీతారామలక్ష్మణులు జీవించి యున్నారని చెప్పుట:

ఈ విధముగా విచారించుచున్న సీతను జూచి త్రిజట ఇట్లు చెప్పెను. ఓ తామర రేకులవంటి నేత్రములు గల సీతా! ఏల ఏడ్చెదవు. నీ భర్త ప్రాణములతో ఉన్నాడు. దుఃఖమును పొందకుము. రామలక్ష్మణులు చావలేదనుటకు నేను చూచినవి, మునుపు విన్నవియు నయిన గొప్ప కారణములను చెప్పెదను వినుము. రాజు సంహరింపబడెనా భటులు ముఖములందు విచారములు గనబడును. సంతోషము కనపడరాదు. పుష్పకము అను పేరు గల ఇది దేవతల దివ్య మహిమ గల విమానము. వీరు చంపబడినచో

నిన్నెక్కనీయదు. నాయకులు హతులైన సైన్యములు నావికుడు లేని ఓడవలె ఉత్సాహమును విడచి ప్రయత్నము లేనివారగును. ఈ వానర సైన్యములు ఇంచుకంతయైనను భయములేకుండ కంగారు పడకుండ రాఘవులను రక్షించుచున్నవి. నీ మీదనున్న ప్రేమచేత ఇన్ని క్షేమంకరమైన కారణములను చెప్పితిని. తెలిసికొని నా మాటను విశ్వసింపుము. దుఃఖమును మానుము. ఆ అన్నదమ్ములు బ్రతికియే యున్నారు. ఇది వఱకు అసత్యము చెప్పి నీ చరిత్ర చేతను, స్నేహము చేతను, శీలము చేతను నా మనస్సునకు నచ్చితివి. జానకీ! వీరిని గెల్చుటకు రాక్షసులకుగాని ఇంద్రునితో గూడిన దేవతలకు గాని సాధ్యముకాదు. క్షేమంకరములైన చిహ్నములు తొలగక పోవుటను జూచి చెప్పుచున్నాను. వారి శరీరముల వైఖరి చూడుము. మెల్లగా మూర్ఛచే నలగియున్నను వారిలో నైజముగా నున్న ప్రకాశము తగ్గలేదు గదా. ప్రాణములేని దేహములయందు కాంతి మారియుండును. ఓ సుందరీ రామలక్ష్మణులకై విచారించుట మానుము. నా మాట నమ్ముము. యుద్ధమున వీరిని సంహరింపగలవారు లేరు. ఇక కళవళపడనేల? అని త్రిజట ఈ విధముగా దెల్పగా దేవకన్యను బోలిన ఆ మిథిలారాజపుత్రి త్రిజటను జూచి అమ్మా! నీవు చెప్పిన యట్లే జరుగును గాక. అని చేతులు జోడించుకొని పల్కెను. అంత మఱలి వెళ్లి పుష్పకము రామపత్నిని త్రిజటను లంకలో దింపగానే రాక్షస స్త్రీలు సీతాదేవిని అశోకవన మధ్యమున ప్రవేశపెట్టిరి. ఈ విధముగా జానకీదేవి రాక్షసరాజ విహారమైన అందమైన ఆ ఉద్యానవనమున ప్రవేశించి రాజపుత్రులను భావనలో చూచి మఱియు మఱియు విచారించుచుండెను.

★★★



# నలువది తొమ్మిదవ సర్గము

## శ్రీరాముడు మూర్ఛదేరి లక్ష్మణుని జూచి దుఃఖించుట:

వీరులైన వానర నాయకులు వేయి విధములుగా తనను కాపాడుకొనుచు గొప్పదైన ఆర్తితో దుఃఖించుచుండగా అంతలో ధైర్యము, సత్వము గల రఘునాధుడు బాణ పాశములచేత బంధింపబడియుండియు తెలివిని పొందినవాడై తన ప్రక్కన నేలమీద బడియున్న తమ్ముని నెత్తురు కాలువల వలె పారుచుండ తడిసిన శరీరముతో సొమ్మసిల్లి గాఢమైన శరములచే బంధింపబడి మిక్కిలి అదమబడి బాధ నొందియున్న ఉత్తమవీరుని తేరిచూచి భరింపరాని వ్యథతో బాధపడి ఇట్లు విలపించెను. నాయనా! లక్ష్మణా! హా! గొప్ప బుద్ధి బలము గలవాడా! ఓ తమ్ముడా! నిన్ను ఇట్టి అవస్థలో చూచుచున్న నేను ఎంతటి పాపిని. యుద్ధమున ఈ విధముగా ఓడింపబడి మూర్చిల్లిన ప్రేమపాత్రుడైన తమ్ముని నేను చూడవలసి వచ్చినది. ఇంక సీతా తరుణియు, గిరుణియు నెందులకు? ఈ జీవితము గీవితము నెందులకు? వెదకినచో సీతతో సమానమైన స్త్రీ లభింపవచ్చును భూమియందు లక్ష్మణునితో సమానమైన తమ్ముడు, స్నేహితుడు, యుద్ధ విశారదుడు ఎందైనను దొరుక జాలడుగదా. బాణముల దెబ్బలచే తమ్ముడే నిర్యాణము పొందినచో నిజముగా ఇక్కడనే ఈ వానరులు చూచుచుండ నా ప్రాణములు విడచెదను గాక. ఇక బ్రతుకుట ఏమిటికి? లక్ష్మణుని విడిచి నేనింటికి వెళ్లినచో కౌసల్యకు ఏమని చెప్పుదును. కైకేయి కేమందును. ఆ సుమిత్రానందనునితో ఏమి చెప్పుదును? పుత్రుడెప్పుడు వచ్చునో ఎప్పుడు చూచెదనో అని ఎదురుచూచుచున్న స్త్రీలలో శ్రేష్ఠురాలయిన సుమిత్రకు ఏమి చెప్పుదును? ఈ చెడువార్త చెప్పినచో దుఃఖముతో వణికి యేడ్చుచుండ ఏమని మాట్లాడుదును? ఏమని యూరడింతును? రామా! నీవడవులకు వెళ్లుచుండగా నీకు సహాయునిగా బాధ చెందకుండ నేను నా కొడుకును పంపించితిని. కాని అతనిని అడవులందు పోగొట్టుకొని నీవును, నీ భార్యయును తిరిగి చక్కగా నివాసమునకు వచ్చితిరా? వీరుడవైన నీకు ఒక్కని రక్షించుటకు పరాక్రమము తగ్గెనా? అని సుమిత్ర క్రూరత్వముతో పలుకగా భరించుట ఎట్లో గదా. నా కారణముగా ఈ శూరుడు మృతిచెందినట్లు నేలబడి యున్నాడు.

అనార్యుడను. గొప్ప పాపకార్యములు చేసినవాడను. ఛీ ఇక నేను జీవించుట వలన ఫలమేమున్నది? ఎప్పుడును నేను దుఃఖించుచుండ నీవు ఊరడించుచుందువే? ఇప్పుడు విలపించుచుండగా పలుకవేలనయ్యా! యుద్ధమున నెవ్వరిని రూపుమాపుచుందువో అట్టి రాక్షసులచే సంహరింపబడితివా? తండ్రీ! బాణ శయ్యయందు బాణములు శరీరమునిండ నాటగా నెత్తురులు గారుచు సంధ్యాసూర్యునివలె నుంటివయ్యా! గొప్ప బాణముల బాధచే పల్కజాలకపోవుటచే ప్రేమ చూపులతో పల్కుచున్నావు. వనములకు నేనొంటరిగా వెళ్లవలసివచ్చునని నీవెట్లు తోడుగా వచ్చితివో వీరశ్రేష్ఠా! అట్లే నీవు యమలోకమునకు వెళ్లగా నేను తోడుగా వచ్చుట నీతియైన పని గదా. తన యిష్ట బంధువులు తననెప్పుడు చుట్టియున్నను, ఎల్లవేళలయందును ఈతడు నన్నుసరించును. అట్టి గుణవంతుడు దురదృష్టుడనైన నా తెలివిలేని తనముచే ఇటువంటి దుస్థితిని పొందెను. నేను కోపగించుకొన్నను, అయ్యో! పాపము! ఈ లక్ష్మణుడు ప్రతిగా తాను పొరపాటున నైనను, అహితముగా గాని, పరుషముగా గాని నన్ను పలికి ఎఱుగడు. మొగమున విరుపైన నెఱుగము. దర్పముతో కార్తవీర్యార్జును (వేయి చేతులు గలవాడు) అయిదు నూర్లు బాణములు వేయునంతలో మహా వేగముతో బలవంతుడై ఇతడు అన్ని బాణములను వేయును. ఇంద్రుని అస్త్రములనెల్ల అస్త్రములతో త్రుంచగలడు. అట్టివాడు సాటిలేని సుఖములంద దగినవాడు మరణించి హా భూమిపై బడియున్నవాడు. అయ్యో! రాక్షసరాజుగా విభీషణుని జేసెదనని ప్రతిన చేసితిని. ఆ శపథమిప్పుడు తప్పినది. అటువంటి అబద్ధపు మాట ఇప్పుడు నా అవయవములను నిప్పువలె గాల్చుచున్నది. భరింపజాలను.

## శ్రీరాముడు సుగ్రీవుని కిష్కింధకు బొమ్మని చెప్పుట:

ఓ సూర్యనందనా! సుగ్రీవా! నీ వీక్షణమునందే అంగదుని, నలుని, నీలుని నీ బలముల నెల్లను తీసుకొని పొమ్ము. ఇచ్చట నిల్వవద్దు. సముద్రమును దాటుము. ఏలననగా ఆ దేవతావిరోధుల రాజు కోపముతో నేను లేకుండుటను జూచి తన సైన్యములతో గలిసి నీపైకి వచ్చును. అప్పుడు వెళ్లుట చాల కష్టము సుమా. అన్యులు చేయునట్టివా యుద్ధరంగమున ఆంజనేయుడు చేసిన సాహసములు? ఈ జాంబవంతుడు ఈ గవాక్షుడు సలిపిన కృత్యములు చెప్పదరమా? తారాపుత్రుడైన అంగదుని సాహసములు చెప్పుట నా తరమా? మైందుడును, ద్వివిదుడును మహా బలవంతులు. కేసరి, సంపాతి చేసిన

కార్యములు సామాన్యములా? ఏమని చెప్పగలవాడను. గజుడు, శరభుడు, గవయుడు, గంధమాదనుడు మొదలగు వానరులు మహా శౌర్యముతో నా నిమిత్తమై ప్రాణములను మరచి సాహసించిరి. వీరినందఱిని ఓ సచ్చరిత్రుడా! చాల మెచ్చితిని. నీవు మంచి హృదయము గల స్నేహితుడైనవాడు ఎంత చేయదగునో అంతయు సుగ్రీవా! ధర్మ భయముతో గావించితివి. దైవమే వంచింపగా మానవునికి శక్యమా! వానరశ్రేష్ఠులారా! చాల పట్టుదలతో స్నేహితుని పనిని చేసితిరి. మనస్సునందు మిమ్ము మెచ్చితిని. మీ కాజ్ఞ ఇచ్చితిని. స్వేచ్ఛగా వెళ్లరయ్యా! అనగా వానరులు అందఱును హా యని కన్నులు వాచునట్లు, కన్నుల వెంట కన్నీళ్లు కాలువలు గట్టగా నేడ్చిరి. ఇంతలోన యుద్ధరంగమున సేనలనందందు దృఢముగా నిల్పి రాఘవులు పెంపు దక్కియున్నచోటికి విభీషణుడు వేగముగా వచ్చిచేరెను. కాటుక కొండవలె గద ధరించి వేగముగా వచ్చుచుండగా ఇంద్రజిత్తని తలచి జడిసి వానరసమూహములు పారిపోసాగిరి.

★★★



# ఏబదియవ సర్గము

## కపులు విభీషణుని ఇంద్రజిత్తని భ్రమించి పరువెత్తుట:

వాయువు తాకిడిచే చెల్లాచెదరగు మబ్బుల వలె తన సేనలు పరువు పెట్టుటను జూచి సుగ్రీవుడు ఇట్లనెను. సముద్రమునందు సుడిగాలులచే కొట్టబడిన నావ వలె ఈ సైన్యము అల్లలాడుచున్న కారణమేమియో యనగా అంగదుడిట్లు పల్కెను. వీరులైన రాజపుత్రులు రాముడు లక్ష్మణుడు బాణములచే కొట్టబడుటే కారణమనగా అంగదునతో సుగ్రీవుడిట్లనెను. అది కాదు సుమా మఱి ఏదియో జరిగియుండును. ఆయుధములను విడచి అదరి బెదరి నిలువు చూపులు చూచుచు చిన్న బోయిన ముఖములు కల్గి దిక్కులందు వ్యాపించి పారిపోవుచున్నారు. అందఱు పిరికిపందలు సిగ్గు విడిచిన వారై క్రింద పడిన వారిని దాటుచు ప్రక్కవారలును ఈడ్చుకొని పోవుచున్నారు. ఇంత ఏలనో అనునంతలో తనచేత గదను ధరించి విభీషణుడు సుగ్రీవుని దగ్గఱగా వచ్చి దీవించి, చింతలో మునుగుచు రాముని, లక్ష్మణుని జూచుచుండెను. వానరరాజును వానరులకు భయకారణుడైన ఆ విభీషణుని జూచి తన ప్రక్కనున్న భల్లూకరాజైన జాంబవంతునితో 'ఈ విభీషణుని చూచి వానరసంఘములు ఇంద్రజిత్తే తిరిగి వచ్చెనను సంశయముచే తొందరపాటుతో పరువెత్తుచున్నారు. యదార్థమును జెప్పి వారినందఱును వెనుకకు మరలింపుము. అనగా జాంబవంతుడు వానరులు పరువెత్తుచున్న మార్గమునకు అడ్డముగా నిలిచి తన చేతులను పైకెత్తి పెద్ద యెలుగు (కంఠధ్వని)తో ఓ వానరేంద్రులారా! భయపడకుడు. ఇతడు విభీషణుడు. ఇంద్రజిత్తు కాదు. నిజము తెలుసుకొనక ఊరకే గ్రుడ్డివారై గొఱ్ఱె దాటుగా ఉరకకుడు. ఈ పిరికితనము నెప్పుడు నేర్చితిరి. ఇక చాలును. వెనుకకు తిరుగుడనగా వారలు జాంబవంతుని మాటలను విని ఆ విభీషణుని జూచి భయము విడిచిన వారైరి. పాపరహితుడైన విభీషణుడు బాణములచే గ్రుచ్చబడిన శరీరముగల మహాబలవంతులైన రామలక్ష్మణులను చూచి దుఃఖముతో నీటిచే వారి కన్నులను తుడిచి

## దుఃఖించు విభీషణుని సుగ్రీవుడు తేర్చుట:

గొప్ప దుఃఖభారముచే తడబడుచు ఇట్లు పలవరించెను. హా! గొప్పబలవంతులును, కడు సాత్వికులును, యుద్ధప్రియులును అయిన వీరు మాయాయుద్ధము చేయువారైన

రాక్షసులచే ఇట్లు చంపబడిరి గదా. క్రూరమైన మనస్సుగల మా అన్న కుమారుడు నిర్వక్ర పరాక్రములగు వీరిని మోసముతో గూడిన తన రాక్షస వక్రబుద్ధితో పీడింపగా ములుకులతో గూడిన మేనులు గలవారై ముండ్లపందుల వలె పడియున్నారు. ప్రతిష్ఠను గోరి ధీరులగు నెవ్వరిని చేరితినో ఆ రాజులిద్దఱును ఈవిధముగా మృతిచెందునట్లు పడియున్న వారు. ఇక నేను బ్రతికి యుండియును రాజ్యాధిపతిని గావలెనను కోరిక తీరక చచ్చి నట్లయితిని గదా. రావణునకు కోరికయు ప్రతిజ్ఞయు తీరెను ఏమి పాపమో గదా. అని విచారించుచున్న విభీషణుని తన కౌగిట పొదవిపట్టి వానరరాజు మెల్లగా ఇట్లనెను. విభీషణా! లంకను నీవే ఏలెదవు. రావణుడు తనపుత్రులతో తన కోరికను పొందబోడు సుమా. దుఃఖింపకుమయ్యా! వీరికే బాధయు కలుగదు. మూర్ఛదేరినచో విరోధిని రావణుని సైన్యసమేతముగా సంహరించెదరు. అని ఒప్పయిన విధముగా ఊరడించుచు తన దగ్గఱనే యున్న సుషేణునితో ఓ వానరా! మూర్ఛదేరిన రాజపుత్రులతో వానరసైన్యముతో నీవు కిష్కింధాపురమునకు వెళ్లుము. నేను రాక్షసరాజును బంధువులతో స్నేహితులతో సైన్యములతో గూడ సంహరించి సీతను, పూర్వము తొలగిన రాజ్యలక్ష్మిని ఇంద్రుడువలె తీసుకువత్తును.

## సుగ్రీవునితో సుషేణుడు సంజీవకరణిని దెప్పింపుమని చెప్పుట:

అని పల్కగా సుగ్రీవునితో సుషేణు డిట్లనెను. పూర్వము దేవ దానవులకు దారుణముగా యుద్ధము సంభవించెను. అందు వాడియైన బాణములచే దేవతా సమూహము లెల్లను సొమ్మసిల్లి నేలవ్రాలి ప్రాణములను విడువగా దేవగురువైన బృహస్పతి తన విద్యా ప్రభావము చేతను, మహిమ గల ఓషధుల చేతను ఆ బాధను మాన్పెను. అవి పాల సముద్రప్రాంతమున గలవు. సంపాతిని, పనసుడు మొదలగు వానరులను బంపి వేగముగా తెప్పింపవయ్యా! అచ్చోటను వానరశ్రేష్ఠులు అందఱు ఎఱుగుదురు. ఈ వాయుపుత్రుని బంపుము. బలవంతుడు తన పరాక్రమమును ప్రకటించి తీసుకొని వచ్చును. అమృతమునకై దేవతలు పాల సముద్రము నెచట మథించిరో అచట ద్రోణ పర్వతము చంద్రపర్వతము అనునవి యున్నవి. అందు విశల్యకరణియు దివ్య సంజీవ కరణియు ప్రకాశించుచుండును. దేవతలచ్చట ఓషధులు నిలిపిరి. వేగవేగముగా వానిని తెమ్మనుము అని చెప్పుచుండగా ఇంతలో గొప్ప ధ్వని ఎక్కువగా చెవులు గడియలుపడి వినపడనట్లుగా వినవచ్చెను.

## గరుత్మంతుడు శ్రీరామలక్ష్మణులను చూడవచ్చుట:

మబ్బులు విడిపోయి యిటునటు చెదరగా, సముద్రమునంద కెరటములు ఎగిరి అల్లకల్లోలముకాగా, భూమి గడగడ లాడగా లవణ సముద్రమునందున్న ద్వీపములు, కొండలు, చెట్లు మొదళ్లతో గూడ విరిగి నేలబడగా తీవ్రమైన గాలి వీచినది. సుళ్లు తిరిగి పాములు బెదరి పరువెత్తి సముద్రమున దూకెను. వెంటనే ప్రజ్వలించు అగ్నిహోత్రుని వలె వెలుగుచు గరుత్మంతు డాకాశమున గనిపించెను. అట్లు కనిపించగనే రామలక్ష్మణులను జుట్టియున్న ఆ తుంటరి పాపపు పురుగులు వెంటనే మనస్సులు వికలములై భయము జనింపగా పరువెత్తి ఆ ఉప్పు సముద్రమున దూకినవి. అవి యట్లు విడచిపోవగానే గరుత్మంతుడు దగ్గఱకు వచ్చుచు కాకుత్థ్సులను జూచి సంతోషము నందుచు చంద్రబింబముల వంటి వారి ముఖ పద్మములను ఎంతయో ప్రేమతో నిమురగా స్పష్టముగా వారి శరీరములందలి వ్రణములు మాసి పోయినవి. బుద్ధిబలములు, వీర్యమును, తేజమును, కాంతియు, ఉత్తమగుణము, ఉత్సాహము, జ్ఞాపకశక్తియు, మంచి దర్శనమును రామచంద్రునకును, లక్ష్మణునకును ఇది వరకటి కన్న రెట్టింపుగా కలిగెను. శరీరకాంతి బంగారమున కన్నమేలుగా నుండెను. అంతట గరుత్మంతుడు ఆ అనఘమైన బుద్ధిగల వారలను ఎత్తి కౌగిలించుకునగా వినతాపుత్రునితో సీతానాధుడు అమిత సంతోషముతో నిట్లనెను.

## నాగపాశ విముక్తులై శ్రీరామలక్ష్మణులు గరుడుని ప్రశంసించుట:

అయ్యా! నీ అనుగ్రహము చేత రాక్షసరాజ పుత్రునిచే ప్రయోగింపబడిన ఈ నాగపాశబంధములు విడిపించి ఏమియును ఆపద ఇక లేకుండగా అలసిపోకుండ మునుపటి వలె పెద్ద శౌర్యమును పొందితిమి. నిన్ను చూడగా మా తండ్రియగు దశరథుని తాతయగు అజమహారాజును ఆదరముతో చూచునట్లు మనస్సు పొంగుచున్నది. రూపమును, దివ్యమైన మాల్యములు, లేపనములు, దివ్యమైన వస్త్రములు, గొప్ప ప్రకాశముగల అనేక విభీషణములు దాల్చి దివ్య తేజస్సుతో ప్రకాశించుచున్నవాడవు నీవెవ్వడ వయ్యా! మహాత్మా! అనగా

## గరుడుడు శ్రీరామునకు హెచ్చరికగా యుద్ధము చేయ బోధించుట:

గరుత్మంతుడు కనులవెంట ఆనందబాష్పములు గారగా ఇట్లనెను. మీకెంతో దగ్గరైన స్నేహితుడను (నీ వాహనమగుటచే ఇది గూఢోక్తి) గరుడుడను పేరు గలవాడను.

పొగడదగిన కీర్తి కలవాడా! నీ బహిః ప్రాణమును మీకు సహాయము చేయుటకై వచ్చితిని. దేవతలు గాని, గంధర్వులు గాని రాక్షసులు గాని ఇంద్రునితో సహా వచ్చినను మీ శరీరమున నున్న నాగపాశ బంధనములను తొలగింపలేరు. ఆశ్చర్య శక్తిరూప బలమున ఇంద్రజిత్తు ప్రయోగింపగా కద్రువ పుత్రులైన సర్పములు విషముతో గూడిన కోఱలు గలవి యిట్లు బాణములై వచ్చి బంధించినవి. ఈ వార్తను విని స్నేహ తత్పరతతో వేగముగా వచ్చితిని. రామచంద్రా! ఓ వీరశ్రేష్ఠా! మీ బంధనములను విడిపించితిని. రాక్షస కులమున బుట్టిన వారందఱును మయాయుద్ధ విశారదులు. మీరలు అప్రమత్తతతో నుండుట తగినపని. రాక్షసులకు మాయయే బలము. ఓ అనఘా! నిర్మలమైన మనస్సుగల మీకు ఋజుత్వమే బలము. కావున యుద్ధమునందు రాక్షసులను నమ్మవద్దు. దానికి దృష్టాంతము ఇదే సుమా. అని వారి చరిత్రను స్పష్టముగా గ్రహించి మీరలు వారలతో షష్ఠాష్టకమున మెలుగుడు. అట్లైనచో రఘురామా! మీ యిష్టము శీఘ్రముగా నెరవేరగలదు. నీకు నేను స్నేహితుడ నెట్టులైతినని చూచుచున్నావేమో. ఆ ఆలోచనలను విడువుము. (వాస్తవము చెప్పిన అవతార రహస్యము వెలువడును. రావణవధ పర్యంతమది వెలువడరాదు) ఆ విధమును, యుద్ధము పూర్తియైన తరువాత ఎఱుంగవచ్చును. నేను వెళ్లి వచ్చుటకు అనుజ్ఞనిమ్ము. సాటిలేని ధర్మవిధిజ్ఞుడవగు రామా! ఓ నీరజ పత్రలోచనా! నీవు శత్రువుల యందైనను దయను విడువవు గదా. బాలురు, వృద్ధులు తప్ప ఈ లంకనున్న రాక్షస సంగములు నెల్ల నీ బాణములచే మొదలంట సంహరించి శీలవతియైన సీతను తిరిగి పొందెదవుగాక అని చెప్పి వారలను తన కౌగిట గ్రుచ్చి ఎంతయో సంతోషమును కలిగించి వారలకు ప్రదక్షిణము గావించి వాయువువలె ఆకాశమార్గమును బట్టి గరుత్మంతుడు వెళ్లగా తెలివి నొందిన రామలక్ష్మణులను వానర సైన్యములు చూచి

## శ్రీరామ లక్ష్మణుల జూచి కపులు సింహనాదములు చేయుట:

సంతోష భారముచేత శరీరములు పులకింపగా మదముతో తోకలను నేలగొట్టుచు, గర్జనలను చేసి భేరీ నినాదములు చేసి మృదంగములను వాయించి వానరులు వాద్యములను వాయించుచు శంఖములను మ్రోయించుచు కోయని యరచుచు జేయని పల్కుచు రాక్షసులను సంహరించుచు సంతోషముతో నెదుర్కొనిరి. వర్షాకాలమున మేఘములు మ్రోయు విధముగా అర్ధరాత్రి సమయమునందు బలవంతులైన వానరుల భయంకరమైన నినాదములు కర్ణకఠోరముగా ఆ యుద్ధభూమి యందు క్రమముగా హెచ్చుగా మ్రోగినవి.

★★★

# ఏబది యొకటవ సర్గము

## రావణుడు కపుల సంతోషమునకు కారణము తెలిసికొనుట:

హెచ్చైన సందడితో విజృంభించి యున్న వానర సంఘముల యొక్క గొప్ప భయంకరములైన మ్రోతలు పెద్దవై గంభీరముగా వినవచ్చుచున్న కంఠ నినాదములను విని సభలో నున్న రావణాసురుడు ఒక్కమాటుగా ఉలికి పడి రాక్షస సమూహముతో వానరులయొక్క కోలాహలములతో నున్న సింహనాదములు శబ్దించు మేఘముల గర్జనలను తలపించుచున్నవి. పట్టణమును భయపడునట్లు చేసెను. సముద్రమును కలంచెను. ఇంచుకంతయైన జంకులేక వానరులు ఇట్లు సంతోషించుటకు కారణము ఏమియో కదా. వానరేంద్రులకు ఏదియో సంతోష కారణము కలిగి యుండవలయును. సీతానాధుడును, లక్ష్మణుడును దారుణముగా నాగ మహాస్త్రములచేత బంధింపబడి నేలబడియుండగా కారణము లేకుండ సైన్యములిట్లు సంతోషమును పొందునా? మనస్సునందు సందేహమధికమైనది. మీరు వేగముగా వెళ్లి ఆ విధానమును తెలిసికొని రండు. అనగానే రాక్షసులు భయముతో కంగారుగా పరువెత్తి వెళ్లి ప్రాకారముల నెక్కి వానర సంఘములను జూచి బంధములచే విడువబడి శౌర్యములతో సంతోషములతో యుద్ధభూమియందున్న భీమమూర్తులును శూరులును అయిన రామలక్ష్మణులను చూచి గుండెలు గుభిల్లనగా ఆ రాక్షసులు తెల్లబోయిన ముఖములతో వెనుకకు వెళ్లి ఆ వృత్తాంతమునంతను రావణునికిట్లు తెలియజేసిరి. రాక్షసరాజా! ఇంద్రజిత్తు బాణములచే బంధింపబడి చేష్టలు దప్పిన ఆ బలవంతులగు రామలక్ష్మణులు ఏన్గులతో సమానమైన బలముగలవారలు ఆ బంధములను త్రెంచుకొని ఎప్పటియట్లు ప్రతాపములతో నొప్పుచున్నారని చెప్పగనే

## శ్రీరామ లక్ష్మణులు పాశవిముక్తులగుటకు రావణుడు వ్యసనపడుట:

అది విని రావణుడు చింతయు, వ్యసనమును కంగారు పెట్టగా విషాదము చెందిన మనస్సు గలవాడై ఇట్లనెను. ఏమిది? మహా సర్పములతో సమానమైనవి, సూర్య

సమానములైనవి బ్రహ్మదేవుని వరముగా నీయబడినవి, తిరుగులేనివి, ఘనమైనవి అయిన నా కుమారుని అస్త్రములు ఎన్నడును వ్యర్థము కావుగదా. అట్టి అస్త్రములచే ఇంద్రజిత్తు గట్టిగా కట్టినను మఱల శత్రువులు వాని నుండి విడువబడిరి. నా బలమిక వ్యర్థము. అది నన్నెటులైన రక్షించుననుట ఏమో నేను నమ్మను. శత్రువుల ప్రాణములను ఒక్కపెట్టున దీయగలిగిన భయంకరములైన బాణములు ఆ వాసుకితో సమానమైన తేజస్సుగలవి. ఈ విధముగా వృధాగా పోయెనే. ఇక ఏమనగలను. అని రోషముతో ఎఱ్ఱవారిన నేత్రములు గలవాడై

## ధూమ్రాక్షుడు యుద్ధమునకు బోవుట:

రావణుడు సర్పమువలె రోజుచు ధూమ్రాక్షునితో ఇట్లనెను. నీవు వధ కొఱకు అపారసైన్యముతో వెళ్లుము. (నీవు శ్రీరామవధార్థమై వెళ్ళుమని రావణుని భావము. కాని నీవు చచ్చుటకై పొమ్మని నోట వచ్చెను) మదించిన వానరుల సైన్యముతో నున్న రాముని మీదకి వెళ్లుము. అని చెప్పగా వాడు సంతోషముతో రావణునకు మ్రొక్కి వెళ్లి సైన్యాధిపతితో సైన్యములను సిద్ధపరుపుము ఇంకను ఆలస్యము చేసెదవేల? అని పల్కగా రావణుని ఆజ్ఞపొంది సైన్యాధిపతి సైన్యమును సిద్ధము చేసి తీసుకొని రాగా గంటలు మ్రోగుటచే ఘణంఘణ ఘణమను ధ్వనులు దిక్కుల నిండగా ధగధగ మెఱయు శూలములు, భల్లములు మొదలగు ఆయుధములు మంటలు చిమ్ముచుండగా, ఢమంఢమఢమమను గొప్ప వాద్యధ్వనులు ఆకాశము నంటుచుండగా శౌర్యముతో తుంటరులైన రాక్షసుల సైన్యములు గుంపులు గుంపులుగా వచ్చి చేరిరి. సింహనాదములతో దిక్కులను నింపుచున్నవారై, నల్లని ఇనుప దండములు, పరిఘులు, ఖడ్గములు, మహా శూలములు, పరిశ్వథములు, పట్టిసములు మొదలగు ఆయుధములచే వెలిగిపోవుచున్నవారై సంభ్రమముతో గూడిన బుద్ధిగలవారై కవచములు, ఖడ్గములు, ధ్వజములు అనేక విధముల ముఖములుగల గాడిదలను గట్టిన సూర్యసమాన రథములపై ఠీవిగా వచ్చుచుండిరి. మహావేగముగలిగిన గుఱ్ఱముల పైనను, మదపుటేనుగుల పైనను, ఎక్కి దేవతావిరోధులు పెద్దపులులవలె యుద్ధముచేయు ఉత్సాహము గలవారై దుర్జయులై బయలుదేరిరి. తోడేళ్లు సింహములు మొదలగు బంగారు ప్రతిమలచే నలంకరింపబడినదియు, బలిసిన గాడిదలను పూన్చిన రథము నధిష్ఠించి చకచక ధూమ్రాక్షుడు యుద్ధమునకై బయలుదేరెను.

**ధూమ్రాక్షునకు అపశకునములు కనబడుట:**

సంతోషముతో గూడిన ముఖము గలవాడై హనుమంతుడు అడ్డుగా నిలిచిన ద్వారమును చేరబోగా ఆకాశమున శకునములు కన్పట్టెను. అతని రథముపై గ్రద్ద గభాలున పడెను. జెండాపై గ్రద్దలు విడువక వ్రాలెను. అతని సమీపమునందు తెల్లని మొండము ప్రవహించుచున్న నెత్తుటిలో తడియుచు స్వరము వికారముకాగా సైన్యాధ్యక్షుని చూచి ఆర్భాటము చేయుచు దబ్బున నేలపై బడెను. మఱియు నెత్తురు కురిసెను. పిడుగులు దొర్లుచున్న విధముగా అతనికెదురుగా గాలి వీచెను. భూమి కంపించినది. అన్నిచోటులను చీకట్లు గ్రమ్మెను. దిక్కులు కాంతి హీనములయ్యెను. ఆ శకునములను జూచి ధూమ్రాక్షుడు తన మనస్సునందు చాల అటమట చెందెను. రాక్షసులును భయక్రాంతమతులై మూర్ఛలను పొంది నేలపై బడిరి. ఎట్లో తిరిగి ధైర్యము తెచ్చుకొని సైన్యము తనను చుట్టుకొని వచ్చుచుండ నిబ్బరము గనబడునట్లుగా దేవతావిరోధి వానరసైన్యము పైకి శౌర్యముతో వెడలెను.

★★★



# ఏబది రెండవ సర్గము

## ధూమ్రాక్షుని సేనలు కపులతో పోరుట:

అట్లు ద్వారము దాటి వచ్చుచున్న దేవతావిరోధిని జూచి వానరులెల్ల సంతోషముతో గర్జనలు రేగగా యుద్ధకాంక్షగలవారై రాక్షసులతో వేగముగా దాకిరి. వారల సంకుల సమరము నివారింపరానిదై భయంకరమై కనిపించెను. వృక్షములు, శూలములు ముద్గరములు బాణములు మొదలగు ఆయుధములతో సాటిలేనిదై ఆయుధమొప్పెను. పరశువు,పట్టిసము,ఖిండివాలము ముద్గరము మొదలైన సాధనములతో ముఖాముఖి రాక్షస సేన పోరగా చెట్లు, పర్వత శృంగములు చేతబట్టినవారై గర్వముగల వానరసంఘములు రాక్ష సైన్యముల మీద దూకి దానిని బ్రద్దలు చేయబడిన దేహములు గల దానినిగా చేసిరి. క్రోధముతో అరచుచు రాక్షస సంఘములు గదలు మొదలైన సాధనములచేత వానర సైన్యమున నెత్తురు వరదలు పారజేయగా వారలు గొప్ప బాణములచే ఖడ్గములచే దెబ్బలు తగిలిన శరీరములుగల వారలయ్యును వెను దిరుగక రాళ్లు చేతను వృక్షముల చేతను వారితలలు పగుల నేసిరి. తలలు బ్రద్దలగునట్లు మొత్తుచు వేగముగా చెట్ల కొమ్మలచే చేతులు నేల బడునట్లు బాదుచు, కరుణలేని మనస్సులతో నరములు, ప్రేగులు త్రెంచివైచుచు, నానా విధములుగా కోరలచే గుండెలను చీల్తురు. చీలికలై పడునట్లుగా రెండురెండగు నట్లు గొట్టుదురు. ముద్దముద్దగా దంతురు. గొప్పవేగముతో చెట్ల దెబ్బలచే నొప్పింతురు. రాళ్లచేతను రప్పలచేతను విపరీతముగా వర్షము వలె గురియించి మర్దింతురు. అసూయతో క్రింద పడవైచి మెడలను త్రొక్కిపట్టి పిడికిటి పోటులచే మర్దింతురు. ఈ విధమైన వానరుల పోటులచే రాక్షసులు కండలతో నెత్తురులు గ్రక్కిరి. ఉక్కిరి బిక్కిరై చెడి చచ్చిరి. సొమ్మసిల్లిరి. భయముచే చాటునకు పారిపోయిరి. చచ్చిపడిన గాడిద ప్రోవుల చేతను, విరిగి పడిన ఏనుగుల చేతను దేహములు చీలిన గుఱ్ఱములచేతను, భూమియంతయు నిండెను. అంత చివాలున ఎగిరి వెళ్లి తమ దంతములతో వాడియైన గోళ్లతో రాక్షసుల ముఖములను గుంటలు పడునట్లు చీల్చి వానరులు వారలను యమపురమునకు పంపిరి. వ్రేలాడు

వెంట్రుకలతో అందములు చెడిన ముఖములతో రక్తమాంసముల దుర్గంధములతో సోలిపోవు శరీరములు గలవారై రాక్షసులు పరువెత్తిరి.

## ధూమ్రాక్షుడు కపుల వధించుట:

అందుకొందఱు రాక్షసులు రోషవశముచే వేగముగా వజ్రముల వలె కఠినములైన తమ హస్తములతో వానరులపైన బడి గుండెలపై మోదగా వారలను వానరులు కాళ్లతోడను చెట్లతోడను చంపి వేసిరి. రాక్షసులు పారిపోవుటను, వానరులు విజృంభించుటను ధూమ్రాక్షుడు రోషముతో గూడిన చూపులతో చూచి విరోధి బృందముపై కలబడెను. అటు వెళ్లి ఇంద్రాస్త్రముల బోలిన వాడి బాణములచే గ్రుచ్చి, కొందఱిని పాశములచేత, పరశ్వథము పట్టిసము శూలము మొదలయిన వానిచే కొట్టి, భయంకరములైన అస్త్ర సమూహములచే హింసించి చీల్చబడిన శరీరములు గల వారినిగా జేసి తన విక్రమము ప్రకటమగునట్లుగా క్రోతుల ప్రతాపముల నడంచుచు ఎక్కడ చూచినను దానే అయి ప్రక్కలకు ఖడ్గముచే చెక్కుచు, ఎదలను పగిలించుచు శరీరములను ముక్కలు ముక్కలు చేయుచు బలముచే మదించిన వాడై ప్రతాపముతో విహరించెను. కొంచెము తెఱిపిని జూచి రాక్షస సంఘములు వానరులను నరుకగా వారు నలి నలి యగుచు పారిపోయిరి. చచ్చిరి. నరములు త్రెగి పడగా అధికమైన నెత్తురులలో మునిగిరి. వారి మ్రోతలనెడి తంత్రీ నాదములు, ఎక్కిళ్లు అనెడు తాళధ్వనులు ఏనుగుల గర్జనలనెడు సంగీతము కలిగిన యుద్ధమనెడు గాంధర్వవిద్య ధూమ్రాక్షుని యుద్ధక్రీడ యందు వెలసెను. వింటినుండి విడువబడిన బాణముల వరుసలనెడు తరంగముల వానరసైన్యమనెడు భూమిని ముంచివేయగా వెను తిరుగుచున్న కోతులను జూచి గొప్పబరువు గల బండరాతి నెత్తి వేగముగల గమనము గలవాడై

## ధూమ్రాక్షుడు హనుమంతునిచే చచ్చుట:

హనుమంతుడు కోపముచే ఎఱ్ఱనైన కనులు గలవాడై ధూమ్రాక్షునిపై వేసెను. ఆ శిల వేగముగా రాగా జూచి ధూమ్రాక్షుడు వేగముగా వంగి నేలపై కురికి తప్పించుకొని నిశ్చేష్టుడు కాకుండ గొప్ప గదను ధరించి నిలిచెను. పిడుగువలె ఆ శిల వచ్చి కాడితో, వింటితో టెక్కెముతో రెండు రథ చక్రములతో గుఱ్ఱముల గుంపుతో గూడ రథమును పిండిచేసెను. దానిని జూచి రాక్షసవీరులు వేగము గలవారై ప్రక్కలందు బ్రవేశించి పరాక్రమముగల వాయుపుత్రుని దాకిరి. అతడు గండుమీరి ప్రళయకాలమునందలి యముని వలె

స్కంధములతో గూడిన వృక్షమును త్రిప్పుచు దగ్గఱకు వెళ్లి మోదుచు ఫట్, పట్ అను ధ్వనులతో తలలు పగులగొట్టుచు నెత్తురులు కాలువలు గట్టించుచుండ రాక్షసులు భయము, విషాదము నొందిన చిత్తములు గలవారై పరువెత్తిరి. రాక్షసులీవిధముగా పారిపోగానే మఱల నొక కొండ శిఖరమును సమర్థుడగు హనుమంతుడు చేత బట్టి భయంకరమైన వేగముతో మీదకు రాగా ధూమ్రాక్షుడు సింహనాదముచేయుచు గదనెత్తి హనుమంతుని ఱొమ్ము వ్రక్కలగునట్లు వేయగా వాయుపుత్రుడు దానిని లక్ష్యపెట్టక ఉగ్రుడై గురిచూచి పర్వ శృంగమును, వేగముగా ధూమ్రాక్షుని నడినెత్తిన వైచెను. ఆ రాక్షసుడు దానిచే జీవము కోల్పోయినవాడై నేలపై బడెను. పిడుగుపడిన పర్వతము వలె పడిన సైన్యాధ్యక్షుని జూచి వానరులు తరుమగా రాక్షసులు ఒకరి నొకరు చుట్టుకొని భయపడి కలతచెంది లంక త్రోవను బట్టి పరువెత్తిరి. ఈ విధముగా హనుమంతుడు రాక్షసవీరుడైన ధూమ్రాక్షుని సంహరించి వానరసైన్యములు పూజింపగా యుద్ధముచేయు తలంపుతో తన స్థానమునకు వెళ్లి నిలిచెను.

★★★



# ఏబది మూడవ సర్గము

## రావణుడు వజ్రదంష్ట్రుని యుద్ధమునకు బంపుట:

ధూమ్రాక్షుని చావును విని హెచ్చైన కోపముతో రావణుడు వజ్రదంష్ట్రుని జూచి ఓరీ! నీవు రామలక్ష్మణులను వానరరాజుతో గూడ సంహరించుటకు వెళ్లుము. అనగా అట్టులే యని ఆ మాయావియగు రాక్షసుడు అధిక సైన్యముతో గూడి యుద్ధము చేయు కోరికతో వెడలెను. ఆ రాక్షసుడు కిరీటము, కేయూరములు భూషణములు ధరించినవాడై కవచము తొడిగి విల్లు ఆభరణములచే సుందరముగా నున్న రథము దగ్గఱకు వెళ్లి దానికి ప్రదక్షిణ చేసి నమస్కరించి గదలు, విచిత్రములైన శూలములు ఖడ్గములు ధరించిన వీరులు అనేకవిధములైన అస్త్ర శస్త్రములు ధఱించినవారు విచిత్రమైన వస్త్రములు గట్టినవారు సంతోషముతో రాగా, బాగుగా మదించిన ఏనుగులు నడచెడు పెద్దకొండలవలె నడవగా, తోమరములు అంకుశములు ధఱించిన యుద్ధనిపుణులు ఏనుగులపై నెక్కి రాగా యుద్ధమునకు వెళ్లెను. ఆ సైన్యము వర్షాకాలమున మెరుపులతో గూడి గర్జించు మేఘ సమూహమువలె నొప్పెను.

## వజ్రదంష్ట్రుడు యుద్ధమునకు వెడలుట:

అప్పుడు వజ్రదంష్ట్రుడు సేనతో వాయుపుత్రుడున్న దక్షిణపు ద్వారము నుండి బయలుదేరి రాగా వారిపై మేఘములులేని ఆకాశము నుండి అగ్నిజ్వాలలు గ్రక్కుచు ఉల్కలు గురిసెను. అశుభ సూచకముగా భయంకరముగా నక్కలు కూసెను. రాక్షసుల నాశనమును తెలియజేయుచు ఆకాశమున భాస పక్షులు విహరించినవి. రాక్షస సైన్యములు నశించు సూచనలను మృగములు చేసినవి. రాక్షసయోధులట్లు వెళ్లునపుడు సత్తువలు లేనివారై భయముచే నిటు నటు దిరుగుచు నేలమీద కాలుజారి పడిరి. ఆ గొప్ప ఉత్పాతములను జూచి యోధులందఱును వ్యామోహితులై తూలసాగిరి. కాని భయంకరమైన యుద్ధము చేయు కుతూహలము గలవాడై వజ్రదంష్ట్రుడు భయము లేకుండ వెడలెను. అతని రాకను వానరులు చూచి ఆకాశమును బ్రద్దలు చేయు అరపులతో

భయరహితముగా విజృంభించి భయంకరముగా యుద్ధము చేయసాగగా చాలక్రోధము గల ఆ రాక్షస వానర శ్రేష్ఠులు ఒకరిపై నొకరు పిడుగుల వంటి దెబ్బలతో కొట్టుకొన బూని యౌద్ధత్యముతో ఱివ్వున విసరిన రాళ్లును బాణపు సంచు (తారాజువ్వ) లవలె వచ్చుచున్న వాడి బాణములును తగులగా జివ్వుమని ఎగిరెడు మిణుగురులు సమయమున చూచువారలకు మహా ఆశ్చర్యమును కలిగించెను. బండరాళ్లు, చెట్లును వివిధములైన ఇనుప ఆయుధములును తగిలినపుడు వచ్చుచున్న ధ్వనులును, అతివేగముగా పరువులు తీయుచున్న రథముల చక్రపుటంచుల వలన పుట్టు చప్పుడులును, భేరులు, మదంగములు శంఖములు మ్రోయు ధ్వనులును, వింటినారి మ్రోతలను, ఏనుగుల ఘీంకారములును, గుఱ్ఱముల సకిలింపులును కాల్బలములు పెట్టుచున్న బొబ్బలును, పెద్ద నవ్వులును, ఒకరినొకరు కొట్టుకొనుటచే వచ్చు ధ్వనులును, ఇరుపక్షములవారు వాదించుకొను వాదములును, చేతులు చరచుటలును హెచ్చై ఇరు పక్షముల వారలకు చెవుడు గల్గించెను. గుండె పగిలించెను. రాక్షసులు కొందఱు ఆయుధములను విసరి వానరులను నొప్పించగా వానరులును కక్షపూనిన వారై చెట్లను పట్టుకొని శత్రుసైన్యమున నున్న భటుల సత్తువలను పోగొట్టిరి. అప్పుడు బాహుయుద్ధము మహాద్భుతముగా సాగెను. వానరులు వేగముగా కాళ్లతో, చేతులతో, మోకాళ్లతో నొప్పింపగా, రాక్షస సమూహము గోలపెట్ట జొచ్చిరి. ఆ యుద్ధరంగమున వారలపాట్లు చూచి వజ్రదంష్ట్రుడు మదాంధుడై మబ్బులు వేగముగా ఉరుము విధముగా రథమును ఉద్ధతితో తోలెను. నివారింపరాని బాణవర్షమును గురిపించి వానరవీరులను సంహరించుచు మూడు లోకములు ప్రళయ సమయమున పాశములు ధరించి తిరిగు యముని విధముగా తిరిగెను. కొంచెమైనను భయములేకుండ శత్రు వీర సైన్యముల లోనికి రథమును ఔద్ధత్యముతో తోలి వింటినారి అధికముగా శబ్దించుచుండ బాణములను తెరిపిలేకుండా అవలీలగా సంధించుచు కోతుల మూకలను నరకుచు, పారదోలుచు నాశనము చేయుచు ప్రతాపమును జూపింపగా

## అంగదుడు శత్రుసేనపై విజృంభించుట:

అతని సహాయము చూచుకొని పరాక్రమించి రాక్షస సమూహములు తిరుగులేని గొప్ప అస్త్రధారల చేత భయంకరముగా వానర సంఘములను చెండుచుండగా వాలి సుతుడు కోపించి ప్రళయ కాలమందలి అగ్ని వలె మండుచు గొప్ప వృక్షమును చేతబట్టి అతని నెదుర్కొనెను. బాణా కఱ్ఱవలె ఆ చెట్టును గిరగిర త్రిప్పుచు కనిపించనివాడై, బలము వేగము

ప్రావీణ్యము ప్రకటమగునట్లుగా గుఱ్ఱములు, రథములు కేతనములు సారథులతో గూడిన రాక్షస సైన్య సంఘములు క్షీణించి చచ్చునట్లుగా, నఱుకబడిన చెట్లవలె అవయవములు తలలు తెగిన రాక్షసులు నేలవ్రాలగా విక్రమమే టగా చూపించు ప్రావీణ్యము గలవాడై ఎక్కడ చూచినను రక్తమే ఎక్కడ చూచినను శవములే, ఎక్కడ కనినను రాక్షుల మెండెములే, ఎక్కడ చూచినను శస్త్రముల తునకలే అగునట్లు చేసెను. ఆ యుద్ధభూమి హారములతోను, కేయూరములతోను, మేలైన వస్త్రములతోను, వాడియైన శస్త్ర సమూహములతో శరత్కాలపు రాత్రి వలె ప్రకాశించెను. క్షుద్రమృగములను జూచిన పార్వతి వాహనమైన సింహమువలె గొప్ప శౌర్యముతో వానరుడు మహా రౌద్రముతో రాక్షసుల రూపుమాపెను.

★★★



# ఏబది నాలుగవ సర్గము

## వానరులు వజ్రదంష్ట్రుని సేనల బొరిగొనుట:

ఈ విధముగా అంగదుడు భయంకరమైన విక్రమముతో శత్రు సైన్యములను సంహరించుచుండగా ఉగ్రమైన వాయుప్రతాపమున కోర్వక విడిపోవు మబ్బులవలె బెదిరిపోవుచున్న సేనలను చూచి వజ్రదంష్ట్రుడు కోపించి ఇంద్రుని వజ్రాయుధమువలె ధ్వనించు వింటినారిధ్వని చెవుడ్పడజేయుచుండగా గొప్ప సర్పములను బోలు బాణములను వర్షమువలె గురిపించి మీదకు వచ్చు కోతుల నడ్డుకొనగా రాక్షసులు కొంత తెప్పరిల్లి దివ్యమైన శస్త్ర సమూహములను వానర సైన్యముపై చిమ్మి ఆ వానరుల ప్రతాపముల నణచసాగిరి. వేలకొలది సాధనముల రాక్షససేనలు సందీయక వానర యోధ ముఖ్యులపై ఆటగా విసరి, విసరి వారి శక్తి నణగించిరి. అప్పుడు శ్రేష్ఠులైన వానర నాయకులు పెద్ద గండ శిలల నాయుధములుగా ధరించి కోయని అరచుచు గుంపులు గూడి ఆ రాక్షసవీరుల శరీరములను నలగగొట్టియమునిదరికి బంపిరి. గుట్టలుగా పడియున్న శవముల గుంపులపై నెక్కి తోడేళ్లు ఆనందముతో ఆటలాడెను. వింతగా కంకాళములు రేగి గుంపులు గూడి ప్రచండముగా నాట్యమాడెను. గ్రద్దలు తమ బలగముతో గూడి కడుపార విందు లారగించెను. రక్తము ఏఱులవలె ప్రవహింపగా దానియందు పుఱ్ఱెలను తెప్పలపై నక్కల గుంపు పయనింప సాగెను. కాకులాకాశమున గుంపుకట్టి గుండ్రముగా తిరిగెను. కాకులకు గ్రద్దలకు పెద్ద కలహమయ్యెను. ఈవిధముగా అప్పుడు ప్రాణకోటికి భయము కలుగునట్లు రాక్షస వానరుల యుద్ధము ప్రవర్తిల్లెను.

## వజ్రదంష్ట్రుడు వానరులపై విజృంభించుట:

పగిలిన తలలు, తెగిన మొలలు, విరిగిన మోకాళ్లు, తెగిన చేతులను, పాదములును గలిగి తగులుచున్న యుధముల దెబ్బలచే నొచ్చుకొనుచున్న వారై రాక్షసులు వానరులు నేలకొరిగిరి. తీవ్రమైన ప్రతాపముతో గూడిన వానరసేనచే తమ వారందఱును శక్తిహీనులై తూలుచు తాను చూచుచుండగనే కకావికలలై పారిపోవుచుండగా వజ్రదంష్ట్రుడు

విల్లుదాల్చి రోషముచే భయంకరమైన రూపము గలవాడై వానరులు బెదురునట్లు భయంకరముగా బాణములను గురిపించెను. వ్యూహములు చెదురునట్లుగా రథమును దోలుచు యుద్ధోత్సాహము రెట్టింపు కాగా వాడియైన బాణపు దెబ్బలచే వానరులకు తేరి చూడరానంత భయంకరుడై త్రుంచుచు, నఱకుచు తన యుద్ధనైపుణ్యమును జూపుచు బాహుబలమును ప్రకటించెను. అధికమైన క్రోధావేశముతో ఒక్కొక్క బాణముతో ఐదుగురను, ఏడ్వురను, ఎనమండ్రను గుదులుగా గ్రుచ్చు సంహరించెను. ఒరిగిన మెడలు, విరిగిన తొడలు, నఱుకబడిన కాళ్లు గలవారై వానరవీరులు చెల్లాచెదరై అంగదుని మాటునకు పారిపోయి అధికమైన భయముతో దాగిరి.

## వజ్రదంష్ట్రుడు అంగదునితో పోరి చచ్చుట:

భయమునందిన తమ వీరులను జూచి కోపముతో దలనూపుచు, చూపులతోనే ఆ రాక్షసుని దహించుచున్నవాడై అంగదుడు మహావేగముతో సింహము గజము మీద బడు విధముగా దూకి వజ్రదంష్ట్రుని నొక గ్రుద్దు గ్రుద్దెను. తోమరములతో ఏనుగును పొడుచు విధముగా వజ్రదంష్ట్రుడు క్రోధముతో భయంకరములైన బాణ సహస్రములచే వాలిపుత్రుని శరీరమును రక్తమయముగావించెను. ఈవిధముగా బాణ వర్షమును గురిపించి మర్మములను నొప్పింపజేయగా అంగదుడు ఒక పెద్ద వృక్షమును రివ్వున విసిరివేయగా రాక్షసుడు చూచి దానిని తన శౌర్యసంపద మెరయునట్లు గర్వముతో చిన్నచిన్న ముక్కలై నేలపడునట్లు గూల్చెను. ఆ రాక్షసుని ప్రతాప విధానము నంతయును చూచి అంగదుడు వేరొక కొండను పట్టుకొని సింహనాదము చేయుచు పఠిల్లున అతనిపై వేసెను. అతడును కొంచెమైనను భయపడక అవలీలగా దానిని తప్పించుకొని గదను బూని రథమునుండి ఉరుకగానే ఆ కొండ వేగముతో గుఱ్ఱములతో గూడ రథమును నాశనము చేసెను. తిరిగి వాలినందనుడు చెట్లతో గూడిన మఱియొక కొండను ఔద్ధత్యముతో విసరగా రక్తమాంసములను గ్రక్కుచు ఆ రాక్షసుడు గదనాధారముగా జేసికొని భూమిపై సొమ్మసిల్లి పడెను. ఆయాసపడుచు ఒక్క క్షణముండి తిరిగి తెలివినందినవాడై లేచి తన సమీపమునకు వచ్చిన ఇంద్రుని మనుమడైన అంగదుని ఱొమ్మును గదతో గ్రుమ్మెను. అంత అంగదుడాగదను దూరముగా విసిరివేసెను. భయంకరమైన బలము గల యిరువురు తెగించి ముష్టీ ముష్టి యుద్ధము చేయ మొదలిడగా ఒకరినొకరు కొట్టుకొను దెబ్బలచే శరీరములందు విపరీతముగా రక్తధారలు గురిసెను. అంగారకుడు బుధుడు

పోరాడునట్లు రాక్షస వానర వీరులు క్రోధముతో భంగపడక ఒకరినొకరు కంగారు పరచుచుండ అవకాశము చూచి అంగదుడు హెచ్చు పుష్పములు గలిగి అందముగా నున్న ఒక పెద్ద వృక్షమును విసరగా ఆ రాక్షసుడు ఖడ్గముచే దానిని నఱికెను. వృషభ చర్మముతో చేయబడిన డోలును, గజ్జెలతో అందముగా నున్న ఖడ్గమును అంగదుడు గైకొనగా వజ్రదంష్ట్రుడును కత్తి డాలు ధరించి అతని నెదుర్కొనెను. జయము నందవలెనను కోరికతో ఇద్దఱును, ఏటును, పోటును, దాటును, చలమును, వేగమును చూపించుచు భయరహితులై ఒకరినొకరు గొట్టుచుండగా ఆ కత్తిపోట్లు తగిలిన గాయముల నుండి నెత్తురులు కారగా పూచిన మోదుగు చెట్లవలె ఆ మేటి వీరులు శ్రమనొంది భూమిపై మోకాళ్లు నుంచి నిల్చునప్పుడు వ్రేటు దిన్న పాము వలె పెచ్చురేగి వానరనాధుడు మీదకు దూకి వీరత్వముతో ఆ రాక్షసుని పెద్దశిరస్సును బంతివలె ఖడ్గముచే తెగగొట్టగా అధికమైన రోషముతో కన్నులు గిరగిర తిరుగుచుండగా నిండిన నెత్తురు ఒక్క నిమిషములో మొండెమును విడిచి శిరస్సు నేలబడెను. తమ నాయకుడీవిధముగా యముని సన్నిధికి వెళ్లగా రాక్షసులు భయమునిండిన మనస్సులతో తమను వానరులు తరుముచుండగా మనస్సులు కంగారు పడుచుండగా లంకకు వెళ్లిరి. అంతట అంగదుడు వానరులందఱు తన చుట్టు చేరి సేవించుచుండగా దేవతలచే సేవింబడు ఇంద్రుని వలె నుండెను.

★★★



# ఏబది యైదవ సర్గము

## అకంపనుడు యుద్ధమునకు వెళ్లుట:

అట్లు అంగదునిచే వజ్రదంష్ట్రుడు యుద్ధమున చంపబడుట విని రాక్షసరాజు ప్రహస్తునితో "మహా శౌర్యవంతులైన రాక్షసులను గూర్చి అకంపనుని యుద్ధమునకు బంపుము. ఈతడు సర్వ శస్త్రాస్త్ర విద్యలు తెలిసినవాడు. యుద్ధము చేయ సమర్థుడు. శాసించువాడు, రక్షించువాడు, నాయకుడు, నా శ్రేయస్సును గోరువాడు గొప్పబలము గలవాడు. ఈతడు నరేంద్రులను వానరేంద్రులను జయింపగలడు" అని చెప్పగా ప్రహస్తుడు లెక్కలేనంత మందిని భయంకరులైన రాక్షసులను సిద్ధముచేసి అకంపనున కిచ్చెను. యుద్ధమునందు దేవతుల సమూహము చేత కంపింపని వాడౌట అకంపనుడను పేరుతో వెలుగుచున్న వాడు మేఘవర్ణము, మేఘగర్జన వంటి గర్జనము గలిగినవాడు. మెరయుచున్న బంగారపు పోగుల విలాసము గలవాడు అయిన అకంపనుడు గొప్ప రథముపై తామరల మిత్రుడు తూరుపు గొండనుదయించిన విధముగా ప్రకాశించెను. ఈవిధముగా అతడు వెడలుచుండగా అతని రథమునకు గట్టిన గుఱ్ఱములు కారణము లేకుండగనే ముందుకు ముగ్గినవి. ఎడమ కన్నదిరెను. గొంతు గద్గదమైనది. ముఖమునందు విచారము గనబడెను. వాయువు ప్రతికూలముగా భయంకరముగా వీచెను. మంచిదినమయ్యును మబ్బు గ్రమ్మిన దినముగా దోచెను. కఠినమైన స్వరములతో పక్షులు మృగములు. అరచెను. పెద్దపులి వంటి బలముగల అకంపనుడవి లెక్కచేయక యుద్ధమునకై ఉత్సాహపడెను. రాక్షసుని సైన్యము సముద్రమువలె ఘోషింపగా వానరసైన్యములు కంగారుపడి చెట్లను, పర్వతములను సిద్ధపరచుకొని యుద్ధమునకై నిలిచియుండిరి. ఇద్దటి సైన్య సమూహములకు మహా ప్రతాపముతో తీవ్రమైన పోరు జరుగుచుండగా రామునికి జయముగోరి వానరులు, రావణు జయము గోరి రాక్షసులు శరీరముల నర్పించుటకు సిద్ధపడి పరస్పరము బాహు బలము ప్రకాశించునట్లు, అవక్రపరాక్రమము ప్రకటమగునట్లు తలపడిరి. వారలు ఒకరినొకరు బెదిరించుటలు, నిదించుటలు, గర్జించుటలు భటుల కందఱకు చెవుడు కలిగించినవి. ఒకచోట ఎఱ్ఱని ధూళి పది దిక్కులందును వ్యాపించెను. ఒకచోట

పాదముల తాకిడిచే రేగిన ధూళులు సేనలవారిని గ్రుడ్డివారినిగా నొనరించెను. గుఱ్ఱములు, కవచములు, ధ్వజములు, పతాకములు, రథములు అను భేదము తెలియకుండెను. ఒక్క ఆకారము గూడ గనిపింపక ఔద్ధత్యముతో గూడిన వారి వికట శబ్దములు మాత్రమే వినిపించుచుండెను. ఆ స్థితిలో రాక్షసులే రాక్షసులను గొట్టసాగిరి. వానరులే వానరులను చంపిరి. తనవారలు విరోధులు అని మనసులందు గుర్తింపలేనివారై ఆ చీకటిలో కన్నులు గానరాక ఉభయ పక్షముల వీరులు ఆ సంకుల సమరమున తమవారిని, ఎదుటివారిని సంహరించుచుండిరి. రక్తప్రవాహము లధికమై భూమి ధూళి అణగిపోగా అనేక శవములు గనిపించినవి. చచ్చిన గుఱ్ఱములు, నేలవ్రాలిన కంచర గాడిదలును గోచరించినవి. వృక్షములను, శక్తులను, శిలలను ప్రాసములను, గదలను, పరిఘలను, పట్టిసములను ధరించి వానరవీరులను, రాక్షస యోధులును సాటిలేని సాహసముతో యుద్ధము చేసిరి. గోళ్లచే వానరులు నొప్పింపగా, బాణములచే రాక్షసులు నొప్పించిరి. చేతులతో కోతులు ముఖములను చీల్పగా వాడి బాణములచే రాక్షస ముఖ్యులు వారిని ద్రుంచిరి. అప్పుడు అకంపనునిచే ప్రేరితులైన రాక్షసులు వానరులను హడలగొట్టగా, కుప్పలుగా గండశిలల గురియుచు వానరులు వారి మదమణచిరి. చెట్లచేతను, గుట్టలచేతను రాళ్లచేతను కొట్టుచు మీదకురికి భయపెట్టుచు వానరులు రాక్షుల ఆయుధములను లాగి వారిని నేలకూల్చిరి. ఇంతలో వారలకు తోడుగా నలుడు, కుముదుడు, మైందుడు, బలవంతుడైన ద్వివిదుడును వచ్చి వృక్షములతో భయంకరముగా దాకి శత్రువీర సమూహములను పీనుగుపెంటలుగా చేసిరి.

## అకంపనుడు వానరసేనలపై గవియుట:

మదించిన వారై వైరి వీరులు భుజబలముతో విక్రమించి తమ వారిని వధించి మించియుండుటను జూచి క్రోధముతో ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై విరోధులను నాశనము జేయగల అకంపనుడు ధనుస్సును వేగముగా త్రిప్పుచు 'సారథీ! మన రథమును వేగముగా విరోధులు భయపడునట్లు తోలుము. అదిగో వానరనాధులు రాక్షస సమూహములు అలసిపోవునట్లు సంహరించుచున్నారు. ఆ ప్రదేశమునకు వేగముగా రథమును పోనిమ్ము. అచ్చట కొండలు, చెట్లు సాధనములుగా గల వానరులు యుద్ధమును గోరుచు కొల్లలుగా నున్నారు. వారల శరీరములు చిల్లులు పడవేసి, చూచువారి గుండె జల్లుమనునట్లు చంపవలెనని కుతూహలపడుచున్నాను.' అనగా సారథి అట్లే రథమును వేగముగా

తోలగా అకంపనుడు తీవ్రములైన బాణములను గురియుచు వారి మీదకు వెళ్లి తేనెటీగల గుంపులవలె బాణములను ప్రయోగించి ఒక్క నిమిషములో వానరసైన్యము బలము నశించి తూలునట్లు చేసి సింహనాదము చేయగా అతని యుద్ధమునకు నిలువజాలక మిక్కిలి భయముతో పారుచున్న వానర వీరులను వాయుపుత్రుడైన ఆంజనేయుడు చూచి ఆ రాక్షసుని యెదుట దర్పముతో నిలిచెను.

★★★



# ఏబది యాఱవ సర్గము

## హనుమంతునిచే అకంపనుడు హతుడగుట:

హనుమంతుని సహాయమును చూచుకొని వానర నాయకులందఱును సంతోషముతో పొంగిపోవుచు బలమును కూడ గట్టుకొని అరపులతో శత్రుసేనలను క్రోధముతో దాకిరి. తన ఎదుట హనుమంతుడు పర్వతమువలె నిలువగా ఓర్వలేని వాడై యకంపనుడు వరుణుడు వర్షధారలతో ముంచు విధముగా బాణ సమూహములచే ముంచెత్తెను. ఆ బాణవర్షమును ఆబోతు వర్షమునకు కొమ్ము వంచునట్లు లెక్కచేయక శిరము ఒక్కొంత ఓరగా వాల్చి వాని మీదికి మదించిన ఏనుగువలె ఉద్రేకించి వేగముగా వెళ్లగా వాడు నివ్వెరపడి ప్రక్కకు తప్పుకొని విడువక బాణములను గురిపించుచుండగా మండుచున్న సూర్యుని దలపింపజేయుచు ఆ హనుమంతుడు తొలగక గర్జించి వానిని తరుముకొని వెళ్లెను. తన వెంటనే పరుగెత్తి వచ్చుచున్న వానరవీరునిపై వేగముగా మండుచున్న వాడి బాణములను ప్రయోగించి నొప్పింపగా శౌర్యముతో హనుమంతుడు తానే సాధనము పట్టలేదని దలంచి మొదలు ఊడివచ్చునట్లుగా ఒక కొండను పెల్లగించి చేతితో పట్టుకొని పెద్ద బొబ్బపెట్టుచు గిరగిర త్రిప్పుచు పూర్వము త్రిలోకాధిపతియైన ఇంద్రుడు వజ్రాయుధ పాణియై నముచియను రాక్షసుని తరిమినట్లు అకంపనుని తరమగా ఆదే విరోధి దానిని జూచి గురిపెట్టి వాడియైన అర్ధచంద్రాకార బాణములచే దూరము నుండియే ముక్కలగునట్లు చేయగా కేసరి పుత్రుడు తన కొండ నడుమనే పిండియగుట చూచి ఎక్కువైన క్రోధముతో అశ్వకర్ణవృక్షమును వ్రేళ్లతో బెకిలించి నవ్వుచు వేగముగా ఎత్తి త్రిప్పుచు పాదఘాతములచే నేలకంపింపజేయుచు భటులు, గుఱ్ఱములు, రథములు, ఏనుగులు వీటి సమూహములను పిండి పిండి యగునట్లుగా రౌద్రముతో సంహరించుచుండ విరోధి సైన్యములు యముని జూచిన విధముగా బెదరి పారిపోయెను. మదించినవాడగు రాక్షసేశ్వరుడును తన ధనుర్విద్యా నైపుణ్యము కనిపించునట్లు ఆ వృక్షమును ముక్కలు చేసి బాణ సమూహముచే హనుమ శరీరమంతయు గాయమగునట్లు చేయగా వాయుపుత్రుడు నెత్తురులు గారు శరీరముతో పొగలేక జ్వాలలతో వెలుగు

అగ్నిహోత్రుని వలెను, పుష్పములతో నిండియున్న మోదుగ వృక్షము వలెను ఒప్పుచు గొప్పబలముతో ఇంకొక చెట్టును పట్టుకొని త్రిప్పుచు విరోధులకు తేరి చూడరానివాడై గొప్ప క్రోధముతో నిండిన మనస్సుగలవాడై రెండు చేతులతో గట్టిగా అకంపనుని తల చెక్కలగునట్లు మోదగా దేవతావిరోధి నేలపై బడి చచ్చెను. తక్కిన రాక్షసులను భూమి కంపించగా కూలు చెట్లవలె నేలపై బడిరి. సంతోషముతో పుట్టిన ఆవేశముతో వానరులు తరుముచుండగా భ్రాంతి చెందిన మనస్సులతో చావు భయమున తలలు వ్రేలాడగా తడబడుచున్న కాళ్లతో ఒకరినొకరు పడ ద్రోసికొనుచు వెనుదిరిగి చూచుచు రాక్షసులు ఒకరిని మించి యొకరు పరువెత్తుచు లంకకు పారిపోయిరి. అంత వానర సమూహములు హనుమంతుని నీవు సాటిలేని బలవంతుడవని పొగడిరి. అతడు తగిన సమాధానములతో మీరు తోడ్పడగా నాకు చేయలేని పని యేది యని వారి నాదరించెను. వానరులును తమకు ఓపికలున్నంత వఱకు సంతోషముప్పొంగగా కేకలు వేసిరి. కొంచెము కొంచెము ప్రాణములున్నవారిని గుఱుగుఱమని గొంతులో గుఱకలు గల వారిని అచ్చటనున్న రాక్షసుల నందఱిని వానరులు వేగముగా బరబరా ఈడ్చి ఆవల పాడవేసిరి. అప్పుడట్లు బలవంతుడైన అకంపనుని సంహరించి హనుమంతుడు తేజస్సుతో ప్రకాశించెను. బలిని అణగద్రొక్కిన వామనుని వలె మెఱిసెను. రామలక్ష్మణులును, వానరరాజును, విభీషణుడును, దేవతల సమూహములును, మహా సంతోషముతో వాయుపుత్రుని మంచి మాటలచే ప్రస్తుతించిరి.

★★★



# ఏబది యేడవ సర్గము

## రావణుడు ప్రహస్తుని యుద్ధమునకు బంపుట:

యుద్ధమునందకంపనుడు యముని కతిథిగా వెళ్లుటను విని ఒక్కింత దీనుడై రావణుడు మంత్రి సంఘముతో ఆలోచనలు చేసి ఆరోజు ఉదయ సమయమున పట్టణమును చూచుటకై నాలుగు వైపులకును వెళ్లి తన సేనలున్న విధమును పరికించి చూచి వానరసేనలు పట్టణము చుట్టును ముట్టడించి యుండుటను తెలిసికొని కోపముచే కాలిపోయిన మనస్సుగలవాడై యుద్ధమున నేర్పరి యయిన, తన యొద్దనే యున్న ప్రహస్తుని చూచి యిట్లనెను. ఈ కోట ముట్టడిని దొలగించు మార్గము యుద్ధమొక్కటియే తప్ప వేఱొకటి యేదియు గానరాదు. ఈ మహాభారమును మోయుటకు నేనుగాని, తమ్ముడైన కుంభకర్ణుడు గాని, నికుంభుడు గాని, సేనానాయకుడైన ఓ యోధశేఖరా! నీవు గాని, ఇంద్రజిత్తుగాని తగుదురు గాని, వీరు గాక యెవ్వరు సమర్థులు? చెప్పుము. అందువలన నీవు కావలసిన రాక్షస సైన్యమును దీసికొని యుద్ధమునకు వెళ్లుము. ఆ కోతులు నీ ప్రతాపమును విన్నయంతనే బెదరి పరుగెత్తెద. బెదరుగొడ్లు, నీతిలేనివారు, అదరు గుండెలు గలవారు అయిన వానరులు నీ ఆర్భాటమును విన్నచో సహింపగలరా? సింహగర్జనము విన్న రామసౌమిత్రులు ఏమి చేయుదురు. సేనలు లేకున్నచో తొలగిన వారై దిక్కుతోచక దీనులై నిశ్చయముగా నీకు యుద్ధమందైనచో మరణము సందేహాస్పదము. కొంత ప్రయత్నించినచో యుద్ధరంగమున జయము పొందుదుమేమో గదా. అది మేలే కదా. ఓ బాహుబలవంతుడా! యోధునకు మరణము పురమందు మేలో యుద్ధరంగమున మేలో నీవే హితము చెప్పుము. అని రావణుడు పల్కగా సేనాధిపతి దశముఖునితో శుక్రుడు రాక్షసరాజైన బలితో చెప్పిన విధముగా ఇట్లనెను. ఓరాజా! ఇదివరకే సమర్థులైన నీ మంత్రులను నేనును ఆలోచించితిమి. అందఱము ఏకాభిప్రాయమునకు రాలేకపోవుటచే పని చెడినది. ఆ వివాదమున నా అభిప్రాయమును తెల్పెదను. వినుము. జానకిని రామునకిచ్చివేయుట శ్రేయస్కరము. అట్లు చేయనిచో యుద్ధము చేయటమే శుభమని నేను చెప్పితిని. కాని వాదములో భేదాభిప్రాయము వచ్చుటచేత నా మాటలు వ్యర్థములైనవి.

సరే అది అట్లుండనిమ్ము. అనేక విధములైన అర్థములచేతను, ప్రసంసా వాక్కుల చేతను సంతోషముతో తృప్తిపరచి ఎల్లప్పుడు నన్నెంతో సత్కరించితివి. నీ ఋణము నంతయు దీర్చుకొనుట కిది నాకు తగిన సమయము. ఇట్టివేళ నేను బ్రతుక కోరికగలవాడనై దాగియుండెదనా? ఓ రాజా! ప్రాణము లంత తీపియా? పుత్రులను, భార్యలను, స్నేహితులను, ఇండ్లను, ధనాదులను ఆశింపను. నీ కొఱకై యుద్ధ యజ్ఞమున నేమాత్రము వెనుదీయక నా శరీరమును ఆహుతి చేయుదును. మనస్సున ఈ విషయమును నమ్ముము రాక్షసరాజా! అని చెప్పుచు

**ప్రహస్తుడు యుద్ధమునకు వెడలుట:**

ప్రహస్తుడు తన సేనాధ్యక్షునితో 'క్షణములో ఉత్సాహపూరితమైన మన సైన్యమును తీసికొనిరమ్ము. నా యొక్క వాడియైన బాణములచే చంపబడిన వానరుల మాంసములను మాంసభుక్కులగు పక్షులు తృప్తిగా మెక్కుగాక.' అని పలికెను. సేనాధ్యక్షుడు అట్లే బలములను సిద్ధపరచగా లంకయంతయు క్షణములో తీవ్రమైన వివిధములైన ఆయుధముల ప్రకాశముతో రాక్షస బలముతో ఏనుగులతో గుఱ్ఱములతో ఆకులితమై భయంకరముగా అయ్యెను. అగ్నిహోత్రుని యందు హోమములు చేసిన నేతిపోగుల వాసనల చేతను, బ్రాహ్మణులను పూజించి అర్పించిన పుష్పముల వాసనల చేతను నగరము మూల మూలల ఘుమాయించెను. వివిధములైన మంత్రపూతములైన హారములతో రాక్షసవీరులు యుద్ధోద్యమ హర్షాతిరేకులై తమ శరీరముల నలంకరించుకొనిరి. కవచము ధరించి చేత ప్రకాశవంతమైన ధనువులు దాల్చి తమ గర్వాతిశయమును రావణుడు చూచునట్లు రాక్షసవీరులు సంతోషముతో నేతెంచిరి.

సకలమైన అస్త్రశస్త్రములతో గూడినదియు, సమర్థములైన గుఱ్ఱములు పూన్చినదియు, యుద్ధవిద్యాకోవిదుడైన సారథిచే నడుపబడునదియు, కఠినమైన గర్జవంటి ధ్వని గలదియు, సూర్యచంద్రులు ప్రత్యక్షమైనట్లుగా ప్రకాశము గలదియు భయంకరమైన సర్ప ధ్వజముతో కూడినదియు మంచి వరూధములు చక్రములు గలదియు బంగారు హారములతో నొప్పునదియు, ఇతర రథములను తిరస్కరించు కాంతిగలదియు అయిన రథము నెక్కి రావణుని ఆజ్ఞను గైకొని శంఖములు, భేరులు మ్రోగించు ధ్వనులతో సంకులమైన సైన్యముతో సేనా నాయకుడగు ప్రహస్తు వెడలెను. దేవతల గుండెలు

పగులునట్లు మేఘగర్జవంటి మహా శబ్దముతో గర్జించుచు భుజబల పరాక్రమములచే శత్రువులను లోగొన్న ప్రహస్తుడు యుద్ధోత్సాహముతో బయలుదేరెను.

## ప్రహస్తున కపశకునంబులు తోచుట:

దిక్కులు సర్వమును బీటలు వారుచున్నట్లుగా భయంకరమైన శబ్దములు చేయుచు భయంకరాకారులు, పర్వతముల వంటి శరీరములు గలవారునయిన సమున్నతుడు, నరాంతకుడు మహానాదుడు కుంబహనుడు అను నలువురు మంత్రులు తమ సైన్యములతో గూడి ముందుగా నడువగా ప్రహస్తుడు తూర్పు ద్వారమున బయలు వెడలెను. వానియొక్క ప్రయాణ ఘోషము, సేనల అరుపులు లంకలోనున్న రాక్షస సమూహము యొక్క గుండెలను పగులజేసెను. సర్వభూతములును అరచినవి. మేఘ రహితమైన ఆకాశమున పక్షిరాజులు రథముచుట్టు ప్రదక్షిణముగా తిరిగినవి. నక్కలు నిప్పులు ఉమియుచూ అతని ప్రక్కన తిరిగెను. వాయువు విపరీతమైన వేగముతో వీచెను. ఆకాశమున గ్రహములెల్ల పోరాడ సాగినవి. పెద్ద తోకచుక్కలు వ్రాలినవి. మేఘముల గుంపులు కఠోర ధ్వనులు నింపినవి. గ్రద్ద టెక్కెముపై దక్షిణ ముఖముగా వ్రాలి ఇరుప్రక్కల గీరుకొనుచు అతని తేజస్సునంతయు హరించెను. సారథి చేతనున్న సెలగోల జారిపడెను. సమ తలమునందే అతని గుఱ్ఱములు, చాపకట్టుగా పడెను. యుద్ధమునకు బయలు వెడలునప్పుడున్న ప్రహస్తుని గొప్ప తేజస్సు తృటిలో నశించెను. ఇట్టి దుశ్శకునములను చూచియు ప్రఖ్యాతిచెందిన పౌరుషము గలిగిన ప్రహస్తుడు భయపడక రోషముతో లంకాద్వారము నుండి బయటకు వచ్చెను. అట్లు వచ్చువానిని కోతులు రోషముపుట్ట చూచి కొండలను, చెట్లను పీకుచు వాని కెదురుగా వచ్చిరి. వారి నాదములు దిక్సమూహములను పగుల జేయుచుండెను. రెండు పక్షముల సైన్యములు అంకెలు వేయు ఆబోతుల వలె ఒకరినొకరు బింకము మీర చూచుచు, పిలుచుచు, వగర్చుచు యుద్ధమునందు కోరిక గలవారై జంకు గొంకు లేకుండగా కోయని అరచుచు తలపడిరి. అంత సంశయములేక అగ్నిలో పడు మిడుత వలె దుష్టుడైన ప్రహస్తుడు గెలువ దలంచుచు వానర సైన్యమును ప్రవేశించెను. ఇట్లు భీకరగతితో తమ సేనల మీదకు వచ్చు రాక్షసుని జూచి రామచంద్రుడు చిఱునవ్వుతో

★★★

# ఏబది యెనిమిదవ సర్గము

## ప్రహస్తసేనలు వానరులతో పోరుట:

విభీషణునితో "రాక్షసరాజా! గొప్పసేన కొలువగా యుద్ధమునకు వచ్చిన గొప్ప దేహముగలిగిన ఆ బలవంతుడెవరయ్యా! అనగా అతడిట్లు చెప్పెను. రామభూపతీ! ఈతడే రావణాసురునకు మిక్కిలి నమ్మిన బంటు. శూరుడు ప్రఖ్యాతమైన పరాక్రమము గలవాడు. గొప్ప అస్త్రములందు నేర్పరి. సర్వసైన్యాధిపతి. మూడు వంతుల సైన్యమును నడిపించువాడు. వీరత్వము గలవాడు. వెఱపు నెఱుగనివాడు. ఈతని పేరు ప్రహస్తుడు." అని చెప్పగా ఇంతలో ప్రహస్తుడు రాక్షస సైన్యముతో గలిసి ఎంతో రోషముతో అధికమైన సింహనాదములతో దిక్కులు భేదిల్లజేయుచు జై యనుచు పైకి రాగా వానర సమూహము కొండలు వృక్షములు వేగముగా పట్టుకొని మిక్కిలి వేగముతో, ఈర్ష్యతో క్రోధముచే అందమైన మనస్సు గలదై ఎదుర్కొనెను. శూలములు, గదలు, రోకండ్లు, శక్తులు, ఖడ్గములు, గుదియలు, బరిసెలు, బరుచులు మొదలైన ఆయుధములు మెఱయగా బలవంతులైన రాక్షసులు తాకిరి. వానరులు రాళ్ల వర్షమును, రాక్షసులు బాణ వర్షమును గొప్ప వేగముతో కురిపించిరి. వాని దెబ్బలచే గుంపులు గుంపులుగా రాక్షసులును, వానరులును వ్యథ చెంది కేకలు పెట్టుచు తలలు బ్రద్దలై నేలగూలిరి. నల్లని యినుప శూలాయుధములతో రాక్షసులు వానరులను గుదిగ్రుచ్చిరి. ఇనుప కట్ల గుదియలతో మోది సాటిలేని విధముగా సంహరించిరి. గండ్ర గొడ్డళ్ల దెబ్బలచే కండలను పగులగొట్టి వానరుల ప్రతాపముల నణచిరి. క్రింద పడవైచి పై బడి త్రొక్కి ఊపిరి ఆడకుండ రాక్షసులు వానరులను నొక్కిపట్టిరి. వానరులు బాణపు దెబ్బలకు హృదయములు పగిలి, కత్తుల నరకుట లచే రెండు ముక్కలై శూలములచేత ప్రక్కలు పొడువబడినవారై నిహతులైరి. ఆ యుద్ధమున వానరులు పౌరుషముతో కొండలను చెట్లను రువ్వగా బజ్జులుగను, ఊరుబిండ్లుగను, పచ్చడులుగను, పెద్ద ముద్దలవలెను, గుజ్జులుగను అయి రాక్షసుల గూలి చచ్చిరి. తాటలూడి పిండివలెనైరి. లెక్కలేనంత మంది రాక్షసులు వినాశమునందిరి. పెఠీలు మను అరచేతి చెంపదెబ్బలచే పండ్లూడి బొక్కినోళ్లైన వారును, పిడుగులకు సరివచ్చు పిడికిటి పోట్లచే కనుగ్రుడ్లు ఊడి గ్రుడ్డివారైనవారును,

జుట్టు పట్టుకొని తలవంచి చేతి కొలది గ్రుద్దగా భోక్కుమని నెత్తురు గ్రక్కుకొను వారును, రెండు కాళ్ళను బిగ్గరగా పట్టుకొని గిరగిరమని త్రిప్పి విసిరి వైచిన యముని జూడ వెళ్లువారును, మీదకురికి కఱుకు కోరలచే కరచి, గోళ్లతో బరికి ముక్కలు ముక్కలుగా పారవేయగా శౌర్యములు చెడి గర్వమును విడచి తత్తరపాటు చెంది భయపడి అరచుచు పరువెత్తువారును అయి రాక్షులు మరణించిరి. బాహువులప్పళించుచు భయంకరాకారులు అహంకారముచే తిరుగుడువడుచున్న నేత్రములు గల వారు నై రాక్షస వానర వీరులు హేమాహేమీలు ఘటాఘటీలుగా సింహముల గుంపులవలె బాహువులతో బాహువులు గలిపి మల్లయుద్ధ ప్రావీణ్యము కనబడునట్లు పోరాడిరి. అట్లు పోరుచుండగా వారి పెద్ద గర్జనలును, ఏడ్పులును, జై జై అను అరుపులును, దీనముగా దుఃఖించు శబ్దములును అధికమయ్యెను. ఆ సమయమున యమునితో సాటివచ్చు కుంభహనుడు, సమున్నతుడు, నరాంతకుడు, మహానాదుడు సముద్రమునకు చెలియలి కట్టలై నిలువరింపగా ద్వివిదుడొక కొండ శిఖరమును వేయగా దానిచే నరాంతకుడు యముని సేవింప వెళ్లెను. దుర్ముఖుడొక గొప్ప వృక్షమును రివ్వున వేయగా సమున్నతుడు నేలగూలెను. జాంబవంతుడు శౌర్యముతో మహానాదుని నొక బండతో బాధగా అతడు యముని జేరెను. తారుడు ఒక చెట్టుతో గొట్టగా కొండవలె కుంభహనుడు నేలకొరిగెను.

## ప్రహస్తుడు కపుల వధించుట:

ఆ వానరుల తీరు చూచి ప్రహస్తుడు విల్లుచేత బట్టి ప్రళయకాలమున విజృంభించు సముద్రము వలె దేవతలకు భయంకరుడై అట్టె పొంగుచు, రౌద్రరసమాకృతి దాల్చివచ్చెనో యను నట్లును, లయము చేయు విధముగా, కోతులు భయముచెందునట్లును, మహావేగముతో రథమును తోలించెను. వానరులనెడి సముద్రమున మందరపర్వతమువలె రథమును త్రిప్పు నేర్పరియైన ఆ ప్రహస్తుని యుద్ధము ప్రళయము వలె గన్పింపగా, ఆ సైన్యము యొక్క నినాదము సాగర ఘోషమువలె నుండగా కఠోరములైన బాణములచే కొట్టబడిన వానరుల శరీరముల నుండి కారుచున్న అధికమైన రక్తము ఆ సముద్రపు నీరువలె నుండెను. దానికి వెనుదిరుగక వారలు విజృంభించి రాక్షస సంఘములను సంహరింపగా అప్పుడు రెండు సైన్యములయందు రాక్షస వానరుల రక్తప్రవాహముచే తడిసి భూమి వసంత సమయమున పుష్పించిన మోదుగ వృక్షమును దలపించెను. కూలిన వీరుల కోట్లు ఒడ్డులుగా, విరిగిన ఆయుధములే వృక్షములుగా, రక్తమే నీరుగా,

యాకృత్ప్లీహములే బురదగా, ప్రేవుల ప్రోగులే నాచుగా, కాలుసేతుల ఖండములే మీనములుగా, శరీరావయవముల గుంపులే మధ్యనున్న పచ్చిక బయళ్లుగా గ్రద్దల గుంపులే హంసల సమూహముగా, రాపులుగులే (కంకములు) బెగ్గురు పక్షులు (సోమములు) గా మెదడు తండములే నురువుగా ఆర్తనాదములే నాదముగా దర్జనులకు దాటరానిదగు యుద్ధభూమియనెడు నది యమపురియనెడు సముద్రమును జేరుటకై అపుడు ప్రవహించెను. శరత్కాలమున హంసలతో, బెగ్గురులతో ప్రకాశించు నదిని వలె ఆయుధ భూమి యనెడు నదిని ధీరులగు రాక్షస వానర వీరులు తమ బలముతో దాటి వెలిగిరి. పాదధూళులచే గూడినదియు, రక్తమే జలముగా గలదుగు యుద్ధసరస్సును రాక్షస వానరవీరులు మదపుటేనుగులవలె దాటి ప్రకాశించిరి.

## నీలుడు ప్రహస్తుని వధించుట:

ఎందును తన్నెదిరించు వారు లేక యుద్ధభూమిలో తన రథమును వానరుల మీదమీదకు దోలగా తనను చూచి కోతులు చెల్లాచెదరై పరువెత్తుచుండగా సముద్రములో విహరించు పెను చేపవలె విహరించుచున్న ఆ ప్రహస్తుని నీలుడు కన్నులు కెంపులవలె ఎఱ్ఱవారగా చూచి అతివేగము గలవాడై ఆకాశమున పుట్టిన పెనుగాలి మేఘముల గుంపుపై బడు విధముగా వానితో తలపడగా సూర్యసమానమై ప్రకాశించు రథము యొక్క వేగముతో విలువిద్యా నైపుణ్యము ప్రకాశింపజేయుచు వానిపై బడి శూరుడై తన ప్రతాపమును చూపుచు పెద్దగా హుంకరించుచు రాక్షస సమూహము మెచ్చునట్లు వింటినారిని మ్రోగించుచు వాడి బాణములను నీలుని శరీరమున నాటి మహాహంకారముతో అఱచెను. ఆ బాణములు వానరశ్రేష్ఠుని శరీరమున నిరాఘాటముగా బ్రవేశించి రక్తముతో తడిసి నేలబడెను. మఱల ఆ ప్రహస్తుడు నీలుని తన చెంతకు చేరనీయక తీవ్రములైన బాణముల ప్రవాహమును గురియింపగా శూర శ్రేష్ఠుడగు నీలుడును ఒక చెట్టును నిమిషములో తీసికొని బాణములకు ఎదురీది వెళ్ళి బాహుపరాక్రమముతో ఆ రాక్షసునిపై నొక దెబ్బ తీసెను. అప్పుడు భయంకరములైన అరుపులతో దిగ్గజములను చెవుడ్పడ జేయుచు ఆ రాక్షసుడు శరవర్షమును ధారలుగా నీలునిపై గురిపించగా అతడు నిశ్చేష్టుడై ఆ బాణవర్షము ఆపుటకు గాని దాటుటకు గాని శక్యము కాకపోవుటచే ఆ వానరశ్రేష్ఠుడు శరత్కాలమున ఆకస్మికముగా వచ్చిన ధార వర్షమును వృషభము కనులు మూసికొని సహించునట్లు ఆ బాణ వర్షమును సహించుకొని బాహుబలమే ఆధారముగా నిల్చి యుండి అవకాశమును

చూచి చెట్ల దెబ్బల చేత రథమును, గుఱ్ఱములను గూల్చెను. ప్రహస్తునిపై బడి వాని వింటిని గట్టిగా పట్టిలాగి వంచుచు తటుక్కున దానిని విరిచివేయగా, విల్లు లేక రాక్షసుడు రథము మీద నున్న సాధనములలో చేతికందిన రోకలిని బట్టుకొని వేగముగా నేలకురికెను. అట్లు రోకలిని త్రిప్పుచు తన్ను దాకుచున్న రాక్షసుని జూచి యేమియు తడబాటు లేక శౌర్యముతో నీలుడెదుర్కొని బాహుబలాధిక్యముచే అడ్డగించెను. ఇద్దఱు సేనాపతులు. ఇద్దఱు జాతవైరులు. ఇద్దఱును గద్దరికాండ్రు. ఇద్దఱును గొప్ప బలవంతులు. ఇద్దఱును గొప్పవేగము గలవారు. ఒకరికొకరు పెన్నుద్దులు. విశ్రాంతి కోరక, ఓడిపోక, భయపడక, ఆపద నొందక, బలము నశింపక తొలగక, తగ్గక, మనస్సులందు నొవ్వక మదించిన ఏనుగులవలె పోరుచుండగా నెత్తురులలో శరీరములు మునుగుచుండ కీర్తిని గోరుచు శౌర్యముతో అరచుచు ఆలస్యము చేయక తలడుచు గుండ్రముగా తిరుగుచు కోఱలతో గొరుకుచు గోళ్లతో ఱక్కుచు, కత్తులతో నరకుచు, పౌరుషముతో సమీపించిన గొట్టుచు, దూరమేగుచో పట్టుచు, పారినచో తిట్టుచు, పడినను మఱల లేచి కలబడుచు, ఇట్లు ఆటగా వానర రాక్షస సైన్యాధిపతులు బలములు ప్రకాశింపగా ఇంద్రవృత్రుల వలె వెనుదీయక మనస్సులందు రోషములు వీడక విజృంభించి కొమ్ముటేనుగుల వలె ఢీకొనుచు ఒక్కమాటు హుమ్మని తాకుదురు. ఒక్కొక్కమాటు కోడిపుంజులవలె ఒకరినొకరు చుట్టి తిరుగుచు రోషముతో దాటుదురు. ఒక్కొక్క మారు సర్పము వలె పెనుగుచు నేలపై పొరలుదురు. మదించిన ఆబోతుల వలెను, సింహముల వలెను, పెద్ద పులుల వలెను పోరుచు, సాటిలేని బలముగలవారును ఓటమి నెఱుగని వారును, యుద్ధ విజయులు నగువారిరువురు ఉండగా, రాక్షసు డొకింత సమయము చూచి తటాలున ముసలమును తీసికొని మహావేగముతో వానరవీరుని నుదుటిపై కొట్టెను. జొట జొట నెత్తురు కారుచుండగా నీలుడు త్రుటిలో ఒక పెద్ద చెట్టును వానిపై విసిరివేసెను. దాని దెబ్బకు చలింపక, అలసిపోక ప్రహస్తుడు రోషమును పొందినవాడై ముసలమును రెండు చేతులతో పట్టుకొని గొప్ప శౌర్యముతో పైకెత్తి రాగా వానరశ్రేష్ఠుడు ఏమాత్రము కలతజెందక దూరముగా దుమికి మిగుల వేగముతో ఒక గుండు రివ్వున విసరి సూటిగా వాని శిరమున మొత్తెను. ఆ రాతి దెబ్బచే దేవతా విరోధియైన ప్రహస్తుని శిరము నిమిషములో కఱ్ఱదెబ్బచే పగులు కుండవలె పగిలి చెక్కచెక్కలై నేలబడెను. మొదలు నఱికిన చెట్టువలె అతడు నేలపై బడగా శరీరమునుండి శిరస్సు నుండి నెత్తురులు ఏఱులవలె భయంకరముగా ప్రవహించెను. తమ సేనాపతి అట్లు భయంకరముగా చావగా

సంతోషము తొరగిన మనస్సులు గలవారును ఏ ప్రయత్నములు లేనివారును దీనులునై రాక్షసులు గట్టు తెగ గొట్టగా పారు నీటివలె యుద్ధరంగమును వీడి భయమునొందుచు లంకకు పారిపోయి రాక్షసరాజగు రావణుని భవనమునకు వెళ్లి ఏమియును మాట్లాడలేక ధ్యానముచే మౌనము వహించునట్లును, తెలివితప్పిన విధముగను, గొప్ప శోక సాగరమున మునుగుచు, వెఱ్ఱిచూపులు చూచుచు కన్నుల వెడలు బాష్ప ధారలను ఆపలేరైరి. అద్భుతమగు విధముగా వానర శ్రేష్ఠుడగు నీలుడు ఇట్లు శత్రువును భుజబలముతో చంపి యుద్ధరంగమున ప్రకాశించెను. వానరులు సంతోషముతో పొగుడుచుండగా అధికమైన ఆనందముతో రాముడు మేలు మేలని మెచ్చుకొనెను. సౌమిత్రియు అతనిని అమితముగా పొగడెను. ఆ దశరథాత్మజుని దయకు నీలుడమితానందము నందెను.

★★★



# ఏబది తొమ్మిదవ సర్గము

## రావణుడు తొలిసారి యుద్ధమునకు వెడలుట:

చావగా మిగిలిన సైన్యములు జరిగినదంతయును వినిపింపగా విని రావణుడు క్రోధముచే శరీరము తెలియనివాడై దుఃఖముచే పీడింపబడినవాడై దేవతల నుద్దేశించి పల్కు ఇంద్రుని వలె వారితో నిట్లనెను. "ఇంద్ర సైన్యమును నాశము చేయగల్గు నా సేనాపతిని, సేనలతో, గజబలముతో సహితముగా ఆ కపులు చంపిరా? ఇంక ఉపేక్షించుట తగదు. ఔరా! ఎంత వింత? వానరులా రాక్షసులను చంపువారలు. చూచెదను గాక. నేనే వెళ్లి వారిని సమూలముగా నిర్మూలించి జయమును పొంది స్థిరమైన కీర్తిని పొందెదను. ఎవడురా? నన్ను దాకి బ్రతుకగల వీరుడు? ఇక నన్ను చూడుడు. ఇక వానరసైన్యములను కారు చిచ్చు అడవులను తగులపెట్టునట్లు మాడ్చివేసెదను. వాడి బాణములచే రామలక్ష్మణులను గాల్చెదను. ఇంత చేసినట్టి, దుష్ట కీటకములగు నరులను చంపివేసెదను గాని సంహింతునా" అని అగ్నివలె ప్రకాశించునదియు గుఱ్ఱములు పూన్చినదియు, గొప్ప మణులచే ప్రకాశించునదియు అగు రథమును వేగముగా ఎక్కి మృదంగములు, భేరులు, శంఖములు మొదలగువాని మ్రోతలను, రాక్షస సంఘముల సింహనాదములును, జనుల శుభవాక్యములును వెలయుచుండగా యుద్ధ క్రీడయందాసక్తి గలవాడై వెడలెను. కొండలవలెను మేఘములవలెను ఉన్న రాక్షసులు, అగ్ని గోళములు వలెనున్న నేత్రములు గలవారు తనవెంట రాగా రావణుడు భూత గణములచే సేవింపబడు శివునివలె నొప్పెను. ఇట్లు రావణుడు రాక్షస సేనా సంఘములు కొలువగా లంకాపురము వెలువడి వెళ్లి కొండలు చెట్లు చేతులందు దాల్చి, సముద్రము యొక్కయు మేఘములయొక్కయు ధ్వనులు గలిగి చూచుటకు భయంకరముగానున్న వానర సైన్యమును చూచెను. సర్వరాజుల వలె పొడవైన చేతులు గలవాడును, వానరరాజగు సుగ్రీవునితో గలిసియున్నవాడును, మహాతేజస్సు గలవాడును అగు రాముడు ఎదురులేనిదై యుద్ధమున తీవ్రమైన యుద్ధమును గోరి వచ్చుచున్న రాక్షసాధిపుని సైన్యమును చూచి శస్త్రవిద్యా నిపుణులలో అగ్రగణ్యుడు, గుణవంతులలో శ్రేష్ఠుడు నయిన విభీషణుని చూచి యిట్లనెను. ఓ రాక్షసరాజా! అనేక

విధములగు జెండాలతో గూడినదియు, అనేకములైన ప్రాస శూలాద్యాయుధముల సమూహముచే భయంకరమైనదియు, దిగ్గజముల వంటి ఏనుగులు గలదియు, శౌర్యముగల అనేక యోధులతో గూడినదియు అగు సైన్యము చెనకరానిదైయున్నది. అది యెవ్వరిదో దానిని నాకు తెలియునట్లు చెప్పుము. అనగా

## విభీషణుడు శ్రీరామునకు రాక్షసవీరుల నిరూపించి చెప్పుట:

విభీషణుడు తామరలవలె విశాలమైన నేత్రములుగల ఆ రామునితో రావణుని సేనను గూర్చి విశారదముగా ఈవిధముగా వివరించెను. ఏనుగు మూపుపై నున్నవాడును, ఉదయగిరి శృంగమున నుండు సూర్యునితో సమానమైన కాంతి గల ముఖము గలవాడును, శౌర్యము గలవాడును, బాహు గర్వ ప్రఖ్యాతి గలవాడును, గొప్ప తేజస్సు గలవాడును, తన బరువుచే చలింపజేయబడిన ఏనుగు శిరస్సు గల వాడును రాక్షసరాజపుత్రుడును అగు ఆతడే రామచంద్రా! అకంపనుడు. ఇంద్ర ధనువు వంటి ధనస్సును త్రిప్పుచు సింహధ్వజము గల రథముపై గూర్చుండి తూర్పు దిగ్గజము వలె మెలిదిరిగిన దంతములు గలిగి గొప్పలు పోవుచున్న వాడే సుమా ఇంద్రుని గర్వము నణచిన వాడును వరముల బలముచే జయింపరాని వాడును అయిన ఇంద్రజిత్తు రాజచంద్రా! అదిగో అతడు అతిరథులలో శ్రేష్ఠుడును, శ్రేష్ఠమైన వింటి నారిని తీవ్రముగా మ్రోయించుచున్న వాడును, అస్త్రాద్రిని, మహేంద్ర పర్వతమును, పెద్దదైన వింధ్య పర్వతమును పోలిన పెద్ద శరీరము గలవాడును, రథముపై నున్నవాడును, యుద్ధమునందు కొట్టుపడనివాడును, అద్భుతములగు చర్యలు గలవాడును అయిన అతికాయ నామధేయుడు. బాలసూర్యుని వంటి నేత్రములు గల వాడును ప్రకాశించుచున్న ఘంటానాదములచే భయంకరమైన ఏనుగుపై నున్నవాడును విరోధులకు భీతి గలిగించువాడును, వీరులలో శ్రేష్ఠుడును, పెద్ద గాడిద స్వరము గలవాడును, అగువాడే ఓ రామభూపాలా! మహోదరుడను రాక్షసుడు చూడుము. ఓ సీతాపతీ! సాయంకాలపు మేఘములతో నొప్పు పర్వతము వలె బంగారు భూషణములతో ప్రకాశించుచున్న గుఱ్ఱముపై నెక్కి ధగధగ జ్వాలలతో మెరయు బంగారపు పిడి గలిగిన బల్లెమును చేతబూని యుద్ధక్రీడాసక్తుడై వచ్చుచున్నవాడు పిశాచుడను పేరుగలవాడు. కింకర వజ్రవేగమని ప్రఖ్యాతి చెందిన వృషభము నెక్కి సంశయము లేని మనస్సుగలవాడై మెఱుపులు కాంతలనీనెడు వాడియైన శూలమును పట్టుదలతో పట్టుకొని అతివేగముగా వచ్చుచున్నవాడు జగత్తున ప్రసిద్ధిపొందిన త్రిశిరుడనువాడు.

పుణ్యమూర్తియైన రఘురామా! సర్పకేతనుడును, విశాలమైన బలిసిన యెదగలవాడును, దేవతాసమూహమును సంహరించుటలో సమర్థుడును తాటి చెట్టు వంటి విల్లు త్రిప్పుచున్నవాడును, మిక్కిలి భయంకరముగా వింటినారిని మ్రోయించుచున్నవాడును, గొప్ప శౌర్యము గలవాడును అగునాతడే జనాకీనాథా! కుంభుడనువాడు. ఆతని తమ్ముడు అతిభయంకరమైన రూపము గలవాడును, రాక్షస సైన్యమునకు కేతనము వంటివాడును, యుద్ధరంగమున ఆటగా విహరించు ఘోరకర్ముడును, ప్రఖ్యాతిగన్న బలవంతుడును, రత్నములతోను బంగారముతోను చేయబడిన పొగలేని అగ్నిజ్వాలలవలె ప్రకాశించు పరిఘను హస్తమున బట్టినవాడును అగు నికుంభుడను పేర బరగువాడు. రామచంద్రా! విల్లు, ఖడ్గము, బాణములు మొదలైన సాధన సమూహములు గలదియు, మండుచున్న అగ్నివంటిదియు ఆకాశమున నెగురుచున్న పతాకము గలదియు, శ్రేష్ఠములైన గుఱ్ఱము గట్టబడినదియు అగు రథము మీద ఉగ్రరూపముతో నున్నవాడు, పర్వత శృంగములతో పోరువాడు అగు నరాంతకుడనువాడు. అనేక విధములైన రూపములతో ఏనుగులు పెద్దపులులు, గుఱ్ఱములు, లేళ్లు, ఒంటెలు మొదలగువాని ముఖములతో నున్న భూతములు తన్ను గొలిచి రాగా రుద్రుని విధముగా మెరయుచు, సన్నని కామ గలిగి సుందరమై, చంద్రునివంటిదైన శుభ్రమౌ తెల్ల గొడుగును, ప్రకాశమానమౌ కిరీటమును మెఱయగా, చెవులకు తళతళలాడు కుండలములు గలిగి హిమపర్వతమును, వింధ్యపర్వతమును పోలిన భయంకరమైన గొప్ప శరీరము గలవాడు ఇంద్ర, యమ దర్పములను హరించినవాడు, అపర సూర్యుని వలె వెలుగువాడు, స్వర్గవాసులకు ఆర్తి గలిగించు కీర్తి గలవాడు అయిన అతడే ఓ దయామయా! రాక్షస చక్రవర్తి అని చెప్పగా

## శ్రీరాముడు రావణుని జూచి ఆశ్చర్యపడుట:

శ్రీరామచంద్రుడామాటలను విని "ఔరా! ఏమి యీ తేజము? అరరే ఈ పటు పరాక్రమము! సూర్యుడు కిరణములచేత వలె ఈ రావణుడు చూడరానివాడై యుండెనే! దేవతలయందు గాని, దేవతా విరోధులగు రాక్షసుల యందుగాని, ఇట్టి తేజస్సుతో గూడిన రూపమును ఎందైనను వినియుంటిమా? ఈ వీరుని ప్రకాశము భూమియందు ఎవ్వరికిని లేదు. ఇతనిని స్థిరులై సేవించి వచ్చుచున్న రాక్షసవీరులు, అందఱును కొండల వంటి వారే. అందఱును కొండలతో డీకొనెడు వారే. అందఱును ఆయుధముల బట్టిన వారే. అందఱును అధికమైన తేజస్సు గలవారే. భీమ పరాక్రమము, అమితమైన తేజస్సుతో ప్రకాశించు

ఆకారము గలిగి, తీక్ష్ణమైన అనేక భూత సమూహములు గొలువగా నీతడు సూర్యపుత్రుడైన యముని వలె ప్రకాశించుచున్నాడు. ఈవిధముగా దైవ వశమున ఈ పాపాత్ముడు నాయొక్క దృష్టి మార్గమున బడెను. వీనిపై సీత నపహరించుట వలన నాలో గలిగిన రోషమునంతయు విడిచెదను గాక'' అని తలచి అంతట రామచంద్రుడు ధనుస్సును పట్టి అమ్ములపొది నుండి బాణమును దూసి ఎక్కుపెట్టి యుద్ధముచేయు తలంపుతో సోదరునితో గూడి నిలిచెను. రాక్షసరాజు తన అనుచరులతో ఇట్లు చెప్పెను. మీరందఱును తిరిగి పురమునకు వెళ్లుడు. మనస్సులందు భయము లేకుండగా ద్వారములందును, రాజమార్గమునందలి గృహముల ప్రక్కలను, గోపురములందును నిలిచి కాపుండుడు. అందఱమును ఇచ్చటికి వచ్చుటను తెలిసికొన్నచో వానరులు ఇదే సమయమని తలంచి సైన్య శూన్యమైన పట్టణమును ప్రవేశించి ధ్వంసముచేసి పాడుచేయగలవారు సుమండీ. పొండు అని పంపి అంతట పోటు వీరుడగు రావణుడు సముద్రములోనికి ప్రవేశించు తిమింగలము వలె వానరసైన్య సముద్రమును ప్రతాపముతో చీల్చుకొనుచు ప్రవేశించెను.

## రావణుడు సుగ్రీవాదులతో పోరుట:

గొప్ప అహంకారము గలవాడై భయంకరమైన సింహనాదముచే దిక్కులనెడు గోడలను పగల చేయువాడై గర్వముతో గూడిన ఆత్మాభిమానముతో ప్రకాశించుచున్న ధనుర్బాణముల గలవాడై వచ్చు రాక్షసులైన రావణాసురుని జూచి సూర్యపుత్రుడు (సుగ్రీవుడు) గొప్ప రోషము గలవాడై బాహాటోపముతో విజృంభించుచు పర్వత శిఖరమును రావణునిపై వేసెను. వానరరాజుచే విసరబడినదై చెట్లతో గూడిన చరియలు గలిగి పెద్ద శబ్దముతో భయంకరమైన కొండ తనమీదకు వచ్చుటను చూచి ధనుర్విద్యా ప్రవీణుడైన ఆ రాక్షసరాజు బంగారు పుంఖములతో సాటిలేని వేగముగల బాణజాలములతో దానిని నూరువ్రక్కలై నేలబడగొట్టెను. అట్లు కొట్టియు వానరరాజును సంహరింపదలంచి రోషముతో గూడిన మనస్సుగలవాడై ఇంద్రుని వజ్రాయుధమును బోలినదియు, నివారింపని వాయువేగము గలదియు, అగ్నివంటి కాంతి కలదియు అగు వాడి బాణమును గొప్ప విసురుతో ఆ వానరరాజు యొక్క హృదయమున నాటునట్లుగా వేసెను. కుమారస్వామిచే వేయబడిన శక్తి క్రౌంచపర్వతమును భేదించి పోయిన విధముగా దశముఖునిచే విడువబడిన క్రూరమైన బాణము అపుడు సూర్యపుత్రుని భేదించి వెడలెను. ఆ బాణ ఘాతముచే సూర్యపుత్రుడు బాధతో కూతపెట్టుచు నేలబడగానే గొప్ప

సంతోషముతో రాక్షస సైన్యములట్టహాసము చేసెను. వానరరాజు విధమును జూచి అతివేగముతో జ్యోతిర్ముఖుడును, గవయ గవాక్షులును, కోతులరాజైన ఋషభుడును, నభుడును, కొండలను దాల్చి, సందంష్ట్రుడు తమకు సహాయపడగా రావణాసురినిపై విసిరివేసిరి. ఇరువది చేతులుగల రావణుడు వివిధములైన బాణములచే వాటిని నేల బడవేసి కఅకు బాణములచే వారి శరీరములను జల్లెడలవలె తూట్లు పడగొట్టి నేల బడవేసెను. వారట్లు నేలబడగా తన నెదిరించువారు లేక రావణుడు శౌర్యముతో వానర సమూహముతో ఎదురులేని బాణవర్షములతో ముంచగా అతి భయముచేత కోతులు గొప్ప దుఃఖమునందినవారై బలములు చెడి పరుగెత్తి దీనులయందు వాత్సల్యము గలవాడును, లోకములకు శరణము కోరదగిన వాడును, అగు రాముని శరణువేడగా ఆ రాజశ్రేష్ఠుడు వారల భయమును మాన్పుచు.

## లక్ష్మణుడు రావణునితో పోరుటకు శ్రీరామాజ్ఞను గొనుట:

కరుణ గల వాడైన మహాత్ముడు పెద్దవిల్లును చేతబట్టి రావణుని మీదకు వెళ్లుచుండగా లక్ష్మణుడు చూచి చేతులు జోడించి పరమార్థమైన మాటలతో ఇట్లనెను. రామచంద్రా! దుర్మార్గుడైన రావణుని యుద్ధమున సంహరించుటకు దేవరవారే నేర్పరులు. అయినను దేవా! ప్రీతితో నాకనుజ్ఞనిమ్ము. ఈ నీచుని నేను వధించెదను అని పలుకగా సత్య నిష్ఠల పరాక్రమము గల రాముడిట్లనెను. పొమ్ము లక్ష్మణా! యుద్ధ మందేమరు పాటును జెందకుము. ఈ రాక్షసరాజు యుద్ధ విద్యలందసమానమైన నైపుణ్యము గలవాడు. అద్భుత వీర్యుడు. మూడు లోకములు పూనికతో ఎత్తి వచ్చినను క్రుద్ధుడగు అతని వ్రేలిని సైతము యుద్ధమున వంచజాలవు. వానియొక్క లోపములను చూడుము. నీ లోపములను గుర్తింపుము. వానినతనికి గనబడ నీయకుము. నీ కన్నులతో ధనువుతో నిన్ను హెచ్చరికతో రక్షించుకొనుచు యుద్ధమునకుపక్రమింపుము. అని చెప్పగా సుమిత్రాపుత్రుడు సీతానాధుని కౌగిలించి మంచి మనస్సుతో అతని పాదములకు మ్రొక్కి వానరవరులు పొగుడుచుండగా యుద్ధముపై కోరికతో వెడలెను. ఆరాజపుత్రుడట్లు వెడలి గొప్ప భయంకరమైన విల్లు దాల్చినవాడును, విషసర్పములను బోలిన బాణములచే వానరసేనా నివాసమును గప్పుచున్న వాడును, వాడిబాణములచే కొట్టబడిన శరీరములు గల వానరుల రవములచే దిక్కులను నింపినవాడును అయిన ఆ దశకంఠుని, ఎఱ్ఱబడిన కన్నులతో తేజరిల్లు ముఖపద్మము గలవాడును, ఏనుగు తొండములవంటి బాహువులు గల వాడును అగు లక్ష్మణుడు వచ్చుటను చూచి

## రావణ హనుమంతుల యుద్ధము:

వాయుపుత్రుడు వేగముగా పరుగెత్తి అడ్డము వెళ్ళి తోకతో శత్రు శరములను చెదరగొట్టి మహా కోపముతో రావణుని రథము మీదకు ఉరికి వేగముగా కుడిచేతి నెత్తి రాక్షసరాజు మనస్సులో విహ్వలత్వము చెందగా క్రూరమైన చూపులు చూచుచు ఇట్లనెను. ఓరీ రావణా! నాగులచేతను, యక్షుల చేతను, దేవతల చేతను రాక్షసుల చేతను, దానవుల చేతను, పక్షిజాతి చేతను చావకుందువు గాక! వానర సంఘముచే నీకు చావు తప్పునా? ఇదిగో! నా కుడిచేతిని చూడుము ఓరీ యిది ఐదు కొమ్మలు గలది. ఇన్నినాళ్ల నుండి కాపాడుకొనుచున్న నీ ప్రాణములను ఇప్పుడే శరీరము నుండి చెదరగొట్టుటకై ఎత్తితిని. స్థైర్యము గల వాడవై ఎదుర్కొనుము అనగా ఆ రావణుడు చాల క్రోధము గలవాడై ఎఱ్ఱని నేత్రములు గలవాడై ధైర్యముతో వాయుపుత్రునితో నిట్లనెను. వానరా! నీ బలమును చూచెదను గాక. వేగముగా అనుమానింపక నన్ను కొట్టుము కీర్తిని పొందుము. నేను తరువాత నీయొక్క ప్రతాపమును చూచి నిన్ను సంహరించెదను అనగా మునుపు యుద్ధములో నాచేత చంపబడిన అక్షుని మనస్సున తలచుకొని నా పరాక్రమము నూహించుకొనుము అని హనుమంతుడు పల్కగా శౌర్యదర్పములతో గూడిన రావణుడు ఆ వాయుపుత్రుని రొమ్మును తన గాఢమైన చేతి దెబ్బచే బాధించెను. హనుమంతుడాదెబ్బచే గలిగిన బాధతో మాటి మాటికి వణికి ఇటునటు తూగి నిమిషార్థముననే మఱల స్థైర్యమును పొందుచు తీవ్రమైన కోపముతో చంద్ర నిప్పులవంటి కన్నులతో, గాండ్రించుచున్న ముఖముతో వేగముగా గర్జించుచు ఆ రాక్షసుని చేతితో నొక గ్రుద్దు గ్రుద్దెను. రాక్షసరాజు ఆ దెబ్బతో గొప్పబాధను పొంది భూకంపముచే చలించెడు కొండవలె వచ్చుచు పోవుచున్న ప్రాణములతో కంపించెను. హనుమంతుని హస్త తాడనముచే బాధ చెందిన రాక్షసరాజును జూచి వానరులును, దేవతలును, మునీశ్వరులును మనస్సులు అధిక సంతోష సముద్రమున ఓలలాడగా హనుమంతుని గొనియాడిరి. రావణుడును కొంతసేపునకు తెప్పరిల్లి 'మేలు, మేలు! మాకు శత్రుడవే యైనను నిన్ను మెచ్చితిని. గొప్పవీరుడవే' అనగా హనుమంతు డిట్లనెను. ఇస్సీ రావణా నన్నేల మెచ్చెదవు. అది యేమి పోటురా. నీవు నా దెబ్బకు కాటికి బోక మిగిలియున్నావు నా భుజ పరాక్రమములు కాల్పనా? యుద్ధముల తారతమ్యము నెఱుగని మూఢుడా! ఈ మాటు నన్ను గ్రుద్దుము. పిదప నేను నా దృఢమైన పిడికిటి దెబ్బతో నిన్ను కూల్చెదను. అని హనుమంతుడు పల్క గ్రోధముతో కను లెఱ్ఱవాఱగా మండిపడుచు

రావణుడు తన శక్తినంతను కూడ దీసికొని కుడి పిడికిలితో బలముగా వాయుపుత్రుని గుండెలపై నొక దెబ్బవేసెను. అతడాదెబ్బకు దద్దరిల్లగా వెనువెంటనే నీలుని మీదకు వెళ్లి ఈర్ష్యతో నిలబడెను.

## రావణుడు నీలునితో యుద్ధము చేయుట:

భయంకర సర్పములతో సమానము లయినవియు, వాడియైనవియు, క్రూరములైనవియు, మర్మములను ఛేదించునవియు, భయంకరములైనవియు అగు రావణుని బాణములు అత్యుద్ధతముగా వచ్చి నీలుని ముంచివేయగాతడు చేతితో నొక కొండ శిఖరమునెత్తి అతనిపై విసరెను. ఇంతలో ఆంజనేయుడు తేరుకొని నీలునితో పోరుచున్న రావణుని జూచి అయ్యో తప్పించుకొనెనే! ఇతరునితో పోరుచున్నప్పుడు శత్రువు మీదకు వెళ్లుట యుద్ధనీతి కాదు గదా అని చింతించెను. ఆ విధముగా నీలుడు వేసిన కొండ శిఖరమును రావణాసురుడు తీవ్రమైన ఏడు బాణములతో ముక్కలు చేసి వేయగా అతడు ప్రళయకాలపుటగ్నివలె మండుచు మద్ది, చంద్ర, మామిడి చీకటి చెట్టు జువ్వి మొదలగు వృక్షములను పెకలించి మీదమీదకు విసరగా రాక్షసరాజు వానినన్నిటిని వేగముగా బాణపు గుంపులతో ముక్క చెక్కలు చేయుచు అంతటితో ఆగక ఆ వీరునిపై బాణవర్షము నెడతెగకుండ కురిపింపగా అతడు తన రూపమును చిన్నదిగా జేసి ఎగిరి రావణుని ధ్వజాగ్రముపై దుమికెను. రావణుడు ఓరీ! ఎక్కడికి పోయెదవురా అనుచు బాణములు వేయునంతలోనే నీలుడు గర్జించుచు వింటి కొప్పుమీదకు, రథమునొగలమీదకు జెండాపైకి, నొప్పి కలుగునట్లు కిరీటము మీదకు, గుఱ్ఱముల మీదకు వాని చేతులమీదకి, తలపైకి ఇక్కడనుండి అక్కడకు, అక్కడ నుండి ఇక్కడకు చెంగు చెంగున నెగురుచు కొంచెమైనను రావణుని గురికి దొరకకుండ ఔద్ధత్యమును జూపెను. అతని వేగమును లాఘవమును జూచి ఆశ్చర్యము నొందిన ఆ నరభోజనుడు వింటియందు ఆగ్నేయాస్త్రమును సంధించి వేయదలచెను కాని అతడెక్కున్నాడో తెలిసికొనలేక భ్రాంతితో నుండెను. రావణుని తికమకను చూచి వానరులు ఔద్ధత్యమును ఆనందమును పట్టజాలక పెద్దగా అరుచుచు అట్టహాసములను చేసిరి. నీలుని గంతులకు వానరుల రంతులకు రాక్షసరాజు మిక్కిలి కలతచెంది తూలిపోవుచు దిక్కుతోచని స్థితిలో నుండెను. కొలదిసేపటికి కలవరపాటు తొలగి నీలుడు తన రథము టెక్కెముపై ఉండుటను గుర్తించి ఓరీ వానరా! లాఘవమునందు అద్భుతశక్తియుందారితేరిన వాడవై పెక్కు విధముల గోచరించితివి. ఇదిగో ఆగ్నేయాస్త్రము విడుచుచున్నాను. తెలిసికొనుము. నీకు శక్తియున్నచో ప్రాణములను కాచుకొనుము.

నీవెంత ఎగిరినను ఇది నిన్ను ప్రాణములతో వదలదు. ఇది నిశ్చయము సుమా అనుచు అగ్నిపుత్రుడైన ఆ నీలునిపై దశకంఠుడు కోపముతో ఆ ఆగ్నేయాస్త్రాన్ని సోకగానే తపింపజేయబడుచూ స్మృతి గోల్పోయి నీలుడు మోకాళ్లపై ఊదుకొనుచు నేలగూలెను. తండ్రి మహిమ చేతను తన బలముచేతను తేజస్సు చేతను ప్రాణములు నిల్పుకొనగలిగినాడు.

## రావణ లక్ష్మణ సంవాదము:

ఇంద్రగర్వాపహారియయిన రావణుడు నీలుడు గూలుటను చూచి అహంకారముతో మేఘము గర్జించునట్లు రథమును నడిపించుచు విజృంభించి లక్ష్మణుని సమీపించి ధనుష్టంకారము చేయుచు, అడ్డువచ్చిన వారి నెల మోదుచుండగ చూచి లక్ష్మణుడు ఓరీ! దుష్ట రాక్షసుడా! బక్క క్రోతులను గర్వముతో జంపుట అంత ఆశ్చర్యకరమైన పనియా? శూరధర్మమా? కొంచెమైనను సంకోచింపక ఈ వానరేంద్రులను కలత నొందించినంత మాత్రమున పగ తీరినదా? రాక్షసేంద్రా ఇటురమ్ము నేను నీ గర్వము నణచివేసెదను. అని పలుకగా అతని మాటలను, తీవ్రమైన పరిపూర్ణమైన అతని వింటినారి మ్రోతలను విని కోపముతో రాక్షసనాధుడు సుమిత్రానందునితో నిట్లనెను. ఓ రాజపుత్రా! ఔరా! ఎంత యదృష్టము. విపరీతబుద్ధితో యముని సమీపమునకు వెళ్లదలచియా ఇటు వచ్చితివి. కొంచెము సేపు నా దృష్టిపథము నుండి తొలగక నిలువుము. నా బాణములు కొంచెమైన ఆలస్యము చేయక నిన్ను యమపురికి పంపగలవు అనగా దశరథనందనుడు విజృంభించి బొబ్బలు వెట్టుచున్న ఆయసురేంద్రుని ఒక పోకకు గూడ లెక్కచేయక ఇట్లు పలికెను. ఓరీ! పాపిష్ఠులలో అగ్రగణ్యుడా! ఈ విధముగా నీకు నీవే ప్రగల్భములు పల్కుటేల? గొప్ప ప్రభావము గల వారెవ్వరును ముందు ముందుగనే ఇట్లు కాఱులు ప్రేలరు. ఓ రాక్షసేంద్రా! నీ బల పరాక్రమములను ఎఱుగని వాడను గాను. నీ గొప్ప పరాక్రమము నెఱిగియే నీతో యుద్ధమును గోరి విల్లమ్ములు చేత దాల్చి వేగముగా వచ్చినాను. సాధనములు చేతిలో నుండగా నిట్టి వట్టి యరుపుల వలన నేమి ప్రయోజనము. యుద్ధము చేయుటకు రమ్ము అని పలుకగా

## రావణలక్ష్మణుల యుద్ధము:

క్రోధముతో నిండిన మనస్సు గలవాడై క్రూరములైన వాడి మొనలు గల ఏడు బాణములను లక్ష్మణునిపై వేయగా ఎదురులేని పరాక్రమము గల ఆ మానవనాథ పుత్రుడు ప్రకాశవంతమగు బంగారు మొనలు గలవియు తీక్ష్ణమైనవియు అగు బాణసమూహములచే

ఆ బాణములను ఇంతింత ముక్కలుగా చేసెను. అట్లు సౌమిత్రి వాడి బాణములచే తన బాణములు చిన్న ముక్కలయి తెగిన పాములవలె నేలపై దొర్లుటను చూచి దశముఖుడు ఎఱ్ఱని నేత్రములు గలవాడై తిరిగి ప్రకాశించు బాణ శ్రేష్ఠములను దండిగా కురిపించెను. ఆ బాణ వర్షమును దశరథ సుతుడు కర్ణిభల్లములు, క్షురములు, అను బాణములచే అర్ధ చంద్రబాణములచే అందందే త్రుంచివేసి కలతచెందక నిలిచియుండెను. తానెన్ని బాణములను వేసిన అన్నిటినీ త్రుంచుచున్న లక్ష్మణుని బలమును చూచి ఆ యనఘుని చేతి లాఘవమునకు శౌర్యలక్ష్మికిని అబ్బురపడి రావణుడు మరల ఘోరమైన శరములను గురియించెను.వానినన్నిటినిధైర్యుతోలక్ష్మణుడునేలగూల్చివీనిఔద్ధత్యమునణచివేగముగా యముని యమదండమును బోలిన వాడియైన క్రూరబాణములను సంరంభముతో వింట సంధించి అగ్నిజ్వాలలు గ్రక్కుచున్న ఆ బాణ సమూహమును రాక్షసనాధునిపై వేసెను. గర్వోద్రిక్తుడగు ఆ రావణుడు వానిని త్రుంచివేసి బ్రహ్మచే ఇవ్వబడినవియు, ప్రళయ కాలాగ్నితో సమానకాంతి గల బాణ సమూహముతో లక్ష్మణుని లలాటముపై గొట్టగా ఆ క్రూరాస్త్రముల తాకిడిచే కలిగిన గొప్ప బాధచే చలించిపోయి చేజారుచున్న ధనుస్సును బట్టుకొని మిక్కిలి నేర్పరి తనముతో శత్రువుచేతి ధనుస్సును ఖండించెను. వెనువెంటనే నిరంకుశమైన వేగముతో రాక్షసుని మూడు బాణములతో గుండెలు పగులునట్లు కొట్టెను. అతడు గగ్గోలు పడి తబ్బిబ్బైపోయెను. విరిగిన విల్లు గలవాడును, అధికముగా కారుచున్న రక్తముచే తడుపబడిన శరీరము గలవాడును మాంసపు ముద్దలు వ్యాపించిన దేహము గలవాడునై స్మృతి గోల్పోయి అంతలో తిరిగి స్మృతి తెచ్చుకున్నవాడై తెగింపుతో బ్రహ్మ యిచ్చినదియు, పొగలేని యగ్నివలె ప్రకాశించునదియు, వ్యర్థముకానిదియు, అత్యధికశక్తి గలదియు అయిన శక్తియను ఆయుధమును వానరసమూహము భయపడునట్లు జేయని విసరివేసెను. అది చూచి లక్ష్మణుడు మండుచున్న అగ్నితో సమానమైన బాణములతో దగ్గరకు రాకుండ గొట్టుచున్నను ఆగక అది భయంకరాకారముతో

## మూర్ఛిల్లిన లక్ష్మణుని రావణుడెత్తనెంచుట:

సంరంభముతో వచ్చి విశాలమైన ఎదపై నాటగనే మహా బలవంతుడగు నా రఘువీరుడప్రకాశించుచున్న దేహము గలవాడై భూమిపై సొమ్మసిల్లి పడెను. వెంటనే ఇరువది చేతులుగల రావణాసురుడు ఆ మహాపురుషుని నెత్తుకుని వెళ్లవలెనని తలచి చేతలతో నెత్తబోయెను. తన భుజశక్తిచే మేరువును మందరమును, హిమవత్పర్వతమును,

దేవతలతో గూడిన సమస్త లోకమును ఒకచేత ఎత్తగలిగిన ఆ దానవరాజు గొప్ప పూనికతో పంగటించి, పెదవులను బిగించి, బిగబట్టియు ఆ భరతుని తమ్ముని గదలింపలేకపోయెను. [శ్రీరాముని కంటె చిన్నవాడు భరతుడు. అతనికంటె చిన్నవాడు లక్ష్మణుడు. ఇరువది చేతులతో లక్ష్మణునే గదిలింపలేనివాడు శ్రీరాము నేమి జయింపగలడని భావము] బ్రహ్మ యిచ్చిన శక్త్యాయుధము హృదయమున నాటగా ఇట్టిదట్టిదని చెప్పరానిదియు, పండితులచే పొగడదగినదియు విష్ణువు యొక్క అంశమైనదియు అయిన తన స్వరూపమును లక్ష్మణుడు స్మరించెను. ఇట్లు వైష్ణవాంశ మానవదేహమున ప్రవేశింపగా దానవుల దర్పణ నణచు గొప్ప బలవంతుడయిన లక్ష్మణుని ఆ రాక్షసరాజు తన భుజదండములచే బిగబట్టియు రవంతయైన కదిలింపజాలక ప్రయత్నముతో పెనుగులాడుచుండగా అంతలో

## హనుమంతుడు రావణుని రామునొద్దకు లక్ష్మణునెత్తికొని పోవుట:

హనుమంతుడు పరుగున వచ్చి వజ్రసమానమైన తన పిడికిటిచే గొప్పశక్తితో రావణుని రొమ్మున గ్రుద్దగానే, ముఖమునందు, కన్నులయందు, చెవులయందు నెత్తురులు గారగా దిక్కుతోచక నిశ్చేష్టుడై సోలిపోయి తాను రథములో కూలబడి కూడ రావణుడు పూర్వపుస్థితిని పొందలేడయ్యెను. గొప్ప శౌర్యము ప్రతాపము కలిగినను సగము చచ్చిన రావణుని జూచి వానరసంఘములు ఋషులు ఇంద్రాది దేవతా సమూహములు సంతోషముతో పొంగిపోయి కేకలను వేసిరి. అంత రావణుని బాణపు దెబ్బతిన్న సుమిత్రాపుత్రుని గొప్ప తేజస్సుగల వాయుపుత్రుడు స్నేహముతో చేతులలో నెత్తుకొని వెళ్లి రామచంద్రుని సమీపమున నుంచెను. వాయుపుత్రుడు మిత్రుడు గొప్పశక్తి కలిగినవాడు నగుటచేత శత్రువునకు కదలింపరానివాడయ్యును లక్ష్మణుడు వానరునకు తేలికయయ్యెను. [వాస్తవపు మూర్ఛితుడు ఒకరికి తేలికగాను, మరియొకరికి భారముగాను కాజాలడు. బ్రహ్మశక్తిని అగౌరవింపరాదు కావున దానిని సమ్మానించుటకు నాగపాశబంధమునందు వలె ఈ మూర్ఛ మాయామానుష నటన మాత్రమే.] అంత ధీరశ్రేష్ఠుడు జయింపరాని వాడు అయిన లక్ష్మణుని వీడి బ్రహ్మదేవుని శక్తి రావణాసురుని రథము వద్దకు వేగముగా వెళ్లెను. ఆవిధముగా ఆయుధము తొలగిపోగా లక్ష్మణుడు తేరుకొని బడలిక తొలగిన వాడయ్యెను. మనస్సులో అతడు ఊహింపనలవికాని తన అంశమైన విష్ణువును స్మరించుచుండెను. అంతలో రావణాసురుడు తెప్పరిల్లి బాణములను వింటిని ధరించి యుద్ధమునకు సిద్ధమయ్యెను.

## శ్రీరాముడు హనుమంతునిపై నెక్కి రావణుని మీదికి బోవుట:

ఎందరో వీరులను గోల్పోయి పారిపోవుచున్న శత్రుసైన్యమును జూచి రాముడు క్రోధముతో ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై తొందరతో రావణుని మీదకు వెళ్లుచుండగా హనుమంతుడు దగ్గరకు వచ్చి రామచంద్రా బలవంతుడైన గరుత్మంతుని విష్ణువువలె నీవు నాపై నెక్కి దేవతావిరోధిని శాసించుట తగును అని చెప్పెను. అంత ఆ వానరసింహుని భుజములపై నెక్కి అమితమైన పరాక్రమము గల రాముడు రథముమీద నున్న రావణుని తేరి చూచి రోషముతో బలిచక్రవర్తి మీదకు ఆయుధము నెత్తి వెళ్లుచున్న విష్ణువులె మెరయుచు వజ్ర నిర్ఘోషము వలె వింటి నారి శబ్దించుచుండ సముద్రఘోషవంటి గంభీర స్వరముతో ఇట్లు పలికెను. నిలువుము నిలువుము. నాకు ఈవిధమైన అపరాధమును చేసి ఓ రాక్షసరాజా! నీవు ఎక్కడకు వెళ్లినను విడుతునని తలంచుచున్నావా? వీరుడనని భావించువాడా! వినుమురా. ఇంద్రుని, యముని, సూర్యుని, బ్రహ్మను, శంకరుని చేరినను, పదిదిక్కులకు పారినను నిన్ను విడిచిపెట్టను. నీ శరీరమునకును ప్రాణములకును సంబంధము లేకుండ చేసెదను. గొప్ప శక్త్యాయుధముచే ఎవనిని గొట్టితినని పొంగి పోవుచున్నావో ఆ అతి బలవంతుడయిన లక్ష్మణుడే నీకు ఉపద్రవమును గల్గింపదలచి, నిన్ను భార్యాపుత్రులతో గూడ యముని కప్పగింపదలంచి యుద్ధభూమిలో నిన్నెదుర్కొనుటకు వచ్చెనని తలంపుము. ఈ నేనే కదా జనస్థానమున గర్వముతో విజృంభించినదియు నానావిధములగు ఆయుధములు గలదియు అగు పదునాల్గు వేల రాక్షస సమూహమును యుద్ధములో సంహరించినవాడను.

## శ్రీరామ రావణుల ప్రథమ యుద్ధము:

అని రామచంద్రుడు పలుకగా కోపమతిశయింపగా రావణుడు శ్రీరఘురాముని వాహనమగు హనుమంతుని ప్రళయకాలాగ్ని వంటి బాణములతో కొట్టి నొప్పింపగా మహానుభావుడైన వాయుపుత్రుని తేజమంతకంతకు ఎక్కువయ్యెను. అట్లు దశకంఠుని బాణములచేత కొట్టబడి గాయపడిన హనుంతుని జూచి క్రోధమునకు వశుడై రామభద్రుడు ఆకర్ణాంతముగా వింటినారిని లాగి వేగము ఔద్ధత్యము ప్రకాశింపగా ఆ దేవతావిరోధి రథమును ఒక్కమాటే చక్రములు, గుఱ్ఱములు టెక్కెము, ఛత్రము సూతుడు ఖడ్గములు శూలములు పతాకములు మొదలగువాటితో గూడ రూపము తెలియబడనట్లు నుగ్గై నేల వ్రాలునట్లు బాణముల సమూహముతో గూల్చి, అంతటితో వదలక క్రూరమైన

వజ్రసన్నిభమైన బాణమును అతని బలసిన ఱొమ్ముపై ఇంద్రుడు వజ్రాయుధమును మేరు పర్వతమును చీల్చుటకు వేసినట్లు భయంకరముగా నాట నేయగా అతడు చేష్టలు లేనివాడై విలవిలలాడెను. ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బలకైనను ఏ మహాయోధుడు కొంచెమైనను చలింపడో కలతచెందడో అట్టివాడు రాముని బాణపు దెబ్బలబాధకు మిక్కిలి భయపడి వణికిపోవుచు వింటిని నేలపై విడిచెను. [విల్లు విడువకున్న శ్రీరాముడు చంపుననన్న భీతి] ఆకులపాటు చెంది నిరాయుధుడై నిలిచియున్న ఆ దేవతావిరోధియొక్క సూర్యునికాంతితో మహాత్ముడగు రాముడు నేలబడవేసెను. శ్రేష్ఠమైన యుద్ధధర్మమునెఱిగిన శ్రీరాముడు గొప్ప దయారసముతో కోఱలు తీసిన పామువలెను, వేడిమి తగ్గిన సూర్యునివలెను కిరీటము నేలబడగా ఆకృతి మారిపోయి శోభారహితుడైయున్న రాక్షసరాజుతో నిట్లనెను. ఇతరులచే సాధింపరానిది శత్రువులకు భయంకరమైనది అయిన యుద్ధమును ఇంతవఱకు చేసితివి. మా పక్షము వీరులను సంహరించితివి. కనుక నీవు యుద్ధమునందు చాల డస్సియున్నావని నా మనస్సున తలంచి ఓ రాక్షసరాజా! నిన్ను నేను చంప నిష్టపడను. రాముడు యుద్ధమున నిరాయుధుని భయముచే నిశ్చేష్టుడయినవానిని చంపడు సుమా. నీ లంకకు పొమ్ము. అనుజ్ఞ నిచ్చితిని. పో. పో. బడలిక తీరిన తరువాత రథముతో ధనుస్సుతో ప్రకాశించు గొప్ప ఆయుధ సమూహముతో మరల రమ్ము. రథస్థుడవై వచ్చి అప్పుడు నా శౌర్యమును చూచెదవుగాక రాక్షసేంద్రా! అని పలుకగా దర్పము సంతోషము నశించినవాడై

## రావణుడు పరాజితుడై లంకకు బోవుట:

ఆ రావణుడు విల్లు విరిగిపోగా సారథి రూపము లేకుండ పోగా గుఱ్ఱములు చావగా క్రూరమైన బాణపు దెబ్బలచే బాధనొందు శరీరముతో కిరీటములేని వెంద్రుకలు విరియబోసిన శిరస్సుతో అవమానముతో తన పురమున కేగెను. దేవతలకు దానవులకు భయంకరుడైన రావణుడీ విధముగా తలవంచుకొని యుద్ధరంగమును విడిచి పురము ప్రవేశింపగా తన తమ్మునితో గూడి రఘురామచంద్రుడు వానరవీరుల శరీరములందు నాటిన బాణములను తీయించి వారి బాధను తొలగించెను. అప్పుడు ఇంద్రవిరోధి నిర్వీర్యుడు కాగా దేవతలు రాక్షసులు, భూత గణములు, సముద్రములు, భూమి, చరాచరములు, ఋషులు సర్పములు దిక్సమూహము అంతయు మిక్కిలి ఆనందించెను.

★★★

# అరువదవ సర్గము

## రావణుడు తన పరాభవమును తలచి దుఃఖించుట:

రావణుడావిధముగా తన పురమునకు వెళ్లి రాముని బాణములను తలచి తలచి కలతజెంది గర్వమును విడిచినవాడై బాధ నొందు అవయవములు గలవాడై గరుడునిచే పట్టి విడువబడిన సర్పమువలెను, సింహము నోట బడి విడువబడిన ఏనుగువలెను, రాముని బారిన పడి యముని బారి నుండి తప్పించుకొన్నవానివలె, ఇంకను రామ బాణములు వచ్చి తన్ను తాకుచున్నట్లు తలంచుచు భయము చెంది పెద్ద పెద్ద ఊర్పులను విడుచుచు దివ్యమైన వివిధ వర్ణములుగల బంగారు సింహాసనమున గూర్చుండి తోడనున్న రాక్షసవీరులతో బాధతో తన మనోగతమునీ విధముగా వచించెను. అక్కటా నా యొక్క గొప్ప అద్భుతమైన తపస్సు వ్యర్థమైపోయెనే! ఆహా భయంకర యుద్ధరంగమున వజ్రధరుడైన యింద్రుని గెల్చిన నేను నేడొక మానవుని గెలువలేక చెడితినే! కాలమెంతమారినది. మనుజులను దినువానిని దర్పముగా మానవుడు గెల్చెనే. యుద్ధమునందు నీకు మనుష్యునిచేత భయము తప్పదని ఆనాడు బ్రహ్మ చెప్పెను. ఘోరమైన ఆ మాట అమోఘమై ఈనాటి కిట్లు ఫలించినది కదా. దానవులు, యక్షులు, రాక్షసులు, సర్పములు, వియచ్చరులైన దేవతా సంఘములచే యుద్ధమునందు చావకుండ పద్మసంభవుడగు బ్రహ్మదేవునిచే వరములను పొందితిని గాని పూర్వము మానవులను దురహంకారముచే లెక్కింపనైతిని. ఇప్పుడది నా ప్రాణముల మీదికి తెచ్చినది చూచితిరా! ఇక్ష్వాకు కులమున బుట్టిన అనరుణ్యుడను రాజు అయోధ్యలో పూర్వము నాచేత యుద్ధమున నేలగూలుచు నన్నుచూచి యిట్లనెను. రాక్షసాధమా! నిన్ను యుద్ధమునందు పుత్రులతో, సైన్యముతో, మంత్రులతో గుఱ్ఱములు సారథులు గల రథములతో గూడ చంపగల శూరుడు నా వంశము నందు పుట్టును సుమా కులపాంసనా! అదరి పడకుమురా దుర్మతీ యనెను. ఆ రాజు మాట నేటికి యదార్థమై సూటిగా ఫలించినది. అందువలన దశరథపుత్రుడైన ఈ రాముని ఆ మనుష్యునిగా మనమునందు భావింతును. నాచే పరాభవము నొంది, నా చేతులకు కోపమమునంది వేదవతియను కన్యక నన్ను 'ఓరీ రాక్షసా నిన్ను నీకులమును నాశనము చేసెదను చూడుమని శపించినది. ఆ వేదవతియే

విదేహరాజైన జనకునకు సీతయను పేరుతో నిట్లు జన్మించినది. పర్వతరాజపుత్రికయు, రంభయు, వరుణుని పుత్రికయు, నందియు పూర్వము పలికినట్లుగనే జరుగసాగినది. రాక్షసశ్రేష్ఠులారా! ఋషుల వాక్కులు అబద్ధమగునా? నాపై నున్న శాపముల ప్రయత్నములు చేయుడు. మూల బలములందును, గోపురముల శిఖరములందు రక్షణగా నిలిచియుండుడు. గొప్ప శౌర్యవంతుడును దేవతల దైత్యుల దర్పముల నణచిన వాడును, బ్రహ్మ శాపముచే నిద్రించిందియున్నవాడును అగు కుంభకర్ణుని నిద్రలేపుడు.

## రావణుడు మంత్రులను కుంభకర్ణుని నిద్రలేప పంపుట:

ఉగ్రమైన యుద్ధములందు నిపుణుడయిన ప్రహస్తుడు మరణించెను. నేను యుద్ధమున నోడింపబడి తిరిగి వచ్చితిని. ఇక విరోధులను అడ్డుకొని ఓడింపగలవారెవ్వరు? ఆ తిరుగులేని యోధుడు, రాక్షసశ్రేష్ఠుడునైన కుంభకర్ణుడొక్కడే హెచ్చిన శక్తితో శత్రువును చంపగలడని నిశ్చయించుకొని యిట్లనెను. ద్వారములన్నింటిని ప్రయత్నముతో గాచుచుండుడు. ప్రాకారముల మీద నుండి విరోధులను కనుపెట్టుచుండుడు. ఈ విధముగా కాలవశుడనయి నేనుండగా ఆ రాక్షసశ్రేష్ఠుడు హాయిగా ఆదమరచి ఏ చింతయులేక నిద్రించుచున్నాడు. ఏడు, తొమ్మిది, ఆఱు, ఎనిమిది మాసములు నిశ్చింతగా నిద్రించును. ఇంతకు తొమ్మిది రోజుల ముందే నాతో మంత్రాలోచనము చేసి నిద్రపోవనారంభించినాడు. ఆ గొప్ప బలవంతుని ఇప్పుడు మేల్కొలుపుట సులభము. రాక్షసశ్రేష్ఠుడగు కుంభకర్ణుడు మేల్కొనెనేని నిజముగా రాజపుత్రులచే వానరసైన్యమునంతను సంహరించివేయును. రాక్షసులలో శత్రుసమూహముల నెల్ల నాశనము చేయును. అట్టి సాటిలేని బలము గలవాడగు కుంభకర్ణుడు తుచ్ఛ సుఖములందలి ప్రీతితో మూఢుడై ఎప్పుడును సోమరియైయుండును. ఎప్పుడైనా దుఃఖమును తెలిసికొనలేడు. అతడు నిద్రనుండి లేచినచో సీతానాధునిచే నాకు కలిగిన గొప్ప పరాభవము నంతయును వేగముగా తీర్చగలడు. తరువాత నేను సంతోషముగా నుండెదను. ఇంద్రునితో సమానమైన బలవంతుడు, గొప్ప సాహసము గలవాడు అయిన యితడు నాకు యుద్ధమునందిట్టి ఆపద సంభవించిన సమయమున తోడు పడజాలడేని యింక నాకు వాడుండియు ఏమి ఫలము? అందువలన వానిలేపుడు అని రావణుడు చెప్పగా మిక్కిలి సంభ్రమముతో రాక్షసులు గంధములు, పుష్పమాలికలు, భక్ష్యపురాసులు పట్టుకొని పెద్దపెద్ద ద్వారములు గలదియు, యెటుచూచినను యోజనము పొడవు గలదియు అయిన కుంభకర్ణుడుండు

గుహను అనేక విధముల సుగంధములు వెడలుచు దానిని ప్రవేశించబోగా అతని పెద్ద నిట్టూర్పుల గాలిచే ఆ బలశాలురైన రాక్షసులు ఎండుటాకుల వలె ఎగిరిపోవుచుండిరి. వారు ఎంతో కష్టముతో పాదము నిలదొక్కుకొనుచు లోన ప్రవేశించి బంగారు అరుగులచే సుందరమైన గుహయందు నిద్రించుచున్న కుంభకర్ణుని, భయంకరమైన రూపముగల వానిని విరిగి యెరిగిన పర్వ తమువలె ప్రక్కపై బడిన వానిని, సర్పమువలె పెద్దగా బుసలు కొట్టుచున్న వానిని, కఠినమై నిక్కబొడుచుకొన్న వెంట్రుకలు గలవానిని, భయంకరమైన ముక్కుపుటములు గలవానిని, పాతాళము వంటి నోరు గలవానిని, బంగారు బాహుపరులు గల దేహము గలవానిని, బలవంతుని, కిరీటముచే అలంకరింపబడిన శిరస్సు గలవానిని, మాంసము రక్తముల వాసనలు హెచ్చుగ వచ్చువానిని, శత్రుసంహారకుని జూచి సమీపించి మేరు పర్వత సమానమైన మాంసముతో గూడిన భోజన పదార్థములు, దున్నపోతులు, లేళ్లు, పందులు మొదలగు వాటి సమూహములు అద్భుతముగా చేయబడిన అన్నపానాలు సిద్ధము చేసిరి.

## రాక్షసులు కుంభకర్ణుని నిద్ర లేపుట:

రాక్షసులు కుంభకర్ణుని శరీరమునందు శ్రేష్ఠమైన గంధములను పూసిరి. అందమైన పుష్పమాలికలను, సుంగంధ వస్తువులను శరీరమున నుంచిరి. ధూపములను వేసిరి. స్తోత్రముతో పొగిడిరి. చంద్రునివలె తెల్లనైన అనేక శంఖముల నూది రాక్షసులు గుంపులై దిక్కులు చెక్కలగునట్లు గొప్ప ధ్వనులతో శబ్దించిరి. వారందఱు ఒక్క గొంతుతో గొంతులు వ్రక్కలగునట్లు అరిచిరి. నిరాటంకముగా చేతుల నప్పళించిరి. పెనుకేకలతో గూడిన ఆ శబ్దములు లంకను కలత జెందించెను. పణవములు భేరులు శంఖములు మొదలయిన వాద్యముల గొప్పధ్వనులు ఉరుములవలె సింహనాదములు అధికముకాగా ఆ ధ్వనిలో మునిగి పక్షులు దిక్కులందు పరువెత్తి పరువెత్తి ఆకసమున కెగబ్రాకి దిగ్భ్రాంతి నొంది ఱెక్కలు తడబడగా సుడివడి భయముతో నేలపై బడెను. ఆ రాక్షసులును విసిగి వేసారి కష్టపడి ఓపికలు దప్పిరి గాని ఆ రాక్షసేంద్రుడు ఇంచుకంతయైన మేలుకొనలేదు. అప్పుడు వారు మరల జాలిలేక ముద్గరములు, గదలు కొండలు చెట్లు ముసలములు మొదలగు సాధనములతో చేతికొలది శక్తితో మోదిరి. గొప్ప బలవంతులైన వారయ్యును ఆ రాక్షసులు రావణుని సోదరుని ముక్కుల నుండి వచ్చుచున్న గాలి వేగమునకు నిలువలేకపోయిరి. గొప్పగాలులచే నెగురగొట్టబడిన మేఘములవలె నెగిరిపోయిరి. భీమబలము గలిగిన ఒక పదివేలమంది రాక్షసులు అందఱును కలిసికట్టుగా చేరి ఒక్కమారుగా తూర్యములు

మృదంగములు ఘటములు మొదలగు వాద్యముల ధ్వనులను అధికంగా చేసిరి కాని ఆ దానవవీరుడు ఒక్కింతయైన తన శరీరమునందు తెలివి నొందకపోవుట భయంకరమైన ప్రయత్నమును చేయదలంచిరి. దండములతో, కశలతో, అంకుశములతో హెచ్చుగా గొట్టుచు ఒంటెలు, గుఱ్ఱములు, ఏనుగులు, గాడిదలు మొదలగు జంతువులచేత ఆ రాక్షసవీరుని త్రొక్కించిరి. ఆ జంతువులచే గట్టి అరపించుచు, తామును శంఖములు భేరులను మెండుగా మ్రోగించిరి. మరియు ఆ రాక్షసులు దయగాని మొగమాటము గాని లేనివారై సుత్తెలు దూలములు పెద్దకత్తులు గునపములు, గుదియలు, గండ్రగొడ్డళ్లు మొదలైన ఆయుధములతో తమ శక్తికొలది లంకలోని రాక్షసుల చెవుల గింగరు మనుచుండగా ఆ నాదము పర్వతములు అడవులు నిండునట్లు పూర్ణముగా వ్యాపించెను. అంతకును రాక్షుడు లేవకుండుటచే అతనికి దగ్గరగా వెయ్యి భేరుల నొక్కమారుగా రాక్షస సంఘములు బంగారు బెత్తములతో ఎంతయో మ్రోగించినను అతడికించుకంత యయిన కదలడయ్యెను. శాపవశమున పరవశత్వమునొంది పడియున్న ఆ రాక్షసశ్రేష్ఠుని కోప పరవశులైన రాక్షసులు మఱియొకరీతి పరాక్రమము చేయగోరి క్రొత్త భేరుల సమూహమును మ్రోగించుచు జుట్టును పీకుచు నెత్తురులు కారునట్లు మొరటగా చెవులను కొరుకుచు చేతి గోళ్లను పీకుచు నీటి కుండలను దెచ్చి చెవులలో బోయుచు తలను ఱొమ్మును ముద్గరములతో మోదుచు బాధించుచున్నను, కదలకుండుటచే త్రాళ్ళతో గట్టబడిన శతఘ్నులతో మదముతో అందఱు ఒక్కమారుగా వానిని గొట్టుచు, మరియు మదించిన ఏనుగుల నొక వేయింటి నొక్క మారుగ శరీరము మీదికి తోలగా అతడు ఏదో తనకు సోకినట్లనిపించగా అంతలో ఇంచుక కన్నులను విప్పెను.

**కుంభకర్ణుడు నిద్రలేచుట:**

ఆ కుంభకర్ణుడు కొండల చెట్ల సమూహములు తనపై బడుట గానీ, క్రూరమైన శస్త్ర సమూహముల దెబ్బలుగానీ ఏమియు తెలియదయ్యెను. నిద్రలేవగానే మండుచున్న ఆకలిచే భయముచెంది దానవవీరుడు శరీరమును విదిలించుచు వేగముగా లేచి పెను సర్పములవలెను పర్వతముల వలెను ఉన్న రెండు చేతులను జాడించి నీల్గి మఱల బడబాగ్ని వంటి నోరు తెరవగా చూచుటకు పాతాళమునకు సాటివచ్చు అది మేరుపర్వతముపై నున్న సూర్యునివలె నుండెను. ఆవులించి లేచుచున్న ఆ కుంభకర్ణుని రూపము కొంగల చాలుతో గూడి వర్షించు మేఘమువలె నుండెను. అట్లు లేచి అతడు అగ్నితో మెరపులతో సదృశమైన అతని రెండు కన్నులు జ్వలించుచున్న మహా గ్రహముల వలె నుండెను.

అంత నతడు అధికమగుచున్న ఆకలితో అక్కడనున్న భక్ష్యములను వివిధములైన మాంసములను, దున్నలను, పందులను ఇష్టము వచ్చిన విధముగా తిని రక్తమునెంతయో త్రాగి మద్యములు మొదలగు పానీయములను హెచ్చుగా త్రాగి తృప్తితో ఆ యింద్ర విరోధి యొప్పుచుండగా అచ్చట గొప్పభయముతో దాగియుండిన రాక్షసులు వచ్చి మ్రొక్కుచు తనచుట్టు నిలువగా చూచి నిద్రావసమున అప్రసన్నములై మలినములైయున్న నేత్రములు గల కుంభకర్ణుడు అకాలమున నిద్రలేపినందులకు అచ్చెరువందుచు వారినందఱిని జూచి మీరందఱిట్లు నన్నేల మేలుకొలిపితిరి? రాక్షసరాజునకు క్షేమమే కదా? భయపడవలసిన కారణమేమియును గలుగలేదు కదా. ఆలోచింపగా నాకు సందేహము కలుగుచున్నది. ప్రయత్నపూర్వకముగా నన్ను నిద్రలేపు కారణముచే నిజముగా విరోధులచే గొప్ప ఆపద సంభవించియుండును. ఆలస్యమెందులకు? నన్ను మేలుకొలిపిన కారణము నిప్పుడే చెప్పుడు. స్వర్గము నుండి పడునట్లుగా ఇంద్రునినైనను వెళ్లగొట్టెదను. అగ్నినైనను నుగ్గునూచముగా గొట్టెదను. నిద్రించు నన్ను కొలది మాత్రమునకు ఇట్లు లేపుటకు రాక్షసరాజంగీకరింపడు. ఏమి మూడెనో చెప్పుడు

## యూపాక్షుడు కుంభకర్ణునితో నిద్రలేపిన కారణము చెప్పుట:

ఈవిధముగా కుంభకర్ణుడు కోపావేశముతో ప్రశ్నింపగా యూపాక్షుడను మంత్రి ఆ మహాబలవంతుని దగ్గరకు వెళ్లి చేతులు జోడించినవాడై యిట్లు పలికెను. దేవతల వలన భయము మన రాక్షసుల కెప్పుడును కలుగదు. ఓ దేవా! యిప్పుడు తీర్పరాని భయము మానవుల సమూహములచేత సంభవించినది. ఇదివరకెప్పుడును దైత్యులచేతను, దానవులచేతను, దేవతల సంఘముల చేతను పొందనంతటి ఆపద మానవులచేత కల్గెను సుమా. పర్వత సమాన దేహులైన వానరులు లంకను చుట్టుముట్టి యున్నారయ్యా! భూమిసుతను పోగొట్టుకొని వానరుడు వచ్చి నివారింపరాని బలౌద్ధత్యముతో లంకకంతటికిని నిప్పు పెట్టెను. సైన్యముతో ఏనుగులతో గూడిన అక్షుని సంహరించెను. ఇప్పుడు హెచ్చైన బలముతో సూర్య సమాన తేజుడగు రాముడు యుద్ధరంగమునుండి చచ్చితివి రాయనుచు రాక్షసనాధుడగు రావణుని పారద్రోలినాడు. దైత్యులుగాని దానవులు గాని దేవతలు గాని కలిగింపజాలని అవమానమును సీతానాధుడు కలుగజేసి రావణుని ప్రాణములు యుద్ధమున తన అన్నగారికి కలిగిన అవస్థను విని కోపముతో తిరుగుడు వడుచున్న కనులు గలవాడై సాటిలేని బలము గల రావణానుజుడగు కుంభకర్ణుడతనితో నిట్లనెను.

## మహోదరుడు కుంభకర్ణునితో రావణుని జూడ వెళ్లుమనుట:

యూపాక్షా! నేనీక్షణమందే వెళ్లి రాఘవులతో గూడ వానర సైన్యమునెల్లను సంహరించి పిదప రాక్షసాధిపతిని జూచెదను. రాక్షస కోట్లకు వానరసమూహముల మేని గాయములనుండి స్రవించు రక్తమాంసములతో తృప్తి గావించెదను. నేను స్వయముగా శౌర్యముతో రాఘవుల మేని రక్తమును తృప్తిగా త్రావెదను. ఇట్లు రోషముతో అధికమైన దోషము గల అతని గర్వోక్తులను విని మహోదరుడు పేరుగల రాక్షస సేనానాయకుడు తగిన విధము తెలియజేయుచు నిట్లనెను. ఓ రాక్షసనాధా! నీవు ముందుగా రావణుడు చెప్పు మాటలను విని తరువాత గుణదోషముల నాలోచించి ఆపైన జయము కలుగువిధముగా యుద్ధముచేయుట తగిన పనిగదా అనగా కుంభకర్ణుడు కానిండనుచు లేచెను. అతడట్లు లేచుటను జూచి రాక్షస సంఘములు వేగముగా రాక్షసరాజును చేరబోయి చేతులు జోడించి ఓ రాక్షసేంద్రా! నీ సోదరుడు మేల్కొన్నాడు నీవే వెళ్లి సమ్మానింతువా? అతడే ఇచ్చటకు వచ్చిన ప్రేమతో గౌరవించెదవా? అని అడుగగా రావణుడు అతడే ఇక్కడకు వచ్చుగాక వచ్చిన అతనికి తగువిధముగా సపర్యలతో సంప్రీతుని జేయుట తగును అని చెప్పగా వారలు వేగముగా కుంభకర్ణుని యొద్దకు వెళ్లి మీ సోదరుడు రాక్షసరాజు మిమ్ము చూచు కోరికతో ఉన్నాడు వెళ్లగోరెదవా? అని చెప్పగా మనస్సు సంతోషమందగా అట్లే యని శత్రువులను శిక్షించిన వాడగు కుంభకర్ణుడు పాన్పునుండి వెడలి వచ్చి ముఖము గడిగికొని స్నానముచేసి నగలను బెట్టుకొని దాహము తీరునట్లు బలవర్ధకమైన పానీయమును కడుపార త్రావెను. రావణుని ఆజ్ఞచే వేగముగా కల్లుకుండలు అమితములైన బహువిధములైన ఆహారములను రాక్షులందీయగా వేలు కుండలను ద్రావి కుంభకర్ణుడు మహాతేజము బలము కలవాడై మదించి ప్రళయకాల యమునితో సమానమైన విభవముతో అన్నను చూచుటకా బలవంతుడు వెళ్లుచుండగా అతని పాదముల తాకిడిచే భూమి వడకెను. ఆ పట్టణమునందలి రాజమార్గములతని యాభరణకాంతులచే వెలుగొందెను. మార్గముల కిరుప్రక్కల నున్న రాక్షసులు దోసిళులొగ్గి నిలిచియుండిరి. బ్రహ్మ పట్టణమునకు వెళ్లుచున్న ఇంద్రుని వలె పోవువాడును, తేజముతో సూర్యునంటుచున్న అపరిమేయమైన పొడవు లావుగల శరీరముగలిగి గొప్ప పర్వత శృంగమువంటివాడగు రాక్షసశ్రేష్ఠుడైన ఆ కుంభకర్ణుని పట్టణము బయట ముట్టడించి యున్న వానరులు ఆశ్చర్యముతో భయముచెంది పరువెత్తి పాదములు తడబడగా నిలబడిపోయిరి. కొందఱు రాముని సమీపించి శరణు జొచ్చిరి. భయపడిన వానరులు కొందఱు గర్వము నశించి నేలబడిరి.

★★★

# అరువదియొకటవ సర్గము

## రావణుని జూడబోవు కుంభకర్ణుని జూచి శ్రీరాముడు విభీషణుని బ్రశ్నించుట:

పర్వతాకారుడును, భయంకరమైన శరీరము గలవాడును, పూర్వము విశ్వరూపము నెత్తిన నారాయణుని విధముగా ఆకాశమునంటుచున్నదేహము గలవాడును నీటితో గూడిన మేఘమును బోలినవాడును బంగారు కేయూరములు మొదలగు మనోహరాభరణములు ధరించినవాడు నగు అతనిని జూచి వానర సంఘములు భయపడి పారిపోవుచుండగా రఘురాముడు గొప్ప ధనుస్సు పట్టుకొని ఆశ్చర్యముతో రావణుని సోదరుడైన విభీషణునితో ఇట్లనెను. విభీషణా! ఎవడయ్యా ఆ పర్వతసమానుడు. మెరుపులతో గూడిన మేఘముతో సాటివచ్చువాడు, పచ్చని కన్నులు గలవాడు గొప్ప శరీరముతో కోట ప్రాకారము మీద నుండియే కనబడుచున్న వాడై లంకలో వెళ్లుచున్నవాడు. అతడు రాక్షసుడో లేక దేవతయో చెప్పుము. అతని జూచి మన వానరులందరు భయముతో పారిపోవుచున్నారు. ఇంతకుపూర్వము ఇటువంటి మహాద్భుతమైన భూతము భూమిమీద తిరుగగా చూడలేదు అనగా సజ్జనశ్రేష్ఠుడైన విభీషణుడు విశేషమైన భక్తితో నెమ్మదిగా దశరథులలో శ్రేష్ఠుడైన రామునితో ఇట్లనెను.

## విభీషణుడు శ్రీరామునకు కుంభకర్ణుని గురించి చెప్పుట:

రామచంద్రా! అతడు యుద్ధమున నెదుర్కొని గొప్పవాడగు ఇంద్రుని బట్టుకొని ఓడించిన మహా శౌర్యవంతుడు. విశ్రవసుడను మునియొక్క ప్రఖ్యాతి గలిగిన పుత్రుడు. కుంభకర్ణుడను పేర బరగువాడు. ఇంతటి ఎత్తు లావు ఇతర రాక్షసులకెవ్వరికి లేవు. ఇతర రాక్షసులందఱు వరములచే బలవంతులయినవారు. ఇతడు మాత్రము స్వతహాగా బలవంతుడు. రాక్షసులను గంధర్వులను, కిన్నరులను, యక్షులను, నాగులను, దానవులను, విద్యాధరులను యుద్ధమునందు వేల పర్యాయములు ఇతడోడించి యున్నాడు. దేవతల కితనిపేరు హృదయశూలము సుమా. శూలమును చేతబట్టి యుద్ధరంగమున వీడు వికృత నేత్రుడై నిలబడినచో యముడేమోయని దేవతా సంఘములు దగ్గరకు రాలేక

భయము నొందుదురు. వీడు పుట్టీ పుట్టకముందే ఆకలి బాధచే వేలకొలది జంతువులను మ్రింగబోవుచుండగా ప్రజలందఱు కడు భయముజెంది దేవతల రాజైన యింద్రునకు తెల్పగా ఇంద్రుడు వజ్రాయుధముతో కుంభకర్ణుని కొట్టగా ఆ దెబ్బకు చలించి గట్టిగా అరచెను. ఆ గొప్పధ్వనికి భూమండలము వడకిపోయి మఱల భయము నొందెను. అంత కుంభకర్ణుడు ఇంద్రుని ఏనుగు దంతమును బెరికి దానితోనే అతనిని బాదెను. ఆ దెబ్బచే ఇంద్రుడు బాధతో చలింపగా దైత్యులు ఋషులు దేవతలు కలత చెందిన మనస్సుగలవారైరి. ఇతడు పెట్టు బాధలను సహింపలేక దేవతలందరితో బ్రహ్మయొద్దకు వెళ్లి యింద్రుడు ఇది యంతయును విన్నవించెను. ఈ పాపాత్ముడు ప్రజలను తినివేయుట, శ్రమప్రదేశములను బాడుచేయుట మొదలగు విషయములు చెప్పి ఓ లోకేశ్వరా! ఈ విధముగా వీడు నిత్యము లోకులను భక్షించెనేని భూలోకము నశించిపోవును సుమా అనగా దేవతలనూరడించి బ్రహ్మ కుంభకర్ణుని జూచి గుండెలు దడదడలాడ ధైర్యము తెచ్చికొని వానిని ప్రేమతో బిలిచి ఓ జగద్విరోధీ! నిన్ను నిజముగా విశ్రవసుడు లోక నాశనము కొఱకే సృజించెను. కాన ఇది మొదలుగా ఘటకర్ణుడా! నీవు మృతప్రాయుడవై పడియుండుమని శపింపగా తక్షణమే అతని ఎదుటనే వీడు నేలబడెను. ఎంతయో విచారమును బొంది ఈతని సోదరుడైన రావణుడు బ్రహ్మతో ఇట్లనెను. తాతా! నీవిట్లు చేయదగునా? ఇతడు నీ మనుమడు. వీనిని శపింపదగునా? ఉమ్మెత్తచెట్టునైనను ప్రేమతో బెంచి ఫలించు సమయమున నఱికివేయుట న్యాయమా? పద్మగర్భా! నీ వాక్యములబద్ధములగునా? కావున మహాత్మా! దయతలచి వీని శయనించుట యందు మేలుకొనుట యందు కాలమును నిర్ణయింపుము అని రావణుడు వేడుకొనగా బ్రహ్మ దయకలిగిన మనస్సుతో నిట్లనెను. ఈతడాఱు మాసములు నిద్రించును ఒక్కపగలు మేల్కొని జగత్తున దిరుగుచు అగ్నివలె తినుచుండును గాక అని పలికెను. మహాత్మా! కుంభకర్ణుడట్టి వాడు. ఇప్పుడు దశకంఠుడు ఆర్తినొంది నీ శౌర్యమువలన భీతి చెందినవాడై వీనిని మేలుకొల్పెను. ఈ యింద్రవిరోధిని చూచి భయముచే వానరులెల్ల పరువెత్తుచున్నారు. ఈతడు యుద్ధరంగమున నెదురై నిల్చినచో ఎట్లు యుద్ధము చేయుదురో గదా! రామచంద్రా! తన శిబిరమును వీడి యీ ప్రతాపశాలి యుద్ధమునకు వచ్చుచున్నాడు. దేవా! ఈతడు వానరులను బట్టి తన రెండు చేతులతో తన నోటువేసికొనుచు వచ్చును. ఇది రాక్షరాజుచే ప్రయోగింపబడిన యొక యంత్రపు కీలుబొమ్మ కావున దీనికై భయపడుకుడో కపివీరులారా అని ప్రకటించుట మేలు. అట్లు చెప్పుటచే వానరులు భయము వీడి తిరిగెదరని

విభీషణుడు చెప్పగా హేతుబద్ధములయిన అతని వాక్యములను విని వానరసేనాపతియగు నీలునితో రాముడిట్లనెను.

## శ్రీరాముడు నీలునితో కుంభకర్ణునితో యుద్ధమునకు సేనల సిద్ధపరుపుమని బోధించుట:

ఓ అగ్నిపుత్రా! మన సేనల నన్నిటిని నేర్పుతో వ్యూహముల నేర్పరుపుము. లంకాద్వారములను రాజమార్గములను అడ్డగించి నిలబెట్టుము. పర్వతశిఖరములు పెద్ద వృక్షములు రాతిబండలు సంపాదించి సిద్ధము చేయుము. ఆయా సాధనములు పర్వతములు చేతుల ధరించి వానరులు నిలువ వలయును. అని చెప్పగా నీలుడు రాముని యాజ్ఞ వానరులకెల్లను తెలియజేసెను. వానరనాధులందఱు పర్వత శిఖరములను చెట్ల సమూహములను చేతులందు ధరించి అట్లే నిలిచిరి. శరభుడు, గవాక్షుడు, అంగదుడు, కేసరి పుత్రుడైన హనుమంతుడు పెచ్చుపెరిగి పర్వత శృంగములు చేతులబట్టి విరోధులు బెదురునట్లుగా అరచుచు ద్వారముల నడ్డుకొనిరి. పర్వతములు వృక్షములు చేతుల దాల్చి నిలిచిన వానరసేన కన్నులకు పర్వత సమీపమున మోహరించిన పెద్ద మేఘముల గుంపును దలపింపజేసెను.

★★★



# అరువది రెండవ సర్గము

## కుంభకర్ణుడు రాముని జూచుట:

పూర్తిగా నిద్రతీరని మత్తును, మిక్కిలి మధువును త్రాగుటచే కలిగిన మత్తును కలిసి మనస్సును కలతపెట్టుచుండగా రాక్షసశ్రేష్ఠుడగు కుంభకర్ణుడు రాక్షసరాజును చూచుటకు వేగముగా వెళ్లెను. రాక్షస సైన్యములు తనను కొలుచుచుండగా పట్టణమునందలి జనులు పుష్పములు తనమీద చల్లుచుండగా మనోహర వైభవముతో నొప్పు రాజమార్గమున వెళ్లి బంగారు కిటికీలు గలదియు సూర్యకాంతితో ప్రకాశించునదియు విశాలమైనదియు అగు అన్న గృహమును సూర్యుడు మేఘ సమూహములోనికి ప్రవేశించినట్లు ప్రవేశించి లోపలికి వెళ్లి ద్వారములను దాటి ఇంద్రుడు బ్రహ్మను చూచినట్లు అన్నను జూచి, అతడు పుష్పకవిమానమున చింతలో మునిగియుండగా కుంభకర్ణుడు వేగముగా సమీపించగా నాయనా రమ్మ అనుచు రావణుడు సంతోషముతో లేచి ప్రేమ పొంగగా కౌగిలించుకొనగా కుంభకర్ణుడు గౌరవముతో అన్నపాదములకు తన నుదురు సోకునట్లుగా మ్రొక్కి దగ్గర నున్న పీఠముమీద సంతసముతో కూర్చొని తీక్ష్ణములయిన నేత్రములు గల కుంభకర్ణుడన్నతో నిట్లనెను. ఓ రాజా! నన్నీవేళ ప్రేమతో నిద్రలేపుట యెందులకో తెల్పుము. ఏ వంక నీకు భయము కలిగినది? ఎవడిప్పుడే శవాకారమును పొంద గోరెను? త్వరగా చెప్పుము అనగా రావణుడు తన సోదరుడు కోపముతో నున్న వైఖరిని జూచి కొద్దిగా తిరుగుచున్న కనులు గలవాడై ఆ మహావీరునితో దాపరికము లేకుండ నిట్లనెను.

## రావణుడు కుంభకర్ణునితో రాముని వలన రాక్షసులకైన విపత్తు దెల్పుట:

తమ్ముడా! నీవు సుఖముగా నిద్రించుటచే ఎఱుగవు గదా. చాలకాలము నుండి రాఘవుడు నన్ను బాధపెట్టెడు విధము వినుము. సూర్యపుత్రుడగు సుగ్రీవుడు సాయము చేయుటచే సైన్యసమేతుడై సముద్రము దాటి యుద్ధరంగమున రాక్షస సైన్యమును సమూలముగా నాశనము చేయుచున్నాడు. చూచితివా? సముద్రమునకు సేతువు నొకదానిని నిర్మించి లంకాపుర సమీపమున నున్న ఉద్యానవనములన్నింట ఆ రాజు

వానర సమూహములతో మహాసముద్రును వ్యాపింపజేసెను. అయ్యో! యుద్ధమునకు రాక్షసశ్రేష్ఠులు వెళ్లుటే కాని ఒక్కడైనను తన ఆకారముతో తిరిగివచ్చుట చూడలేదు. వానరులందొక్కడైనను పేరుగల వీరుడు చంపబపడుటయు వినలేదు. దాని వలన మనస్సునందు భయము గలుగుచున్నది. వీరులలో శ్రేష్ఠుడా! ఈ పురమును రక్షింపుము. తమ్ముడా! ఆ వానర సమూహములను సంహరింతువని నిన్ను నిద్రలేపితిని. మిక్కిలిగా ధనము బలము కూడ నాశనమైనది. నమ్ముము. ఈ పట్టణమిప్పుడు వృద్ధులు బాలురే శేషించినట్లున్నది. అన్న నిమిత్తము దీనిని నీవే రక్షింపుము. అతి దుష్కరమైన ఈ కార్యమును నిర్వహింపుము. ముందెప్పుడైన నీకీ విధముగ చెప్పితినా? నీపై నాకున్న స్నేహ వాత్సల్యము ఆదరము ఎంతయో నీ వెరుగవా? ఒప్పుగా దేవతలకు రాక్షసులకు యుద్ధములు వచ్చినప్పుడు శౌర్యముతో నీవు గెలవలేదా? వాని నన్నిటిని మరచితివా ఎప్పుడైనను? భయంకరమైన పరాక్రమముగలవాడా! నీ భుజశక్తిని, శౌర్యమును, ధైర్యమును నేడు యుద్ధభూమి యందు చూపించుము. నీతో సమానమైన పరాక్రమముగల మొనగాడు ఈ భూమండలమునందేడీ? ఇది నాకు మహా ప్రీతికరము దీనిని ఘటింపుము. బంధుప్రీతిగలవాడా! యుద్ధకళా ప్రియుడా! మన విరోధులను సంహరింపుము. మన ప్రేమను స్నేహమును తలంపుము. నాకలోక నివాసులైన దేవతలను పారద్రోలిన నీకు వనముల సంచరించు వానరులొక లెక్కయా? సాటిలేని తేజో లక్ష్మిగలవాడా! నీ బలమనే పెనుగాలిచే విరోధి సంఘములనే మేఘములను చెదరిజేయుము.

★★★



# అరువది మూడవ సర్గము

## కుంభకర్ణుడు రావణుని నిందించుట:

ఇట్లు అంగలార్చుచున్న రాక్షసరాజును చూచి కుంభకర్ణుడు నవ్వుతోప నిట్లనెను. పూర్వము మేము మంత్రాలోచన సమయమున నీకెటువంటి విపత్తు కలుగునని నిశ్చయించితిమో అట్టి విపత్తు హితులయందు అనురక్తిలేని నీకు కలిగినది. దీనియందు విపరీతమేమియు లేదు. పాపములు చేయు వారలు నరకమున గూలునట్లు నీవు చేసిన ఆ పాపము యొక్క ఫలితము నిన్ను విడువక చేజేతుల అనుభవింపగ జేసినది గదా. రాజా! మునుపు నీవెవ్వరి తోడను చేయవలసిన విధమును గూర్చి ఆలోచింపలేదు. కేవలము శార్యమదముచే ముందు రాబోవు అనర్థములను తలంచవైతివి. సంపన్నుడు తాను ముందు వెనుకల జేయవలసిన పనులను వెనుక ముందులు ఇష్టము వచ్చినట్లు చేసిన నీతివేత్త అనిపించుకొనునా? హవిస్సులను (సంస్కారము చేయని) తగని అగనియందు వ్రేల్చినట్లు దేశకాలములను తెలియకుండ చేసిన కార్యములు విపరీత ఫలములను కలుగజేయును గదా. రాజా! ఉత్తమ మధ్యమ అధమ మార్గములలో ద్రవ్యము, దేశము, కాలము, అధికారి, ప్రయోజనము అను అయిదు సంబంధములను మంత్రులతో గూడి ఆలోచన చేసిన ఆ నీతి ఫలములను అనుభవించును. నీతిని వీడక సచివులతో మంత్రాంగము నెరపి కార్యనిర్ణయము చేసెడు వాడు కార్యములందు విజయముపొంది ప్రఖ్యాతిగాంచును. ధర్మము, అర్థము, కామము అను పుర్షార్థములను వేరువేరుగా గాని, మూడింటినిగాని, లేక రెండు రెండుగా గాని క్రమపద్ధతిలో నిత్యము తగినకాలములందు సేవించు పురుషుడు సంపదలకు నిలయమైయుండును. ఎల్ల సమయములందును కామమునే కొనియాడు వాడును ఒక మనుష్యుడేనా? వానిని ఇష్టపడునా? కాన ఆ మూడింటిలో నేది ఉత్తమమో యెఱిగి రాజుగానీ రాజవంశీయుడుగానీ దానిని నియమముతో ఆచరింప దలంపడేని వాడు గుండెలు బ్రద్దలగునట్లు చదివిన నేమి సార్థకము. వట్టి శ్రమచేటు తప్ప. సామదాన బేధములను ఉపాయములన్నింటినో ఒక్కటొక్కటో నియమముతో నీతి అవినీతి తెలిసికొనుచు ధర్మార్థకామములను మంత్రయుక్తముగా ఆలోచించి కార్య

నిర్ణయముచేసికొని నిష్ఠగా ఆచరించువాడు కీడు పొంది దుఃఖించడు ఇది సత్యము. అన్ని విషయముల తత్త్వము తెలిసిన మంత్రులతో ఇట్టిది కార్యము ఇట్టి దకార్యము అని ఆలోచన చేసి మంచి ఫలితమిచ్చుదానిని ఆచరించువాడు సౌఖ్యముగా జీవించును గదా. అట్లు శాస్త్ర రహస్యములు తెలియనివారై తెగింపుతో పశువులవలె వివేక శూన్యమైన బుద్ధులు గల నీచులు ఓ రాక్షసరాజా! భ్రమచే మోహిత చిత్తులైన రాజులయొక్క మంత్రులై యుండుచు మంత్రాలోచనవేళలందు కేవలము ప్రగల్భములు పలుకుటలో ముందు నిలిచెదరు కాని దానివలన కలుగబోవు కీడునే మాత్రము ఆలోచింపరు. ఓ రాక్షసరాజా! అర్థ శాస్త్రమించుకంతైనను దెలియనివారై అధికముగా ధనము పొందు నభిలాష గలిగి శాస్త్రార్థ జ్ఞానములేని వారియొక్క అహిత వచనములను ఇంచుకంతైనను పాటింపరాదు. హితమువలె కనిపించు అహితమును వాగుచుండెడు చెఱుపనుచేటులగు వారిని గుర్తించి కార్యముల నాలోచించు సమయములందు వారలను దూర దూరముగ నుంచుటే రాజునకు ఉచితము. కార్యము సాధింప నేర్పరులగు విరోధులకు రహస్యములను జెప్పి, తమ రాజుచే దుష్టకార్యములను చేయించుచు, దుర్మార్గుడగు మంత్రి రాజును ఆపదల సముద్రమున ద్రోయకుండునా? మిత్రులవలె పైకి కన్పించు శత్రువులను మంత్రాలోచన సమయమున మెలకువతో రాజు వారు చెప్పు మాటలను బట్టి నెమ్మదిగా ఎఱుగ దగును. త్వరపడి పనులు చేయుచు, దుర్మార్గుని మంత్రియని నమ్మ రాజు యొక్క రహస్యమును గుర్తించుచు శత్రువులు, ఓ శత్రుమర్దనా! క్రౌంచ పర్వత బిలములోనికి హంసలవలె లోపలికి ప్రవేశింతురు. దుష్టుడగు శత్రువును తెలిసికొనలేక తమ ఆపదలను గాచుకొనలేని రాజు తప్పక ఆపదలు రాగా సంపదలు ముక్కలు ముక్కలై తన పదవి గెంటబడినవాడై నశించును. ఇదివరకు నీ తమ్ముడైన విభీషణుడు చెప్పిన విధముగా జేయుము. అదియే నీకు మిక్కిలి మేలు కలుగజేయును. రాక్షసరాజా! ఇది నా అభిప్రాయము. వినుము. తరువాత నీ యిష్టము వచ్చిన విధముగా చేయుము.

## రావణుడు కుంభకర్ణుని కోపించి పలుకుట:

ఇట్లు కుంభకర్ణుడు మిక్కిలి హితముగా పలుకగా ఇరువది భుజములు గల రావణుడు రోషముచే శరీరము తెలియనివాడై కనుబొమ్మలు ముడివడగా కన్నులెఱ్ఱవడగా సోదరుని జూచి కటములదరగా నిట్లనెను. ఓ శౌర్యధనాఢ్యా! నీతి గుణశాలియు మాన్యుడునైన దొడ్డ ఆచార్యునివలె శాసించెదవేలరా? ఇక చాలును చాలును. ఈ సమయమున తగిన

కార్యము చేసినచో ప్రయోజనముండునుగాని, కేవలము మాటల శ్రమవలన నేమి పర్యవసానముండునో తెలుపుము. పొరపాటుననో, తెలియకయో గొప్ప బలమును శౌర్యమును ఆశ్రయించియో కార్యము తప్పుగా నడచినది. మఱల మఱల ఇట్లయినచో బాగుండెడిదని పలికిన ఏమి వచ్చెనో చెప్పుము. జరిగిపోయిన దానికి విచారింతురా? జరిగినది జరిగిపోయినదియే. ఇప్పుడే విధముగా కార్యమును దీర్పవచ్చునో దానికి పూనుకొనుము. గతమును గూర్చి మాటలాడిన ప్రయోజనమేమైన కలదా? నాయందు నీకు స్నేహము మిక్కిలిగా నుండునేని, నీ ఘనమైన శౌర్యమింతటిదని నీ మనస్సునందు ఎఱుగువేని, ఇప్పటి కార్యము నిరాక్షేపముగా జరుగునని యెంచెదవేని వేగముగా నా దౌష్ట్యము చేత కలిగిన యీ ఆపదను నీ శౌర్యముచే తొలగింపుము. కష్టములలో నుండుట యెఱిగి దైన్యముతో బాధ నొందెడు వానిని చేరువాడే గదా జగత్తులో నిజమైన మిత్రుడు. కష్టములలో దుఃఖపడువానిని గాచువాడే బంధువు సుమా.

## కుంభకర్ణుడు రావణుని సమాధానపరచుట:

అని వ్యథ చెందిన ఇంద్రియములు గలవాడై దారణములగు మాటలను పలుకుచున్న ధీరుడగు అన్నను చూచి రోషము చెందిన వాడని తెలిసి కుంభకర్ణుడు మెల్లగా వినయముతో మంచి మాటలతో నిట్లు విన్నవించెను. చాలు రాక్షసరాజా! సందేహింపకుము. ఇక కోపమును విడచిపెట్టి స్వస్థతను పొందుము. నేను జీవించియుండగా దీనిని మనస్సునందుంచు కొనకుము. ఎవ్వనివలన నీకింత పుట్టెనో వానిని సంహరింతును. బంధువగుట చేతను సోదర ప్రేమచేతను అన్ని వేళలందును హితము చెప్పుట అవసరము కావున అట్లు పలికితిని. ప్రేమగల చుట్టము అవసరపడ్డ వేళ శత్రునాశనము చేయుట తగియుండును. ఓ అసురరాజా! సాటిలేని నా శౌర్యముచేత నేడు యుద్ధముచేసి నీ పగ దీర్చెదను. చూడుము. ఇదే నన్ను రణశూరుని శ్రీరాముని వైరిని జంపగా (శ్రీరాముని వైరిని నన్ను జంపగా జూడుమనియు అన్వయము) చెడిపోయి పారిపోయెడి విరోధుల సైన్యమును కన్నులారా చూడుము. రాముని సంహరింపగా యుద్ధరంగమందు దొరలుచున్న శిరస్సును వేడుకతో జూడుము. యుద్ధమునందు తమ చుట్టములను గోల్పోయిన రాక్షసులందఱు రాఘవుడు మరణించగనే నన్ను ప్రీతితో సంతోషముతో చూచెదరు గాక. యమపురమునకు వెళ్లిన చుట్టములకై విలపించెడి వారి కన్నీటిని అతివేగముగా శత్రునానశమొనరించి తుడిచి వేసెదను. పర్వత సమానదేహుడైన ఆ సూర్యనందనుడగు సుగ్రీవుడు దేహము

ఇంతలింతలు వ్రక్కలై నేలవ్రాలి సూర్యునితో గూడిన మేఘమువలె నుండగా ఏ గతి పట్టునో చూడుము. రాముని సంహరించు కోరికగల నేనును రాక్షసులు ప్రేమతో రక్షించుచుండగా నీవు రామునిచే ఎట్లు వధింపబడెదవు? ఆ రాముడే రణరంగమున ముందుగా నన్ను వధించినచో బలసంపదచే అధికుడగు అతడు నిన్ను చంపక మానడు. ఇది సత్యము. నేను యుద్ధమున పరాభవము నొందుదునేమో అను విచారము నాకు మనస్సునందు ఏమియు లేదు. కాన నన్ను వెంటనే యుద్ధమునకు పంపుము. ఇతరుని బంపవలదు. ఇంద్రుడైన నేమి? వరుణుడైన నేమి? శూలమును చేతబట్టి పర్వతము వంటి శరీరము గలవాడనై వాడియైన కోరలు గలిగి యుద్ధమున నేను తలపడగా విరోధులు బెదరి తూలరా? వ్రీలరా? కూలరా? వట్టిచేతులతో నైనను నేను రోషముతో విరోధులను నలిపి వేయుచుండగా ప్రాణములమీద ఆశగల జీవి యెవ్వడు ఎదిరించి నిల్చును? బాణముల వరుసలెందుకు? వాడి ఖడ్గములు గదలు మొదలుగునవి ఎందులకు? శక్తియేల? నాకవన్నియు నెందులకు? నా చేతులతోడనే యింద్రునినైనను ముద్దగా జేయనే? నాయొక్క గొప్ప పిడికిటి పోటును రఘురాము డోర్చుకొనగల్గినచో ఆ రాముని బాణజాలములు నా రక్తమును త్రాగగల్గును. ఓ రాక్షసరాజా! ఏల యిట్లు నేనుండగా వ్యసనముతో ఆర్తిని పొందెదవు? అతివేగముగా వెళ్లి శత్రు సమూహముల మదమణగించెదను. ఆ రామలక్ష్మణులను, వానరరాజును మన లంకను గాల్చిన హనుమంతుని మిగతా పెద్ద పెద్ద వానరులను నేను సంహరించెదను. రాముని వలని భయమును వదులుము. నీకు సాటిలేని కీర్తి కలుగును. ఇంద్రుడు నైనను బ్రహ్మనైనను సంహరించెదను. నేను కోపించిన నిర్జర సమూహము చాపకట్టుగా చచ్చి నేల పడరా? శమనుని (యముని) శమింపజేసెదను (చంపెదను). సర్వభక్షకుడైన అగ్నిని మ్రింగివేసెదను. నక్షత్ర సమూహముతో గూడ సూర్యుని పడ ద్రోయుదును. శతక్రతుని (ఇంద్రుని) యుద్ధమనెడు యజ్ఞమునకు బలిపశువుగా చేయుదును. వరుణుని కొంపగూల్చి త్రాగి వేసెదను. గర్వముతో కులపర్వతములను పట్టి పిండిపిండిగా దంచెదను. నా శక్తిచే భూమిని చిన్న చిన్న ముక్కలుగ చీల్చివేసెదను. ఇన్ని దినములు నిద్రించిన కుంభకర్ణుని బల తేజములను, ఇప్పుడు నేను భక్షించుచుండగా అదిరిపోయి ఆపదనొంది వినాశము నందుచు ప్రాణికోటులు చూచునుగాక. మదముతో ఈ మూడు లోకముల నిట్టె భుజించినను నాకు తృప్తిలేదు. శ్రీరాముని మరణముచే నీకు స్థిరమైన సౌఖ్యమును గలుగజేయుటకై నేను యుద్ధము చేయుదును. ఓ రాక్షసరాజా! రాఘవులచే

రక్షింపబడుచున్న వానరసైన్యమంతటిని మ్రింగి తృప్తి నొందెదను. చింత యెందులకు? కోరికల ననుభవింపుము. మద్యమును త్రాగుము. చేయవలసిన పనులన్నియు చేయుము. నేను పోవుదును. హతుడు కాగ రామవిభుడు ఏ లోటు లేకుండ సీతారమణిని పొందవచ్చును నీవు మనసునందు విచారమును బొందవలదు. [నేను పోవుదును హతుడుకాగ. రామవిభుడు సీతారమణిని పొందవచ్చును అని రెండవ విధముగా అర్థము]

★★★



# అరువది నాలుగవ సర్గము

## మహోదరుడు కుంభకర్ణుని మతమును ఖండించుట:

గొప్ప దేహము గలవాడును బలవంతుడును గొప్ప బాహువులు గలవాడును అగు కుంభకర్ణుడిట్లు పలుకగా విని సంతోషము విడచినవాడై మహోదరుడతనిని జూచి యిట్లు పలికెను. ఓ కుంభకర్ణా! గొప్ప వంశమున బుట్టితివి. కొంచెమైనను బుద్ధిలేదు. గర్వమునొందియున్నావు. అజ్ఞానుల వంటి దృష్టిగలవాడా! కార్యమునంతను లోతుగా చూడజాలకున్నావు. ఇస్సీ! బాల్యచాపల్యముచేత నోటికి ఎట్లు వచ్చిన అట్లు బుద్ధిహీనుడవై చెప్ప జూచెదవు. రాజా నీతి అనీతుల అంతరము నెఱుగనివాడు? అతడు తనకు శత్రువులకు కలిగెడు హాని వృద్ధులను, స్థానమును బాగుగ తెలియును. దేశకాలవిధముల నాలోచించి చేసినవాడు. బలవంతుడు. మూఢునివలె, వృద్ధుల సేవ చేయక చెడినవానివలె పండితుడెందైనను చేయతలంచునా? ఓ కుంభకర్ణా! నీవు ధర్మము అర్థము కామము వేర్వేరుగా ఫలముల నిచ్చునని పల్కితివి. ఏ పని నిజముగా ఏ ఫలమును తప్పక యిచ్చునో నీవెఱిగిన విధము ఒక్కటి యున్నను చెప్పవయ్యా! ఓ గొప్పబలము గలవాడా! ఆలోచించి చూడగా కర్మమే గదా ఐహికము మొదలయిన ఫలములకు కారణమగును. పాపాత్ములగు వారికి శ్రేయస్సు కలుగుట మనము చూచుటలేదా? ధర్మము, అర్థము శ్రేయమును కలిగించునట్లే అధర్మమును, అనర్థమును శ్రేయమును కలిగించుచున్నవి. ఎక్కడనో అధర్మము, అనర్థము పాపమును గలిగించును. ఇంక ఏవిధముగా ధర్మమే నియతముగా సత్ఫలము కలిగించునని దృఢపరిచెదవో చెప్పుము. అచ్చమైన పుణ్యకర్మలచేత ఇహలోక సౌఖ్యములు పరలోక భోగములు హెచ్చుగా గల్గునని లోకులు సత్కార్యములు చేయుదురు. గర్వముతో నిరాఘాటముగా కార్యములు చేయువానికే సంపదలు వచ్చును. ఓ బుద్ధిమంతుడా! అందుకు కారణమేదియో చెప్పుము. కామమొక్కదానినే ఆధారముగా దీసికొని రాజు సుఖపడగోరెను. అది దోషమా? మా మనస్సుల కది సమ్మతమే. శత్రువుల విషయమున రాక్షస రాజేమి సాహసము చేసెనో చెప్పగలవా? ఇక ఒంటరిగా యుద్ధముచేసెద నని యేమో పలికితివి. అది యనుచితము. ఎట్లందువా?

చెప్పెదను వినుము. ఎవడు జనస్థానమునందు మహా పరాక్రమవంతులైన రాక్షసవీరులను సంహరించి శ్రేష్ఠమైన పరాక్రమము గలవాడో, ఎవని పేరును నేటికిని రాక్షసుల బంధువులు లంకలో అతిభీతితో స్మరించుదురో, ఆ రాముని మహా శౌర్యవంతుని యుద్ధములో నెదుర్కొనుటకు నీవా ఒంటరిగా పోవుదవు? కోపించిన సింహము వంటి పరాక్రమము గలవాడును అవధిలేని శౌర్యదర్పము గలవాడును అగు రాముని నిద్రించిన సర్పమును తెలివితక్కువగా లేపబోవునట్లు ఏమని చెనకబోయెదవు? అధికమైన రోషముగలవాడును, మృత్యువు వలె భయంకరుడును అగు రాముని తేరిచూచుటకు యుద్ధములో నెవ్వడు సమర్థుడు? ఇంతమంది సైన్యముతో యుద్ధరంగమునకు వెళ్లలేకున్నారనగా ఒంటరిగా ఆ సీతానాధుని నెదుర్కొనుట నాకుచితముగా దోచుట లేదు. కుంభకర్ణా! సహాయులు లేకుండ సమృద్ధబలుడైన శత్రుని వశము చేసుకొనుటకు ప్రాణముల మీద ఆశ వీడి యెవ్వడు పోవునో చెప్పుము. ఓ రాక్షసేంద్రా! మానవులలో రామునితో సమానుడు లేడు. ఆ రఘునాధుడు ఇంద్రునితో సూర్యునితో సమానుడు. అతనితో కయ్యమున కెందులకు బోవదలంచెదవు? అనర్థము వాటిల్లకుండునా? అని ఆ మహోదరుడు దశకంఠుని జూచి దర్పము కోపము నిండిన మనస్సుగలవాడై సీత నీ చేతిలోనిదే. ఆమెకై ఇంక చింతయేల? నీవెప్పుడు కోరిన అప్పుడే వశమగును. అందుకొక్కయుపాయమును చెప్పెదను వినుము.

## రావణునకు మహోదరుడుపాయమును చెప్పుట:

నీకిష్టమైనచో దానిని చెప్పెదను. కుంభకర్ణుడును, నేను, ద్విజిహ్వుడును, వితర్దనుడును, సంహ్రాదియు అను మేమైదుగురము రాముని జంపుటకై యుద్ధమునకు వెడలుచున్నట్లు లంకాపట్టణమున చాటింపజేయుము. మేము వెళ్లి యెట్లైన శక్తికొలది రామునితో పోరాడెదము. మేము జయించినచో ఏ యుపాయములు అక్కఱలేదు. ఎంత పోరాడినా రాముడే జయించినచో ఒక ఉపాయము చేయుదము. దానినంతయు నే నాలోచన చేసియుంచితిని. ఓ రాక్షసరాజా! మేము రామునితో యుద్ధము చేసినట్లు, రామనామాంకితములైన వాడి బాణములు గాడిన శరీరములతో పెద్దగా అరచుచు నీ యొద్దకు వచ్చి నీ పాదములపై వ్రాలెదము. ఓ అసురరాజా! నీవు సంతసించి మాకు అధికమైన కానుకలిచ్చి సత్కరింపుము. అంతట యేనుగుపై పట్టణమందంతట సైన్యసహితముగా రామలక్ష్మణులు యుద్ధములో మరణించిరని చాటింపజేయుము. ఆపై సేవకులకు కోరికలు దీరునట్లు వివిధ పదార్థములను ప్రీతితో నొసంగుము. యోధులకు

నూతన వస్త్రములను గంధములను మణిభూషణములను మాల్యములను మద్యములను సమర్పింపుము. నీవు కూడ సంతసముతో మద్యమును సేవింపుము. ఆ విధముగా లంకలో నలుదిక్కుల రాఘవుల మరణవార్త వ్యాపించును. మెల్లగా నీవు సీతను చూచి మాటలతో ప్రియోక్తులతో ధన ధాన్యములు మణులు మొదలుగునవి ఆశ పుట్టునట్లు చూపించి ఆనందింపజేసి, ఊరడిల్లునట్లు మాటలాడి వశము చేసికొనుము. నీ మనస్తాపము తీరుటకు, భయశోకములు నశించుటకు నిదియే ఉపాయము సుమా. భూపుత్రి కూడ తన మనఃప్రియుడు నశించుట చేతను, ఎడతెగని భోగభాగ్యములలో పెరిగినదగుట చేతను, తొలుత దుఃఖముచే వికలమైన మనస్సుగలదైనను ఆశ నశించుట చేత, స్త్రీ సహజమైన చంచలబుద్ధి చేత నీకు వశము కాగలదు. మనసులో ప్రేమ లేకున్నను నీవే దిక్కు గావున నీకు వశవర్తిని కాగలదు. ఇదియే సుమా నేను నిర్ణయించిన విధానము. ఇది నీకు సుఖ కారణమని నేను తలంతును. దశరథనందనుని బారిని బడితివా చాల అనర్థము కలుగును. ఇది నిక్కము. ఇచ్చటనే సుఖముగా సంతోషముతో నుండుము. యుద్ధభూమికి వెళ్లు యత్నము చేయవద్దు. యుద్ధము చేయకున్నచో సుఖము లభించును. రాజా! నా మాటల నాదరింపుము. శత్రుసైన్యమును చూడ దలపక ప్రాణసంశయమునందక రాజా! జయమునందుము. కీర్తిని, పుణ్యమును ఐశ్వర్యమును పొంది నీవు సుఖింపగలవు.

★★★



# అఱువది ఐదవ సర్గము

## కుంభకర్ణుడు మహోదరుని నిందించుట:

మహోదరుడిట్లు చెప్పగా ఛీ! యని అతని అసహ్యించుకొని తన గొప్పతనము ప్రకటమగునట్లు కుంభకర్ణుడు రాక్షసరాజును జూచి దురాత్ముడగు రాముని శీఘ్రముగా చంపి నీ భయము తొలగించెదను. శత్రు రహితుడవై నీ వెప్పటివలెనే బాగుగా సుఖింపవయ్యా రాక్షస నాయకా! పరాక్రమము గలవారు నిర్జలమేఘముల వలె ఊరకే గర్జింపరు. మహాకీర్తిశాలీ! నేను శత్రువులను జయించి చేయు గర్జనల నిండుదనమును చూడవయ్యా! శూరులు పరుల ధిక్కారములను సహింపరు. తమ్ము తాము పొగడుకొనరు. పైకి అమాయికుల వలె నుండియు ఓ రాక్షసేంద్రా దుష్కరములైన కార్యములను సాధింతురు. ఓరీ! మహోదరా! యుద్ధ భీరులు, అన్ని తెలిసిన పండితులమని భావించువారు, నీచులు, ముఖప్రీతిగా మాటలాడువారు, అల్పబుద్ధులు అయిన నిన్ను బోలినవారు ఆలోచనలు చెప్పువారలగుటచే మీ వాక్యములు విని రావణుడిట్లయినాడు. చేసిన పనుల ఫలితమిట్టిదైనది. ఎల్లవేళల రాజువెంట నుండి మిత్రరూపులయిన శత్రువులై మీరు లంకానగరమును రాజుమాత్రమే మిగిలిన దానినిగా జేసితిరి. కోశాగారమును సైన్యమును నశింపజేసి ఈ యుక్తులు గిక్తులేమిటి? ఇంతకు ముందు చేసినవి చాలును. మీరు చేసిన ఈ దోషమును యుద్ధమునకు వెళ్లి చక్క జేయుదును అని పల్కగా నవ్వుచు రాక్షసరాజు కుంభకర్ణుని జూచి యిట్లనెను.

## రావణుడు కుంభకర్ణుని ప్రశంసించుట:

రామునకు భయపడి ఈ మహోదరుడు యుద్ధము నేమాత్రము ఇష్టపడుటలేదు. భయంకరమైన బలమునందు అధికమగు స్నేహమమునందు నాకు నిన్ను బోలిన ధీశాలి యెవడున్నాడు? వెంటనే యుద్ధక్రీడకు వెడలుము. వెళ్లి క్రౌర్యముతో శత్రువులను జంపి ప్రాణభయమును పోగొట్టుము. సోదరా! నేనా భీతి చేతనే గదా నిన్ను నిద్రలేపితిని. నాకిష్టులైనవారు శక్తియుక్తులతో సహాయపడుటకిదియే సమయము. కాన శూలమును పట్టి పాశము ధరించిన యమునివలె సూర్య తేజస్వులయిన ఆ రాజపుత్రులను వానరులను అందఱను విడువక మ్రింగివేయుము. నీ రూపమును జూచినచో వానరసంఘములు

అత్యంత భీతితో కకావికలై పారిపోవరా? రాముడును వాని సోదరుడును గుండెపగిలి మరణింపకుందురా? రాక్షసరాజీవిధముగా కుంభకర్ణుని ప్రశంసించి వాని గొప్ప భుజబలమును, గొప్ప పరాక్రమమును ఎరిగినవాడగుటచే తనను తిరిగి బ్రతికినవానిగా తలంచుచు మహానందములో తేలియాడుచు సభాస్థలమున చంద్రునివలె నిర్మలుడై వెలుగొందెను.

## రావణుడు కుంభకర్ణుని ఒంటిగా యుద్ధమునకు పోవలదనుట:

అన్నగారి యాజ్ఞ ప్రకారముగా కుంభకర్ణుడు యుద్ధ సన్నాహములు చేసి కాలాయసమును బంగారముతో అలంకరింపబడినదియు, వజ్రాయుధముతో సమానమయినదియు, భయంకరమును, దేవదానవ గంధర్వ వినాశకరమును, భయంకరమైన అగ్నిజ్వాలలను వెడలించునదియు, సాటిలేని తేజము గలదియు, ఎఱ్ఱని పుష్పమాలికలు గలదియు, శత్రువుల రక్తముతో గూడినదియు నై ప్రకాశించుచున్న శూలమును చేతబట్టి దశకంఠుని జూచి అన్నా! నేనొక్కడనే యుద్ధము చేయుటకు వెళ్లుచున్నాను. నేను తిరిగి వచ్చునంతవఱకు నా సైన్యములిందేయుండును గాక వరుసబెట్టి ఆ వానరులనందఱును మ్రింగి వేసెదను. అనగా రావణుడు తమ్ముడా! అది నీతి గాదు సుమా. భయంకరమైన రాక్షససైన్యములు ముద్గరములు ముసలములు ఆయుధములుగా ధరించినవారు సేవింపగా వెళ్లుము. వానరులన్న శౌర్యవంతులు, భయము లేనివారలు, వేగము గలవారు, యుద్ధ ధురంధరులు హెచ్చైన సాహసము గలవారు. ఒంటరివి, ప్రమత్తుడవు అయియున్న నిన్ను జూచి వానరులు కోరలతో గోళ్లతో ముక్కలు ముక్కలుగా పీకి చంపుదురు. ఒంటరిగా వెళ్ళవద్దు నాయనా! గొప్ప సైన్యముతో వెళ్లుము. వెళ్లి మన విరోధులనందఱను సంహరింపుము. అని చెప్పి దిగున తన సింహాసనము నుండి దిగి ప్రకాశవంతమైన రత్నహారమును సంతోషముతో తన తమ్ముని కంఠమునందు వైచి మణిమయములైన ఉంగరములను, బంగారు ఆభరణములను ప్రకాశించెడు గొప్ప బాహు పురులను కుండలములను తానే  అతనికలంకరించి దివ్యములై అందముగల కుండలములను తానే అతనికలంకరించి దివ్యములై అందముగలవైన పుష్పమాలికలను శరీరమున నుంచెను. అంత కుంభకర్ణుడు మేలైన సొమ్ములు ధరించి హోమద్రవ్యములు వేసిన హోమాగ్ని వలె ప్రకాశించెను. నల్లని పెద్ద మొలనూలితో ఆ కుంభకర్ణుడు అమృతోత్పాదన సమయమున సర్పబద్ధమైన మందరాద్రి వలె ప్రకాశించెను. బంగారపు తొడుగులు గలదియు, శత్రువులచే భేదింపరానిదియు మెరుపువంటి తేజస్సు గలదియు అగు కవచమును ధరించి సంధ్యాకాల మేఘములతో కూడిన పర్వతమువలె ప్రకాశించెను.

మఱియు చందనము పుష్పములు, ఆభరణములు మొదలగువానితో అలంకరింపబడిన శరీరము గలవాడై శూలమును దాల్చినవాడై నారాయణుడు త్రివిక్రమవేళ పెరుగుచున్న విధముగా నొప్పుచు ఆ కుంభకర్ణుడన్నకు ప్రదక్షిణము చేసి కౌగిలించుకొని నమస్కరించి యుద్ధరంగమునకు బయలుదేరెను.

## కుంభకర్ణుడు యుద్ధమునకై బయలుదేరుట:

ఆ బలవంతుడగు కుంభకర్ణుడు అన్నగారి దీవనలంది గర్జించుచు వెడలుచుండగా శంఖముల దుందుభుల మ్రోతలు, శూరుల, ఏనుగుల, గుఱ్ఱముల, రథముల శబ్దములు దిక్కులు నిండినవి. రథికులు అతని ననుసరించిరి. సింహములు, ఏనుగులు సర్పములు తురగములు, గాడిదలు, ఒంటెలు వెడలినవి. పురజనులు పుష్పములను జల్లిరి. శస్త్రములు చేతుల ధరించిన భటులు సింహనాదములు దిక్కుల నిండగా భయంకరములైన కన్నులు గలవారై వెళ్లిరి. కుంభకర్ణుడు మిక్కిలి భయంకరమయిన రూపము గలవాడై రక్తగంధమత్తుడై వెళ్లుచుండెను. నూరు ధనుస్సుల వెడల్పును ఆరునూర్ల ధనుస్సుల యెత్తును రథచక్రములవంటి కన్నులును రౌద్రమైన రూపమును, తగులబడిన పర్వతము వంటి శరీరమును, కొండ గుహవంటి నోరును గలిగి రాక్షసులను జూచి నవ్వుచు నిట్లనెను. రాక్షసశ్రేష్ఠులారా! మిడుతలపై పడు అగ్నివలె వానర శూరులను కాల్చివేసెదను. కాని నాకు వారలేమియును అపరాధము చేయలేదు సరికదా. మా వంటివారి సుందరమైన ఉద్యానములన్నిటికిని అలంకారప్రాయులగుదురు. ఇట్టి వీరిని చంపనేల? మన నగరమును ముట్టడించినది మానవనాథులైన రామలక్ష్మణులు. మొట్టమొదటగా వారిని సంహరించినచో సర్వము సమూలముగా నశించును అని పల్కగా ఆ రాక్షసులు మనస్సులందు సంతోషించి రామలక్ష్మణులు నేడే నశింతురని తలంచుచు సముద్రము క్షోభ చెందునట్లుగా సింహనాదములు చేసిరి. కుంభకర్ణుడు యుద్ధ కుతూహలముతో వెళ్లుచుండగా చాల దుశ్శకునములు కనిపించెను. మేఘములు గాడిదల వంటి రంగుగలవై ఉల్కలతో పిడుగులతో ఆకాశమున గోచరించెను. సాగరములు వనములు కలతనొందెను. భూమి కంపించినది. నక్కలు రోదన ధ్వనులు చేసినవి. అగ్ని గ్రక్కుచు పక్షులు ప్రదక్షిణముగా వెడలెను. దండవలె గ్రద్ద మీద వ్రాలెను. ఎడమ కన్ను ఎడమ భుజము అదరెను. సూర్యుడు తేజోహీనుడయ్యెను. కఠినములైన గాలులు వీచెను. వానినేమాత్రము లెక్కచేయక కుంభకర్ణుడు కాలునిచే ప్రేరేరింపబడినవాడై యుద్ధమునకు వెడలెను.

★★★

# అరువది యారవ సర్గము

చెంగున అతడు ప్రాకారమును పాదములతో దాటి మేఘ సమూహమువలె గనిపించు వానర సైన్యమును క్రోధముతో జూచెను. అట్లు వచ్చిన కుంభకర్ణుని జూచి వానరసైన్యములు చెల్లాచెదరై గాలిచే నెగురగొట్టబడిన మేఘ సమూహములవలె పాడై పరుగులు పెట్టినవి. ఈ విధముగా అధికమైన భీతితో పరువెత్తు వానరనాధులను జూచి ఆనంద సముద్రములో మునిగి అతడు పెద్ద మేఘమువలె గర్జనలు చేసెను. అట్లు బొబ్బలు పెట్టిన ఆ పెద్ద ధ్వనిచే భీతిజెంది తడబడి వానరవీరులు వేళ్లు తెగిన వృక్షముల వలె నేలబడిరి. వారిని జూచి కుంభకర్ణుడు విడువక చెలరేగి చేతపరిఘమును ధరించి శత్రుభయంకరుడగుచు వారిపైకి వెళ్లెను.

**కుంభకర్ణుని చూచి పరువిడు కోతులకు అంగదుడు ధైర్యము చెప్పుట:**

వరుణుడుగాని, యముడుగాని, యింద్రుడుగాని, యుద్ధమందు సంహరించుటకు వీలుకాని గొప్పబలవంతుడు, విరోధులకు భయము కలిగించు కన్నులు గలవాడు, కంఠధ్వనిచే పర్వతములను భేదింపగలవాడు, పిడుగులను వర్షించువాడు అయిన కుంభకర్ణుని జూచి కోతిమూకలు వికావికలై గాలిచే ఎగురగొట్టబడిన పాదరసమువలె పారిపోయెను.అంతనీలుని,గవాక్షుని,నలుని,కుముదుని ఇంద్రుని మనుమడైన అంగదుడు సమీపించి యిట్లనెను. గొప్ప శౌర్యము గలవారు మీరు. మీరలే యిట్లు పారిపోయెదరేల? మీ వంశ శౌర్యములను మనస్సులలో మరచిపోయితిరా? ఓ వానరవీరులారా! ఈ భయమునెప్పుడు నేర్చుకొంటిరి? సాధారణులైన వానరులవలె మీరును ఈ విధముగా పారిపోవుదురా? ప్రాణభయముచేత పారిపోయినను, వెళ్లిన చోట మృత్యువు కన్నుగప్పుట శక్యమా? నిండైన కీర్తితో మరణించుటో, నింద్యమైన మరణమునొందుటో ఏది మేలో ఆలోచింపుడు. అక్కటకటా! ప్రాణములు రక్షించుకొనలేరా? రాక్షసులు భయము కలిగించుటకు ఈ వెఱబొమ్మను దెచ్చిరి. ఇది యుద్ధము చేయలేదు. ఈ మోసమును మీరు గుర్తించి దీనిని పడగొట్టిన తీరిపోవును గదా. వానరులారా! ఇటురండు. మరలుడు. వీనిని చంపివేయుదము. నిత్యమైన కీర్తితో ప్రకాశింతుము.

## వానరులు కుంభకర్ణునితో యుద్ధముచేసి ఓడి పారిపోవుట:

అని అంగదుడు పలుకగా వారు ధైర్యమును పొంది మిక్కిలి క్రోధము గలవారై చెట్లతో ఆ రాక్షస శ్రేష్ఠుని మదించిన ఎనుగుల వలె మోదిరి. వానురందరును పెద్ద పెద్ద కొండ శిఖరములను, చెట్ల గుంపులను చెలరేగి వేయగా అత్యధికమైన మదముగల కుంభకర్ణుడు కంపింపడయ్యెను. ఆ రాక్షసుని తాకిన ఆ కొండలు చెట్లు వేల ముక్కలయి నేలబడెను. తీవ్రమైన బలము గల అతడు క్రోధమునందినవాడై దావాగ్నివలె భుజ పరాక్రమము మెరయగా శత్రువుల గర్వమునణచి చెల్లా చెదురగునట్లు కూల్చెను. నెత్తురులు కారుచున్న శరీరములు గలవారై కొందరు వానరులు తెగిపడిన ఎఱ్ఱని పుష్పములు గల వృక్షములవలె నేలగూలిరి. మనస్సులందు కలిగిన భయముతో కొందరు వానరులు ఏదారి దొరికిన అదే దారిగా వెనుదిరిగి చూడకుండ గంతులు వేయుచు పారిపోయిరి. కొందరు వానరులు భయముతో కడువేగముగా సముద్రములో ప్రవేశించిరి. సేతువు దాటి వచ్చుచున్న వానరులు భయముతో మధ్యదారిలోనే మిట్టల మాటున దాగిరి. కొన్నియెలుగుబంట్లు చెట్లెక్కినవి. కొన్ని భయముతో కొండలపై కెగబ్రాకెను. కొన్ని గుహలలో, దూరంగా కొన్ని నీళ్లలో మునిగెను. దిక్కు తెలియక తికమకబడి దీనమైన ముఖములతో కొన్ని ఎలుగుబంట్లు కోతులు నేలపై కూలబడెను. ఈవిధముగా పారిపోవుచున్న వానరవీరులకు వాలిపుత్రుడు వేగముగా అడ్డము వచ్చి వారించి వారిని పురికొలుపుచు పెద్ద కంఠధ్వనితో అందరితో ఇట్లనెను.

## అంగదుడు కపులకు భయము బాపి వెనుద్రిప్పుట:

వానర శ్రేష్ఠులారా! వెళ్ళకుడు. నిలువుడు. ధైర్యముతో తిరిగి యుద్ధమునకు రండు. మిక్కిలి భయముతో పరవీరులు నవ్వగా పారిపోయినచో ఈ లోకము నందిసుమంతయైనను సుఖముగాని కీర్తిగాని లేదు సుమా. అభిమానము వీడి యిట్లు పారిపోవుటకు ప్రాణము లంత యెక్కువా? ఆయుధములను వీడి మగతనము నశింపగా పారిపోయి మీ యిండ్లు చేరగా మీ స్త్రీలే మిమ్ము చూచి నవ్వరా? మగవారికి ఇంతకంటె మరణము వేరే యున్నదా? అక్కటా! అందరును ప్రఖ్యాతిగలిగిన కులమును బుట్టితిరి. బక్క కోతులవలె దిగజారి పారిపోదురా? భయమునిట్లు కీర్తిని పౌరుషమును మీరు తేలికచేసి పారిపోవుటచే మీరలు అనార్యులు కారా? మునుపు నిండు సభయందు

చెప్పిన ప్రజ్ఞలు మాటలు తలచుకొనుడు. భయమును వదలుడు. అభిమానమును వదలి జీవించియున్నచో వీడు పిరికిపందయని జనులు పిలుతురు. హేయమైన బ్రతుకెందులకు? ధీరులైన సాధుజనులు వెళ్లెడి మార్గమున వెళ్లుడు. వానరులారా! యితడు కొట్టినచో కొనయూపిరులతో భూమిపై పడియుందము. ఇతడు చంపినచో ఎవ్వరికిని పొందుటకు శక్యముగాని బ్రహ్మలోకమున సౌఖ్యములను పొందవచ్చును. సాహసముతో వీనిని చంపితిమా అసాధారణమైన శాశ్వత కీర్తిని పొంది బ్రతుకవచ్చును. కాదేని ప్రాణములను వెల యిచ్చి వీర స్వర్గమును కొని ప్రకాశింపరాదా? రామచంద్రప్రభువు చూచువరకే వీని ప్రతాపము రాముని బారిన బడినచో ఈ రాక్షసుడు నిప్పులోని కురుకు మిడుత వలె మాడి పోవడా? ధైర్యమును వహింపుడు. తిరిగిరండు. ఒకనిని మించి యింకొకడు తికమకపడి ప్రాణరక్షణకై దీనులవలె పిక్కబలము చూపినచో కీర్తి కలుగునా? ఒక్కని కోడిపోయి వానరశ్రేష్ఠుల సైన్యమంతయు పారిపోయెననెడునింద నక్షత్రములు, చంద్రసూర్యులు భూమండలము ఉన్నంతవరకు నిలిచిపోదా? అని చెప్పుచుండగా భయంకరమైన కన్నులుగలవాడై వచ్చుచున్న కుంభకర్ణుని దెస చూచుచు వానరులు చెదరి పరువెత్తుచు భయముతో కలతచెందిన మనస్సులు గలవారై ఆ తారాపుత్రునితో నిట్లనిరి. క్రూరుడైన ఈ రాక్షసుడు బలముచే మమ్ము విరిగిన శరీరములు గలవారిగా జేసెను. వానితో యుద్ధము చేయుట కెవ్వడును సరిపోడు. ఇతర రాక్షసుల వంటి వాడు కాడు. ఊరక వీనిచే చచ్చినచో ఏమి ఫలము? పేరా? పెంపా? ఇంక ప్రతాపములు చాలును ప్రాణములు ఎవ్వరికైనను తీపియని వినలేదా అంగదా? అని పరువెత్తుచుండగా వారికి అడ్డము వచ్చి కారణములను చెప్పి ఓదార్పుమాటలతో వారి మనస్సులను చక్కజేయగా వారలు సంతసించినవారై వేగముగా మరలిరి. మైందుడు, ధూమ్రుడు, కుముదుడు, ఆంజనేయుడు, రంభుడు, గవాక్షుడు, పవసుడు, శరభుడు అమితబలులైన ఋషభుడు, నీలుడు, తారుడు, ద్వివిదుడు, సుషేణుడు తిరిగి యుద్ధమునకై యెదురుగా వెళ్లిరి.

★★★

# అరువది యేడవ సర్గము

## కుంభకర్ణుడు వానరసేనను హతము చేయుట:

అంగదుని మాటలను విని అందఱును ప్రాణములమీది ఆశను వీడి తమతమ బిరుదులు చెప్పుచు తమపేరులను చెప్పుచు యుద్ధము చేయదలచి విజృంభించి కొండలు, గుండ్లు, వృక్షములు పట్టుకొని ఘోరముగా కుంభకర్ణుని తాకగా అతడు కోపించి పెద్దగదను చేత బట్టి వారందరను బాది నాశనము చేసెను. ఒక్కదెబ్బకు నూరు వేలు, ఏడువేలు, ఎనిమిదివేలు కోతుల సైన్యములు నేలగూలెను. పదునాఱుగురిని, పదిమందిని, ఇరువది మందిని పట్టి ఒక్కమారుగనే మ్రింగసాగెను. గరుత్మంతుడు పాములను వలె బట్టి విదిలించి మ్రింగుచుండగా వానరులు విజృంభించుచు ఎట్టకేలకు గుంపులు గట్టి అతనితో యుద్ధము చేయసాగిరి.

## ద్వివిదుడు కుంభకర్ణునితో పోరుట:

అప్పుడు ద్వివిదుడు కోపముచే సుడివడుచున్న మనస్సుగలవాడై ఒక పర్వత శిఖరమును బట్టి గాలిచే ఎగురగొట్టబడిన మేఘము వలె వెళ్లి దానిని వానిమీద వేయగా అది రాక్షసనాథుని తాకకుండగనే నడుమనే సైన్యము మీద పడి గుఱ్ఱములు రథములు ఏనుగులు గల సైన్యములను రెప్పపాటుకాలములో నాశనము చేసెను. తిరిగి ద్వివిదుడు ఒక కొండను పట్టుకొని విపరీతమైన బలముతో వేగముగా విసరగా అదియును రాక్షససైన్యము మీద బడి ఏనుగులను గుఱ్ఱములను సంహరింపగా యుద్ధము భయంకరమయ్యెను. యుద్ధభూమి యంతయు రాక్షసుల రక్తములతో నిండెను. దానితో రాక్షసులు గొప్ప రోషమూర్తులై బలసంపదతో గూడిన బాహుబలములతో సూర్యసమాన కాంతితో మెరయు బాణసమూహములతో శరీరములను ఖండించుచు, శిరస్సులను నరకుచు, ఎదలు, నుదురులు పగులగొట్టుచు మాంసములను ముద్దలుగా జేయుచు నాభి, కటి ప్రదేశములు, పాదములు తెగరవేయుచు వానరసైన్యము చెండజొచ్చిరి. ధీరులు, భుజబలశాలురు అయిన వానరులు చెట్ల సమూహములతో విరోధి సైన్యములను, రథములను, ఏనుగులను, గుఱ్ఱములను విడువకుండ చంపి అలసిపోవునట్లు చేయుచుండగా

## హనుమంతుడు కుంభకర్ణునితో పోరుట:

హనుమంతుడు భయంకరమైన రూపముతో కొండలు, చెట్లు, బండలు అపరిమితమైన వేగముతో రాక్షసరాజు తలపై ధారావర్షము వలె నాకాశ మార్గమున సంచరించుచు వేయగా శూరుడైన కుంభకర్ణుడు వానినంతను తన శూలముతో ముక్కలుగా చేసెను. అతంటితో విడువక శౌర్యముతో వానరసేనలను పరుగులు పెట్టించి పెట్టించి శూలపుమొనతో చంపగా వాయుపుత్రుడును పెద్ద కొండ శిఖరమును చేతబట్టి ఆ రాక్షసుని ఎదుట అట్లే నిలబడి విసరి అతని మీద వేయగా వాడా శిఖరము దెబ్బకు గొప్ప బాధ జెంది నెత్తురుచే తడిసినవాడై బెదిరి కలతజెంది మెరుగులు జిమ్ముచున్న శూలమును పెద్ద కొండవలె నున్న దానిని వేసి కుమారస్వామి శక్త్యాయుధముతో క్రౌంచ పర్వతమును వలె ఆ వాయుపుత్రుని వక్షమును శత్రువులు భయమందునట్లు చీల్చెను. శూలము చేత కొట్టబడిన వక్షము గలవాడై నెత్తురులు చాల క్రక్కుచు నేల పడి ప్రళయకాల మేఘ గర్జలవంటి అరపులరచెను. ఆ హనుంతుని పాటును జూచి రాక్షసులు సంతోషించిరి. సింహనాదములొనరించిరి. వానర సంఘముల దీనత నొంది భయముతో పారిపోజొచ్చిరి. అట్లు పరువెత్తుచున్న వానర సైన్యములను ఆపి నీలుడు ఒక కొండ శిఖరమును వేగముతో కుంభకర్ణుని మీద బలముతో విసరగా రాక్షసుడు దానిని పిడికిటి పోటుతో దూరముగా పడవేయగా అది మంటలు మిణుగురులు వెలువడుచుండగా రాళ్లు గుండ్లు గా భూమిపై బడెను.

## శరభాదులు కుంభకర్ణునితో పోరుట:

సాహసవంతులలో శ్రేష్ఠులైన శరభుడు నీలుడు, గవాక్షుడు, గంధమాదనుడు, పరాక్రమవంతుడైన ఋషభుడు అను ఈ ఐదుగురును కొండల చేతను వృక్షముల చేతను, కళ్లతోను, పిడికిళ్లతోను, అరచేతుల తోను, నాలుగు దిక్కుల నుండి రోషముతో నొప్పుచుండగా ఆ దెబ్బలను ఈగ(వాలినట్లు కూడ రాక్షసనాధుడది లెక్కచేయక ఆ ఋషభుని ఒడిసి పట్టుకొని రెండుచేతులతో అదుమగా ఆ వానరుడు నెత్తురులు గ్రక్కుచు పడిపోయెను. గంధమాదనుని కాలితోను, ముష్టితో శరభుని మోకాలితో నీలుని ఆగ్రహముతో అరచేతితో గవాక్షుని కొట్టెను. ఇట్లు కొట్టబడినవారై ఆ వానరశ్రేష్ఠులు ముక్కుల నోళ్ల నెత్తురు లధికముగా గ్రక్కుచు నేలబడిరి. గొప్పవారైన వానరులు కూలుటను

చూచి వానరులు కోటిమందియును కుంభకర్ణుని దగ్గఱకు వెళ్లి కొండను ప్రాకినట్లు ప్రాకి కాట్లతోను, పోట్లతోను, వాడియైన గోళ్లతోను, కోఱలతోను చేతుల దెబ్బలతోను గొప్ప పరాక్రమముతో నొప్పి కలుగునట్లు కొట్టగా కుంభకర్ణుడును

## కుంభకర్ణుడు వానరులను మ్రింగుట:

చెట్లతో గూడిన పర్వతమువలె ప్రకాశించుచు వానరుల నందఱను తన చేతులతో బట్టి గరుత్మంతుడు సర్పములను వలె మ్రింగగా అట్లు మ్రింగబడిన ఆ వానరసంఘము పాతాళలోకము వలె నున్న వాని యుదరమందు ప్రవేశించియు తిరిగి వేగముగా ముక్కుల నుండి చెవుల నుండి ఏమియు అపాయము నొందక బైటకు వచ్చిరి. వాడును హా యని నోరు విప్పి గొప్ప ఆకలితో వరుసగా అచ్చటనున్న వానరుల నందఱను చిటికవేసినంతలో (తృటిలో) మ్రింగెను. వజ్రమును దాల్చిన యింద్రునివలెను పాశమును ధరించిన యమునివలెను రాక్షసుడు శూలమును చేతబట్టి వానర సైన్యములో తిరిగి తిరిగి ప్రళయాగ్నివలె నొప్పుచు సంహరింపగా భూమియంతయు నెత్తురులు మాంసములతో బురదగా మారెను. వేసవికాలమున ఎండిన వనములను అగ్ని దహించిన విధముగా అతడు వానరసేనలను కాల్చెను. వాని ధాటిని సహింపలేక వానర సమూహము వికృతధ్వనులతో రోదించెను. మిగిలిన వారందరు దుఃఖముచే కలతచెందినవారై రాముని శరణు జొచ్చిరి.

## అంగదుడు కుంభకర్ణునితో పోరుట:

అట్లు భంగము నొందిన వానరసేనలను జూచి వాలిపుత్రుడు కలతజెందక రొప్పుచు అతివేగముగా రాక్షస సమూహములకు భయము కలుగునట్లు ఒక కొండ శిఖరమును రాక్షసరాజు తలకు తగులునట్లు విసరగా దానిచే మిక్కిలి బాధనొంది అధికమైన కోపము కలవాడై అంగదుని ప్రతాపమును సహింపక విపరీతమైన వేగముతో వానరసంఘములు భయపడునట్లు గీరించుచు అత్యధిక ప్రకాశము గలిగి తీవ్రమైన శూలమును యుద్ధరహస్యము నెరిగినవాడై కడు నేర్పుతో ఆ వాలిపుత్రుని మీద గట్టిగా విసరివేసెను. శూరులలో శ్రేష్ఠుడైన అంగదుడు ఆ శూలమును తప్పించుకొని ఆగ్రహముతో భయంకరమైన అరచేతి దెబ్బతో కుంభకర్ణుని నొప్పింపగా సొమ్మసిల్లియు తెలివినొందినవాడై ఆ రాక్షసుడు తనయెడమ పిడికిలితో వాలిపుత్రుని బొడువగా అతడు మూర్ఛితుడై నేలబడెను.

## సుగ్రీవుడు కుంభకర్ణునితో పోరుట:

అట్లంగదుడు పడిపోగానే తన ఆయుధమును బట్టి కుంభకర్ణుడు సుగ్రీవుని మీద తలపడగా అతడు పర్వత శిఖరము నొకదానిని ఎత్తి పట్టుకొని రాక్షసరాజును సమీపించి వానరుల రక్తముచే తడిసిన శరీరము గలవాడును, ఎందరో వానరులను సంహరించినవాడును, భయంకరమైన రూపము గలవాడును అయిన అతనిని జూచి యిట్లనెను. ఓ రాక్షస శ్రేష్ఠుడా! వానరవీరులను సంహరించితివి. కష్టమైన పనిచేసి కోతుల గుంపులను భక్షించితివి. దీనివలన నీకు కీర్తి కలిగినది. ఇక ప్రాకృతములైన వానరుల మారణ కర్మను చాలించుట మేలు. ఇటు వచ్చి నా యీ కొండదెబ్బను ఓర్చుకొనుము. అని పలుకగా బలము ధైర్యముతో గూడిన వానరరాజు మాటలను విని కుంభకర్ణుడు బ్రహ్మదేవునకు మనుమడయ్యును, ఋక్షరజసుని పుత్రుడయ్యును ప్రఖ్యాతి గలిగిన బలముగల వాడయ్యును ఇట్లు ప్రేలెదవేల వానరా? అనగా సుగ్రీవుడు ఘనమైన ఆ పర్వత శిఖరముతో రాక్షసుని ఎద అదురునట్లు వేయగా అతని రొమ్మునకు తగిలినంతనే ముక్కలు ముక్కలైనపర్వతమునుజూచిరాక్షసులుదిక్కులుపిక్కటిల్లునట్లుసింహనాదములనుచేసిరి. వానరులందరు విచారించిరి. కుంభకర్ణుడును పర్వత శృంగముచే బాధింపబడినవాడై నోరంతయు తెరచినవాడై రోషముచే శరీరము తెలియనివాడై మెరయుచున్న మూడు మొనల ఆయుధమును (త్రిశూలమును) వానరులెల్లరు బెదురుచుండగా వానరముఖ్యునిపైకి విసరెను. బంగారపు పూతగలిగి నిప్పులు గ్రక్కుచు వచ్చుచున్న దానిని చూచి వాయుపుత్రుడు చివ్వున అడ్డము దూకి దానిని పట్టుకొని వేగముగా ఫళుక్కున విరుగునట్లు త్రుంచెను. అదిచూచి అధికమైన ఆనందముతో వానరులందఱు మదించి హనుమంతుని నెంతగానో పొగిడిరి. పెద్ద ఆకారము గలిగి వేయి బారువుల బరువు గలదైన కఠినమైన ఉక్కు శూలమును వీరుడైన హనుమంతుడు తన మోకాలున బెట్టి రెండుగావిరిచి చాల ఆనందించెను. ఆవిధముగా శూలము విరిగిపోగా వేగముగా లంక సమీపముననున్న మలయపర్వత శిఖరమును లాగి రాక్షసుడు సూర్యపుత్రుని సమీపించి గొప్ప బాహుశక్తితో కొట్టెను.

## మూర్ఛిల్లిన సుగ్రీవునెత్తుకొని కుంభకర్ణుడు లంకకేగుట:

పర్వత శిఖరపు దెబ్బచేత సుగ్రీవుడు తెలివితప్పినవాడై కష్టదశనొంది నేలగూలెను. ఆశ్చర్యకరమైన ఘోరమైన పరాక్రమము గలిగిన సుగ్రీవుడిట్లు తెలివిదప్పి నేలబడగనే

రాక్షసులు ఘోరమైన విధముగా గర్జనలు నిండించిరి. కుంభకర్ణుడు వానివద్దకు వెళ్లి పట్టుకొని యెత్తుకొని మేఘమును వాయువు కొనిపోవు విధముగా తీసుకొనిపోవుచు, రాక్షసుల స్తోత్రముల ధ్వనులను, విస్మయముతో దేవతలు చేయు కలకలమును వినుచు గొప్ప శృంగముతో గూడిన మేరుపర్వతము వలె భయంకరముగా లంకలో ప్రవేశించెను. ఈ విధముగా వెళ్లుచు కుంభకర్ణుడు తనలో వానరరాజు చిక్కెను గాన తక్కిన రాముని బలము కూడ చిక్కినట్లే. అని అనేక విధములుగా తలంచుచు త్వర త్వరగా వెళ్లుచుండెను. సుగ్రీవుడు రాక్షసునకు చిక్కుటను, సైన్యము బెదిరి పారిపోవుటను జూచి హనుమంతుడు మనస్సులో దీనికిప్పుడేమి చేయవచ్చును? దీనికి ప్రతిక్రియను న్యాయమార్గము తప్పకుండ ఏదైనను చేసెదను. పర్వత సమానాకారుడనై ఆ రాక్షసరాజును మర్దింతునా? వీనిని చంపినచో వానరరాజు విడువబడును. వానరులందరును సంతోషపడుదురు. కాని నేను పరాక్రమము జూపుటకేల ప్రారంభింపవలెను? వానరరాజు సామాన్యుడా? దేవతలు పట్టినను శౌర్యము ప్రకాశింపజేసి తానే విడిపించుకొని వచ్చెడి బలము గలవాడు. ఈ విధముగా చిక్కియుండుటకు కారణము కొండదెబ్బచేత తెలివిని కోల్పోయి యుండుట కావచ్చును. గాలి వీచుటచే తెలివి నందినవాడై తనకును వానర సమూహమునకును మేలు చేయుగాక. ఒకవేళ నేను బలముతో రాజును విడిపించినచో ఆ మహాత్మునకు భూమియందు శాశ్వతముగా గొప్పకీర్తి నశించుటయు, కష్టమును, అసంతోషమును కలుగును. కాన ఒక ముహూర్తకాలము ఓర్చుకొని యుండి ఈ వానరుల నివ్వెరపాటును దొలగించి సముదాయించెదను. ఒక్కచోటికి చేర్చెదను అని ఆలోచించుచు చెదిరిపోయిన వానర సంఘములను వేగముగా గూర్చుచుండగా కుంభకర్ణుడును సుగ్రీవుని తీసుకొని లంకలోని రాజమార్గమున వేగముగా వెళ్లుచుండగా అంతలో

## సుగ్రీవుడు కుంభకర్ణుని ముక్కు చెవులు గొరికి శ్రీరామునివద్దకు వచ్చుట:

ఇరుప్రక్కలనున్న ఇండ్ల గోపురములు విమానములపై అంతస్తుల నున్నవారలై ప్రజలు లాజలు, గంధములు గలిపిన జలములు మీద పడుటచే మెల్లమెల్లగా తడియుట చేతను, రాజమార్గము చల్లదనము చేతను ఎట్టకేలకు మూర్ఛనుండి తేరి తెలివినందినవాడై రాజవీధిలో వెళ్లుచుండుటను తెలిసికొని ఇప్పుడు దీనికి ప్రతిక్రియ యేమి చేయుదును? వానరులకు హితమును ఇష్టమునైన కార్యమునిప్పుడు చేయుదును గాక అని ఆలోచించి ఆ రాక్షసుని చంకనుండి జారి వేగముగా అంతలోనే పైకెగసి చివాలున ముక్కును కొరికి

గోళ్లతో చెవులను పెరికెను. ఆ రాక్షసరాజు చెవులును ముక్కును పోగా శరీరము రక్తముతో తడిసిపోగా రోషముతో శరీరము తెలియనివాడై సుగ్రీవుని గట్టిగా పట్టుకొని ఎత్తి నలిపి నేలపైకి వేగముగా కొట్టెను. ఈవిధముగా నలపబడిన వాడైనను రాక్షసుల మర్దింపబడినను వానరరాజు లాఘవముతో ఆకాశమునకెగిరి రామచంద్రుని సమీపమున నిల్చెను. అక్కడ స్రవించుచున్న రక్తము శరీరమును తుడుపుచుండగా సెలయేళ్లతో ప్రకాశించెడి కొండవలె యెఱ్ఱని కాంతి గలవాడై

## కుంభకర్ణుడు మత్తుడై వానరాదులను మ్రింగుట:

అమితమైన రోషముతో రాక్షసుడు సంధ్యతో గూడిన నీలమేఘము వలె మెరయుచు తిరిగి యుద్ధభూమికెదురై అసహనముతో రక్తములు స్రవింపగా వెడలుచు చేతిలో ఆయుధము లేకుండుటచే రౌద్రము క్రూరమునైన ముద్గరమును బట్టి విరోధులను చెండెను. మత్తుతో గూడిన మనస్సు గలవాడును, రక్తమాంసముల నాస్వాదించు నిచ్ఛగల వాడును అయి శరీరము తెలియనివాడై వీరు వారు అనక రాక్షస ముఖ్యులను వానరముఖ్యులను లయకాలమునందు మృత్యువు వలె మ్రింగసాగెను. ఒక్కచేతితో దొరికిన యిద్దరిని ముగ్గురుని అనేకులను నోటియందు గూరుకొనుచుండెను.

## శ్రీరాముడు కుంభకర్ణునితో యుద్ధము చేయుట:

తన చుట్టును కోతులు పెద్దపెద్ద చెట్లను లాగి కొట్టి బాధించుచున్నను లెక్కచేయక పెదవుల చివఅల నుండి నెత్తురు మాంసము ప్రవహించుచుండగా ఏడుగురిని ఎనమండుగురిని నూరుగురిని పాతాళబలము వంటి తన యుదరమున బడమ్రింగుచు ఇష్టము వచ్చిన విధముగా తిరుగుచుండగా వానరులు రామచంద్రుని దగ్గఅకు వెళ్లి శరణువేడిరి. అదిచూచి లక్ష్మణుడు అధికమైన కోపముతో ఏడు క్రూరమైన బాణములతో కుంభకర్ణుని గొట్టగా అతడు లక్ష్మణుని వంకజూడక రాముడున్న చోటునకు పరువెత్తెను. అతనిని చూచి రాముడు రౌద్రబాణమును వింట సంధించి అతని విశాలమైన యురమును దాకునట్లు విడువగా వాడా దెబ్బచే అదరి నిప్పుకణికలతో గూడిన అగ్నిజ్వాలలు నోటినుండి అధికముగా వెడలుచుండ భయంకర ధ్వనులను ఆకాశము పగులునట్లు నిండించి వానరులవంక తిరిగి పరాక్రమముతో వారిని తరిమెను. నెమలి యీకలు గల రాఘవుని కఠినమైన బాణములు గాఢముగా అతని రొమ్మున నాటగా చేత ధరించిన

ఆయుధములన్నియు తమంతట తామే జారి నేలమీద పడగనే రాక్షసుడు కాళ్లచేతను, చేతుల చేతను గొప్పయుద్ధమును చేయుచు రక్తమయమైన శరీరముతో రాక్షసులను కోతులను మ్రింగుచు యమునితో సమానుడై తిరుగుచు ఒక పర్వతశిఖరమును దెచ్చి సీతానాధునిపై వేయగా మధ్యనే ఏడు బాణములతో త్రుంచి దాని శకలములు నేలబడినచో రెండు వందల వానరులు చత్తురని వేగము గలవాడై రాముడు దానిని బాణ సమూహములచే చూర్ణము చేసెను. ఈలోగా అతనిని చంప దలచుచున్న రామసోదరుడగు లక్ష్మణుడు అన్నా తమవారిని, శత్రువులను మ్రింగివేయుచున్నాడు చూచితివా? వీడు రాక్షసుడు వీడు వానరుడు తెలియలేకున్నాడు. రక్తవాసనచే మదించియున్నాడు. కాన వానరకోటులు వానిపై నెక్కిరేని గొప్పబరువుచే పీడింపబడినవాడై ఆ దుర్మార్గుడు నలిగి ఆ కోతులను చంపనేరడని పలుకగా విని వానర సంఘములు రాక్షసునిపై నెక్కెను. మదించిన గజేంద్రము మావటివానిని క్రింద బడద్రోయుటకై శరీరమున విదిల్చినట్లు ఆ గొప్ప బలవంతుడు తన అవయవములను విదిల్పగా వానరు లెల్ల క్రిందబడిరి. రామచంద్రుడది జూచి ఆహా వీడెంతటి దురాత్ముడు అని తలచి తీవ్రమైన విల్లు చేత ధరించిన రాముడు వెనువెంటనే వాని భయముతో బాధనొందుచున్న వానరులందఱు సంతోషపడునట్లు రోషమను అగ్నిచే ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై ఆ రాక్షసుని తన చూపుల చేతనే కాల్చివేయునట్లు అదలించుచు రాక్షసులెల్ల భయపడునట్లు భయంకరమైన వింటి నారి మ్రోతతో దిక్కులను నిండించుచున్నవాడై అడ్డగించెను. రక్తమును గ్రక్కుచు నాలుకతో నాకుచు వెదకి కోతులను అధికముగా మ్రింగి వేయుచు ఘోరమైన రూపముతో ప్రళయకాల యముని గేలి చేయునట్లున్నవాడును ప్రకాశించుచున్న బాహుపురులు గలవాడును అగు రాక్షసుని రాముడు సమీపించునట్లు వెళ్లగా వాడును రోషముతో వెలుగుచున్నవాడై.

## శ్రీరామకుంభకర్ణుల సంవాదము:

కుంభకర్ణుడు దగ్గరకు రాగానే రామచంద్రుడతనితో నిట్లనెను. ఓ రాక్షసేంద్రా! రా రమ్ము. విషాదమును పొందకుము. నేను రాముడను. విల్లును బట్టుకొని సిద్ధముగా నున్నాడను. ఇంక ఎక్కడకు పారిపోయెదవు. ఒక నిమిషములో నీ ప్రతాపమును పోగొట్టి యమునకు విందుచేసెదను. నా మాట నమ్ముము. అని పలుకగా అతడే రాముడని తెలుసుకొని రాక్షసుడు వికృతమైన నవ్వుతో వానరులు గుండెలు పగులునట్లు మేఘ గర్జనవంటి ధ్వనితో రామచంద్రునితో నిట్లనెను. రామా! నేను విరాధుడను గాదు సుమా.

కబంధుడను గాను, వాలిని కాను, ఖరుడను కాను. వినుము ఆ తాటకపుత్రుడైన మారీచుడను గాను దానవులను దేవతల సమూహములను సంహరించుటకు కారణమైనదియు, తీవ్రమైన యగ్నివంటిదియుయైన ముద్గరముచే లభించిన కీర్తిగలవాడనైన కుంభకర్ణుడను. రామచంద్రా! నన్ను జూచి చెవులు ముక్కు లేవని నవ్వకుము. అవి తెగినను బాధ వీసమంతైనను లేదు. నీయొక్క బలమును శౌర్యమును నేను చూచి, మరియు నా అత్యధిక పరాక్రమమును సార్థకముగా నీకు జూపి వేగముతో నిన్ను మ్రింగెదను. గొప్పదనముతో ప్రకాశించెదను. అని కుంభకర్ణుడు పల్కగా రాముడు వాడిగా నున్న వజ్ర సమాన కాఠిన్యము గల బాణములను ప్రయోగించెను. వాని వలన అతడేమాత్రము చలింపకుండుట చూచి సప్తసాలవృక్షములను, వాలిని ద్రుంచిన బాణముల [ఒకటి సాలవృక్షములను ద్రుంచిన బాణమొకటి వాలిని ద్రుంచినదొకటి] కొట్టగా ఆ రెండు బాణములును కొంచెమైనను బాధింపవయ్యెను. ఆ రాక్షసుడును రాముడు కురిపించుచున్న బాణవర్షమును మేఘము నుండి కురియు జలవర్షమును వలె గ్రహించి ఆ బాణముల వేగమును తన ముద్గరము వేగముచే వారించుచు వానరుల సమూహమును ఆ ముద్గరాయుధపు గాలిచే తరిమివేసెను.

## శ్రీరాముడు కుంభకర్ణుని కాలుసేతులు నరకుట:

ఈ రాక్షసుడూరకే పోయెడివాడు గాడని తలంచి వాయవ్యాస్త్రమును సంధించి పద్మములవంటి నేత్రములు గలవాడగు రామచంద్రుడు ముద్గరముతో గూడిన అతని చేతిని నరికి నేలబడజేయగా ఆ రాక్షసశ్రేష్ఠుడు యుద్ధరంగము దద్దరిల్లునట్లు అరచెను. అట్లు బాణముచే నరుకబడిన వాని చేయి వానరసంఘమును హతమొనర్చుచు నేలబడగా చావగా మిగిలిన వానరులందఱు దూరదూరముగా పరువెత్తి విచారముతో నున్న మనస్సులతో కంపించుచున్న శరీరములతో గుండెలు దిగ్గు దిగ్గుమనగా ఎంతయో భయము పొందినవారై రామ కుంభకర్ణుల యుద్ధమును చూచుచుండిరి. అంత కుంభకర్ణుడు ఒక్క చెయ్యి తెగియును, రెండవచేతితో ఆ సమీపమున నున్న చెట్టును పీకి రాముని కొట్టవచ్చుచుండగా భయంకరమైన ఐంద్రబాణమున రాముడు వృక్షముతో నున్న హస్తమును గురితప్పకుండ నరుకగా చెట్టుతో సహా ఆ హస్తము నేలబడెను. అట్లు తెగి పడిన చేయి దొర్లుచు దొర్లుచు శిలలను భూమిపై బడునట్లును, వానరులను చచ్చునట్లును చెట్లను విరుగునట్లును మోదెను. పర్వతసమానుడైన రాక్షసుడు కోపముతో సుడివడుచు రెండు చేతులు లేకున్నను మిక్కిలి భయంకరములైన గర్జనలతో వేగముగా వచ్చుటను జూచి

రాముడు రెండు అర్ధచంద్రాకార బాణములతో అతని పాదములను నరికెను. దిక్కులందు విదిక్కులందు రాక్షసుల సమూహమందు పర్వతములందు, సముద్రమునందు గుహలందు ఒక్కమారుగా ప్రతిధ్వనులు పుట్టగా ఆ కాళ్లు రెండును తెగి నేలపై పడెను. ఆ రాక్షసుడు రెండు చేతులును రెండుకాళ్లను తెగినవాడయ్యును హాయని గుహవంటి నోటిని దెరచి అరచుచు చంద్రుని మ్రింగుటకు వచ్చు రాహువువలె రాముని చేరవచ్చెను. తెరిచిన ఆ నోటియందు రాజశ్రేష్ఠుడైన రాముడు బంగారు మొనలు గల్గి ప్రకాశించుచు తీవ్రమైన బాణముల గుంపును వేగముగా నింపెను. నోటిలో బాణములు గ్రుచ్చుకొనగా క్రూరాత్ముడు మాటాడలేక పెద్దగా కూతబెట్టి స్మృతి తప్పి దిమ్మెరపోగా

## శ్రీరాముడు కుంభకర్ణుని శిరంబును దెగవ్రేయుట:

వెలుగుచున్న సూర్యునితో సమానమై, వాడియై, ప్రళయకాలుని వంటిదై దుష్టులకు భయంకరమై బ్రహ్మదండ సదృశమై బంగారు మొన గలదై ఇంద్రుని వజ్రాయుధముతోను, వాయువుతోను సమానమైన వేగము గలదై ప్రకాశించు అగ్నిజ్వాలగలదై యొప్పు ఐంద్రాస్త్రమును సంధించి శ్రీరాముడు చెవి వరకు లాగి దశదిక్కులు దాని ధ్వని నిండునట్లుగా వేగముగా రాక్షసునిపై విడువగా ఆ భయంకరాస్త్రము పొగలచే ఆవరింపబడిన అగ్నివలె నొప్పుచు తన కాంతులతో దిక్కులు భూమి పర్వతముల సమూహములను ప్రకాశింపజేయుచు పిడుగువలె వెళ్లి భయంకరమై గొప్ప పర్వత శిఖరమువంటిదియు కదులుచున్న అందమైన బంగారు కుండలములు గలదియు వికృతములైన కోరలు గలదియు అగు ఆ రాక్షసుని శిరస్సును మహాఘోరముగా ఖండింపగా అట్లే పైకెగిరి కుండలములతో ప్రకాశించు ఆ శిరస్సు అందమైన పునర్వసు నక్షత్రముల జంట మధ్యన రాత్రివేళ ప్రకాశించు చంద్రుని వలె నొప్పుచు దబ్బున నేలపై బడుచు ఆ పట్టణమునందలి గోపురములను విశాలమైన గృహములను, ఎత్తుగా నున్న ప్రాకారములను పాడొనరించెను. గొప్పధ్వనితో కోటి వానరులను హతమార్చుచు నీరుపై కెగురునట్లు అందలి సర్పసమూహములను మొసళ్లను చేపలను నశించునట్లు ఆ రాక్షసుని కళేబరము సముద్రములో బడెను. దేవతలకు బ్రాహ్మణులకు విరోధియైన కుంభకర్ణుడీవిధముగా రణరంగమున చంపబడగా భూమండలమంతయు వణకెను. దేవతలు సంతోషముతో చేయు ధ్వనులతో ఆకాశమంతయు నిండిపోయెను. రాముని పరాక్రమమును జూచి దేవర్షులు సర్ప సమూహములు సురలు, ఋషులు, యక్షులు,

ఆకాశచారులగు ప్రాణి సమూహములన్నియు ఆనందించెను. యుద్ధరంగమున దేవతావిరోధులకు రాక్షసులు శ్రీమహావిష్ణువును జూచినట్లు శ్రీరాముని జూచి రాహువుచే విడువబడిన సూర్యుడు దేవలోకపు జీకట్లను పోగొట్టి ప్రకాశించిన విధముగా యుద్ధమున కుంభకర్ణుని సంహరించి వానరుల నడుమ రామచంద్రుడు ప్రకాశించెను. భయంకరమైన బలము గలవాడును సమీపించుటకు శక్యముకాని వాడును భయంకరమైన శరీరము గలవాడును అగు కుంభకర్ణుని అణచుటకు శక్యముగాని బలముతో సంహరింపగా రామచంద్రుని వానరసమూహము వికసించిన పద్మములవంటి ముఖములు గలదై అధికమైన సంతోషముతో స్తోత్రములు చేయగా వృత్రాసురుని జంపిన యింద్రునివలె రాముడు సంతోషము పొందెను.

★★★



# అరువది యెనిమిదవ సర్గము

## హతశేషులు రావణునకు కుంభకర్ణుని మరణమును దెల్పుట:

యోధులలో శ్రేష్ఠుడైన సీతానాధునిచే కుంభకర్ణుడు యుద్ధమున సంహరింప బడుటను రాక్షసరాజునకు రాక్షసశ్రేష్ఠులిట్లు చెప్పిరి. రాజేంద్రా! నీ సోదరుడు తన విరోధి సంఘములను భయ భ్రాంతులను చేసి అగ్నిహోత్రునితో సమానమైన ప్రతాపముతో ఎంతో పోరి వానరులను హింసించి ఆ జానకీదేవి వల్లభుని చేత యుద్ధములో ప్రతాపమారిపోయి మరణించెను. తెగగొట్టబడిన కంఠము, తొడలు, బాహువులు గలవాడై పొగడబడిన పరాక్రమముగలవాడగు కుంభకర్ణుడు నేలనిండుగా నెత్తురులు కారుచుండగా నేలగూలినాడు. రాక్షసరాజా! అతని సగము దేహము ద్వారమునందు పడి ఈ పట్టణము నడ్డగించెను. మొండెము సముద్రమునందలి జీవ జంతువులకు నాశనము చేయుచు భయంకరముగా సముద్రమున గూలెను. నీ తమ్ముడు సీతానాధుని వాడి బాణములచే పీడింపబడినవాడై అగ్నిచే తగులబెట్టబడిన పెను వృక్షము వంటివాడై ముద్దయై గుర్తింపరాని విధముగా నేలబడెను. అని చావగా మిగిలిన రాక్షసులు చెప్పగా రాక్షసరాజు కుంభకర్ణుడు యుద్ధమున మరణించుటను విని భరింపరాని గొప్ప ఆర్తిచే తపించుచు తనను మూర్ఛ హెచ్చుగా ముంపగా పడిపోయెను. యముని వంటివాడగు పినతండ్రి సంహరింపబడెనను దుఃఖవార్తను విని పరితాపుతో త్రిశిరుడు, అతికాయుడు, దేవాంతకుడు, నరాంతకుడు, ఎంతటి ధైర్యముగలవాడు, ఎంతటి బలశాలి యని తలంచుకొనుచు దుఃఖించిరి. రామరాజు చేత ఘోరమైన యుద్ధమునందు తమ సోదరుడు చచ్చెనను దారుణమైన వార్తను వినుటచే మహాపార్శ్వుడు దుఃఖించెను. హాయని మహోదరుడేడ్చెను. ఎట్టకేలకు రాక్షసరాజు తెలివినందినవాడై తన సోదరుని తలచి తలచి అతని శౌర్యమును, అతని ధైర్యగరిమను పరిపరివిధాల తలచుకొని తలచుకొని యేడ్చెను.

## కుంభకర్ణుని మరణమునకు రావణుడు దుఃఖించుట:

హా! కుంభకర్ణా! హా! రిపుదర్పఘ్నా! హా! వీరరత్నమా! హా! మహా బలవంతుడా! దైవ ప్రేరితుడవై వెళ్లిపోయితివా? తమ్ముడా! నీ అన్ననగు నన్ను విడిచి యమపురమునకు

వెళ్లితివా? బంధువుల యొక్కయు నాయొక్కయు బాధలను పోగొట్టకుండగనే నీవు ఒంటరిగా వెళ్లుట తగియున్నదా? ఓ తండ్రీ! ఓ గొప్ప శౌర్యవంతుడా! ఎవ్వని సహాయమును చూచుకొని ఇంద్రాదులకు కూడ భయపడక యుంటినో అట్టి నా కుడి భుజము పోగా ఇంక నేనేమి చేయుదును. బలము లేనివాడనైతిని. పూర్వము నాచే అపకారము పొందిన దేవతలు నన్ను జూచి నవ్వరా? యెందు బోదునయ్యా! అలవోకగా సురల దానవుల మదమణచిన వాడవు గదా. హా! ప్రళయకాల రుద్రునివంటి వాడవగు నీవు యుద్ధరంగమున రామునిచే మరణించితివా? ఏమిది? వజ్రాయుధుని మహా వజ్రాయుధము నిన్ను తాకగా నేమియు అలయని వాడవు. అట్టి మహిమగలవాడవు ఔరా! మనుష్య మాత్రుడగు ఆ రామరాజు వేసిన బాణముల కోర్వలేక బాధతో భూమిపై పెను నిద్దుర (మరణము) నందితివే. ఇట్టి చిత్రములుండునా. మునుల సమూహములు దేవతలగుంపులు యుద్ధమునందు నీవు సంహరింపబడుటను జూచి భయమును వదిలిన వారై గొప్ప సంతోషము గలవారై ఆకాశమునందు కలకలమని నవ్వుచు త్రుళ్లుచున్నారు. నిక్కముగా మేనులు మరచిన వారై వేగముగా ఈ నగరపు ద్వారములు వాకిండ్లను కోట గోడ నాల్గు దిక్కులందు ఎక్కుచున్నారు. ఇంక నాకు రాజ్యమెందులకు? ఇంక ఈ పట్టణమెందులకు? సీత ఏల? నాకింక ఈ బ్రతుకెందులకు? నా తమ్ముడు లేకున్నచో నేదీ నాకు రుచింపదు. దీనికి ప్రతిగా నా సోదరుని జంపిన ఆ రామచంద్రుని నేను వధింపకున్నచో ముమ్మాటికి చావే మేలు గదా. ఈ భూమిపై కొఱమాలిన ఈ బ్రతుకులెందుకు? నా సోదరుడున్న చోటునకే నేనును వెళ్లెదను. అతనిని విడిచి నేనొక్కక్షణమైనను శరీరమును నిలుపజాలను. ఇక అట్టివానిని ఈ జగత్తులో నేనెక్కడ జూడగలను. ఇంద్రుడు దండెత్తి వచ్చినచో అతని నేనెట్లు జయింపగల్గుదును? శ్రేష్ఠబుద్ధి గల ఆ విభీషణుని వాక్యము ఫలింపబోవుచున్నది గదా! అయ్యో! ఆలోచింపక తెలివి లేక గొప్పవాడైన ఆ విభీషణుని వాక్యమందనాదరము జూపితిని. తగిన ఫలము తప్పకుండ వచ్చినది. ఏమి చేయుదును? యుద్ధమందు కుంభకర్ణుడు, ప్రహస్తుడు మరణించిరన్న వార్తలను వినగానే మనస్సునందు ఆ విభీషణుడు పల్కిన మాటలు నిజమయ్యెను గదా. మిక్కిలి సిగ్గుగ నున్నది. మహాత్ముని, ధర్మరతుని నిరాదరణము చేసిన ఘనపాపమే అట్లు చేసినది. శోకమను పేరుతో కోయుచున్నది. అని యేడ్చుచు రావణుడు పలవరించెను. తమ్ముడాయనెను. కుంభకర్ణుడా! అనెను. అయ్యో! పోయితివా యనెను. ఇంక నాగతి ఏమో చెప్పుమా యనెను. సోలిపోవుచు నేలబడును. బాధనొందును. చెడితినే అని విలపించెను.

★★★

# అరువది తొమ్మిదవ సర్గము

## త్రిశిరుడు రావణునకు దుఃఖశాంతి చేయుట:

అని యిట్లేడ్చుచున్న రాక్షస రాజుతో త్రిశిరుడిట్లనెను. తండ్రీ! నీవు చెప్పినట్లు నీ తమ్ముడంత గొప్పవాడే. శత్రువులచే చంపబడెను. ఈ విధముగా చచ్చుట పరాక్రమవంతుల కందఱకు సహజమే కాని సజ్జనులు నీవలె యెచ్చటను హెచ్చుగా ఏడ్వరు. బేలవిధముగా ఏడ్చుట తగునా? మూడులోకములనైనను నీవు యుద్ధమునందు జయింపగల సమర్థుడవు. నీకు లేవా? బ్రహ్మచే ఈయబడిన బాణములు, విల్లు, శక్తి కవచము మేఘధ్వని వంటి ధ్వని గలదియు వేయిగాడిదలు పూన్చినదియునైన అమోఘరథము? కేవలము వట్టి చేతులతోడనే ఎన్నిమారులో దేవసంఘములను, దానవ సమూహములను సంహరింపలేదా? సమస్తమైన శ్రేష్ఠమైన ఆయుధములతో వెళ్లి సీతానాధుని నీ భుజబలముతో వధింపుము. ఇంతయేల? నీవు ఇష్టమువచ్చిన విధముగా సౌఖ్యముగా ఇచటనే యుండుము. నేనే పగ తీర్చెదను. మహాసర్పములను గరుత్మంతు సంహరించు విధముగా యుద్ధరంగమున నీ శత్రువులను చించి చెండాడెదను. బలారియగు ఇంద్రుడు శంబరాసురుని, విష్ణుమూర్తి నరకుని సంహరించినట్లు నేను దుర్భరములైన వాడి బాణముల వరుసలచే రామచంద్రుని సంహరించెదను అని పలికిన త్రిశిరుని మాటలను విని తేరికొని కాలునిచే ప్రేరేపింపబడినవాడై యిరువది భుజములు గల వాడగు రావణుడు మనస్సునందు తనను భూమియందు తిరిగి పుట్టినవానినిగా తలంచి సంతోషించి దుఃఖమును విడిచివేసెను. ఆ త్రిశిరుని మాటలచే తేరుకొని నిరాంతకుడు, అతికాయుడు, దేవాంతకుడు యుద్ధోత్సాహులగుచు ఒకరికంటే నొకరు ముందై గర్జనలు చేసిరి. ఆ రావణపుత్రులందఱును ఆకాశమార్గమున సంచరింపగలవారు, అందఱును మాయలలో మహాపండితులు. అందఱును దేవతల గర్వము చూచి నగగలవారు. అందఱును యుద్ధమున జయింప శక్యముగానివారు. అందఱును శౌర్యధైర్యములు గలవారు. అందఱును ప్రఖ్యాతి చెందిన కీర్తి గలవారలు. అందఱును యుద్ధక్రీడ యందోటమి లేనివారు. పలుమార్లు నాగసంఘములను పారద్రోలుచోటను, దేవతల

సమూహములను బాధించుచోటను, ఒక్కమారైనను వారు ఓడిపోయిరనుమాటయే లేనివీరులు. గొప్ప గౌరవమందిన బుద్ధి గలవారు. యుద్ధమందతి గర్వితులు. సాటిలేని పండితులు. వరములను పొందినవారు. సూర్యుని వంటి తేజస్సు గలవారు.

## దేవాంతక, నరాంతక, అతికాయ, త్రిశిరో, మత్త, యుద్ధోన్మత్తులను రావణుడు యుద్ధమునకు బనుచుట:

వారు తననుసేవించుచుండగా దేవతలచే సేవింపబడు ఇంద్రునివలె నుండి పుత్రులను ప్రేమ మీర బిగి కౌగిట జేర్చి భూషణములచే అలంకరింపజేసి అందఱకు మేలైన దీవన లిచ్చి సీతానాధునితోను, వానర సైన్యముతోను యుద్ధము చేయుటకు పంపెను. తన పుత్రులకు సహాయులుగా మత్తుడు, యుద్ధోన్మత్తుడు అను తన సోదరులను రాక్షస శ్రేష్ఠులను బంపెను. వారు రావణునకు వినయముతో మ్రొక్కి సర్వవిధములైన ఓషధులను, గంధమును ఆరుగురును వేరు వేరుగా అవయవములకు పూసికొని బాహుగర్వాంధులు యుద్ధకాంక్షతో అమితమైన వేగముతో దైవప్రేరితులై దేవాంతకుడు, త్రిశిరుడు, అతికాయుడు, నరాంతకుడు, మహోదర, మహాపార్శ్వులు వానర సమూహము మీదకు వెడలిరి. నల్లని మేఘము వంటిదియు ఐరావత వంశమునందు బుట్టినదియు, సుదర్శనమను పేరుగలదియు, సమస్తమైన ఆయుధములతో గూడినదియు, అమ్ములపొదులతో గూడినదియునైన ఏనుగును సూర్యుడస్తాద్రిని ఎక్కిన విధముగా ఆ మహోదరుడు శౌర్యము ప్రకటమగునట్లు ఎక్కెను. కుబేరుని వలె గద చేత ధరించి భయంకరమైన శరీరము గలవాడైన మహాపార్శ్వుడు మెరసెను. ఉత్తమజాతి గుఱ్ఱములు బూన్చినదియు, శ్రేష్ఠమైన ఆయుధములతో గూడినదియు, అయిన రథముపైనెక్కి మెరుపులు, ఉల్కలు గలదియు, ఇంద్రధనువుతో గూడినదియునైన మేఘములతో గూడిన పర్వతమోయనునట్లు పెద్ద భయంకరమైన విల్లు ధరించిన వాడై వేగముగా ఆ త్రిశిరుడు యుద్ధము చేయవలెనను ఉత్సాహముతో బయలుదేరెను. మూడు బంగారు శిఖరములు గలిగి ప్రకాశించు మంచుకొండవలె లోక భీకరుడైన ఆ త్రిశిరుడు మూడు కిరీటములతో మెరయు శిరస్సులతో రథముపై ప్రకాశించెను. విలుకాండ్రందరిలో శ్రేష్ఠమైన చరిత్ర గలవాడును, బంగారు కిరీటముతో ప్రకాశించువాడును, అయిన రాక్షస రాజపుత్రుడగు అతికాయుడు కిరణములతో ప్రకాశించు మేరుపర్వతమో అనునట్లు బంగారు ఆభరణములచే అలంకరింపబడినవాడై దృఢమైన బండి కండ్లు గలదియు, మిక్కిలి పొందిక గలదియు, మంచి కోడిపీట గలదియు మంచి నొగలు గలదియు, అమ్ముల పొదులు విండ్లు గలదియు

ప్రాసము, ఖడ్గము, పరిఘము మొదలైన ఆయుధములతో గూడినదియు అగు రథశ్రేష్ఠము నెక్కి తన ప్రక్కలందు రాక్షస సైన్యముల గుంపులు చేరి కొలువగా దేవతలతో గూడిన వజ్రహస్తుడైన యింద్రుని వలె తోచెను. తెల్లనిదియు, బంగారు ఆభరణములు గలదియు, ఉచ్చైశ్రవముతో పోటీ పడునదియు అధికమైన వేగము గలదియు, పెద్ద శరీరము గలదియు అయిన గుఱ్ఱముపై నరాంతకుడు ప్రకాశించెను. గొప్పశక్త్యాయుధమును ధరించిన కుమారస్వామివలె శ్రేష్ఠమైన ఉల్క వంటి ప్రాసమను ఆయుధమును ధరించి రావణ పుత్రుడు మెరసెను. వజ్రముల సమూహములచే అలంకరింపబడిన పరిఘాయుధము నొకదానిని చేత ధరించి పర్వతమును రెండుచేతులతో పట్టుకొన్న (సముద్రమున శయినించువాడగు) విష్ణుమూర్తిని హేళన చేయు చున్నట్లుండెను. దేవతలమరావతిని వీడి యుద్ధమునకు వెళ్లు విధముగా సైన్య సమూహముతో గూడినవారై రథములు, ఏనుగులు, గుఱ్ఱములు ఆయుధములను ధరించిన భటులు వెంటనంటిరాగా రావణుని పుత్రులు యుద్ధమునకు వెడలిరి. కిరీటము లందలి మణుల కాంతులు దిక్కులందు వ్యాపింపగా గ్రహముల గుంపువలె వెలుగుచు, చకచకమని వ్యాపించు కాంతులుగల పెద్దవైన శ్రేష్ఠమైన ఆయుధములు ఆకాశమున శరత్కాల మేఘముల వంటి హంసల సమూహముల వలె నుండగా మూర్ఖత్యముతో యుద్ధము నందు చావో గెలుపో ఒక్క మాటయే యదార్థమని తలంచుచు వగర్చుచు విరోధుల బలమును నిందించుచు గట్టిగా అరచుచు తీవ్రమైన ఆయుధములను త్రిప్పుచు గర్వము కన్నులను కప్పివేయగా యుద్ధకాంక్ష చిగురించుచుండగా బయలుదేరిరి. వారి యొక్క అరపుల ధ్వని చేతను, భుజములను చరుచుకొను ధ్వనులచేతను, వారిపాద ఘట్టనల చేతను గడగడమని భూమి వణకెను. ఆకాశము బ్రద్దలయ్యెను. ఈ విధముగా రాక్షసనాధులు ఉత్సాహముతో బయలుదేరి పెద్దవృక్షములను కొండలను చేతుల ధరించినదియు, యుద్ధమును కోరుచున్నదియు అయిన గొప్పవానర శ్రేష్ఠుల సైన్యమును చూచిరి. వానర నాధులును ఏనుగులు గుఱ్ఱములు రథములు గలిగి ఘణ ఘణ మని శబ్దించుచున్న రాక్షస సైన్యమును చూచిరి.

## వానర రాక్షస సేనల యుద్ధము:

నల్లని మేఘములవంటిదియు, ప్రకాశించుచున్న అగ్నిసూర్యులతో సమానమైనదియు, ఆయుధముల ఎత్తి పట్టుకొన్నదియు, రాక్షసేంద్రులచే రక్షింపబడినదియు అయిన రాక్షస సేనను వానరులు వృక్షములను కొండలను పైకి ఎత్తి గర్జనలు చేసిరి. అసూయతో, శత్రుసైన్యముల గొప్పనైన ఔద్ధత్యమును ఓర్వలేక రాక్షసులు అత్యధికమైన

రోషముతో ఆకాశము బ్రద్దలగునట్లు మదమెక్కిన మనస్సులు గలవారై ప్రతిధ్వనులు నింపగా వానరులును పర్వత శిఖరములను చేతుల ధరించి భయము లేనివారై సాహసించి శత్రు సైన్యమునందు ప్రవేశించి క్రోధము గలవారై కొందఱు ఆకాశము నందు, కొందఱు నేలపై, కొందరు వృక్షములు చేత బట్టినవారై కొందఱు కొండలను దాల్చినవారై కోయని అరచుచు కొండల బండలను వర్షించుచు విజృంభించి వెంటపడగా ఆ యుద్ధము చూపరులకు భయము కలిగించునదై ఎంతయో గొప్పగా నుండెను. దానికి భయపడక రాక్షసులు వాడిబాణముల గుంపులను నిరాటంకముగా గురియించి తాకెడు వారిని నిరోధింపగా వానరులు వెనుకంజ వేయక మేఘగర్జల వంటి గర్జనలు చేయుచు జయింప వలెనను తలంపు కలవారై బాహుబలముతో శత్రువులను సంహరించి వెలిగిరి. ఈ విధముగా నిర్భయముగా ఇరు సైన్యములు పరాక్రమించి, గర్జనలు చేయుచు సాహసించి యుద్ధక్రీడలలో తేలియాడుచుండగా వానరులును నిండైన బాహుబలముతో తమ బాహువులనెడు మేఘముల నుండి పుట్టిన కొండ శిఖరములను వృక్షములను వర్షము గురియించుచు శౌర్యమును ప్రదర్శించుచు ఏనుగులపై రథములపై గుఱ్ఱములపై ప్రకాశించుచున్న భూషణములు ధరించిన రాక్షసులపై దూకి వేగముగా గ్రుద్దగా, కొండలతో మొత్తంగా, కనుగ్రుడ్లు పెల్ల గిలగా గీయని కూతలు పెట్టుచు, నేల మీద ప్రాకుచు నేలపై దొర్లుచు రాక్షస సైన్యములు చావగా, శక్తిమంతులగు రాక్షసులు వేగముగా ముద్గరములు, శూలములు, ఖడ్గములు, శక్తులు మొదలగు ఆయుధముల గుంపులను చిమ్ముచు ఎముకలు విరుగునట్లు గుచ్చుచు గాయములందు నెత్తురులు గ్రమ్మునట్లు క్రుమ్ముచు గెలుపును గోరిన వారై అనేక విధములైన ఆయుధములతో క్రోధముతో వానరుల పొగరణచిరి. ఇరువర్గముల వారును ఈ విధముగా తీవ్రముగా పోరగా ఒక్క ముహూర్తకాలములో నెత్తురులు వరదలై పారగా నేలయంతయు కుంకుమ పరచిన విధముగా తోచెను. వానరులాక్రమించి వెన్ను నేలనంటు విధముగా నేలబడవైచి రొమ్ములందు పాదములుంచి చేతులనున్న సాధనములను లాగి వేయగా రాక్షసులును చేతులతోను, కాళ్లతోను, ఓపిక యున్నంత పోరుచు అభిమానముమీద దృష్టి నుంచి శౌర్యముతో వానరులను నొప్పించిరి. వానరులు, రాక్షసులును తమతమ యుద్ధ పాటవములను ప్రదర్శించి పోరాడుచుండగా పట్టుదలతో దగ్గరలో పోరుచున్న రాక్షసుని కాళ్లు పట్టి త్రిప్పుచు మరియొక రాక్షసుని కొట్టబోగా ఆ దుష్టుడును ఇంకొక వానరుని కాళ్లు పట్టుకొని వేరొక వానరుని కొట్టుచున్నాడు. వానరులు వేయు రాళ్లను రాక్షసులును, రాక్షసులు వేయు క్రూరమైన బాణపరంపరలను

వానరులును విడువక వారించుచు యుద్ధమున పరాక్రమముతో మెరసిరి. వానరుల దెబ్బలచే కూలి నేలబడిన రాక్షసుల మూకలు శరీరములందు ధరించిన కవచములు పగిలి ఆ సందుల నుండి రక్తము చెట్ల నుండి స్రవించు రసమువలె స్రవించెను. గొప్ప బలవంతులైన వానరులు ఏనుగుల నేనుగుల చేతను, గుఱ్ఱములను గుఱ్ఱములచేతను కొండల వంటి రథములను రథములచేతను కొట్టి నశింపజేయగా, గొప్ప కొమ్మలు గల వృక్షముల సమూహమును దాల్చి వానరులు రాక్షసులను నొప్పింపగా, రాక్షసులను వాడియైన బాణములతో, అర్ధచంద్రబాణములతో బల్లెములతో వృక్షములను వానరులను సంహరింపగా, వానరులను రెట్టించిన ఉత్సాహముతో భయంకరముగా అనేక విధములైన అస్త్రములను ధరించిన రాక్షసులను చెండాడిరి. మఱియు దేవతలు కొనియాడునట్లు వానర సమూహములు రాక్షసుల శవములచే యుద్ధరంగమును ఎటూ కదలరాకుండ చేసిరి.

## నరాంతకుడు కపులను దునుమాడుట:

అది గని నరాంతకుడు యముని వంటి ఆకారము గలవాడై మిక్కిలి వేగవంతమై వాయువుతో సమానవేగము గల గుఱ్ఱమునెక్కి శక్తి ఆయుధమును ధరించి వానర సైన్యములోనికి మత్స్యము సముద్రములో ప్రవేశించు విధముగా ప్రవేశించి పెద్దప్రాసముతో ఏడువందల వానరులను ఒక్క క్షణములో సంహరించెను. ఎచ్చట చూచిన తానే అయి విజృంభించి ఇష్టము వచ్చిన విధముగా విహరించుచున్న ఆ రావణపుత్రుని మార్గమంతయు వానర శవములతోను, మాంసము నెత్తురులతోను నిండెను. ఎవ్వడు నరాంతకు దలంచునో అంతలో ఆ వానరుని తలలు నేలబడుచుండెను. లాఘవముతో మీదకు దూకబోవునంతలో ఆ వానరుని దేహము పైభాగము తెగి మీద పడుచుండెను. తన వంక దృష్టిని త్రిప్పెడునంతలో ఆ వానరుడు యముని దృష్టిలో పడుచుండెను. ఈ విధముగా ఎదురులేక ప్రాసము చేత ధరించినవాడై శత్రువులకు భయము కలిగించువాడై నరాంతకుడు ఎండిన అడవులను దహించు అగ్నివలె వానరసైన్యముల శక్తి నణచెను. వర్షాకాలమున పెద్దగాలి నాలుగు ప్రక్కలనుండి విసరి విసరి వీచినట్లు రావణుని పుత్రుడు అన్ని ప్రక్కలకు తిరిగి తిరిగి వానరులను హతమొనర్చెను. వానరులు నిలబడలేరు. పరువెత్తలేరు. భయముచే ఇటునటు కూడ కదలలేరు. ఇట్టి దుస్థితిలో నరాంతకుడు యుద్ధరంగమున నిలిచిన వారును. ఎగిరి ఆకాశమున ప్రాకువారును, పరువెత్తువారును అగు శత్రువులను బలము దర్పము ప్రకాశితమగునట్లు కొలది సేపటిలో హరించెను.

పిడుగులు పడినవిధముగా పడుచున్న ప్రాసపు వ్రేటులను భరింపజాలక పెద్ద దుఃఖముతో భయముతో వానరులు ఒక్కమారుగా అరచిరి.

## అంగద నరాంతకుల యుద్ధము:

ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బలచే కొండలు పగిలినట్లు వానరులు కూలుటను జూచి ఇదివరకు కుంభకర్ణుని చేతి బలము జూచిన వానరనాధులు సుగ్రీవుని యొద్దనే సుఖముగా నుండిరి.

ఆ సూర్యపుత్రుడు వానరసేన చెదరి పరువెత్తుటను రాక్షసుడు విజృంభించుటను చూచి ఇంద్రునితో సమానమైన శౌర్యము ధైర్యము గల అంగదుని జూచి గుఱ్ఱము మీద నెక్కి అడ్డు లేకుండ వచ్చుచున్న రావణపుత్రుని జూపించి పుత్రా! అతడు మనసేనను క్షోభింప జేయుచున్నాడు వీరత్వముతో అతని వధింపుము. అని వానర రాజు చెప్పగా మబ్బులను చీల్చుకొని వచ్చు సూర్యుని వలె వానర సమూహముల నుండి తన బాహుపురుల కాంతులు ప్రకాశించుచుండ దాతువులతో ప్రకాశించు పర్వతమోయనునట్లు వచ్చి ఆ రావణ పుత్రుని పైకి ఆయుధలేమియు ధరింపక గోళ్లే ఆయుధములుగా గలవాడై వెడలెను. అట్లు వెడలి ఆ రాక్షసునితో ఇట్లనెను. ఓ రాక్షసశ్రేష్ఠుడా! ప్రాకృతులైన వానరుల గుంపులను చంపినంత మాత్రమున అదియొక బలమా? కీర్తియా? ఫలమా? ఏదీ? నీ అభిమాన పాత్రమయిన ప్రాసమును నా రొమ్మున వేయుము అనగా రాక్షసుడతనిని జూచి అత్యధికమైన రోషముచే దహింపబడిన మనస్సు గలవాడై పండ్లచే పెదవులను గొరుకుచు ముదముచే త్రాచు వలే రోజుచు ఆతారా తనయుని యెదపై గొప్ప బలముతో ప్రాసముతో గొట్టెను. ఆ ప్రాసము వాలిపుత్రుని వజ్రము వలె కఠినమైన పెద్ద రొమ్మును దాకి ముక్కలై చెదరి భూమిపై బడెను. దానిని జూచి వానర సింహము భయము లేక మీదకు దూకి గుఱ్ఱమును గ్రుద్దగా అది దవడలు పగిలి చిదిగిన కనుగ్రుడ్లు గలదై తెగిన నాలుకతో చిట్లిపోయిన తలగలదై కొండవలె నేల గూలెను. గుఱ్ఱము పడుట చూచి రాక్షసుడును క్రోధము నిండిన మనస్సుతో ఇంద్రుని మనుమని తలపై పిడికిటితో ఒక గ్రుద్దు గ్రుద్దెను. ఇట్లు ముష్టిచే పగిలిన మూర్ధము గలవాడై రక్తము హెచ్చుగా కన్నులు కనబడనట్లు కారుచుండెను. పెద్ద మూర్ఛనొందిన వానరుడు ఎంతయో కష్టము మీద తెలివినంది అధికమగుచున్న క్రోధముతో మండుచు రాక్షసుని యొక్క గొప్పశౌర్యమునకు మనస్సు ఆశ్చర్యమును పొందుచుండగా చివాలున లేచి కొండశిఖరము వంటి పిడికిలి బిగించి అంగదుడు ఆ రాక్షసుని రొమ్మునలుగ బొడిచెను.

రక్తము, కండలు, క్రొవ్వు, శరీరము నిండగా అతడు ఇంద్రుని వజ్రాయుధముచే కొట్టబడిన కొండ వలె తూలిపోయి దూరముగా నేలబడెను. వానర రాజపుత్రునిచే రాక్షసరాజ పుత్రుడిట్లు చచ్చుటను జూచి ఆనందముతో వానరులు చేసిన ధ్వనులును దుఃఖముతో రాక్షసులు చేసిన ధ్వనులును గలిసి ఆకాశమున వ్యాపించెను. దుష్కరమైన ఆకార్యమును జూచి తామరలవంటి కన్నులు గలవాడగు రాముడు అగ్నితేజుడయిన అంగదుని అధికమైన హర్షముతో మెచ్చి ఆదరించెను.

★★★



# డెబ్బదియవ సర్గము

## అంగదుడు దేవాంతక మహోదర త్రిశిరులతో పోరుట:

అట్లు నరాంతకుడు పడుట చూచి త్రిశురుడు, మహోదరుడు, దేవాంతకుడు దుఃఖించిరి. మేఘసదృశమైన ఏనుగునెక్క హెచ్చైన రోషముతో మహోదురుడును, పరిఘనుచేతబట్టి పెద్ద రథముల నెక్కి దేవాంతకుడును, త్రిశిరుడును ఒక్కమారుగా సాహసముతో వాలి పుత్రుని దాకి నొప్పింపగా ఆ అంగదుడొక చెట్టును దేవాంతకుని మీద వేయగా దానిని త్రిశిరుడు కోపముతో శ్రేష్ఠములయిన బాణములచేత విరుగగొట్టెను. అంగదుడు తిరిగి త్రిశిరునిపై వృక్షములను కొండలను వానగా గురియింపగా వానిని వారింపరాని బలముగలవాడైన త్రిశిరుడు త్రుంచివేసెను. అట్లు ముక్కలు చేసియును తృప్తి చెందక యుద్ధకుతూహలియై త్రిశిరుడు అంగదుని బాణములచే ముంచుచుండగా మహోదురుడును క్రోధముతో నిండిన మనస్సు గలవాడై తోమరముతో గొట్టెను. మూడవవాడు గుదియతో గట్టిగా గొట్టి వేగముగా దూరముగా తొలగిపోయెను. ఇట్లు ముగ్గురును తనను ముట్టడించినను వాలికుమారుడేమియును మనస్సునందు భయపడక బాధనొందక వేగము గలవాడై మహాబలముతో అఱచేతితో మహోదరుడెక్కిన ఆ యేనుగుతలపై గొట్టగా అది నేలపై ముగ్గి పడిపోవుచు, కనుగ్రుడ్లురాలిపోగా మిట్టి పాటుతో ఘీంకారము చేసెను. ఆ యేనుగు దంతమునే పెరికి వాలిపుత్రుడు దానిచే దేవాంతకుని మొత్తెను. వాడా దెబ్బచే గాలిచే దూలింపబడిన వృక్షమువలె ఒడలంతయయు వణకగా అధికముగా నెత్తురులు గ్రక్కుచు నేలబడి తానెంతయో బాధనొంది తేరుకొని వానరనాధపుత్రుని పరిఘాయుధముతో గొట్టెను. అట్లు దెబ్బతినియును శక్తితో లేచుచున్న అతని నొసట గాఢముగా నాటునట్లు త్రిశిరుడు నిరాఘాటముగా బాణసమూహమును వేసెను.

## హనుమంతునిచే దేవాంతుకుడు నీలునిచే మహోదరుడు చచ్చుట:

ఆ ముగ్గురు రాక్షసముఖ్యులు ఇట్లు అంగదకుమారుని తాకుట తెలిసికొని హనుమంతుడును నీలుడును అక్కడికి వచ్చిరి. అందునీలుడు ఒక కొండ శిఖరమును

త్రిశిరునిపై వేయగా దివ్యశరములచే వాడాకొండను భయంకరముగా పిండిచేసెను. సంతోషించి విజృంభించి దేవాంతకుడును పరిఘను చేతబట్టుకొని హనుమంతునిపై బడుటకు రాగా ఆ వానరశ్రేష్ఠుడు పిడుగువంటి తన పిడికిటితో వాని నడిశిరస్సుపై పొడిచెను. దానితో నతడు గట్టిగా అరచుచు దంతములు బయటకు రాగా నాలుక వ్రేలాడగా మెదడు చెదిరి పడగా చచ్చెను. దేవాంతకుడిట్లు దేవలోకము చేరగా త్రిశిరుడు నీలునిపై వాడి బాణమును గురియింపగా వేగముగా మహోదరుడును తీవ్రమైన బాణములచే అతని వక్షమును గొట్టెను. ఆ యిద్దరి బాణవర్షముచే సంధిబంధులు సడలగా సొమ్మసిల్లి తేరుకొని అవలీలగా లేచి చెట్లతో నిండిన యొక కొండను తీసికొని మహోదరునిపై వేయగా అతడు నేలబడెను. వజ్రముచే గొట్టబడిన కొండ విధముగా పినతండ్రియైన మహోదరుడు శవమైపడుటను చూచి త్రిశిరుడు అధికమైన గర్వముతో హనుమంతుని నిశితబాణముల గుంపులతో గప్పెను.

## హనుమంతునిచే త్రిశిరుడు చచ్చుట:

హనుమంతుడొక పర్వతశిఖరమును బట్టి త్రిశిరునిపై వేయగా ఆ రాక్షసుడు వేగముగా వాడి బాణములచే దానిని పొడిచేసెను. ఈ విధముగా వ్యర్థమైన కొండను గాంచి హనుమంతుడు వృక్షముల వర్షముచే అతనిని ముంచివేయగా అతడు దానిని మధ్యలోనే హరించివేసెను. దానిని చిన్నచిన్న ముక్కలుగా జేసి సింహనాదము చేయగా అంజనాపుత్రుడు క్రోధముతో దెప్పున ఎగిరి ఆ రాక్షసుని గుఱ్ఱములను సింహము ఏనుగును చీల్చువిధముగా గోళ్లతో చీల్చివేసెను. అట్లు చంపగా త్రిశిరుడు కాళరాత్రిని ప్రయోగించు కాలునివలె శక్తి అను ఆయుధములను వాయుపుత్రునిపై వేయగా అతడు దానిని పట్టుకొని విరిచివేసెను. ఈ విధముగా ఘోరమగు శక్తిని విరిచిన హనుమంతుని మేలు మేలని మెచ్చుకొని వానరులు పొగడిరి. త్రిశిరుడు రోషముతో మండిపడుచు హనుమంతుని రొమ్మున దాకునట్లు ఖడ్గమును విసరివేసెను. చబుకుతో కొట్టబడిన సింహమువలె రామదాసుడగు హనుమంతుడు తన అరచేతితో త్రిశిరుని యెదపై గొట్టగా వాడు తెలివిదప్పి నేలపై బడెను. అట్లు నేల వ్రాలుచున్న వాని ఖడ్గమును వాయుపుత్రుడు లాగుకొని రాక్షసులు భయముచే దుఃఖించుచుండగా అరచెను. ఆ ధ్వనిని సహింపక మిడిసి పాటుతో తన పిడికిలితో హనుమంతుని యెదపై గొట్టగా, హనుమంతుడు చేతితో విలాసముగా అతని కిరీటమును బట్టుకొని క్రోధము నంది పెద్ద కిరీటములతో గూడినవియు కుండలములతో

ప్రకాశించునవియునగువాని మూడు శిరస్సులను ఇంద్రుడు విశ్వరూపుని సంహరించిన విధముగా ఖడ్గము అంచుతో ఖండింపగా అవి అగ్నులవంటి విశాలనేత్రముల వరుసలతో నేలపై దొరలెను. పుణ్యఫలము క్షీణించగానే సూర్యమార్గమున భూమిమీద వ్రాలెడి వానిని బోలి రాక్షసుడు నేల గూలగా వానరసేనలన్నియు శత్రువులు పరువెత్తునట్లు పెద్దగా అరచుచు గోల చేసెను.

## ఋషభునిచే మత్తుడు చచ్చుట:

అట్లు గొప్ప యుద్ధ నైపుణ్యము గలవారగు దేవాంతకుడును, నరాంతకుడును, మహోదరుడును, త్రిశిరుడును సంహరింపబడుటను చూచి మత్తుడు విపరీతమైన ఆగ్రహముతో శత్రువులు రక్తమాంసముల నురువులు గలదియు, మిక్కిలి అసహ్యకరముగా నున్నదియు బంగారు పట్టముగలదియు, పుండరీకము, సార్వభౌమము, ఐరావతము అను దిగ్గజములకు కూడా భయము గలిగించునదియు, మిక్కిలి ఎఱ్ఱనైన పుష్పమాలికలచే అలంకరింపబడినదియు, ప్రకాశించు అగ్రభాగము గలదియు నయిన గదను చేత ధరించి ప్రళయకాలమందలి అగ్నివలె వానరులను చంపుచుండగా, కోపించి ఋషభుడను వానరనాథుడు ఎగిరివెళ్ళి ఆ మత్తుని ముందు నిలువగా అతని నా రాక్షసుడు గొప్ప గదతో మోదెను. ఆ గదాఘాతముచే వానరనాథుడు రొమ్ము పగిలి తెలివిదప్పి నోటివెంట నెత్తురులు కారగా నేలపైబడెను. అంతలో మరల ఆ బలవంతుడు లేచి శౌర్యముతో మీద దూకి అతని చేతిలోని గదను లాగికొని క్రోధముతో త్రిప్పి త్రిప్పి వేగముగా శత్రువు తలమీద గొట్టెను. తన గద చేతనే తాను కొట్టబడినవాడై వజ్రాయుధమే గొట్టబడిన గొప్ప కొండ నశించువిధముగా రాక్షసుడు నలగగొట్టబడిన దంతములు కన్నులు గలవాడై గత ప్రాణుడై యమపురమును చేరెను. అతడట్లు నేలబడగానే హడలిపోయినవారై చెల్లాచెదురై భయము నంది ఆ రాక్షసులు సమూహము పలాయనమునందు తమ సామర్థ్యమును ప్రదర్శించెను.

★★★

# డెబ్బది యొకటవ సర్గము

## అతికాయుడు కపులను పారద్రోలుట:

ఇట్లు తన తోబుట్టువులను పినతండ్రులను చావగా బ్రహ్మచే వరములు పొందిన వాడును కొండవంటి శరీరము గలవాడును దేవతా సమూహములకు భయము గలిగించువాడును అయిన అతికాయుడు నూర్గురు సూర్యులవంటి ప్రకాశము గల రథమునెక్కి అతివేగముతో మెరయుచున్న విల్లు దాల్చి పెద్దపెద్ద బొబ్బలచే వానరసేనలనదలించి తరుముచుండగా దాని నెదిరించు శక్తి లేనివారై వానరులు ఆ రాక్షసనాథుని శరీరమహత్వము నట్టె చూచి మఱల కుంభకర్ణుడే లేచి వచ్చెనో లేక త్రివిక్రముడు కావచ్చునాయని యుద్ధము చేయజాలనివారై గుంపులుగా చేరెను. అధికమైన భయముతో బుద్ధినశించి వెళ్లి శ్రీరాముని శరణువేడగా రామచంద్రుడు పర్వత సమానాకారుడును, పెద్దవిల్లుచేత ధరించినవాడును అగు ఆ రథికుని చూచి ఆశ్చర్యము నొంది వానరుల భయము పోగొట్టి తన స్నేహితుడైన ఆ విభీషణుని చూచి యిట్లనెను.

## శ్రీరాముడతికాయుని గూర్చి విభీషణు నడుగుట:

విభీషణా! పర్వతము వంటి శరీరము గలిగిన వీడెవ్వడయ్యా! ఎఱ్ఱని గ్రుడ్లు కలిగి పెద్ద విల్లు ధరించి వేయి గుఱ్ఱములు గట్టిన రథము నందు ప్రాసము, శూలము, తోమరము మొదలయిన ఆయుధముల కాంతులు ప్రకాశింపగా భూతగణములచే సేవింపబడిన భూతనాథుని పోలి మెరుపుతో గూడిన మేఘమో యనునట్లు కాలుని నాలుకవంటి శక్తిని ధరించియున్నాడు. బంగారముతో మెరయుచున్న విండ్లసమూహము ఇంద్రచాపము వలె రథమునకు శోభను కలిగించుచున్న అందమును జూచితివా? రాహు చిహ్నము గల టెక్కెమును, సూర్యకాంతితో మెరయు బాణముల వరుసలు దిక్కులన్నింటికి కాంతులు గలుగజేసెను. అతని ధనువు మూడువంకరలు గలది ఉరుములవంటి ధ్వని గలది. బంగారు పృష్ఠభాగము గలది అందమైనది. ఇతని రథము ధ్వజముతో అలంకరింపబడినది నలుగురు సారథులు గలది. ఎగురుచున్న పతాకములు గలది. గొప్ప ధ్వని కలది. ఇరువది తూణీరములు పది భయంకరములైన ధనువులు ఎనిమిది

బంగారు రంగు వింటినారులు రెండుప్రక్కల ప్రకాశించుచున్నవి. పదిమూరల పొడవును నాలుగుమూరల పిడులు, గలిగిన ఖడ్గములు మెరయుచుండగా ఆ ధైర్యశాలి, ఎఱ్ఱని పుష్పమాలికలు మెడయందు ధరించినవాడు నల్లని ముఖము గలిగిన యముని వంటివాడు మేఘము నందున్న సూర్యునివంటివాడు ఎవడయ్యా! ఓ ధీరవర్యా! బంగారు బాహుపురుల గల భుజములతో ఇతడు ఎత్తైన శిఖరములు గల హిమవంతునితో సాటివచ్చుచున్నాడు. కుండలములతో మెరయుచున్న ఇతని ముఖము పునర్వసు నక్షత్రముల మధ్యనున్న చంద్రునివలె నొప్పుచున్నది. ఈతని జూచి వానరులందఱి భయముచే పారిపోయిరి. ఇట్టి ఈ వీరుడెవ్వడో యితని శౌర్యము బలము ఎంతటివో చెప్పుమనగా విభీషణుడిట్లు చెప్పెను. రామచంద్రా! ఇతడు రావణాసురునకు ధాన్యమాలిని యందు జన్మించినవాడు. యుద్ధమున రావణుతో సమానమైనవాడు. పరాక్రమవంతుడు. పెద్దలను సేవించువాడు. అస్త్రవిద్యను బాగుగా ఎఱిగినవాడు. వేదశాస్త్రములనెరిగినవాడు. గుఱ్ఱపు స్వారీ యందు రథముపై నుండి గానీ, ఏనుగుపై నుండి గానీ శౌర్యముతో ఖడ్గములతో గానీ వింటితోగానీ పోరుటలో మిక్కిలి నేర్పరి. రాజనీతియందును, సామదానభేద దండోపాయముల యందు నేర్పుగలవాడు. వీని భుజబలము చేతనే ఈ లంక భయములేనిదై విలసిల్లుచున్నది. ఇతని పేరు అతికాయుడందురు. తపస్సు చేత బ్రహ్మను తృప్తిపరచినవాడు. ఎన్నియో క్రూరాస్త్రములను సంపాదించినవాడు. దేవతాదులచే అవధ్యత్వమును పొందినవాడు. యక్షులను, దానవులను, దేవతలను పారద్రోలి రాక్షసులను కాపాడినవాడు. గొప్పగొప్ప అస్త్రములచేత వరుణుని పాశమును ఇంద్రుని వజ్రాయుధమును స్తంభింపజేసినవాడు. రాక్షసులందఱిలో గొప్ప ధీశక్తి, బలము గలవాడు, రామచంద్రా! యుద్ధమునందు వానిచే వానరసేనలు సంహరింపబడకముందే అతని వధింప బూనుకొనుము. అని చెప్పుచుండగానే వింటి నారి మ్రోతలు భయంకరముగా వినిపించుచుండగా, భూమండలము కంపింపగా, నిరాఘాటమైన అద్భుతమైన వేగముతో యుద్ధక్రీడ సల్పునుత్సాహముతో వానరసైన్యమనెడు సముద్రమును మందరపర్వతము వలె ప్రకాశించి అది అల్లకల్లోలమై వ్యర్థమైన ప్రాణములు గలదై కుముదుడు నీలుడు శరభుడు ద్వివిదుడు మైందుడు పెద్ద పిడుగులవలె రాళ్లను, వృక్షములను, కొండశిఖరములను అధికముగా పైకి విసరగా రాక్షసరాజపుత్రుడు వానినన్నిటిని బాణములచే పొడిపొడిచేసి ఆ వానరులను గొప్ప బాణములచే గొట్టి నొప్పింపగా భరింపరాని నొప్పి కలిగి మఱిమేమియు చేయజాలక ఆ వీరులు తొలగిపోగాచూచి రావణనందనుడు సింహముజింకలను అడవిలో

బెదిరించెడు విధముగా తరుముచు సమీపించి సూర్య వంశశేఖరుడైన రామచంద్రునితో గర్వముతో ఇట్లనెను.

## అతికాయుడు లక్ష్మణుని తూలనాడుట:

ఓ రాజపుత్రా! విల్లు బాణములు పట్టి వచ్చియున్నాను. బలము నందు పరాక్రమమునందు హెచ్చైన వాడను. శక్తిహీనులను గొట్టనివాడను. రథమందున్నవాడను. ఇచ్చటనున్న నీ సైన్యము నందు నాతో యుద్ధము చేయుటకు సమర్థుడుండెనేని వేగముగా యుద్ధమునకు వచ్చునుగాక అని పలుకగా సుమిత్రాపుత్రుడైన లక్ష్మణుడు నిలిచి ఏనుగుతొండము వంటి చేతితో భూమి పర్వతములు దిక్కులు సముద్రములు ఆకాశము నిండునట్లు వింటినారిని మ్రోయింపగా తన అనుచరసమూహము భయమునొంది గర్వము వీడుచుండగా రావణపుత్రుడును ఆ ధ్వనికి ఆశ్చర్యము నొంది దర్పము మదముచేత కన్నులుగానని వాడుగాన ఇట్లనెను. ఓ మానవుడా! నీవు బాలుడవు. యుద్ధనైపుణ్యము లేనివాడవు. యుద్ధము మానిపొమ్ము. యమునితో సాటివచ్చు వాడనగు నన్ను నీవా ఎదిరించువాడవు. ఇంచుకయైనను నీయొక్క ఎదుటివాని యొక్క శౌర్యతారతమ్యమును నీ మనస్సు నందు తలపవు. నీవెంతటి మూర్ఖుడవోగదా. నాచేతి నుండి వెలువడు వాడి బాణముల వరుసలను హిమవత్పర్వతముగానీ భూమ్యాకాశమలు గానీ సహింపలేవన్న నీవేమి లెక్క? నిద్రించు ప్రళయకాలాగ్నిని మేలుకొలుపు తలపెందులకు? విల్లు నేల విడచిపో పొమ్ము. చెడిపోకుము. నా పాలబడి చావకుము. అట్లు పోనని కండకావరమున నిల్చితివేని ఓ నరుడా! యిప్పుడే ప్రాణములు వీడి యమపురమున చేరగలవు. బంగారముతో అలంకరింపబడినది ఆ శివుని త్రిశూలమును బోలినది శత్రుసమూహము మదమణగించునది అయిన ఈ వాడి బాణ సమూహమును బాగుగా చూడుము. సర్పముల వంటి నా బాణములు, కోపించిన సింహము ఆశతో గజరాజు రక్తమును గ్రోలు విధముగా నీరక్తము నాస్వాదించును.

## లక్ష్మణు డతికాయుని ధిక్కరించి పలుకుట:

అని బాణమును వింటియందు సంధింపగా అతని గర్వముతో కూడిన తీవ్రమైన రోషపు మాటలను విని మహా బలవంతుడయిన సౌమిత్రి అగ్నిని వెల్వరించుచున్న కన్నులు గలవాడై యిట్లనెను. ఓ రాక్షసుడా! నీవు మాటలతో మాత్రమే మేటివికాజాలవు. తన్ను తాను పొగడు

కొనుటచే కీర్తి చేకూరదు. వృధా ప్రగల్భములనేల పల్కెదవు? బాణములను, వింటిని చేతబట్టి యుద్ధము చేయ నిల్చినాను. దుర్మార్గుడా వట్టి బీరములు పల్కెదవేల? నీ బాహుబలమును చూపింపుము. ఓ రాక్షసుడా! ఊరకే పొగడుకొనుటవలన ఫలితమేమున్నది? నీకు గల శక్తిని క్రియచే చూపింపుము. పౌరుషము గలవాడే భూమి యందు ఎన్నడైనను శూరుడనబడును. అందముగా సర్వశస్త్రమలు దాల్చినవాడవు. రథము మీదనున్నాడవు. చేతితో వింటిని గట్టిగా పట్టినవాడవు. ఇంక నీ ప్రతాపమును పరాక్రమమును మిక్కిలి వాడియైన బాణములచేత గాని గొప్పనైన అస్త్రముల చేతగానీ తెలియునట్లు చూపరాదా? యుద్ధము నందు నీకు గల నేర్పునంతయు జూచి తరువాత ఈ బాణముల చేత వాయువు పండిన తాటిపండును పడవేయునట్లు నీ శిరమును నేలగూల్చెదను. బంగారముతో మెరయుచు అందమైన నా వాడి బాణముల వరుస బాణపు ములుకుల సమూహపు మార్గములద్వారా నీ శరీరము నందలి రక్తము నాస్వాదించుచుండగా చూచెదవు గాక. ఓ రాక్షస శ్రేష్ఠుడా! బాలుడనని నన్ను హేళన చేసెదవేల? నేను బాలుడనో వృద్ధుడనో నీకు మృత్యువును సుమా. ఇది దృఢముగా నమ్ముము. మూర్ఖుడా! వామనుడు బాలుడు గాదా? మూడు జగములను తాను వినోదముగా త్రివిక్రముడై పాదవిన్యాసముతో ఆక్రమించుకొనలేదా? అది లోకమునకు తెలియునుగదా.

## లక్ష్మణ అతికాయుల యుద్ధము:

అని లక్ష్మణుడు పల్కగా అతికాయుడు గొప్ప రోషమును పొందినవాడై తీవ్రమైన బాణమును వింటి యందు సంధించెను. వారి యుద్ధమును జూచుటకై ఆకాశమున దేవతలు దేవర్షులు గుంపులు గూడి నిలిచిరి. రాక్షసుడు సర్పమువంటి బాణమును ఆకాశమును మింగునట్లు లక్ష్మణునిపై వేసెను. అట్లు వచ్చుచున్న ఆబాణశ్రేష్ఠమును సౌమిత్రి అర్ధచంద్రబాణములచే ఖండించి వేసెను. ఖండింపబడిన పడగ గల సర్పము వంటి బాణమును జూచి రాక్షస రాజపుత్రుడు ఐదు బాణములను తిరిగి వేసెను. లక్ష్మణుడు వానినెల్ల తనను చేరకుండగానే ఖండించి వేసెను. అతంటితో వదలక ప్రజ్వలించు అగ్నితో సమానమైన బాణము నొకదానిని చెవివరకు లాగి రాక్షసుని ఫాలమున నాటునట్లువేయగా ఎంతయో నెత్తురుచే తడిసి ఆ బాణము గొప్ప కొండశిఖరముపై నున్న సర్పమువలె ఆతని ముఖమున చిత్రముగా నుండెను. ఆ బాణపు దెబ్బను సహింపలేక ఆ రాక్షస ముఖ్యుడు శంకరుని బాణముచే కొట్టబడిన త్రిపురాసుర పురద్వార మోయనునట్లు

దేవతలుప్పొంగునట్లు కంపించెను. అట్లు దెబ్బతిని రాక్షసరాజపుత్రుడు చింతించి తనను తానూరడించుకొనుచు కర్తవ్యమును విమర్శించుకొని ఆ వీరుడు లక్ష్మణుని జూచి యిట్లనెను. ఓ రాజపుత్రా! మేలు మేలు నీలాఘవమునకు నీ బాణశక్తికి నీవు విరోధివైనను మెచ్చుకొనుచున్నాను. అని పలికి తలను వంచి చేతులను క్రిందమోపి రథము మీద నిలిచి విజృంభించి యిష్టము వచ్చిన విధముగా యుద్ధరంగమున తిరుగుచు ఒకటి, మూడు, ఐదు, ఏడు భయంకరమైన బాణములను సంధించి లాగి బాణాగ్రముల బంగారుకాంతులు భూమి యందంతట నిండునట్లు వైచెను. ఆ రాజపుత్రుడను ఒక్కటియును మిగులకుండ అన్నిటిని తాననేక బాణములను పెద్ద కోపముతో వేసి ఖండించెను. ఏమియు నొవ్వక భయపడక ఆశూర శ్రేష్ఠుడిట్లు విజృంభింపగా ఆ రాక్షసుడు నిప్పులు గ్రక్కుచు ఒక బాణమును లక్ష్మణుని రొమ్మునందు నాటునట్లు వేయగా మదించిన ఏనుగు నుండి మదజలము స్రవించునట్లు నెత్తురులు ధారలుగా కారెను. అట్లున్నను లక్ష్మణుడు దానిని లెక్కచేయక వాడియైన బాణమునొకదానిని సంగ్రహించి అగ్నిమంత్రముచే మండింపజేసి వింటినారి యందు సంధింపగా దుర్మార్గవర్తనుడైన రాక్షసుడును అతివేగముగా సౌరాస్త్రమును సంధించెను. ఇట్లి రువురును లాగివేయగా అవి రెండును ఒకదానికొకటి తలపడి ఆకాశము నందు రోషముతో నున్న సర్పముల వలె హెచ్చుతగ్గులు లేకుండ పోరి పోరి భస్మమై నేలబడెను. తన మహాస్త్రమిట్ల చెడిపోవుట చూచి రాక్షసుడు ఐషీకమును అస్త్రము నెత్తి విసరగా సూర్యవంశ్యుడగు లక్ష్మణుడు దర్పముతో ఐంద్రబాణమున దానిని హతము చేసెను. ఐషీక మీవిధముగా పూర్తిగా నశింపగా రాక్షసశ్రేష్ఠుడు గొప్ప రోషముతో రాక్షసులకు భయంకరుడైన లక్ష్మణునిపై యామ్యాస్త్రమును భయంకరముగా వేసెను. ఆయామ్యాస్త్ర విజృంభణము లక్ష్మణుడు వాయుశరముతో తృంచివేసి అతికాయునిపై బాణవర్షమును తెరపిలేకుండ కురిపించెను. ఆ గొప్పనైన బాణముల గుంపులు అతనిని దాకి వ్యర్థములై ఎగిరి భూమిపై బడగా సుమిత్రపుత్రుడు ఉగ్రమూర్తియై ఏ మాత్రము శౌర్యమును వీడక వేల సంఖ్యలో మహాస్త్రములను వేసెను. అవియును అతికఠినమైన కవచముగల అతనిని చంపకయే భూమిమీద పడిపోయెను.

## లక్ష్మణునిచే అతికాయుడు చచ్చుట:

ఒక్క బాణమైనను రాక్షసుని బాధింపకుండుట చూచి వాయుదేవుడు లక్ష్మణుని యొద్దకు వచ్చి యిట్లనెను. వీడు దెబ్బతినని కవచము గలవాడు. అది బ్రహ్మ వరము. అది

దాటరానిది. వీడు బ్రహ్మాస్త్రము చేత మాత్రమే చంపబడును. తక్కినయే అస్త్రములును వీనిని యుద్ధమున చంపజాలవు. వరముచే లభించిన కవచము గలవాడు. గొప్ప అస్త్రములు తెలిసినవాడు. బలవంతుడు. ఇతడు ఈ విధముగా అల్పప్రయత్నముతో పోడు. అని చెప్పగా సాటిలేని బలముగలవాడగు లక్ష్మణుడు వాయుదేవుని మాట ననుసరించి వింటియందు బ్రహ్మాస్త్రమును సంధింపగా సూర్యచంద్రులు గ్రహములు భూమ్యాకాశములు దిక్కులు భయము చెందెను. యమకింకర సమానమైనదియు, నిర్మలమైనవాడి మొనగలదియు వ్యర్థముకాని గొప్పవేగము గలదియు అయిన ఆ బాణమును కోపముతో వీరుడైన లక్ష్మణుడు నిప్పులు గురియుచుండ శత్రువుపై వేసెను. అది వచ్చుటను చూచి అతికాయుడు బలము మెరయ క్రూరమైన బాణములను పెక్కింటిని వేయగా వానినన్నింటిని భస్మము చేయుచు తనను సమీపించగా శక్తి,గద,కుదారము శూలము మొదలగు ఆయుధములతో ఆ శూరుడు కొట్టుచున్నను విడువక వాటినన్నిటిని నశింపజేసి మణికిరీట కాంతులతో ప్రకాశించు అతని శిరస్సును శిరస్త్రాణ సహితముగా భూతలముపై గూల్చెను. హిమవత్పర్వత శిఖరము వలె అతికాయుని శిరస్సు భూమిని బడగా చావగా మిగిలిన రాక్షసులందఱును దీనులై యేడ్పుమొగలముతో అమితముగా దెబ్బలు తగులుటచే నొచ్చటినవారై దుఃఖించుచు యుద్ధకాంక్షను వీడి వానరులు తమ్ముతరిమెదరని భయముతో లంకాపురాభి ముఖముగా పరుగెత్తిరి. సంతోషముతో వికసించిన ముఖములతో వానరులందఱును వేగముగా వచ్చి సౌమిత్రిని సంతోషము నిండిన మనస్సులతో పూజించి కీర్తించిరి.

★★★



# డెబ్బది రెండవ సర్గము

## అతికాయాదుల మృతివిని రావణుడు దుఃఖించుట:

శత్రు సంహారకుడైన లక్ష్మణుని గొప్పబాణములచే కీర్తి నశించునట్లు యుద్ధభూమి యందు అతికాయుడు మరణించుటను విని రావణుడమితమైన వ్యథచే దుఃఖించుచు ఇట్లు విలపించెను. ధనుర్ధరులలో రత్నము వంటి వాడును, దారుణమైన కోపము గలవాడును అయిన ధూమ్రాక్షుడు అక్కటా చనిపోయెనే. సాటిలేని పరాక్రమముతో శ్రేష్ఠుడైన ప్రహస్తుడు యముని నోటికి మొదటి ముద్ద అయ్యెనే. అత్యధికమైన భుజపరాక్రమముచే దిగ్గజముల కుంభస్థలములను భగ్నమొనర్చిన కుంభకర్ణుడేడీ!

దేవతల రాక్షసుల సైన్యములచేత కంపింపజేయబడని వాడగు అంకపనుడు హతుడయ్యెనే! వీరందఱును అసామాన్యమైన బలము గలవారు బాహుబలాఢ్యులు. యుద్ధవిశారదులు. శత్రుసైన్యములను చెండాడువారు. సాహసవంతులు కటకటా! రాము బాణములచే చంపబడిరి కదా. వారు వీరని చెప్పనేల? అందఱును ధైర్యవంతులు, గొప్ప అస్త్రవిద్యాప్రావీణ్యము గలవారు. పెద్దశరీరములు గలవారు. గొప్పధీశాలురు. మహాత్ములు. ఓటమి నెరుగనివారు. విరోధుల హృదయములందు నాటిన ములుకులవంటివారు. శౌర్యవంతులు దేవతలను రాక్షసులను సంహరించువారు. అందఱును సంహరింపబడిరే! అయ్యయ్యో! ఖ్యాతిచెందిన పరాక్రమముచే కీర్తింపబడిన వాడగు నా కుమారుడు ఇంద్రజిత్తు యుద్ధభూమి యందు వరములచే లభించిన అస్త్రములచేత ఆ అన్నదమ్ములను బంధించెను. వానిని విడిపించుట యక్షులకు గంధర్వులకు దేవతలకునైనను సాధ్యముగాదు. అట్టియెడల రాముడును అతని సోదరుడును విడువబడిరి. అక్కటా అది ఏమి మాయయో లేక వారి ప్రభావమో లేక వంచనయో నాకు తెలియుటలేదు. నేనేమి యందును. నేను వెళ్లమనగనే రాక్షసనాధులు అట్టె యుద్ధమునకు వెళ్ళిరే కానీ వానరుల ప్రతాపమునకు చిక్కి ఎవ్వరును మరలిరారైరి. ఈ పురమునందింక ఆ సీతానాధుని అతని సోదరుని సైన్యసమేతుడైన సుగ్రీవుని, విభీషణుని గెలువగల బలవంతుని ఒక్కనినైనను

వెదకియు కనలేకున్నాను. ఏమి ఆ రాముని పరాక్రమము? ఏమి ఆ అస్త్రముల బలము? అనేక రాక్షస ముఖ్యులు భూమని పేరైన లేకుండ హింసింపబడి యుద్ధమునందు హతులైరి. యోధశ్రేష్ఠులైన రాక్షసులు యుద్ధమున ఎవనిశక్తి చేత యమపురమునకేగిరో అట్టి వీరుడైన రాముని రోగశోకాది రహితుడైన విష్ణుమూర్తిగా ఆదినారాయణునిగా నేను మనస్సునందు తలంతును. అతని వలని భయముచేతనే గదా అక్కటా లోపలి బయటి ద్వారములన్నియు మూయించవలసివచ్చినది. ఓ రాక్షసులారా మీరలింక హెచ్చరికతో లంకయందన్ని ప్రదేశములను పరాక్రమముతో రక్షింపవలెను.

★★★



# డెబ్బది మూడవ సర్గము

నా ఆజ్ఞలేనిదే అశోకవనము నందు సీతాదేవి యుండెడి చోటునకు ఎవరైనను వెళ్లుటగానీ మఱియు వెలుపలికి వచ్చుటగానీ తగని పని సుమా. వినండి. సైన్యములున్నచోటు లన్నియు గొప్పబలములతో మీరు కాపాడుచుండవలెను. అర్ధరాత్రివేళ గానీ, సాయంసంధ్యవేళగానీ తెల్లవారువేళగానీ ఎల్లప్పుడును వానరుల మార్గములను మీరలు చూచుచుండు. వానరుల విషయమున అశ్రద్ధ పనికిరాదు సుమా. విరోధులు యుద్ధమునకు సిద్ధపడినారో వచ్చుచున్నారో ఊరక నిలబడియున్నరో యని ఎల్లవేళల తెలిసికొనుచుండవలెను. వెళ్లుడు అనగా రాక్షస సమూహములు వెడలి యట్లే చేసెను. ఇట్లా జ్ఞాపించి రావణుడు దైన్యముతో తపించుచుతన మందిరమునకు వెళ్లి గొప్ప రోషమను అగ్నిచే దహింపబడుచు అతికాయుని మాటిమాటికిని తలచి బాధనొందుచు మనస్సునందు చింతించుచు నిట్టూర్పులు విడచెను.

**ఇంద్రజిత్తు రావణునూరార్చుట:**

ఇట్లు రావణుడు తమ్ములును పుత్రులును మరణించిరని దారుణమైన శోకముచే శరీరము తెలియనివాడై యుండుట చూచి యింద్రజిత్తు సమీపించి యిట్లనెను. తండ్రీ! నీ పుత్రుడు ఇంద్రుని గర్వమణచి దేవదానవుల జయించిన యింద్రజిత్తు క్షేమముగా బ్రతికి యిచ్చటనుండగా రాక్షసనాథా: నీవేమిటి కిట్లు మనోవ్యథతో నుండుట? ఈ యింద్రజిత్తు బాణముల దెబ్బలనెవ్వడయ్యా సహించువాడు? జాగరూకుడై తన శరీరము నాపద జెందకుండ గాచుకొనువాడెవ్వడు? అదియంతయు నిప్పుడెందులకు? నా దట్టమైన శరవర్షము చేత దారుణముగా తెగగొట్టబడిన శరీరములతో నేలబడియున్న రామలక్ష్మణులనిప్పుడే చూచెదవుగాక. తండ్రీ! రాక్షసాధిపా! దైవపౌరుషములు గల ఈ ఇంద్రమర్దనుని ప్రతిజ్ఞను వినుము. ఆ రామలక్ష్మణులను భయంకరములై ప్రకాశించు అమోఘములైన నా బాణముల గుంపులచే యుద్ధరంగమందు తృప్తినొందింతును. విష్ణువును, ఇంద్రుడును, సూర్యుడును, అశ్వినీదేవతలును, అగ్నియు, చంద్రుడును,

యముడును నా ఔద్ధత్యమును జూచి బలిచక్రవర్తి యజ్ఞశాలయందు పెరిగి పోవుచున్న విష్ణువోయని మనస్సులందు తలంచునట్లు చేయుదును అని చెప్పి తండ్రి అనుమతిని పొంది వాయువేగము గలదియు సుందరమైనదియు గాడిదలను బూన్చినదియు ప్రకాశవంతమైనదియు నగు రథమును విల్లుచేబూని ఎక్కి తనవెంట గుఱ్ఱములను ఏనుగులను ఎక్కి వచ్చు భటులు ఆర్భాటములు చేయుచుండగా.

## ఇంద్రజిత్తు మొదటియుద్ధము:

భేరులు శంఖములు మ్రోగించుధ్వనులు ఆకసమంతయు నిండగా, కాంతులను ప్రసరింపజేయుచున్న ముద్గరములు గదలు ప్రాసములు బాణములు ఖడ్గములు ఇంకను అనేక విధములైన శస్త్రములు ధరించి ఇంపుగా స్తుతులొనరించుచున్నవారై రాక్షసులు తన వెంటరాగా శంఖము, వలెను చంద్రునివలెను తెల్లనైన గొడుగులతో నున్న రావణుని పుత్రుడు శరద్రాత్రి యందు పూర్ణచంద్రునితో వెలుగొందు ఆకాశమువలె ప్రకాశించెను. విల్లు పట్టు వారలలో శ్రేష్ఠుడును, మండోదరీ పుత్రులలో పెద్దవాడును అయిన ఇంద్రజిత్తునకు బంగారు పిడులతో గూడిన చామరముల ప్పుడు రాక్షసశ్రేష్ఠులు ఇరువైపుల విసరిరి. సూర్యునిచేత ఆకాశమువలె సూర్యసమానతేజుడును అధికబలుడునైన దశకంఠుని పుత్రునిచే లంకయంతయును గొప్ప ప్రకాశముతో అద్భుతముగా వెలిగెను. యుద్ధరంగమునకు వెళ్లి దేవతావిరోధి తన రథమునకు అన్నిదిక్కులయందు దట్టముగా రాక్షసులను కాపుంచి అగ్నియందు హోమము చేయమొదలిడెను. పేలాలు గంధమాల్యములతో ఒప్పుచున్న హవిస్సుతో అగ్నిహోత్రు నర్చించెను. బాణములనే కుశపత్రములుగా అమర్చి తాండ్రశాఖలను సమిధలుగా జేసి ఎఱ్ఱని వస్త్రములు గట్టి ఇనుప స్రువముతో శరపత్రమధ్య ప్రదేశము నందు నల్లమేకను బలియీయగా పొగలేని మంటలతో జ్వాల లెగయగా బంగారు నగలు ధరించి ప్రత్యక్షముగా అగ్నిహోత్రుడు పైకి వచ్చి హవిస్సు నందుకొనెను. తన రథమును, తన వింటిని, తన బ్రహ్మాస్త్రమును తక్కిన పదార్థములన్నింటిని రాక్షసుడు నిశ్చలమైన మనస్సు గలవాడై మంత్రయుక్తముగా అగ్నియందు హోమము చేసెను. మయుని పుత్రికయైన మండోదరి యొక్క పుత్రుడీ విధముగా నిశ్చలమైన మనస్సుతో బ్రహ్మాస్త్రము నగ్ని మధ్యము నందు హోమముచేయగా చంద్రుడు, గ్రహములు నక్షత్రములతో గూడిన ఆకాశము భయముతో వణకెను. అగ్ని సమతేజుడయిన రావణపుత్రుడు అగ్నిదేవునిచే నీయబడిన అశ్వములు, శ్రేష్ఠమైన ధనువు,

బాణములు, రథము, సూతుడు గలవాడై అదృశ్యుడై ఆకాశమున కెగిరి తన పక్షపు రాక్షసులను వానరుల మీదకు ప్రోత్సహింపగా ఆ రెండు పక్షముల వారికి రోమములు గగుర్పొడుచునట్లుగా ఘోరయుద్ధము జరిగెను.

**ఇంద్రజిత్తు మాయాబలముచే వానరసేనలను చెండుట:**

అట్లు భయంకరముగా యుద్ధము చేయుచున్న తన సైన్యమును జూచి ఇంద్రజిత్తు నేనుండగా మీరు తడబడనేల? ఓ రాక్షసులారా! మీరు వానరసంఘముల నెల్లరను సంహరింపుడు. నిజముగా మీకు జయము కలుగును. అనగా ఆ రాక్షసవీరులు అరచుచు తలపడి జయమును గోరినవారై యుద్ధము చేసిరి. విజృంభించి దశముఖుని పుత్రుడు మేలైన బాణములచే వానరసేనలను ముంచి పరాక్రమించుచు గొప్పనైన గదలు ముసలములు మొదలైన ఆయుధములచే సంహరించుచు శత్రువుల దేహములను చీల్చివేయుచు, గూల్చివేయుచు, ఒక్కొక్క బాణముచే వరుసగా ఐదు, ఏడు, తొమ్మిది సంఖ్యగల వానరశ్రేష్ఠులను వీరత్వముతో సంహరించెను. అతని పరాక్రమమును జూచి కొండలు, చెట్లు ఆయుధములు ధరించిన వానరశ్రేష్ఠులును అమితమైన వేగముతో ఎదుర్కొనగా, సింహమువలె విజృంభించి వేసవి సూర్యునివలె కన్నెత్తి చూడరానివాడై ఈర్ష్యతో సూర్యసమానమైన బాణసమూహములతో వానరులనందరను వికలాంగులుగా చేసెను. అంగములు చితికినను తలలు పగిలినను వానరులు ధైర్యముతో సీతానాధుని కొరకై ప్రాణములర్పించుచు యుద్ధము చేసిరి. ఆ యింద్రజిత్తును చుట్టుముట్టి వానరులు జడివానవలె పెద్దపెద్ద కొండలను, బండల సమూహములను గురిపించగా ఆ యింద్రజిత్తు కూడా కేవలము తన శౌర్యధైర్యములతోడను ధనుర్విద్యా విలాసము చేతను వానినన్నిటిని ఒక్క నిమిషములో ముక్కలుముక్కలుగా చేసెను. తిరిగి అతడు గొప్ప వీరత్వముతో గంధమాదనుని పదునెనిమిది గొప్ప బాణముల చేతను, దూరముగా నున్న నలుని తొమ్మిది బాణముల చేతను, మైందుని నేడు బాణముల చేతను గజుని ఐదు బాణముల చేతను, గొప్పవాడైన జాంబవంతుని పది బాణముల చేతను, నీలుని ముప్పది బాణములచేతను కొట్టి సుగ్రీవుని, వాలిసుతుడైన అంగదుని, ఋషభుని ద్వివిదుని వరముచే లభించిన తీవ్రబాణముల వరుసలచే మృతినొంది నేలబడునట్లు క్రూరుడై నొప్పించి తక్కిన వానరసంఘములను ప్రళయాగ్నివలె అనేక బాణములనెడు జ్వాలలచే ఎదురులేనివాడై కాల్చివేసెను. సాటిలేని వేగము గల సూర్య సమాన బాణ సమూహములచే ఇంద్రజిత్తు

మహాక్రోధము గలవాడై వానరసేనను మథించెను. దారుణమైన తన బాణములచే తెలివిదప్పి కాంతిదొరగి కలత జెందిన వానరసేనలను చూచి దేవతలను తిరస్కరించిన వీరుడైన యింద్రజిత్తు పొంగిపోవుచు మరల ఆకాశమునందు మాయచే కనిపించకుండా నుండి ఉగ్రాకారుడై ఘోరమైన బాణములను గురిపించి కోతుల చేతులు, మూతులు, అవయవములు రూపుచెడునట్లు చేసెను. వజ్రాయుధముచే గొట్టబడిన కొండల వలె వానరశ్రేష్ఠులు బలము నశించినవారై నేలబడుట, వాడియైన ఆయుధములు విరోధుల మీద జోరుగా పడుట తప్ప ఆ యుద్ధమున రాక్షసవీరులు గాని వానరయోధులు గాని ఇంకేదియు చూడలేరైరి. యుద్ధమునందు తృప్తిలేనివాడై యింద్రజిత్తు మిక్కిలి వాడియైన ఖడ్గ పరిఘ శూలాద్యాయుధములను పెద్దనిప్పు కణములను విరజిమ్ము ప్రజ్వలించు అగ్నివంటి వాటిని వానరులపై గురిపించెను. ఆ బాణప్రవాహపు తాకిడికి వానర సమూహమంతయు పువ్వులతో ఎఱ్ఱగానైన మోదుగుచెట్ల వంటిదై వికృతస్వరముతో పెద్దగా గోలచేసెను. కోతియను వాడెవ్వడైనను కనులెత్తి చూచినచో రెండుకన్నుల యందు వాడియైన బాణములతో నిండుచుండెను. తలవంచి తిరిగినచో పదునైన బాణములచే నడినెత్తి పగిలి బ్రద్ధలై నేలబడుచుండెను. డాలు చేతబట్టినచో రెండుచేతులు ఖండింపబడి నేలమీద దొర్లుచుండెను. కొండపైకెత్తినచో ఆ వానరుడు దాని క్రిందనే పడి నజ్జు నజ్జుగా నలిగిపోవుచుండెను. అరచుటకై నోరు విప్పినచో అంతలోనే నోటినిండుగా బాణములు కూరుకొని పోవుచుండెను. ఔరా! ఆ క్రూరాత్ముని విలువిద్య యందలి పాండిత్యము నేమని పొగడవలెను. హనుమంతుని, సుగ్రీవుని అంగదుని, గంధమాదనుని, జాంబవంతుని, మైందద్వివిదులను, హరిలోముని, నీలుని, గవాక్షుని, గోముఖుని, వేగదర్శిని, సుషేణుని, దధిముఖుని, గజుని, జ్యోతిర్ముఖుని, సూర్యముఖుని, అగ్నినేత్రుని, కేసరిని, నలుని, కుముదుని, మంత్రసహితములైన తీవ్రములచేతను మర్దించి వారి ప్రతాపములను పోగొట్టి సూర్యకిరణ సదృశములైన బాణములచే రామలక్ష్మణులను ముంచి, ప్రకాశించి విక్రమము చూపుచున్న ఇంద్రజిత్తు తీరును జూచి

## శ్రీరాముడు లక్ష్మణునకు బ్రహ్మవరము మన్నించి ఓర్చుకొనుమని చెప్పుట:

గొప్ప అద్భుతమైన ధైర్యసంపద గలిగిన రాముడు బాణసమూహ వర్షమును అధైర్యము లేక నీటిచుక్కలను వలె సహించి తమ్మునితో నిట్లనెను. తమ్ముడా! లక్ష్మణా! దానవరాజపుత్రుడు సాటిలేనిదైన బ్రహ్మాస్త్రము నాశ్రయించి వానరసైన్యములన్నింటినీ

నేలపాటు గావించి అడ్డులేకుండ మనలను పీడించుచున్నాడు. బ్రహ్మయిచ్చిన వరముచేత తిరుగులేక ఆకాశమున కనిపించకుండి అస్త్రములను వేయుచున్నాడు. యుద్ధమున వీనినెట్లు వధింపగలము? స్వయంభువుడగు బ్రహ్మబాణముగదా యిది. ఇది యూహింపనలవి గాని మహిమతో నొప్పుచున్నది. ఈ బాణపు దెబ్బలను నావలెనే నీవును ధైర్యముతో ఓర్చుకొనుము. దేవతా విరోధి వాడియైన బాణములచేత ఎల్లదిక్కులను గప్పెను. ఆ వీరుని విక్రమము చేత వానర సైన్యములు బలహీనమైనవి. స్మృతి దప్పి ప్రయత్నహీనులమైన మనలను జూచి ఈ రాక్షసుడు జయలక్ష్మిని గొని పురమునకు వెళ్ళును. అని పలుకుచుండగా బాణవర్షము హెచ్చై భరింపరానిదై రామలక్ష్మణులు మూర్ఛలో మునిగిరి. ఇంద్రజిత్తు వారుపడుట జూచి మనస్సు సంతోషముతో పొంగుచుండగా సంతోషధ్వనులు చేయుచు ఈ విధముగా వానరసేనలను రామలక్ష్మణులను దెబ్బకొట్టి భంగపరచి ఎదురులేని పరాక్రమము గలవాడై తన పట్టణమునకు వెళ్లెను.

★★★



# డెబ్బది నాలుగవ సర్గము

## విభీషణాంజనేయులు జాంబవంతుని వెదకుట:

రావణపుత్రుడైన ఇంద్రజిత్తు దెబ్బలచే పరాక్రమములు చెడి సైన్యపతులైన సుగ్రీవుడు అంగదుడు జాంబవంతుడు మొదలగువారు ఏమియు తోచనివారై భయపడి యుండగా విభీషణుడు భయపడుచున్న కపిశ్రేష్ఠులను చూచి రామలక్ష్మణులు తెలివి దక్కి నేలబడి యుండిరని దుఃఖించిన కార్యమేమున్నది? ఇది దుఃఖింప సమయము గాదు. రాజపుత్రులు బ్రహ్మవాక్యమును గౌరవింపదలచి రాక్షసుని బాణములకు చిక్కియున్నారు. మాన్యులారా! ఆ బ్రహ్మాస్త్రము మిక్కిలి వ్యర్థముకాని వేగము గలదగుట చేత దానిని మన్నించు దృష్టితో నుండిరి. ఏల వగచెదరు? అని నెమ్మదైన మాటలచే వారి నోదార్చెను. అప్పుడు వాయుపుత్రుడాయస్త్రము నిశ్చలమైన భక్తితో చాలగా గౌరవించి విభీషణుని జూచి యిట్లనెను. మహాత్మా! ఈ మనసేన లందు ఇంకను బ్రతికి యున్న వారలను కనిపెట్టి యూరడిల్లునట్లు పల్కుట తగియుండును గదా అని పలుకగా విభీషణుడట్లే యనగా చేతులందు మండుచున్న కొరవులను బట్టుకొని ఆ వీరశ్రేష్ఠులు వేగముగా ఆ రాత్రి వేళ చావగా మిగిలిన వానరులకై వెదకిరి. తెగిన తోకలు గలవారును, తెగిన చేతులు గలవారును, వ్రేళ్లు తెగినవారును, పాదములు ఖండింపబడినవారును, తలలు తెగినవారునునైరక్తములు గారుచుండ కొండలవలె పడియున్న వానరులను చూచిరి. శస్త్రములు భేదింపగా, అస్త్రములు బాధింపగా శరీరములు ఖండింపబడిన గంధమాదనుని, అంగదుని, నీలుని, సుగ్రీవుని, ద్వివిదుని, సుషేణుని, వేగదర్శిని, నలుని, పనసుని, జ్యోతిర్ముఖుని, మైందుని, ఆహుకుని, గవాక్షుని, తక్కిన వానరులను తెలివిదప్పినవారిని చంపబడినవారిని వీరశ్రేష్ఠులను మనస్సు నందెంతయో కలత జెందుచు చూచిరి. అరువది యేడుకోట్ల వానరులు భయంకర స్వరూపులు ఇట్లు బలము నశించినవారై దినమందొలివైదవ భాగమున బ్రహ్మదేవుని ప్రీతికి పాత్రుడైన ఆ కఠిన రాక్షసునిచే సంహరింపబడిరి. సముద్రము వంటి వానరసేన ఒక్కమారుగా ఇట్లు రూపుమారిపోగా హనుమంతుడును విభీషణుడును ఎక్కడ ఉన్నాడో మన ఎలుగుబంట్లరాజైన జాంబవంతుడని వెదకుచు వెళ్లి ఒకచోట చల్లారిన అగ్ని

మోయనునట్లు శరీరమున అనేక బాణములు దట్టముగా నాటుకొనగా మిక్కిలి వృద్ధత నొందిన వాడును, అయిన బ్రహ్మపుత్రుడగు జాంబవంతుని జూచి రావణుని తమ్ముడగు విభీషణుడిట్లనెను.

## జాంబవంతుడు హనుమంతుని కుశలమును విభీషణునడుగుట:

ఓ గొప్ప ప్రభావముగల జాంబవంతా! బాణసమూహములు నిన్ను ప్రాణహీనునిగా జేయలేదు గదా. అనగా బలమును శ్రమతో తెచ్చుకొనుచు తన నోటిని కొంచెము విప్పి యిట్లనెను. మహాబలవంతుడైన రాక్షసరాజా! నిన్ను చూడలేకున్నను నీ మాటతీరునుబట్టి నిన్ను చక్కగా గుర్తించితిని. వాడి బాణములు నాటుటచే కన్నులే మాత్రము కనిపించుట లేదు. వాయుపుత్రుడు, అంజనాదేవి గారాల బిడ్డడు అయిన ఆ హనుమంతుడు ప్రాణములతో నున్నాడా? చెప్పవయ్యా! అనగా విభీషణుడు ఓ మహాబుద్ధిశాలీ! నీవు రఘుశ్రేష్ఠుల సేమమును ప్రశ్నింపక ముందుగా వాయుపుత్రుని గూర్చి ప్రశ్నింపనేల? ఆ బలవంతుని మీదనున్న ప్రేమ రాజపుత్రుల మీదను, వాలిపుత్రుని మీదను, సుగ్రీవుని మీదను సత్యముగా నీవు మనస్సు నందు కలిగియుండలేదేల? అని విభీషణుడు పలుకగా విని భల్లూకరాజు రాక్షసేశ్వరా! వినుము నేను హనుమంతుని గూర్చి ప్రశ్నించుటకు కారణము తెలియజెప్పెదను. హనుమంతుడు జీవించియున్నచో మన సేనలు చచ్చినవైనను బ్రతికియున్నట్లే అగును. హనుమంతుడు లేకున్నచో మనమందరమును బ్రతికి యున్నను చచ్చినట్లే సుమా! ప్రస్తుతింపదగిన బుద్ధిగలవాడగు గమనము నందు వాయుదేవునితో సమానమైనవాడు, గొప్ప పరాక్రమము నందు అగ్నితో సమానుడు. కావున బ్రతుకుదుననెడి ఆశ నన్ను బాధించెను. అనగా హనుమంతుడా పవిత్రుని పాదములపై బడి మహాత్మా! ఇదే నేను వాయుపుత్రుడను వచ్చియున్నాడను అనగా అతని మాటలను విని బ్రహ్మపుత్రుడగు జాంబవంతుడు మిగుల దుఃఖించి, తిరిగి తన తల్లి గర్భమునుండి పుట్టినట్లు తలంచి సంతసముతో వాయుపుత్రునితో నిట్లనెను.

## జాంబవంతుడు హనుమంతుని సంజీవకరణిని దెమ్మనుట:

రమ్మా! వానర శార్దూలా! రమ్ము. ఈ వానర సేనలను గాపాడుటకు నీవే దిక్కు. శౌర్యము నందు నీతో సమానమైన వారలేరీ! సమ్మతిగా మా కందరకును గొప్ప స్నేహితుడవు నీవే సుమా. అన్నా! నీతో సమానుడైన బలవంతుని వెదకినను ఎచ్చటను

చూడనైతిని. లోకమునందున్నతమైన శౌర్యము గలవాడవు. నీ భయంకరమైన పరాక్రమము చూపింపదగిన సమయమిప్పుడే సమకూరినది. నీవు వేగముగా వానరులను, భల్లూకములును, రామలక్ష్మణులును సంతోషించునట్లొనర్చుము. ఓ అంజనాపుత్రా నీవు సముద్రమును దాటి ఎంతో దూరము వెళ్లి హిమవత్పర్వతమును జూచి అటనుండి స్వర్ణమయములైన ఋషభ కైలాస పర్వతములను జూచి వాటి మధ్యయందు గొప్పకాంతి గలిగి సకలమైన ఓషధులచే ప్రకాశించు ఓషధి పర్వతమును జూడుము. ఆ పర్వత శిఖరమున తమ కాంతిచే దిక్కులను వెలిగించు నాలుగు ఓషధులు గలవు. వాని కాంతులచే అవియున్నచోటును తెలిసికొని నీవు వేగముగా మృతసంజీవని, విశల్యకరణి, సౌవర్ణ్యకరణి, సంధాన కరణి యను వానిని తీసుకొనివచ్చి ఓ వాయుపుత్రా! ఈ వానర సేనకు ప్రాణములనిమ్ము. పొమ్ము నీకు శుభము కలుగును. వేగముగా తిరిగి రమ్ము అని చెప్పగా హనుమంతుడు సంతోషమధికమగుచుండగా

## హనుమంతుడు సంజీవనిని తేబోవుట:

సముద్రము జలములచే నిండినట్లు దేహమును బెంచి పూర్ణబలమును పొందినవాడై తన పాదములచే పర్వతశిఖరమును వడకజేసెను. రెండవకొండవలె నున్న వాయుపుత్రుని పాదముల తాకిడికోర్వజాలక పర్వతము కంపించెను. శిఖరములు, వృక్షములు నేలపై కూలబడెను. ఆ పర్వతమున అప్పుడు వానరులు నిలువలేనివారై భయముతో గడగడలాడిరి. ద్వారములు విరిగి, గృహములు కూలి, గోపురములు భగ్నములై లంకాపట్టణము ఆ రాత్రి భయముతో కలత జెంది పెద్దగా గోలచేయునట్లయ్యెను. ఈ విధముగా మేరుమందర సదృశమైనదియు, అల్లకల్లోలమగుచున్న సెలయేళ్లు గలదియు, దేవతలకు నివాసమైనదియు, అనేకములైన లతలతో చెట్లతో నిండినదియు, వికసించిన అనేకములైన కలువలు పద్మములు గలదియు, అనేక మృగములతో నిండినదియు, అనేక గుహలు గలదియు, మునులతో నొప్పునదియు నయిన మలయపర్వతమును పాదములతో త్రొక్కి బడబానలము వంటి నోటిని విప్పి భూతముల చెవులు పగులునట్లు గర్జించెను. ఆశ్చర్యకరమైన ఆ ధ్వనిని విని రాక్షసులెల్లరును కడుభయముచే ఇటునటు కదలక యుండిరి. భయంకరమైన పరాక్రమము గలవాడగు ఆ వానర వీరుడు భక్తితో రామచంద్రునకు మనఃపూర్వకముగా మ్రొక్క దాశరథుల కార్యమును చేయ నిశ్చయించుకొన్నవాడై ముఖమును వికసింపజేసి గొప్ప సర్పమువంటి తోకను పైకెత్తి

స్థిరబుద్ధితో వీపును వంచి వీనులు కుంచించి తీవ్రమైన వేగముతో కుప్పించి ఎగురగా పర్వతమున నున్న శిలలు, వృక్షముల సమూహములు అతని వెంట పరుగెత్తి ఆ వేగమణగినతోడనే సముద్రమునందు పడినవి. గరుత్మంతుని వంటి వేగముగలవాడై సర్పములను బోలిన చేతులను జాచి మఱిమఱి దిక్కులు కంపించుచుండగా విష్ణువు చేతి నుండి విడువబడిన చక్రమువలె వెడలెను. తిరుగుడు వడుచున్న అలలు గలదియు, భ్రమించుచున్న సకల జలజంతువులతో నిండినదియు, అయిన సముద్రమును జూచుచు వెళ్లి వెళ్లి మార్గమునందు నదులను, నదములను, వృక్షసమూహములను, మనోహరములైన పురములను, చూచుచు హిమవత్పర్వతమును జూచి, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుని మాటలను స్మరించుచు వెళ్లి వెళ్లి, అధికమైన సెలయేళ్లు గలదియు, అనేకములైన చెట్లతోడను గుహలతోడను ఒప్పుచున్నదియు, గొప్పవైన తెల్లని మేఘముల వంటి శిఖరములతో సుందరమైనదియు అగు హిమగిరిని చేరవేగి ఎత్తైన శృంగములను, మునిజనులతో గూడిన పుణ్యాశ్రమములను భక్తితో చూచి బ్రహ్మనివాసమును, వెండి కొండను, ఇంద్రనివాసమును, ఈశ్వరుడు త్రిపురాసురునిపై బాణము విడిచిన చోటును, హయగ్రీవుని, ప్రకాశవంతమైన బ్రహ్మశిరోనామకాస్త్రమును, యమదూతలను, అగ్నినివాసమును, సూర్యసమతేజస్సుగల కుబేర నివాసమును, సూర్యుల నివాసమును, బ్రహ్మవాసమును భూమియొక్క నాభిప్రదేశమును, కైలాస సమీపముననున్న హిమశిలను, ఋషభమను పర్వతరాజమును, సర్వౌషధులతో నిండిన ఓషధీ పర్వతమును సూర్య సమాన కాంతితో నొప్పుదానిని వాయుపుత్రుడు అచ్చట గొప్ప ఆశ్చర్యమును పొందిన మనస్సుతో చూచెను.

## హనుమంతుడు సంజీవనిని దెచ్చుట:

ఆ వానరనాథుడు ఓషధులను విడువక వెదకుచు ఒకవేయి యోజనములు తిరుగగా తమను సంగ్రహించుట కెవ్వడో వచ్చెనని తలంచి ఓషధీ సమూహములు వేగముగా కనబడకుండ దాగెను. వానర శ్రేష్ఠుడును కోపముతో ఎఱ్ఱనైన నేత్రములు గలవాడై అరచి గొప్పనైన కంఠధ్వనితో ఆ కొండతో నిట్లనెను. ఏమి పర్వతశ్రేష్ఠమా! రామ చంద్రునిపై నింతయైనను దయలేదా? ఏమనుకొని ఓషధులనిట్లు కనబడకుండ చేసితివి? నీ మనస్సునందిదియే నిశ్చయమైనచో నాయొక్క భుజములు దెబ్బలచే నేమయిపోయెదవో ఎరుగుదువా? ఇదిగో నిన్ను పిండిగా గొట్టెదను అని చెప్పుచూ బంగారముతోను,

ఏనుగులతోను, వేయివిధములైన ధాతువులతోను, నిండినదియు, గొప్పశిఖరములు గలదియు, సూర్యునితో సమానమైన కాంతిగలదియునైన ఆ కొండను సమూలముగా పెళ్లగించి ఆకాశమున కెగిరి ఆకాశచారులందరు ఆహాయని పొగడుచుండగా వేగముగా వచ్చెను. సూర్యమార్గమున వచ్చుచున్నవాడై ఆ సూర్యశిష్యుడు సూర్యసమానమైన కొండనుదాల్చి సూర్యసమీపముననున్న రెండవ సూర్యునివలె తీవ్రమైన కాంతిగలవాడై శైలధరుడైన హనుమంతుడు పెద్దదై భయంకరమై వేయి అంచులు గల చక్రమును ధరించిన విష్ణునివలె విరోధులధిక భయము చెందినట్లు ప్రకాశించెను.

## సంజీవనిచే వానరులు మొదలగు వారు బ్రతుకుట:

అట్లు వాయుపుత్రుడు దూరమున వచ్చుచుండగనే ఆ ఓషధీలతల నుండి వచ్చుచున్న గాలి తగిలి వానరులెల్లరును తిరిగి ప్రాణములను పొందినవారై ఆ దిక్కు చూచి కేకలు పెట్టగా సంతోషముతో హనుమంతుడు పెద్దగా తానును ప్రతి గర్జనలు చేసెను. రాక్షసులు భయముతో బొబ్బలు పెట్టిరి. ఈ విధముగా వాయుపుత్రుడు ఆ వానరులమధ్య కొండను దింపి పెద్దవారికి నమస్కరించెను. ప్రీతితో రాక్షసరాజగు విభీషణుని కౌగిట జేర్చెను. ఆ మహౌషధుల వాసనలను పీల్చి రామలక్ష్మణులు తెలివినంది లేచి ఎంతయో తేరుకొనిరి. చచ్చిపోయిన వానరుల గుంపులు గాఢనిద్ర నుండి తెల్లవారగానే మేలుకొనిన విధముగా లేచి క్రొత్త యందముతో నొప్పెను. ఒక్క రాక్షసుడైనను జీవింపలేదు. ఏలననగా యుద్ధము మొదలైనప్పటినుండి వానరవీరులచే చచ్చిన రాక్షసవీరుల శవములను గౌరవము కారణముగా రావణుని యాజ్ఞచొప్పున రాక్షసులు సముద్రమున త్రోసివేయుచుండిరి. ఇట్లు కార్యము పూర్తికాగానే ఆ గొప్పనైన కొండను తీసికొని హనుమంతుడు తిరిగి వేగముగా ఎప్పటి చోటున నుంచి శ్రేష్ఠపురుషుడైన రఘురాముని యొద్దకు వచ్చెను.

★★★

# డెబ్బది యైదవ సర్గము

## సుగ్రీవుడు లంకను గాల్చకపుల నాజ్ఞాపించుట:

వానరరాజగు సుగ్రీవుడు వానర విరోధులు చేసిన అపకారము వలన పుట్టిన క్రోధముతో నిండిన మనస్సుగలవాడై తగిన విధముగా హనుమంతునితో నిట్లనెను. తమ్ములును, కుమారులను చచ్చుటచే శోకముచే తపించినవాడై రాక్షసరాజగు రావణుడు యుద్ధమునకు తాను బయలుదేరడు. కాన మీరును మీతో సమానమైనవారును, వేగము గలవారును ఆలోచించక వేగముగా వెళ్లి మండుచున్న కొరవులను తీసికొని లంకాపురమును తగలబెట్టుడు. అని చెప్పగా ఆశౌర్యవంతులందఱు భయంకరమైన రాత్రి మొదటి జాముున క్రోధముగల వానరశ్రేష్ఠులు కద్రువపుత్రులైన సర్పములవలె బుసలు కొట్టుచు అరచుచు, కొరవులు చేతబట్టి గొప్ప ఔద్ధత్యముతో లంకలోనికి ప్రవేశించి పురరక్షకులైన రాక్షసులు భయముతో పారిపోవుచుండగా సంతోషముతో మేడలను, గృహములను, గోపురములను, అట్టములను, వీధులను, కొలువ కూటములను పెద్దగా అరచుచు అగ్నిహోత్రునికి సంతర్పణము చేసిరి. కొండల వలెనుండు మేడల సమూహములు దబ్బుదబ్బున శబ్దము చేయుచు నేలబడెను.

## కపులు లంకను గాల్చుట:

అగరు చెక్కలు మేలైన హరిచందనములు మండిపోవుచు మేలైన పరిమళములను వెదజల్లెను. ముత్యములు, వజ్రమణులు పగడములు, శంఖసమూహములు భస్మమయ్యెను. పట్టువస్త్రములు, నారవస్త్రములు మడతలు మడతలు మాయమయ్యెను. కంబళములు అందమైన బంగారుపాత్రలు గుఱ్ఱపు జీనులు మొదలగునవి చెడిపోయెను. ఏనుగుల సొమ్ములు, రథముల అలంకారములు కవచములు ఏనుగులకు గుఱ్ఱములకు కప్పెడు బంగారు చేలములును సాటిలేని ఖడ్గములు, విండ్లు, వింటినారులు, ఆయుధములు, శూలములు, శక్తులు కాలిపోయి పిండిమయ్యెను. చామరములు, కంబళములు, పులిచర్మములు, కస్తూర్యాది వస్తువులు పొడైపోయెను.

ముత్యముల చేతను, మణులచేతను అలంకరింపబడిన పెద్దమెడలు, ఆయుధశాలలు అణగిపోయినవి. వేనవేలు రాక్షసుల గృహములు బూడిదయయ్యెను. ప్రకాశించు కవచములు ధరించినవారు, హారములు, పుష్పమాలికలు ధరించినవారు, మధువు త్రాగుటచే చంచలములైన నేత్రములు గలవారు, కోపమునొందిన వారు, భార్యలతో గలిసి నిద్రించువారు, త్రాగెడువారు, ఆయుధములు చేతుల ధరించినవారు అందరును అగ్నిహోత్రుని వాతబడిరి. భార్యలు తమ కొంగుపట్టుకొనగా పారిపోయెడివారు, పొగచేత నేమియును తోచక బాధపడువారు చంకలో బిడ్డలతో వణకుచున్నవారు పరునెత్తునపుడు నేలబడెడివారు, తమవారిని కాపాడుటకు వెళ్లి తామే కాలిపోయెడివారు, తప్పిపోయిన వారిని పిలుచువారు, కొడుకా! యని. కోడలా! యని, కూతురా! యని బిగ్గరగా అరచువారును, బంగారముతో నిర్మితములయిన పూర్ణచంద్ర, అర్ధచంద్ర రూపములయిన చంద్రశాలలు, మణినిర్మితములయిన గవాక్షములు, రత్నములు, పగడములు పొదిగిన సుందరమైన వివిధపంజరములు అగ్నియందు మాడిపోయెను. అగ్నిచే చుట్టుముట్టబడిన గృహములు వర్షపు వేళలందు మెరుపుతీవెలతో గూడిన మేఘసమూహముల వలె కనిపించగా కాలికూలిపోవుచున్న భవనములు పిడుగు పాటున గూలు పర్వత శృంగములవలె తోచెను. వానివలన పుట్టిన ధ్వనులు వ్యాపించి పౌరులకు చెవుడు పుట్టజేయుచుండెను. మిద్దెలమీదను మేడలయందును నిద్రించు ముగ్ధలు మంట లెగయు చుండగా వేగముగా ఆభరణములను తీసివేసి అప్పుడు హా! హా! యని పలవరించిరి. అగ్నిజ్వాలల వరుసలతో గూడిన మేడల సమూహము ప్రకాశించెడు ఔషధులతో గూడిన వనములతో నొప్పు హిమవత్పర్వత శిఖరమువలె దూరము నుండి చూచువారలకు కనిపించెను. సౌధముల అగ్రభాగములందు అగ్నిజ్వాలల వరుస లెగురుచుండగా రాత్రి సమయమున నా పట్టణము నిండుగా పూచిన మోదుగు చెట్లగుంపువలె ఆ సమయమున దూరపు చూపులకు తోచెను. కట్లు విడిచిన సంచరించు ఏనుగులగుంపులు గుఱ్ఱములు గలదై ఆ లంక ప్రళయకాలమున తిరుగుడువడుచున్న పలువిధముల మొసళ్లతో గూడిన మహాసముద్రమునకు సాటివచ్చుచుండెను. బెదరి పరుగెత్తు గుఱ్ఱపు విధమును జూచి ఒక్కొక్కచోట పెద్ద ఏనుగు కూడా తొలగిపోయెను. మఱియొకచోట భయముతో పరుగెత్తు ఏనుగు తీరును జూచి గుఱ్ఱము తప్పుకొని వెళ్లుచుండెను. రాక్షస నగరమును తగులబెట్టుచున్న అగ్నిహోత్రుని మెరయుచున్న కాంతులతో నీరు కలిసిపోగా సముద్రము

అప్పుడు అద్భుతముగా రక్తసముద్రమోయని యూహ చేయుటకు దగియుండెను. చెట్లయందు దిరుగువానరులన్నిచోట్ల నిప్పుపెట్టగా లంకాపట్టణమప్పుడు సర్వలోకములు లయము చెందు ప్రళయకాలమున మంటలతో నున్న భూమితో సమానమై యొప్పెను. పొగ కన్నుల నిండగా, ఏమియును తోచక, శరీరములందు మంటలు ప్రాకగా భయంకరముగా కేకలు వేయుచున్న స్త్రీల రోదన ధ్వనులు పదియోజనముల దూరము వఱకు వ్యాపించెను. శరీరములు కాలి యిండ్లనుండి వెలుపలికి వచ్చెడివారితో వానరులు కలబడగా రాక్షసుల కోతుల భయంకరమైన అరపులు ఆకాశమును భూమిని అధికముగా నిండెను. మహాత్ములైన రామలక్ష్మణులు వేదనలు తొలగినవారై భయరహితులై విండ్లను బట్టి నారులను లాగి మ్రోగింపగా రాక్షసులు భయముతో కలతజెందిరి. ఆకాశమే జటాజూటముగా గల ఈశ్వరుడు వేదమయమైన ప్రఖ్యాతమైన అల్లెత్రాటిని మ్రోగించిన విధముగా శ్రీరామచంద్రుడు నారి సారింపగా ఆశబ్ద మొక్కటియే వానరుల రాక్షసుల ధ్వనులను మ్రింగివేసెను. వానర సంఘముల గర్జనలును, రాక్షస సంఘముల అరపులును రామచంద్రుని వింటినారి మ్రోతలును కలిసి దిక్కులందు నిండెను. రామచంద్రుని ధనుస్సు నుండి విడువబడిన బాణముల వరుసలు రాక్షసరాజపురమున అట్టాలకములు, గోపురములు మొదలైనవి బ్రద్దలగునట్లు భూమిపై పడద్రోసెను. దానికి భయపడి మహావేగముతో రాక్షసులు ఘోరయుద్ధము చేయదలంచినవారై దిక్కులు బ్రద్ధలగునట్లరచుచు ధైర్యముతో బయలుదేరిరి. యుద్ధసన్నాహముతో సింహనాదములు చేయుచు రాక్షససమూహములు యుద్ధమునకు బయలుదేరగా అప్పుడా చీకటిరాత్రి భయంకరమయ్యెను. అప్పుడు సుగ్రీవుడు సమీపద్వారమును సమీపించి వానరులారా! ముట్టడింపుడు. సోమరియై ప్రక్కకు తప్పుకొను రాజశాసనదూషకుని పట్టి శిక్షించెదను సుమా. అని పల్కగా వానరులు హస్తములందు మండుచున్న కొరవులు దాల్చినవారై సమీపమున నున్న రాక్షసనాధుని ద్వారమును అడ్డుకట్టగా దశకంఠుడు ఆగ్రహముతో ఎఱ్ఱనైన నేత్రములతో ఆకారము దాల్చిన రుద్రుని కోపమోయన్నట్లు మండుచు తనయెదుటనున్న రాక్షసులు భయము చెందగా అట్టే లేచి కుంభకర్ణుని పుత్రులైన నికుంభుని, కుంభుడనువానిని మఱియు, యూపాక్షుని, శోణితాక్షుని, కంపనుని, ప్రజంఘుని గొప్పసైన్యముతో యుద్ధమునకు బంపెను.

**కుంభనికుంభులు యుద్ధమునకు వెడలుట:**

కుంభకర్ణుని పుత్రులు సైన్యసమేతులై అతివేగముతో బయలుదేరిరి. శత్రు సైన్యమునకు భయము కలుగునట్లు రాక్షససేనల జయజయధ్వనులొక్కమారుగా వ్యాపింపగా బంగారు భూషణముల కాంతులు, భయంకరములైన ఆయుధముల కాంతులు కలియగా ఆకాశమున జంద్రకాంతులధికములై ఆకాశమున వ్యాపించెను. వానరులు రగిలించిన అగ్నిజ్వాలల కాంతులును రాక్షసులు వానరులు ధరించిన భూషణముల కాంతులును ఆకాశమున కొక క్రొత్తకాంతిని గలుగజేసెను. చంద్రకిరణ కాంతులును, గొప్ప అలంకారములతో నున్న పురగృహములు అగ్నిచే మండుచున్న కాంతులును, ఆ సమయమున ఉభయసేనలను బాగుగా వెలుగజేసెను. ఇండ్లపై భాగముల మండుచున్న మంటలు సముద్ర మధ్యమందు వ్యాపింపగా కదలుచున్న తరంగముల జలములు వింతకాంతులతో మెరసెను. గుఱ్ఱములు, ఏనుగులు, రథములతో నిండినదియు భటుల సంఘములతో నిండినదియు, ప్రకాశించుచున్న తోమరములు, ప్రాసములు, విండ్లు, గదలు శూలములు, ఖడ్గములు మొదలైన ఆయుధములతో శోభించుచున్నదియు, ప్రకాశించుకవచములు గలదియు, బంగారు భుజాభరణములు గలదియు, గజ్జెలధ్వనులతో గూడినదియు, బాణములు సంధించిన విండ్లు గలదియు, గొప్పశబ్దములు చేయుచున్న ఆయుధములు గలదియు, గంధములు, మాలికలు, మధువుల సుగంధములతో గూడిన వాయువులు గలదియు, మేఘముల ధ్వనులవంటి అరపులు గలదియు, శూరల సమూహములతో గూడినదియునై వచ్చుచున్న రాక్షససైన్యమును జూచి గర్జలను చేసి వానరుల సైన్యము మిడుతలు అగ్నిజ్వాలలలో పడువిధముగా వృక్షములు, కొండలు పట్టుకొని రాక్షసులపై బడి యుద్ధము చేయగా వారు కత్తులతో వానరుల తలలను నరికివేసిరి. శౌర్యముతో పిడుగల వలె వేగముగా పరుగెత్తివచ్చి పండ్లతో చెవులను కొరికివేసి, చేతుల శక్తి కొలది పిడికిళ్లతో తలలు బ్రద్దలు కొట్టి పెద్దరాళ్ల దెబ్బలచే శరీరములను ముద్దగా జేసి వానరనాధులు పరాక్రమముతో శత్రుసేనలను రూపుచెడునట్లొనర్చిరి. ఆ రెండు సైన్యములందున బాగుగా యుద్ధము చేయగల వీరులు గొప్ప పరాక్రమము గలవారు శత్రుసేనలలోని భటులను జై అని యరచుచు సంహరించిరి. కొట్టిపోవుచున్న వానిని అంతలోనే యింకొకడు కొట్టిపోవుచుండెను. త్రోయబోవువానిని ఇంకొకడు త్రోసిపోవుచుండెను. ఒకడు చంపబోవుచుండగా ఇంకొకడు వానిని చంపివేయచుండెను.

కొరికెడు వానిని వేఱొకడు కొరుకుచుండెను. తిట్టెడువానిని వేరొకడు తిట్టుచుండెను. గ్రుద్దెడు వానిని మఱియొకడు గ్రుద్దుచుండెను. నీ చేతి బలమును చూచెదను రారా యని పిలువగా ఇదిగో వచ్చితినని ఒకడు ఎదురుకొనుచుండెను. ఒక్కవాని మీదనా నీ పౌరషము? నిలు నిలుము. ఇటు రమ్ము అని యిట్లొకరినొకరు గద్దించి పలుకుచు యుద్ధభూమి యందు తమ భుజబలము కొలది పోరుచుండిరి. పైనున్న వల్లె వాటు జారుచుండగా సాధనములు పడిపోగా కవచములు నేలబడగా మేనుమరచి ఆ రాక్షస సైన్యములు ఎత్తి శూలములతో హెచ్చుగా మోది వానరులను బాధనొందజేయగా ఈర్ష్య మనసులందు నిండగా వారును అట్లే పోరగా అప్పుడాయుద్ధము మహాభయంకరముగా నుండెను. పదుగురను, ఏడుగురిని వానరులను రాక్షసులు వివిధాయుధములతో సంహరింపగా వదలక వానరులును అప్పుడే పదునేడ్వురు రాక్షసులను చంపిరి. ముడులు వీడుచున్న తలలును, జారుచున్న వస్త్రములును, విరిగిన టిక్కెములను, చినిగిన కవచములును గలవారై పరువెత్తుచున్న రాక్షసులను వానరు లౌద్ధత్యముతో చుట్ట ముట్టి చంపుచుండగా

★★★



# డెబ్బది యాఱవ సర్గము

## అంగదుడు కంపనుని జంపుట:

వీరులు నశించునట్లుగా తుములయుద్ధ మిట్లు ప్రవర్తిల్లుచుండగా ధీరులలో శ్రేష్ఠుడైన అంగదుడు తెగించినవాడై యుద్ధకౌతుకము హెచ్చగా కంపనునితో తలపడగా ఆతడు రారా యిటు రమ్మనుచు క్రోధముచే ఎఱ్ఱబడిన కన్నులు గలవాడై తన చేతనున్న పెద్దగదచే వేగముగా గొట్టెను. అంగదుడాతని గదను పీకి ఆ కంపనుని దానిచేతనే గొట్టెను. అట్లు కొట్టగా అన్ని అవయవములు చలింపగా తెలివిదప్పినవాడై తెప్పరిల్లి తిరిగి కొట్టగా అంగదుడొక పర్వతమును ఆ రాక్షసుని శిరముపై బడవేయగా దానితో శక్తి నశించినవాడై ఎప్పుడో ప్రాణములు పోయినవాడై యుద్ధభూమిలో కూలిపోయెను. గొప్పదనము నశించి పీనుగై పడిన కంపనుని చూచి వేగముగా శోణితాక్షుడు బాణములను గురిపించుచు ఇంద్రుని మనమడైన అంగదుని నొప్పింపగా అతడును గొప్ప బలముతో వింటిని, గుఱ్ఱఖడ్గమును, రథమును పిండిపిండి చేయగా ఆ రాక్షసుడు వాడి ఖడ్గమును, డాలును బట్టి శౌర్యముతో వేగముగా ఆకాశమున కెగిరెను. వెంటనే వాలిపుత్రుడు గూడా వానివెంటనే పైకెగిరి చేతి యందున్న ఖడ్గమును బలాత్కారముగా లాగికొని భుజముపై జర్రున నరుకగా వాని శరీరము జందెము వేసినట్లు చీలికయయ్యెను. ఆ ఖడ్గముతోనే శత్రువులను నొప్పించుచుండగా శోణితాక్షుడు ఇనుముతో చేయబడిన గదను బూని తాకెను.

ప్రజంఘుడు, యూపాక్షుడు కలిసిరి. ఆ వానరనాథుడు రెండు ప్రక్కలను రాక్షసులుండగా విశాఖ నక్షత్రముల నడుమనున్న పూర్ణచంద్రుని వలె మెరసెను. వానిని రక్షించుటకై మైందుడు ద్వివిదుడు వేగముగా తోడురాగా ముగ్గురు రాక్షసులకును, ముగ్గురు వానరులకును పోరు ఘోరముగా సాగెను. వానరులు వేయుచెట్లను ప్రజంఘుడను రాక్షసుడు ఖడ్గముతో వదలక ఖండించెను. యూపాక్షుడా తరువులను బాణములతో ఖండించెను. ద్వివిదుడు వేసిన చెట్లను శోణితాక్షుడు కోపించినవాడై పెద్దదైన గదచే నేలబడగొట్టెను. విరోధుల మర్మములను ఛేదించునదియు మిక్కిలి భయంకరమైనదియు

నగు ఖడ్గమును రెండుచేతులతో పట్టుకొని ప్రజంఘుడు వేగముగా వాలిపుత్రునిపై తలపడెను.

### అంగదుడు ప్రజంఘుని జంపుట:

సమీపమునకు వచ్చిన ఆ రాక్షసుని తారాపుత్రుడు ఇను మద్దివృక్షముచే కొట్టగా ఆ దెబ్బ వేగమునకు చేతిఖడ్గము జారగా పిడికిటిచే అతడు వానరుని నొసటిపై పొడిచెను. అట్లు దెబ్బతిని అంగదుడు క్షణకాలము కొద్దిగా కంపించి తేరుకొని చేతితో ఆ ప్రజంఘుని తల తెగవ్రేసెను. అట్లు చచ్చిన పినతండ్రిని జూచి కన్నుల నీరు గారగా బాణములు లేనివాడగుటచే కత్తిని బెట్టుకొని యూపాక్షుడంగదుని పై కురికెను. ఇంతలో ద్వివిదుడు తలపడి వాని రొమ్మును పగులునట్లుగా గ్రుద్ది చేతులతో అతనిని గట్టిగా పట్టుకొనెను. అట్లు చిక్కుపడిన సోదరుని సమీపించి శోణితాక్షుడు ద్వివిదుని ఱొమ్ముపై గదతో మోదగా అతడు త్వరగా లేచి రాక్షసుని చేతి గదను లాగికొనెను. గొప్ప పరాక్రమవంతుడగు మైందుడు యూపాక్షుని ఱొమ్మును చేతితో పొడిచెను. అటు వానరులకును రాక్షసులకును చూచుటకు రమ్యమై, హృదయమునకు సంభ్రాంతి కరమై యుద్ధము జరిగెను. ద్వివిదుడు శోణితాక్షుని నేలబడద్రోసి ఱొమ్ముపై త్రొక్కి రోషములో శరీరము మరిచినవాడై గోళ్లచే రాక్షసుని ముఖమును పీకి కంఠమును మెడకు తగులునట్లు అణచి నలిపి చంపెను. అంతలోనే వానరనాథుడు మైందుడు తొందరగలవాడై యూపాక్షుని సంహరించెను.

### కుంభుడు వానరవీరుల నొప్పించుట:

అట్లు వీరులు మరణింపగా సైన్యములు వెలవెలబోవుచు కుంభుని చేరబోగా అతడు క్రోధమూర్తియై ఉగ్రత్వముతో వింటి నారి మ్రోత దిక్కులు నిండగా విజృంభించి, మెరుపుతో గూడిన ఐరావతాఖ్యమగు ఇంద్రచాపమును దలపింపజేయు వింటిని బూని సర్పములవంటి బాణములతో వానరుల ప్రాణవాయువులను హరింపగా, చెవి వఱకు లాగి విడిచిన బాణములచే ద్వివిదునిపై వేయగా ఆతడు ఆ బాణముల దెబ్బకు బాధనొంది కొండవలె నేలగూలెను. ఇట్లు తమ్ముడు పడగా మైందుడు కుంభునిపై ఒక పెద్ద శిలను విసరెను. తనమీద పడవచ్చుచున్న శిలను ఐదుబాణములతో పడగొట్టి సర్పము వంటి బాణమును వేయగా ఆ దెబ్బను సహింపజాలక మైందుడు నేలపై, అంగదుడు సాటిలేని గొప్పబలము గలవాడై వేగముగా కుంభుని దాకెను.

## అంగదుడు కుంభునిచే నొచ్చిపడుట:

వచ్చుచున్న వాలిపుత్రునిపై ఐదుబాణములను, మఱల మూడింటిని, అగ్నివంటి అనేక బాణములను వ్యర్థములు కానివానిని వేగముగా కుంభుడు కురిపించెను. అధికమైన సాహసముతో అంగదుడును ఏమియు నొవ్వక ఓర్చుకొని నిలబడి కుంభునిపై హెచ్చుగా రాళ్లవాన గురిపించెను. అతడా రాళ్ల వర్షమును పొడిగా పడజేసి తనపైకి వచ్చుచున్న తారానందనుని కనుబొమ్మలకు తగులునట్లుగా ప్రకాశించు మొనలుగల బాణములతో కొరవులతో ఏనుగును వలె దిగులు జెందునట్లు కొట్టగా రక్తము కారగా చేతితో కన్నులు మూసికొని సమీపమున నున్న పెద్దవృక్షమును రెండవ చేతితో పట్టికొని ఝొమ్మున గదలించి మూలముతో గూడ ఏనుగు వలె పెకలించి మహాబలముతో రాక్షసుని మీద వేసెను. ఆ రాక్షసుడును, మందర పర్వత సమానమైన ఇంద్రధనువుతో సమానమైన ఆ వృక్షమును చిందఱవందఱ జేసి శరీరమును ఛేదించుననియు, అధికమైన వేగము గలవియు, దృఢమైనవియునైన వాడి బాణములతో శరీరమును చీల్చగా కలవరపాటుతో సహింపరాని వేదనతో అంగదుడు నేల బడెను. అట్లు అరచి వేదనతో మూర్ఛమునిగి సముద్రతీరమున కూలియున్న ఆ ధీరశ్రేష్ఠుని అవస్థను కొందఱు వానరులు రామచంద్రునితో జెప్పగా అతడు జాంబవంతుని మరికొందఱు వీరులను తోడ్పడుటకు బంపెను. వారును రాళ్లను వృక్షములను అధికముగా ధరించి యువరాజును రక్షించుటకై వేగముగా కుంభుని దాకిరి. వేగదర్శి, సుషేణుడు, జాంబవంతుడు క్రోధముతో తన మీదకు వచ్చు విధమును జూచి వాడును ప్రవాహవేగమును చెట్లచేత కొండలచేత అడ్డగించు విధముగా బాణ సమూహముల చేత వారినడ్డగించెను. ఆ బాణముల వరుసను సముద్రము చెలియలికట్టను దాటలేని విధముగా దాటజాలక చిక్కువడుట జూచి సుగ్రీవుడు అధికమైన కోపముతో అన్న కుమారుని వెనుక వేసికొని అడవియేనుగును సింహము తరిమిన విధముగా తరిమి అశ్వకర్ణము, చంద్ర మొదలైన వృక్షముల వరుసలను ఆకాశమునిండునట్ల వేసెను.

## సుగ్రీవుడు కుంభు నుపాలంభించుట:

అసూయతో కుంభకర్ణపుత్రుడగు కుంభుడును అనేకమైన బాణములతో ఆ చెట్లనన్నిటిని పడద్రోయగా అవి శంకువులు నాటిన తీక్షమైన శతఘ్నులవలె ప్రకాశించెను. ప్రకాశమానమైన తేజము గల సూర్యపుత్రుడు మీద మీద పడుచున్న బాణసమూహములను

తగ్గని ధీరతతో లెక్కచేయక రాక్షసుని పైకి దూకి వింటిని విరిచి మిక్కిలి కష్టమైన పనిని చేసియు కోపముతో దంతములు విరిగిన మదపుటేనుగు వలెనున్న కుంభునితో నిట్లనెను. ఓ కుంభుడా! నీ బాణవేగము నీ శౌర్యము వలెనే ఆశ్చర్యమును కలిగించినది. గొప్పనైన వినయము నందును, బలము నందును నీ పెదతండ్రియైన రావణునకు మిక్కిలిగా సాటివచ్చువాడవు. ఇంద్రుడు, ప్రహ్లాదుడు, బలి, నిరృతి, కుబేరుడు అనువారలకు నీవు సాటి కాగలవాడవు. సహజ దేహబలము చేతను, తేజస్సుచేతను నీ తండ్రితో సమానుడవు నీవొక్కడవే సుమా. విజితేంద్రియుని మనోవ్యాధులు మీరజాలనట్లు నిన్ను దేవతలైనను మీరజాలరు. ప్రాజ్ఞుడా! వెనుదీయక నీ యెల్ల బలమును నాకు చూపింపుము. నేను చూడగోరుచున్నాను. నీ పెద్దతండ్రి తిరుగులేని వరబలము చేతను, నీ తండ్రి సహజమైన శక్తిచేతను దేవతల సమూహమును బాధించిరి. నీవు విలువిద్యచే ఇంద్రజిత్తును, బలముచే రావణుని పోలినవాడవు. రాక్షససమూహములో బలముచే పేర్కొనదగిన వాడవు నీవొక్కడవే. నాకు నీకు జరుగుయుద్ధమును ఇంద్రశంబరాసురుల యుద్ధమును వలె ఇచ్చటనున్న ప్రాణుల సంఘములు చూచుగాక! దృఢమైన అస్త్రముల చేతను, ధనుర్విద్యాకౌశలము చేతను వానరవీరులను సంహరించితివి. ఎంతటి శౌర్యవంతుడవో కదా. అపవాదు వచ్చునను భయముచే నిన్నిప్పుడే చంపబూనను. ఇక ఆయాసము తొలగించుకొన్న తరువాత యుద్ధము చేయబూనుము. అప్పుడు నీవు నా బలము నంతయు చూడుము. అని గౌరవమైన వాక్యములచే హేళన చేయగా ఆ సుగ్రీవుని గొప్ప బలము మదముగల కుంభకర్ణ సుతుడు పట్టుకొనెను.

## సుగ్రీవుడు కుంభుని వధించుట:

అట్లు పట్టుకొన్న రాక్షసుని నుండి విడివడ తన్నుకొని తిరిగి యముని వలె పైబడగా ఇట్లు దానవ వానరవీరులు హెచ్చైన దోష వేగములు గలవారై మదములు వీడక కొంచెమైనను తగ్గని బింకములతో గజములవలె బలములతో పోరిరి. మాటిమాటికి ఊర్పులు నిగిడించుచు తలపడి ఒకరితో నొకరు పెనగుచు ఒకదానితో నొకటి పేనిన విధముగా శరీరము కనిపించగా క్రింద దొర్లుచు, దెబ్బలచే నొకరి నొకరు నొప్పించుచు, విరోధి శరీరమును బట్టి ఊడ్చుచు అలసి ఒగర్చుచు, నోటినుండి పొగతో గూడిన మంటలను గ్రక్కుచు ఇద్దరును పాదముల దెబ్బలచేత సముద్రము ఘూర్ణిల్లగా భయంకరముగా పోరాడుచుండగా సమయము చూచి సుగ్రీవుడు కుంభుని పట్టుకొని సముద్రమధ్యమున

బలముతో విసరివేయగా వింధ్యపర్వతమువలె కుంభుడును సముద్రములో నీరు లేని యొడ్డునకు శౌర్యముతో దూకెను. కోపమే మూర్తీభవించిన విధముగా సముద్రమునుండి వెలువడి మహావేగముతో సమీపమున దూకి యింద్రుని వజ్రాయుధము వంటి పిడికిటితో సుగ్రీవుని గ్రుద్దగా శరీరము బ్రద్దలై రక్తమునదిగా స్రవించెను. అతని శరీరమునందలి ఎముకలాదెబ్బను నిలువరించెను. ఇంద్రుడు పర్వతముల రెక్కలు నరుకునపుడు వజ్రాయుధపు తాకిడి వలన పుట్టిన అగ్నియోయనునట్లు పిడుగుతో సమానమైన ఆ దెబ్బతో వింతయైన కాంతి వానరనాథుని శరీరము మీద కనిపించెను. అట్లు దెబ్బతిని వానరనాథుడు హుమ్మని వేయికాంతులతో ప్రకాశించు సూర్యమండలము వలె దృఢమైనదియు, ఇంద్రుని వజ్రాయుధము వంటిదియు అయిన పిడికిలి బిగబట్టి ఆ రాక్షసుని ఱొమ్మును బలముతో గ్రుమ్మగా ఆ దెబ్బచే మిక్కిలి బాధనొందిన వాడై కుంభుడు నేలగూలెను. రుద్రునిచే తిరస్కరింపబడిన సూర్యునివలె వానరనాథునిచే మర్దింపబడినవాడై ఇటునటు తన్నుకొనుచు నేలబడి జ్వాలలణగిన అగ్నివలె ఆ రాక్షసుడు ఆకాశము నుండి అంగారకుడు నేల గూలినయట్లు కుంభుడు నేలపై బడగా వనములతో పర్వతములతో గూడ భూమి వణకెను. రాక్షస సమూహములు భయమునందెను.

★★★



# డెబ్బది యేడవ సర్గము

## నికుంభుడు కపులను పారద్రోలుట:

అట్లు వానరరాజు తన అన్నయైన కుంభుని సంహరింపగా నికుంభుడు కోపముతో విజృంభించిన వాడై మంటలు గ్రక్కుచున్న చూపులతో సుగ్రీవుని స్తంభింపజేయువానివలె నొప్పుచు మాలికలతో బంగారు వస్త్రములతో అలంకరింపబడినదియు ఎత్తైన పర్వత శృంగము వంటిదియు. ఐదు వ్రేళ్ళ గుర్తులు గలదియు, యముని దండముతో సమానమైనదియు, అఖిలరాక్షసుల భయమును నశింపజేయునదియు అయిన పరిఘాయుధమును ఎత్తెను. వక్షస్థలముపై బంగారు పదకములు, బాహుపురులు ప్రకాశించుచుండగా కర్ణకుండలములు, కాంతి సమూహములను ప్రసరింప జేయుచుండగా, పరిఘతో వాడు మెరుపులతో గూడిన మేఘము వలె వెలిగెను. ఆ పరిఘాయుధమును త్రిప్పుచుండగా పుట్టిన భయంకరమైన అగ్నిచే మహావాయువులు మండుచున్నట్లు గనిపించెను. అలకాపట్టణమును, గ్రహములను, నక్షత్రములను, గొప్పగ్రహములను, చంద్రుడును, సకలజగత్తును, ఇంద్రుని స్వర్గముతో గూడ తిరుగుచున్నంట్లుండెను. పరిఘయొక్కయు ఆభరణముల యొక్కయు కాంతులతో నొప్పుచున్న నికుంభుడనెడి అగ్ని వానర వీరులకు ప్రళయకాలాగ్ని వలె భరింపరాని దగుటచే మిగుల భయముతో పరుగెత్తిరి. కదలక మెదలక పెదవుల తడిలేక యెండిపోగా భయముతో శౌర్యవిహీనులై రాక్షసులును, వానరులును నిలబడిరి. ఒక్క హనుమంతుడు మాత్రమే భయపడక అతని యెదుట నిలిచెను.

## హనుమంతుడు నికుంభుని వధించుట:

అట్లు తన యెదుట నిలిచిన హనుమంతుని జూచి నికుంభుడు ఆ బలమైన పరిఘాయుధముతో గురిచూచి ఝొమ్మున గొట్టగా అది హనుమంతుని దాకి ముక్కలు ముక్కలైఉల్కలుగానేలవ్రాలెను.ఆదెబ్బచేభూకంపమునందుపర్వతమువలెచలించినవాడై హనుమంతుడు ఊరకొనక వెంటనే పిడుగువంటి తన పిడికిటి పోటుతో నికుంభుని

గొట్టగా వాడు భయమునందియు తేరుకొని రాక్షసులు సంతోషముతో అరచుచుండగా హనుమంతునిపై బడి గట్టిగా పట్టుకొనెను. అట్లు పట్టువడిన వాయుపుత్రుడు విరోధిని ముష్టితో గట్టిగా పొడిచి బలవంతముగా వాని పట్టును విడిపించుకొని మహోత్సాహముతో నికుంభుని నేల గూలునట్లు కొట్టెను. నేలబడదన్ని అతనిపైకి వేగముగా ఎగిరి మెడను చక్కగా బిగబట్టి మెలిపెట్టి త్రిప్పి శత్రువు గోలపెట్టుచున్నను విడచిపెట్టక కాలితో నలిపి ఒక్క నిమిషములోనే మరణించునట్లు చేసెను. ఇట్లు కుంభుని తమ్ముడు మరణించి నేలగూలగా చూచి వానరులందఱును ఆనందముతో నిండిన మనస్సులు గలవారై విజృంభించి గంభీరధ్వనితో గర్జించిరి. భూమి కంపించునట్లుగా అరచిరి.

★★★



# డెబ్బది యెనిమిదవ సర్గము

## మకరాక్షుడు యుద్ధమునకు వెడలుట:

అట్లు కుంభనికుంభులు సంహరింపబడుటను విని రావణుడు రోషముచే శరీరము తెలియనివాడై క్రోధము చేతను దుఃఖము చేతను బాధనొందినవాడై మండిపడి మూర్ఛనొంది లేచి ప్రఖ్యాతి నొందిన బలముగలవాడైన ఖరపుత్రుడగు మకరాక్షుని చూచి యిట్లనెను. పుత్రకా! గొప్పసైన్యములు సేవింపగా నాయాజ్ఞచే నీవు వెళ్లి వానరులను, రామలక్ష్మణులను సంహరింపుము నాయనా! అని చెప్పగా మరరాక్షుడట్లేయని రావణునకు ప్రదక్షిణము చేసి నమస్కరించి ఇల్లు వీడి బయటకు వచ్చి సైన్యనాధునితో ఇట్లనెను. ఒక్క నిమిషములో నా రథమును తీసికొనిరమ్ము. సైన్యమును సిద్ధపరపుము. అనగా అతడు రథమును సైన్యమును సిద్ధపరచెను. అప్పుడా మకరాక్షుడు రథమునకు ప్రదక్షిణము చేసి ఎక్కి సూతుడా! రథమును వేగముగా తోలుమని చెప్పి ఓ రాక్షసులారా! మీరు నాముందుండి యుద్ధము చేయుడు. నేనును దశకంఠుని ఆజ్ఞననుసరించి శౌర్యముతో రామలక్ష్మణులను, వానరరాజును, తక్కిన వానర సమూహమును ఖడ్గములు, బాణములు, శూలములు అనెడు అగ్నులతో ఎండిన వనమును దావాగ్ని వలె వేగముగా తగులబెట్టెదను అని చెప్పగా, రాక్షస వీరులు వాడియైన అనేక ఆయుధముల కాంతులు నిండునట్లుగా గొప్పయేనుగుల వలె గర్జించుచూ కామరూపధరులై వేగముగా యుద్ధరంగమున నిలిచిరి. వేలకొలది శంఖముల భేరుల ధ్వనులును, గర్జనలును, భుజములను చరచు శబ్దములును, విండ్లనారులను మ్రోగించు ధ్వనులును, కలిసి వ్యాపించగా రాక్షస సైన్యములు మకరాక్షుని వెంట యుద్ధమునకు బయలుదేరిరి. అట్లు యుద్ధసన్నద్ధుడై వెళ్లుచున్న మకరాక్షుని రథముపై నున్న ధ్వజము నేలపై బడిపోయెను. రథసారథి చేత నున్న కోల జారిపడెను. గుఱ్ఱముల కాళ్లు తడబడగా పరువెత్త లేక దైన్యముతో కన్నుల నుండి నీరు గార్చినవి. ధూళితో గూడినవై ప్రతికూలమైన గాలులు దారుణముగా భోరున వీచినవి. అనేకములైన అపశకునములు కనిపించినను లెక్కచేయక ఏనుగులు, సర్పములు, మేఘముల వలెనున్న రాక్షసులు నేను ముందు నేను ముందనుచు భరింపరాని తేజస్సు గల రామచంద్రుని సమీపమునకు వెళ్లగా

★★★

# డెబ్బది తొమ్మిదవ సర్గము

## మకరాక్షుడు శ్రీరాముని తూలనాడుట:

అట్లు వచ్చి రాక్షసులు వానరులతో కలబడిరి. అప్పుడు వానరులకు రాక్షసులకు గుగుర్పాటు గలిగించు ఘోరమైన యుద్ధము జరిగెను. పరిఘములు, కుంతమలు, శూలములు మొదలైన ఆయుధములతో రాక్షసులు, కొండలు, వృక్షములు మొదలగు వానితో వానరులు పోరగా, కఠినమైన ముష్టిఘాతముల చేత కొట్టబడినవారును, వృక్షముల చేతను రాళ్లచేతను ఛిన్నగాత్రులునై రాక్షసులు, వివిధములైన గదల చేతను, ఖడ్గముల చేతను, కుంతముల చేతను, బాణముల చేతను దెబ్బతిన్న శరీరములు గలవారై వానరులు యుద్ధము చేయుచుండిరి. అట్టి యుద్ధము జరుగుచుండగా మకరాక్షుని తీవ్రతకు బాణప్రవాహమునకు తాళలేక భయముచే వానరులందఱు పారిపోవుచుండగా వెనుక రాక్షసులు వేగముగా తరుముచుండగా రాముడు కోపముతో ఆ రాక్షసులను దుర్జయులైన శత్రువుల సమూహములకు భయము కలిగించు వాడి బాణముల వర్షముచే నిల్వరించెను. నిల్వరింపబడిన రాక్షసులను బాణసమూహమును గురియించుచున్న రామభద్రుని చూచి రోషముతో గూడినవాడై మకరాక్షుడు ధైర్యముతో రామదేవునితో నిట్లనెను. నిలు నిలు రామా! ఏమిటికి నిక్కెదవు? నేనిక్కడనే యున్నాను. నీ బలమును జూడ వచ్చితిని. ద్వంద్వ యుద్ధమున నీ ప్రాణములను భూమికి బలియిచ్చెదను. పారిపోకుము. నేను లేని సమయమున దండకాటవి యందు నాతండ్రియైన ఖరుని కష్టముతో సంహరించితివి. పరాక్రమముతో నాయెదుటనున్న నిన్ను చూడగా నా యొడలు మండిపోవుచున్నవి. దుర్మార్గుడా! కాలము నా కనుకూలముగా నుండుటచే దైవము కూడా నాకు సాయపడుచున్నాడు. చిన్న మృగమును ఆకలితో నున్న సింహము నివాసమునకు జేర్చినట్లు నిన్ను నా యెదుట నిలబెట్టెను. నాచేత యుద్ధమున చచ్చినీవు యముని పట్టణమునకు వెళ్లి పూర్వము నీచే చచ్చిన రాక్షసులును నీవును స్నేహముతో క్రీడింపుచుండుడు. ఇక ఎందులకయ్యా! పెక్కుమాటలు రాజా! నీ వీరత్వమును నా శౌర్యమును నిపుడే ఎల్లరును చూడగలరు. గద చేతనో, ఇతరమైన అస్త్రశస్త్రముల చేతనో

లేక వట్టిచేతులతోడనో ఏ యుద్ధమును కోరెదవు. నీవు దేనియందు శ్రేష్ఠ వీరుడవో దానిని కోరుకొని యుద్ధమునకు రమ్ము అనగా మందహాసముతో ఓ రాక్షసుడా! ఏమిటికిరా పొగడుకోలు మాటలు? వృథాగా ఏమేమియో ప్రేలనేల? యుద్ధమునందు శౌర్యముతో గాక యిట్లు మాటలబలముచే ఎందైనను జయము కలుగునా? యుద్ధము నందు నేను దండకారణ్యము నందు పదునాలుగు వేల రాక్షసుల సైన్యమును, దూషణుని, త్రిశిరుని, నీ తండ్రిని సంహరించుటెరుగవా? మూర్ఖుడా! సంతోషముతో వాడియైన తమ ముక్కుల చేతను, గోళ్ల చేతను గ్రద్దలు నక్కలు కాకులు నీ శరీరమునందలి మాంసమును ముక్కుబంటిగా భుజించుగాక.

## శ్రీరాముడు మకరాక్షుని వధించుట:

అని పలుకగా రాక్షసుడు బాణముల యొక్క అధిక వర్షముచే రామచంద్రుని ముంచివేసెను. ఆ గొప్ప బాణసమూహము నంతను రాముడు తన బాణములచే నశింపజేసెను. రాక్షసుడును రాముడును ఈ విధముగా గర్వమును, వేగమును, బలమును చూపించుచు వింటినారి మ్రోతలు ఆకాశమున మేఘము లొరసి కొను ధ్వనితో సాటిరాగా యుద్ధముచేసిరి. మునులును, దానవులును, దేవతలును, ఉరగులును వారి యుద్ధమును రెప్పపాటులేకుండ ఆకాశమున నిలిచి చూచుచుండ ఒకరిచే విడువబడిన బాణములను ఇంకొకరు ఖండించుచు అంతకంతకు పెరుగుచున్న బలముతో గొప్ప వీర్యమును శౌర్యమును ధైర్యమును ప్రకటితమగునట్లు రాముడు వేయు బాణములను రాక్షసవీరుడు నేల గూల్పగా రాముడు రాక్షసుని బాణముల వరసలను నూరు వ్రక్కలగు నట్లు భూమిపై బడజేసెను. అట్లిరువురును విడుచు బాణములు దిక్కులు విదిక్కులు నిండిపోయెను. యుద్ధభూమి యందేమియును కనిపించకుండెను. అప్పుడు రామచంద్రుడు తనతో సమానముగా పోరుచున్న రాక్షసుని చందము నంతయును జూచి వేగముగా రాక్షసుని చేతి విల్లును ద్రుంచి వైచి ఎనిమిది బాణములచే సారథిని సంహరించెను. గుఱ్ఱములను చంపెను. రథము నెగురగొట్టెను. అంతరాక్షసుడు చేతితో శూలమును బట్టి నేలపై దుమికెను. అట్లు నేలపై నిలబడి లోకభయంకరమైన శూలమును భయంకరముగా త్రిప్పిరాముని మీద విసరివైచెను. ఆ కాకుత్థ్సవీరుడు దాని నాకాశమందే మూడు బాణములచేత త్రుంచివేసెను. మిణుగురులు చెదరగా ఆ శూలము పొడి పొడియై నేలబడగా భూతసంతతులెల్లను జానకీనాథుని ఎక్కువగా మేలుమేలని ఆకాశము నిండునట్లుగా పొగడిరి. అట్లు శూలము

ముక్కలై నశింపగా, శూరశ్రేష్ఠుడైన రాక్షసుడు తన చేతి పిడికిలిని బిగించి రఘుసింహమా! నిలు నిలు మనిపై బడవచ్చుచుండగా సుకుమారమైన చిరునవ్వుతో గూడిన ముఖచంద్రుడు గలవాడును, సీతామనోబ్జ భృంగమును అయిన రాముడు ఉగ్రుడై భయంకరమైన అగ్నిబాణమును వింటినారి యందు సంధించి వేయగా ఆ బాణము వేగముగా వెళ్లి రాక్షసుని రొమ్మున నాటగా వాడు క్షణములోనే నేలబడి శరీరమును వీడి యముని నివాసమునకేగెను. ఇట్లు రామచంద్రునిచే రాక్షసుడు పడగానే వానర సమూహములు చెలరేగి ఆనందముతో పొంగిపోయెను. రామబాణములకు భయపడి చావగా మిగిలిన రాక్షససేనలు యుద్ధభూమిని వదలి పరుగెత్తిరి.

★★★



# ఎనుబది యవ సర్గము

## ఇంద్రజిత్తు రెండవసారి యుద్ధమునకు వచ్చుట:

గొప్ప బలవంతుడైన మకరాక్షుడిట్లు సంహరింపబడుటను విని ఇంద్ర విరోధి యగు రావణుడు క్రోధముతో పటపటమని పండ్లు కొరుకుచు కుటిల చరిత్రుడైన తన కుమారునితో నిట్లనెను. ఓ వీరుడైన ఇంద్రజిత్తూ! గొప్పవీరులైన రాముని, సుమిత్రాపుత్రుడైన లక్ష్మణుని యుద్ధమునందు పొంచియుండియో, ఎదుట నిలిచియో మాయలో ముంచియో ఎట్లయినను వధింపుము. ఆలోచింపగా నీవే ఇందులకు సమర్థుడవు మఱియు బలవంతుడవు. ఆ దేవతా నాధుని శూరుడవై యుద్ధభూమి యందు జయించితివి గదా. కుమారా! నీగొప్ప తనము ముందు ఈ మానవులనగా లెక్కయా? వేగముగా యుద్ధమునకు వెళ్లుమనగా అట్లే యని సెలవుగైకొని యజ్ఞభూమి యందు అగ్నిలో హోమము చేయుటకై వెళ్లెను. ఎఱ్ఱని రంగుగలిగిన శిరోవస్త్రములను చేతబట్టి రాక్షసస్త్రీలు భయముతో ఇంద్ర విరోధి హోమము చేయుచోటికి అప్పుడు పరుగున వెళ్లిరి. పేలాలు, గంధము, పుష్పమాలికలచేతను హవిస్సు చేతను అగ్నిహోత్రుని పూజించి శస్త్రములనే దర్భలుగా జేసి తాండ్ర శాఖలను సమిధలుగా జేసి యెఱ్ఱని వస్త్రములను గట్టి ఇనుప స్రువమును బట్టి దర్భల మధ్య ప్రదేశము నందు మిక్కుటముగా నిండునట్లు నల్లమేకను బలి యీయగా, బొగలేని మంటలతో ప్రకాశించుచు విజయ లక్షణములను బయలు పరుచు విధముగా సప్రదక్షిణముగా జ్వాలలెగయు చుండగా బంగారు నగలు ధరించి ప్రత్యక్షముగా అగ్నిహోత్రుడు మంటల నుండి పైకి వచ్చి హవిస్సును స్వయముగా గ్రహించెను. అంతట రావణపుత్రుడు అంతర్ధాన శక్తిగలదియు, నాలుగు గుఱ్ఱములతో ప్రకాశించునదియు, బంగారు అలంకారములు గలిదియు, అగ్ని వంటి తేజస్సు గలదియు, చంద్ర, అర్ధచంద్ర ఆకృతులు గల వాడి బాణములతో నిండినదియును, మృగములతో గూడినదియునైన రథము నెక్కి అందమైన బంగారపు శంఖములు పొదగబడినదియు, ప్రజ్వలించుచున్న అగ్నితో సమానమైనదియు, వైడూర్యములు గలదియు అయిన ధ్వజము మెరయుచుండగా సూర్యసదృశమైన బ్రహ్మాస్త్రము రక్షించుచుండగా జయింపరాని పరాక్రమము గలవాడై

పురము నుండి బయలు వెడలి రాక్షస సమూహములకు తన బాహుబలము తెలియునట్లుగా ఇట్లు పలికెను.

## ఇంద్రజిత్తు కనబడకుండ కపిసేనలను రామలక్ష్మణులను నొప్పించుట:

దొంగమునుల వేషములు ధరించిన ఆ రామలక్ష్మణులను యుద్ధమునందు సంహరించి నా తండ్రికి జయము కలిగించెదను. నిజముగా నేడే భూమండలము రామలక్ష్మణులు వానరసేనలు లేని దగును. రాక్షసనాధునకు సంపూర్ణమైన ఆనందము కల్గును అని చెప్పుచు మాయమై జయమును కోరినవాడై యుద్ధమునకు వెళ్లెను. దశవదనునిచే పంపబడినవాడును, దారుణ మైన రోషము గలవాడును, దివ్యమైన ధనువును, గొప్పబాణములను ధరించినవాడును అయిన యింద్రజిత్తు రాక్షస యోధులను తిరస్కరించినవారును, క్రోధపరవశులును, మూడు శిరస్సులు గల సర్పముల కాంతి వంటి కాంతితో ప్రకాశించువారును అగువారిని జూచెను. చూచి ఓహో వీరే కదా వానరసమూహము మధ్యనున్న దశరథ పుత్రులని తలంచి వింటినెక్కు పెట్టి బాణముల వరుసలను వారిమీద ఘోరమైన ధారలుగా పడునట్లుగా పరంపరగా కురిపించగా రామలక్ష్మణులును బాణములతో నిండిన శరీరములు గలవారై కోపముతో ఆకాశమంతయును బాణములచే వ్యాపింపజేయగా అందొక్క బాణమైనను ఇంద్రజిత్తునకు తగులదయ్యెను. పొగమంచు క్రమ్మినట్లు ఆకాశమున పొగతో గూడిన చీకటిని భయంకరముగా వ్యాపింపజేసి బాణముల వానను ఘోరముగా కురిపించగా వింటినారి మ్రోతయో గుఱ్ఱముల డెక్కల చప్పుడో రథ చక్రపుటంచుల ధ్వనియో ఏదియు వినబడదు. బాణములు పడుటయే అధికమగుచుండెను. ఇంద్రజిత్తు ముందునకు వెళ్లి రామలక్ష్మణుల శరీరములను బాణములచే ముంచెను. వారు గొప్పవానచే కొట్టబడిన కొండలవలె బాణములచే కొట్టబడిన శరీములుగలవారై వాని బాణములు వచ్చుచున్న దిక్కుచూచి శౌర్యముతో వాడియైన బాణములను వేసిరి. ఇంద్రజిత్తు ఆ బాణములు తగిలి బాధజెందినవాడై తిరిగి బాణములను వారలపై గురియింపగా రామలక్ష్మణులును మహాస్త్రములచే ఆ బాణములను నూరువ్రక్కలు చేయుచు యుద్ధము చేసిరి. ఆ రాక్షస శ్రేష్ఠుడు విక్రమముతో నిశిత బాణములు శరీరములు చీల్చునట్లు వేసెను. పూచిన మోదుగు చెట్లవలె కనిపించుచు రామలక్ష్మణులుండగా ఎవరికిని ఆ నీచుని రూపముగానీ విల్లుగానీ, నిల్చినవిధమో పోయినరీతియో బాణములో తెలిసికొనుటకు ఎవ్వరికి శక్యముకాకుండెను.

ఇట్లు వాడు మాయచే విజృంభింపగా వందలు వేలుగా వానరసంఘములు అంతట నేలగూలెను. ఆ మాయావి యుద్ధవిధానమునకు క్రోధము నందినవాడై లక్ష్మణుడు సీతానాధునితో నిట్లనెను. అన్నా! దారుణమైన బ్రహ్మాస్త్రముచే రాక్షసులు మొత్తముగా భూమియందు లేకుండగా జేసెదను, నీకది యిష్టమైనచో అనగా, గొప్పదయగలవాడును, నిర్మలమైన మనస్సుగలవాడును అగు రామచంద్రుడు తమ్మునితో నిట్లనెను. తమ్ముడా! ఒక్కని కారణముగా భూమియందున్న సమస్త రాక్షసులను సంహరించుట ధర్మమా? మూర్ఛిల్లిన వానిని, యుద్ధము మానినవానిని భయపడిపారిపోవువానిని, చేతులు జోడించినవానిని, దాగికొనినవానిని, నీవే నాకు దిక్కన్నవానిని, శత్రువైనను చంపుట ధర్మము గాదు. కాన వీనిని వధించు ఉపాయమును వేగముగా ఆలోచింతము. వీడు మాయచే కనబడకున్నాడు. వానిని కనబడ జేసినచో వానరులే సంహరింతురు. వాడు పాతాళమున కేగినను ఆకాశమున కెగిరినను నేనిదే సంహరింపబూనుచున్నాను. చక్కగా చూడుము. నా బాణములచే దహింపబడ్డవాడై నేలపై బడును చూడుము అనుచు పురుషోత్తముడు వికసించిన తామరలవంటి నేత్రమలు గల రాముడు ఆకాశమును జూచెను.

★★★



# ఎనుబది యొకటవ సర్గము

## ఇంద్రజిత్తు మాయా సీతతో హనుమంతుడున్న దిక్కున కేగుట:

యోధులలో శ్రేష్ఠుడైన రఘురాముని సంకల్పమును తెలిసికొన్నవాడై రావణపుత్రుడు రాఘవుడు క్రోధమును బూనెనని భీతి చెందినవాడై యుద్ధమును మాని పురమునకు వెళ్లెను. తనవారు మరణించుటను మనస్సునందు తలపోసిపోసి కోపముతో మండుచు కన్నుల నుండి నిప్పులు రాలగా రాక్షసుడు తిరిగి పడమటి ద్వారమున వచ్చెను. వచ్చి బాగుగా యుద్ధము చేయుచున్న రామలక్ష్మణుల శౌర్యము నణపదలచి అచ్చుగ్రుద్దినట్లు రూపముండునట్లు మాయాసీతను కల్పించి దుఃఖించుచున్నదానిని రథము నందు నిలబెట్టి వానర సైన్యము పెద్ద మోహమున మునుగగా వేగముగా వారల ముందరకు సీతను సంహరింపగోరుచు వెళ్లెను. పురము నుండి బయలుదేరి వచ్చుచున్న యింద్రజిత్తును జూచి వానరులందఱు నొక్కమారుగా చెట్లను కొండలను చేతులందుబట్టి వాయుపుత్రునితో గలిసి వానిని సంహరింపవలె ననెడి యాశతో వేగముగా వెళ్లిరి. హనుమంతుడును ఒక పెద్దకొండ చేత ధరించి ఎదురేగి రాక్షసుని రథముపై మాసియున్న ఒంటి చీరతో చిక్కులుపడిన జడతో కన్నుల నుండి కారుచున్న కన్నీటి కాలువలతో, ఉపవాసకారణము చేత కృశించియున్న శరీరముతో భూషణములు లేనిదై దీనురాలై ధూళిగ్రమ్మిన శరీరమున ప్రకాశహీనయైయున్న స్త్రీని వాయుపుత్రుడొక నిమిషము చూచి యీమె జానకియే యనుచు బాధనొందెను. కొలది దినములకు పూర్వమే తానామెను చూచినవాడు కాన సీతయని గుర్తించుటచే ఆపద పొందినదై వాని రథమున నుండుట జూచి హనుమంతుని హృదయము అల్లకల్లోలముగా ఉడికెను.

## ఇంద్రజిత్తు మాయా సీతను జంపఁబూనుట:

ఏమి చేయునో యితడీ సీతాదేవి నీ విధముగా బట్టి తెచ్చుటకు హేతువాదియో అని తలంచుచు హనుమంతుడు వానర సైన్యముతో గూడి అతి వేగముగా యుద్ధమునకు ఎదురై రాగా వీరుడగు ఇంద్రజిత్తు వారిని జూచి అణపరాని క్రోధముతో వేగముగా

ఖడ్గమును తీసి ఎత్తుచు దుష్టుడు మాయాసీతాదేవి జుట్టును చేతబట్టి రామా! శ్రీరామా! అని ఆ స్త్రీ ఏడ్చుచుండగా శిరమును ఖండింపనుండగా హనుమంతుడు కన్నులందు కన్నీటి ప్రవాహములు నిండుచుండగా సుందరమైన శరీరము గల రామచంద్రుని ప్రియురాలు పట్టపురాణి మనోహరమైన చరిత్రగల సీతను జూచుచు కోపముతో రాక్షసునితో ఇట్లనెను. మూర్ఖుడా! ఇతరుని భార్య కేశములను ఆత్మనాశనము పొందుటకే యిట్లేల పట్టితివి? దుర్మదుడా! పాపాత్ముడా! శుంఠా! కీర్తింపబడిన బ్రహ్మఋషి వంశమునందు రాక్షసియోని యందు జన్మించితివిరా. ఓరీ! దురాత్మా! పాపీ! కనుక నరకమార్గమునకు పోవునట్టి యిట్టి మహాకల్మషమైన ప్రవర్తనమును తలపెట్టితివి క్షుద్రస్వభావుడా! ఖలుడా! క్రూరమైన నడతగలవాడా! దయలేనివాడా! ఏమిరా! నీ మనస్సు నందు కరుణగానీ జుగుప్సగానీ తోచదా? స్త్రీని చంపజూచుచున్నావు. పాపము. రాజ్యమును, ఇల్లు వాకిలిని రామచంద్రుని సన్నిధిని విడిచి కష్టపడుచు ఇప్పుడేమి తప్పు చేసినదిరా ఈ మిథిలానాధుని పుత్రికను నీవిట్లు చంపబూనుటకు? నీవే గనుక సీతాసతిని జంపితివా నీవు నిజముగా చిరకాలము జీవింపలేవుసుమా. నిన్ను నేనే విధముగనైనను చంపెదను. ఓ ఇంద్రజిత్తూ! నాచేతికి చిక్కి తిరిగి వెళ్లగలవా? ఓరీ లోకులచే వధింపదగినవాడా! జడుడా! క్రూరమైన మనస్సుగలవాడా! నీవు నాశనమైన శరీరము గలవాడవై స్త్రీలను సంహరించు పాపాత్ములుండెడు లోకమును పొందెదవు సుమా.

## ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట:

అని తన మీదకు వచ్చుచున్న హనుమంతుని సేనలను జూచి వారినందఱిని తన బాణవర్షమున ముంచుచు పారిపోవునట్లు చేసి వాయుపుత్రునితో నిట్లనెను. నీవును, ఆ సూర్యపుత్రుడైన సుగ్రీవుడును, రాముడును ఏ స్త్రీకై ఇచ్చటికి వచ్చితిరో, ఓ వాయుపుత్రా! బలాత్కారముగా ఆ సీతను నీవు చూచుచుండగనే సంహరించి, మఱియు రఘువంశ్యులగు రామలక్ష్మణులను వధించెదను. నిన్ను, సుగ్రీవుని, అనుచిత మార్గున నడచుచున్న దుష్టుడైన విభీషణుని చంపివేసెదను. వానరుడా! స్త్రీని చంపరాదని పలికితివి. శత్రు పక్షమునకు మనస్సులు నొప్పించు కార్యములు విడువక చేయుట తగినదేయగును సుమా. అని పలికి మాయచే నిర్మితమయిన సీతను తన చేతి కత్తివాదరతో నఱికెను. అది రోదనము చేయుచుండగా జన్నిదము వలె నరుకగా శరీరఖండములు నేలపై బడెను. ఈ విధముగా

ఖండించి, రామునిపై కలిగిన అధికమైన కోపముతో ఆ భూపుత్రికను జంపితిని. ఓ వానరుడా! మీ శ్రమయంతయును వృధాయే గదా. అనుచు ఆకాశము పిక్కటిల్లునట్లు సింహనాదము చేయగా విజృంభించిన విరోధిని జూచి ధైర్యమును వీడి కోతులసైన్యము పారిపోయెను.

★★★



# ఎనుబది రెండవ సర్గము

## హనుమంతుడింద్రజిత్తుతో పోరుట:

చెదరిన పాదరసము వలె భయముచే ముఖములు తెల్లనైన వారై పరుగెత్తుచున్న ఆ దీనులైన వానరులను జూచి మృదువైన మాటలతో అందఱు వినుచుండగా ఇట్లనెను. సాహసవంతులారా! రణోత్సాహులారా! యుద్ధోత్సాహమును విడిచి వేసి దృఢమైన ధైర్యమును పెద్ద ప్రవాహములో గల్పి వీరయుద్ధమును వీడి విరోధులందఱు ఫక్కున నవ్వగా, ఇది అపకీర్తి కలిగించునని తలంచలేనివారై ఈ విధముగా కాలికి బుద్ధిచెప్పుట తగునా? మీ శౌర్యము లెందుబోయినవి? మగతనము మిమ్ము విడిచిపోయినదా? వెనుక ముఖములు వెట్టిపారిపోవుట కార్యమా? అంతభయమా వీరశ్రేష్ఠులారా! నేను ముందు వెళ్లెదను మీరు నావెనుక రండు అని చెప్పగా వారందఱును చెట్లను కొండలను బట్టుకొని హనుమంతుని చుట్టిరాగా అసమానమైన వేగముగల వాయుపుత్రుడు శత్రుసైన్యములను ప్రళయకాలాగ్ని వలె కాల్చుట మొదలిడెను. మనస్సున అధికమైన కోపము శోకము పెనగొనగా భయంకరముగా ఒకపెద్ద బండను రావణి రథముపై వేయగా సారథి మిగులనేర్పుతో రథమును దూరముగా కొనిపోయెను. ఆ బండను అచ్చటనున్న రాక్షస సంఘములను నలినలి చేసి నేలను చీల్చుకొని శత్రువులు తత్తరము చెందునట్లు భూమిలోనికి వెళ్లెను. అంతలో వానరులందరు గలిసి ఇంద్రవిరోధిని పెద్దపెద్ద చెట్లచేతను శిలలచేతను గొట్టి ఎంతయో నొప్పించుచు వానిని గాచుచున్న సైన్యమును పీనుగుపెంటలుగా చేయగా ఇంద్రజిత్తు తీవ్రబాణములను నారి యందు సంధించుచు వానరనాధులతో తలపడి వారిని కలత నొందించెను. తమ నాయకుని పరాక్రమము, గొప్పగా విజృంభించుటను చూచి రాక్షసులు మత్తులై శూలములను పరశువులను, ఖడ్గములను బట్టి వానరసైన్యమును చంపుచుండుటను చూచి వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు మిక్కిలి తీవ్రమైన కోపముతో భయంకరుడై రాక్షసుల నాపి వానరవీరులతో నిట్లనెను.

## హనుమంతుడు యుద్ధము చాలించి రామునొద్దకేగుట:

ఓ వానరవీరులారా! శత్రుసైన్యము నంతయును చంపివేసినను దానివలన ఏమైన మేలు లభించునా? రఘురాముని నిమిత్తమై కదా ప్రాణముల మీది ఆశను కూడా విడిచి అనేక విధములుగా పోరుట. అట్టి రాముని భార్య యుద్ధమునకు హేతువైన భూపుత్రియే విరోధి చేత చంపబడినది కదా. ఈ జరిగిన విధమంతయు దశరథపుత్రునకును, వానరరాజు సుగ్రీవునకును చెప్పి వారే విధముగా చేయదలంతురో ఆ విధముగా మనమును నడచుట మేలు గదా. అనుచు వానరులను మరలించి అందరును సీతానాధుని జూడబోయిరి. ఇచ్చట ఇంద్రజిత్తు కూడా యుద్ధప్రయత్నమును విడిచి రాముని చూచుటకు ఆంజనేయుడు వెళ్లుట చూచి సంతసించి వేగముగా యథావిథిగా చైత్యవనము నందలి నికుంభిలయందు మాంసరక్తములతో అగ్నిజ్వాలలు గలదై అస్తమించు సూర్యకాంతి వలె ప్రకాశించునట్లు మిక్కిలి గొప్ప హోమము చేయబూనెను. రాక్షసులకు శుభము గలిగించు యజ్ఞమును రాక్షసశ్రేష్ఠులు రక్షించుచుండ ఇంద్రజిత్తు చేయుటకు పూనుకొనెను.

★★★



# ఎనుబది మూడవ సర్గము

## హనుమంతుడు శ్రీరామునకు ఇంద్రజిత్తు సీతాదేవిని వధించెనని తెలుపుట:

అక్కడ రామచంద్రుడు హనుమంతుడున్న దిక్కున కోలాహలము ఆకాశమున కెగయు చుండగా యుద్ధము తీవ్రమైనదని తలంచి జాంబవంతునితో నిట్లనెను. వింటివా ఆ ధ్వనులను? వినగా వినగా శత్రువీరుల ఆయుధముల ధ్వనులు భయంకరముగా వినిపించుచున్నవి. హనుమంతునకు యుద్ధము భారమైనటులు తోచుచున్నది. గాన నీవు తోడుగా వెళ్లుము అనగా అతడు తన సైన్యమును తీసికొని పోవుచు పెద్ద నిట్టూర్పులను విడుచుచున్నవాడును, శత్రువులను సంహరించిన వాడును, వానరసైన్యములతో గూడినవాడును, తన కెదురుగా వచ్చుచున్నవాడును అగు హనుమంతుని త్రోవలో జూచి అతనిచే నిలుపబడిన వాడై నిలిచెను. హనుమంతుడును రామునిచేరజని మిక్కిలి దుఃఖముతో నిట్లని చెప్పెను. ఓ విరోధులబలమును సంహరించువాడా! కడుభయంకరమైన విధముగా మేము యుద్ధము చేయుచుండగా పాపకృత్యములందాసక్తి గల యింద్రజిత్తు ఆ సీతాదేవిని ఏడ్చుచున్న దానిని తాను మాయెదుటనే సంహరించెను. దుఃఖముచే మనస్సు తత్తరపాటు నొందగా అది యంతయు నీకు తెలియజేయుటకై వేగముగా వచ్చినారము. అని చెప్పగనే రఘురాముడు మొదలు నరికిన చెట్టువలె మూర్ఛ తన్ను ముంచగా శోకముతో నేలబడెను. వానరులందఱును చింతనొందినవారై ప్రజ్వలించు జ్వాలలు గల అగ్నియందు వలె మెల్లగా కలువల పద్మముల సుగంధముగల స్వచ్ఛమైన నీటిని తాపము శమించుటకై రాముని మీద చల్లిరి.

## లక్ష్మణుడు శ్రీరామునితో ధర్మము నిరర్థకమని చెప్పుట:

శోకావేశపు భారముచే బాధనొందుచు లక్ష్మణుడు అన్నను కౌగిలించుకొని అస్వస్థుడై యున్న అతనితో ప్రఖ్యాతిగా హేతుబద్ధములైన మాటలను పలికెను. అన్నా! నీవు కేవలము ధర్మాత్ముడవు. ఇంద్రియములను జయించినవాడవు. అందఱికి ఎంతయో మేలు చేయువాడవు. అట్టి నిన్ను ఆ ధర్మము అనర్థము నుండి రక్షింపలేదు కావున మహాత్మా!

ధర్మము నిరర్థకముగదా. ధర్మమనునది ఒకటి యున్నచో స్థావర జంగమములందు వలె లోకములోని వారికెందులకు విశదముగాదు. ఆ విషయము నాలోచింపుము. ఆ ధర్మఫలములు ఒక్కటియును స్థావరముల యందు కనిపించకున్నవి. అట్లుగాన ఓ రాజా! ధర్మమొకటి ఉండుట అబద్ధమని నేను తలంచెదను. అధర్మము అనునదున్నచో దశముఖుడు బహుదుఃఖములను పొందవలెను. అట్లే ధర్మమనునది యున్నచో నీకు ఇటువంటి దుఃఖములు కలుగక ఉండవలెను గదా. దుర్మార్గుడైన రావణుడు కష్టముల నెఱుగకుండుట చేత నిత్యము ధర్మమే ఆచరించు నీవు దుఃఖముల పాలగుచుండుట చేత ధర్మము అధర్మము ఒకదానికొకటి విరుద్ధమైన ఫలమిచ్చుచున్నవిగదా. తలంచి చూడగా ధర్మము చేత కీడును, అధర్మము చేత సౌఖ్యము కలుగునట్లు తోచుచున్నది. ధర్మప్రవర్తన చేత సుఖము కలుగును. ధర్మము విడిచిన దుఃఖపరంపరలు గలుగునని తలంచెదవా అన్నయ్యా! అది వట్టి అబద్ధము. ధర్మమే సౌఖ్యములను కలుగజేయునది యైనచో ధర్మాత్ములు ధర్మము నందే నడిచినచో ఆ ధర్మఫలములు తొలగకుండ ఉండవలదా? జగత్తు నందీ విధముగా జరుగుచున్నవా? ధర్మశీలా? ఇది అంతయు తలచి చూడుము. పాపాత్ములయిన వారలు సౌఖ్యములను పొందుచుండగా ధర్మాత్ములకు కష్టములు దప్పకుండును గదా. అందువలననే భూమండలమునందు ధర్మమును అధర్మమును గూడ నిరర్థకములే సుమా. పాపములు చేయువారలను వారి అధర్మమే బాధపరచునన్నచో క్రియారూపమయి వారిని బాధింపవలసిన అధర్మము ఒక తృటికాలము తరువాత తానే నశించునుగదా. ఆపై అది ఎవనికి బాధలు కలుగజేయును? కర్మ నశించినను కర్మాధిదేవత ఫలము నివ్వదా అని చెప్పెదవేని, దైవమెప్పుడును ధర్మపరులనే బాధించుచున్నాడు. కాదేని కర్మకారుడు అన్యజనులను బాధించును. సత్యముగా ఇటులైనచో పాపకర్మముల ఫలము దుఃఖము దైవమునే చెందును. కర్మము నందదు – ధర్మము దానిచందము కనిపించదు. రూపము లేకున్నను చివరకు చిహ్నములచే నైనను తెలియబడదు. ఓ మాననీయా! అట్టి అసత్సరూపమగు ధర్మము ఏ విధముగా పరమఫలము నీయగలుగును. వట్టి భ్రాంతి గాక. ధర్మమనునదే ఒకటి యున్న యెడల ధర్మాత్ముడవైన నీకిటువంటి కీడులు గలుగునా? మర్మములు చేదించు దుఃఖములు గలుగుటచే ధర్మమన్నది ఉండుట అబద్ధము సుమా. నపుంసకము, దుర్బలమునైన ధర్మము ఆలోచించి చూడగా పౌరుషము ననుసరించి వర్తించును. అట్లగుటచే తనంత తాను స్వతంత్రముగా ఫలముల నీయలేని ధర్మమును

ఆచరింపనేల? చూడగా ధర్మమే పురుషకారమునకు విశేషణమైనచో ధర్మమని ఇన్ని బాధలు పొదవలసిన పనిగలదా? కాన దానిని విడిచి ఇంతవఱకు ధర్మమును సేవించిన విధముగా పౌరుషమును సేవింపుము. రాజచంద్రా! అన్ని కార్యములు చక్కబడును. నన్ను నమ్ముము. సత్యాభాషణము శ్రేష్ఠమైన ధర్మము. దానిని ఆచరించెదనని పల్కెదవు గానీ దానిని గూడా నీవు బాగుగా ఆచరించవైతివి. సభలో అందరు చక్కగా వినుచుండగా నీకు రాజ్యము నిచ్చుట కంగీకరించి నిర్దయుడై తండ్రి నిన్ను ఈ విధముగా అడవులకు బంపెను. అతనిని దండింపక అతని రెండవ మాటను ఆచరించుటకు నీవేమని పూనుకొంటివి? ధర్మమును గాని, అధర్మమును గాని ఏదో ఒక్కటే నరుడు చేయవలెనని నియమమైనచో ఇంద్రుడు ఎందుకు మౌనిని చంపకయజ్ఞ చేయడయ్యెనో! ఆర్యవర్యా! కేవల మధర్మమైనను కేవలము ధర్మమైనను కీడు కలుగజేయును సుమా. సౌఖ్యమును గోరువారలకు ఏ వేళకు తగిన విధముగా అది భావించుట మేలుగదా –

## లక్ష్మణుడు శ్రీరామునితో ధనము సర్వార్థసాధకమని చెప్పుట:

నా అభిప్రాయమిది తండ్రీ! నీకు న్యాయముగా లంభించెడు ధర్మమూలమైన రాజ్యలక్ష్మిని వీడి క్షేమమూలమును పాడుచేసితివి. ధర్మము నిన్నెట్లు వీడకుండును? ధర్మమునకు అర్థము మూలము. అది జనులిచ్చెడు పన్నులచే వృద్ధి చెందుచుండగా పర్వతములనుండి పుట్టిన నదులను బోలిన దానధర్మకార్యములు జరుగును. కాన సర్వకార్యములకు మొదలు ప్రధానమైనది ధనమే. అట్టి ధనమును చేతికి వచ్చినదానిని దూరము చేసికొని తన కార్యమును తానే నాశనము చేసి కొనువానికి మేలు కలుగునా? ధనము లేనివాడే బలము లేనివాడు. ధనము లేనివానిని అన్నదమ్ములైనను విడిచిపెట్టెదరు. ధనహీనుడు తలపెట్టిన పని వేసవి యందు ఏటినీటి వలె నశించిపోవును. సౌఖ్యము కోరువాడు తన సొమ్మును వ్యయమొనరించి తిరిగి సుఖములను కోరినవాడై ధనము సంపాదించుటకు పాపములు చేయుచుండును. దానివలన పాపమును పొందినవాడై తాను నశించును. ధనముగలవాడే భూమియందు పురుషుడు. ధనము గలవాడే సర్వశాస్త్రముల యందును పండితుడు. ధనవంతుడే బలవంతుడు. ధనవంతుడే బుద్ధిమంతుడును, ధర్మాత్ముడును. ధనవంతుడే మహాత్యాగి, ధనికుడే మహాగుణవంతుడును ధైర్యవంతుడును గదా. ధనము లేకపోవుటచే గలుగు అనర్థములను ఇదివఱకే చెప్పియున్నాడను. ఏ

యర్థమును గోరి నీవు రాజ్యమును త్యాగము చేసితివో నేను ఎఱుగను. తాను అర్థమును అర్థమునకై కామమునకై ఖర్చు చేసెడువానికి ఏదియును వృధాగా పోదు. ధనములేనివాడు ధనమునాశించి అనర్థములను పొందును. శాంతము, సంతోషము, కామము, దమము, క్రోధము, దర్పము, ధర్మము ఇవియన్నియు రాజచంద్రా! భూమియందు ధనముచేతనే కలుగును, నిలుచును, ప్రకాశించును. ధర్మము ధర్మము అని ఒక్క ధర్మమునే శరణుపొందిన వారికి ఇహమందు సౌఖ్యము గలుగజాలదు. మేఘములు గప్పినచో సూర్యుడు మొదలైన గ్రహసమూహములు కనిపించని విధముగా సర్వసుఖములకు మూలమైన విత్తములు వినుము రామచంద్రా! నీకు లేవుగదా. తండ్రిని సత్యభాషణునిగా జేయదలంచితివి. దానియొక్క ఫలమును ఇదిగో చూచితివి గదా. నీ ప్రాణములకన్న ప్రియమైన నీయొక్క భార్యను రాక్షసుడు దొంగిలించెను. జరిగిపోయిన దానికి విచార మెందులకు? ఇంద్రజిత్తు చేసినదానికి ప్రతీకారము చేసెదను. రఘురామా! లెమ్ము ఇప్పుడే ఆజ్ఞనిమ్ము. పార్థివోత్తమా! ఆజానుబాహువులు గలవాడా! నియమములను చక్కగా పాలించువాడా! లేలెమ్ము. మహాత్ముడైన పరమాత్ముని నిన్ను నీవెరుగ లేక కటకటా యిట్లు తపింపజేయుచుండగా నేనేమి జేయగలను. నీకు ప్రియమును జేయుటకై పుట్టిన వీడు నీయొక్క ప్రియురాలి వధను హఠాత్తుగా వినుటచే రోషముచే కలుషితమైన మనస్సు గలవాడయ్యెను. దేవా! రథములతో, గుఱ్ఱములతో, ఏనుగులతో కూడినదియు, రాక్షసరాజుతో గూడినదియు అయిన లంకను నాచేతుల నుండి విడువబడిన బాణసమూహములతో వేగముగా గూల్చివేసెదను.

★★★



# ఎనుబది నాలుగువ సర్గము

## విభీషణుడింద్ర జిత్తు మాయోపాయము రామునకు దెల్పుట:

అని సోదర వాత్సల్యము గల లక్ష్మణుడు తగు విధముగా అన్నను ఓదార్చుచుండగా వానరసేనలకు తగువిధముగా నిలిపి ఏనుగులచే సేవింపబడిన గజనాధుని వలె ఉగ్రులైన మంత్రులు కొలుచుచుండగా విభీషణుడు వచ్చి కన్నుల నీరుగార దుఃఖించుచున్న లక్ష్మణుని, తక్కిన వానరులను, లక్ష్మణుని యొడిలో బాధతో ఉన్న రాముని జూచి వగచి దీనికి కారణమేమి యని అడుగగా కన్నుల నీటిని గార్చుచు అతనిని, వానరులను, సూర్యపుత్రుని చూచుచు మెల్లని మాటలతో లక్ష్మణుడిట్లనెను. మహాత్మా! ఇంద్రజిత్తు చేత సీత సంహరింపబడెనని హనుమంతుడు చెప్పగా విని రామచంద్రుడు మూర్ఛనందెను అని చెప్పుచున్న లక్ష్మణుని ఆపి విభీషణుడిట్లు పల్కెను. ఓ అనఘుడా! హనుమంతుని మాట సముద్రము ఎండిపోయిన దన్న విధముగా మనస్సు నందు నమ్మరాదు. సీతయెడల రావణాసురుని మనస్సును నేనెఱుగుదును. ఆమెను చంపడు నొప్పింపడు నమ్ముము రాఘవా! మనుజాధినాధా! నేను మా అన్నను అతని మేలుగోరి భూపుత్రిని విడువుమని ఎంతయో బ్రతిమాలుకొని నాడను. నా హితోక్తులను చెవులబెట్టలేదు. సామము, దానము, భేదము, మాయ, దండము – అను వీనిచేత జనకరాజపుత్రిని సమీపించి చూచుటకైనను ఎవ్వరికిని సాధ్యము కాదు సుమా.

## ఇంద్రజిత్తు నికుంభిలా హోమము చేయుటను విభీషణుడు శ్రీరామునకు దెల్పుట:

ఐనచో ఈ కార్యము చేత కలుగు లాభమేమి? అందువేని వానర సేనలను మోహింపజేసి క్రూరుడై యింద్రజిత్తు నికుంభిలా మందిరమున హోమము చేయుచున్నాడు. అది పూర్తియైనచో వాడు దేవతలకైనను యుద్ధమున జయింపరాని వాడగును గాన విక్రమమును పొందజేయు క్రమమును విఘ్నము చేయుటకై వానరశ్రేష్ఠులను బంపవలెను. రాజా! వాడు మాయ పన్నినాడనుట నిజము. హోమము పూర్తికాక ముందే వీరశ్రేష్ఠులగు వానరులను అచటికి బంపుము. కారణములేని దుఃఖమును విడువుము. లెమ్ము

రామభద్రా! వ్యసనమున మునిగి యున్న నిన్ను జూచి సైన్యమంతయును దుఃఖభారముచే ధైర్యమును వీడినది. వేగముగా మాతో సౌమిత్రిని బంపుము. కక్షతీరునట్లు అతడు రావణి పొగరు నణగించును. శూరుడైన లక్ష్మణుడు మొదట ఇంద్రజిత్తు యజ్ఞమున వారించుటకు శక్యముగాని బాణములచే చెడగొట్టి పిదప వానిని సంహరించును. శత్రువులను సంహరించుటయందు ఆలస్యము తగదు. వెంటనే సుమిత్రానందనునకు ఆజ్ఞనిమ్ము. విరోధి ఈ కర్మము పూర్తిచేసినచో దేవతల కైనను జయించుటకు అసాధ్యుడగును. యజ్ఞము పూర్తియైనచో రాక్షసరాజపుత్రుడు వెంటనే ఆకాశమునందదృశ్యుడై యుద్ధము చేయును. రాజచంద్రా! అప్పుడతనని గెలుచుట దేవతలకైనను శక్యమా!

★★★



# ఎనుబది యైదవ సర్గము

## ఇంద్రజిత్తును జంపలక్ష్మణుని బంపుమని విభీషణుడు శ్రీరాముని వేడుక:

అని విభీషణుడు చెప్పిన మాటలను దుఃఖతప్తుడైన ఆ రాజశ్రేష్ఠుడగు రాముడు వినియు గ్రహింపలేక తిరిగి తెలివి దెచ్చుకొని లేచి యిట్లనెను. నీవు చెప్పిన మాటలను వినగోరుచున్నాను రాక్షసనాయకా! నీవిది వఱకు జెప్పిన హితవాక్యములను తిరిగి చెప్పుము అనగా మహితాత్ముడైన ఆ రాక్షస రాజిట్లనెను. నీ ఆజ్ఞను తీసికొని వెళ్లి సేనలనన్నిటిని ఆయా చోటులలో నిలబెట్టి యధాన్యాయముగా విభజించితిని. చేయగలిగినంత మట్టుకు చేసితిని రామభద్రా! నా మనవిని ఆలకింపుము. మనస్సునందు కారణము లేని దుఃఖమును పొంది మీరిట్లు బాధపడినచో మాదురవస్థ చెప్పతరమా? దేవా! ఈ మాయామయమైన శోకమును శత్రువుల కానందము గలిగించు దానిని విడిచిపెట్టి సంతోషమును స్థిరపరచు పరాక్రమమును పొంది శత్రువులను పరిమార్పజూడుము. జానకీదేవిని తిరిగి పొందవలెనని మనస్సునందు గలదేని రాక్షససంఘముల నన్నిటిని సంహరింపుము. అందులకు నేను ఉపాయమును చెప్పెదను. రామచంద్రా! ఇప్పుడే వానరసైన్యముతో ఈ మహావీరుడగు లక్ష్మణుని నికుంభిలకు పంపించుము. ఈయన యుద్ధములో రావణుని సంహరించును. వింటిని మండలాకారముగ నొనర్చినవాడై ఈ లక్ష్మణుడు విజృంభించి తన భుజబలముచేత బాణపరంపరలచే ఆ ఇంద్రివిరోధి పొగరణగించును. దశరథనందనా రావణపుత్రుడు గొప్పనైన ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మశిరమను నస్త్రమును, ఆకాశమున సంచరించు గుఱ్ఱములను బ్రహ్మదేవునిచే వరముగా పొందెను. అందుచే ఆ రాక్షసుడు యజ్ఞనిర్వహణము నందే మనస్సు నుంచినవాడై యిప్పుడు తన పరివారము చుట్టును రక్షించుచుండగా నికుంభిలకు వెళ్లినాడు. రాజా! అతడాయజ్ఞమును పూర్తిచేసి యుద్ధమునకై వచ్చినచో మమ్మందఱను చచ్చినవారుగా తలంపుము. బ్రహ్మదేవుడును వరమిచ్చునప్పుడు యజ్ఞమునకు విఘ్నము చేసినవాడే ఇంద్రజిత్తును చంపువాడని చెప్పెను. కావున ఓ జానకీనాథా! వానిని సంహరించుటకు నీవనుమతి నిమ్ము. యుద్ధమునందు ఇంద్రజిత్తు చచ్చినచో హితులతో సహరావణుడు కూడ చచ్చినట్లే. రామచంద్రా! బుద్ధిమంతులలో శ్రేష్ఠుడైన వాడా! నేను వాని మాయలను బలమును వేగమును తెలియనివాడను కాను.

వాడు మిక్కిలి ప్రాజ్ఞుడు. బ్రహ్మాస్త్రము నెఱిగినవాడు. రథస్థుడై దేవతలను వరుణునైనను సంహరింపగలడు. ఆకాశము నందు మేఘముల మాటున నున్న సూర్యునివలె కన్నులకు కనిపించకుండ సంచరింపగలడు.

## ఇంద్రజిత్తును జంప శ్రీరాముడు లక్ష్మణుని నికుంభిలకు బంపుట:

అని విభీషణుడు చెప్పగా రామచంద్రుడు దురాత్ముడైన రాక్షస రాజపుత్రుని బలమును మనస్సునందాలోచించి సోదరుడైన లక్ష్మణునితో నిట్లనెను. తమ్ముడా! లక్ష్మణా! నీవు సుగ్రీవుని సర్వసైన్యములతోడను, హనుమంతుడు మొదలైన సేనానాయకులతోను, జాంబవంతునితోను ఆలస్యములేకుండ వెళ్లి ఆ మాయావిని సంహరింపవయ్యా! ఈ మహాత్ముడైన విభీషణుడు తన మంత్రులతో నీకు తోడుగా వచ్చును. అతని యజ్ఞప్రదేశము నితడు చూపించును. అని చెప్పగా అప్పుడే అద్భుతమైన విక్రమము గలిగిన లక్ష్మణుడు తన బంగారపురంగు గలిగిన వింటిని చేత ధరింపగా విభీషణుడును వేరొక ధనువును చేత గొనెను. ఇట్లు సన్నద్ధుడై మిక్కిలి వాడి కలిగిన ఖడ్గమును బాణములను తీసికొని తాను అన్నగారి పాదముల వ్రాలి అధికమైన సంతోషముతో తన గొప్ప పూనిక విధమునిట్లు తెలియజెప్పెను. అన్నా! ఇప్పుడే నా చేతినుండి వెలువడిన వాడిబాణములా దశకంఠుని పుత్రుని శరీరమునందు ప్రవేశించి పుష్కరిణిలో గుంపులుగా ప్రవేశించు హంసలవలె వేగముగా కోటానుకోట్లుగా లంకపై పడగలవు. మహాత్మా! వాడిప్పుడే నా బాణముల దెబ్బలచే చీల్చబడిన సర్వశరీరముగలవాడై భూమిమీద పడగలడు. అని చెప్పి రావణిని వధింపవలె ననెడి కోరికతో ప్రదక్షిణము చేసి రాముని పాదపద్మములకు మ్రొక్కి విభీషణునితోడను, అంజనాపుత్రుని తోడను, వానర సైన్యములతోడను గూడి వెళ్లుచు మధ్యదారి యందు సైన్యముతో నున్న జాంబవంతుని జూచి వారిని గూడ తీసికొని వెళ్లుచు, దూరమునందు శస్త్రములచే భయంకరమైనదియు, విశాలమైనదియు గొప్పకేతనములతో నొప్పునదియు, గొప్పవేగము గలదియు, ప్రకాశమానమై చూచుటకు వర్షాకాలమేఘములకు దగ్గరచుట్టము వలెనున్నదియు అగు ఆ రాక్షసనాథుని సేనను జూచి దారుణమైన విల్లు చేత బట్టి వాయుపుత్రునితోను, వాలిపుత్రునితోను, విభీషణునితోను, ఆ ధూర్తుడైన యింద్రజిత్తు చేయు యజ్ఞమును బ్రహ్మవాక్యము ప్రకారము ధ్వంసము చేయుటకు సిద్ధపడియుండెను. అప్పుడా రాక్షససేనను జూపి విభీషణుడు విరోధులకు బాధాకరమును, తమకు హితసాధకమును అయినరీతిగా లక్ష్మణునితో ఇట్లు పలికెను.

★★★

# ఎనుబది యాఱవ సర్గము

## విభీషణుడు లక్ష్మణునకు ఇంద్రజిత్తుండుచోటు చూపుట:

లక్ష్మణా! మేఘములవలె నల్లగానున్న ఆ విరోధుల యూధమును జూడుము. దానిని తీవ్రములైన బాణములచే విడిపోవునట్లు గొట్టుము. అది తొలగినతోడనే రాక్షసరాజపుత్రుడు కనిపించును. ధీరుడును, క్రూరుడును, వంచకుడును, జయించుటకు శక్యము కాని పరాక్రమము గలవాడును, పాపపు నడవడిగలవాడును, సర్వలోకములకు భయంకరుడును, అగు ఆ అధముడు సేనల మధ్యభాగము నందు యజ్ఞము చేయుచున్నాడు. అని చెప్పగానే పిడుగుల వంటి ఘనశరములను శౌర్యముతో కురిపించెను. వానరులు భల్లూకముల సంఘములు చెట్లతోను కొండలతోను వెళ్లి రాక్షససేనతో తలపడెను.

## కపులు ఇంద్రజిత్తు సేనలతో పోరుట:

రాక్షసులును కలత జెంది ముసలములు, ఖడ్గములు, పరశువులు, తోమరములు మొదలైన సాధనములతో వానరసేనను తాకగా వారికిని వీరికిని పోరు ఘోరమయ్యెను. ఆ యుద్ధధ్వనులు పురము నాలుగు దిక్కులను మహావేగముతో వ్యాపించెను. ఆకాశమంతయు ఎత్తబడిన ఖడ్గములు, కుంతములు, శరములు, కొండలు, చెట్లతో నిండి సంకులమై తోచెను. తమ మీద భయంకరములయిన శస్త్రములను గుర్వించుచున్న రాక్షస సమూహములను, వానరవీరులు వృక్షముల, కొండల సమూహములతో సంహరించి అణచుటకు శక్యముగాని భుజ పరాక్రమమును ప్రకటించుచు మిడుతల దండోయనునట్లు చుట్టుముట్టి చిమ్మచీకటి వలె నున్న సైన్యసమూహములను ముక్కలుచెక్కలై నశించునట్లు కూల్పగా వారలముందు నిలువజాలక రాక్షసులు చెదరిపోగా, తన సైన్యముయొక్క దైన్యస్థితిని జూచి యింద్రజిత్తు హోమకార్యమును వదలి క్రోధముతో లేచివచ్చెను. చీకటిగా నున్న చెట్లమధ్య ప్రదేశమును విడిచి వెలుపలికి వచ్చి మిక్కిలి రోషముతో మండిపడుచు ఇదివరకే సిద్ధము చేయబడిన రథమునెక్కి నల్లనిమేఘము వంటివాడు భయంకరమైన విల్లు బట్టి ఎఱ్ఱని నేత్రములు గలవాడై క్రోధముతో నున్న యముని బోలి బయలుదేరి లక్ష్మణుని ఎదిరించనున్న ఇంద్రజిత్తును అతని సేనలు చుట్టి నిల్చుండగా, ఇంతలో యింద్రజిత్తు కనబడకుండుటచే మందరపర్వత సమానుడైన వాయుపుత్రుడు ప్రళయకాలాగ్ని వలె

కాల్పజొచ్చెను. వృక్షమును చేతబట్టినవాడై పరాక్రమించి భయంకరమైన విధముగా యుద్ధము చేసి విరోధులను రూపుమాపెను.

## హనుమంతుడు రాక్షసులను నాశనమొనర్చుట:

అధికవేగముగల వాయుపుత్రుని రాక్షస సంఘములు భయంకరముగా దాకెను. వాడియయిన శూలములను ధరించిన వారలు వాడియైన శూలధారలచేతను, ఖడ్గములను బట్టినవారు ఖడ్గముల చేతను, పట్టిసములను బట్టినవారు పట్టిసములచేతను, శక్తిని ధరించినవారు శక్తిచేతను, పరిఘములు, ముద్గరములు, గదలు, పరశువులు, శతఘ్నులు, ఛిండివాలములు మున్నగు ఆయుధముల చేతను భయంకరముగా తన్ను తాకుచుండ ఏమియును లెక్కచేయక ముష్టులచేతను, హస్తములచేతను వారందఱను చంపివేసి భయంకర శత్రువులనెడు సర్పములకు గరుత్మంతుని వంటివాడగు వాయుపుత్రుడు పీనుగు పెంటలుగా చేసెను. ఎదిరించుచున్న రాక్షస సంఘములు వేయు అస్త్రములకేమియు లొంగక యుద్ధము చేయుచున్న వాయుపుత్రుని జూచి ఇంద్రజిత్తు సారథీ! స్థైర్యముతో పోరుచున్న ఆ వానరుని మీదికి మన రథమును పోనిమ్ము. అతనినెదుర్కొనక మనము ఉపేక్షించినచో మన బలములనెల్లను సంహరించును సుమా అని చెప్పగా.

## ఇంద్రజిత్తు హనుమంతు నెదుర్చుట:

సారథి అట్లే రథము నిలుపగా బాణముల సమూహములతోను ఖడ్గముల వర్షములచేతను, దారుణమైన పట్టిసముల చేతను మిక్కిలి వేగముతో శూలముల చేతను హనుమంతుని ముంచెను. కేసరి పుత్రుడు వానిని తొలగద్రోసి ఆ క్రూరాత్మునితో రోషమే వేషము గైకొన్న విధముగా ఇట్లనెను. ఓరీ దుష్టరాక్షసుడా! దుర్మతీ! యుద్ధోద్యోగమునందు నీవు కూడా శూరుడవైనచో యుక్తమైన రీతితో నాతో యుద్ధమునకు రమ్ము. గొప్పబలవంతుడైన మారుతిని దాకి రావణపుత్రా! మఱి ప్రాణములతో ఎట్లైనను పోరాదుగదా. బాహుయుద్ధమునకు రావో! నీ గతిని చూచెదను. నాపోటు సహింపగలిగినచో గదా నీచా! నీ బంటు తనము అని ధిక్కరించుచున్న వాయుపుత్రుని మీద బాణములు వేయుటకు ఇంద్రజిత్తు వింటినెక్కు పెట్టుచుండగా విభీషణుడు లక్ష్మణా! వాడే ఇంద్రజిత్తు ఆ దిక్కు చూడుము. హనుమంతుని మీద తలపడినాడు వేగముగా వెళ్లి నీ తీవ్రమైన బాణములతో వానిని నేలగూల్పుము అని గర్జించుచున్న పర్వత సమానుడైన భయంకరబలుడైన రావణిని చూపించెను.

★★★

# ఎనుబది యేడవ సర్గము

## విభీషణుడు లక్ష్మణునకు ఇంద్రజిత్తు యజ్ఞము చేయున్యగ్రోధమును జూపుట:

అట్లు చూసి సంతోషము కలుగుచుండగా లక్ష్మణుని వేగముగా తోడ్కొని వెళ్లి కొద్దిదూరముననున్న వనము ప్రవేశించి అందు యజ్ఞము చేయు విధమును చూపించెను. ఓ సౌమిత్రీ! నల్లని మేఘమువలెనున్నదియు ఘోరరూపము గలదియు అగు న్యగ్రోధము ఇదియే సుమా. రాక్షసరాజపుత్రుడిందు భూతములకు బలులిచ్చి హోమము చేసి యుద్ధమునకు వచ్చును. అట్లు వచ్చినచో వాడెవరికిని గనబడకుండ యుద్ధము చేయును. ఆ తీవ్రబలశాలి శత్రువరులలో కొందఱను చంపును. కొందరిని బంధించును. కొందరిని చిత్రవధ చేయును. కాన తిరిగి ఇంద్రజిత్తును ఆ మఱ్ఱిచెట్టును సమీపింపనీయక అశ్వములతో సారథితో గూడ చంపివేయుము అని చెప్పగా సంతసముతో లక్ష్మణుడు అట్లేయని తన వింటి నారిని మ్రోగించెను. అగ్నివర్ణముగల రథమునెక్కి కవచము, ధనువు, ధ్వజము, ఖడ్గము ధరించి రావణుని పుత్రుడు గ్రక్కున అచ్చటికి రాగా చండకోపముతో లక్ష్మణుడిట్లు పలికెను. ఓ రాక్షసుడా! నీ కొఱకై వెదకుచు ఇచ్చటికి వచ్చితిని. రణాతిథ్యమునిమ్ము. నిన్ను నేను కోరికతో బిలుచుచున్నాను. దుర్మార్గుడా! ఇక నీమాయ సాగదు సుమా.

## ఇంద్రజిత్తు విభీషణునధిక్షేపించుట:

అని లక్ష్మణుడు పల్కగా ఇంద్రజిత్తు ఆ పరిసరమునందున్న పినతండ్రిని జూచి మనస్సు మండుచుండగా కన్నులనుండి నిప్పులు రాలుచుండగా గర్వమతిశయింపగా ఇట్లనెను. ఓ కఠినుడా! ఇచ్చటనే పుట్టి పెరిగితివి. నా తండ్రికి స్వయముగా సోదరుడవు. నాకు పినతండ్రివి. ఓ రాక్షసుడా! తనయుని పట్ల ఇట్టి ప్రత్యక్షపు ద్రోహము తగునా? చుట్టమనుమాటను సున్న చుట్టితివి. స్వజాతి యభిమానమైన కనిపించదు. స్నేహభావము అసలే లేదు. ధర్మశాస్త్ర ప్రమాణములయందు ఆలోచనలేదు దుష్టుడా! ధర్మచింతనము నీయందు కనబడదుగదా. దుష్టబుద్ధీ! తోడబుట్టిన వాడని నీమనస్సునకు తోచునా? ధర్మదూషణా! తనవారందఱిని విడిచి విరోధులను బంటువై కొలుచుచున్న నీయవస్థను

జూచి సజ్జనులచే నిందింపదగినవాడా! నీ పట్ల నా మనస్సు దుఃఖముచే మరుగుచున్నది. ఓ కుమతీ! స్వజనులలో నివసించుటెక్కడ? విరోధుల సేవయెక్కడ? అక్కటా! ఈ మాత్రము బేధము నీకు గనిపింపదా? ఐనను నీచులకు బుద్ధిచాతుర్యము ఉండునా? తన వారలు గుణములేని వారైనను, విరోధులు గొప్పగుణములతో ఒప్పుచున్నను, చూడగా గుణము లేని తనవారలే ఉత్తములు. పరులు పరులే యదార్థముసుమా. కుమతీ! తనవారలను విడిచి పరపక్షమును సేవించువారు తన స్వజనులందఱును నిర్మూలింపబడగా తరువాత తానును శత్రువులచే చెడుట నిజము. ఓ మూఢాగ్రేసరుడా? దయయను మాటయే లేకుండ ఇట్లు నీతిలేనివాడవై ఇంత నాశనపు పనికి తెగించితివా? ఈ విధమైన ఘోరపు పనికి చుట్టమవు నీవు తప్ప యెవ్వడు ఒడిగట్టును తండ్రీ!

## విభీషణుడింద్రజిత్తునకు సమాధానము చెప్పుట:

అట్లనుచున్న తన అన్న కుమారునితో విభీషణుడిట్లనెను. ఓ రాక్షసరాజపుత్రా! అన్యాయశీలా! నా శీలము నెరుగని విధముగా వదరెదవేల? గౌరవము నుంచి నిందింపవలదు. పుట్టుక క్రూరరాక్షసవంశము నందైననేమి? గుణమే ముఖ్యము కాదా జనులకు? గావున వినరా! గుణములచే నేను రాక్షసుడను గాను వేయిమారులకైనను. నాకు దారుణ గుణములు రుచింపవు. అధర్మమెప్పుడును రుచింపదు. క్రూరుడా! దుష్టచరితగల అన్నయెవ్వడు నిండుసభలో తమ్ముని పోపొమ్మని పల్కును? ధర్మము వదలిన వానిని పాపకర్మములు చేయువానిని చేతనున్న పామును విడిచినట్లు విడిచి సత్కర్ముడు ఇహమునందును పరమునందును సుఖములననుభవించును పాపాత్ముడా! వింటివా? ఇతరుల ధనములను ఇతరుల భార్యలను హరించుటయు, హింసచేయుట అను ఈ దురాచారములను పురుషుడు మండుచున్న యింటిని విడిచిన విధముగా విడిచిపెట్టవలయును. ఓ కలుషాత్ముడా! పరుల ధనమునపహరించుట, పరులభార్యలను కోరుచుండుట, తన మిత్ర వర్గమునందు నిండైన సంశయము ఈ మూడును దురితాత్ముడా! వినాశ హేతువులగు దోషములు సుమా. వినుము. ముని సంఘములను హింసించుటయు, దేవతలతో ఎడతెగని పోరాటములును, కోపమును, బద్ధవైరమును, గర్వము, ఇతరుల మేలును సహింపలేకుండుటయు, జీవితమును, సర్వసంపదలను మాడ్చునట్టి దోషములు. ఇవి అన్నయందు స్థిరముగా నిల్చి కొండను మేఘములు దాచినట్లు అతని సుగుణములను దాచెను. ఈ దోషములుండుట వలననే గదా నీ కన్నతండ్రియైన నా

అన్నను నేను సంతోషముతో విడుచుట. ఇక ఈ భూమిపై ఈ పట్టణముగానీ, నీవుగానీ, నీ తండ్రిగానీ లేనట్లే. నీవు దురభిమానము గలవాడవు, బాలుడవు, బుద్ధిహీనుడవు. వినయము నెరుగవు. యమపాశములచే బంధింపబడినవాడవు. మూర్ఖుడా! నీ బుద్ధికి తోచిన విధముగా వాగుము. నీకిప్పుడు చేటు మూడినది. నీ వింక చేసెడిదేమి యున్నది? వట్టి వాగ్వాదములతో నేమి జరుగును. నీవు తిరిగి మఱ్ఱిచెట్టును చేరలేవు. యుద్ధమునందు ఆ రాఘవుల ముందర జీవములతో నిల్వలేవు. నీ మాయ యుద్ధమింక సాగదు. నిన్నిప్పుడే లక్ష్మణుడు యుద్ధమున సంహరించును. యముని సంయమనీ పట్టణమునకు వెళ్లి నిజదేవతల నర్చించుకొనుము. నీ శరీర బలమంతయును, అన్ని దారుణమైన అస్త్రములను యుద్ధమున వ్యయమొనరింపుము. సుమిత్రా పుత్రుని ఘోరబాణముల బారిన బడి ఈ శరీరముతో నీవును నీ సైన్యమును తిరిగి లంకలోనికి వెళ్లుట కల్లసుమా.

★★★



# ఎనుబదియెనిమిదవ సర్గము

## ఇంద్రజిత్తు లక్ష్మణుల సంభాషణము:

అని విభీషణుడు చెప్పిన మాటలను విని కోపించి భయంకరమైన విధముగా ఆయుధములను బట్టి ప్రళయకాలయముని బోలి భయంకరమైన వింటినెత్తి వాడియైన బాణములు కాంతులుచిమ్ముచుండగా దృఢమైన రథమునెక్కినవాడై, తేజస్సులో ఉదయపర్వతము పైనున్న సూర్యుని వలె ప్రకాశించుచు హనుమంతుని భుజములపై నెక్కియున్నవాని శత్రువులను హింసింప సమర్థుడైన సౌమిత్రిని చూచి యిట్లనెను. నా వింటి నుండి విడువబడిన ఘోరమైన సహింపరాని బాణముల యొక్క గొప్ప వర్షము ఆకాశము నుండి కురియగా నీవును నీ తోడివారును ఏవిధముగా బ్రదుకుదురో చూడుము. లక్ష్మణా! ఇప్పుడే నిన్నును, నీ బలమునంతను నాచేత విడువబడిన బాణములు కప్పివేసి దూదిని కాల్చెడి అగ్నివలె కాల్చివేయును. ఇప్పుడే మీరందఱును ఒక్కటిగా తప్పక యముని వీటికి పోయెదరు. నా వేగవంతమైన బాణముల దారుణవర్షములను ఓర్చుకొనగల వాడెవ్వడు? లక్ష్మణా! పిడుగుల వంటి నా బాణ సమూహములచే వచ్చుచు పోవుచున్న ప్రాణములతో తెలివి దప్పి నేలపై బడియుండుటను మరచితివేమో. లేక అట్లు మరువకున్నచో యముని మందిరమును చేరదలచి వచ్చితివా? తెలివిలేనివాడనై విషసర్పమును చెనకుటకు వచ్చితివేమో అనగా భయము లేని ముఖము గల వాడును, క్రోధముతో నున్నవాడును అగులక్ష్మణుడు ఇట్లనెను. రాక్షసుడా! చేతగాని ప్రజ్ఞలను పలికితివి. ఎందైనను పనిని పూర్తిచేసి పలుకువాడే ప్రాజ్ఞుడనబడును. కొరగాని కొన్నిమాటలు పల్కుచు ఎవ్వరికిని చేతగాని కార్యములను చేసినట్లు చెప్పి ధన్యులలో శ్రేష్ఠుడననుచు సంతోషపడుచున్నాడవు. ఓ దశకంఠనందనా! ఎవ్వరికిని కనిపించక ఆరాత్రి యుద్ధమున దాగికొని ఆ విధముగా చేయుటవలన పౌరషము హెచ్చైనదా? అది దొంగయొక్క మార్గముకాని శౌర్యవంతులు చేయు విధమా? నీ బాణముల మార్గమున నిల్చితిని. ఓ రాక్షసశ్రేష్ఠుడా! నీవు పూర్వము చూపించిన బాహుశక్తిని చూపించుమా నేను చూడదలచితిని. వ్యర్థమైన మాటలచే ఫలమేమైన నున్నదా?

## ఇంద్రజిత్తు లక్ష్మణుల యుద్ధ ప్రారంభము:

అని లక్ష్మణుడు చెప్పగా ఇంద్రజిత్తు కోపముచే చలించుచున్న నేత్రములు గలవాడై అతివేగముగా వాడి బాణములు కొంచెమైన తెఱపి నీయక అత్యద్భుతముగా లక్ష్మణునిపై వేసెను. అట్లు వేసిన బాణములచే రక్తముచే తడిసిన శరీరము గలవాడై లక్ష్మణుడు పొగతొలగిన అగ్నియో యనునట్లు కనిపించెను. దానిచేతనే పని తీర్చితిని గదాయని పొంగి అధికమైన గర్జనలచే ఆకాశమును బ్రద్దలు చేయుచు రావణి యిట్లు పలికెను. లక్ష్మణా! శ్రేష్ఠమైన వింటినుండి వెలువడిన బాణములనెడు సర్పసమూహము నీ ప్రాణవాయువులను రణమున నిప్పుడే పానము చేయును చూడుము. నా శ్రేష్ఠమైన శరములచే దిక్కులేక కూలిన నిన్ను నక్కలు, డేగలు, గ్రద్దలు, క్కిరిసినట్లుగా వ్రాలి తమలో తాము దెబ్బలాడుచు చిల్లులుపొడుచుచు తినునుగాక. నీ కవచము ముక్కలు ముక్కలు చేయబడి విల్ల ఖండింపబడి నరుకబడిన శిరస్సుతో పడియున్న దుష్టుని, ధైర్యరహితుని తనకు శ్రేష్ఠుడైన భక్తుని క్షుద్రయుని నిన్ను ఆ పరమ దుర్మార్గుడైన రాముడు చూచును సుమా అని పలుకగా, ఆ పొగరుబోతు కఠినమైన మాటలకు ఆ రాజశ్రేష్ఠుడు హేతుబద్ధకమైన మాటలనిట్లు చెప్పెను. పలువా! నోటిదురుసు ఏలరా? నీవేమి చేయువాడనని పలికితివో ఆ విధముగా జేసి కీర్తిని పొందరాదా? ఊరక దూషించిన ఫలమేమి? ఓ నిష్ఠుర చరితుడా! దేనిని నెరవేర్చకముందే నిన్ను నీవే పొగడుకొందువు. నీవు పలికిన ప్రజ్ఞలను నెరవేర్చి అప్పుడు తిరస్కరింపుము. నేనును నమ్మెదను. కరకు మాటలు పలుకక, ఏ ఆక్షేపములు చేయక పొగడుకొనక ఇప్పుడే నేను వాడి బాణములచేత నీతలను నా ప్రజ్ఞ తెలియునట్లు నేలబడవేసెదను అని కర్ణముల వఱకు లాగి ఐదు వాడి బాణములను ఆ రాక్షసుని యెదపై నాటెను. అవి ఆ రాక్షసుని ఱొమ్మున సూర్యుని కిరణముల వలె వెలిగెను. దానివలన ఇంద్రజిత్తునొచ్చి అంతులేని రోషముతో గూడినవాడై మూడు కఱకు బాణములను రాముని తమ్మునిపై వైచెను. ఇట్లు వారింపరాని విధముగా వారిద్దఱును పరస్పర జయకాంక్షతో పోరిరి. ఇద్దఱును గొప్ప భుజబలము గలవారు. ఇద్దఱును ప్రసిద్ధి గలవారు. ఇద్దఱును శ్రేష్ఠమైన శస్త్రాకోవిదులు. ఎంతయో దుర్జయులు. ఆకాశమున పోరాడు గ్రహముల వలె ఒకరికొకరు సమానులై, తొలగిపోక చెనకరాని ఆ యిరువురు తీవ్రముగా యుద్ధము చేసిరి. లక్ష్మణేంద్రజిత్తులు సింహము సింహము తలపడిన విధముగా మిక్కిలి పౌరుషము గలవారై లొంగక సడలక ఇంద్రవృత్తాసురుల వలె పోరిరి. ఒకరిని మించిన సంతోషముతో నొకరు,

ఒకరిని మించిన సాహసముతో ఒకరు, ఒకరిని మించిన శౌర్యముతో ఒకరు, ఒకరిని మించిన యుద్ధాభిలాషతో నొకరు ఒకరిని మించి ధనుర్విద్యాపాటవము, శరవేగములతో ఒకరు ఇద్దఱును తీక్ష్ణమైన గొప్ప బాణసమూహములతో ఒకరినొకరు ముంచివేసిరి. ఒకడు వేయు బాణములను ఇంకొకడు త్రుంచివైచును, తిరిగి ఒకడు వేయులోపలనే మఱియొకడు బాణములచే ముంచివేయును. ఇట్లు వారు ఎక్కువతక్కువలు గాకుండ పరాక్రమముతో శంబరాసురుడు ఇంద్రుడు వంటివారై మిక్కిలి తెంపు పెంపుగలిగి సాహసులై పోరిరి.

★★★



# ఎనుబది తొమ్మిదవ సర్గము

## ఇంద్రజిత్తు లక్ష్మణుని బాణములచే నొచ్చుట:

అట్లు పోరుసాగుచుండగా లక్ష్మణుడు చెవి వఱకు వింటినారిని లాగి కోపించిన సర్పమోయనునట్లు నిట్టూర్పులు నిగిడించుచు ఎక్కుడు బలముగా ఒక గొప్ప బాణమును సంధించి వేయగా ఆ వింటినారి మ్రోత చెవులబడగనే మొగము తేజోవిహీనమై తెల్లబోయి డిల్లపాటుతో ఇంద్రవిరోధి లక్ష్మణుని ముఖము వంక చూడగా విభీషణుడు చేరి యిట్లనెను. లక్ష్మణా విరోధియందు త్వరగా యుద్ధము చేయుము అనగా లక్ష్మణుడు మెత్తబడక అగ్నిజ్వాలలకు ప్రియసోదరుల వంటివైన వాడి బాణముల సమూహములను సర్పసమూహములు పుట్టలో దూరిన విధముగా అతని శరీరమున దూరునట్లు చేసెను. వజ్రాయుధము వంటి బాణసమూహములు తగులుట చేత వ్యాకులపాటు నొంది సర్వేంద్రియములు గలవాడై చైతన్యము లేనివాడై బాధచే విలవిలలాడుచు యుద్ధభూమి యందు నిశ్చేష్టుడై యుండి తిరిగి తెలివిని పొంది చలించని ప్రభావము గలవాడును ప్రజ్వలించు తేజస్సు గలవాడును అగు రాజపుత్రుని జూచి మాటలలో గర్వమును తెలియజేయుచు యింద్రజిత్తు ఇట్లనెను. మొదటిరోజు యుద్ధమున దుమ్ముకొట్టుకొని నేల పొర్లుటను, బలీయమైన శస్త్రపాశములతో నిన్ను, నీ సోదరుని ఆ విధముగా కట్టివేయుటలు జ్ఞాపకము లేవా? అది గుర్తులేకనే కదా! యుద్ధమున నన్నెదిరింపవచ్చితివి యమునిపురము పిలుచుచున్నదేమో అట్లు కానిచో ఇటువచ్చువాడవా? ప్రథమదినమున జరిగిన యుద్ధమున నా బలమును చూడకున్నచో ప్రఖ్యాతిగా నిన్ను మర్దించి చూపించెదను ఒక్క నిమిషము నిలువుము అని పలికి ఏడు బాణములచే లక్ష్మణుని, పదిబాణములచే హనుమంతుని గొప్ప క్రోధముతో విభీషణుని భయంకరమైన నూరుబాణములచే ఇంద్రజిత్తు వేయగా అది చూచి లక్ష్మణుడు వానిని లెక్కచేయక నవ్వుచు ఇవియా విరోధులను నొప్పించునవి. ఇవి ఒక లెక్కయా పొమ్మనుచు అవలీలగా బాణములతో కొట్టగా ఆ రాక్షసుడు చిక్కగా వేయుబాణములను చిందరవందరగా పడగొట్టుచు ఇట్లనెను. ఓ రాక్షసుడా! ఇవి నీవాడి బాణములా? ఇట్టివానిని ఎవడైనను గెలువగోరినచో బలవంతుడైన శత్రువు మీద వేయునా?

తేలికయినవియును, తక్కువ శక్తి గలవియు అగు నీ బాణములు తగులుచున్నను బాధ కలుగుట లేదు. దిట్టమైన బంటు ఇట్టివానిని వేయునా? అనుచు కవచము పగులునట్లు బాణసమూహములను గురిపించెను.

## ఇంద్రజిల్లక్ష్మణులు ఘోరముగా బోరుట:

ఆ బాణముల తీవ్రవర్షమునకు బంగారముచే అలంకరింపబడిన కవచమంతయును ముక్కలుముక్కలై ఆకాశమునుండి నేలబడుచున్న నక్షత్ర సమూహములో యనునట్లు రథము మీద వ్రాలెను. కవచము పగిలిపోగా ఇంద్రజిత్తు బాణపు దెబ్బలచే చిగిర్చిన వృక్షములు గల పర్వతమువలె నొప్పెను. అంత నా రాక్షసుడును వేలకొలది భయంకర బాణముల వర్షము చేత సుమిత్రా పుత్రుని శరీరమంతయును కప్పి సాటిలేని కవచమును పగులగొట్టి యమునివలె భయంకరుడై తనకు చేసిన కృత్యమునకు అప్పుడే ప్రతిక్రియ చేసెను. ఇట్లు అత్యధిక క్రోధవశాత్ములై ఆ గొప్పయోధులు సరిసమానముగా పోరుచు ఒకరి బాణములచే నొకరు చీల్పబడిన దేహములు గలవారై ఆలస్యము చేయక జయమును కోరినవారై నెత్తురు గార్చుచు బాధతో నిట్టూర్చుచు చాలాకాలము పోరగా శరీరములందు ఊటకాలువల వలె నెత్తురులు గారగా ఘోరమైన విధముగా గర్జించుచు ఆకాశము నందలి మేఘముల సమూహము వలె శరవర్షములను గురిపించుచు ఏ మాత్రము తగ్గక శ్రమలేక ఆ రాక్షసుడును రాజపుత్రుడును ధైర్యము శౌర్యము సమానముగా కనిపించునట్లు పోరుచు దృఢమైన విండ్లు మండలాకారము దాల్చుచుండగా శస్త్రాస్త్రములు సులభముగా మరిపించుచు బాణములచే ఆకాశమునడ్డుకట్టిరి. తరుగని బాణవేగములు, విడువని చిత్రమైనపరాక్రమములు,వదలిపెట్టనిలాఘవములు,తప్పిపోనిధనుర్విద్యానైపుణ్యములు, విడువని రోషములు గలవారై యుద్ధము చేసిరి. వారియొక్క హస్తప్రహరముల మ్రోతలు వజ్రఘోషములు వలె నేరుగా విననయ్యెను. జనులు కంపించువిధముగా గర్జనల ఆర్భాటములును, బాణములు తాకెడు చప్పుళ్లును, చెవుడు గలిగించు భయంకరములైన వింటినారి మ్రోతలును, ఆయుధములు విరుగుటచే నయిన ధ్వనులును, ఏకమగునట్లు బంగారుమొనలు గలిగిన బాణములు తగులుటచే శరీరములందు వ్రణములు కాగా కారుచున్న నెత్తురుల కాల్వలతో పుష్పించిన అశోక వృక్షములవలె గనిపించుచు యుద్ధము చేయగా వారిచే విడువబడిన బాణములు శరీరములు తూట్లుపడి దూరి కొన్ని నేలలో దిగిపోయెను. ఒక కొన్ని ఆకాశమున కెగిరిపోయెను. మఱికొన్ని విరోధి బాణములను

విరుగగొట్టెను. ప్రజ్వలించు రెండగ్నులు కలిగి దర్భలతో గూడిన యజ్ఞమోయనునట్లు దశకంఠపుత్రుని దశరథుని పుత్రుని యుద్ధము ప్రకటములయిన బాణమయమగుచు దేవతాసమూహములకు సంతోషకరమై వెలిగెను. ఇట్లు రావణి లక్ష్మణులు తెగించినవారై ఒకరినొకరు చంపగోరుచున్నవారై కేవలము రౌద్రమే రూపముగా గలవారై బాధనొందక వెనుకంజ వేయక తెగింపు కలుగగా ప్రాణములపై ఆశపెట్టుకొనక కొంచెమైనను అలసిపోక చాలాసేపు ఆకాశమును భూమిని బాణములచే నింపివేసిరి. ఒక్క ఆకయినను లేకుండా అంతటను పువ్వులతో సుందరముగా నున్న అశోక వృక్షములు బూరుగు చెట్లవలె ఇంద్రజిత్తు లక్ష్మణుడును వెలిగిరి. కలహమున అధికశ్రమ చెందిన ఇంద్రజిత్తును సంహరించుటకును, తిరుగులేని పరాక్రమము గల లక్ష్మణునకు ప్రియమును హితమును గలిగించుటకును విభీషణుడు లక్ష్మణుని చెంతనే నిలిచియుండెను.

★★★



# తొంబదియవ సర్గము

## విభీషణుడు కపులను ప్రోత్సహించుట:

ఒకరి నొకరు చంపుట యందాసక్తిగల ఇంద్రజిల్లక్ష్మణులు యుద్ధాటోపముతో గర్జించుచున్న వనగజముల సామ్యమును దలపించుచు పోరుచుండగా రాజపుత్రుడు ఇంద్రవిరోధిపై వాడియై భయంకరములయిన బాణములను గుప్పించెను. అగ్నిహోత్రుని వంటి బాణములు విరోధి సేనలపైబడి ఇంద్రుని వజ్రాయుధము పర్వతముల సమూహమును దునిమినట్లు శత్రువులను సంహరించెను. భయంకరమైన బలము గలవారగు విభీషణుని మంత్రులు శూలములు, ఖడ్గములు, పట్టిసములు, బాణములు మొదలగు ఆయుధములచే అప్పుడు తమ చేతులవాటము గనిపించునట్లు గుంపులు గుంపులుగా రాక్షసకోట్లను గూల్చివేసిరి. గున్నయేనుగుల మధ్యనున్న మదగజమువలె నొప్పుచున్న దృఢమైన శౌర్యముతో ఉన్నతుడైన విభీషణుడు సంతోషముతో ఆ వానర సంఘముతో ఇట్లనెను. మిక్కిలి బలవంతులైన వానరులారా! వినుడు దశకంఠునకు ఈ ఇంద్రజిత్తు ఒక్కడును ఈ సైన్యములే మిగిలినవి. వీడిక్కడ చచ్చెనేని రావణుడొక్కడు తప్ప తక్కిన రాక్షసులందఱు చచ్చినట్లే. కాన మీరలు మిక్కిలి శౌర్యములతో విజృంభించి వీరలనందరను చంపుడు. కుంభకర్ణుడును, కుంభుడును, నికుంభుడును, సంహ్లాదుడును, దుర్ధరుడును, జంబుమాలియు, వజ్రదంష్ట్రుడును, మహామాలియు, తపనుడును, దముడును, అశనిప్రభుడును, యజ్ఞకోపుడును, ప్రఘసుడును, ప్రఘాసుడును, రశ్మికేతుడును, అగనికేతుడును, అర్కశత్రుడును, జంఘుడును, ప్రజంఘుడును, చక్రమాలియు, కంపనుడును, ద్విజిహ్వుడును, అకంపనుడును, తీక్ష్ణవేగుడును, సుపార్శ్వుడును, ధీరవిఘ్నుడును, ఆ దేవాంతక నరాంత కాదులును అందఱును యుద్ధమున కూలిరి గదా. మీకు ఇతడే పాటివాడు. వారలనందరను వధించిన వీరులైన మీకు ఈ రాక్షసుని చంపుట వింతయా? సముద్రమును చేతులతో ఈదిన మీరు ఈ గోష్పదమును ఈది కీర్తిని పొందుడు. ఇంక మీరు చేయుటకు మిగిలిన కార్యము ఈ సైన్యమును యమపురమునకు

వదలకుండ పంపుటే గదా. మదించిన వారందరును వరుసలు వరుసలుగా ముందే వెళ్లిరి. నా పుత్రుని నేనే చంపుట యనగా తగని పనియైనను ప్రఖ్యాతిగా రాముని కారణముగా దయను విడిచి వధింపవచ్చును. దాన ఏ దోషమూ లేదు. ఇతని సంహరింపకోరుచున్న నా కన్నులు బాష్పధారలచే మాటిమాటికి తడియుచున్నవి. కావున ఓ వానరులారా! వీనిని లక్ష్మణుడే పొగరడగించును. మీరు ఇట్లూరకుండనేల? మీ లాఘవము బలము ప్రకాశించునట్లు ఇంద్రజిత్తు సమీపమునందున్న సేనలను సంహరింపదగును అని చెప్పగా వానరులు చెలరేగి శత్రుసేనలను దాకి అపారమైన భుజబలములు తెలియునట్లు పోరిరి. కారుమబ్బులను చూచి నెమళుల గుంపులు సంతోషముతో పొంగి కేకలు వేయు విధముగా రాక్షససైన్యముల నెదురుగా జూచి వానరసైన్యములు గర్జనలను చేసెను. వారిలో జాంబవంతుడు తన సైన్యాయుధములతో గూడి రాక్షస సంఘముల మీద తలపడి పోరాడగా పారిపోక రాక్షసులు చెలరేగి వానిని చుట్టుముట్టిరి. శరములను, పరశువులను, తోమరములను భల్లూకముల రాజైన జాంబవంతుని మీద వాన జల్లులవలె కురిపించి నొప్పింపగా అతడు వానిని లెక్కచేయక పోరగా వారి యుద్ధము దేవాసురుల యుద్ధమువలె భీభత్సమై ఘోరమయ్యెను. భయంకరమైన ధ్వనులు హెచ్చగా వాయుపుత్రుడు అత్యుగ్రుడై చెట్టుచేత ఒక్క దెబ్బకు వేయిమంది చొప్పున నేలగూలునట్లు విజృంభించి సంహరించెను. రావణపుత్రుడు తన పినతండ్రితో పోరి తిరిగి రాక్షసనాశకుడైన దశరథ రాజపుత్రునితో అట్టె తలపడగా హనుమంతుడు లక్ష్మణునకు తోడ్పడెను. అంతట వారిద్దఱకు భూతములు భయము చెంది వణకునట్లును, దేవతలకు గుగుర్పాటు కలిగించునట్లును యుద్ధము సాగెను.

## ఇంద్రజిత్తు లక్ష్మణుల ఘోరయుద్ధము:

వర్షాకాలము నందు సూర్యచంద్రబింబములు మబ్బుల సమూహములచే గప్పబడినయట్లు ఆ వీరుల బాణ సమూహములచే మరుగుపడిరి. వారియొక్క లాఘవము నేర్పుచేత బాణములను తీయుట, సంధించుట, లాగుట, వేయుట, చేయి మార్చుకొనుట, లక్ష్యమును చూచుట, తప్పుకొనుట, సమీపించుట, యుద్ధమున విజృంభించుట ఇవి యేవియును కనిపించుటలేదు. విండ్లనుండి వేగముగా విడువబడుచున్న బాణములు ఏ స్థలమందు బడుచున్నవో తెలియకుండ ఎచ్చట చూచినను వేగముగా వెళ్లుచున్నవి,

క్రిందపడుచున్నవి, తాకుతున్నవి యగు బాణవితానములే కనింపించుచుండెను. ఒకరి మీద నొకరు విజృంభించి వేసికొని బాణములు ఆకాశమంతయు నిండి పందిరివైచినట్లుండి భూమియంతయు చిమ్మచీకట్లు ముమ్మరముగా నిండించెను. వారల బాణవేగములు, వారల శౌర్య విజృంభణములు, వారల హస్తలాఘవము, వారల తెంపుపెంపులు చూడగా విజయమెవ్వరికో ఇదమిత్థమని చెప్పరాక ఆకాశసంచారులు అబ్బురబడి చూడగా ఆయుద్ధము అంతకంతకు అధికమగుచుండెను. దిక్కులు విదిక్కులు బాణముల ప్రసారము చేత నిండగా సూర్యుడు లేనప్పుడు మూసెడు పెంజీకటివలె చూపులకు భయము కలిగించు చిమ్మచీకటి వ్యాపించెను. యుద్ధభూమి యంతయును నెత్తురు టేరులు మొత్తములై ప్రవహించెను. కాకులు గ్రద్ధలు పెద్ద ధ్వనులతో అరచెను. అగ్నిమండదయ్యెను. వాయువు వీవదయ్యెను. ఋషిసంఘములు లోకములకు స్వస్తియగుగాక యని పలికెను. గుంపులు గట్టి యుద్ధము చూచుచున్న గంధర్వులు మొదలైన ఖేచరులు భయముతో చారణులతో గూడ దూరముగా వెళ్లి నిలిచి చూచిరి. ఆ సమయమున సిద్ధహస్తుడైన శూరుడు లక్ష్మణుడు రాక్షస సింహుని బంగారు ఆభరణములతో నొప్పుచున్న నల్లని గుఱ్ఱములను నాలుగింటిని నాలుగు వాడి బాణముల వేసి వాటి వేగమును మాన్పి

## లక్ష్మణుడింద్రజిత్తు సారథిని జంపుట:

తీవ్రతతో పిడుగునకు సాటియై పదునుగలిగి అందమైన ఈకలుగలిగి కాంతియు అందముగల బాణముచే ఆ శూరుని సూతునియొక్క శిరస్సును నేలగూల్చెను. అట్లు సారథిని జంపి వెంటనే అతని వంటిని గూడ త్రుంచగా ఆ ఇంద్రజిత్తు రథమును తానే తోలుచు ధైర్యముతో ఇంకొక విల్లు పట్టి యుద్ధము చేయుట, మిగుల వింతగా నుండెను. అతడు తేరు నడపు సమయమున లక్ష్మణుడు అతివేగముగా మరల వింటిని ద్రుంచెను. ఇంకొక విల్లు పుచ్చుకొనునంతలో గుఱ్ఱముల బాధించెను. అయినను తాను ధైర్యమును విడువక ఆ రాక్షసుడు ఎంతో ధైర్యముతో తాను వేయు బాణముల నెదుర్కొనుచుండగా వేగముగా బాణముల వరుసల తాకిడిచే కలత నొందజేయగా తన సారథి చావునకు గోలపెట్టుచు తేజస్సు కోల్పోయియున్న రాక్షసుని ముఖమును చూచుచు వానర సమూహములన్నియు రాజపుత్రుని సాధువాక్కులతో పొగడినవి. గుఱ్ఱముల శక్తి చేతనే ఆ రాక్షసుడు అడ్డులేని శక్తితో తిరుగుచుండుటచే ఆలోచించి శౌర్యమదయుక్తులైన వానరశ్రేష్ఠులు నలుగురు

శరభుడు, గంధమాదనుడు మిక్కిలి బలము గల రభసుడు ప్రమాథయనువారు అతివేగముగా ఎగిరి విరోధి రథము మీద దూకి గుఱ్ఱములను నాల్గింటిని చంపి నేలబడవేసి ఇంద్రజిత్తు రథమును ముక్కలు చేసి వానరులందఱు తమను మెచ్చుకొనుచుండగా తిరిగి ఒక్క క్షణములో లక్ష్మణుని చెంత నిలిచిరి. అట్లు రథము లేనివాడును. సారథి, గుఱ్ఱములు లేనివాడును అయి యింద్రజిత్తు నేలపై నిలబడి రాజపుత్రుని నెదిరింపగా అతడు వాడి బాణములతో ఒక్క తృటిలో వాని ఔద్ధత్యము నణచివేసెను.

★★★



# తొంబది యొకటవ సర్గము

## ఇంద్రజిత్తు కపులను వంచించి లంకకుబోయి రథికుడై వచ్చుట:

అట్లు విడువకుండ బాణములు కురిపించగా, రాజపుత్రునిపై రాక్షసరాజు అనేకమైన అస్త్రసంతతులను అనంతముగా మరిపించగా ఇద్దఱును అభిమానము, మాత్సర్యము ఆశ్చర్యకరముగా పెరుగగా యుద్ధము చేయుచుండగా వానరసేనలు, రాక్షససేనలు వారి యండనుండి విరోధులు భయపడునట్లు యుద్ధము చేయుచు తమ నాయకులను రక్షించుకొనుచు అనేక విధములుగా తమ పరాక్రమములను చూపించగా అప్పుడు ఆ ఇంద్రజిత్తు రాక్షసులను మెచ్చుకొని పొగడి వారలదగ్గఱ చేరి యిట్లనెను. రాక్షసులారా! సర్వదిక్కులయందు గాఢముగా చిమ్మచీకట్లు వ్యాపించెను. మనవారో, విరోధులో కనిపించుటలేదు. అందుచే ఒక సాహసము చేయవలయును. వానరులు తికమక చెందునట్లు వారు భ్రాంతి పడునట్లు గుంపులుగా కలిసిపోరుడు. నేను అడ్డులేని వాడనై లంకకు వెళ్లి క్షణములో రథము నెక్కివచ్చెదను. వారలెరిగినచో అడ్డము వత్తురు కాన వారలను మీరు మోసగింపవలెను. మీ శక్తి సామర్థ్యములు చూపించుటకిది సమయము సుమా. అని చెప్పగనే వారందఱు అట్లేయని పోరుచుండగా ఇంద్రజిత్తులంకకు వెళ్లి బంగారు ఆభరణములతో అలంకరింపబడినదియు, గొప్పనైన ముసలములు, గదలు ఖడ్గములతో నిండినదియు, శ్రేష్ఠమైన గుఱ్ఱములు గట్టినదియు, హితుడైన సారథి గలదియు నయిన రథమును వేగముగా సమకూర్చుకొనెను. వెంటనే రథమునెక్కి భటుల గుంపులు వెంటరాగా వాడు లంకానగరము నుండి బయలుదేరెను. యముడు తనను ప్రేరేపింపగా వచ్చి లక్ష్మణుని, ఆ విభీషణుని, వానరసైన్యములను రాక్షసులందఱు మేలు మేలనుచుండగా వాడి బాణములతో కప్పెను. అతని అస్త్రలాఘవమును జూచి వానరులెంతో విస్మయము చెందిరి. సుమిత్రాతనయుడును, విభీషణుడును తమ మనస్సులందు ఇతడే యోధులలో శ్రేష్ఠుడని తలంచిరి.

## లక్ష్మణుడింద్రజిత్తును నొప్పించుట:

మిక్కిలి క్రోధమూర్ఛితుడై రావణి కపిరాజులను నూర్లు వేలుగా వాడి బాణముల చేత చంపి నేలబడవేయగా తక్కిన వానరులు భయము చెంది రాఘవుని సోదరుని మరుగున చేరిరి. అప్పుడు సుమిత్రానందనుడు రావణి విల్లును ముక్కలుముక్కలగునట్లు బాణము వేసెను. అతివేగముగా ఆ రాక్షసుడింకొక వింటికి నారిగూర్చుచుండగా లక్ష్మణుడు త్వరపడి మూడు బాణములచేత ఆ వింటిని కూడ త్రుంచి రెక్కలుగల సర్పసమూహములను బోలిన ఐదు వాడి బాణముల చేత ఱొమ్ము బ్రద్దలు గొట్టగా అవి శరీరము నందు దూరి వెడలివచ్చి ఎఱ్ఱని సర్పముల వలె నేలవ్రాలగా కవచము బ్రద్దలై రక్తము గ్రక్కుచు ఇంద్రజిత్తు గొప్ప శక్తి గల పెద్ద విల్లును తీసికొని రాజపుత్రుని ఆ యింద్రుని వలె తీవ్రబాణవర్షములతో కప్పివేసెను. కొంచెమైనను భయము లేక ఆ దుష్టుని లక్ష్మణుడు తేరిపారజూచెను. చూపరులకు ఆశ్చర్యమును కలుగజేసెను. అంతట లక్ష్మణుడు ప్రళయకాలాంతకుని వలె విజృంభించి శత్రు సమూహములో ఒక్కొక్కనిని మూడు మూడు ప్రాణములు తీయు బాణములతో గురితప్పక కొట్టి భయంకర విక్రమము ప్రకటితమగునట్లుగా చూచువారు భయము పొందగా అనేక బాణములతో రావణపుత్రుని ముంచెను. ఆ రాక్షసుడును వెనుదీయక మిక్కిలి వాడియైన బాణములతో అతివేగముగలవాడై ప్రతాపముచూపగా లక్ష్మణుడు వానిని మధ్యదారియందే ముక్కలు చేసి మఱియొక వాడి బాణముచేత ఆ రాక్షసుని సారథి శిరమును త్రుంచెను. బాగుగా శిక్షితములైనవగుటచే గుఱ్ఱములు సారథి లేకున్నను మండల భ్రమణములతో పొగరుతగ్గనివై తిరుగుట వింతగా దోచెను. లక్ష్మణుడును క్రూరుడై గొప్ప బాణములచే వాని గుండెలదరగొట్టెను. అతని ప్రతాపమును సహింపక వాడును వజ్రాయుధములవంటి గొప్పబాణములను మిక్కిలి వేగముగలవానిని ఆ సుమిత్రాపుత్రునిపై వేయగా అవి కవచమును దాకి నేలబడగా రాక్షసుడు ఇతనిది భేదింపరాని కవచమని తలంచి వాడి బాణములను మూడింటిని సంధించి త్వరగలవాడై నొసలు దాకునట్లు వేయగా కరలాఘవము తెలియచేయుచు వేసిన ఆ బాణములు నొసటియందు నాటి చాలా ఆశ్చర్యకరముగా మెరయగా శూరుడగు లక్ష్మణుడు మూడు శిఖరములు గల కొండవలె నొప్పుచు కోపముచే కదలచున్న చూపులుగలవాడై వేగముగా ఐదు బాణములను సంధించి మిక్కిలి బలముగల లక్ష్మణుడు విరోధి నుదుట గొట్టెను. ఈ విధముగా ఆ గొప్ప పరాక్రమవంతులు మనస్సునందు విడువని రోషములతో ఒకరి నొకరు

శరీరములు జల్లెడలో యనిపించునట్లు గెలుపుగోరినవారై పట్టుదలతో పోరిరి. అధికమైన ఈర్ష్యగల ఆ రావణపుత్రుడు చెవి వఱకు లాగబడిన బాణములను మూడింటిని అద్భుతమైన వేగముతో ఆ విభీషణుని నొసల దూరునట్లేసి ఇతర వానరవీరులకు తగులునట్లొక్కొక్క బాణమును వేయగా అధిక రోషమునందిన విభీషణుడు గదచేత అతని గుఱ్ఱములను కూల్చెను.

## ఇంద్రజి లక్ష్మణులు దివ్యాస్త్రములతో పోరుట:

అట్లు తురగములు చావగా భూమిమీదికి దూకి ఇంద్ర విరోధి వేగముగా శక్తితో విభీషణుని వేయగా లక్ష్మణుడు భయంకరములైన పది బాణములను సంధించి ఆ శక్తిని నేలబడునట్లు వేయగా విభీషణుడు వజ్రసదృశములైన భయంకర బాణములను తన అన్న పుత్రునిపై వేసెను. అవి ఔమ్ము బ్రద్ధలగునట్లు దూరి బయటపడగా ఆ క్రూరాత్ముడు రోషముతో పినతండ్రిపై యమునిచే ఈయబడిన భయంకరాస్త్రమును వేయగా లక్ష్మణుడు స్వప్నమునందు తనకు కుబేరునిచే ప్రసాదింపబడిన సాటిలేని పరమాస్త్రమును పూని రాక్షసునిపై వేసెను. ఆ బలవంతులు బలమైన ధనువులను బలముగా లాగి విడిచిన వింటినారులు దేవతలు వెరగపడునట్లు క్రౌంచపక్షుల విధముగా ధ్వనులు కలుగజేసెను. ఆ యస్త్రములు రెండును నిప్పులు గ్రక్కుచు పిడుగులవలె వేగముగా వెళ్లి ఆకాశమున నొకదానినొకటి ఢీకీమని ఢీకొట్టుకొనుచు హెచ్చుగా పొగను మిణుగురులను ఆకాశము నందంతటను చిమ్మగా పెద్దగ్రహములవలె పోరిపోరి నూరు వ్రక్కలై నేలపై బడగా సౌమిత్రియు, ఇంద్రవిరోధియు సిగ్గుతోను, రోషముతోను చిడిముడిపడిరి. అంత వారుణాస్త్రమును దశరథపుత్రుడు వేయగా రావణపుత్రుడు రౌద్రాస్త్రమును వేసి అద్భుతముగాదాని బిగువును అణచివేసెను. అంతతో ఆగక మిక్కిలి ఉగ్రుడైలోకములన్నిటిని గాల్చువిధముగా అగ్ని బాణమును ఇంద్రజిత్తు వింట సంధించి వేగముతో రామసోదరునిపై వేయగా అతడు సౌరాస్త్రమును సంధించి శత్రువు మనసునందు తొట్రుపడునట్లు దానిని అణచివేసెను. తిరిగి అతడు ఆ సురాస్త్రమును వేయగా దానినుండి ప్రకాశవంతములైన ముద్గరములు, ముసుంఠములు, పరిఘులు, గదలు, ఖడ్గములు మొదలైనవి రాసులుగా బయలువెడలిన, చూచి లక్ష్మణుడు రౌద్రాస్త్రమును వేగముగా వేసెను. అది నివారింపరానిది సమస్త శత్రువులను సంహరించునది. రౌద్రాస్త్రము ఆ దానవాస్త్రమును పడగొట్టగా, ఆకాశము నందుండు భూతములు క్షోభించినవై ఆ రాజపుత్రుని చుట్టియుండెను. రాక్షస

మనుజనాథుల యుద్ధము దేవసంఘములకాశ్చర్యము గలిగించునదై భయంకరమై మిక్కిలి సంభ్రమము కలిగించునదై ప్రవర్తింపగా ఋషులు, దేవతలు, గంధర్వులు, నాగులు, గరుడుల సంఘములు కలిసి ఇంద్రుడు ముందుండగా సన్నుతింపదగిన శీలము గల లక్ష్మణుని యుద్ధము నందు హెచ్చరికతో గాచుచుండిరి.

## లక్ష్మణుడింద్రజిత్తును వధించుట:

అప్పుడు రామసోదరుడు ఈ రాక్షసుడు సామాన్యమైన వానితో చావడు. అన్ని అస్త్రములు తెలిసినవాడు అని కోపించి దేవతలకు రాక్షసులకు జరిగిన యుద్ధమున ఇంద్రుడు రాక్షసులను ఏ అస్త్రముచేత సంహరించెనో అట్టి అగ్నివంటి స్పర్శ గలదియు, సుందరమైన కణుపులు గలదియు, మంచి అంచులుగలదియు, దృఢమైనదియు, బంగారముతో చేయబడినదియు, శత్రువులను నాశనము చేయునదియు, నివారింపరానిదియు, భరింపరానిదియు, దేవతల చేత పూజింపబడినదియు, సర్పసదృశమైనదియు,ఇంద్రుని దేవతగా గలదియు అయిన ఐంద్రశరమును, శ్రేష్ఠమైన వింటియందు శ్రేష్ఠమైన బాణమును పురుషశ్రేష్ఠుడు సంధించి ఆ దశరథ పుత్రుడగు ఆ రామచంద్రుడు పూర్ణధర్మాత్ముడైనచో, సత్యసంధుడైనచో, పౌరుషమున నెదురులేని వాడైనచో ఓ బాణమా! ఈ రావణపుత్రుని సంహరింపుము అని నిజకార్య సాధకములైన యదార్థమైన సుభాషితములను పలికి అతివేగముగా గట్టిగా గుప్పిటి బిగబట్టి చూపును వేగమును గనిపించగా దశముఖ పుత్రునిపై వేయగా అది సూర్యునితో సమానమైన కాంతి గలదై మహోద్ధతితో వెళ్లి శిరస్త్రాణముతో కుండలములతో గూడిన విరోధి శిరమును తృటిలో త్రుంచెను. అట్లు తెగిపడిన శిరము బంగారముతో సమానమైన కాంతి గలదై రక్తముతో తడిసినదై అందము చెడకుండ భూమిపై గనపడెను. విరిగిన విల్లును, తెగిన కవచమును, తెగిన శిరస్సును గలదై పర్వతమువంటి దేహము పడగా వృత్రుని వధించినవాడు దేవతలవలె విభీషణుడను, వానరులందఱును ఆనందము నొందగా.

## ఇంద్రజిత్తు మరణమునకు లోకములు సంతోషించుట:

ఆకాశమున దేవతలును, స్త్రీలును, ఋషిశ్రేష్ఠులును, యక్షులును, గంధర్వులును, మనస్సునందు గలిగిన సంతోషముతో కొంచెమైననూ చలింపక కేకలు వేసిరి. తమ నాయకుని చూచి వానరులు తమ్ముతరుమగా రాక్షసులు చేతనున్న ఆయుధములు

క్రిందపడగా లంకకు పారిపోయిరి. వేలకొలదిగా దిక్కుతోచనివారై నలుదిక్కులకు పరుగెత్తిరి. భయపడి కొందఱు సముద్రములో ప్రవేశించిరి. పై వస్త్రములు జారగా జుట్టు ముడులు వీడగా కొందఱు కొండలనెక్కిరి. సూర్యుడస్తమింపగా కిరణసమూహము అతని వెంటపోవు విధముగా కూలియున్న యింద్రజిత్తును జూచి రాక్షససైన్యములో ఒక్కడైనను అచ్చట నిలువడయ్యెను. అచ్చట ఆరిపోయిన అగ్నియో కిరణములేని సూర్యుడో యనునట్లు ఆ శూరవరుడుండెను. దేవతలతో గలిసి యుద్ధభూమికి వచ్చి ఇంద్రుడు రాక్షసుని జూచి సంతోషావేశముతో పొంగెను. ఆకాశవీథిలో దేవదుందుభులు మ్రోగెను. ప్రకాశమానమైన తేజస్సుతో సూర్యుడు ప్రకాశించెను. జగములన్నియు దుఃఖశాంతిని పొందినవి. లోకము ఆపదలు తొలగి ప్రకాశించెను. గంధర్వశ్రేష్ఠులు పాడిరి. ఆకాశమున అప్సరఃస్త్రీలు నాట్యము చేసిరి. దేవతా సంఘములు పుష్పవర్షమును కురిపించెను. సముద్రములు నిర్మలములయ్యెను. దిక్కులన్నియును స్వచ్ఛమైన ప్రకాశమునందెను. సర్వలోకములకు భయంకరుడైన ఇంద్రవైరి చంపబడిన వార్తను విని గుంపులుగా వచ్చి చూచి దానవులు ఋషులు, దేవతలు పొగడి మంచి వాక్యములతో దీవించిరి. కలత పరితాపము లేకుండ బ్రాహ్మణులింక నిర్భయులై బ్రతికెదరని సంతోషముతో దేవతాసంఘములు బ్రహ్మర్షి సంఘములును బలికిరి. జాంబవంతుడు, హనుమంతుడు, విభీషణుడు పొంగిపోవుచు ఆ గొప్ప పరాక్రమము గలిగిన ఇంద్రజిత్తును చంపి పరాక్రమించిన రాజసింహుని సమీపించి స్తోత్రములు చేయుచు అతని విజయమును మెచ్చుకొని ఎంతో శ్రద్ధతో వేయి విధములుగా వారియుద్ధమును వర్ణన చేసిరి. వానరులు అరచుచు వాలములను నేలపై గొట్టుచు, దూకుచు లంక సంక్షోభించునట్లు పరుగెత్తుచు, ప్రకాశించుచు లక్ష్మణుని గొప్పదనమును మెచ్చుకొనుచు అతని చుట్టు చేరి నిలిచిరి. జై లక్ష్మణా! జై లక్ష్మణా! అని వానరశ్రేష్ఠులు ఒకరినొకరు కౌగిలించుకొనుచు ఆనందించుచు రణకథలను తిరిగి తిరిగి వినిపించుకొనుచు వేడుకతో నుండిరి. అవి విని ప్రియమిత్రుడగు లక్ష్మణుడు చేసిన అతి దుష్కరమైన కార్యమును నమ్మజాలక తామే యుద్ధభూమికి వచ్చి చూచి దేవతలు మనస్సులు సంతోషముతో పొంగుచుండగా ప్రీతితో వెళ్లిరి.

★★★

# తొంబది రెండవ సర్గము

## ఇంద్రజిత్తువధ విని శ్రీరాముడు లక్ష్మణుని గొనియాడుట:

అట్లు ఇంద్రజిత్తును వధించి మిక్కిలి ఆనందమునందుచు నెత్తురుతో తడిసి వానరులను, జాంబవంతుని, వాయుపుత్రుని, పిలిచి మనము సుగ్రీవుని, రాముని చూడబోవుదము పదండు అని విభీషణ హనుమంతుల చేతిని పట్టుకొని వేగముగా లక్ష్మణుడు ఇంద్రుని జేరు బృహస్పతి విధముగా రామచంద్రుని సమీపించి నమస్కరించి సంకోచపడుచు మెల్లగా ఇంద్రజిత్తును వధించుటను తెల్పెను. రాక్షసశేఖరుడైన విభీషణుడు మనస్సు సంతోషముతో పొంగిపోవుచుండగా సర్వమును వినిపించెను. ఆ కథను వినుటచే సంతోషమును పొంది రామచంద్రుడు మేలుమేలు లక్ష్మణా! నిన్ను మెచ్చితిని. నీవు బలే మేలుచేసితివి. ఆ పాపాత్ముడు చంపబడుటచే ఇంక సర్వకార్యములు చక్కబడును సుమా అనుచు అతనిని పొగడుచు సిగ్గుపడుచున్న అతనిని తన తొడపై జేర్చి గట్టిగా కౌగలించుకొని శిరస్సు మూర్కొనెను. శరీరమంతయును నిమురుచు తమ్ముని మరల మరల చూచి శరీరమునందు బాణములు మొదలైన సాధనములచే కలిగిన గాయములతో అతడు నిట్టూర్చుచుండగ మనస్సునందు దుఃఖించుచు తానును మాటిమాటికి నిట్టూర్చెను. శ్రీరాముడు పలుమారు తమ్ముని తడవెను. శిరస్సును మూర్కొనెను. మనస్సునందలి బాధ తీరునట్లుగా ఓదార్పు మాటలను పలికెను. ఆ కఠినుడు నిన్నెంతగా కడగండ్లు పెట్టెను అనుచు కళకళమండెను. అన్నా! లక్ష్మణా! నీవు చేసిన యీ పని చాలా కష్టమైనది. ఎవ్వరును చేయజాలనిది. ఇంక మనకు శుభములు కలుగగలవు. ఆ నీచుడగు రావణుడు తన పుత్రునితో గూడ చచ్చినవాడై సుమా. రావణునకు కుడిచేయి వంటివాడు ఎల్లప్పుడు ఈ ఇంద్రజిత్తే సుమా. తండ్రీ! అట్టి దుర్మార్గుని నీ వంత మొందించుటచే ఇప్పుడు గదా నేను జయించితిని. ఈ విభీషణుడును, హనుమంతుడును చేసిన సాహసము నెంచశక్యమా? మూడుపగళ్లును, మూడురాత్రులును ప్రతాపముతో యుద్ధముచేసి యెట్లెట్లో ఇంద్రజిత్తు చచ్చెను గదా. తన పుత్రుని మరణమును వినినంతనే రావణుడు మిగిలిన బలములతో కదలివచ్చును. ఇంక యుద్ధ ఆతిథ్యము నిచ్చును. సోదరా! నా బలముచే అతడు చచ్చును.

ఓ విశిష్టమైన నడవడి గల లక్ష్మణా! నాకిచ్చుట దిక్కై, నీవా ఇంద్రవిరోధిని వధించుటచే గదా నే నా భూపుత్రిని, రాజ్యములను తిరిగి పొందగలిగితిని. అని యిట్లాశ్వాసించి గట్టిగా కౌగిట బట్టి సుషేణుని బిలిచి ఈ పవిత్రుడు, మిత్రవాత్సల్యము గలవాడు, గొప్పమేధావి అగు లక్ష్మణుని ఆరోగ్యవంతుని జేయుము. ఈతని శరీరమునందు బాణముల ములుకులు నాటియున్నవి. అట్లే విభీషణుని కోతులను ఎలుగుబంట్లను వేగముగా స్వస్థులను జేయవయ్యా! వారు వీరని చెప్పనేల మన వంక నిల్చి యుద్ధమున నొచ్చిన వారికెల్ల వేగముగా బాధను తొలగింపజేయుము అని చెప్పగా ఆతడు శక్తివంతమైన ఓషధిని రాజపుత్రునికిచ్చెను. దానిని వాసన చూడగా తక్షణమే లక్ష్మణునకు సుఖము గలిగెను. ములుకులు రాలిపోయెను. గాయములు మానిపోయినవి (ఇట్టి వైద్యమును ఇప్పటి నాగరిక శిఖామణులు నేర్చుకొనవలసి యున్నది) మఱియు విభీషణునకును, తక్కిన వానరులకును రాముని శాసనము ననుసరించి చికిత్స చేసెను. తక్షణమే లక్ష్మణుడును తక్కిన వానరేంద్రులందఱును బాధ తొలగినవారై సంతసమును పొందిరి. రామసోదరుడు బాధలేని వాడగుట జూచి వానరభల్లూక సమూహములును, ఆ విభీషణుడును, చాలా సంతోషమును పొందిరి. సీతానాధుడు సోదరుని మఱియొక మారు మెచ్చుకొనెను.

★★★



# తొంబది మూడవ సర్గము

## ఇంద్రజిత్తు మరణమునకు రావణుడు విలపించుట:

ఇచ్చట ఇట్లు వానరశ్రేష్ఠులు సంతోషమున దేలుచుండగా అచ్చట లంకయందు రావణుని మంత్రులు ఇంద్రజిత్తు మరణవార్తను వినియు యుద్ధభూమికి వెళ్లి అతని శవమును జూచి నిశ్చయపరచుకొన్నవారై కన్నుల నీరు గారుచుండగా రావణుని జేరి రాక్షసరాజా! నీ సోదరుడైన విభీషణుడు సహాయపడగా లక్ష్మణుడు నీపుత్రుడైన యింద్రజిత్తును యుద్ధమున జంపెనట. శూరులలో శ్రేష్ఠుడును, యుద్ధమున ఓడిపోవుట యెరుగని వాడును, ఇంద్రుని జయించి భూమియందు కీర్తిని బొందిన బలవంతుడును అయిన నీ పుత్రుడు సీతానాథుని సోదరునితో తలపడి వారింపరాని శరసంఘములతో కలత నొందింపజేసి వీరజనులు చేరెడు లోకమున కరిగెను అని చెప్పగా దారుణమైనదియు, హృదయము బ్రద్దలు చేయునదియునైన పుత్రమరణవార్త విన్న మాత్రముననే ఘోరమైన మూర్ఛపొంది నేలబడి తెలివి దప్పిన వాడగుచు లంకాధిపతి చాలా కాలమునకు తెలివిని పొంది మరల ఉడుగని పుత్ర శోకమున వ్యాకులుడై దీనుడై విలపించెను. హా పుత్రరత్నమా! హా మహారథవర్యా! హా రాక్షసవ్యూహవీరముఖ్యా! హా పెన్నిధానమా! హా నా పెన్నిధానమా! నా పాలిటి భాగ్యమా! నన్ను విడిచి పోవుటకు నీకు మనసెటు వచ్చినదయ్యా? ఇంద్రునంతటి వానిని జయించియు సౌమిత్రిచే ఎట్లు చంపబడితివయ్యా? ఆ కాలాంతకుని నైనను హతమొనర్చెడు నీదు బాణశక్తి యేమయ్యెనయ్యా? తండ్రీ! మందర పర్వత శృంగములనన్నింటిని నేలబడగొట్ట జాలిన నీ బాహుశక్తి యెట్లు నశించెను రా? పుత్రా! అట్టి నీ శౌర్యము ఆ సుమిత్రా పుత్రుని నణప జాలదయ్యెనా? హా! కుమారా! నేడు తప్పక శాలుడు నాకు గొప్పవాడుగా దోచుచున్నాడు ఏలన నీవింటి బలాఢ్యుని కాలగతి గూర్చెను. ఔరా! కాలము యొక్క గతిని ఎంద్దైనను ఎవ్వరు నెరుగలేరు గదా. అన్నా! నా పుత్రరత్నమా! సమస్త దేవతలలో మానవులలో నెవ్వరికైనను గొప్ప శౌర్యముతో ప్రకాశించువారికిని విడువని ధైర్యవంతులకు తమ యజమానికై ప్రాణములు వీడువారికి యోగ్యమైన మార్గము. ఆత్మయందు నా దుస్థితిని నాదిక్కులేని విధమును ఆలోచించి దుఃఖించెదను.

ఎన్నడును నన్ను విడువవు. అగ్రేసరుడైన నన్ను సైన్యమును కాపాడుచుండెదవు. ఇక నాకెవరున్నారురా దిక్కు? నన్ను విడిచి ఒంటరిగా నీవు యమపురమునకు వెళ్ళదగునా? ఇప్పుడింక దేవతలును, దిక్పతులును, ఋషులును, నీవు సంహరింపబడుటను విన్నవారై అపరిమితమైన సంతోషము పొంగగా ఆదమరచి నిద్రించెదరు గదా. పుత్రా! నాకింక పురములున్నను, నగరములున్నను, భూమియు ఆకాశమును ఉన్నను, వనములున్నను, పర్వతశ్రేష్ఠములున్నను, జీవములకు రత్నమునైన ఇంద్రజిత్తువు నీవొక్కడవు లేకున్న సర్వమును శూన్యముగా దోచుచున్నది గదా. అక్కటా! అంతఃపురములందు రాక్షస కన్యలు దుఃఖించుచున్న ధ్వనులు గుహలందు దిక్కులేక అరచుచున్న ఆడయేనుగుల భరింపరాని ధ్వనులవలె వినిపించుచున్నవి గదా. అయ్యో! నన్నును, యువరాజపదవిని, నాయనా! లంకను, రాక్షససమూహములను, నీ ముద్దుల భార్యను, నీ తల్లిని, అందఱిని విడిచి ఒక్కడవే పోవదగునా? కుమారా! ముందుగా వెడలిన నాకు ప్రేతకార్యములు నీవు చేయుట అర్హము గదా. విధి చేసిన మోసము చేత అది తారుమారయ్యెను గదా. రాముడును, లక్ష్మణుడును, వానరరాజును ప్రాణములతో నుండగా, నా మనస్సునందు దృఢముగా నాటిన శల్యము లట్లేయుండగా, నన్ను తీవ్రమైన వేదనల పాలొనరించి ఈ విధముగా పుత్రా! గొప్పనైన ఊర్ధ్వలోకములందలి సుఖసమూహములను పొందుటకు ఆశపడితివా? అక్కటా! నా ప్రేమను మరువదగునా? యనెను. దేవతల సేనను నిర్జించినవాడా! యనెను. బాహుబలమునకు నిలయమైన వాడా! యనెను. నీ తల్లి దుఃఖమును మాన్పరాదా? యనెను. నీ భార్య నోదార్పరాదా యనెను. ఈ కోపమేలరా? యనెను. నాపుత్రరత్నమా! నీవేకదా నాకు దిక్కు అనెను.

## రావణుడు రాక్షసులతో తన పరాక్రమము దెలుపుట:

అట్లు విలపించుచున్న సహజముగా అధిక క్రోధనుడైన రాక్షస రాజునకు పుత్రుని మరణముచే సంభవించిన ఆర్తిచే కలిగిన రోషము భయంకరమై మనస్సు నందు జనింపగా వేసవికాలము నందు వేడెక్కిన కిరణములు సూర్యునికి మరింత తీక్ష్ణతను గలిగించు విధముగా ఆతడు మండిపడుచు ముడుతలు పడిన కనుబొమ్మలు నటించుచున్న ముఖముగలవాడై మొసళ్లతో నిండిన కల్లోల సముద్రము వలె నుండెను. కోపముచే విజృంభించుచున్న వాని నోరు నిప్పుల గ్రక్కుచున్న వృత్రాసురుని నోటిని తలపింప జేయుచుండెను. సహజముగానే ఎఱ్ఱనైన నేత్రములు క్రోధాగ్నిచే మరింత విజృంభించి

రుద్రుని రూపమునకు సాటియయ్యెను. మండుచున్న వత్తి నుండి మండుచున్న నూనెబొట్లు వలె కనులనుండి కన్నీటిబిందువులు రాలెను. దానవులతో త్రిప్పబడిన యంత్రములు చేయు ధ్వనివలె రావణాసురుడు పండ్లు పటపట కొరుకుచప్పుడులుండెను. యముని వలె అతని చూపులు వ్యాపించిన ఆయా ప్రాంతములందున్న రాక్షసవీరులు మనస్సులు చెదరగా భయముతో గుంపులై పరుగులెత్తిరి. అప్పుడు రావణుడు తనవారికెల్లను భయము తీరునట్లును, ధైర్యము కలుగునట్లును, పటపట పండ్లు కొరుకుచు నిట్లనెను. ఓ రాక్షసవీరులారా! నా శక్తిని విశదముగా ఎరిగింతును వినుడు. వేల సంవత్సరములు ఘోరతపస్సు చేసి అప్పుడప్పుడు బ్రహ్మను మెప్పించితిని. తపో బలముచే బ్రహ్మవరముచే దేవతలవలన గాని రాక్షసులవలన గానీ భయములేనివాడను, వజ్రము చేతనైనను భేదింపరాని కవచమును బ్రహ్మచే పొందినాడను. అట్టిదే అయిన విల్లును పట్టి రథమునధిష్ఠించి ఎదురులేకుండా జగత్తునంతయు తిరుగువాడను. బ్రహ్మచే నొసగబడిన విల్లును బాణములను ధరించి యుద్ధభూమి యందు నిలువగా ఇంద్రుడైననునన్నెదిరింపలేడు గదా ఇక రామలక్ష్మణాదులొక లెక్కయా? వందలకొలది మంగళవాద్య ధ్వనులతో సాటిలేని వింటిని తీసికొనిరండు. భాస్కరసమానమైన తేజముతో నున్న బాణసమూహములతో రామలక్ష్మణులను చెండెదను.

## రావణుడు సీతను జంపబోవుట:

అనుచు పుత్రశోకముచే తపించుచున్నవాడును, అధికమైన రోషమును పొందిన వాడును అయిన దశముఖుడు జానకిని చంపదలంచుచు రాక్షసులతో దీనస్వరముతో నిట్లనెను. రాక్షసులారా! నా పుత్రుడు నాసంతానములో శ్రేష్ఠుడు వానరులను వంచించుటకై సీతయను నొకదానిని సృష్టించి దానిని వధించినాడు గానీ నేను చంచలమైన కనులు గలదియు, క్షత్రియాధముడైన రాముని యందు ప్రేమగలదియు అగు విదేహ రాజపుత్రికను తెగనేయుదును చూడుడు. ఆ సీతతో మన పీడ వదలిపోవును. అని చెప్పుచు తెల్లని వస్త్రములకాంతి గలదియు, పుష్పహారములచే అలంకరింపబడినదియు అయిన చంద్రహాసమును వేగముగా చేతబట్టుకొని పుత్రశోకముచే గలిగిన అధికబాధచే మనస్సు స్వాధీనము తప్పుచుండగా జానకి యున్నదిక్కునకు తన భార్యలును మంత్రులు వెంటరాగా వేగముగా వెళ్లెను. అట్లు వెళ్లుచున్న రాక్షసరాజును చూచి పెద్దగా గోలచేయుచు అచ్చట నున్నవారు ఒకరితో నొకరు ఇట్లనుకొనిరి. ఈ రావణుడు సామాన్యుడా! సకల

దిక్పాలకులను యుద్ధమునందు పారద్రోలినవాడు. ఇట్టి వీనిని చూచి రాజపుత్రులే విధముగా పోవుదురో ఎవ్వరెరుగుదురు? దేవతలు మొదలగువారిని గెలిచి బలాత్కారముగా మూడులోకములనున్న రత్నరాసులను సాహసముతో తెచ్చినాడు. విక్రమమునను, బలమునందును వీనితో సాటి వచ్చువాడు పదునాల్గు భువనములందెవ్వడున్నాడని చెప్పగలము అని యనుకొనుచుండగా రాక్షసరాజు అశోకవన మార్గముననుసరించి వెళ్లెను. మంత్రులు వద్దని చెప్పినను, బంధువులందఱును అడ్డగించినను, స్నేహితులు మరలుమన్నను, విశిష్టమైన బుద్ధిగలవారు ఇది నీకు తగదని చెప్పినను, నిలువక రోహిణీ నక్షత్రమును ఆక్రమింపబోవు దుష్టగ్రహము వలె సీతమీదకు భయంకరముగా చూచువారు భయము చెందునట్లుగా పరువెత్తెను.

## రావణుని జూచి సీతాదేవి దుఃఖించుట:

అట్లు వచ్చుచున్న రావణుని, చేతియందు ఖడ్గము దాల్చిన వానిని, అధికమైన క్రోధము గలవానిని, అతనియందు స్నేహము గలవారిచే అడ్డగింపబడుచున్నవానిని, ఆ సాధుచరిత్ర గల వారిలో శ్రేష్ఠుడైన రామచంద్రుని భార్య చూచి అయ్యో! వచ్చుచున్న ఈ రాక్షసుని తీరుచూడగా అవశ్యకముగా నన్ను జంపవధింపగోరుచున్నాడు, సర్వదిక్కులకు తానే దిక్కైన మహావ్రతుడు దిక్కుగా గలనన్ను అక్కటా! అనాధను వలె ఈ క్షుద్ర రాక్షసుడు నేడు సంహరింపదలంచెనే. పతివ్రతయైన నన్ను ఈ పాపాత్ముడు అనేక పర్యాయములు భయము చేతను, నయము చేతను తన భార్య కమ్మని బ్రతిమాలి తిరస్కరింపబడి నిరాశుడై విసుగు జెందినవాడై మోహము రోషము మనస్సు నందు పెనగొనగా నన్ను సంహరింపవచ్చుచున్నాడు.

ఇది యదార్ధము. ఇందు సందియము లేదు. అట్లుకాక నా కొఱకై వీడు ఆ మహానుభావులగు రామలక్ష్మణులను వధించెనో. ఇస్సీ నన్ను గురించి రాజపుత్రులు గతించి గదా. ఓ దైవమా! ఎంతలు పుట్టెను. కానిచో ఈ పాపాత్ముడు పుత్రశోకముచేత వారిని చంపలేక నన్ను జంపగోరినవాడై యిటువచ్చెనో గదా. నేనెంత బుద్ధిహీనురాలను, నా హితము కోరువాడైన బుద్ధిమంతుడైన హనుమంతుని మాటలను స్వీకరింపచెడితిని. అతని మాట ననుసరించి నిశ్చింతగా అతని వీపు నెక్కి వెళ్లియుండినచో ఒక్కచిక్కును పొందకుండ హాయిగా నేనీపాటికి నానాధుని తొడపై నెమ్మదిగా నుండకుందునా? ఇట్లు ఏడ్తునా? ఒకే కుమారుడు గల సాధ్వియైన కౌసల్య తన పుత్రుడు యుద్ధభూమి

యందు చంపబడెనని విని యెంతగా శోకించునోగదా! ఈ ఆర్య పుత్రుడు తనకు లేకలేక కలిగిన విధమును బాలక్రీడలయందు ప్రజలందఱకు ముద్దుబిడ్డడై ముద్దు ముద్దు మాటలచే మురిపించుటను, యౌవనమందు తనయందు ప్రేమచే చూపించు భక్తిని, పరిశుద్ధమైన చరిత్ర గలిగి ధర్మకార్యములను చేయుటను తలచి తలచి గుండెలు పగులగా ఇంకెక్కడి కొడుకనుచు ఆశలను విడిచి శ్రాద్ధకార్యములు నిర్వర్తించి తాను అగ్నియందో నీటియందో పడి మరణించును గదా. దీనికంతకును మూలము ఆ జగజంత దుష్టురాలు దుష్టచరిత్రురాలునగు కుబ్జయే. ఇస్సీ ఆ మంధరచే మంచి హృదయము గల కౌసల్యకు ఎంతటి దుఃఖము గలిగినది.

## సుపార్శ్వుడు రావణునకు నీతి దెలిపి మరలించుట:

అని యిట్లు భర్తృహీనమయి గ్రహము బారినబడిన చంద్రుని భార్యవలె ఏడ్చుచున్న రాజపుత్రుని భార్యను జూచి మంచి బుద్ధిమంతుడును, ధర్మాచారపరుడును అయిన సుపార్శ్వుడు శ్రేష్ఠులైన మంత్రులచే హితులచే చుట్టబడి యున్నవాడగు రావణుని దగ్గఱకు వెళ్లి వేగముగా మనస్సునకు తగులునట్లుగా ఇట్లు పల్కెను. ఔర్యా! దశాస్యుడా! బ్రహ్మకులమందు పుట్టి, కుబేరుని తమ్ముడవై, వేదములను పూర్తిగా వల్లెవల్లించి, వ్రతములన్నియును జేసి, శుచివై, నీకు విహితము లైన నిత్యకర్మములను చేయువాడవై తామరలవంటి నేత్రములు గల ఈ సీతనా నీవు చంపుటకు తెగించితివి? వీరశ్రేష్ఠుడా! కోపముచే ఎంతటి పాపమును ఒడిగట్టుచున్నావో తలంపవుగదా. ఏ విధముగా ఇది ధర్మమని ఓ రాక్షసరాజా! ఈమెను చంపబూనితివయ్యా? ఈ అభిమానవంతురాలి అందమైన రూపము గొప్పదనమును చూడుము. నీకీ సుకుమారిని చంపుటకు చేయియెత్తుటకు మనసెట్లువచ్చినది? రాక్షసరాజా! మిక్కిలి శూరులమైన మమ్ము సాయముగా తీసికొని గౌరవప్రదమగు రీతిగా రామచంద్రునిపై నీ మనస్సున మండెడు కోపమును చూపుము. దానిని లోకములు మెచ్చుకొనును. కృష్ణపక్షచతుర్థశి యందిప్పుడు లేచి శత్రువులపై దాడివెడలు వాడవై ప్రయాణమునకు సన్నాహమొనర్చి రేపు అమావాస్య గాన బలగములతో యుద్ధమున కేగి జయమును పొందుము. నీవు శూరుడవు, ధీరుడవు వాడియైన ఖడ్గమును చేత ధరించి, రథము నధిరోహించి వెళ్లి శ్రీరాముని జంపి సీతను చేపట్టుము అని చెప్పగా ఆ ధర్మయుక్తమైన మాటలనాలించి ఆ దుష్టాత్ముడు తన గృహమున కేగి హితులైన మంత్రులతో సభ దీర్చి రోషముతో సింహము వలె ఊర్పులను విడిచెను.

★★★

# తొంబది నాలుగవ సర్గము

## మూలబలముల యుద్ధము:

పరమమైన దుఃఖమును పొంది మిక్కిలి దైన్యముతో సైన్యమందు ముఖ్యులను తేరిపారజూచి కడుపు దుఃఖము తన్ను కాల్చుచుండగా చేతులను జోడించి యిట్లనెను. ఓ కార్యసాధకులారా! గజములు, గుఱ్ఱములు, రథములు, భటులు గల సేనతో దాడి వెడలి రాముని నొక్కని చుట్టుముట్టి వర్షాకాలము మేఘములవలె బాణవర్షముల ముంచి చంపుడు. రేపు నేను మీకు సాయముగా వచ్చి జానకీనాథుని జంపి జగములకు తెలియునట్లు జయమును పొంది మిమ్ములను సన్మానించెదను. అని చెప్పగా అట్లేయని అనేకమైన సైన్యములతో సేనానాయకులెల్ల బయలుదేరి వెళ్లి వాడియైన పట్టిస సమూహములతోను పరిఘములతోను వానరవీరులను కొట్టి యుద్ధము చేసిరి. సూర్యోదయవేళ యుద్ధక్రీడకై దశకంఠుని బలములు తలపడగా వానరవీరులు పర్వతములను వృక్షములను వేసివేసి పోరుచుండగా ఘోరమైన ఖడ్గములతోను, గదలతోను, రాక్షససంఘములు వానిని పిండిపిండి చేసి చంపగా ఇట్లు ఇట్లని చెప్పరానివిధముగా యుద్ధము మహాభయంకరమై యొప్పెను. ఆ సమయమున కాళ్లచే త్రొక్కగా భూమి నుండి వెడలిన దుమ్ము రక్తప్రవాహములచే అణగినదయ్యెను. ఆ రక్తనదులందు నౌకలవలె రథములుండెను. వానరులు రాక్షసులు చేయుచున్న యుద్ధక్రీడయందు ఏనుగులు రథముల సమూహములే గట్లుగాను. గుఱ్ఱములు చేపలుగాను, శరీరములే పెద్ద తెప్పలుగను, పెద్ద టెక్కెములే వృక్షములుగను గలిగి రక్తనదులు హెచ్చియుండెను. నెత్తురులు గారుచుండగా పెద్ద యేనుగులపైనను గుఱ్ఱములపైననూ, ధ్వజసమూహములపైనను గుంపులుగా ఎగిరి ఎగిరి మదించినవారై వానరవీరులు నేలబడగొట్టిరి. మోకాళ్లను, ముక్కులను, నొసళ్లను వెంట్రుకలను గోళ్లతో, పండ్లతో మిక్కిలి బలముతో పెరుకుచు, కొరుకుచు, తెగనరుకుచు వానరసమూహము రాక్షస శ్రేష్ఠులను వేధించిరి. పండిన వృక్షములపై పక్షిసంఘములు వ్రాలిన విధముగా ఒక్కమారుగా ఒక్కొక్క శత్రురాక్షసుని మీదకు శౌర్యవంతులగు వానరవీరులు వందలకొలదిగా గర్వము మెరయునట్లు తలపడిరి. విరోధులు కూడా వెనుదీయక పరశ్వథముల చేతను, శూలములు, ఖడ్గములు మొదలైన సాధనముల

చేతను, వాడియైన పరిఘాయుద్ధముల చేతను, బాణముల చేతను వానరవీరులను వారి సేనాసమూహములను, చీల్చిరి, కూల్చిరి, నొప్పించిరి, త్రుంచిరి, వేగముగా బాధపడునట్లు బెదిరిపోవునట్లు, కలతచెందునట్లు, తల్లడిల్లునట్లు, మనస్సులందు దుఃఖించునట్లు చేసి పారద్రోలిరి. రాక్షస సైన్యములిట్లు విజృంభించగా వానరులెల్లఱును బెదిరి దశరథపుత్రుడైన గొప్ప బాధలొందినవారికి శరణుగోరదగినవాడగు రామచంద్రుని జూచి శరణుగోరగా రామచంద్రుడు కోపముతో

## శ్రీరాముడు మూలబలములను సంహరించుట:

శ్రేష్ఠమైన విల్లు ధరించి రాజశ్రేష్ఠుడు శత్రుసమూహమునందు చొరబడి బాణవర్షముచేత జోరున ముంచగా సూర్యుని మేఘమలు చెంత చేరలేని విధముగా గొప్పనైన దావాగ్నిని సమీపింపలేని విధముగా ఒక్కడైనను రాముని చూడజాలడయ్యెను. చేరుట చెప్పనేల? అగ్నిజ్వాలలు ఒకదానితో నొకటి తాకుచున్న విధముగా నిప్పులు గ్రక్కుచు అన్ని దిక్కులకు వ్యాపించుచు రాముని బాణములు ముమ్మరమై ముంచగా. ఆ గొప్పవాడి యైన బాణములు తగిలి శరీరములు తెగిపోగా రాక్షసులు కొలదిసేపటిలోనే అగ్నిలో దగ్ధమౌ మిడతలదండు వలె నశించిరి. ఇట్టిదని యెవ్వరును చెప్పజాలని వేగముతో, రాజశ్రేష్ఠుడును విరోధులను చలింపజేయువాడును అగు రామచంద్రుడు విజృంభణ మొప్పగా మహారథుల సమూహములను శాపముతో కూలునట్లు ఎక్కుడు తీవ్రతతో సంహరింపగలవారికి అరణ్య సమూహములను గూర్చి పెనుగాలి చూడరాని విధముగా చూడరానిదయ్యెను. వైభవముతో నున్న సైన్యము భిన్నమై, భిన్నమై నశించి తరిగిపోగా యుద్ధభూమి యంతయు శవములతో నిండినదై చూచువారల కన్నులకు కడుఘోరముగా నుండెను. తల తెగిపడువారును, తలపగిలినవారును, మొండెము నుండి తల వ్రేలాడెడివారును, తగులపెట్టబడిన, నఱుకబడిన శరీరములతోనున్నవారును ఎటు చూచిననూ ఇంద్రజాలము వలె కనిపించుచుండెను. గానీ రాముడు కనిపించడయ్యెను. ఱివ్వగ వచ్చి బాణములు ఱొమ్మున నాటుటయే కనిపించునుగానీ యుద్ధమున కడువేగవంతుడైన రఘుశేఖరుడు ఇంద్రియార్థములకై శరీరమునందున్న ఆత్మవలె ఎచ్చటను గానరాడు. ఆయన యొక్క వేగమును, ఆయన అస్త్రలాఘవమును చెప్పశక్యమా! నరశ్రేష్ఠుడైన రామభూవిభుడు గంధర్వాస్త్రము వేసి మాడ్చుచుండగా విరోధి సేనలు మోహితాత్ములై దిగ్భ్రాంతిని బొందిరి. వేగముచే ఒకరికొకరు రాముడుగా కనిపించుటచే రాముడే అను భ్రాంతిచే (కొఱవి త్రిప్పిన నిప్పుచక్రము వలె గాన వచ్చునట్లు గమన

వేగముచే శ్రీరాముడు అందఱకు అందఱు శ్రీరాములై యెందును తానే అయి తోచెను గాని యింద్రజాలము వంటి మోసపు విద్యచే గాదు) క్రోధముచే నిండిన మనస్సు గలవారై ఆ రాక్షసులు ఒకరినొకరు చంపుకొనిరి. ఈ యేనుగుల ద్రుంచునాతడే శ్రీరాముడు, ఈ హయములను చంపు ఇతడే శ్రీరాముడు, ఈ రథికులను హతమొనర్చునతడే రాముడు, ఇదిగో నన్ను చూచుచున్న ఈతడే కోసలరాముడు, ఇదిగో ఆ కత్తినెత్తిన ఆతడే రాముడు. అని అనుకొనుచు జగత్తంతయు రామమయము కాగా నీవే రాముడవు, రాముడవు నీవే యనుచు రాక్షస సంఘములు ఒకరినొకరు తలపడి గొప్ప అస్త్రసంఘములతో కొట్టుకొని చచ్చిరి.

ఒక్కనికి అనేకులు గాను, అనేకులకు ఒక్కడుగాను కనిపించుచు భయంకరమైన విల్లును ఆశ్చర్యకరముగా కొఱవి త్రిప్పిన విధముగా త్రిప్పగా వింటికోటి యొక్కటే కనిపించెను. రాక్షసులను సంహరించుచున్న రాముడనెడు చక్రము ప్రజలకు కాలచక్రము వలె కనిపించెను. రాముని శరీరమే ఆ చక్రపు నాభి. ఆయన బలమే దాని జ్వాల. శరములే దాని అరములు (ఆకులు) విల్లే ఆ చక్రనేమి. వింటినారి మ్రోతలే దాని ధ్వని, తేజస్సు బుద్ధి మొదలగు శ్రేష్ఠ గుణములే జ్వాలలు, దివ్యాస్త్రములే దాని అంచు. వాయువేగము గల పెద్ద రథములు సేనలు పదివేలును, పద్దెనిమిది వేల యేనుగుల సేనలును, గుఱ్ఱములతో గూడ ఆశ్వికుల సేనలు పదునాల్గువేలును, రెండు లక్షల రాక్షసపదాతి సేనలును అప్పుడు నశించెను. మూడు ముప్పావు గడియలలో తీక్ష్ణములైన వాడి బాణములచే పాదచారియు, అసహాయుడునైన రాముడు కామరూపులయిన రాక్షసులను ఈ విధముగా నేలపాలు చేసెను. చావగా మిగిలిన వారు విరిగిన రథములు, చచ్చిన గుఱ్ఱములు విరిగిన టెక్కెములు గలవారై దైన్యము పొందుచు కొందఱు పురమునకు వెళ్లిరి. భూమి కోపించిన శివుని విహారరంగము వలె నొప్పెను. సిద్ధులు, ఋషులు రాముని మేలుమేలని స్తోత్రములు చేసిరి. మూలబలమంతయు నశింపగా వానరరాజును, రాక్షసరాజైన విభీషణుని, హనుమంతుని, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుని, ద్వివిదుని, మైందుని తక్కిన వానరవీరులను, చెంతకు పిలిచి ఈ యుద్ధభూమియందు మీరు చూచిన గొప్ప అస్త్రవేగమును, శక్తియు కల్పాంతకుడైన ఆ ఫాలాక్షుని యందును నాయందును మాత్రమే కననగును. అనగా విని చచ్చిపడిన రాక్షస సైన్యములను చూచి ఆశ్చర్యపడుచు సంతోషముతో దేవతా సంఘములు ఇంతచేసియు అలసట నొందని అస్త్రవిద్యాప్రవీణుడగు రామచంద్రుని పొగడెను.

★★★

# తొంబది యైదవ సర్గము

## రాక్షస స్త్రీల విలాపము:

అట్లు రావణాసురునిచే పంపబడిన రాక్షససైన్యము, ఏనుగులు, గుఱ్ఱములు, టెక్కెములు మొదలగువానితో గూడ రాముని బాణముల సమూహములచేత మూలమట్టుగా నశించిపోయెనను విషయమును చావగా మిగిలిన వారు చెప్పగా రాక్షసస్త్రీలు గుంపులుగా గూడి వాడవాడలందును హా! హా! యని యేడ్చుచు బాధ చెందుచుండిరి. చచ్చిన పుత్రులుగలవారును, భర్తలు మరణించిన వారును, బంధువులు నశించినవారును అయిన రాక్షస స్త్రీలందఱును నేలమీద పడిపొరలుచు ఏడ్చుచు, దుఃఖముతో నెత్తినెత్తి కొట్టుకొనుచు పెద్దపెద్ద ధ్వనులతో అయ్యో! ఆ ముసలివగ్గు, మిట్టపండ్లది, వ్రేలాడు పొట్టతో చేటంత గోళ్లతో, చింపిరితలతో, ఏనుగు చెవులంత చెవులతో గూనితో మిడిగ్రుడ్లతో మిడిమేలముగ పోయి అడవిలో ఎచ్చటనో అడగియున్న మన్మథుని వంటి సుందరుని, అతిసుకుమారుని శృంగారములకు నిలయమైన వానిని, నిండుచంద్రుని బోలు ముఖముగలవానిని, గొప్ప బలవంతుని, సర్వభూతముల హితమును గోరువానిని, సర్వలోకములకు నమస్కరింపదగినవానిని, సర్వగుణాఢ్యుని ఎల్లరచే నిందింపదగినది, గుణహీనురాలు అయిన శూర్పణఖ చెనకి గదా ఇంతటి చేటు దెచ్చినది. ముడుతలు నిండిన మొగము గల కురూపి తానెక్కడ? పూర్ణచంద్రుని బోలు ముఖము గల అతడెక్కడ? నెఱసిన తలవెండ్రుకల ముసలిడొక్కు తానెక్కడ? తుమ్మెదల వంటి ముంగురులు గల అతడెక్కడ? అవగుణములకు పుట్టినిల్లయిన తానెక్కడ? సుగుణములనెడు రత్నములకు రత్నాకరుడైన అతడెక్కడ? భయంకరమైన ఎత్తైన తాటిచెట్లవంటి చేతులు గల తానెక్కడ? గజ తుండము వంటి కరములు గల అతడెక్కడ? తనకును తన రూపమునకును దగినవాడు రామచంద్రుడని తోచెనా? అయ్యయ్యో! ఇది ప్రజలు విన్నచో నవ్వరా? భూమినున్న జనులు తిట్టరా? ఇట్టి ఆగడములను భూమియందు దివఱకెన్నడైనను విన్నామా? అడవియందు ఖరదూషణాదులకు పెద్ద మృత్యువు వలె నయ్యెను గదా. మన దురదృష్టమీవిధముగా బాధపెట్టుటకే దానితో రాజపుత్రులకును రాక్షసనాధునకు వైరము పెంచినది. తన కంఠము నందు చుట్టుకొన్న కాలపాశము విధముగా భూపుత్రుని తాను తీసికొని వచ్చెను గాని

నిజముగా అతడామెను పొందుటకల్ల. వృధాగా భూపుత్రి భర్తతో బలవద్విరోధము కలిగినది. జానకిని గోరిన విరాధుడు ఆ మహాభుజుని బలము చేత చచ్చెను. దీనికి అదియే తగినంత నిదర్శనము గదా. పదునాల్గు వేల బలవంతులైన రాక్షసులు ఒక్కమారుగా పెద్దపెట్టున రాముని నెదిరించి ఒక్కడైనను మిగులకుండ సంహరింపబడిరి. ఆ మదించినవారగు ఖరుడు, దూషణుడు, సత్వధునుడైన త్రిశిరుడును రామునితో తలపడిరి చచ్చిరి. అదియే దీనికి తగినంత నిదర్శనము గదా. యోజనము చేతులు గల మాంసభోజనుడు, మిక్కిలి బలవంతుడైన కబంధుడు, సాటిలేని మహాబలవంతుడగు తామరల వంటి నేత్రములు గల రామునిచే చచ్చెను. ఆలోచింపగా ఇంకొక నిదర్శనము కావలెనా? మేరు పర్వతమంతటి బలము గలవాడు ఇంద్రపుత్రుడునైన వాలిని ఒక్క బాణముచేతనే నేలగూల్చిన రాముని వీరత్వమునకు వేరొక నిదర్శనమేల? దీనుడై తన ప్రాణముల మీద ఆశను విడిచి ఋష్యమూక పర్వతము నందే బాధ చెందుచున్న ఆ సూర్యపుత్రుని రాజుగా జేసిన ఆ జానకీపతి యొక్క పరాక్రమమునకు ఇంకొక నిదర్శనమెందులకు? విడువకుండగా సర్వరాక్షసులకు హితము చేకూర్చునవియు, అర్థధర్మములతో గూడినవియునైన నీతులను తెగించి చెవి నిల్లు గట్టుకొని గొప్ప గుణవంతుడును బుద్ధిమంతుడును అయిన విభీషణుడు ఈ రావణునితో చెప్పెను. బలీయమైన మోహపాశములచే బంధింపబడినవాడు గాన ఆ మాటలు రావణునకు రుచింపవయ్యెను. ఆ మాటలను విని కుబేరుని సోదరుడప్పుడే సీతను రామునికిచ్చినచో ఈ లంకానగర మీవిధముగా ఏమిటికి కష్టదశను పొంది స్మశానమగును? విడువని దుఃఖసముద్రాన మునిగి జనులేల చత్తురు? అయ్యో! రాజే న్యాయము దప్పినచో అది ఊరకపోవునా? కష్టపెట్టదా? రాముని చేత సాటిలేని పరాక్రమము గల కుంభకర్ణుడు చచ్చుటయు, రాముని తమ్మునిచే విరోధులకు తేరి చూడరానివాడగు ఆ అతికాయుడు పడుటయు. భీమ పరాక్రముడైన యింద్రుజిత్తు చచ్చుటయు ఇవన్నియు చూచియైనను రావణుడు కొంచెమైనను బుద్ధిగొనకున్నాడు అయ్యయ్యో! ఎంతటి మూర్ఖుడో గదా. నా తనయుడా! నా యన్నా! నా తమ్ముడా! తండ్రీ! నా ప్రాణనాధా! అను ఆర్తధ్వనులే పట్టణము నందేవైపున చూచినను ఇంటింటి దగ్గర వినబడుచుండెను. రథములను, గుఱ్ఱములను, ఏనుగులను గల సైన్యములను లక్షలకొలది రాక్షసులను ఒక్క రాముడే క్రోధము నంది వింటిచే సంహరించెను. విష్ణువో, రుద్రుడో, ఇంద్రుడో శ్రీరామరూపము ధరించి సంహరించెనో లేక స్వయముగా యమధర్మరాజు వచ్చెనో, శౌర్యవంతులైన వీరులు సంహరింపబడిరి. ఏమి బ్రతుకు? ఇక ఆపద తొలగునట్టి విధమే లేదు గదా. ఇట్లు దిక్కులేక మనము దేవురించుచుండగా రామచంద్రుని వలన తనకు రాబోవు ముప్పును మూర్ఖుడగు

రావణుడు కాన లేకున్నాడు. వరములు కలవని గర్వపడుచున్నాడు. శ్రీరాముని బారిని పడినవారిని వసువులు, రాక్షసులు, దేవతలు, గంధర్వులు మొదలగువారైనను రక్షింపలేరు. ఇక ఏవిధముగా దశముఖుడు బ్రతుకుదారి గనునో? రావణుడు చేయుచున్న ప్రతియుద్ధము నందును ఉద్పాతములనేకములు కన్పించెను. వీనిచేత నిజముగా రావణుడు రామునిచే చచ్చునని తోచుచున్నది. ఈ రావణుడు బ్రహ్మను మిక్కిలి కోరికతో వరములు వేడునప్పుడు దేవతలచేతను, ఖేచరములచేతను, సర్పములచేతను, రాక్షస సమూహములు మొదలగు వారి చేతను మృత్యువు లేకుండ గోరినవాడై గర్వముతో మానవులను విడిచిపెట్టెను. ఆ ఫలితమిప్పుడు విడువక ప్రాణములు తీయుటకు వచ్చెను. రావణునితో గూడ రాక్షసుల నాశము సిద్ధము సుమా. వరములు పొందినన్న గర్వముతో రావణుడు పెట్టుచున్న బాధలను భరించలేని వారై దేవతలు బ్రహ్మతో మొరపెట్టుకొనగా ఆయన ఇది మొదలు దానవులు రాక్షసులు జగములందు భయముతో తిరుగగలరు పొండు అని చెప్పగా వారు పురహరుడును, వృషభధ్వజుడును అయిన శంకరుని కడకు వెళ్లి వేడుకొనగా ఆయన ప్రసన్నుడై దేవతలారా! మీ మేలుకై రాక్షసులను సంహరించునట్టి ఒక స్త్రీ పుట్టగలదు. పూర్వము దానవులను నాశనము చేయుటకు దాపురించిన క్షధవలె ఈమె రాక్షసులను నశింపజేయునని చెప్పెను. ఆ స్త్రీయే ఈ సీత రావణుని రాక్షసకులమును మ్రింగుటకై వచ్చినది. ఈ రావణుడు కుటిలమైన బుద్ధిగలవాడు. గోరంతయైనను తెలివి లేదయ్యెను. నీతి మార్గమున బోని పాపాత్ముడు. వీని పాపము చేతనే పట్టణము పాడుపడినది. ఇంతటి దుఃఖపాటు గలిగెను. ప్రళయకాలయముని వలె భయము గలిగించు రామభద్రుని వలన భయమును పోగొట్టి కాపాడువారు మూడులోకములందును ఎవ్వరును లేరుగదా. ఇది యదార్థము సుమా అడవియందు పుట్టిన దావాగ్ని చుట్టుముట్టిన ఆడ యేనుగుల వలె రోదించుచుండగా చూచి దిక్కులేక కాలెడి మనకు శరణునిచ్చునట్టి ఆ ఘనుడెవ్వడు? స్వచ్ఛమైన నీతిమంతుడును, వివేకవంతుడును అయిన ఆ విభీషణుడు అర్హమైన పనిని ఆచరించినాడు. ఎక్కడ నుండి భయము కలిగినదో దానిని తెలిసికొని ఆతడక్కడికి వెళ్లి రాముని నాశ్రయించి శరణుపొంది భయమును బాసెను. అని రాక్షసస్త్రీలు దుఃఖించుచు ఒకరినొకరు గాఢముగా కౌగిలించుకొని హా యని యేడ్చిరి. ఆకాశమునంటువారి రోదన ధ్వనులతో దిక్కులును విదిక్కులును మారుమ్రోగెను.

★★★

# తొంబది యాఱవ సర్గము

## రావణుడు పౌరషోక్తులు పలుకుట:

ఈ విధముగా ఇంటింటను వినిపించుచున్న మిక్కిలి ఆర్తితో గూడిన రోదన ధ్వనులు ఘోరములై రావణుని చెవుల బడగా భారముగా ఊర్పులను విడుచుచు ఆలోచించినవాడై విజృంభించి మహాక్రోధముతో కన్నులను ద్రిప్పుచు భూతజాలములకు భయము గలిగించు ముఖము గలవాడై ప్రళయకాలాగ్నివలె రాక్షసులను గూడ తేరిచూడరానివాడై కటకటమని పండ్లుకొరుకుచు,పుటపుటమని రక్తము వచ్చునట్లు పెదవిని కొరుకుచు,మటమటలాడుచు భయముచే అస్ఫుటములైన మాటలతో తనవద్దనున్న రాక్షససేనతో ఇట్లనెను. మా యాజ్ఞగా గొప్ప సైన్యముతో మహాపార్శ్వుడును, విరూపాక్షుడును, మహోదరుడును వేగముగా యుద్ధమునకు వెళ్లుటకై పయనము కండు అని చెప్పుడు అనగా వారు అట్లే తమరాజు చెప్పిన విధముగా చేసి సైన్యాధిపతులు సమస్తమైన సైన్యమునంతయు సిద్ధముచేసి భయముచే రావణుని యొద్దకు వచ్చి చేతులు జోడించి రాజుయొక్క జయమును గోరినవారై నిలిచియుండగా. ఆ విరూపాక్షుడు మొదలైన రాక్షస శ్రేష్ఠులను జూచి రావణుడిట్లనెను. ప్రళయకాల సూర్యుని కిరణముల వంటి బాణములచే రామలక్ష్మణులను ముందుగా నా బాహుబలముచేత సంహరించెదను. ఖరుడు, ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు మొదలైనవారి ఋణమును నేను తీర్చి వైచెదను. వరుసగా రామలక్ష్మణులను, వానర రాజులందఱను సంహరించి నాయొక్క గొప్ప బాణములనెడు మేఘసమూహములచే దుర్దినమును కలుగజేసి సముద్రము ఆకాశము పర్వత సమూహములచే దుర్దినములను తెలియరాకుండ నొనర్చెదను. కండలు కండలుగాను, తుండెములు తుండెములుగాను, తుంటలు తుంటలుగాను, దుమ్ముదుమ్ముగాను, తుండెలు తుండెలుగాను, తునుకలు తునుకలుగాను, ముక్కలు ముక్కలుగాను, వ్రక్కలు వ్రక్కలు గాను, బ్రద్దలు బ్రద్దలు గాను, పరియలు పరియలుగాను, వ్రయ్యలు వ్రయ్యలుగాను, ప్రప్పు ప్రప్పుగాను, తుండులు తుండులుగాను, ఖండములు ఖండములుగాను, తునియలు తునియలుగాను, బాడిసతో చెక్కినట్లు, అంపముచే కోసినట్లు, వండుటకు తరిగినట్లు, గనిపించు విధముగా వానర

సమూహములను నఱికెదను. వారి మీదికి ఉరికెదను. ఇప్పుడే వానరసేనలను ధనుస్సనెడు సముద్రము నుండి వెలువడు బాణములనెడు అలలచే గప్పివేసెదను. వారు తెప్పిరిల్ల లేక కుప్పలు కుప్పలుగా నేల గూలునట్లు చేసెదను. పుప్పొడి రంగు గలదియు పద్మముల వంటి ప్రకాశము గలదియు అయిన వానరయూథములనెడు సాటిలేని సరస్సులను ఏనుగువలె నా గొప్ప అస్త్రములచే కలచివేసెదను. బాణములు మొగములందు నాటగా ప్రతాపము నశించి నేలబడిన వానరుల తలలు తూడులతో నున్న పద్మములవలె యుద్ధభూమి యందు గనిపించును. ఒక్కొక్క బాణము చేతనే వందలకొలదిగా వానర శ్రేష్ఠులను చెక్కలు చెక్కలుగా నరికి నేలబడునట్లు చేసెదను. వారియుద్ధ పద్ధతిని అణచెదను. ఎవ్వరి భక్తులు, ఎవ్వరి పుత్రులు, ఎవ్వరి సోదరులు యుద్ధమున చచ్చిరో యిప్పుడే వారివారి దుఃఖము పోవునట్లు శత్రువులను యుద్ధమునందు జయించి వారివారి కన్నుల నీరు తుడిచెదను. ఆ కోతుల దండును భయంకరమైన బాహుదండములతో పట్టిన విండ్లనుండి విడువబడిన వాడియైన బాణముల వరుసలచే యుద్ధభూమి యందు చూచువారల గుండెలను బ్రద్దలగునట్లు త్రుంచివేసెదను. విరోధుల గర్వమునుడిపి వారి శరీరములందలి కండలను వాడి బాణములచే తెగగోసి అధికమైన నక్కలు గ్రద్దలు కడుపులనిండ తృప్తిగా తినునట్లు దండిగా ఇచ్చెదను.

## రావణుడు యుద్ధమునకు వెళ్లుట:

ఇప్పుడే రథమును సిద్ధము చేయుము. శ్రేష్ఠమైన విల్లును తెమ్ము మిగిలియున్న రాక్షసులందఱును నావెంట యుద్ధమునకు రావలయును అనగానే ఆ మాటలననుసరించి అప్పుడే మహాపార్శ్వుడు దళవాయులారా! మీరందఱును వేగముగా యుద్ధమునకు బయలుదేరుడు అని చెప్పగనే వారలు ఆలస్యము చేయకుండ ఇంటింటికి వెళ్లి పిలువగా ఒక్క నిమిషములోనే భయంకరాకారులైన రాక్షసులు ఆయుధసమూహములతోను, అడ్డకత్తులతోను, దుడ్డుకఱ్ఱలతోను, బడితెలతోను, పలకలతోను, చిన్నకత్తులతోను, గండ్రగొడ్డళ్లతోను, కత్తులతోను, చిన్న ఫిరంగులతోను, పెద్ద ఫిరంగులతోను ఇంకను అనేక విధములైన ఆయుధములతోను సిద్ధపడిరాగా భయంకరమై ప్రకాశమానమైన రథమునెక్కి బలము గాంభీర్యముల ప్రభావముచే నేల బీటలు వారుచుండగా రావణుడప్పుడు యుద్ధమునకై బయలుదేరెను. తమ రాజు ఆజ్ఞచే విరూపాక్షుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు అను గొప్ప బలవంతులగు సేనానులు తమ రథముల నెక్క ఆర్పులు

పెడబొబ్బలు హెచ్చుచుండగా భూమి బ్రద్దలగునట్లు పెద్ద ధ్వనులను నిండించుచు జయము కోరినవారై బయలుదేరగా పెద్ద విల్లును బట్టి శ్రేష్ఠమైన గుఱ్ఱములు గట్టబడి సూర్యునివలె వెలుగొందుచున్న రథమునధిరోహించి యముని వలె దశవదనుడు అతివేగముగా ద్వారము నుండి వెడలి కర్కశులైన రాక్షససేనతో రామలక్ష్మణులున్న ప్రదేశమునకు కదలిరాగా

## రావణున కపశకునములగుట:

సూర్యుడు కాంతిహీనుడయ్యెను. గొప్ప చీకటులు దిక్కులన్నిట నిండెను. భూమియెంతయో వణకెను. మాంసభుక్కలైన పక్షులు కూసెను. గొప్పశక్తి వృష్టి కురిసెను. నక్కల సమూహములు గుంపులు గట్టి అశుభరావములను చేసెను. ధ్వజములందు గ్రద్దలు వ్రాలెను. గుఱ్ఱములు కాళ్లు జారిపడెను. ఎడమభుజము ఎడమ కన్ను అదరెను. ముఖమునందు ప్రకాశము తగ్గెను. కంఠస్వరమున దీనత్వముతోచెను. పిడుగురాలెడి విధముగా ఉల్కరాలెను. ఈ ఇంద్రవిరోధికి యుద్ధమునందు కీడును దెలియజేయుచు చుట్టును నక్కలగుంపులు కాకులు కూసెను. ఘోరమైన ఉత్పాతము లీవిధముగా దారుణముగా కనిపించుచున్నను రావణుడు వానిని మనస్సున జేరనీయక కాలుని ప్రేరణచే మోహముతో వేగముగా వెళ్లెను. వారల రథఘోషములు, వారల అర్పులను విని తెగించి వానరసేనలు మిగులయుద్ధ కాంక్షగలవారై రాక్షసుల నెదిరింపగా వారికి వీరికి యుద్ధము విడువక భయంకరముగా సాగెను. వారందరి కన్న ఎక్కువగా దశముఖుడు వింటి నారి మ్రోయించుచు.

## రావణుడు వానరసేనను నురుమాడుట:

బంగారపుటలంకారములు గల బాణసమూహములు క్రమముగా ఔద్ధత్యముతో అధికముగా గురిపించగా శిరస్సులు పగిలినవారును, గుండెలు పగిలిపడినవారును, చెవులు తెగినవారును, చెంపలు చీలినవారును, ప్రక్కలు డొక్కలు పగిలినవారును, ముక్కులు తోకలు తెగినవారును, ఊపిరి సలుపక చచ్చువారును, కన్నులు పోయినవారును, కాళ్లు తెగినవారును, మెడలు నరుకబడినవారును, అయి వానరశ్రేష్ఠులు బాధనొందిరి. రావణుని రథమెక్కడికి పోయిన అక్కడంతయును సేన పాడుపడెను. కత్తులతో నరికిన విధముగానూ, బాడిసచే చెక్కినవిధముగాను, అంపముతో గోసిన

రీతిగాను, తోపుడు పట్టిన యట్లును, ఉలులతో మలిచిన విధముగాను, తరిమెనబెట్టిన చందముగాను, తురిమిన విధముగాను, గొఱవులతో గాల్చినరీతిగాను, దావాగ్ని చుట్టుముట్టి దాల్చినట్లును, విజృంభించి భయంకరమైన దీర్ఘభుజములతో తాండవింప జేయబడిన విల్లు గలిగిన రావణుడు వానరసేనలను సంహరించెను. ఎక్కడ చూచినను తానే కనిపించుచు ఎడము లేకుండగా విజృంభించి పిడుగులు గురిపించెను. ఏ ప్రక్కన చూచినను తానేయై కాంతులు జిమ్ము బాణసమూహముల చేత చించిచెండాడు చుండెను. ఏ వంక చూచిన తానేయై వంకలులేని బాణములతో కలత నొందించెను. ఏ మూల జూచిన తానేయై శత్రుసైన్యములు సమూలముగా పరుగులు పెట్టునట్లు చీకాకు పరచెను. మేటి విలుకాడగు దేవతా విరోధి సూటిగా వెళ్లును ప్రక్క ప్రక్కలకు పోవును. మూలమూలలందు వెదకి చంపును. గుండ్రగుండ్రముగా తిరుగుచు చిందరవందర చేయును.

★★★



# తొంబదియేడవ సర్గము

రాక్షసరాజు చేతుల నుండి వెలువడిన బాణసమూహము తాకగా వానరసైన్యము అగ్నిచే కాల్చబడిన మిడుతల గుంపు వలె రూపము మారినదయ్యెను. వాయువుచే ఎగురగొట్టబడిన మేఘముల విధముగా దావానలముచే కాల్చబడుచున్న అడవి యేనుగుల వలె రాక్షస రాజుచే విడువబడిన బాణములచేత బాధింపబడిన వానరశ్రేష్ఠులు అరపులచే దిక్కులు నిండుచుండగా ఆపద నొంది నలిగి దీనులై కాందిశీకులై యుద్ధమును విడిచి పోయినదే పోకగా పారిపోయిరి.

## సుగ్రీవుడు రాక్షసులను వధించుట:

వానరులు మూల కొక్కడుగ పారిపోగా రామచంద్రునిపైకి రథమును దోలమని రావణుడు తన సారథితో చెప్పుచుండగా అప్పుడు సూర్యపుత్రుడు దట్టమైన వానరసేన ఈ విధముగా చెల్లాచెదరై పోగా తనంతటి వాడైన వానరనాధుడగు సుషేణుని సైన్యరక్షణమునకు నిల్పి అతివేగముగా శూరులైన యూథపతులు తన ప్రక్కన రాగా చెట్లు కొండలు చేతులబట్టి రాక్షసుల పీచ మడంచుట మొదలుపెట్టి కొండలు వృక్షములు మహాతీవ్రముగా బోరున మేఘము అడవిలో పక్షులమీద శిలావర్షము గురిపించునట్లు కోపముతో గురిపించెను. ప్రళయకాలము నందు వీచెడు ఝంఝా మారుతము వలన పడిపోవు వృక్షసమూహములవలె ఆ వానరుల తాకిడికి తమ బలములు నశింపగా రాక్షససేనలు నేలపాలైరి. ఆ వానరరాజు విసరిన వివిధములైన రాళ్ల సమూహపు దెబ్బలకు తలలు పగులగా నరములు తెగిపోయి మొలలు విరిగి చేతులు కాళ్లు తెగిపోగా నెత్తురులు గ్రక్కుకొనుచు పడుచులేచుచు క్షీణించుచున్నదై రాక్షససైన్యములు మోడువారెను భయపడి పారిపోవుచుండెను.

## సుగ్రీవుడు విరూపాక్షుని వధించుట:

వానర రాజీ విధముగా రాక్షసులను శిక్షించి విజృంభింపగా విరూపాక్షుడు తన పేరు చెప్పుకొనుచు రథము నుండి దిగి ఏనుగు నెక్కి ప్రత్యక్షమైన ప్రళయకాలయముని విధముగా

వానరుల నెదుర్కొని రాక్షసులందఱును సంతోషమొందునట్లు సూర్యపుత్రునిపై బాణముల సమూహములను వేసెను. వానియొక్క బాణవర్షముచే వానరరాజు నొచ్చి రూపము దాల్చిన తీవ్రకోపము వలె చెట్టునొక దానిని త్రిప్పుచు కుప్పించి యెగిరి వాని యేనుగు ముఖము మీద తన్నగా గజరాజు ఆ దెబ్బచే కంపించి ఒక్క ధనువు ప్రమాణపు దూరము వెనుకకు తగ్గి పెద్దగా శబ్దము చేయుచు నేలగూలెను. రాక్షసుడును ఏనుగును విడిచి డాలును కత్తిని బట్టి ధీరశ్రేష్ఠుడైన వానరరాజు మీదికి వెళ్లగా అతడును గొప్పరాతితో గొట్టెను. ఆ రాతిని తప్పుకొని దాటి కత్తితో ఆ రాక్షసుడు సుగ్రీవుని చేతి కొలదిగా మోదగా అతడు బాధనొంది మూర్ఛపడి తెలివంది మిక్కిలి క్రోధమును పొందినవాడై ముష్టితో రాక్షసుని గుండెలు బ్రద్దలు గొట్టి చేతనున్న ఖడ్గము నెగురగొట్టి లేచి తలమీద దెబ్బ తగిలియును రాక్షసుడు సుగ్రీవుని రొమ్మున గొట్టెను. సూర్యపుత్రుడును అతడు గొట్టిన దెబ్బ తప్పిపోయిన సందు చూచుకొని ఆ విరోధి ముఖమధ్యమున మిక్కిలి బలమైన పిడికిలి పోటుచే గ్రుద్దగా నెత్తురు గ్రక్కుచు నెత్తురుచే శరీరము తడియగా వికృతమైన కన్నులు గలవాడై గొంతునుండి ఊపిరి రాక గొప్పవేదన పొంది దొర్లి నేలబడెను. భూమి మీద పడి ఇటు నటు దొర్లుచు విలవిల తన్నుకొనుచు వికృతధ్వనులు చేయుచు ఎగిరి పడుచున్న బలవంతుడైన విరూపాక్షుని వానరసైన్యములు చూచెను. ఈ విధముగా అతడు మృతి చెందుటను చూచి రాక్షసులు దుఃఖముచేతను, వానరులు సంతోషము చేతను పిచ్చియెత్తిన విధముగా అరచుచుండుట చూడనయ్యెను.

★★★



# తొంబది యెనిమిదవ సర్గము

## సుగ్రీవుడు మహోదరుని చంపుట:

క్రోధముతో రెండు సైన్యములును ఒకదానితో నొకటి తాకి గ్రీష్మఋతువు నందు సరస్సులవలె ఏపు తగ్గి నశించెను. తన సైన్యములు మిక్కిలి నశించుటను వాని దుస్థితిని, బలవంతుడగు విరూపాక్షుడు మరణించుటను జూచి రావణుని కోపము రెండింతలయ్యెను. చెట్లయందు దిరుగువానరులు విజృంభించుటయు, గుఱ్ఱములు రాక్షసులు నశించుటయు చూచి ఎంతో ఖేదమును పొంది అయ్యో! దైవ విపర్యాసము ఇట్లున్నది గదా! అని దగ్గరనున్న వానరబృందమును ద్రుంచుచున్న బలవంతుడగు మహోదరుని జూచి యిట్లనెను. ఓ గొప్ప పరాక్రమము గలవాడా! మహోదరుడా! వినుము. నాకు జయము గలుగునను ఆశ నీచేతియందున్నది. నీయొక్క బలపరాక్రమములనంతను చూపి ఈ విరోధులను జంపి స్వామి ఋణమును దీర్చువేళ యిదియేసుమా. అని చెప్పగా అట్లేయని అతడు అగ్నియందు ప్రవేశించు శీలభము వలె శత్రుసైన్యములో చొరబడెను. రాజు మాటలు అతనిని తొందరపెట్టి వధించుచుండగా వానరులును గొప్పకాండలతోడును, చెట్లతోడును, గట్టిగా అతనిని గొట్టిరి. ఆ మహోదరుడు రోషావేశముచే తీవ్రమైన బాణముల వరుసలతో వానరుల నెల్లను పాదములు లేనివారిగాను చేతులు తెగినవారిగాను తొడలు పోయినవారిగాను చేయగా భయపడి కోతులు పారిపోవుచుండగా సుగ్రీవుడు భయపడకుడని వారితో చెప్పుచు మహోదరుని మీదికి ఒక పెద్దరాతిని విసరివేయగా రాక్షసుడు వేగముగా దానిని పిండిపిండి చేసి నేలబడవేయగా సూర్యపుత్రుడు చెట్టునొకదానిని గూడ త్రుంచివేసను. వానరరాజు అచ్చట నేలబడియున్న పరిఘాయుధమును తీసికొని త్రిప్పి ఆ మహోదరుని రథమునకు గట్టిన గుఱ్ఱములను గొట్టగా అవి నేలగూలెను. వాడు వేగముగా నేలపైకి దూకి ఒక ఉక్కు గదను బట్టుకొనియును, సుగ్రీవుడు పరిఘాయుధముతోడను కలబడి కోడెదూడల వలె రొప్పుచు పోరుచుండగా ఆ మహోదరుడు భీమగతిని గద త్రిప్పివేయగా సుగ్రీవుడు తీవ్రముగా పరిఘాయుధమును విసరెను. ఇరువురి ఆయుధములును ఒకదానికొకటి తగిలి ముక్కలై నేలబడగా వేగముగా వానరరాజు బంగారముతో చేయబడిన ముసలమును తీసికొని

విసరివేయగా ఆ రాక్షసుడు గదను విసరగా ఆరెండును నేలబడెను. అట్లాయుధములు వ్యర్థమగుటను చూచి ఆ యిరువురును మండుచున్న అగ్నులవలె ముష్టియుద్ధమునకు సిద్ధపడి గర్జించుచు ముష్టీ ముష్టి యుద్ధము చేయుచుండగా అతిలాఘవము గల ఆ రాక్షసుడు కొంచెము దూరమున నున్న ఖడ్గమును డాలును తీసికొనెను. అట్లే వానరరాజు కూడా ఇంకొక కత్తిని డాలును వేగముగా తీసికొనెను. కడు విక్రమము గల ఆ వానరరాక్షసులు ఖడ్గములతో కొట్టుకొనుచు గుండ్రముగాను నలుమూలలకును సంకోచమింతయైన లేకుండ వేగముగా దిరుగుచు తాకుచు మరలుచు శౌర్యముతో పోరుచుండిరి. దుష్టుడైన ఆ రాక్షసుడు ఖడ్గముతో చర్మనిర్మితమైన డాలుపై గొట్టగా అది అందు నాటుకొనెను. ఆ నాటిన కత్తిని లాగుటకు అతడు యత్నించుచుండగా సుగ్రీవుడు రత్నములు పొదిగిన బంగారు కిరీటము గలిగిన అతని శిరస్సును మిక్కిలి వాడియైన ఖడ్గముతో గొట్టెను. అప్పుడు రాక్షసుని పాటు చూచి తక్కిన రాక్షసులు పారిపోయిరి. సూర్యపుత్రుడు విరోధిని సంహరించి సూర్యతేజముతో ప్రకాశించుచుండ దేవతలు, సిద్ధులు, సాధ్యులు, భూమి యందలి భూతజాలములన్నియు ఆనందముతో అతనిని పొగడిరి.

★★★



# తొంబది తొమ్మిదవ సర్గము

## మహాపార్శ్వుడు అంగదునిచే హతుడగుట:

యుద్ధమునందు మహోదరుడిట్లు సుగ్రీవునిచే చచ్చుట చూచి గొప్ప ప్రతాపము గల మహాపార్శ్వుడు భయంకరమైన ఆయుధములతో వాలిపుత్రుడైన అంగదుని సైన్యమును అడ్డకొట్టెను. పెనుగాలిచే తొడిమలూడి రాలిన ఫలముల వలె తలలు నేలపై దొరలెను. కొందరి చేతులు, కొందరి కాళ్లు, కొందరిప్రక్కలు తెగిపడినవి. వాని తీవ్రబాణవర్షవేగమును భరింపలేక వెనుదిరుగుచు శిరస్సులు వ్రేలాడ వైచి వానరసైన్యములన్నియు చెల్లాచెదురయ్యెను. దానిని వీరుడైన తారాపుత్రుడు చూచి యుద్ధోత్సాహమున పున్నమనాటి సముద్రము వలె శరీరము పొంగగా పట్టిసమును బట్టి సూర్యతేజస్సుతో నున్న దానిని త్రిప్పి దేవతావిరోధిని గొట్టగా వాడు సారథితో గూడ తెలివిదప్పినవాడై నేలపై దొర్లగా జాంబవంతుడు భయంకరమైన ఖడ్గముచే వాని రథమును పిండిచేసి గుఱ్ఱములను సంహరింపగా మహాపార్శ్వుడంతలో తెప్పరిల్లి వాలిపుత్రుని శరీరమును బాణములచే ముంచి బ్రహ్మపుత్రుని శరీరమును మూడు బాణములచే నొప్పించి మఱియు వానరయూధ నాయకుడైన గవాక్షుని అనేక బాణములచే వ్యథపెట్టగా అంగదుడు క్రోధముచే ఎఱ్ఱనైన కన్నులుగలవాడై పరిఘాయుధమును బట్టి రాక్షసుని ప్రతాపముననణచుటకై రెండు చేతులతో త్రిప్పి త్రిప్పి వేయగా ఆ దెబ్బతో విల్లు బాణములు నేలబడెను. వెంటనే అంగదుడు రాక్షసుని చెవి గూబలు అదరునట్లు ఉక్కిరి బిక్కియగునట్లు తలదిమ్మెక్కునట్లు గ్రుద్దెను. దానిచే రాక్షసుడు రోషము నంది భయంకరమైనదియు నూనె మెరుగులు గనిపించుచున్ననదియు, పర్వతమువంటి బలము గలదియు అగుపెద్ద గండ్ర గొడ్డలిని చేతబట్టి వానరుని ఎడమభుజముపై వేగము వేయగా అంగదుడు దానిని నేర్పుగా తప్పించుకొని దాటుచు తండ్రితో సమానమైన బలముగల అతడు వజ్రసదృశమైన పిడికిలితో రాక్షసుని హృదయమునందు గొట్టెను. ఆ పోటుతో మహాపార్శ్వుడు గుండెలు బ్రద్దలు కాగా ప్రాణములు దొరగి నేలగూలెను. రాక్షససేనలు కళవళపాటుతో సంక్షోభమును పొంది పారిపోదొడగెను. వానరుల గర్జనలచే లంకానగరము సౌధములతో

గూడ వణకి బీటలు వారునట్లు కనిపించెను. రాక్షసులు భయముతో చేయు ఆర్తనాదములు వానరుల గర్జనలు మిక్కిల వ్యాకులము రోషము కలతపెట్టగా ఇరువది భుజములు గల రావణుడు ఒక్కడే ఉద్యమించినవాడై వానరులపైకి వెళ్లెను.

★★★



# నూఱవ సర్గము

## రావణుడు కపులను పొలియించుట:

ప్రఖ్యాతి గలిగిన శౌర్యవంతులైన మహాపార్శ్వ మహోదరులును గొప్ప ధీరుడైన విరూపాక్షుడును అట్లు సంహరింపబడుటచే భరింపరాని ఆగ్రహముతో రావణుడు తన సారథితో నిట్లనెను. శూరులైన మంత్రులు చచ్చిన దుఃఖమును, సైన్యముల యొక్క ఆర్తిని యుద్ధభూమియందు రామలక్ష్మణులను చంపి పోగొట్టెదను. రథము నతివేగముగా తోలుము. సూర్యపుత్రుడు, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుడు, కుముదుడు, హనుమంతుడు, అంగద, ద్వివిద, మైందులు మొదలైన మఖ్యులైన వనసంచారులనెడు కొమ్మలు గలదియు అవనిజయుడు పుష్పములు ఫలములు గలదియు అయిన రాముడను వృక్షమును పడగొట్టెదను. అనగా ఆ సారథి రథము నతివేగముగా తోలెను. ఆ రథము యొక్క ధ్వనులు దిక్కులనుండి ప్రతిధ్వనులు పల్కుచుండగా అడవులు పర్వతములు నదులతో నున్న భూమియంతయు వణకెను. సముద్రము గట్లను దాటుచుండె నాయనునట్లు క్రోధముతో నున్న రావణుడు తామసమను అస్త్రశ్రేష్ఠమును వానరసైన్యమును మసిచేయదలచి వేసెను. బ్రహ్మచే నిర్మింపబడిన దారుణమైన ఆ యస్త్రము ఆగకుండ గొప్పభయంకరమైన మంటలతో వానరవీరసంఘములను దహించుచుండ నేలబడి, సముద్రమున బడి ఆ వానరులు యుద్ధభూమి నుండి గుంపులుగా పరుగెత్తగా వారు పరువెత్తుచున్న వేగముచే రేగిన దుమ్ముచే చీకటులు గ్రమ్మెను. రాక్షసుడాయస్త్రముచే అనేక యుద్ధములను దహించి నేలగూల్పగా కానిమ్మని జానకీ భర్తయుద్ధకాంక్షచే విల్లును బాణములను చేబూనెను.

## శ్రీరామ రావణుల యుద్ధము:

ఆకాశమును రాయుచున్న దోయనునట్లున్న పెద్ద విల్లును చేత బూని నిలిచియున్న వాడును, తామరలవంటి విశాల నేత్రములు గలవాడును పొడవైన చేతులతో లయకాలుని వలె నున్నవాడును అగురాముని లక్ష్మణునితో గూడియున్న వానిని విష్ణువుతో గూడిన యింద్రుని వలె రావణుడు చూచెను. తనను రావణుడు గదియవచ్చుచున్న విధమును,

వానరసంఘముల పాటును జూచి విచారించి సంతోషించి క్రోధముచే ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడై విల్లునెత్తి భూమి బ్రద్దలగునట్లుగా నారి మ్రోగించగా ఆ ధ్వనిచే రాక్షసులు వానరులు గుంపులు గుంపులుగా నేలబడిరి. ఆ రాజశ్రేష్ఠుని సమీపించిన రావణుడు ఆకాశములో చంద్రుని చేరెడు రాహువువలె నుండెను. ముందుగా యుద్ధము చేయవలెనన్న కోరికతో వేగముగా లక్ష్మణుడు ఆ రాక్షసునిపై మండుచున్న అగ్నితో సమానమైన వాడి బాణములను వేయగా వాని నన్నింటిని బలవంతుడైన రావణుడు తనచేతి నేర్పు కనబడునట్లు ఒకటి, రెండు, మూడు, పది బాణములచేత త్రుంచెను. అతనిని దాటి కొండవలె నిశ్చలముగా నున్న రామునిమీద వాడియైన గొప్పబాణములను వేగవేగముగా వేయగా ఛల్లములను గురిసి రాజపుత్రుడాబాణముల వరుసలను త్రుంచి రాక్షసరాజుపై వందలు వందలుగా బాణములను నేర్పుతో ప్రశస్తమైన విధముగా వేసెను. వారిద్దఱును అత్యద్భుతముగా బాణములు విడుచుచుండుటచే కోదండముల నుండి వెలువడు ధ్వనులు భయంకరముగా దిక్కులందు వ్యాపింపగా బ్రహ్మాండమునందలి భూతజాలములన్నియు హా హా కారము లొనరించెను. ఒక్క తృటిలోనే గుండెలదర జేయు భయమును పొందెను. అంత ఒకరిపై నొకరు వేసికొను బాణపరంపరలు అడ్డులేకుండగా ఆకాశమునందు బంతులు గట్టి ప్రవహించగా వర్షాకాలమేఘములు మెరుపులతో ప్రకాశించు విధముగా నుండెను. మిక్కిలి వేగవంతములును వాడి గలవియును గ్రద్ద ఈకలరెక్కలు గలవియు అగు ఆ యోధుల బాణములు దొంతరలుగా వ్యాపించి ఆకాశమును ద్వారములు గలదానినిగా నొనర్చెను. ఆకాశమున వ్యాపించిన పెనుమేఘలవలె సూర్యుని గప్పి వారి బాణజాలము ఆకాశమున చిమ్మచీకటులను వ్యాపింపజేసెను. వీరులలో శ్రేష్ఠులయిన వారిరువురును అప్పుడు ఉగ్రులై తలపడి ఒకరినొకరు సంహరింపకాంక్షగలవారై హస్తకౌశలము కనిపించు విధముగా ఎప్పుడును చేయని చుట్లు చూడని విధముగా అస్త్రములయందు శస్త్రముల యందు మిక్కిలి నేర్పుగలవారై యుద్ధము చేసిరి. వారు వెళ్లెడు మార్గములందు బాణపరంపరలు గాలిచే ప్రేరేపింపబడిన సముద్రముల తరంగములవలె కనిపించెను. రాక్షసరాజు వింటి నుండి వెడలిన బాణములు చక్కగా రాజపుత్రుని ముఖమున మధ్యభాగమున నాటగా రాముడించుకంతయయినను లెక్కచేయడు. నల్ల కలువల వంటి ఆ బాణమాలికచే నొవ్వక తమ్ముడైన రావణుని గొట్టగా ఆ బాణములు విరోధి కవచమును దాకి వ్యర్థములై నేలబడగా అతివేగముగల ఆ యఖిలాస్త్రవేది ఆ రాక్షసుని ముఖమధ్యమున ఒక యస్త్రమును వేసెను.

అది అతని లలాటమును ఛేదించి అయిదు పడగల సర్పము వలె శబ్దించుచు భూమి యందు ప్రవేశించెను. తిరిగి రాక్షసుడు మహాఘోరమయిన ఆ సురాస్త్రమును వేయగా అది సింహశార్దూలవాయస, దక్ష, ఫిర, గృధ్ర, క్రోతి, సృగాలాది జంతువుల ముఖములు గల బాణములను, కోళ్లు, పక్షులు, తేళ్లు, నక్కలు, తోడేళ్లు, మొదలగు ముఖములు గల అనేక బాణములను సృష్టించగా అవి వచ్చుచుండుటను జూచి రాముడు ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపగా అందుండి అగ్నివలె ప్రజ్వలించు ముఖములు గలవియు, సూర్యునివంటి కిరణములు గలవియు, అర్థచంద్ర పూర్ణచంద్ర ముఖములు గలవియు, పక్షిముఖములు గలవియు, తోకచుక్కల వంటి ముఖములు గలవియు, కేతువు వంటి నోళ్లు గలవియు అగు బాణములప్పటి కప్పుడే పుట్టి ఆకాశమునందే రావణుని బాణముల నన్నింటినీ హరించి వానినదృశ్యము చేసెను. వానరులానందముతో అరవగా, వానరరాజు మొదలైనవారు రాముని చుట్టి పొగడగా రావణునిచే విడువబడిన బాణములను త్రుంచి రాజచంద్రుడు సంతోషముతో నుండెన. రావణుడును తన అస్త్ర మీ విధముగా నశింపగా రెండింతలుగా కోపము పెరుగగా.

★★★



# నూట ఒకటవ సర్గము

## రామరావణులు దివ్యాస్త్రములతో పోరుట:

తనకు యమునిచే ఈయబడిన రౌద్రమును అస్త్రమును సంధించి జయింపరాని వాడైన రామునిపై వేయగా ఆ యస్త్రము నుండి వేగముగా శూలములు, గదలు, ముసలములు, లయకాలమున వీచు గాలుల వేగముతో ముద్గరములు, పాశములు, కూటములు మొదలగునవి వెల్వడుచుండగా సర్వాస్త్రములను తెలిసిన నేర్పరియగు రాముడు గొప్పబలము వేగము గలవాడై గాంధర్వాస్త్రమును తన వింటి యందు సంధించి వేసెను. అది దేవతలు ఆశ్చర్యపడు విధముగా రౌద్రాస్త్రము నాక్షణమునందే త్రుంచెను. ఆ యస్త్రము నేల గరచుచు ఎదురు తిరుగుటచే రావణుడు సౌరాస్త్రమను నస్త్రమును రాముని మీద వేసెను. చక్రముల వరుసలవలె వచ్చుచున్నదానిని, ఆకాశమంతయు వెలిగించుచున్నదానిని, చంద్ర సూర్యగ్రహములతో సమానమైన దానిని రాముడు బాణములచే రూపులేకుండ చేసెను. అది కూడా హతమగుటచే రావణుడు పది బాణములచే రాముని మర్మస్థానములను నొప్పింపగా ధర్మశీలుడైన రాముడు ఇంచుకంతయును నొవ్వక సూదులవంటి బాణములతో రావణుని నొప్పించెను. శౌర్యమును ప్రకటించుచు తన అన్నతో సమానముగా పోరుచున్న రావణుని విధమును జూచి లక్ష్మణుడు.

## రావణ లక్ష్మణుల యుద్ధము:

కోపగించి ఈ రావణుడు రథము మీద నుండియు, అన్న నేల మీదనిలిచియు ఇంతదాక పోరుచుండిరే అని చింతించి ఆ వీరుడు ఏడు బాణములను తీసికొని మనుష్యుని శిరస్సు గుర్తుగా గల అతని కేతనమును ముక్కలుచేసి నేలబడజేసెను. వెంటనే వేగముగా మణికుండలములతో ప్రకాశించుచున్న సారథి శిరస్సును ఒక బాణముతో త్రుంచుచు తక్కిన ఐదు బాణములచే పర్వత సమానమై దృఢమైన అతని వింటిని ముక్కలు ముక్కలుగా త్రుంచెను. నల్లని మేఘములవలెను కొండలవలెను రథమున బూన్చిన గుఱ్ఱములను బలవంతుడైన విభీషణుడు భయంకరమైన గదతో మోది వధించెను. మెదలక గుఱ్ఱములు

కూలగానే రావణుడు రథమునుండి నేలకురికి మిక్కిలి శక్తితో భయంకరమైన రూపమును దాల్చి చూపులందు నిప్పులు గ్రక్కుచు తన తమ్ముడైన విభీషణుని జంపుటకు హమ్మని శక్తిని వేయగా అది పిడుగువలె వచ్చునంతలో లక్ష్మణుడు మూడు బాణములతో దానిని నాశనము చేసెను. ఉగ్రమగు ఆ శక్తి బంగారు మాలికలతో తోకచుక్కవలె నేలరాలెను. వానరులు పొంగి కేకలు వేయగా ఆ అసమానమైన శక్తి ఇట్లు నేలబడుటచే క్రోధముతో కన్నులు మండుచుండగా రావణుడు యమదండము వంటి శక్తిగలదియు, కాంతులతో ప్రకాశించుచున్నదియు, దివ్యమైన పిడుగుతో సమానమైనదియు వాయువువంటి వేగముగలదియు అయిన మఱియొక శక్తిని చేతబట్టుచున్నంతలో రఘురాముని తమ్ముడు ఇంతయైన ఆలస్యముచేయక శరణుపొంది దీనస్థితిలోనున్న ఆ విభీషణుని వెనుకవేసికొని (శరణాగత రక్షణము తన ప్రాణమిచ్చియైనను చేయవలయును గనుక) బాణవర్షమును విరోధి మీద ముమ్మరముగా దిక్కులు పిక్కటిల్లునట్లు దెఱపింతయైన లేకుండ అతి సాహసముతో వేసెను. ఈ విధముగా అడ్డము దూకి రాజపుత్రుడు తన సోదరుని చావును తప్పించి వాడి బాణములతో తన శౌర్యమును తొలగిపోవునట్లు చేసిన లక్ష్మణునితో దుశ్చరిత్రుడగు రావణుడిట్లనెను. మృత్యువుకు సిద్ధపడి వెళ్లుచున్న విభీషణుని తప్పించిన శౌర్యవంతుడా! నీ యెదురు లేని పరాక్రమము ఆశ్చర్యమును కలిగించినది. మెచ్చుచున్నాను – సుమా. రాజశ్రేష్ఠా! లక్ష్మణా! నా యెదుట నిలువుము. రాక్షసుడు చావక తప్పించుకొనెను గానీ నీ పొగరణగించెదను. నీ హృదయమును వేగముగా జీల్చి ప్రాణములను హరించెదను. రావణుడట్లు తాళుము తాళుము లక్ష్మణా: యనుచు

## లక్ష్మణుడు రావణుని శక్తిచే మూర్ఛపోవుట:

భయంకరమైన ధ్వనిచే భయదమైన పాదఘట్టనలచే తిరుగులేనిదియు, నాశనము చేయునదియు, మయదానవునిచే కల్పింపబడినదియు అయిన శక్తిని దుర్మార్గుడైన రావణుడు రాముని తమ్ముని మీద అతివేగముగా వేయగా ఆ వచ్చుచున్న శక్తిని చూచి రామచంద్రుడు "స్వస్తి స్వస్తి సుమిత్ర పట్టికి, ఓ శరరాజమా! వ్యర్థమై పొమ్ము పొమ్ము" అని ప్రశస్తమైన వాక్యమును పలుకగా నిర్భయుడయి యున్న లక్ష్మణుని వక్షమున నాటెను. ఆ శక్తి గాఢముగా తగులగా మిక్కిలి మూర్ఛమునిగి తెలివి తప్పినవాడై లక్ష్మణుడు నేలబడెను. రాముడు సోదరుని దుస్థితిని జూచి వేదన నిండిన మనస్సుగలవాడై ఇంచుక విచారించి నిశ్చేష్టుడై కన్నుల నీరు నించుచు ఇది విచారించుటకు సమయము కాదు. యుద్ధము

చేయవలసిన సమయమని తలచి విచారమును చాలించి క్రోధము నంది విల్లును చేతబట్టి రావణుని చంపదలచినవాడై.

## శ్రీరాముడు లక్ష్మణుని కపుల కప్పగించుట:

తిరిగి రాక్షసరాజు అదే పనిగా తనమీద బాణవర్షమును కురిపించగా దైన్యము చెందక వానర నాయకులెవ్వరును తీయజాలని శక్తిని లక్ష్మణుని యెద నుండి పెకలించి విరిచివైచెను. అదే సమయమని రాక్షసరాజు రాముని మర్మములను ఛేదించు శ్రేష్ఠమైన అస్త్రములను వేయగా దానిని లెక్కచేయక సోదరుని కౌగిట క్రుచ్చిపట్టి సుగ్రీవుని తోడను, వాయుపుత్రుని తోడను ఓ వీరులారా! మీరప్రమత్తులై నా తమ్ముని చుట్టు నిలువుడు. ఎంతకాలముగనో ఎదురు చూచుచున్న సమయమాసన్నమయ్యెను. ఆశతో వేచియున్న చాతకమునకు వేసవి ముగిసిన తరువాత మేఘదర్శనము వలె యుగ్ధ క్రీడా ప్రయత్నుడైన రావణుని చూచుచున్నాను. నేను చాలా కాలము నుండి వేచియున్న ఈ గశాస్యుని చంపెదను. ఇది సత్యమని నమ్ముడు. నా మాటలను వినుడు. రావణుని ఈ క్షణమునందే యుద్ధమున సంహరించెదను. రావణుడో రాముడో కాని ఈ భూమియందు ఇద్దరుండుట ఇక అబద్ధము సుమండీ! రాజ్యమును పోగొట్టుకొనుట, అడవులందు సంచరించుట, రాక్షసుల మధ్య దండకాటవి నుండుట, మూర్ఖుడు జానకిని ముట్టి దొంగిలించుట, రాక్షసులతో విపరీతమైన యుద్ధము. ఘోరమైన దుఃఖము సంభవించుట ఇన్నిటినీ రావణుని యుద్ధభూమిలో ఒక తృటిలో చంపి విడుచువాడను. ఏ నిమిత్తముగా నేను వాలిని వధించితినో, సూర్యపుత్రుని వానరరాజును చేసితినో, వానరసేనలను సిద్ధపరుప జూచితినో ఎందులకు సముద్రమునకు వారధి గట్టి దాటితినో ఇంతకు మూలమైన ఈ రాక్షసుడు వానరనాధులారా! ఇదే కనబడుచుండెను. చూపులయందు విషమున్న సర్పము ఎదుటబడిన వాని విధముగా నేడీ పాపాత్ముడు నాయొక్క దృష్టిలో పడి బ్రతికి వెళ్లిపోజెల్లదు సుమా! వానరులారా! సమీపమున నున్న పర్వతశిఖరమున గూర్చుండి దుర్మార్గుడైన రావణునితో నాదు యుద్ధమును చూచుచుండుడు. మూడు లోకములును, ఎల్లదేవతలును, ఇంద్రుడును, ఋషులును, అందఱును రఘురాముని ప్రతాపము యొక్క రామణీయకమును నా వామత్వమును చూచెదరు గాక. (రామనామ సార్థక్యము – రామావతార ప్రయోజనము. జగదేకవీరత్వము, సత్యధర్మశౌచములచే మూడు లోకములను రమింపజేయుటయును). స్వర్గనివాసులును, ప్రాణులును, అప్రాణులును

లోకములన్నియును గుంపులు గట్టి పద్యరూపముగా నా కథ నెప్పుడును శాశ్వతముగా చెప్పికొను విధముగా చేసెదను.

## రావణుడు పరాజితుడై లంకకు పరుగెత్తుట:

అని చెప్పుచు బంగారు అలంకారములు గల వాడి బాణములను దశవక్త్రుని శరీరమున నాటవేయగా అతడును క్రూరముగా ప్రకాశమానములగు బాణములును, పెద్ద ముసలములను రాముని మీద వర్షము వలె కురిపించగా వానిని రాముడు వేగముగా ముక్కలు ముక్కలుగా చేసివేసెను. ప్రకట బలప్రతాపములు గల రాజశ్రేష్ఠుని చేతను, రాక్షసరాజు చేతను విడువబడిన బాణముల వరుసలు ఆకాశమునందే ఒకదానితో నొకటి తాకుచున్న చప్పుడులు దిక్కుల మార్గములందు సహింపరానివై వ్యాపించగా అవి ముక్కలు ముక్కలై భూమియందంతటను రాలిపడినవి. ఏమిరా వీడు ఇంత తెగించి పోరుచున్నాడే అని క్రోధముతో రాముడు నిప్పులు గ్రక్కుచున్న బాణములను కోట్లుగా చేతియందే పుట్టుచున్నవా యనునట్లు దొప్పలు దోరలుగా వేయగా సహింపలేక రావణుడు శౌర్యమును విడిచి దీనతతో పురములోనికి పారిపోయెను.

★★★



# నూట రెండవ సర్గము

## మూర్ఛిల్లిన లక్ష్మణుని జూచి రాముడు దుఃఖించుట:

అట్లు రావణునితో పోరుచునే రామవిభుడు ఒక కంటితో రక్తముచే తడిసిన అవయవములు గల తన సోదరుని ఆర్తిని చూచుచు సుషేణునితో నిట్లనెను. హా! గొప్ప విక్రమము గలవాడును, సుగుణ సముద్రుడును, నా ప్రాణములకంటే ఎక్కుడైనవాడును శౌర్యవంతుడును, అగు నా ఈ తమ్ముడు సర్పమువలె నేలమీద పొరలాడుచున్నాడు గదా. ఈతని అవస్థను చూచినచో నా మనస్సు ఆరాటము నందుచున్నది. ఇంక యుద్ధము చేయనాతరమా? శౌర్యశాలియైన నా సోదరుడు ప్రశస్తమైన లక్షణములు గలవాడు. సుమిత్ర పట్టి అయ్యో! చంపబడినచో నేను బ్రతికియుండుటేమిటికి? సౌఖ్యములవేటికి? చేతినుండి విల్లు బాణములు జారుచుండెను. మనస్సు తెలివి తప్పుచున్నది. బాణములు గురితప్పి ఎటో పోవుచున్నవి. కన్నులందు బాష్పములు నిండి దృష్టి కనిపించదయ్యెను. ఈ శరీరము భరింపరానిదయ్యెను. ఆశలన్నియు తీరిపోయినవి. దీనముగా తమ్మునిపాటు చూడగా విషాదము హెచ్చినది. స్వప్నమున ప్రయాణించు జనుల విధముగా నా అవయవములన్నియు సడలి పట్టుతప్పి నేలగ్రుంగబడుచున్నవి. శరీరమునందు పటుత్వము లేదయ్యెను. సంధులన్నియు విడిపోయినవి. దుష్టునిచేత తమ్ముడీ విధముగా నా కనులముందరే మృతిజెందియుండగా ఇస్సీ! నా శౌర్యమును తలంపగా సిగ్గు కలుగుచున్నది. ఇక నాకెక్కడి బలము? నాకీ ధనువు ఎందులకు అని వ్యసనముచే పీడింపబడినవాడును, బాణములు తగిలిన శరీరము గలిగినవాడును, తెలివితప్పినవాడును, తన బహిఃప్రాణమైన వాడును, సుందరుడును అగు తమ్ముని జూచి తాను కన్నుల నీరు గార్చుచు గొప్ప ఆర్తిని పొందినవాడై మనస్సు బాధనొందుచుండగా భూపుత్రి భర్తదీనుడై ఇక ఏలనాకీ యుద్ధము? ప్రాణములేల? ఇంక సీతయేల? మృదువైన గుణములు గలవాడగు లక్ష్మణుడీవిధముగా దుమ్ముగొట్టుకొని నేలబడియుండగా నా ముద్దు తమ్ముడు మృతుడు కాగా భోగములు రాజ్యములు ఇక నేటికి? బ్రతికి ఏమి ప్రయోజనము? యుద్ధములో గెలిచి యేమి ప్రయోజనము? (కం ఊరూరఁగళత్రంబులు,

నూరూరన్ బాంధవులును నొదవెదరకటా! ఆరయభ్రాత సహోదరుడారగ లభియించు దేశమవనింగలదే) (భ్రాత = తమ్ముడు సహోదరుడు = తనతో సమానుడు. శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్నులవి ప్రాకృత శరీరములు గావు. దివ్యామృతకారణమైన అప్రాకృత దివ్యమంగళ విగ్రహములు. ఒక పాత్రములోని పాయసము బాగములయినట్లే ఒక తేజస్సు నాలుగు రూపములను ధరించెను గాన సమానములు) ఊరూరను భార్యలు లభించెదరు. ఊరూరను బంధువులు లభింతురు. అక్కటా తలంచి చూడగా భ్రాత సహోదరుడు లభించు దేశము భూమియందు గలదా.

## సుషేణుడు శ్రీరాముని నూరార్చుట:

అని నిట్టూర్పులు నిగిడించుచు, నేలబడి పొరలుచు కన్నుల నీరు నించుచు శోకించుచు పరవరించుచు, విచారించుచున్న శ్రీరాముని జూచి సుషేణుడు దగ్గరకు వచ్చి ఓదార్చుచు ఇట్లనెను. రామచంద్రా! లక్ష్మీవర్ధనుడగు మన లక్ష్మణుడు మృతుడుగాడు సుమా. ప్రశంసింపబడు చరిత్ర గలవాడా! సూక్ష్మబుద్ధి గలవాడా! ఈ లక్షణములను జూడుము. నీవిట్లు విచారింపనేల? రాజా! ముఖము కాంతి తగ్గలేదు. నల్లబడలేదు. మారురూపము నొందలేదు. ప్రకాశము గలదు. ప్రసన్నమగుచున్నది. సొంపును గలదు. హస్తములు ఎఱ్ఱని పద్మముల కాంతితో నొప్పుచున్నవి. కన్నులందు తేజస్సు మారలేదు. రామచంద్రా! ప్రాణములు పోయినవారికి యిట్టి గొప్పకాంతి యుండునా? ఇతని ముఖమును చూచినచో దీర్ఘకాలము జీవించునని తెలియుచున్నది. కావున మృతికరమైన ఆకృతి గలవాడు ప్రాణముతో నున్నాడు. దుఃఖింపకుము. రాజశ్రేష్ఠా! అదిగో మాటిమాటికిని గుండె కొట్టుకొనుట కనిపించుచున్నది. ఉచ్ఛ్వాసములను చూడుము. విషాదమును మానుము అని చెప్పి హనుమంతుని జూచి ఈ విధముగా జెప్పెను.

## హనుమంతుడు సంజీవని పర్వతము దెచ్చుట:

హనుమంతా! ఓషధీ శైలమునకు పూర్వము బ్రహ్మపుత్రుడైన జాంబవంతుడు చెప్పిన మార్గమున వేగముగా వెళ్లుము. ఆ పర్వతము యొక్క కుడిశిఖరము నందు విశల్యకరణియైన సుఖకారియైన విశల్యకరణియను ఓషధి కలదుసుమా. అందు సవర్ణకరణి, సంజీవని, సంధాన కరణి యను ఓషధులు గలవు. ప్రశస్తమైన వేగము గలవాడా! లక్ష్మణుని బ్రతికించుటకు వానినతివేగముగా తీసికొని రమ్ము వీరుడా! వేగముగా పోయి రమ్ము

అని చెప్పగా హనుమంతుడు జివ్వున జని ఆ పర్వతమును చేరి ఆ మహౌషధులున్నచోటు వెదకి వెదకి తెలిసికొనలేక ఇట్లనుకొనెను. ఎందులకింతయాలస్యము. కొండను మొదలంట పెళ్లగించుకొని పోయెదను. మందులిందున్నవని సుషేణుడు చెప్పెను గదా. ఓషధులు తీసికొని వెళ్లక ఆలస్యము చేసిన ఎంతో కీడు గలుగును గదా. మఱియు నాకు పౌరుష హానియు గలుగును అని యా వీరుడు చింతించి ఆ కొండను బట్టి ముమ్మారు ఊపెను. సుందరమైన పుష్పములు గల చెట్లతో నున్న ఆ కొండను పెళ్లగించి చేతితో పైకెత్తి ఆకాశమున కెగిరి బంతిని వలె ఆ పర్వతమును ఎగురవేసి పట్టుకొని నీటితో నిండియున్న నల్లని మేఘమువలె నున్నదానిని వేగముగా దెచ్చి హనుమంతుడు వానరుల మధ్య దించి కొంచెము శ్రమ తీరిన పిదప సుషేణుని జూచి ఇట్లు చెప్పెను. ఓ వీరశ్రేష్ఠా! ఈ కొండయందున్న మందులను తెలిసికొనలేక కొండనే పెకలించి తెచ్చితిని అనగా అతనిని మెచ్చుకొనుచు సుషేణుడు తొందరగా ఆ ఔషధములను తీసెను. అట్లు ఓషధీపర్వతమునే హనుమంతుడు తెచ్చుటను జూచి ఇది అసాధ్యమైన పనియని వానరులు రాక్షసులు ఆశ్చర్యపడిరి.

## లక్ష్మణుడు మూర్ఛదేరుట:

అంతట సుషేణుడు మహౌషధిని లక్ష్మణునకు వాసన చూపించగానే ఎంతయో కాంతిని బొంది బాధయేమియు లేక శరీరమునుండి బాణపు ములుకులు తొలగినవాడై వెంటనే సంతోషముతో లేచెను. వానరసంఘములా వానరశ్రేష్ఠుని శక్తి నెంతయో మెచ్చుకొని మేలుమేలనుచు అతనిని తగిన విధముగా గొనియాడిరి. అప్పుడు రాముడు గారాబముతో తమ్ముడా! రారమ్ము అని కన్నుల నీరు నిండగా ప్రేమచే కౌగిట గ్రుచ్చెను. అన్నా! లక్ష్మణా! ఎంతటి పుణ్యమో నిన్ను తిరిగి చూడగలిగితిని. ప్రియమైన తమ్ముడా! నీవు యముని బారిన బడి వెంటనే తిరిగి వచ్చితివి. నీవు మరణించినచో ఇక నాకు జీవితము వలన నేమి ఫలము? సీత యెందులకు? రావణుని చంపి నేను జయమును పొందుటయేల? నాయనా చెప్పవయ్యా! సౌమిత్రీ!

## లక్ష్మణుడు శ్రీరాముని రణమునకు ప్రోత్సాహపరచుట:

అని రాముడు చెప్పగనే లక్ష్మణుడు మాటలు తడబడగా మనస్సునందు బాధను పొంది యిట్లనెను. ఓ గొప్ప బలవంతుడా! నీవు రావణుని చంపుదువు. రాజ్యమును

విభీషణున కిచ్చెదను అని చెప్పలేదా? ఎప్పుడైనను మహాత్ములు పలికిన బాసలను తప్పిపోదురా? ఓ అతిబలవంతుడా! పలికిన ప్రతిజ్ఞను నిలబెట్టుకొనుటే హెచ్చుగుణములు గలవారి చిహ్నము గదా. నీవు బలవంతుడవై యుండియు బలహీనునివలె పేదమాటలు పలుకదగునా? నాకొఱకై కార్యమును నిలుపుట తగదు. ఈ రావణుని వధించి ప్రతిజ్ఞ నెరవేర్పుము. అన్నా! తీక్ష్ణమైన దంష్ట్రలు గలదియు, వాడియైన గోళ్లు గలదియునై గర్జించుచున్న సింహము కన్నులబడినచో ఏనుగు తప్పించుకొనలేని విధముగా నీయొక్క బాణమార్గమున బడిన రావణుడు బ్రతికి వెళ్లజాలడు గదా. ఈ సూర్యుడస్తమించకమున్నే పంక్తికంఠుని సంహరింపుము. (దీనివలన లక్ష్మణుని మూర్ఛపగటియందే కావున హనుమంతుడు కాలనేమిని జంపుట కల్పిత కథయని తెలియనగును. రావణుడు లంకకు బోయి రథియై తిరిగివచ్చులోపలనే లక్ష్మణుడు మూర్ఛదేరెను.) అతనిని వధించుట యందు నీకభిలాషకలదేని, నీమాట నిలబెట్టుకొనుట తగిన పనియైనచో, నామాట స్వీకరించుట నీకిష్టమైనచో ఓ రాజశ్రేష్ఠా! ఇప్పుడే శీఘ్రముగా ప్రీతితో నామాటను నెరవేర్పుము.

★★★



# నూట మూడవ సర్గము

## శ్రీరామ రావణుల కడపటి యుద్ధము ప్రారంభము:

అని లక్ష్మణుడు చెప్పిన మాటలను రామచంద్రుడు మనస్సునందుంచి వేగముగా విల్లును బట్టెను. అంతట రావణుడు తానొక రథము నెక్కి త్వరగలవాడై సూర్యుని మీదకు రాహువు తీవ్రతతో వచ్చు విధముగా వచ్చి ఆ రాజశ్రేష్ఠుని క్రూరత్వముతో వజ్రముతో చేసిన బాణములతో గొట్టెను. సీతానాధుడును పుటము పెట్టిన బంగారు ఆభరణములు గల అగ్ని సమానబాణముల వరుసలతో అతని శరీరమునంతను గాయములతో నిండునట్లు చేసెను. దేవతలు గంధర్వులు మొదలైన ఆకాశసంచారులు చూచి రామచంద్రుడు నేలపై నిలిచియు, రాక్షసరాజైన రావణుడు రథము మీద నుండియు యుద్ధము చేయుట ఇది సమయుద్ధము కాదు అని పలుకుచుండగా, ఇంద్రుడు బంగారు మయమై ప్రకాశించు నదియు, నూరుగంటలచే అలంకరింపబడినదియు, ఉదయ సూర్యునిబోలినదియు, వైడూర్యపు నొగలు గలదియు, బంగారు ఆభరణములు గలదియు, తెల్లని చామరములు గలదియు ఆకుల వంటి కాంతి గలిగి సూర్యసదృశములైన గుఱ్ఱములు గలదియునై బంగారు కఱ్ఱగల ధ్వజము మెరయగా నొప్పుచున్న తన రథమును రామచంద్రుని చెంతకు బంపెను.

## మాతలి శ్రీరాముకడకు ఇంద్రుపనుపున రథమును దెచ్చుట:

ప్రేమతో ఇంద్రుడు పంపగా మాతలి రథమును దీసికొని భూమి మీదికి దిగి శ్రీ సీతానాధునకు తన చేత కొరడా యుండగా రథము దిగకుండగానే నమస్కరించెను. దేవా! నీ విజయమును గోరి దేవేంద్రుడు ఈ రథమును పంపెను. ఉత్సాహముతో నీవు దీనినెక్కి ఈ ఇంద్రుని విల్లును అగ్ని సదృశమైన కవచమును సూర్య సమానములైన ఈ బాణసమూహములను మెరుపు వంటి కాంతి గల శక్తిని ఓ రఘుపతీ! ఈ విరోధిని సంహరించుటకై స్వీకరింపుము. నేను సారథినైయుండగా పూర్వము ఇంద్రుడు దానవసంఘములను సంహరించిన విధముగా నేను సారథినై యుండగా మహాత్మా! నీవీ రావణుని నిప్పుడు వధింపుము అని మాతలి చెప్పగనే రామచంద్రుడు రథమునకు ప్రదక్షిణము చేసి నమస్కరించి జగములన్నియు లక్ష్మిచే నిండియుండగా రథమునెక్క

యుద్ధము చేయగా రోమహర్షణముగా యుద్ధము జరిగెను. రామచంద్రుడు రథమునెక్కి ప్రకాశించుటను జూచి దశకంఠుడు ఆగ్రహముతో ఉగ్రుడై గాంధర్వశరమునేసెను. దానిని రాముడు గాంధర్వశరముతో గొట్టెను. అతడు దైవశరమునేయగా రాముడు దైవశరముతో అణచెను. అట్లు రాముడణచి వేయగా అతిక్రోధమునంది రావణుడు మిక్కిలి శక్తి గలిగిన రాక్షసాస్త్రమును వేయగా బంగారు భూషణములతో ప్రకాశించు సర్పములు రామచంద్రుని మీదకు వెళ్లెను. మంటలు గ్రక్కుచు మిక్కిలి మండుచున్న మొగములతో వాసుకితో పోలిక చెప్పదగినవై అన్ని దిక్కులను ఆక్రమించుచు కంటకములనెడు విషములు గలవి, ప్రకాశమనెడు పొడవైన భోగములు (సర్పదేహములను భోగములందురు) గలవి మంటలమారులునై మీదకు వచ్చుచున్న బాణములను జూచి నిర్వికారుడై రాముడు గరుడాస్త్రమును ప్రయోగింపగా బంగారు గరుత్మంతుని యాకారములతో బాణసమూహములు అతివేగముగా వెళ్లి తక్షణమే ఆ సర్పసమూహములను త్రుంచి వైచెను. తన అస్త్రములన్నియు నిట్లు వ్యర్థమగుటచే విజృంభించి పట్టుదలతో మిక్కిలి వారింపరాని బాణవర్షమును శ్రీరాముని పైనను సారథిపైనను శరీరములనాటునట్లు వేసెను. బాహుదర్పము ప్రకటమగునట్లుగా మఱియొక బాణముచే బంగరు కేతనమును పడగొట్టి ఎంతో వేగముగా అశ్వములను నొప్పించెను. వాడు చేసిన అసాధ్యకార్యమును, వాని విజృంభణమును రామచంద్రుని దీనత్వమును జూచి సిద్ధులు, మునులు, దేవతలు ఆకాశసంచారులైన చారణులు మొదలగువారు, వానరులు, విభీషణుడు మానవభోజియే గెలిచి ఈ జగమునంతను మాడ్చునేమోయని భావించుచు దుఃఖముచే తపించి అధికముగా కుందిరి. రాముడను పూర్ణచంద్రుడు రావణుడనెడు రాహువుచే ఆక్రమింపబడగా ఆ క్షణమునందే చంద్రునికి ప్రియమైనదియు, ప్రజాపతి దేవతాకమును అయిన రోహిణీ నక్షత్రమును బుధుడాక్రమించెను. ప్రజలకరిష్టకరముగా మండుచున్న సముద్రము పొగలతో నిండిన తరంగములతో సూర్యుని దాకునట్లెగసి పడెను. సూర్యుడు – నీలవర్ణుడును, కఠినుడును, కాంతివిహీనుడును, భయంకరమైన ధూమకేతువుతో గూడిన వాడును, కబంధ లక్షణములు గలవాడును అగుచు కనిపించెను. రావణుడాక్రమింపగా రామునకు బాణములు సంధించు శక్తియే సన్నగిల్లెను. కోసల వంశజుల కులదీపమును, ఇంద్రాగ్నులు అధిదేవతలుగా గలదియు అయిన విశాఖా నక్షత్రమును అంగారకుడాక్రమించెను. ఇరువది భుజములు గల దశకంఠుడు ధనుస్సును కరమున దాల్చినవాడై మైనాక పర్వతము వలె నిలిచెను.

★★★

# నూట నాలుగవ సర్గము

## శ్రీరాముడు విజృంభించి రావణుని శూలమును ముక్కలు చేయుట:

ఆ రావణుని గొప్ప పరాక్రమమును, తన వారలు తెలతెల్లబోవుటను గాంచి జానకీపతి మిక్కిలి యెఱ్ఱనైన నేత్రములు గలవాడై క్రోధము నిండిన మనస్సుతో కనుబొమలు ముడివడుచుండగా వానికి తన చూపుచేతనే భస్మము చేయు విధముగా చూడగా, క్రోధముతో నున్న ముఖము గల రాముని జూచి సమస్త భూతములును భయమునొందెను. భూమి వణికెను. మృగముల చేతను వృక్షముల చేతను నిండిన పర్వతములు గడగడలాడెను. సాగరుడు క్షోభించెను. పక్షిజాతు లాకాశమున పరుషముగా అరచినవి. మేఘములు కర్కశముగా గర్జించినవి. పిడుగులు రాలెను. రాముని భయంకరాకారమును జూచి రావణుడు భయము జెందెను. ప్రళయకాలమువలె భయంకరమైన యుద్ధమును చూచుటకై ఆకాశమున దేవతలు, దానవులు, దైత్యులు, సిద్ధులు, ఋషులు, విద్యాధరులు గూడియుండి దేవతలు ప్రేమతో రఘురాముడే గెలువవలెనని యరచుచుండిరి. ఈ లోపల రావణుడు కోపమనెడు అగ్నిచే మండుచు జానికీనాథుని సంహరించుటకై వజ్రమువలె కఠినమైనదియు, సర్వవిరోధులను నాశనము చేయునదియు, గొప్ప ధ్వనిగలదియు, పర్వతశిఖరముల వంటి కొమ్ములు గలదియు, క్రూరమైనదియు, చూచుటకు భయము కలిగించునదియు, చాలా పదునైన మొనగలదియు, అధిక రౌద్రమైనదియు, సమీపింపరానిదియు, కొండలను ఛేదించినదియు, అయిన ఒక శూలమును చేత ధరించి మండిపడుచు పైకెత్తి భూమి, ఆకాశము, దిక్కులు, విదిక్కులు గిరగిర తిరుగునట్లును, సముద్రము క్షోభించునట్లును, జగములు భయపడునట్లును తీవ్రమైన ధ్వనితో గర్జించెను. ఆ విధముగా శూలమును చేత ధరించి రాక్షసుల సమూహము సంతోషించగా రామచంద్రునితో కఠినమైన మాటలతో అతడిట్లనెను. రాజపుత్రా! వజ్రముతో సమానమైన సారము గలిగిన సాధనమిది తమ్మునితో గూడ నిన్ను సంహరించి యుద్ధమున చచ్చిన రాక్షస సంఘములను చూచుటకును వారికి తోడునీడగ నుండుటకును పంపగలదు. ఒక విషయము నిలుము నిలుము ఇంక నీవు చచ్చితివి అనుచు విసిరివేయగా అది యెనిమిది

గొప్ప గంటలు గలదై ఆకాశమున మెరుగులు జిమ్ముచు రాగా పద్మాక్షుడగు రాముడు దానిపై గొప్పశక్తి గలిగిన బాణములను ప్రళయాగ్నిపై నీరు చల్లినట్లు ప్రతాపముతో వేయగా వానినన్నింటినీ అగ్ని మిడుతలదండును తగులబెట్టు విధముగా కూల్చి తనపైకి రాగా రాజపుత్రుడు చూచి భరింపరానిదియు, ఇంద్రునిచే పంపబడినదియు అయిన శక్తిని తాకగా అది శక్తిని విసరెను. మాతలి తెచ్చిన ఆ ఇంద్రుని శక్తి గంటల శబ్దమునధికముగా వ్యాపింపజేయుచు వెళ్లి ఆ రాక్షసుని శక్తిని తాకగా అది శక్తి నశించినదై ముక్కలు ముక్కలై భూతములరచుచుచండగా, వానరులు బొబ్బలు పెట్టుచుండగా దేవతలు సంతోషముతో పొంగిపోవుచుండగా నేలబడెను. రాఘవుడంతటితో విడువక దుర్మార్గుడైన రావణుని రథమున గట్టిన గుఱ్ఱములను వాడి బాణముల సమూహములచే వేగము తగునట్లు వేగముగా నొనరించి సాటిలేని అమోఘములైన బాణసమూహముచే రాక్షసుని యెదను బగులగొట్టి లాఘవముతో మూడు బాణములచే అతని నుదురు బ్రద్దలగునట్లు చేసెను. గాయములైన శరీరము గలవాడును, రక్తముచే తడిసిన శరీరము గలవాడును అగుచు పూచిన అశోకవృక్షము వలె నుండి రావణుడు బాణవేదనను సంహింపశక్యము గాక యుద్ధము నందు దుఃఖముచే తపించినవాడయ్యెను.

★★★



# నూట ఐదవ సర్గము

## శ్రీరాముడు రావణుని నిందించుట:

అట్లు విచారమున మునిగి వెంటనే రోషము హెచ్చుగా దశవదనుడు అధికమైన వేగము గలవాడై అగ్నివంటి బాణములను రఘురామునిపై చురుకుచురుకున మేఘము కొలనుపై గురిసినట్లు కురిపించెను. అట్లు బాణములచే ముంచబడిన వాడయ్యు కంపము నొందక సూర్యకిరణ సమానములైన ఆ బాణములను ఆకాశమునందే త్రుంచి వేయుచు పోరుచుండెను. ఆ రాక్షసుడు వేయుచున్న వాడి బాణముల పరంపరల తాకిడిచే శరీరము ఎఱ్ఱవారగా వనమునందున్న పుష్పించిన మోదుగుచెట్టువలె నుండి రాఘవుడు ప్రళయకాల సూర్యునివలె క్రూరమైన బాణవర్షముచే రాక్షస రాజుయొక్క మనోధైర్యము నశించునట్లు భుజశౌర్యమును స్థైర్యమును మాన్పగా బలవంతుడైన ఆ దుష్టాత్ముడు వెనుదీయక బాణవర్షమును కురిపించెను. ఒకరి మీద నొకరు వైచుకొను బాణసంతతులచే జగమంతయు చీకటిమయమై కన్నులను గప్పుటచే అప్పుడు వారెవ్వరికి గనిపింపరైరి. ఆ సమయమున రాముడు చిరునవ్వుతో పరుషవాక్యములతో ఇట్లనెను. ఓ శుంఠా! నీవు మునుపు నేను లేని సమయమున బాలికయైన నా భార్యను తెలివితప్పిన దానిని మూఢాత్ముడా! దొంగతనముగా తెచ్చి మనస్సు నందు గర్వించిపొంగుచున్నావు. ఇస్సీ! మూర్ఖుడా! నీవు వీరుడవా? క్రూరాత్మా! అడవియందు నాకై విలపించుచు వెతనందియున్న సీతాసాధ్విని బలాత్కారముగా హరించి నీవు వీరుడననుకొనుచున్నావా? వివేకహీనుడా! శూరడవై యుండియు, అనాథ స్త్రీలను ధైర్యముతో దొంగిలించుటకు పరస్త్రీ కాముకుడా! దొంగవలె ప్రవర్తించియు వీరుడననుకొనుచున్నావా? వివేక విహీనా! మర్యాదరహితుడా! సిగ్గులేనివాడా! సజ్జనుల మార్గమును వదలినవాడా! బలాత్కారముగా మృత్యుదేవతను నీ దగ్గర జేర్చుకొని వీరుడవనుకొనుచున్నావా? వివేకవిహీనా! కుబేరునకు సోదరుడవై పుట్టి బలవంతుడవై, శౌర్యవంతుడవై ఓ ధీరుడా! నీవు జగములు మెచ్చెదు ఎట్టి గొప్ప కృత్యమును చేసితివి? దురాత్మా! దుష్టుడవై లోకము చెడదిట్టునట్టి నీచకృత్యమును జేసితివి. ఇస్సీ ఆ ఫలము నిప్పుడే యనుభవింపుము. ఓ అవివేకీ! పాపము చేసిన వృధాగా పోవునా?

నీకు సిగ్గులేదటరా? దుర్మార్గుడా! సీతను చోరుని వలె ఆ అడవి యందు బలవంతముగా దొంగిలించియు నీవే శూరుడవని ఏ విధముగా తలంచుచున్నావో! నేనచ్చట నుండగా సీతను ముట్టియున్నచో కాంతులీనుచున్న బాణములచే నిన్ను నీ సోదరుడైన ఖరునితో గూర్చకుందునా? ఓ చెనటీ! ఇన్ని దినములకు నిన్ను చూచితిని. ఎంతటి భాగ్యమో కదా. ఇప్పుడే నిన్ను యముని చేరబంపుదును. నిలువుము. ఇప్పుడే మణికుండలముల కాంతులతో గూడిన నీ తలను మాంసమును పక్షులు లాగి లాగి ఇంతింత ముక్కలు చేసి తనివి తీరునట్లు సంతోషముతో భక్షించును. నేలమీద నూరువిధములుగా తెగిపడిన నీ రొమ్మును గ్రద్దలు ముక్కులతో చీల్చుచు సంతోషముతో నీ రక్తమును తృప్తిదీర పానము చేయును. నా వాడియైన బాణములు త్రెంచిన నీ ప్రేవులను పక్షి సంఘములు సర్పములను గరుత్మంతుడు పడవేసినట్లు పడవైచును. నీకింక బ్రతుకుట చెల్లదు సుమా.

## రావణుని రథమును సారథి మరలించుట:

అని విరోధిని మాటలచే నొప్పించి రెండింతలయిన వీర్యము సంతోషము గలవాడును, శ్రేష్ఠమైన అస్త్రశక్తులు గలవాడును, నూతనోత్సాహము గలవాడును అయి రాముడు తన సమస్తములైన అస్త్రములను మనస్సునందు తలంపగనే తక్షణమే ఆ యస్త్రములన్నియు ముందు నిలువగా చూచి మిక్కిలి తొందరగలవాడై తన మనస్సు నందు శుభచిహ్నములన్నియు తోచి గెలుపును తెలియజేయుచుండగా ఆనందముతో పొంగుచు శ్రేష్ఠమైన బాణములచే నొప్పింపగా రావణుడు వానరులు వేయుచున్న కొండల శిలలచేతను శూరుడగు రాముని బాణములచేతను గుండెలు గులగులకాగా నోరెండి గ్రుక్కలు మ్రింగెను. బాధనొందెను. తేజము తగ్గెను. కళవళ పాటు చెందెను. మనస్సున భీతిని బొందెను. నీరసపడెను. వింటిని పట్టలేదు, బాణములను సంధింపలేదు. నారిని బిగించలేదు. విరోధి వేయు బాణములను త్రుంచలేదు. తనపై వచ్చి పడుచున్న బాణములపై తానువేయు బాణసమూహములు ఏదో ఇతర మార్గమును బట్టి పోవుచున్నవి. శరీరము తెలివితప్పుటచే అతని కేమియు తోచుటలేదు. యముని దృష్టియందు పడిన విధముగా నున్న రథికుని స్థితిని జూచి సారథి యుద్ధభూమియందు రాక్షసరాజు ఉన్నచో చచ్చుట తథ్యమని తలంచి మెల్లగా యుద్ధభూమి నుండి రథమును దొలగించెను.

★★★

# నూట ఆఱవ సర్గము

## రావణుడు సారథిని దూషించుట:

అట్లు యుద్ధభూమి నుండి రథమును తప్పించిన సూతుని జూచి రావణుడు యమునిచే ప్రేరేపింపబడినవాడై కోపముచే ఎఱ్ఱబడిన కనులు గలవాడై యిట్లనెను. వినరా! సారథీ అశక్తుని విధముగా బలవిక్రమ పౌరుషములు లేనివాని వలె పిరికి వానివలె, మానహీనుని వలె రోషమును వదలిన వాని వలె ఏమిటికి ఈ రథము నిచ్చటికి దెచ్చితివిరా దుర్మతీ! శత్రుని యెదుట నా మనస్సు ఎట్లున్నదో తెలిసికొనక అనాదర బుద్ధితో ఇష్టమువచ్చిన విధముగా జేసెదవా? అస్త్రసంతతులేమయిపోయినవి? ఏమయిపోయినవిరా నా మాయలు? ఇస్సీ మరియాద దప్పి చెనటీ: నా పరువంతయును పాడు చేసితివి గదా. చిరకాలము నుండియును సంపాదింపబడిన నా యశస్సు, తేజస్సు, బలము, యుద్ధమున వెనుదీయడు రాక్షసరాజను నమ్మకము నీచుడా! నీ వలన నశించెను గదరా. భువనములందు ప్రసిద్ధి వహించిన వీరుడును, అధికమైన బలముచే రంజింపజేయదగినవాడును అగు శత్రువు చూచుచుండగా యుద్ధమునకు ఆశపడుచున్న నా గౌరవమును పాపాత్ముడా! దీనునివలె ఆర్పివేసితివే! విరోధిపై రథమును దోలక శరీరము తెలియని వాడవై ఇట్లు మూలకు తెచ్చితివే. నా మేలు కోరిన నా స్నేహితుడిట్లు చేయునా యెప్పుడైన? కూళా! తులువా! విరోధి చేయదగిన కార్యముగాని ఇది నీవంటి వాడు చేయుట నీతియా? నీవిట్లు చేయుటచే నీవు విరోధులచే ఏదో మేలు పొందితివి. దుష్టా! నా సొమ్మును బహుకాలము నుండి తినుచుండుట మఱవకుందువేని, దీర్ఘకాలము నన్ను గొలుచుట తలంతు వేని నా రథమును రాముడు రాకముందే అతనిపై తోలుము.

## సారథి రావణునకు సమాధానము చెప్పుట:

అని మనస్సు నిలుకడలేని రాక్షసరాజు తన మంచిని గోరువాడైన సారథిని ఇట్లు నిష్ఠుర వాక్యములచేత నొప్పింపగా ఆతడు ఎంతో హితముగా అనునయ వాక్యములతో ఈ విధముగా చెప్పెను. రాజా! వినుము నేను భయపడినవాడను కాను. మూఢాగ్రేసరుడను

గాను. విరోధులచే విధము చెడి కానుకలు పొందిన నీతివిహీనుడను గాను. నేను శరీరమును మరచినవాడనుగాను. పనికిమాలినవాడను గాను. నీ మేలు మరచిన వాడనుగాను. మనస్సు నందు స్నేహము మానలేదు సుమా. నేను నీ క్షేమమును కోరుచు నీ యొక్క కీర్తిని కాపాడువాడను. స్నేహము చేత నేను నీకు ప్రియమును చేయగా అది నీకు అప్రియముగా తోచినది. ఇక నేనేమనువాడను? దేవా ఈ విషయమున నా మనవిని వినుము. నేను నీకు మంచిని కోరువాడను. ఏది యో కులమున బుట్టిన చంచలుడిగాను దుర్నీతి పరునిగాను నన్ను తలంపవలదు. ఎత్తు ప్రదేశమునున్న నదిని క్రిందికి తెచ్చిన విధముగా నీ రథము నిప్పుడు యుద్ధభూమి నుండి మరలించిన విధమును సర్వమును వినిపించెదను. చక్కగా వినుము. యుద్ధమునందు మిగులబడతివని, సంతోషము లేకపోవుటను, ముఖము నందు తేజము లేకపోవుటను ఆలోచించితిని. గుఱ్ఱముల కాళ్లు తడబడుచు డస్సి, డీలాపడి చెమటలు కార్చుచుండుటచే అధికమైన వర్షముచే దిక్కుతోచక నిలిచిన ఆవుల వలె తోచెను. ఎన్నియో దుశ్శకునములు కనబడెను. ఇట్టి సమయమున రాక్షసనాథా! సూతునికి అర్హమైన విధమును వినుము. దేశకాలముల తీరును తెలిసికొనుచు శుభాశుభముల గుర్తులను పరీక్షించుచు, రథికుని ముఖమున నున్న దైన్యమును, దుఃఖమును, సాహసమును, సంతోషమును, తెలిసికొనుచు, సమము, విషమముల విధమును జూచుచు, ఊహించును. యుద్ధసమయమును చక్కగా దెలిసి విరోధుల లోపములను వెదకుచు, విరోధికి ప్రక్కగాను, ఎదురుగాను, వెనుకకు పరుగెత్తువేళలు ఇన్నిటినీ కనిపెట్టి రథికునకు ఏ విపత్తును రాకుండునట్లు చేయుటయే సారథి యొక్క ధర్మము. గుఱ్ఱముల అలసట తీరుటకును, నీయొక్క శ్రమ తగ్గుటకును నీయొక్క నిస్తేజత్వము, దుఃఖము తొలగుటకు రథమునిచ్చటికి తెచ్చితిని గానీ నా యిష్టము వచ్చినట్లు చేయుటకుగాదు. ఓ రాజా! యజమాని యెడ ప్రేమగలవాడను. నన్ను నమ్ముము. రాక్షసరాజా! ఇంక నీవే విధముగా నేనావిధముగా ఒప్పుగా జేసెదను. నీ ఋణము తీర్చుకొనుటకు ఏ విధముగా చేయుమన్న ఆ విధముగా నేను నడచెదను అని చెప్పగా సారథి మాటలను రావణుడు వేమారులు మెచ్చుకొనుచు ఈ విధముగా జెప్పెను. సారథీ! రథమును సీతానాధుని కెదురుగా పోనిమ్ము. ఆలస్యము చేయకుము. ఈ రాక్షసరాజు విరోధి ప్రాణములను తీయక దూరము నుండియే తిరిగిపోడుసుమా. వింటివా! అని చెప్పి రావణుడు సాటిలేని హస్తాభరణము అతని కీయగా అప్పుడు రాక్షసరాజు నాజ్ఞచే సారథి రథమును రామచంద్రుని మీదికి నడపెను.

## అగస్త్యుడు శ్రీరామునకాదిత్య హృదయమునుపదేశించుట:

అంతట యుద్ధము నందలసినవాడును, చింతాకులాత్ముడును (పర్వతమును ప్రకటింపక యెట్లు వీనిని జంపుదునాయని యాలోచించు శ్రీరామవిభుని) రాక్షసనాధుని సమీపమున జూచి యుద్ధము చేయుటకు విక్రమముతో నిలిచియున్నవాడును అగు రామవిభుని వారల సంగ్రామమును జూచు కోరికతో దేవతలతో గూడ ఆకాశమున నిలిచియున్న మిక్కిలి మహిమ గలిగిన అగస్త్యుడు సమీపించి ఇట్లు చెప్పెను. శ్రీరామా! రామా! శ్రద్ధతో వినుము. పరమరహస్యము సనాతనము నైనది యిది. ఓ దీర్ఘభుజుడా! నీ విరోధులనెల్లను యుద్ధభూమిలో దీనివలన గెలువగలవు. భక్తితో జపించినచో ఆదిత్య హృదయము శుభప్రదమైనది. పుణ్యమైనది అఖిలవిరోధులను సంహరించునది. పరమ మంగళకరము. భద్రకారణము. నిత్యము, అక్షయమైనది. నిఖిల పాపములను క్షాళనము చేయునది. విజయ కారణము. శోకమును చింతలను పోగొట్టునది. ఉత్తమ మయిన మంత్రము. ఆయువును వృద్ధిపరచునది. సర్వమంగళ మాంగళ్యమును గొప్ప కీర్తి గలది. ఆ మంత్రము యొక్క ఉపాస్య దైవమును రశ్మిమంతుని, రవిని సురలచేతను అసురులచేతను నుతింపబడినవానిని, భాస్కరుని, అఖిలలోకవల్లభుని, వివస్వంతుని సేవింపుము తండ్రీ! ఇతడే సుమా తేజస్సు గలవాడు. ఇతడు సర్వదేవస్వరూపుడు. రశ్మిభావనుడు. ఈతడే సుమా సర్వదేవతాగణములను, జగములను తన కిరణములతో రక్షించును. ఇతడే బ్రహ్మము ఇతడే విష్ణువు, కుమారస్వామియునితడే, శివుడును, బ్రహ్మయును, ఇతడే. ఇతడే దేవేంద్రుడు. ఇతడే కుబేరుడు. యముడును, కాలుడును, సోముడును, వరుణుడును ఇతడే. పితృదేవతలును, వసువులును ఇతడే. మరుత్తులును, సాధ్యులును, అశ్వినీదేవతలును, మనువు కూడా నితడే. వాయువును, అగ్నియు, ప్రజలకు ప్రాణమును ఇతడే సుమా. భద్రగుణుడా! ఋతుకర్తయు ప్రభాకరుడే.

★★★

# నూట యేడవ సర్గము

**ఆదిత్య హృదయము:**

నీవే ఆదిత్యుడవు. నీవే సూర్యుడవు. నీవే సవితృడువు. నీవే ఖగుడవు, నీవే పూషుడవు, నీవే గభస్తిమంతుడవు. నీవే హేమరేతుడవు. నీవే భానుడవు – తపన దివాకరులు నీవే. నీవే సుపర్ణుడవు. త్వష్టవు. హరిదశ్వుడవు, సహస్రార్చివియును. మరీచిమంతుడవును అంశుమంతుడవును, సప్తసప్తివియును, తిమిరావి. శంభుడవును నీవే. నీవే మార్తండుడవు. రవివి నీవే అగ్నిగర్భుడవును శంఖుడవును, భాస్కరడవును నీవే. శిశిరనాశన తపనులు నీవే. శిశిరమును నీవే. నీవే హిరణ్యగర్భుడవు. నీవే అదితి ప్రియపుత్రుడవు. సువర్ణావహుడవు, నభోధవుడవు, జలముల మిత్రుడవు భక్తుల హృదయములందుండు తమోభావములను భేదించువాడవు. వేదములను పూర్తిగా పఠించినవాడవు, గవిరాజువు వింధ్యవీధి యందు సంచరించు ప్రవంగమవు నీవే దేవా! సమస్త సంసారమునకు ఉద్భవస్థానమవు, పింగళుడవు. మృత్యువవు, విశ్వమవు నీవే. ఆ తపివి, మండలివి సమస్తతాపసుడవు. రక్తుడవు, భూరితేజుడవు. విశ్వభావనుడవు. ఖగతారోడు పతివి నీవే. నీవు తేజస్సులలో మిక్కిలి తేజస్వివి. ద్వాదశాత్మా! దిశనాయకా! దేవా! జయభద్రా! జయ! పద్మముల పతీ నీకివే నమోవాకములు. తూర్పు పర్వతమునకు అస్తాచలమునకు ఉగ్రునకు మ్రొక్కెదను. జ్యోతిర్గణ పతికి మ్రొక్కెదను. హర్యశ్వునకు మ్రొక్కెదను. జయునికి మ్రొక్కెదను. ఆదిత్యునకు మ్రొక్కెదను. వేవెల్గునకు మ్రొక్కెదను. సారంగమూర్తికి మ్రొక్కెదను. వీరువకు మ్రొక్కెదను. మార్తాండులను మ్రొక్కెదను. మహేశ్వరునకు ఆదిత్యునకు, ఆదితేయునకు అర్చికి, సూర్యునకు, భాస్వంతునకు, సమస్తభక్షునకు, రౌద్రాక్షారునకు, విశ్వకర్మకు, తమోఘ్నునకు, విశ్వసాక్షికి, నమితాత్మునకు, శత్రుఘ్నునకు, హిమవైరికి, తమోభినిఘ్నునకు, తప్తస్వర్ణనిభునకు, వహ్నికి, గ్రహపతికి, కృతఘ్నఘ్నునికి, పద్మమిత్రునికి మ్రొక్కెదను నమస్కరించెదను. చేతులు జోడించెదను. అంజలి ఘటించెదను. స్తోత్రము చేసెదను. చిన్నిపూలు నతులు ఇచ్చెదను. భూతములను సంహరించి, మరల సృష్టించి రక్షించునట్టి ప్రభు వీతడే సుమా. ఈతడే తన కిరణములచే తపింపజేయును

వానగురియించును. జగములు నిద్రించునప్పుడీతడే మెలకువగా నుండును. తగు విధముగా సమస్త భూతములందుండి పరిరక్షించును. ఈతడే వేదములు, యజ్ఞములు, అగ్నిహోత్రములందు హోమము చేయు ఫలములు యజ్ఞముల ఫలము, అగ్నిహోత్రుడు ఈతడే. ఇంకను భూమియందు జరుగు పనులన్నియు నీతడే. ఈ సూర్యుడే అన్నింటికి ప్రభువు. రామభద్రా! ఈ మంత్రము ఆపదలందు, కష్టములందు, వనములందు, భయము కలిగిన వేళలందు నరుడు పఠించినచో దుఃఖములనుండి విడువబడును. రాజచంద్రా: సీతా నాధా! ఇది నిజము. కాన మనస్సునేకాగ్రముగా నిలిపినవాడవై లోకముల భర్తయు, దేవదేవుడును, లోకనేత్రుడునయిన సూర్యుని నిశ్చలమైన బుద్ధితో పూజింపుము. శ్రీరామా! ముమ్మారు ఈ స్తోత్రమును జపించినచో జయము సిద్ధించును. కాన దీనిని జపించి నీవీ నిమిషమునందే ఓ మానిత భుజశౌర్యుడా! రావణుని సంహరించెదవు అని ఈ విధముగా చెప్పి అగస్త్యమౌని అంతర్ధానము చెంది తన యిచ్చ చొప్పున వెడలెను. ఇది విని దివ్యతేజస్సు కలిగిన రాముడు హెచ్చైన సంతోషముతో మంత్రమును మనస్సునందు నిలిపి చింతమాని సూర్యమండలమును జూచుచు శుచియై ఆచమించి మూడు మారులు జపించి వింటిని బాణములను బట్టి రావణుని చంప మనస్సు నందు తలచి యుద్ధము చేయబూనెను. అట్లు రాముడు ఆదిత్య హృదయమును జపించగా సూర్యుడును మనస్సునందు సంతోషము గలవాడై రాక్షసరాజును సంహరించుటను తాను మనస్సుతో అనుగ్రహించుచు దేవతలమధ్యనున్న వాడై రాముని త్వరపడుమనెను.

★★★



# నూట యెనిమిదవ సర్గము

## రావణుడు మరల శ్రీరాముని మీదికి యుద్ధమునకు వచ్చుట:

శత్రుసేనలను నురుమాడునదియు, గంధర్వనగము వంటి ఆకృతి గలదియు, ఎగురుచున్న ధ్వజము గలదియు, బంగారు హారములతో ప్రకాశించు గుఱ్ఱములు గలదియు, యుద్ధమునకు ఉపయోగించు పరికరములతో నిండినదియు ఆకాశమును మ్రింగుచున్నదో యనునట్లు ప్రకాశించి భూమి వణకుచుండగా విరోధులు చిన్నబోగా తన సైన్యములు పొంగుచుండగా నున్న రావణుని రథమును సారథి అపరిమితమైన సంతోషముతో వేగముగా నడపెను. ఇట్లు వచ్చుచున్నదియు ప్రబలమైన ధ్వనిగలదియు, నల్లని గుఱ్ఱములు గలదియు, కదలుచున్న మెరుపువంటి ధ్వజము గలదియు చాలా దృఢమైనదియు, ఇంద్రుని ఆయుధముతో సమానమైన ఆయుధములు నిండుగా గలదియు, భయంకరమైన కాంతితో నిండినదియు, అడ్డులేక మేఘముల నుండి కురియు జలధారల వంటి బాణములను గురియుటచే తీక్ష్ణమైనదియు అగు రావణుని రథమును

## శ్రీరాముడు మాతలిని హెచ్చరికను ఉండుమనుట:

శ్రీరాముడు చూచు బాలచంద్రునివలె వంగియున్న వింటిని వజ్రాయుధపు దెబ్బచే ముక్కలయిన పర్వతముల గొప్ప ధ్వనివంటి మ్రోతగల దానిని చేతబట్టి ఇంద్రుని సారథియైన మాతలితో ప్రేమతో నిట్లనెను. మాతలీ: మన విరోధి రథము సాటిలేని వేగముతో వచ్చు వైఖరిని చూచితివా? తాను చావగోరినవాడై అపసవ్యముగా వచ్చుచున్నాడు. గాన నీవు కూడా హెచ్చరికగా వాని నెదుర్కొన వెళ్లుము. నేనీ రావణుని వాయువు క్రమ్మిన మేఘమును చెదరగొట్టు విధముగా రూపుమాపెదను. నేను విక్రమముతో మనస్సు నిలిపిన వాడనై ఒప్పెదను. అతనిపై వ్రాలెదను. నీవును దృష్టిని చెదరనీక హృదయమునే కాగ్రముగ నిల్పి నీరసపడక కలత జెందక మనస్సు చలింపక పగ్గములను వదలునప్పుడు లాగునప్పుడు నేర్పుతో ప్రవర్తింపుము. ఏమియు లోటు లేకుండ ఇంద్రుని రథమును నడపు నీకు బుద్ధులు నేను చెప్పవలెనా? కార్యభారమున మనస్సు నంతయు ఏకాగ్రముగా యుద్ధమునందే

యుంచుదును గాన హెచ్చరించితిని. నీకు నేర్పుట కాదు సుమా. అనగా ఇంద్రుని సారథి సంతోషము గల మనస్సు గలవాడై రాక్షసరాజు రథ మపసవ్యమగు విధముగా భూమి నుండి రేగిన ధూళి శత్రువును గప్పగా రథమును నడపగా కోపముతో రావణుడెదురువెళ్లి రామునిపై బాణములను వరుసలు వరుసలుగా తండోపతండముగా వేసెను.

## రావణుని మరణమును తెలుపు చిహ్నములగపడుట:

తనపై ఇట్లు బాణములు కురిపించుటను సహింపని వాడగు సీతానాధుడు రోషముచే భయంకరుడై ధైర్యమే భూషణముగా గలవాడై యింద్రుడొసగిన విల్లు చేబూని సూర్యకిరణ సమానమైన కాంతి గల వాడి బాణములను వేసెను. ఈ విధముగా రావణరామచంద్రులు ఒకరినొకరు చంపవలెనను కోరిక గలవారై శౌర్యము కనిపించగా మదించిన వన సింహముల ద్వంద్వము వలె పోరుచుండగా దేవతలాకాశమున గుంపులు గట్టి ఇరువురు మహారథులు చేయుచున్న యుద్ధమును రావణుడెప్పుడు చంపబడునోయని కోరుచు తృప్తి తీరక చూచిరి. రావణుని నాశమును, భూపుత్రి భర్త యొక్క విజయమును తెలియజేయుచు ఆ సమయమున అధికముగా శరీరములు గగుర్పొడుచునట్లు దారుణమయిన లక్షణములు కనబడజొచ్చెను. రావణుని రథము మీద రక్తవర్షము గురిసెను. సుడిగాలి అపసవ్యముగా చుట్టిచుట్టి విసరెను. వాని రథము వెంట పెద్ద గ్రద్దలు గుంపులుగ ఆకాశమున ఆడెను. జపాకుసుమ వర్ణముతో లంకాపురముపై సంధ్య ఆవరించెను. అది పగలే అయినను ఆ కాంతిచే భూమి మండు చున్న విధముగా భయంకరమై తేజరిల్లెను. లంకలో తోకచుక్కలు రాలెను. రాక్షస సమూహములు భయపడునట్లు పెద్దపెద్ద పిడుగులు పడెను. రాక్షసులు యుద్ధము నందు వానరులతో తలపడునప్పుడు వారి చేతులనెవ్వరో బిగబట్టిన విధముగా నుండెను. రావణుని రథము వెళ్లునపుడు భూమి వణకుచుండెను. సూర్యుని కిరణములు ఎఱుపు, పసుపు, తెలుపు, నలుపు కాంతులతో రావణుని శరీరముపై ప్రసరించెను. వెంబడి వచ్చెడు పెద్దగ్రద్దలు ముఖముల నుండి మంటలు గ్రక్కుచు రావణుని ముఖమును చూచి యమంగళములైన శబ్దములు చేసినవి. దిక్కులందు చీకటులు దట్టమయ్యెను. ప్రతికూల వాయువులు ధూళితో గూడి రావణుని దృష్టియొక్క పటిమను చెరచెను. అచ్చటచ్చట సైన్యమునందు ఉరుములు లేకుండగనే పిడుగులు పడెను. ధూళి వర్షము చేత సైన్యములకు ఆకాశమార్గము కనిపింపదయ్యెను. గోరువంక పిట్టలు కోట్లుకోట్లుగా జగడమాడుచు

కఠినమైన ధ్వనులతో రథము మీద బడెను. ఒక్కమారుగా గుఱ్ఱముల కటిప్రదేశముల నుండి మిణుగురులు పుట్టెను. కన్నులందు నీరుద్గమ్మెను. ఇట్టి యుత్పాతములు యుద్ధమున రాక్షసరాజు కీడు ననేకవిధములుగా తెలియజేసెను. రామునికి నెమ్మదిని, క్షేమమును గలిగించు చిహ్నములు కనిపించెను. రాముడు వానిని జూచి రాక్షసుడు చచ్చినట్లే యని తలంచి మనస్సు నందు ఆనందమును బొందెను.

★★★



# నూట తొమ్మిదవ సర్గము

## వానర రాక్షసులు శ్రీరామ రావణయుద్ధము చూచి దిగ్భ్రమనొందుట:

సంతోషముతో వికసించిన ప్రకాశవంతమైన ముఖముతో, రామచంద్రుడు వింటినారి మ్రోతలు ఘోరములై వ్యాపింపగా పరాక్రమముతో బాణముల వరుసలతో రావణుని దాకెను. వాడును యుద్ధోత్సాహముతో గొప్ప శస్త్రములను వర్షించెను. ఆ యుద్ధము మూడు లోకములు భయము చెందునట్లు సాగెను. వానర సైన్యములును రాక్షస సంఘములును యుద్ధము చేయు తలంపు కలిగియు కఠినమైన ఆయుధ సాధనములు గల చేతులతో రాక్షసరాజును రామచంద్రుడును చేయు యుద్ధమును కోరికతో చూచుచు చేష్టలు దక్కి ఎవరు జయింతురో అను నాలోచనతో ఏకాగ్రతతో చెదరని చూపులతో చూచుచుండిరి. ఆశ్చర్యపడుచున్న మనస్సులతో నిబ్బరముగా నిలిచి తమ దగ్గఱకు వచ్చు శత్రువులపై ఇరుపక్షముల వారును ఆ బలశాలుర పోరుచూచు అభిలాషతో దెబ్బతీయకుండిరి. రావణుని జూచుచున్న రాక్షసులును, సీతానాధుని జూచు వానరులును అధికమైన ఆశ్చర్యముతో ఱెప్పపాటు లేని చూపులతో నోళ్లు తెరచి బొమ్మలవలె నిలబడిరి.

## శ్రీరాముడు రావణుని ధ్వజమును నరుకుట:

అంతటి రావణ రాఘవులు తమ తమకు గోచరించిన నిమిత్తములవలన దృఢమైన దీక్ష గలవారై కొంచెమైనను క్రోధమును విడువక, ఇంచుకంతయైనను భయము లేక మిక్కిలి శౌర్యముతో పోరుచుండగా రావణుడు చావవలెననియు, రాముడు జయేచ్ఛతోను తమ తమ బలములను సమగ్రముగా జూపించుచు హోరాహోరీగా పోరుచుండగా, రాక్షసుడు మహాభయంకరమైన వారింపరాని బాణపరంపరలను రాముని ధ్వజముపై వేసెను. అవి ధ్వజమును తాకకుండగనే చెడి నేలబడగనే రామచంద్రుడును దానికి ప్రతిక్రియ చేయదలంచి బలముతో విల్లును వంచి నారి లాగి ఒక బాణమును వేయగా అది రాక్షసుని ధ్వజమును విరుగగొట్టి భూమిలోనికి ప్రవేశించెను. ఆ ధ్వజము పట్టుతప్పి రాక్షసుని శౌర్యమువలెనే పడిపోయెను. ధ్వజమిట్లు కూలగా రావణుడు క్రూరమైన

రోషమునందినవాడై తన భుజబలమునంతను చూపుచు రఘురాముని గుఱ్ఱములను బాణములచే ముంచెను. ఆ యశ్వములు బాణములు తగిలినను గజిబిజిపడక తామరతూడులు తగిలిన విధముగా స్వస్థతతో నుండెను. వానిని జూచి రాక్షసుడు తిరిగి మాయచే సృష్టింపబడిన బాణములను, పరిఘలు, గదలు, అతి భయంకరములైన చక్రాయుధములు, శూలములు, పరశువులు, పర్వత శిఖరములు మొదలగు వానిని వానగా భయంకరముగా, ఆకాశము భూమి నిండునట్లు అనేకముగా గురిపించెను. వానితో రాముని రథము తప్ప సైన్యమునందంతట నిండెను. ఒక్కమారుగా విజృంభించి రాక్షసరాజు తెరపిలేకుండగా అంతటను నిండునట్లుగా వానరులు చీకాకు చెందునట్లుగా అస్త్రసహస్రములను వేసెను. అది చూచి సీతానాధుడు చిఱునవ్వుతో వికసించిన ముఖము గలవాడై వేగముగా తన అస్త్రములను పైపై వేసెను. త్వరత్వరగా నూర్లు వేలుగా వచ్చుచున్న రాముని బాణములను చూచి తానును విడువక సాహసముతో పైపైన రాక్షస నాధుడును వేసెను. చూడచూడగా ఆకాశమును వారి బాణములు పందిరి వైచిన విధముగాను రెండవ ఆకాశమోయనునట్లుగాను కప్పివైచెను. ఇద్దఱి బాణములలో ఒకటైనను గురి తప్పుటలేదు. వృధాగా పోలేదు. ఎదుటి బాణములను పడగొట్టకుండ ఒక్కటి పోవదు. ఒక్కటైనను బీరుపోదు. వాడి చెడదు. ఒకరి బాణములు వేరొకరి బాణములను తగిలి ముక్కలు ముక్కలై నేలపడగా సవ్యాపసవ్యములను భేదములను నేర్పుగా జరిగించుచు బాణములను వేసివేసి రాముని గుఱ్ఱములను రావణుడు రావణుని గుఱ్ఱములను రాముడు నొప్పించిరి. ఒకరు చేసిన దానికి మరియొకరు ప్రతిక్రియ చేయుచు నొక ముహూర్తకాలమిట్లు విజృంభించి, వెనుకకు తగ్గక ఇద్దఱు పోరుచుండగా సర్వభూతములును, సంభ్రమముతోను ఆశ్చర్యముతోను చూచుచుండిరి. ఇదివఱకు ఇట్టి యుద్ధమును చూడలేదనుకొనిరి.

★★★

# నూట పదవ సర్గము

## రావణుడు భీమముగా శ్రీరామునితో పోరుట:

అట్లిరువురును ఒకరికొకరు దగ్గరగా వచ్చుచు, దూరముగా వెళ్లుచు, ఒకరినొకరు చంపదలంచుచు ఒకరి చుట్టునొకరు తిరుగుచు, ఒరుసుకొనునట్లు వెళ్లుచు, నిండిన ప్రతాపములచే మండిపడుచు, బలమునందు తగ్గుచు, హెచ్చుచు, ప్రతాపములు పలుకుచు నిందించుకొనుచు, ఒకరి తప్పులను ఒకరు వెదకుచు, సారథుల సారథ్యముల నేర్పులచే విచిత్రమైన నడకలతో నడచు అందములు గలిగి రథములు రెండును రావణరాఘవులు దగ్గఱకు వచ్చుచోటను, మరల దూరమగుచున్నచోటను నడకల నేర్పుతెయునట్లు బాణములను గురిపింపగా మేఘముల విధముగా దోచెను. ఏపును, నేర్పును కనిపించునట్లు ఈ విధముగా ఇద్దఱును చిత్రముగా విక్రమముతో పోరాడుచు అతివేగముగా అట్టే ఎదురుపడుచు కోపముతో కాడికాడిని గుఱ్ఱముల మూతులు మూతులను టెక్కెములు టెక్కెములతో ఢీకొను విధముగా తమ తమ రథములను పరుగెత్తించిరి. అట్టి సమయమున రాక్షసరాజు నాలుగు గుఱ్ఱములను నాలుగు బాణములచే రాముడు క్రూరముగా కొట్టెను. అవి బాధతో ప్రక్కలకు తప్పుకొనగా దీర్ఘక్రోధముగల రాక్షసరాజు రామచంద్రుని మీద వజ్రాయుధములవంటి కఠినములైన బాణములను వేసెను. దశరథనందనుడు వాని తాకిడిచే నొవ్వక మిక్కిలి వాడి సాధనములను వేసెను. దానికి ప్రతిగా ఇంద్రవిరోధి సాటిలేని బాణములచే రామసారథిని గొట్టెను. మాతలియు ఆ బాణములతాకిడికి చీమగుట్టిన పాటి నొప్పియు, భయమును, మోహమును బొందక కాంతి తరుగక యుండెను. ఇట్లు రాక్షసనాథుడు తన సారథిని నొప్పింపగా తనను నొప్పించినను కోపించని ధైర్యనిధియగు రాముడు క్రోధముచే ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడై రాక్షసుని అధికమైన తీక్ష్ణ బాణములచే విముఖుని గావించెను. అట్లు రామచంద్రుడు ఇరువది, ముప్పది నలువది, యేబది, అరువది, నూర్లు వేలుగా భయపడునట్లు వేయగా రావణుడును మిక్కిలివాడిగల శూలములు, గదలు, పరిఘలు మొదలైన సాధనములను ధ్వనులు దిక్కుల పిక్కటిల్లునట్లు వేసెను. ఆ బాణములు ప్రవేశించు తాకిడిని అనేక విధములుగా సముద్రములు క్షోభచెందెను. పాతళనివాసులయిన

సర్వశ్రేష్ఠులు నానావేదనలు పొందిరి. రాక్షసులు భయపడి గగ్గోలుపడిరి. అడవులు, కొండలతో గూడిన భూమండలము కంపించుచు ఆర్తిని బొందెను. పద్మినీ భర్తయైన సూర్యుడు కాంతిని గోల్పోయెను. గతిభేదములు తొలగి వాయువు స్తంభించెను. సిద్ధులు, దేవతలు, గంధర్వులు, ఋషులు మొదలగువారి సమూహములన్నియు దిక్కుతోచక చింతచే దీనులయిరి. "గోవులకు బ్రాహ్మణులకు స్వస్తియగు గాక. లోకములు శాశ్వతవత్సరములు స్థిరముగా నుండుగాక. తీవ్రమైన యుద్ధములో రాముడు విశ్వవిద్వేషియు, రాక్షస నాయకుడు నయిన రావణుని జయించుగాక" అని మనస్సులందు జపించుచు నిరీక్షించుచుండగా శరీరములు గగుర్పొడుచు విధముగా భయంకరమైన యుద్ధము సాగుచుండగా, దేవతలును, గంధర్వులును, సాటిలేని ఆ యుద్ధమును జూచి ఆశ్చర్యపడుచు ఆకాశమాకాశమునకు సాటి సముద్రమునకు సముద్రమే సాటి, రామరావణుల యుగ్రయుద్ధమునకు రామరావణులయుగ్ర యుద్ధమే సాటియని అప్పుడు పవిత్రమైన మనస్సులతో చూచుచుండిరి.

## శ్రీరాముడు రావణుని శిరస్సును నఱుకుట:

తీవ్రమైన కోపముచే భయంకరుడైన రఘువంశమనెడు పాల సముద్రమునకు చంద్రుని వంటి వాడగు రాముడు సర్పమువంటి బాణమును వేగముగా సంధించి రత్నములచే ప్రకాశించు సూర్యునితో సమానమైన కుండలములతో ఒప్పుచున్న శిరస్సును నఱికి వేసెను. అప్పుడు రావణుని తల నేలబడుటను బ్రహ్మాండ మంతయు జూచెను. అట్టి తలయే తిరిగి అచ్చటనే అప్పుడే మొలచెను. వెంటనే మిక్కిలి వేగము గల చేతులు గలవాడై దానిని నరుకగా మరల మొలచెను. సీతానాధుడు దానిని గూడా త్రుంపగా మరల మొలచెను. ఇట్లా రాజపుత్రుడు నూటొక్కసారులా రాక్షసుని శిరస్సులను నరికివేసెను. నరికిన వెంటనే తలమొలచు చుండెనేగాని వాడు సంహరింపబడు విధము కొంచెమైనను తోచకపోవుటచే రాజచంద్రుడు చిత్రముగా నున్నదేయని చింతించెను. అయ్యో! నేను మారీచుని జంపితిని. ఖరుని జంపితిని. దూషణుని నొక్క త్రుటిలోననే త్రుంచగలిగితిని. క్రౌంచ వనస్థుడైన విరాధుని సంహరించితిని. విశ్వాసపాత్రములగు నా అస్త్రము లెప్పుడును తిరిగిపోలేదు. నేడేలనో బలము తగ్గి పదను చెడినవి. ఇట్లగుటకేమి కారణమో గదా. అని చింతించినవాడై దర్పమును వీడక అప్రమత్తుడై సాటిలేని బాణవృష్టిచే తిరిగి రాక్షసుని హృదయమును చీల్చగా బాధపడక ముసలములు గదలు మొదలైన సాధనములను

వేసెను. వారు రథవేగముల అతిశయముచే భూమియందును ఆకసమునందును ఆ పర్వతశిఖరమునను ఒక్క ముహూర్తము గానీ, నిమిషము గానీ రాత్రియు, పగలును నిలుపకయే రాత్రి యంతయును యుద్ధము చేసిరి. వారి యుద్ధములో సూర్యవంశజుడైన రామచంద్రునకే జయము కలగునని నిశ్చయింపలేక మిక్కిలి బుద్ధిమంతుడైన మాతలి యుద్ధోత్సాహముతో నున్న రామచంద్రునితో నిట్లనెను.

★★★



# నూట పదకొండవ సర్గము

## శ్రీరాముడు బ్రహ్మాస్త్రముచే రావణుని వధించుట:

ఏమి మహానుభావా! రామచంద్రా! ఏమియు తెలియనివానివలె ఏవేవో మహాస్త్రములతో విరోధిని గొట్టెదవేల? వాడు చేసిన పనులకు ప్రతిక్రియగా ఈ రాక్షసుని సంహరించుటకే బ్రహ్మాస్త్రమును వదలిపెట్టవయ్యా! ఓ శ్రీరామచంద్రా! దేవతలు నిర్దేశించిన రాక్షసుని మరణకాలము ఇప్పుడే ఆసన్నమైనది అని మాతలి చెప్పగా సర్వలోకములను జయింపవలెనని కోరెడు ఇంద్రునికై పూర్వము బ్రహ్మదేవుడు మిక్కిలి మహిమతో సృష్టించి యివ్వగా అతడు దానిని మునిశ్రేష్ఠుడైన అగస్త్యునకిచ్చెను. ఆయన అత్యంత ప్రీతితో ఇదివఱకు దండకాటవియందు తనకిచ్చెను. ఆ మహాస్త్రము యొక్క ప్రక్కలయందు వాయువును, ముఖము నందు అగ్నిసూర్యులును ఒప్పుచుండగా ఆకాశమయమైన అంగము గలిగి మేరు మందర పర్వతములంత గురుత్వముతో ఒప్పుచు దివ్యమై బంగారముచే అలంకృతములు జాజ్వల్యమానమైన దేహము, సూర్యతేజస్సు, సకలభూతముల తేజము, దృఢమైన అగ్రము కలిగి క్రోధముతో రోజుచున్న సర్పమును, పొగతో గూడిన తోకచుక్కను పోలినది. విరోధుల అశ్వములను, ఏనుగులను, పరిఘాద్యాయుధ సమూహములను ద్వారములను చెండివైచునది. మేధస్సుతో పూయబడినది. కొండలను ఛేదించు శక్తి గలది. రక్తముతో పంకిలమైనది. గొప్ప ధ్వని గలది. వజ్రమువలె కఠినమైనది. ఛేదించుటలో సాటిలేనిది. భూతముల మనస్సులకు భయము కలిగించునది. సాటిలేని పరాక్రమము గలది. నక్కలు, కాకులు, గ్రద్దలు మొదలగువానికి ఆహారము ఎల్లప్పుడు నొసగునది. యమునివంటిది. అట్టి బ్రహ్మాస్త్రమును శ్రేష్ఠతమమైన దానిని వానర బృందముల మనస్సుల కానందమునిచ్చుదానిని, రాక్షస సమూహలకు భయము కలిగించుదానిని, తన వంశమునకు కీర్తి కలుగుజేయు దానిని విరోధుల యశస్సును హరించుటలో సాటిలేనిదానిని గరుడపక్షి రెక్కలవంటి విచిత్రమైన రెక్కలు గలదానిని, బ్రహ్మ మంత్రముతో గూడినదానిని, విధ్యుక్త ప్రకారముగా కాకుత్థ్సుడు వింట సంధించెను. ఆ బ్రహ్మాస్త్రమును

వింటి నారి యందు గూర్చగానే సకల దిక్కులందలి భూతజాలములు హాహాకారములతో అబ్రహ్మణ్య మని అరచిరి. సర్వసముద్రములు కలంగెను. భూమి వణకెను. తీవ్రమైన ఆటోపముతో ఆ బ్రాహ్మణ హంత మీద రఘురాముడు ఆయస్త్రమును వేసెను. ఇంద్రునిచే వేయబడిన వజ్రమోయనునట్లు యమునివలె క్రూరమగుచు ఇంద్రవిరోధి రొమ్మునందు తీవ్రమైన వేగము గలదై సంరంభముతో పడెను. ఆ మహిమ గల అస్త్రము ఈ విధముగా ఆ రాక్షసుని హృదయమును బ్రద్దలు గొట్టి రక్తముచే తడిసి ప్రాణములను శరీరము నుండి బయటికి పోగొట్టి భూమిలోనికి జారబడి గార్యమును నెరవేర్చి రక్తముతో ఎఱ్ఱబడిన ఆకారము గలదై వినయముతో వేగముగా తిరిగివచ్చి భూపుత్రి భర్త యొక్క అమ్ముల పొదలో ప్రవేశించెను. ప్రాణముతోపాటు, విల్లును, బాణమును రాక్షసనాధుని విడచి నేలబడెను. ప్రాణము పోగా రావణుని శరీరము ఇంద్రునిచే సంహరింపబడిన వృత్రాసురుని వలె నేల గూలెను. తమ రాజు సంహరింపబడుటను చూచి ఎంతో భయముతో చావగా మిగిలిన రాక్షసులు కోపముతో శ్రీరాముని జయముచే కలిగిన సంతోషముతో నున్న వానరులు తరుముచుండగా కన్నీళ్లతో, వ్రేలాడు ముఖములతో, చెడిన శౌర్యములతో తడిలేని నాల్కలతో వేగముగా లంకకు పారిపోయిరి. రావణాసురుని మరణమును, సీతానాధుని విజయమును, యుద్ధకథలను వేయి విధములుగా పొగడుచు వానరశ్రేష్ఠులు సంతోషముతో శరీరములు తెలియనివారైరి.

### రావణుని మృతికి లోకములు సంతోషించుట:

అట్లు రామచంద్రుడు బ్రహ్మాస్త్రముచే రావణుని వధించగనే అందముగా, మూడు లోకములకు ఆనందకరమై ఆకాశమునందు దుందుభుల మ్రోతలు నిండిపోయినవి. ఒత్తుగా తేనె లొలుకుచు రథముపై మందారపుష్పముల వాన గురిసెను. పరిమళము గలదై, సుఖము కలిగించునదై మెల్లగా కమ్మని గాలి వీచెను. అందముగా, హితకరము లైన స్తోత్రములతో గూడినవై దేవతల వాక్యములు వినిపించెను.

సర్వలోకములకు భయంకరుడైన విరోధి మూడులోకములకు బాధాకరుడు అయిన రావణుడు శ్రీరామునిచే నామమాత్రాన శిష్టుడై మరణించుటను జూచి చారణులు దేవతలు సంతోషముతో పొంగిపోయిరి. సజ్జనులు శాంతమైన మనస్సులతో సంతసించిరి. దిక్కులు ప్రసన్నములయ్యెను. ఆకాశము నిర్మలమై ప్రకాశించెను. భూమి వణకుట మానెను.

నెమ్మదిగాను కమ్మగాను గాలులు వీచెను. దిగులు లేనివాడై సూర్యుడు తేజస్సుతో వెలిగెను. విచ్చలవిడిగా జనులు వీథులందు దిరిగిరి. యజ్ఞముల పొగలు ఆకాశమంటెను. లోకులందఱును ఆదమరచి నిద్రపోయిరి. స్త్రీలకు గుండెదడలు తగ్గినవి. అన్నిలోకములకు విరోధియైన రావణుడు యమపురమునకు తరలిపోవుటచే ఎల్లరును నెమ్మది చెందిరి. అంతట విభీషణుడు, సూర్యపుత్రుడైన సుగ్రీవుడు, లక్ష్మణునితో గలిసి రామవిభుని చెంత జేరి యుద్ధమందు జయమును బొంది ప్రకాశించుచున్న ఆ మహాస్వాంతుడైన రాముని అనేక విధములుగా బ్రశంసించుచు చుట్టునిల్చి ఇంద్రుని సేవించిన దేవతల వలె సేవించి ప్రకాశించిరి.

★★★



# నూట పండ్రెండవ సర్గము

## విభీషణుడు రావణుని కళేబరము చూచి యేడ్చుట:

శ్రీరామచంద్రుని బాణములచే నరుకబడిన అన్నను సమీపించిన విభీషణుడు ఆపదనొందినవాడై కన్నులనుండి కన్నీరు కాలువలు గట్టునట్లుగా మిక్కిలి దీనముగా ఏడ్చెను. ఎన్నో యుద్ధములందు జయమును పొంది ప్రఖ్యాతి చెంది వీరుడవై, ఎన్నో శాస్త్రములను పఠించి గొప్ప పండితులచే పొగడబడినవాడవై యుండి, ఏ లోపములేని అధికమైన సౌఖ్యమును కలుగజేయు శయ్యయందు అలంకృతుడవై నిద్రించు నీవు అన్నా! నేడిట్లు నేల పాలయితివా? హా! దైవమా! యేమందును. కాళ్లు పారజాచి, బంగారుతో చేయబడిన మేలైన భూషణములతో అలంకరింపబడిన నీరెండు చేతులను (రావణుడు యుద్ధ సమయమున రెండు చేతులు ఒంటితలతో నుండెను) నేలపై బడవైచి చేష్టలుడిగినవాడవై యిట్లు కిరీటము పడిపోగా నేలమీద పడియుండుట తగియున్నదా? అన్నా! ఈవిధముగా జరుగునని నేను నీతో ఎన్నియో మారులు చెప్పలేదా? కాని కామము చేతను, మోహము హెచ్చుట చేతను రాక్షసరాజా! నా పల్కులు నీకు రుచింపవయ్యెను గదా. ఆ కుంభకర్ణుడు గాని, యింద్రజిత్తు గాని, ప్రహస్తుడు గాని, నరాంతకుడు గాని, అతిరథుడైన ఆ అతికాయుడు గాని, తమ బలము చూచుకొని నీతిని తలంచరైరి. నీవైనను ఆలోచింపవైతివి. దాని ఫలితమే నేడిట్లు ప్రాప్తించినది. నేనెంతయో చెప్పితిని. కాని అదియంతయు వృథాయైనది. కాలమును తప్పింపగలవాడెవ్వడు? అన్నా! నీవొక్కడవు భూమిని వీడి పోవుటచేతనే సునీతి యను వంతెన పడిపోయినది గదా. ధర్మము యొక్క విగ్రహము నశించినది. సత్వసంగ్రహవిదమెల్లను చెల్లిపోయెను గదా. స్తోత్రము చేయదగిన అర్హత నశించినది. సూర్యుడు నేలబడెను. చంద్రుడు చీకటిలో మునిగెను. అగ్నిహోత్రుడు చల్లబడెను. ఈ వీరశ్రేష్ఠుడు శరీరము విడుచుటచే ఉత్సాహమునకు ప్రయత్నమే లేదయ్యెను. రాక్షససింహుడు యుద్ధరంగమందు ధూళిలో మునిగి నిద్రపోవుచున్నట్లు మృతిని బొందగా హతవీరమైన ఈ లోకమున నింక చెప్పుకొనుటకేమి మిగిలినది? ధైర్యమను చివురులు, ఓర్పు అనెడు పుష్పములు గొప్ప తపస్సనెడు బలము, వీర్యమనెడు దృఢమైన

మూలము గలిగిన రాక్షసశ్రేష్ఠుడనెడు వృక్షము రాముడను గాలిచే నేలబడిపోయెను. బలమను దంతములు గలదియు, సద్వంశమనెడు పృష్ఠభాగము గలదియు, కోపము, దయ యనెడు దేహము గలదియు అయిన రాక్షసనాథుడను మదపుటేనుగు రాముడనెడు సింహము యొక్క పరాక్రమముచే అణగారి పోయెను గదా. విక్రమము ఉత్సాహములనెడు విజృంభించిన వికట జ్వాలలు గలదియు, దీర్ఘనిశ్వాసములనెడు పొగ కలదియు, దేహమునందలి బలమనెడు ప్రతాపము గలదియు అయిన రావణుడనెడు ప్రజ్వలించు అగ్నిని రాఘవుడనెడు మేఘము చల్లార్చెను. తన సేనలోని రాక్షసులే వాలము, మూపు, కొమ్ములుగా గలిగినదియు, శత్రువులను ధ్వంసము చేయునదియు, హింసయందాసక్తి గలదియు, చంచలములైన చెవులు కన్నులు గలదియు అయిన రావణుడను ఆబోతును దాకి రాఘవుడనెడు వ్యాఘ్రము సంహరించినది. అని దుఃఖముచే కలత చెందినవాడై ప్రలాసములు చేసి చేసి సహేతుకములైన వాక్యములతో దుఃఖించుచున్న విభీషణుని జూచి జానకీనాథుడు దయ అతిశయింపగా ఇట్లనెను.

## శ్రీరాముడు విభీషణునకు దుఃఖోపశమనము చేయుట:

ఓ విభీషణా! ఎందులకయ్యా యేడ్చెదవు? ఈతడు బలహీనతచే చావలేదు. యుద్ధమునందు కుతూహలము గలవాడు, అతిపరాక్రమశాలి, మిక్కిలి ఉత్సాహము గలవాడు, ధైర్యము నందు మేరుపర్వతమువంటివాడు, రవంతయైనను జంకుగొంకులు లేకుండ యుద్ధభూమియందు శౌర్యముతో తనచేతనయినంత వఱకు పోరాడి మృత్యువును బొందెను. పరలోక సుఖమును గోరెడు పురుషులు గొప్ప శౌర్యముతో పోరాడి యుద్ధములో మృతిచెందుదురు. క్షాత్రధర్మమున యుద్ధమున సంహరింపబడువారి కొఱకై యేడ్చుట న్యాయమా? మూడు లోకములను వ్యథపెట్టెను. సాటిలేని బలము గలవాడై యుద్ధము నందు దేవతల నోడించెను. వీరస్వర్గము నలంకరించెను. విభీషణా! ఇట్టి శూరునకై దుఃఖింపదగునా? ఎప్పుడైనా యుద్ధములందిట్టివాడే జయించునని నియమము కలదా? తాను విరోధులను గెలుచును. విరోధులచే తాను చచ్చును. గెలుపోటములను ఎవ్వడు చెప్పగలడు. ఇది క్షత్రియసమ్మతము. పూర్వము నుండియు రాజులకనుసరింపదగినది. ఇది క్షత్రియునకు తగిన గతి. యుద్ధమున శరీరమును వదలిన వానికై ఎందును కన్నుల నీరు కార్పరాదు. ఇది నిశ్చయము చేసికొన్నవాడవై నీ మనస్సునందు తత్వార్థమును నిలిపి దుఃఖించుటను మానుము. తరువాతి కార్యమును నెరవేర్ప త్వరపడుమనగా విభీషణుడు

మిక్కిలి శోకముతో ఇట్లనెను. రామచంద్రా! ఈతడు దేవతల సమూహముతో గూడినవాడై ఇంద్రుడు తనతో తలపడగా వెనుదీయక లోకములెరుగునట్లుతని యహంకారమును రూపుమాపెను. (రావణునకు తండ్రి బ్రాహ్మణుడైనను తల్లి రాక్షసి. భార్య దానవి. కావున రావణుడు క్షత్రియుడు. బ్రాహ్మణుడు కాడు.) వీరశ్రేష్ఠా! మిక్కిలి భుజబలముచే నిన్ను దాకి సాగరము చెలియలికట్టను దాకి చెడు విధముగా యుద్ధమునందు నేడు భంగము చెందెను. ఎన్నియో మేలైన దానములను ఇచ్చినవాడు. గురువులను దైవములను గొలిచినవాడు. అఖిలమైన సుఖములను అనుభవించినవాడు. ఆశ్రయించినవారిని రక్షకుడై అలరినవాడు. స్నేహితులకు సంతోషముతో అర్థముల నిచ్చినవాడు. వైరులను బాధించి మించినాడు. అన్నివేళలందును అగ్నిహోత్రములందు హోమములు చేసినవాడు. చాలా కాలము తపస్సులు చేసి ఫలితములందినవాడు. వేదవేదాంత విధుడై ప్రకాశించినవాడు. కర్మలు చేయుటయందు నేర్పరి యని కీర్తినందినవాడు. ఈతనికి ఉత్తరక్రియలు చేయుట కాజ్ఞయిచ్చెదవా? రామా! యనగా దయగల రాముడిట్లనెను. విరోధము విరోధి మరణముతో దీరును. మన పని నేరవేరినది. తరువాతి కార్యములను, సంస్కారములు మొదలగు వానిని నిర్వహింపుము. చూడగా ఇతడు నీకెట్టివాడో నాకును అట్టివాడే సుమా.

★★★



# నూట పదమూడవ సర్గము

**రావణుని భార్యలు రావణుని జూచి విలపించుట:**

అని చెప్పుచుండగా రాఘవుని వాడి బాణములచే దేవతావిరోధియైన రావణుని మరణమును విని రావణుని భార్యలు దుఃఖించుచు అంతఃపురమును వీడి అధికమైన ఆర్తితో విడిపోయిన జడలు పూలదండలతో గూడి వెన్నులు మీదను ప్రక్కలను వ్రేలాడుచుండగా, దపి వానవలె కన్నుల నుండి కన్నీటి ప్రవాహములచే జారి వ్రేలాడుచున్న పైటలు తడియుచుండగా, చేతులచే మోదుకొనుచుండుటచే తెగిన హారముల రత్నములు నేల రాలుచుండగా, కన్నీరు కప్పుటచే కన్నులు కనబడక కటి భారముచే కాళ్లు తడబడుచుండగా, శరీరము తూలిపోవుచుండగా నేల దొర్లుచు నెత్తిమోదుకొనుచు కంగారుపడుచు. అధికమైన శోకముచే దూడచచ్చిన గోవుల విధముగా అపుడు భర్తను చూడవచ్చిరి. ఉత్తర ద్వారమును గాచియున్న రాక్షస శ్రేష్ఠులు తమ వెంటరాగా భర్తను వెదకికొనుచు రక్తముతో మొండెములతో భయంకరముగా నున్న ఘోరమైన యుద్ధభూమి కందఱును వచ్చిరి. హా! రాజనందనా! హా జీవితేశ్వరా! హా ప్రాణనాధా! హా నా అధిపతీ! హా నాధా! హా నాధా! హా పతీ! యనుచు కన్నీరు నిండిన పద్మములవంటి కనులు గలవారై ప్రాణేశ దుఃఖమున మునిగినవారై ఆ రావణుని భార్యలు మగ ఏనుగు చంపబడగా ఏడ్చు ఆడేనుగులవలె అరచుచు వెదకి గొప్ప శరీరముగలవాడును, కాటుక కొండవంటి వాడును, యుద్ధరంగ ధూళిలోపడియున్నవాడును అగు ప్రాణనాధుని చూచి తెగగొట్టబడిన వనలతలవలె పైన బడి తలలు బాదుకొనుచు అందఱును అనేక విధములయిన ధ్వనులు పుట్టునట్లు విలపించిరి. ఒక గౌరవపూర్వకముగా కౌగిట జేర్చి తనకతనితో గల చనువు నంతను తలచుకొని యేడ్చెను. ఒకతె పాదములను ప్రేమతో కౌగిలించి తన్నతడు ఏలిన విధమును తలచి యేడ్చెను. ఒకతె కంఠమును కౌగిలించుకొని తనను గారవించు విధమును పనవి యేడ్చెను. ఒకతె భర్తను జూచి చేతులు పైకెత్తి ప్రాణేశ్వరా యని నేలపై పొరలి యేడ్చెను. ఒకతె మూర్ఛనొందెను. ముమ్మరమైన శోకముతో ఒక ముగ్ధ మాటాడలేకపోయెను. తన తొడపై తన నాధుని తలను జేర్చి చూచుచు కన్నీటితో అతని ముఖమును ముంచి వేసెను. (రావణుడు

యుద్ధమునందు ఒంటి తలవాడు) నేలమీద పడియును రావణుని ఆ కాంతలు చూచి చూచి మిక్కిలి భరింపరాని దుఃఖముచే నిండిన మనస్సులు గలవారై అతని గుణగణములను మనస్సులందు తలంచు కొనుచు ఇట్లు వాపోవదొడగిరి. ఏ మహాబలవంతుని యుద్ధమున నెదిరించి ఇంద్రుడు దీనుడై అభిమానమును కోలుపోయెనో, ఏ మహావీరుని నెదిరించి యముడు భయముతో దాగుకొనెనో, ఏ శూరశ్రేష్ఠుడు శివుని మిత్రుడైన కుబేరుని ఓడించి తన గొప్పధనము వెలయునట్లు పుష్పకవిమానమును హరించెనో, ఎవ్వని పేరు చెప్పిన ఋషులు, గంధర్వులు, తలపైకెత్తుటకు భయపడువారలో, ఎవని పేరు ఎల్ల దేవతలకును గుండెగాలమో అట్టి పౌరుషవంతులలో శ్రేష్ఠుడు, అట్టి బాహుబలశాలి అక్కటా! నేడిట్లు ప్రాణములు పోయి తెగిపడెనే. రాక్షససంఘములకు వెఱవడు, దేవతలకు జంకడు. సర్పశ్రేష్ఠులకు అదరడు అట్టి పరమ సాహసునకు, భయమునే యెఱుగని వానికి మానవుని వలన నేడు భయము కలిగినది గదా. దానవులచేతను, దేవతలచేతను, అసురులచేతను చంపబడని మిక్కిలి శౌర్యవంతుడవగు నీవు కాళ్లచే నడచివచ్చు మానవునిచే యుద్ధమున అల్పుని వలె చంపబడితివా? స్నేహితులు చెప్పిన మాటలను వినవైతివి. నీ మేలుగోరు పెద్దలు చెప్పిన మాటలను వినకపోతివి. చావు కొఱకే జనకరాజపుత్రిని దెచ్చితివి. దానిచే అసుర సంఘములు నశించెను. నీ హితమును గోరునట్టి నీతియందు నేర్పరియైన నీ సోదరుడు విభీషణుడు ఇంతవఱకు వచ్చునని యూరకే నీ చెవులు నిండునట్లుగా చెప్పలేదా? కాదని ధిక్కరించితివి. అట్టివానిని కాఱులు పల్కితివి. ఇప్పుడీ రాక్షస సంఘములును, నీవును, మేమును ఇందఱమును ఒక్కమారుగా కూలితిమి. ఆ సీతను నీవు రామునకు స్నేహముతో ఇచ్చియున్నచో నీ సోదరుడు సంతోషించి యుండును. రఘురాముడు నీకు హితము కోరువాడయియుండును. మాకీ తలవ్రాతయు, ప్రాణధనహీనతయు తప్పియుండును. విరోధి సమూహముల ప్రయత్నములన్నియు వృధాయై యుండెడివి. రాక్షస సమూహము సమూలముగా నశింపకుండెడిది గదా. పాపపు మనస్సుతో సీతను చేపట్టదలచి పట్టుపట్టుటచేతనే గదా ఈ పట్టణము నందలి వారును, మేమును, నీవును ఈ విధముగా ముగ్గురమును పాడగుట సంభవించినది. ఓ పతీ! నీవు కాముకుడవు గావు. కార్యము పట్ల నీవు స్వతంత్రుడవును కావు. దైవమే సర్వమును జరిగించును. దైవముచే గొట్టబడినవానిని ఇంకేదియయినను వధించగలదు. వానరసంఘములకును, రాక్షస కోట్లకును, మఱియు నీకును వినాశన మిట్లుచేకూరుటకు కారణము రాజేంద్రా! దైవమే సుమా. ఓ ప్రఖ్యాతి

చెందిన బలము గలవాడా! ధనముచేనైనను, కామము బలముచేనైనను, మిగుల దేహబలము చేనైనను, ఆజ్ఞాబలముచేనైనను బలవంతమైన దైవవిధిని త్రిప్పదరమా? అని ఈ విధముగా శోకముచే కలత చెందిన మనస్సులతో, కన్నీరు కారుచుండగా రావణుని భార్యలందఱు గొఱ్ఱెలో యనునట్లు పనవి పనవి యేడ్చుచుండగా వారలందఱిలో

★★★



# నూట పదునాల్గవ సర్గము

## మండోదరీ విలాపము:

పెద్ద భార్యయైన మండోదరియను పేరు గల స్త్రీ, రావణునకు ప్రియమైనది రఘువంశ దీపకునిచే సంహరింపబడిన భర్తను చూచుచు, దుఃఖమును భరింపజాలక ఇట్లు పలవరించెను. అక్కటా! మహానుభావా! కుబేరసోదరా! నీవించుక కోపించినచో ఇంద్రుడు వికలత్వమును పొందును. దేవతలును, బ్రాహ్మణులును తికమకపడి దిక్కులు బట్టి పారిపోయెదరు. అట్టి నీవు అయ్యో! ఒక మానవమాత్రునిచే చచ్చుట కోర్చితివి. ఇంతగా సిగ్గువిడిచితివా? మూడు లోకములను జయించితివి. ఎల్లచోట్ల గల ఉత్తమలక్ష్మిని తెచ్చితివి. పేరు ప్రఖ్యాతులను పొందితివి. అట్టి నీవు అడవి మనిషి చేత తుదకు చంపబడితివా? నాధా! మనుష్యులు దాటరానిదగు ఈ సముద్రమధ్యమున నివసించువాడవును, కామరూపముతో చరించువాడవును అగు నిన్ను మనుష్యుడొక్కడు సంహరించెనన్నచో రాక్షస శ్రేష్ఠా! ఇది ఏమి న్యాయమో చెప్పుము. నేర్పుతో సమస్తమైన అస్త్రశస్త్రములను పూర్తిగా దెలిసిన నిన్ను రథముపై నున్నవానిని యుద్ధము నందు రాముడు చంపుటను నేను నమ్మలేకున్నాను సుమా! ఇంద్రవిరోధీ! వీరత్వములో జన్మస్థానము నందు సోదరయుతుడగు ఖరుని రాక్షసులందఱితో గూడ సంహరించుటను విన్నచో రాముడు నరమాత్రుడు గాడని నాకు తోచుచున్నది. దేవతలకును దానవులకును ప్రవేశింపరానిది లంక. దానిని బలముచే వాయుపుత్రుడు ప్రవేశించెను. అప్పుడే నేను చేటు సంభవించునని పరితాపమును జెందితిని. పర్వత కోట్లచే సముద్రమున వానరులు కట్టకట్టినప్పుడే ఓ ఇంద్రవిరోధీ! రాముడు నరమాత్రుడు గాడని నమ్మితిని సుమా. ఆ యముడే తాను స్వయముగా ఈ భూభర్త రూపమును దాల్చి నిన్ను జంపుటకు ఊహింపరాని మాయను సృష్టించి యుండవచ్చునేమో నా ప్రాణేశా! కాకున్నచో వ్రతాసుర విరోధియే నిన్ను నశింపజేసెనో! ఆ స్వర్గాధి పతికిట్టి మాయలు గలవా? ఆ స్వర్గాధిపతికి ఏ విధముగా నిన్ను జూడగల శక్తి ఎచ్చట నుండి వచ్చెను? కావున నిక్కముగా రాముడు మహాయోగి. ఆది మధ్యాంతరములు లేని సనాతనుడు.

పరమాత్మ, పరాత్పరుడు, మహత్తులకు పరమమహత్తు. పరబ్రహ్మ. శ్రీవత్సమను పుట్టుమచ్చ వక్షస్థలమున గల విష్ణుమూర్తి. శ్రీకి నిత్యనివాసుడు. శంఖచక్రగదాది సాధనములు గలవాడు. నశింపులేనివాడు. ధ్రువుడు. జయింపరానివాడు. సత్యమైన పరాక్రమము గలిగిన విష్ణువే భూమిపై మనుష్యశరీరమును దాల్చి వానరులుగా అవతరించిన దేవతలతో జగత్తునకు మేలు గలిగించు కోరికతో యుద్ధమున రాక్షస సమూహములతో గూడిన నిన్ను మృతి నొందించెను. తొలుత ఇంద్రియములను గెలిచి శౌర్యముతో మూడు లోకములను బాధించితివి. ఆ ఇంద్రియములే పగ మనస్సునందుంచి ఓ ఇంద్రవిరోధీ నిన్నిపుడు తిరిగి గెలిచినవయ్యెను. నేను రఘురామునితో విరోధము మానుమని చెప్పలేదా? నీవా మాటలను గ్రహించితివా? ఆ ఫలమే ఇప్పుడు దాపురించినది. నీ గొప్పతనమును, ప్రాణమును, ప్రేమగల చుట్టములును, సర్వసంపదలును వేగముగా నశించుటకే ఏ కారణము లేకుండగనే ఆ భూపుత్రిని కోరితివి. నీవు మతిలేని వాడవై చంద్రుని సతియైన రోహిణికంటెను, అరుంధతి కంటెను హెచ్చైన జానకిని పతివ్రతను, మిక్కిలి గౌరవింపదగినదానిని అవమానించితివి. ఇది బుద్ధిమంతులు వెళ్లెడు మంచిమార్గమేనా? భూమికే భూమియైన భర్తయందనురాగము గల సీత లక్ష్మికే లక్ష్మియైన స్త్రీ. ఎన్నరాని సుందరమైన అవయములు గలది. అఖిల శుభములకు పుట్టినిల్లు. ఎచ్చటనో అడవిలో ఎవ్వరును లేనిచోట సంచరించుదానిని వంచనచేసి మొఱ్ఱోయని మొఱపెట్టుచుండగా ఓ ఆత్మదూషణా! అట్లు దొంగలించితివి గాని ఆ స్త్రీ వలన నేమి సౌఖ్యమును పొందితివి. ఆ మహానుభావురాలైన జానకి యొక్క పాతివ్రత్యము తపము బలముచే నీవు కాల్చబడితివి. ఆ సీతను ముట్టినప్పుడే భస్మమై పోని నిన్ను జూచి అగ్ని, దేవతలు, ఇంద్రుడు భయపడిరి. పాపమును చేయువాడు పాపఫలము కాలముచే పండినప్పుడు అనుభవించును. ఓ రాక్షసశ్రేష్ఠా అది త్రోసివేసినను పోదు ఇది నిక్కము. శుభములు చేయువానికి శుభములే కలుగును. పాపము చేసినచో పాపఫలము అనుభవించక తప్పదు. పుణ్యము లందిష్టముగల విభీషణుని సుఖము పొందెను. పాపమునందు ప్రవర్తించిన నీకిట్టి పాటు కలిగెను. అందమైన రూపమున ఆ చంచలములైన కన్నులు గల సీతను మించిన సౌందర్యవంతులు నీ పంచనే గలరు కాని మన్మథుని వలలలో చిక్కన నీవది పరికించవైతివి. అయ్యో! కులము చేతగాని, గుణముచేతగాని, చక్కదనము చేతగాని నేర్పరితనము చేతగాని నాకన్న సీత యెక్కువదిగాదు, నాతో సరికాదు. మోహము చెందిన మనస్సు గలవాడా! తెలిసికొనలేక పోయితివి. నిందలేక బొందె పోదు అను సామెత

నిఖిలభూతములందు నిశ్చయమే. సీత యెచ్చట? నీ వెచ్చట? ఆ జానకి నెపమున ఎచ్చటినుండియో మృత్యువును దెచ్చుకొంటివి. (మండోదరి దానవ రాజకన్యకయే గాని బ్రాహ్మణ స్త్రీకాదు) ఆ సీతాసతి రామునితో ఎంతో సంతోషముతో రమింపగా, సుకృతములచే విడువబడిన నేను ఇంక విశాలమైన దుఃఖసముద్రమున మునిగి దుఃఖింపవలసి వచ్చెనుగదా. మందర పర్వత గుహలయందును గొప్పవైన కైలాసపర్వత ప్రదేశములందును, సుందరమైన మేరు పర్వత శిఖరములందును, యక్షులు సంచరించు వనములందును, మణులు పొదిగిన మందిరములలోను, దేవతా విమానములందును, తనివి తీర మాలికలను విలువ గల వస్త్రములను దాల్చి నీతో గూడి సంచరించుచు రమించెడి దానను. నేనావిధముగా కోరిన భోగములను అనుభవించి ఓ వీరుడా! నీవు చంపబడితివి గాన ఇట్లు మూలబడితిని. రాజుల యొక్క ఐశ్వర్యములు ఎందులకు? అవి క్షణభంగురములు. హా! మహారాజేంద్రా! గొప్ప సౌకుమార్యము గలదియు, అందమైన కనుబొమ్మలు గలదియు, ఉన్నతమైన నాసికగలదియు, అందమైన చర్మము గలదియు, చంద్రునితో సమానమైన కాంతియు, పద్మసదృశమైన లక్ష్మియు రవితుల్యమైన ప్రకాశమును గలిగి అందమైనదియు, కిరీటముతో ప్రకాశించునదియు, ప్రకాశవంతములైన కుండలములు గలదియు, గర్వముతో చలించు కన్నులు గలదియు, మనోహరములైన మాలికలు ధరించినదియు, నవ్వుతో సుందరమైనదియు అయిన ఆ యెట్టని నీ ముఖమా ఓ ప్రాణనాధా! రాముని బాణములచే తెగినదై మాంసము మెదడు రక్తములతో గూడి మిక్కిలి భయంకరమై రథములయొక్క దుమ్ములో కాంతి తొరగి యీ విధముగా నేలపై బడియున్నది రాక్షసరాజా! మందబుద్ధి నగుటచే ఎన్నడును మనస్సునందు తలంపనట్టి ఆపద యిప్పుడీ విధముగా వైధవ్యమును బొందితిని. అదియే నీకు ప్రాణహానిని కలిగించెను. తండ్రి దానవుల రాజట. ఘనబలుడగు రాక్షసరాజు భర్తయట. నా తనయుడు ఇంద్రుని జయించినవాడట. అని ఎల్లప్పుడును మిక్కిలి గర్వపడుచుండుదానను. నాధా! విఖ్యాతి గల బలము, ప్రావీణ్యముగలవారు, గర్వించిన శత్రువులను మర్ధించువారు, మనస్సులందు భయములేనివారు నావారలని ఎక్కువగా నమ్మితిని. ఇట్టి ప్రభావము గలిగిన దిట్టలు నీ పుత్రుడును నీవును మనుష్యునిచే చంపబడితిరి. ఇట్లు జరుగునని ఎన్నడును తలచకపోయితిమి. మీరు మనుష్యులచే చంపబడుట ఆశ్చర్యముగదా. ఇంద్రనీలమణుల స్నిగ్ధమైన నీలకాంతి గలిగి యెత్తైన పర్వతమువంటిదై బాహుపురుల చేతను, వైఢూర్యముల చేతను ముత్యాలహారములచేతను ప్రకాశమానమై విహారకేళిచే

మనోహరమై, యుద్ధరంగము వెలుగొందునదై మెరుపు తీగలతో గూడిన మేఘమాయనునట్లు శ్రేష్ఠమైన ఆభరణములచే ప్రకాశించుచు కాంతులను వెదజల్లుచు సుందరమైన నీ శరీరము అక్కటా బాణముల సమూహముల యొక్క వాడియైన ములుకుల సమూహములు గలదై ముట్టుటకైనను వీలులేక ఓ ప్రాణనాథా! కౌగిలించు భాగ్యమైన లేకున్నది. పలుగు ముండ్లవలె బాణములు భయంకరముగా మర్మస్థలములందు తగులగా తెగిన సిరల నుండి తెరిపి లేకుండ కారిన రక్తముచే శరీరము తడిసినదయ్యెను. కట్టా! వాసవుని సాధనమైన వజ్రాయుధమును మొక్కవోవ జేయునట్టి శరీరము మిక్కిలి పెద్దదైన రఘుశేఖరుని శరములచే వజ్రాయుధముచే నరుకబడిన పర్వతము వలె సంగరమున నేలగూలెనా? నిజముగా ఇది కలయే. మృత్యువునకు మృత్యువై హెచ్చైన నీవు మృత్యువునకు వశమౌదువా? రామవిభుడు నిన్ను జంపుట అసత్యము. సకల జగములందలి సర్వవస్తువులననుభవించు వాడవును, విరోధుల హృదయములు చెదరునట్లు పరుషముగా మాట్లాడువాడవును, సకలదిక్పాల సమూహములను జయించినవాడవును, అఖిల జగములకు భయము గలిగించువాడవును కైలాసపర్వతముతో గూడ శంకరుని పైకెత్తిన వాడవును, లంకాపురమును ద్వీపమునవలీలగా రక్షించువాడవును, మదించిన శత్రుసమూహములను ఒక్కమారుగా నిగ్రహించినవాడవును, దుష్టులైన నివాతకవచులను జయించినవాడవును, అనేక యజ్ఞములను ధ్వంసము చేసినవాడవును, స్వజనులైన రాక్షస సేనాపతులను రక్షించువాడవును, దానవేంద్రులను సంహరించినవాడవును, మహానియంతవును, లోకసమూహములను బాధించినవాడవును, ఇంద్రుని మదమణచిన వాడవును, పది కంఠములు గలవాడవును, నా ప్రాణభర్తవును, రక్షించువాడవును, యుద్ధమునందు మాయలు పన్నువాడవును, పరులస్త్రీల సమూహములను బాధించినవాడవును, స్వజనులను ఆనందింపజేయువాడవును, నాయొక్క శ్రేష్ఠమైన కోరికలను ప్రసాదించువాడవును, వీరుడవును, ఉత్తమమైన శాస్త్రములను, వేదసమూహములను తెలిసిన వాడవును, సద్ధర్మమార్గవిధి మర్యాదలను ఛేదించిన వాడవును, రాక్షసాదులను ఛేదించినవాడవును, దేవతల, మానవుల స్త్రీలను విశేషముగా హరించినవాడవును, నాప్రాణేశ్వరుడవును అగు నిన్ను రాముని వాడి బాణములచే సంహరింపబడిన వానినిగా జూచియు మరణింపక నా శరీరమున ప్రాణము ధరించి యుండుటచే ఓ దానవేశ్వరా! ఇంక నా బ్రదుకు శాశ్వతమే. మెత్తని హంసతూలికా తల్పములందు శరీరమును వ్రాల్చి హాయిగా నిదురించు నీవు ఓ రమణా! ధూళిచే నెట్టనైన

ఈ భూమియందు ఏమి సుఖమున్నదని తలంచి పరుండబూనితివి. సౌమిత్రి అస్త్రములచే సంగ్రామమందు ఇంద్రజిత్తు చచ్చుట విని నేను భూమిపై చెడితి ననుకొంటిని. నీ మరణముచే నేడు బూడిదయైతిని సుమా నాధా! చుట్టములు లేరని నాకు చింతపుట్టలేదు. అధికమైన భోగములనిచ్చు నిన్ను విడిచి శాశ్వత సంవత్సరములు దుఃఖమునెట్లు సహింతును? నేను నీ సహధర్మచారిణిని గానా? నేనిట్లు దుఃఖించుచుండగా కడుదూరముగా పోరానిచోటునకు వెళ్లుట తగియున్నదా? నిన్ను విడచి నేను బ్రతుకగలనా? దీనురాలినై భరింపరాని వ్యథచే నిట్లు విలపించుచున్న నన్ను విడిచివెళ్లుట న్యాయమా! ఏడువకే కాంతా! యని ప్రేమతో ఒక్కమాట యైనను చెప్పరాదా! సుకుమారమైన నల్లని దేహము గలవాడా! మేలిముసుగును విడిచి కాలినడకతో నీపట్ట మహిషినైన నేను పురము విడిచి యిట్లు వచ్చుటను చూచి కోపము చెందనేమి రాక్షసేంద్రా! ఇందఱు నీ ప్రియురాండ్రు ముసుగులు విడిచి సిగ్గులేకుండగా ఈ విధముగా రాగా ఇంతయైనను కోపగించుకొనవేల? నీవు లాలించువారైన జనులును, వేడుకగా నీతో విహరించువారలును నాధా! నీచెంత నుండి యేడ్చుచుండగా లాలింపవు ఊరడింపవు. హృదయేశా! నీకిట్టి కఠిన బుద్ధి తగియున్నదా? పరమపాతివ్రత్యముచే ఉత్తమశీలము గలవారును, కులపాలికలును, ధర్మపరాయణలును శ్రేష్ఠమైన వృద్ధుల శుశ్రూష చేయు మనస్సు గలవారును అయిన స్త్రీలనెందఱినో నీవు విధవలనుగా చేసితివి. ఆ స్త్రీలు కోపముతో దుఃఖముతో కఠినమైన విధముగా తిట్టిరి. వారి శాపము తగిలి విరోధిచే చెడితివి. వారలెట్లు తిట్టిరో ఆ విధముగా జరిగినది. పరమసాధ్వులైన స్త్రీల కన్నీరు వారి మనస్సులను నొప్పించినవారి చేటునకు గాక భూమిమీద పడవు అనులోక ప్రవాదము నీయందు సత్యమయ్యెను గదా. జగతిలో ప్రాణనాధా! శూరుడవై యుద్ధము లందు భుజశౌర్యము చేత నిఖిలజగత్తును గెలిచితివే అయ్యో! ఓ శూరమానీ! పిరికివాని వలె స్త్రీని దొంగిలించుట నీచత్వముగాదా? లేడి యను నెపముతో ఆశ్రమము నుండి దాశరథిని దూరముగా వెళ్లునట్లు చేసి జానకిని తెచ్చితివిగదా! మానధనా! ఇది పిరికితనమునకు గుర్తుకాదా! భయంకరమైన సంగరము లందైనను నీవు పిరికి కావని సత్యముగా నేనెఱుగుదును. సాగసవంతుడా! అట్టి నీవిట్లు చేయుచుండగా నా దౌర్భాగ్యము పండిన లక్షణముగా పరిణమించినది. త్రికాలవేదియైన నామరది నీవు సీతను తెచ్చుటను చూచి నిట్టూర్పు విడిచి సత్యభాషి, శుభ చరిత్రుడు దానిచే రాక్షస సంఘములకు చేటు కలుగునని చెప్పెను. కామక్రోధములచేతనే ఈ విధముగా జరిగినది, నీవే

దీనికింతకును మూలము. రాక్షస సంఘములను దిక్కులేని వారినిగా జేసితివి కదా. నీవు బలపరాక్రమముచే నిఖిల జగములందును ప్రఖ్యాతి చెందినవాడవు. నీకై దుఃఖించుట తగదనియు నేనెఱుగుదును కాని ఆడుదానను గనుక నా బుద్ధి దుఃఖసముద్రమున మునిగిపోయినది. చెడో మంచియో చేసి నీ గతికి నీవు వెళ్లితివి. నేనన్ననో నీ సంయోగము తొలగిన కారణమున నాగతి ఏమి? అనుచు నాకై విచారించెదను నాథా! (ఇది సత్యము. లోకమున చచ్చినవారికై ఏడ్చువారు లేదు. తమకు కలిగిన ధనధాన్యసుఖ సంతోషాదినష్టములకై తమకై ఏడ్తురు). వీరశ్రేష్ఠా! నీ హితులు చెప్పు హిత వాక్యములు పెడ చెవిని బెట్టితివి. మహితశౌర్యా! శుభమును చెప్పిన సోదరులకు పెడమొగము పెట్టితివి. నీ పిన్న తమ్ముడు హేతుబద్ధముగను, నీతియుక్తముగను శ్రేయస్కరముగాను తిన్నని మాటలను ఎన్నియో మారులు చెప్పలేదా! వానిని చెవియొగ్గి వింటివా? కొఱత లేకుండ మారీచుడును, కుంభకర్ణుడును నా తండ్రియును అప్పుడే శ్రద్ధతో నీ చెవులందు కూరిపోయలేదా? వారి పల్కులను బలగర్వముచే వినవైతివి. దానిచే ఈ ఫలితము కలిగినది. నల్లని మేఘము వంటిదియు, బంగారు వస్త్రములు గలదియు అగు శరీరము అంతయు నెత్తుటిలో తడిసి యుండగా భూమిపై నిద్రించు విధముగా పరుండి దైన్యముతో ఏడ్చుచున్న నాతో మాట్లాడవేల? చెప్పుము. సాహసవంతుడును, వీర్యవంతుడును, యుద్ధములందు విజయమును పొందినవాడును, శత్రువ్యూహములను ఛేదించువాడును, అయిన మాల్యవంతుని దౌహిత్రుడా! నన్నేల చూడదలపవు? లే లెమ్ము. ఈ లంకకు కొత్త పరాభవము కలిగెను. ఇప్పుడు సూర్యకిరణములు ఎల్లెడలను చాలా అధికముగా ప్రవేశించెను. ఇది నీకు సహింపదగునా? సూర్యునితో సమానమైన కాంతి గలదై సర్వశత్రుసమూహములను జయించినదై బంగారు భూషణములతో నొప్పినదై, ఎల్లప్పుడు పుష్పములచే అర్చింపబడినదై భయంకరమై, ఇంద్రునకు వజ్రాయుధము వలె నీ ప్రధానమై యొప్పు ప్రకాశవంతమైన పరిఘాయుధము కూడా వేయిముక్కలై చెడెను గదా. ఏమీ ప్రియురాలిని వలె యుద్ధభూమిని కౌగిలించుకొని నాతో ఏమియును మాటలాడక ఇష్టములేని స్త్రీని వలె చూచుట నీకు భావ్యమా? చెప్పుమా. ఎంత గట్టి హృదయమిది ఛీఛీ రణమందు సంహరింపబడిన నిన్ను చూచియు పట్టని వేయి ముక్కలుగా పగులదు గదా! కట్టా! అని స్నేహాతిశయముచే కన్నుల నీరు గారుచుండగా మనసు నిలుపలేక మయుని పుత్రిక తనను మూర్ఛ ముంచి వేయగా సంధ్యా సమయమున రక్తవర్ణమయిన మబ్బునందు వెలుగు మెరుపు తీగవలె రాక్షసనాధుని హృదయమున వ్రాలెను. సవతులు హా! యనుచు ఆ

సాధ్వీమణి చుట్టును జేరి అధికమైన శోకభారమువలన మునుగుచు ఓ కాంతా! రాజ్యలక్ష్మియును, లోకముల స్థితిగతులను దశలపోకడలను బట్టి మారుచుండుటచే స్థిరములు కావని ఎఱుగవా? ఓ తొయ్యలీ! నీవు నిబ్బరమును పొంది మమ్ములను నోదార్పుము. అని పలుకుచున్న చెలులతో అయ్యో! యని ధారలుగా కన్నుల నుండి కారుచున్న కన్నీళ్లచే స్తనములు తడియుచుండగా మండోదరి తన పతిని పనవి పనవి యేడ్చుచుండగా అంతట రామభద్రుడు.

## విభీషణుడు శ్రీరామునితో రావణుడు సంస్కారార్హుడు కాదని చెప్పుట:

అయ్యా! విభీషణా! నీవీ స్త్రీలను దూరముగా బంపి వేగముగా నీ అన్నయ్యకు సంస్కారములను ప్రేమతో చేయుము అని చెప్పగా విభీషణుడు నెమ్మదిగా తన మనస్సునందాలోచించి లోకము యొక్క ధర్మవిధిని ఊహించి రాజుననుసరించుటకై (శ్రీరామ రావణులు విరోధులు. రావణ సంస్కారము గావించెదనని తానే ముందుగా పూర్వము చెప్పుటచే తనయందు శ్రీరామునకు సందేహము తోచునేమో యని ఆయన ఆజ్ఞను పొంది యిప్పుడిట్లు చెప్పుచున్నాడు) హితమొనర్చు శీలము గలవాడు రాముని కిట్లు సమాధానమును చెప్పెను. ధర్మపు నడవడులను తొలగ ద్రోసినవాడు, కరుణలేనివాడు, అసత్యావాది, కల్మషచిత్తుడు, పరకాంతలను పొందినవాడు, సోదరరూపము దాల్చిన పరమ విరోధి, సకలమైన చెడు పనుల యందాసక్తి గలవాడు, జగత్తునకు ఉపద్రవకారి, వీనికానేనిప్పుడు విధిహితముగా సంస్కారములు చేయవలసినది? నేనాపనిని చేయజాలను. అన్నగారైనందున పూజార్హుడైనను సంస్కారముల కర్హుడుగాడు. నేనాకార్యమును చేయకున్నచో ఎట్టివారలు నన్ను కఠినుడని తిట్టుదురో వారలే ఈ చెడ్డగుణమును విన్నచో నన్ను మెచ్చుకొందురయ్యా రాజా! అని చెప్పగా అతని మాటలు విని పరమప్రీతితో (పరమ + ప్రీతి, పరమ్ + అప్రీతి, సంస్కరింపనని చెప్పుటచే అప్రీతి) ధర్మజ్ఞులలో మేటియు, మాట్లాడుట యందు నేర్పుగలవాడును శ్రేష్ఠునితో ఇట్లనెను. నాకు ప్రీతికరమగు కార్యము నీకు చేయదగును. నీ మహిమ వలన గాదా నాకు జయము కలిగినది? (దీనివలన సందేహ భయనివృత్తి) కావున ఓ అసురేంద్రా! నీకు హితమును చెప్పుట నాకు నుచితమే. నేనును ఎఱుగుదును. అతడు ధర్మమునకేమియును జంకడు. అసత్యమాడుటకు వెఱవడు. ఆ రాక్షసేంద్రుడు నీతిలేనివాడు. అట్లైనను వీర్యవంతుడును శౌర్యశాలియు, తేజస్సు గలవాడును, యుద్ధమునందు ఇంద్రాదులచేతనైనను ఓడని

వాడును, లోకములను మొత్తుకొనునట్లు చేసినవాడును, పర్వతము వంటి ధీరుడును అయిన, ఈతడు సామాన్యుడా? విరోధి మరణించిన తరువాత విరోధము పోవును. మన కార్యములు తీరినవి. తరువాతి కార్యములయిన సంస్కారాదులను దీర్చుము. ఆలోచింపగా ఈతడు నీకెట్టివాడో నాకును అట్టివాడే సుమా. (ఇప్పుడు రావణుడు నీకు వలె నాకును సంస్కారార్హుడు కాన నీవు సంస్కరింపకుండిన నేనే సంస్కరింతునని భావము) ఓ శ్రేష్ఠుడా! పంక్తి గ్రీవుడు నీవలననే విధి విహితముగా సర్వక్రియలను అందుటకర్హుడు. పవిత్రమైన కీర్తి నీకు గల్గును. దీనిని మనస్సునందు తలంపుము.

## విభీషణుడు రావణునకు దహనాది క్రియలు చేయుట:

అని రాముడు చెప్పగా ఆమాటలను విని సంస్కారము చేయ ప్రయత్నించుచు చందనపు కఱ్ఱల గుట్టలచే చితిపేర్చి దానిపై దర్భలను వట్టివేళ్లను పరచి శాస్త్ర సమ్మతముగా మీద లేడిచర్మము గప్పి పశ్చిమవిధులను శ్రద్ధగా చేసి పితృమేధము నంతను విద్యుక్తముగా జేసి ఆ చితికి ఆగ్నేయ భాగమున వేదిని చేసి యధాస్థానమున అగ్ని నుంచి పృషదాజ్యముతో నిండిన స్రువమును పాదముల యొద్దవేసి, ఆ రాక్షసోత్తముని తొడల యొద్ద శకటమును వేగాముగా నుంచిరి. అరణియు, కొయ్యపాత్రలును, ఉత్తరారణియు, ఇతరమైన ముసలమును క్రమముగా ఆయాచోట్ల తగువిధముగా నిల్పి ఋషులచే దెల్పబడిన పద్ధతిగా మేధ్యపశువును చంపి చితియొద్ద హోమము చేసి నేతితో తడిపిన దర్భలను పరచి కన్నీళ్లు పారుచుండగా రావణుని పుష్పహారములతో గంధములతో అలంకరించి వస్త్రమును గప్పి సన్నిహితులందఱును చితిపై బొరుగులను చల్లిరి. అంతట దుఃఖముతో నిండిన మనస్సుతో విభీషణుడు అన్న చితికి అగ్నిని ముట్టించి తరువాత స్నానము చేసి తడి వస్త్రముతో గరిక పోచలతో గూడిన తిలలను నీళ్లను విడిచెను. ధీమంతుడైన విభీషణుడట్లు ఉదకదానము చేసి నమస్కరించుచు రావణుని భార్యలనోదార్చి పురమునకు బంపి మంచి మనస్సుతో వినయముతో గూడిన గమనముతో వెళ్లి శ్రీరామ విభుని సన్నిధిని నిలిచెను. రామచంద్రుడు వానరసైన్యముతోను, సౌమిత్రియు, సుగ్రీవుడును సేవించుచుండగా భీమబలుడైన వృత్రుని జంపిన ఇంద్రునివలె ప్రకాశించుచుండెను.

★★★

# నూట పదునైదవ సర్గము

## మాతలి శ్రీరామునిచే అనుజ్ఞాతుడై దివంబున కేగుట:

రావణుడు వధింపబడుటను, రాముని పరాక్రమమును రాక్షసులు వానరులు రణము చేసిన విధమును, సౌమిత్రి వీరత్వమును, అన్నదమ్ముల అనురాగవిధమును, సూర్యపుత్రుని యొక్క ఆలోచనమును, కథలుగా చెప్పుకొనుచు యుద్ధమును జూడవచ్చిన దానవులు దేవతలు తిరిగి వెళ్లిపోయిరి. సంతోషము హెచ్చుగా నుండ రాముడు మాతలిని ప్రేమతో పొగడి తిరిగి ఇంద్రుని యొద్దకు రథమును తీసికొని పోవుటకు అనుమతించెను. మాతలియు శ్రీరామునాజ్ఞను పొంది అట్లే రథమును తీసికొని పోయెను. అంతట రాముడు సూర్యపుత్రుని కౌగిలించుకొని, లక్ష్మణుడు తన ప్రేమను తెలియజేయగా, సర్వవానర సేనలు గొల్వగా తమ స్కంథావారమునకు వెళ్లి మిక్కిలి కీర్తి గలవాడును, దివ్యకాంతులతో ప్రకాశించు ఆకృతి గలవాడును, భవ్యమైన చరిత్రగలవాడును, సుమిత్రానందనుడును అగు లక్ష్మణుని సమీపమునున్న వానిని మృదువైన మాటలతో

## విభీషణ పట్టాభిషేకము:

దగ్గఱగా పిలిచి లక్ష్మణా! ఆలోచింపగా ఈ విభీషణుడు నాయందనురక్తుడు, భక్తిగలవాడు నాకు గొప్ప ఉపకారమును చేసెను. కాన లంకయందితనిని అందముగా పట్టాభిషిక్తుని జేయగోరెదను. ఇది నాకు గొప్ప ఇష్టమైన పని. కావున నీవు వేగముగా వెళ్లి దానిని నెరవేర్పు మనగా సంతోషముతో వేగముగా పట్టణమునకు వెళ్లి బంగారు కలశములతో వానర వీరులు సముద్రజలములను తెండని చెప్పగా వారలట్లే తీసికొని రాగా విభీషణుని నర్హమైన ఆసనమున నిల్పి ఆ కలశములలో నొకదానిని తాను తీసికొని రాక్షసుల మధ్యమందు మంత్రయుక్తముగా అభిషిక్తుని చేయగా అతడానందము నొంది ప్రజలను సంతోషము నందు దేల్చెను. మంత్రులందఱును సంతసింపగా రాముడు ప్రసాదించిన రాజ్యమును స్వీకరించి రాక్షసముఖ్యులిచ్చు అక్షతలను, ఉండ్రాళ్లను, పుష్పములను, పేలాలను గైకొని శ్రేష్ఠమైన వస్తువులను తీసికొని రామచంద్రుని జేరనేగి ప్రేమతో వానిని

శ్రీరామునికీయగా కృతకృత్యుడై శ్రీకలితుడైన ప్రియమిత్రుని జూచి ఆనందముచే పొంగి వానినన్నిటిని తీసికొని విభీషణుడు సంతోషించగా మెక్కవోని భక్తితో దగ్గరనున్న హనుమంతుని జూచి యిట్లనెను. వాయుపుత్రా! నీవిట్లొనరింపుము.

## శ్రీరాముడు హనుమంతుని సీతాదేవి యొద్దకు బంపుట:

హనుమా! నీవు విభీషణుని ఆజ్ఞను పొంది లంకకు వెళ్లి అందు రావణుని గృహమందున్న భూపుత్రిని జూచి నా విజయవార్తను చెప్పుము. సుగ్రీవుడును లక్ష్మణుడును నేనును క్షేమముగా నున్నామని చెప్పుము. ఇంద్రవిరోధి యగు రావణుని నేను జయించిన మాటను చెప్పి సీతను సంతోషింపజేసి ఆ జలజాక్షి చెప్పెడు సందేశమును తీసుకొనిరమ్ము పవిత్రుడా! అని చెప్పగా హనుమంతుడు రామాజ్ఞను తన శిరస్సు నందు ధరించి రాక్షసులందఱు తన నాదరించుచుండగా రావణుని గృహము నందు ప్రవేశించి సంతోషము లేక విచారించుచున్నదానిని.

★★★



# నూట పదునాఱవ సర్గము

## హనుమంతుడు సీతాదేవికి విజయవార్త తెలుపుట:

చంద్రుని విడిచిన రోహిణి వలె మనస్సున సుఖము లేనిదై కాంతి తగ్గి రాక్షసస్త్రీలచే చుట్టబడియున్న భూపుత్రిని వృక్షజాలము నందున్నదానిని చూచుచు వినయముతో అణగి మణిగి వెళ్లి తన పేరు చెప్పి భక్తితో సాష్టాంగముగా నమస్కరించి నిశ్చలమైన శరీరము గలవాడై నిలిచిన వాయుపుత్రుని జూచుచు అతడు చేసిన పనులను స్మరించుచు పరమానందముచే సీత మాట్లాడకయుండగా సీతయొక్క సౌమ్యమైన ముఖమును చూచి వానరశ్రేష్ఠుడిట్లు చెప్పసాగెను. అమ్మా! మైథిలీ! శ్రీరాముడు ముద్దు తమ్మునితోను, సూర్యపుత్రుని తోను, వానరసైన్యముతోను, రావణుని చిన్నతమ్మునితోను కుశలియై యున్నాడు. సీతాసాధ్వీమణీ! నీ హృదయనాధుడు విరోధులను గెలిచి విజయమును పొందినవాడై ప్రేమతో తన క్షేమవార్తను తల్లీ! నీతో చెప్పుమని పంపించెను. ఓ జానకీసతీ! విభీషణుడు సాయపడగా నీ భర్త వానరశ్రేష్ఠులతో శ్రీసౌమిత్రి నీతితో తాను యుద్ధమునందు దశకంఠుని వధించెను. అద్భుతమైన కార్యమును చేసిన మహాపరాక్రమశాలి నీ క్షేమము నడుగుచు చెప్పుమని నాతో చెప్పిన మాటలను చెవుల పండువుగా వినుము. నీకు ప్రియమును గలిగించునది చెప్పెదను దేవీ! వినుము. నీయందు నేను మిక్కిలి ప్రేమగలవాడను సుమా! తామరలవంటి కనులు గలదానా! నాయొక్క భాగ్యవశము చేత ఇంతవఱకును బ్రతికి యున్నావు. నా పరాక్రమముచే మనకు జయము గలిగినది. ధర్మజ్ఞురాలా! దుఃఖమును వదలి ఓ జనకతనయా! స్వస్థచిత్తవుకమ్ము. రావణుడు సంహరింపబడెను. లంకాపురము సర్వమును మన వశమున నున్నదని తలపుము. కన్నులను మాయకుండ ఓ జానకీ నీకీ నిర్బంధమును పోగొట్ట ప్రతిన చేసి సముద్రమునందు సేతువు నొకదానిని గట్టి చేసిన శపథమును తీర్చుకొనగలిగితిని. ఓ తియ్యబోడీ! మధురాకృతీ! ఓ పరమాణుమధ్యా! రావణునింట నున్నానని భయపడబోకుము. ఇప్పుడు లంక అంతయు సమస్త సంపదలును విభీషణుని అధీనమునన్నువి. ఓ భూపుత్రీ! నీ స్వగృహమున చరించు విధముగా మనస్సునందు విచారమును విడువుము. ఒక్క క్షణములో విభీషణుడు నిన్ను

చూచు కుతూహలముతో వచ్చుచున్నాడు. అని చెప్పగానే పూర్ణచంద్రుని బోలిన ముఖము గలిగిన సీత ఆ జయవార్తను విని దిగ్గున లేచి నిలిచి చేష్టలు లేనిదై ముని వలె నుండగా హనుమంతుడు సీతాసతీ! ఆలోచించెదవేల? ఏల నాతో మాటాడలేకున్నావు?

## సీతాదేవి హనుమంతుని ప్రశంసించుట:

అని యిట్లు హనుమంతుడడుగగా నియమవంతురాలైన సీత ప్రీతితో సంతోషముతో గద్గద కంఠముతో ఇట్లనెను. వానరనాథా! నేను మౌనము వహించిన కారణమును వినిపింతును వినుము. నా ప్రాణేశుని విజయమును చెప్పుచున్న ప్రియమైన నీ వాక్యములను విని పరవశించినదాననై ఒక నిమిషము మాట్లాడలేనైతిని. అంజనాపుత్రా! నాకు ప్రియమును చెప్పుచున్న గౌరవార్హునకు తగిన వాక్యములనేమి చెప్పుదునాయని యెంతయో యోచించితిని గాని ఒక్కటియు లేదు. తగిన వస్తువేదైన ఇచ్చెద నందునా అందుకు యోగ్యమైనది ఈ భూమియందేదియును లేదు. అనేక విధములైన మణివిశేషములు గాని, జగత్తు నందు గల వెండి గాని, బంగారు కొండగాని, లోకములన్నింటి ప్రభుత్వమైన గాని నిజముగా మాట చెప్పుటకైనను సాటి కాదు. (సర్వలోక ప్రభుడైన శ్రీరాముడు తన్ను ఆంజనేయునకు సమర్పించుకొనెను గాని అదియును చాలదని సీతభావము) అని సీత చెప్పగా హనుమంతుడు చేతులు జోడించి భర్త హితమునే కోరు పతివ్రతా! పావనీ! భర్త జయమును కోరుదానా! ఇట్టి స్నేహపూర్ణములైన మాటలకు నీవే తగినదానవమ్మా! నీ భర్తయొక్క విజయమును చెప్పిన వానికి ఇచ్చుట కర్హమైన వస్తువు నీ భూమియందు చూడనని ప్రేమతో చెప్పిన మాట అది స్నేహముతో నిండినదై, మిక్కిలి అర్థము గలదై అన్నివిధములైన దివ్యములైన శ్రేష్ఠమణుల సమూహముల కంటెను, ప్రఖ్యాతి చెందిన దేవలోక రాజ్యము కంటెను మిక్కిలి హెచ్చైనదిగదా. శత్రువులు నశించినవాడును, విజయమును పొందినవాడును సుఖముగా నున్నవాడును, అగు శ్రీరాముని జూచి దేవీ! దేవతా రాజ్యాదులకంటే అధికమైన గొప్పదనమును బొంది నేనును సంతోషించెదను. అని హనుమంతుడు పల్కగనే జనక రాజపుత్రి శుభతరములై మాటలతో కన్నుల ఆనందబాష్పములు చిందగా ఆ వానరశ్రేష్ఠునితో నిట్లనెను. అతిలక్షణ సంపన్నమైనదియు, అతి మాధుర్య గుణముచే అలంకరింపబడినదియు, సమ్మతమైనదియునగు మాటను అష్టాంగయుక్తమైన బుద్ధితో నీవే మాట్లాడనేర్తువు గదా. మహాత్మా! నీవు వాయువునకు పుత్రుడవు పరమధార్మికుడవు. ఓ అనఘా! గొప్పబలము, శౌర్యము, సత్వము, శ్రుతము,

కాంతి, పరాక్రమము, ధైర్యము, ఓర్పు, వినయము, ధృతి, మొదలగు గుణములతో కూడిన దక్షత మొదలుగా గల గుణములన్నియు నిన్ను ఆశ్రయించుటచే అధికమైన కాంతి సంపదను పొంది ప్రకాశించుచున్నవి.

## హనుమంతుడు రాక్షసస్త్రీలను జంప సీతాదేవి అనుమతిని వేడుట:

ఆ సీతాదేవి చెప్పిన మాటలను విని చేతులు రెండును జోడించి వినయము కనిపించగా ఆ ముగ్ధతో హనుమంతుడిట్లనెను. ఓ తల్లీ! ఈ రాక్షస స్త్రీలసంఘమును నీవమనుతించినచో నేను నాశనము చేసెదను. నీవు పతియే దైవమని భావించి మిక్కిలి దుఃఖముచే కుంగుచుండగా, దయలేక భయంకరమైన రూపములతో క్రూరమైన నడవడితో క్రోధముతో గూడిన చూపులతో క్రూరురాండ్రైన ఈ రాకాసులందఱు పూర్వము నిన్ను అదరించి బెదరించి కష్టపెట్టెడివారు. వారినందఱిని నేడు పాదములతోను, చేతులతోను, మోకాలితోను, ఎడమకాలితోను పిడికిళ్ల పోటులతోను చంపెదను. చెవులను త్రెంపువాడను. తలవెంద్రుకలను లాగి మొగములను ఱక్కి ఱక్కి ఎగిరి దూకి పడద్రోచి యీడ్చి పండ్లురాలగొట్టెదను. ఇట్టి వరమును నాకు దయచేయుము.

## సీతాదేవి హనుమంతునితో రాక్షసస్త్రీలను జంపరాదనుట:

ఓ సీతాదేవీ! నీ కపకారిణులైన ఈ పాపాత్మురాండ్రను క్రూరాత్మలను ఈ విధముగా చంపెదనని పలుకగా మంచి గుణములు గలదియు మిక్కిలి కీర్తి గలదియు నగు సీత ధర్మమార్గమున నడచునదై వాయుపుత్రునితో నిట్లనెను. ఓ హనుమా! ఒక రాజును ఆశ్రయించి బ్రతుకుచు ఆ రాజు ఆజ్ఞకు కట్టుబడి మిక్కిలి అణగి అతని శాసనమును సక్రమముగా నెరవేర్చు నీ దాసీజనుల మీద కోపగించుట నీకు తగునా? వినుము. నా దురదృష్టము చేతను, పూర్వము నేను చేసిన ఘోరపాపముచేతను, దుఃఖముల నిట్లను భవించితిని. తాను చేసిన కర్మమెందైనను తప్పుట కలదా? ఇది ఒక దశాకాలము సంభవించెను గాన అనుభవింతును గాక అని మనస్సునందు నిశ్చయించి ఓ హనుమా! వీరి బెదరింపులను నేను అబలనగుటచే విధి లేక భరించితిని. దేవతావిరోధి ఆజ్ఞచే వీరతనిదాసులు గాన నన్ను బెదరించిరి. వానరశ్రేష్ఠా! దశకంఠుడు చంపబడుట చేత ఇకమీదట నన్ను బెదరింతురా? పూర్వమొక పెద్దపులికి ఒక భల్లూకము అత్యున్నతమైన ధర్మముతో కూడినదై పొగడదగిన పురాణములందు చెప్పబడిన ఈ మంచి వాక్యమును

చెప్పినది. సజ్జనుడు తనకపకారము చేసిన మనుష్యునకు అపకారము చేయవలెనని మనస్సునందు తలపడు. ఈ నియతిని రక్షింపదగును. సజ్జనులు ఎందైనను మంచి నడవడియే భూషణముగా గలవారు గదా. వానరశ్రేష్ఠా! పుణ్యాత్ములందును, పాపాత్ములందును, వధింపదగినవారియందును సజ్జనులు కృపచూపవలయును. అపరాధము చేయని వాడొక్కడైనను గలడా? పాపములే చేయుచు, కామరూపులగుచు, లోకములను హింసించుటే ఆటగా గలవారై పొంగుచున్న రాక్షసులను కీడు చేయుట తగిన పని కాదు సుమా. అని చెప్పగా హనుమంతుడు ఆ సీతతో నిట్లనెను.

## సీతాదేవి శ్రీరాముని జూడగోరుట:

ఓ సీతాదేవి! మంచి కీర్తిగలిగిన నీవు రామునకు దగిన భార్యవు. (ఈ స్త్రీలు సీతకు శరణాగతి చేసిరి. అభయమిచ్చెను. శరణాగత రక్షణ విషయమున శ్రీరామవాక్యములు ఈమె వాక్యములు ఒక్క విధము. దీనిచే సీతయొక్క దయాళుత్వము, అపరాధ సహిష్ణుత్వము, ఘటకత్వము, చెప్పబడెను. శరణాగత రక్షాదీక్షను పరీక్షించుటకే ఈ వరమును హనమ కోరెను. శ్రీరాముడు నిర్దోషి కభయమిచ్చెను. సీత సదోషుల కభయమిచ్చెను) ఇంకనేను రాముని యొద్దకు వెళ్లెదను. నీవేమి బదులు చెప్పెదవని అడుగగా లేడికన్నుల వంటి కన్నులు గల సీత వాయుపుత్రా! నేను నా భర్తను చూడగోరుచున్నాను. అనగా హనుమంతుడిట్లనెను. ఓ సీతాసతీ! పూర్ణచంద్రుని వంటి ముఖము గలవాడును, విరోధులను సంహరించినవాడును, లక్ష్మణునితో గూడియున్నవాడును, దేవతలతో నున్న ఇంద్రునితో సమానుడును అయిన నీ భర్తను చూచెదవు గాక. అని సాక్షాత్తు లక్ష్మీదేవి యనదగిన తామరల వంటి కన్నులు గల సీతకు చెప్పి భక్తితో ప్రదక్షిణము చేసి రాముని జూచుటకై వాయుపుత్రుడు వేగముగా అతని సమీపమునకు వెళ్లెను.

★★★

# నూట పదునేడవ సర్గము

## సీతాదేవి సందేశమును హనుమ శ్రీరామునితో జెప్పుట:

అట్లు వెళ్లి మేటి విలుకాడగు రాముని సమీపించి వాక్చాతుర్యము గల ఆ వాయుపుత్రుడు ఇట్లు చెప్పెను. ఎవ్వతెకై మిక్కిలి అసాధ్యములైన కార్యములను గొప్ప శక్తితో చేసి వాని ఫలముగా లంకానాథుడైన రావణుని నాశనము నీవు చేసితివో అట్టి సీతను అధిక దుఃఖముతో నున్నదానిని చూడదగునయ్యా! శోకము చేత కలత చెందిన మనస్సు గలదై అధికముగా కన్నుల నీరుగారుచుండగా దుఃఖముచే బాధ నొందుచుండియు భూపుత్రి నీ విజయము చెవుల బడిన క్షణమునందే మిక్కిలి సంతోషము నొందెను. పూర్వపు నమ్మకము చేతనే జనకరాజపుత్రి నన్ను నమ్మి కృతార్థుడైన తామరరేకుల వంటి కన్నులు గల నా భర్తను లక్ష్మణునితో గూడియున్నవానిని చూడగోరుచున్నానని చెప్పెను.

## శ్రీరాముడు సీతాదేవిని తోడితేర విభీషణుని నియోగించుట:

అని హనుమంతుడు చెప్పగా పుణ్యాత్ములలో శ్రేష్ఠుడగు రామభద్రుడును కన్నులయందు నీరు నిండగా నేల వంక జూచుచు హుస్సని వెచ్చని నిట్టూర్పులను విడచుచు తన మనస్సు నందు చింతించి తన యొద్దనున్న మేఘము వంటి వాడగు విభీషణుని జూచి, ధర్మమునకాశ్రయమైనవాడా! వికారములు లేనివాడా! రాక్షసరాజా! భూపుత్రియైన సీతను దివ్యమైన మైపూతలతోను సకలాభరణములతోను అలకరింపజేసి శిరఃస్నానము చేయించి వేగముగా తీసికొనిరమ్ము. అని చెప్పగా విభీషణుడు వేగవేగముగా వెళ్లి దివ్యాంగములను ధరించి దివ్యమైన భూషణములను అలంకరించుకొని దేవీ! పల్లకి నెక్కుము. నిన్ను నీ భర్త చూడగోరెను. ఓ నియమము గల శీలవతీ! నీకు క్షేమము కలుగుగాక యని అంతఃపుర స్త్రీలచే సీతాదేవికి చెప్పించెను. ఆ మాటలు విని జానకి రాక్షసేంద్రా! నేను స్నానము చేయకుండగనే భర్తను చూడగోరెదనని పల్కెను. ఆమె యిట్లనగా విభీషణుడు ఇట్లు పల్కెను. అది నీ ప్రాణభర్త ఆజ్ఞ. రాజైన ప్రాణేశుడైన రాముడెట్లు చెప్పెనో ఆ విధముగా నీవు చేయుట అర్హమైన పద్ధతి గదా యనగా భర్తయే దైవముగా గలదియు, తన భర్తయందు భక్తి గల

శీలముగలదియు సాధ్వియు అగు భూపుత్రి అట్లేయని ఆ విధముగా చేసెను. అంత ఆమెకు స్నానము చేయించి భూషణ భూషితాంగిని జేసి దివ్యమైన వస్త్రములిచ్చి మెరుగులీనుచున్న వస్త్రమును మేలిముసుగుగా వేసి రాక్షసులచే రక్షింపబడుచున్న దివ్యమైన పల్లకి యందు జానకీదేవి నెక్కించి వేగముగా విభీషణుడు రామవిభుని సమీపమునకు తీసికొని వచ్చెను.

## సీతాదేవి రాకను శ్రీరామునకు విభీషణుడు తెల్పుట:

అట్లు జానకీదేవి వచ్చుట తెలిసియు ధ్యానమగ్నుడై యున్న దశరథపుత్రుని జూచి రాక్షసరాజు వినయముతో భూనాధా! సీతాదేవి వచ్చినదయ్యా అని చెప్పగా చాలా కాలము రాక్షసుని యింటినుండి అప్పుడచ్చటికి సీత వచ్చినదని వినగనే రామునికి హర్షము, దైన్యము, రోషము ఆవేశించెను. అంతట సవిమర్శముగా ఆలోచించుచు సంతోషము తొలగియున్న సరమాభర్తయైన విభీషణుని జూచి యిట్లనెను. నా విజయమును గోరు విభీషణా! వేగముగా సీతను నా చెంతకు తీసికొనిరమ్ము అని చెప్పగా రాముని మాటను విని రాక్షసరాజు అచ్చటనున్న జనులను దూరముగా తొలగింప ప్రయత్నించెను. వేగముగా కంచుకులును, పాగాలు ధరించినవారును పరుగెత్తి వచ్చి తొలగుడు పొండు పొండు దూరముగా వెళ్లుడు అని తొలగించుచు ఎలుగుబంట్లను, రాక్షసులను, వానరులను అదలింపగా వారలయొక్క పెద్ద ధ్వనులు ఆకాశ మార్గమున దాకెను. వానరులు మొదలగు వారలు తొలగుచుండగా వారి రొదలు వాయువుచే తిరుగుడువడు సముద్రధ్వని వలె నుండగా ఆ తొఱ్ఱు పడుచున్నవారిని జూచి దయాపరతచే కోపమును బూని

## శ్రీరాముడు విభీషణుని కోపించుట:

కోపముచే ఎఱ్ఱబడిన నేత్రములు గలవాడై చూపుల చేతనే కాల్చు విధముగా చుఱచుఱ చూచుచు భూపతి ఉత్తమ మేధ గల విభీషణునితో నిందాపూర్వకముగా నిట్లనెను. విభీషణా! ఏల నన్నిట్లు చులకన చేసి జనుల నీ విధముగా బాధించెదవు? ఇస్సీ! నీ ప్రయత్నమును చాలింపుము. చాలు చాలు వీరందఱు నాకు స్వజనులు సుమా. (భగవంతుడు తన్నవమానించిన సైచును గాని నిజభక్తపరాభవమును సహింపడు) స్త్రీలను రక్షించుటకు వస్త్రములును, ప్రాకారములును, సౌధములును, ఇట్టి రాజసత్కారములును, తెరలును, చాలవు స్త్రీలకు రక్షకమైనది శీలమే సుమా. ఓ సుమతీ! యుద్ధములందును, కష్టసమయములందును, దేశోపద్రవములందును, స్వయంవరమునందును, పెండ్లి

సమయమునను, యజ్ఞములందును స్త్రీలను జూచుట అకార్యమగునా? ఈసీత యుద్ధభూమియందున్నది. అధికమైన దుఃఖములను బొంది తపించుచున్నది. అంతేగాక నాయెదుట నుండగా బయట కనిపించినను దోషమేదియును లేదు సుమా.

## సీతాదేవి శ్రీరాముని సమీపమునకు వచ్చుట:

కాన విభీషణా! మిత్రులతో గలిసియున్న నన్ను జనకరాజపుత్రి చూచును గాక తోడ్కొనిరమ్ము అని చెప్పగా సందేహించుచు రాక్షసశ్రేష్ఠుడు సీతాదేవిని రాముని సమీపమునకు తోడ్కొని వచ్చెను. రాముని వాక్యములను విని సౌమిత్రియు, వాయుపుత్రుడైన హనుమంతుడును, సూర్యపుత్రుడైన సుగ్రీవుడును ఇదియేమోయని మనస్సులందెంతయో దుఃఖించిరి. రాముని మాట తీరును, అతని ముఖ చిహ్నములను చూచి సుగ్రీవుడు మొదలైనవారు భూపుత్రియందు రామునికి ప్రేమలేదనుచు తెలిసినవారై చింతించుచుండిరి. ఆ తామరలవంటి నేత్రములు గల సీతాదేవి సిగ్గుతో తన అవయవములను ముడుచుకొనుచు రాక్షసరాజు వెంట వచ్చి అందఱిలోను సౌమ్యమైన రాజచంద్రుని ముఖములను జూడగానే తనపై వస్త్రముతో ముఖమును గప్పుకొని సౌమ్యమైన ముఖము గలిగిన సీత రాముని దగ్గఱగా వచ్చి ఆ పతివ్రత బిగ్గరగా ప్రాణనాథా! యని ఆర్తిచే తూలుచు ఏడ్చెను. దీననతో నుండి తిరిగి యా పతివ్రత విశ్మయమును, సంతోషమును, ఎంతయో స్నేహమును మనస్సునందు కలిగి నిర్మలమైన పూర్ణచంద్రుని బోలిన ముఖము గల్గిన సీత చాలాకాలము నుండి చూడకుండిన తన నాధుని యొక్క ఉదయించుచున్న పూర్ణచంద్ర బింబము వంటి ముఖమును ప్రేమతో జూచెను.

★★★



# నూట పదునెనిమిదవ సర్గము

## శ్రీరాముడు సీతాదేవికి తన జయమును తెలియజేయుట:

అప్పుడు రాముడు తన ప్రక్కనే వినయముతో వంగిన తీగవంటి శరీరము గలదై నిలుచున్న సీతను జూచి హృదయము లోపలనున్న మిక్కిలి కోపముతో ఇట్లు పలుకసాగెను. యుద్ధమునందు క్షుద్రుడైన శత్రువు యొక్క పొగరణగించి చంపితిని. నిన్ను చేకొంటిని. మొక్కవోని శక్తితో ఏది చేయదగునో దానినంతను చేయగల్గితిని. నాయొక్క కోపము సార్థకమయ్యెను. శత్రువుల ధిక్కారమును తొలగించితిని. జగత్తునందు కీర్తిని బొందితిని. ఔద్ధత్యముతో పగవానిని, అవమానమును ఒక్కమాటే నశింపజేసితిని. నా శౌర్యమును జగత్తు తెలిసికొనెను. జానకీ! నా సమస్త శ్రమయు ఫలించెను. నేను చేసిన ప్రతిజ్ఞను వృధాకాకుండ చేసి స్వతంత్రుడనైతిని. అయ్యారే యనునట్లు నాతో సమానమైన రాజులలో తలనెత్త తిరుగజాలితిని. నేను లేని సమయమున నిన్నావిధముగా చపలచిత్తుడైన రాక్షసుడు దొంగిలించెను గదా. అది దైవము చేసిన దోషము. నావలన అది గొప్పనైన మానవశక్తిచే నశించినది. పరాభవము కలిగినప్పుడు మిక్కిలి శక్తిచే దాని నెదుర్కొన జాలకున్నచో పురుషార్థములున్నవా? సముద్రమును దాటుటయు, గొప్ప విరోధియైన రావణుని పురమగు లంకా నాశనమును అను వాయుపుత్రుని ప్రశంసింపదగిన పనులు ఓ సీతా! నేడుసఫలములయ్యెను సుమా. యుద్ధమునందు గొప్ప పరాక్రమమును, ఆలోచనములందు మేలు గలిగించు మంత్రాంగమును వెలయించిన వానరసంఘపతియగు సుగ్రీవుని శ్రమయు నేడు సఫలమైనది. దుష్టమైన నడవడిగల తోబుట్టిన వానిని వదలివేసి నా శరణు పొందినాడీ విభీషణుడు. ఈ భక్త శ్రేష్ఠుని శ్రమమంతయు ఇప్పుడు సఫలమయ్యెను. అని తన ప్రాణనాధుడు చెప్పుచుండగా లేడికూన కన్నులవంటి కన్నులు గల ఆ సీత కన్నులను కన్నీటి ప్రవాహములతో నింపగా చూచి రాముడు నెయ్యి పోయగా మండు అగ్ని హోత్రుని వలె క్రోధముతో వృద్ధినొందిన రూపముతో నున్న కనుబొమ్మల ముడితో భువన మోహినియైన జానకిని చక్కగా చూడకుండగా రాముడిట్లనెను. ఓ వనితా! విరోధులు చేసిన పరాభవమును తొలగింపగోరు పురుషుడు దేనిని ప్రఖ్యాతిగా చేయదగునో ఆ పనిని

భూజనులందఱు తెలిసికొనునట్లుగా శక్తితో చేయగంటిని. జీవలోకముల కన్నింటికి అపకారము చేయు రాక్షసులచేత పూర్వము సేవింపరానిదిగా చేయబడిన దక్షిణదిశను అగస్త్యుడు విముక్తి నొందించినట్లు శత్రువులచే బాధింపబడిన నిన్ను విముక్తురాలినిగా జేసితిని.

## శ్రీరాముడు సీతాదేవిని తానొల్లనని చెప్పుట:

స్నేహితుల సహాయముతో యుద్ధమునందు విరోధులను త్రుంచి నేను కష్టపడుట నీ కొఱకు గాదని నీ మనస్సునందిక్కడ తెలిసి కొందువుగాక. ఓ తొయ్యలీ! కుల గౌరవము గాచుకొనుట కొఱకును, నా శీలమును రక్షించుట కొఱకును, అపవాదును తొలిగించుకొనుట కొఱకును, కీర్తి నిలుపుట కొఱకును గొప్ప పోరాటములయందు కష్టపడితిని సుమా. వింటివా? జనులు శంకించునట్టి చరిత్ర గలదానవు ఓ పద్మాక్షీ! నీవు నా ప్రక్కన నిలువగా కళ్లకలక గలవాని ముందున్న పెద్ద దీపమువలె శత్రువు వంటి దానవైతివి సుమా. (దోషము దీపము నందు లేదు. అట్లే సీతయందు లేదు. కనులను కలక బాధించు నట్లు నేనపవాద భీతిచే బాధపడుచున్నానని భావము) ఓ నాతీ! నేననుజ్ఞ నిచ్చితిని. నీ కిష్టమైన విధముగా దిక్కుల సమూహములో ఎక్కడికైనను వేగముగా వెళ్లుము. నీతో నిజముగా నాకు పనిలేదు సుమా. ఉత్తమకులమున బుట్టినవాడు గొప్ప తేజస్సు గలవాడును అయిన ఎవడైనను ఇతరుని యింటియందున్న ఆ స్త్రీని తిరిగి ప్రేమగల మనస్సుతో ఎప్పుడైన పరిగ్రహించునా? చెప్పుము. ఆ దుష్టుడు కడుదోషపు చూపులతో నిన్ను జూచెను. నీవు వాని అంకమునుండి జారితివి. ఓ రాజకుమారీ! యిట్టి నిన్ను వంశము చేతను, శీలము చేతను శిష్టుడనని చెప్పుకొను నేను తిరిగి యెట్లు గ్రహింపగలను? మానహానికరమైన పాపకార్యమును రాముడెన్నడును చేయడు. కాన నాయొక్క కీర్తిని భూమియందు నిలబెట్టుకొనుటకై రావణుని వధించి సీతా! నిన్ను విడిపించితిని. యదార్థముగా నీపైన స్నేహముగాని, మోహము గాని మనస్సునందు లేవు సుమా. ఓ మగువా! నీకు సంతోషము కలిగించు విధముగా ఇక్కడనుండి ఎక్కడికైనను వెళ్లుము. నీకనుజ్ఞ నిచ్చితిని. ఓ అభిమానవతీ! మఱి మఱి చక్కగా ఆలోచించి స్పష్టమైన విధముగా చెప్పుచున్నాను. లక్ష్మణుని యొద్దగాని, భరతుని యొద్దగాని, వానర రాజునొద్దగాని, ఈ విభీషణుని యొద్దగాని నిలువుము. నీకు ఏది సుఖకరమో ఆ విధముగా జేయుము. ఓ భూపుత్రీ! దివ్యమైన సౌందర్యము గలదానవు మనస్సును దృష్టిని రంజింపజేయుదానవునై తనయింట

చిక్కియున్న యౌవనవతివగు నిన్ను చూచి రావణుడా చాలాకాలము ఓర్చియుండువాడు? అరటిబోదెలవంటి ఊరువులు గలదానా! వింటివా? కాన నిన్నునేనొల్లను. నీ యెడల నేను కాముకుడను గాను. నీ యిష్టము కొలదిగా వెళ్లుము. నిజముగా చెప్పుచున్నాను. అనగానే ప్రియమైన మాటలను వినదగినదియు, ప్రఖ్యాతి చెందిన శీలము గలదియునైన సీత ప్రియమైన మాటలకై యెదురు చూచుచుండగా తన ప్రియుడీవిధముగా అప్రియములను పల్కగా ఎంతోకాలము గడచిన తరువాత యిట్టి మాటలను వినుటచే మదపుటేనుగుచే త్రెంచబడిన అందుగు చెట్టువలె వణకి దుఃఖముచే తపించినదై బాష్పముల ధారలు గార్చెను.

★★★



# నూట పందొమ్మిదవ సర్గము

## శ్రీరాముని వాక్యములకు సీత దుఃఖించి సమాధానము చెప్పుట:

ఎన్నడును పూర్వము వినియైనను ఎఱుగని రోషపూరితములై కఠినములై ఘోరమైన మాటలను నిండు సభయందు తన నాధుడు ఈ విధముగా పలుకగా సిగ్గుచే తలవంచుకొని సుకుమారమైన శీలము గల ఆ సీత శరీరమును నిలుపలేక దారుణమైన మాటలనెడు బాణములచే కొట్టబడినదై ఆ ములుకులు మర్మములందు నాటి మఱి మఱీ కోయుచుండగా కన్నీటిని కాల్వలుగా కార్చుకొనుచు కన్నీటితో తడిసిన ముఖమును పయ్యెద కొంగుచే తుడుచుకొనుచు భర్తను జూచి ఆ యింతి తడబడుచు గద్గదమైన కంఠమునుండి వెలువడు సన్నని ధ్వనితో మెల్లగా ఇట్లనెను. క్షుద్రుడైన వాడు క్షుద్రురాలైన స్త్రీని మాటాడెడు విధముగా చెవులను జీల్చు పురషపు మాటలను ఓ శుభచరిత్రుడా! నా వంటి దానిని పల్కుట తగునా? నీవ దేమిగా నా శీలమునందు ఛిద్రమును సంశయించితివి? నీ హృదయ సీమ యందు నన్నటువంటి దానినిగా తలంపకుము. నా సచ్ఛీలముపై శపథము చేసెదను సుమా. నీతిలేని దుష్టురాండ్రగు జారిణులగు స్త్రీలను మనస్సునందుంచుకొని స్త్రీల జాతియంతయు అట్టిదేయని భావించు టెందులకు? నీ విదివఱకు నా శీలపరీక్ష చేసియున్నచో ఇట్టి అనుమానములను తగు విధముగా వీడుము. ఇటువంటి శంకలకు కారణము లేదు గదా. నేను శరీరము తెలియక తెలివిదప్పి పడియుండగా నా శరీరమునతడు ముట్టెను గాని నా సమ్మతితో గాదు. చూడగా ఈ విషయమున దైవమే దోషకారి. ఇది యదార్థముగదా నాధా! (ప్రపన్నుని ఆపత్కాలమున రక్షింపకున్న దోషము దైవముదే.) మనస్సు నా యధీనములోనిది. అది యెల్లప్పుడు నీయందే నిలిచెను. ఓ మానధనుడా! పరాధీనమగు శరీరము నందు ఓ ప్రాణేశ్వరా అల్పురాలనగు నేనేమి చేయగలను? మనస్సు లేకమై చిరకాలము కలిసియుంటిమి. వేడుకగా ఒక్కటియై తిరిగితిమి. నిన్ను గూడి పెరిగితిని. ఒకరియొద్ద నొకరికి ఇంతయైనను దాపరికము లేదు. ఇట్లుండియు నీవు నాయొక్క శీలమునే కనిపెట్టలేనిచో హృదయేశ్వరా! ఇంతవఱకు చెప్పకుండ ఏమిటికి దాచితివి. నన్ను వెదకుటకై ఆనాడు హనుమంతుని లంకకు పంపునప్పుడే ఏమిటికి నీవు నన్ను

విడువ వైతివి? అప్పుడే అతనితో నీవు విడిచినట్లు చెప్పియుండినచో ప్రాణము కూడా నన్ను విడిచియుండును గదా (నా ప్రయత్నము లేకయే ప్రాణములు తమంత తామే వెడలిపోయియుండును) నేనప్పుడే శరీరమును విడిచినచో నీకిప్పుడీ ప్రాణంతకమైన శ్రమయుండకపోవును గదా. నీ స్నేహితులకును అధికమైన కష్టము వ్యర్థము కాకుండెడిది కదా. ఆలస్యము చేయుటచే నీ స్నేహితులకును, నీకును, నాకును ఇంత శ్రమను కలిగించితివి చూచితివా? ఓ రాజా! కేవలము కోపము చేత కీడును మేలును ఆలోచింపలేక నీచ మానవుని వలె నా స్త్రీత్వమునే తలంచితివి. జనకుడు నిమిత్తముగా నేను భూమి నుండి పుట్టుటను, నా ప్రేమను, నా మంచి నడవడిని సద్వర్తనము రీతి నెరిగినవాడా! తలంపవైతివి గదా. ఏమందును. నీ చిన్నతనమున నేనును చిన్నదాననై యుండి నిన్ను వివాహమాడుట, నాటి నుండి నాథా! నిన్నే దైవముగా తలంచి నేను భక్తితో నుండుట, ఇద్దఱి మనస్సు లొక్కటిగా ఎప్పుడును కలసి మెలసి యొప్పుచుండుట, నీ కష్టసుఖములే నా కష్టసుఖములని అన్ని అవస్థల యందును నిన్ననుసరించి నేను దిరుగుచుండుట, నిర్మలమైన నా శీలమును నీవెఱుగనివా? నీరజాక్షా! ఏలనయ్యా! ఇప్పుడవి యన్నియును వెనుకకు నెట్టి శంకనొక్కదానినే పట్టితి వెందులకయ్యా?

**సీతాదేవి అగ్నిప్రవేశము చేయుట:**

అని డగ్గుత్తికతో పల్కుచు దుఃఖముతో నిండినదై దీనుడై మిక్కిలి చింతా సముద్రమున మునిగియున్న మఱిదిని చూచి ఆ పద్మాక్షి అనఘా! లక్ష్మణా! ఈ పెను శోకమునకు ఔషధమైన చితిని పేర్పించుము. ఇటువంటి భరింపరాని శాపముచే కొట్టబడిన దాననై ప్రాణములను నిల్పలేను సుమా. కాకుత్థ్సవంశశ్రేష్ఠుడా! పొగడబడిన గుణగణములను మెచ్చని భర్తచే నిండు సభలో విడువబడిన స్త్రీకి యోగ్యమైన గతికి అగ్నిలో ప్రవేశించి వెళ్లెదను. అని జనకరాజపుత్రి చెప్పగా దీనముగా లక్ష్మణుడు రామచంద్రుని ముఖమును జూచి ఆ రాజశ్రేష్ఠుని ఆకృతిచేత సూజింపబడిన అతని మనోభావమును తెలిసికొన్నవాడై ఆయన సమ్మతితో గొప్పదైన చితిని పేర్పించగా సీతాదేవియు తలవంచుకొనియున్న రఘువీరునకు ప్రదక్షిణము చేసి మెల్లగా నిర్మల గుణములు గల జానకి అగ్నిహోత్రుని సమీపించి చేతులు జోడించి మనస్సులకు దేవతలకు బ్రాహ్మణులకు నమస్కరించుచు అగ్నిదేవునితో భక్తితో ఇట్లనెను. సత్యముగా నా హృదయము రామచంద్రుని యందెల్లప్పుడును నిలిచి తొలగనిదైనచో విశ్వాసము కలుగునట్లు అన్నిచోట్లను అగ్నిహోత్రుడు నన్నత్యంతము

రక్షించుగాక. శిష్టమైన నడవడిగల నన్ను పతి దుష్టురాలిగా భావించెను. నేను దుష్టురాలిని గాదేని లోకసాక్షియగు అగ్నిదేవుడు అనిష్టమును దొలగించి నన్నంతటను రక్షించుగాక. మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, శరీరము చేతగాని ఎప్పుడును నేను సర్వధర్మజ్ఞుడైన రాముని నతిక్రమింపక నడచియున్నచో అగ్నిహోత్రుడెందైనను నన్ను గాపాడుగాక. (శ్రీరామా! యని సీత నోట రాలేదు. శ్రీరాముడు కాకుండుటచే కాబోలును.) సూర్యుడును, చంద్రుడును, దిక్కులును, వాయువును, రాత్రులును, సంధ్యలును, పగళ్లును, భూమియును, తక్కిన దేవతలందఱును నా శీలమును, మనస్సును ఎఱిగియున్నచో, నాయందనుమానము లేకున్నచో ఈ జనులందఱు తెలుసుకొనునట్లు నన్ను ప్రీతితో గావుము హవ్యవాహనా! అని యిట్లు పాపరహితురాలగు సీతాదేవి పలికి బంధములు మనస్సునందుండి విడచినదై అగ్నికి మిక్కిలి భక్తితో ప్రదక్షిణము చేసి గొప్ప జ్వాలలతో ధగధగ మండుచున్న అగ్నియందు అగ్ని కంటే పవిత్రరాలును, శుద్ధమైన చరిత్రము గలదియు అగు ఆమె ప్రవేశించెను. (శుచి = అగ్ని. శుచితర = అగ్నిహోత్రుని కంటే పవిత్రురాలు) మేలిమి బంగరు ఆభరణములు శరీరమున నొప్పుచుండగా పుటము పెట్టిన బంగారు బొమ్మవలె భూపుత్రి యెల్ల జగత్తులు చూచుచుండగా మండుచున్న మంటలో ప్రవేశింపగా అప్పుడక్కడనున్న బాలకుల, వృద్ధుల సమూహములు గుండెల దడదడ కొట్టుకొనగా గడగడలాడెను. (సాయుజ్యము గోరు భక్తుడు ఇట్టి పరీక్షకు సిద్ధపడి యుండవలెను) ఆ మహానుభావురాలు అగ్నియందు ప్రవేశించగనే మూడు జగములు జలదరించి అప్పుడామెను పవిత్రమైన అగ్నిలో బడుచున్న ఆజ్యముతో గూడిన పూర్ణాహుతిని వలె ఱెప్పపాటు లేక చూచెను. స్వచ్ఛమైన మహాయాగాగ్నిలో పడుచున్న నేయి వలె అగ్నియందాపతివ్రత నిర్వికారమైన మనస్సు గలదై శాంతితో ప్రవేశింపగా అచ్చట గుమిగూడిన స్త్రీజనులు హాహాకారములతో నిండిన ముఖములు గల వారై భయముతో గూడిన మనస్సులు గలవారై, దిగ్భ్రాంతితో విప్పారిన కనులతో చూచిరి. స్వర్గలోకముల నుండి శాపకారణమున నరకమున బడుచున్న దేవతాస్త్రీ యోయనునట్లు సీత అగ్నిలోబడుటను దేవతలు నాగులు, యక్షులు, సిద్ధులు, గంధర్వులు, దానవులు చూచిరి. మంటలందు దూకుచున్న ఆ విశాల లోచనయగు సీతనుచూచి అచ్చట గుంపులు గుంపులుగా నున్న వానరులును, రాక్షసులును, టం టం అని కొట్టుకొనుచున్న మనస్సులతో అప్పుడు ఆకాశము నంటునట్లు వేగముగా హాహాకారములను జేసిరి.

★★★

# నూట యిరువదవ సర్గము

## దేవతలు శ్రీరామునకు ప్రత్యక్షమై సీతాదేవి నిర్దోషురాలని చెప్పుట:

ఆ ధ్వనులను విని ధర్మాచారుడైన రాముడు కనుల నిండుగా కన్నీరు నిండగా కలత చెందిన మనస్సుతో ఒక్క ముహూర్తము తనంతట దుఃఖముతో మునిగియుండెను. అంతట కుబేరుడును, పాపశీలురను బాధించు వాడగు యముడును, వేయి కన్నులు గలవాడగు ఇంద్రుడును, విరోధుల చెండాడు భయంకరుడైన వరుణుడును, వృషభవాహనుడును మూడుకన్నులు గలవాడును మహాదేవుడును అయిన శివుడును, సర్వ లోకములను సృజించినవాడును, బ్రహ్మజ్ఞుల సమూహములలో శ్రేష్ఠుడును అయిన బ్రహ్మదేవుడను వీరందఱు సూర్యసదృశములగు విమానములతో ఆకాశమును విడచి లంకకు వచ్చి పద్మాక్షుడగు శ్రీరామునెదుట నిలబడి క్రొత్తక్రొత్తవైన పుటము పెట్టిన బంగారు ఆభరణములు గలిగిన పద్మముల వంటి చేతులు జోడించి యిట్లు పలికిరి. (దీనివలన శ్రీరాముడు భగవన్నారాయణుడగుట స్పష్టము) తమ యెదుట నిలబడియున్న రాముని జూచి మహాత్మా! నీవే సమస్త లోకములను కలుగజేయగల సమర్థుడవు. జ్ఞానికోటులలో అధికుడవు. తామర రేకుల వంటి నేత్రములు గల జానకి అగ్నిజ్వాలల యందు ప్రవేశింపగా బెదరక ఉపేక్షచేయుట తగునా? నిన్ను నీవే యెఱుగకున్నావెందులకో? సకల దేవతాసంఘములకు నాథుడవు. వస్తువులలో ప్రజాపతివి. పూర్వము ఋతుధాముడను పేర కీర్తింపబడినవాడవు. అన్ని లోకములకు ఆదికర్తవు నీవే. స్వయంప్రభుడవు. రుద్రులలో ఎనిమిదవ రుద్రుడవు నీవే. సాటిలేని తేజము గలవాడా! సాధ్యులందఱిలో ఐదవ మూర్తివి నీవు. నీకు అశ్వినీదేవతలు, కర్ణములు, కన్నులు, సూర్యచంద్రులు, జగములు నశించువేళలందును, ఆదికాలము నందును, అనఘా! నీవుందువు. ప్రాకృతుని విధముగా విదేహరాజపుత్రుని విడువదగునా? పద్మనేత్రా! భూపుత్రిని కరుణతో చూడుము. అని లోకపాలు రందఱును వినయముతో విన్నవింపగా విని జగములకు నియతి కారకుడైన రామచంద్రుడు ఆ దేవతానాధులతో నిట్లనెను. దేవతానాధులారా! నేను మానవుడనని, దశరథరాజపుత్రుడనని రాముడనని నన్ను గూర్చి తలచుచున్నాను. నేనెవ్వడనో,

ఎవ్వరివాడనో, ఎందులకై నేను పుట్టితినో వినిపింపుడు. (ఇది అజ్ఞానముచే అడిగిన ప్రశ్నకాదు. తన్ను తాను చెప్పికొనుట కంటే పరులు చెప్పిన లోకులు విశ్వసింతురు. కాన తన పర్వతము సుగ్రీవాదులకు తెలియజేయుటకై అడుగబడెను. పరత్వమునకంటే మనుష్యాభినయము. అందు దశరథకుమారత్వము. అందు శ్రీరామత్వము నాకు ప్రియమని భావము) అని పల్కుచున్న కౌసల్యాపుత్రునిజూచి బ్రహ్మవేత్తలలో ప్రధానుడగు బ్రహ్మ సత్యవిక్రమా! రామా! సత్యమును విన్నవించెదను వినుము.

## బ్రహ్మ శ్రీరాముని నుతించుట:

### దండకము

శ్రీ రామ రామా! మహాభావ! నారయణా! దేవ! లక్ష్మీసనాధా! యనాధాధినాధా! విభూ! శంఖచక్రాయుధా! నీవ మున్నొంటి శృంగంబు భూదారమై భూమికాధారమై నిల్చుపెన్వేల్పవుం, జన్నరానున్న యా సూడులం గీడులం గూర్చి వేధించి సాధించి బాధించుబత్ప్రోడవున్, నీవబ్రహ్మంబు, సత్యంబు నీవక్షరం బెల్లకాద్యుండు మధ్యాంత సంస్థుండునున్ నీవ, నీవే చతుర్బాహువున్ స్వామియున్ శార్ఙినిన్, శంఖివిన్, ఖడ్గివిన్, గృష్ణుడున్, విష్ణుడున్, బుద్ధియున్, సిద్ధియున్, సత్త్వమున్, దత్త్వమున్, శాంతియుం దాంతియుం బూరుషాఖ్యుండవుం, బూరుషోత్కృష్ట రూపంబునున్నీవు, నీవే హృషీకేశ విఖ్యాతమూర్తీ! యజయ్యుండవున్, సర్వసేనా నివిన్ గ్రామణీ రత్నమున్ స్రష్టవుం ద్రష్టవున్ నీవ, నీయందడిందున్ సమస్తం బుపేంద్రా! హరీ! మధ్వరీ! యింద్రకర్మా! మహేంద్రా! నరేంద్రా! మునీంద్రాది వంద్యా! పరా! పద్మనాభా! విరోధ్యంత కారీ! శరణ్యుండవున్ నీవ, నిన్నే సుమీ సర్వరక్షైక సామర్థ్యదక్షుండవున్ లోకచక్షుండవం చెల్ల దివ్యర్షు లుక్కర్ష భావించి సేవించి స్తోత్రంబు గావింత్రు, శాఖాసహస్రాత్మ కామ్నాయ రూపా! మహర్షి ప్రవేకా! యనే కోరు జిహ్వా! జగత్పాళికీవాద్యుడౌ కర్తవున్ ధర్తవున్, హర్తవున్ నీవ, నీవే స్వయంభర్తవున్, సిద్ధ సాధ్యాశ్రయుండీవ, నీవే సుమీ సృష్టికి న్ముందు బాసిల్లురూపంబు, యజ్ఞంబునున్నీవ, నీవే వషట్కార మోంకారమున్నీవ, నీవే సముత్కృష్టయాగైక గమ్యుండవున్, భక్తరమ్యుండవున్ నీవ, నీపుట్టువున్ బుట్టునున్ గిట్టుటన్ వెండి నీవిట్టి వాడంచు నెవ్వాడెఱుంగున్ రమాధీశ! గోజాత భూనిర్ఝరాక్రాంత భూతావళీ శైలదిగ్జాలకాంతార దేశం బులన్ నిండి రాణింతువో దేవదేవేశ! నీవే కదా వేయి పాదం బులన్ వేయి శీర్షంబులన్ వేయి నేత్రంబులన్ బూని భూతంబులన్ గోత్ర సంఘాత సంప్రీత ఘౌ భూతధాత్రిన్ వహింపన్

సంహింపంగ దక్షుండ, వీక్షోణి కల్పాంతవేళన్ మహోహింద్ర తల్పుండవై దేవ! గంధర్వదై తేయ సంఘంబులం దాల్చి ప్రత్యక్షమై యుందు, వో రామ! నీ చిత్తమేనేను, నీజిహ్వయే వాణి, రోమాళి దేవాళి, యోగీశహృద్ధామ! శ్రీథామ! కన్ రెప్పలన్ మూయగా రేయి, విప్పంబగల్, నీదు నిశ్శ్వాసముల్ వేదముల్ రామ! నీ కాని దావంతయున్ లేదు, సర్వంబు లోకంబు నీకున్ శరీరంబు, స్థైర్యంబు భూగోళ, మగ్నుల్ ప్రకోపంబు, శ్రీవత్సచిహ్నా! ప్రసాదంబు సోముండు, నీవే కదా మున్ను వైరోచనింజేరి దానంబునుంగోరి పాదత్రయీ న్యాసరూపంబునన్ సర్వలోకంబులున్ నిండి దండించి తాదైత్యు, దైత్యారికింబట్టముం గట్టి రక్షించితో దివ్యమూర్తీ! లసత్కీర్తి! శ్రీలక్ష్మియే సీత, విష్ణుండవే నీవు, కృష్ణుండునున్ నీవ, నీవే ప్రజానాథ వాచ్యుండ వాపంక్తికంఠున్ వధింపంగనై మానుషీ దేహమున్ జొచ్చి రక్షోధిపుంద్రుంచి మాకార్యముందీర్చి లోకుంబులం దేర్చి తీవింక హృష్టుండవై ధాత్రి బాలించి యాపై దివింజేరుమా! యోరమానాథ! నీ వీర్యసారంబమోఘంబు, నీ ఘోర శౌర్యం బమోఘంబు, నీ దర్శనంబేనమోఘంబు, నీ స్తోత్రమున్ మోఘమేవేళ నేవారికంగాదు, నిన్ భక్తిచే గొల్చిచిత్తంబునం దాల్చు నీ భక్తులౌవారికే లోపముల్ లేవు, నిన్నుంబురాణున్ సదా పూరుషోత్తం సు నిశ్చంచలంబైన సద్భక్తి సేవించు భక్తుల్ జగద్రక్షకా! యైహి కాత్యంత సౌఖ్యంబు లెల్లప్పుడుం గందురీశా! నమస్తే నమస్తే నమః.

ఆ. అనఘమునుబురాణ మైతిహ్యమార్షంబు
నైన యీస్తవంబు ననుదినంబుఁ
బరమ భక్తితోడఁ బఠియించువారికి
రాద దెప్పుడేన్ పరాభవంబు.

(కౌసల్య గర్భమును శ్రీరాముడు శుద్ధ సత్త్వమయ దివ్య మంగళ విగ్రహుడు గదా. పరాభవము = మఱుజన్మము, బాహ్యాభ్యంతర శత్రు తిరస్కారము)

అని యిట్లు బ్రహ్మదండక రూపమున శ్రీరామచంద్రుని స్తోత్రము చేసెను. అనఘమైన పురాణేతిహాస వేదసమ్మతమైన ఈ స్తోత్రమును ప్రతినిత్యమును మిక్కిలి భక్తితో పఠించువారలకు పరాభవమనునది ఎప్పుడును రాకుండును గాక.

★★★

# నూట యిరువది ఒకటవ సర్గము

## అగ్నిహోత్రుడు సీతాదేవిని శ్రీరామునికి మరల సమర్పించుట:

అని మంగళకరములైన సూక్తులను బ్రహ్మదేవుడు చెప్పుచుండగా అగ్నిహోత్రుడు జనకరాజపుత్రిని తన అంక తలమున (చిన్న పిల్లను తండ్రి యెత్తుకొని వచ్చినట్లుగా) తీసికొని మనుష్యరూపమున చితిని జిమ్ముకొనుచు వచ్చెను. ఉదయించు సూర్యబింబమును మించినదియు, కొత్తవైన బంగారు ఆభరణములు ధరించినదియు నల్లని వంకరలైన శిరోజములు గలదియు, ఎఱ్ఱని వస్త్రములతో నొప్పునదియు, వాడని పూలమాలికలు ఆభరణములు గలదియు చెక్కు చెదరని మేని కాంతుల గలదియు, మనస్సునందే సంకోచము లేనిదియు, ఇదివఱకటి రూపముతోడనే యున్నదియు, అగు సీతను సర్వలోక సాక్షియగు అగ్నిదేవుడు ఒడియందు బట్టుకొని తెచ్చి భూపతి యగు రామచంద్రుని కిచ్చి యిట్లనెను. ఈమె నీ వైదేహి. ఈమెయందు పాపమేమియును లేదు. మనస్సునందును, మాటలయందును, ధ్యానమునందును, కన్నులనైనను ఈ తరుణీమణి మంచి నడవడి గలదియయిన సీత తానెప్పుడు నిన్ను మీరలేదు. శుభచరిత్ర గల రామచంద్రా! నిన్నెడబాసి దీనురాలై నిర్జనమైన అడవి యందు అస్వతంత్రురాలై యున్న ఈ సాధుశీలను దుర్మార్గ చరిత్రుడైన రావణుడు బలవంతముగా దెచ్చి తన యింటియందుంచెను. అట్లు చేసినను వికృతములైన నేత్రములు గల రాక్షసస్త్రీలు ఎప్పుడును కాపలాగా ఉండగా ఈమె నిన్ను గురించి ఆలోచించుచు నిన్నే సేవించెను సుమా. రావణుడు మోసగించెను, ఎంతయో ఆశలో ముంచెను. ధిక్కరించెను. బెదరించెను. కఠినముగా మాటాడెను. ఏమి చేసినను ఈమె అతనిని లక్ష్యపట్టలేదు. అనఘా! నీయందే తన హృదయమును నిలిపినది. కాన రామా! పవిత్రమైన మనస్సుగలదియు, కొంచెమైనను పాపమునెరుగని సాధ్వియు అగు నీమెను నామాటను బట్టి ఏమియు అడ్డము చెప్పక యిప్పుడే యేలుకొనుము.

## శ్రీరాముడు సీతాదేవిని పరిగ్రహించుట:

అని అగ్నిదేవుడు చెప్పగా విని ప్రీతినొందిన రామప్రభుడు అశ్రుసమూహములు కన్నులందు నిండగా ఒక్క నిమిషమాలోచించి ఆయనఘుడు అగ్నికిట్లనెను. ఓ హుతాశనా!

ఈ జానకి పవిత్రురాలగుట యదార్థమే యైనను చాలాకాలమీ రాక్షసరాజు అంతఃపురమున నివసించుటచే ఇప్పుడూరకే నేను గ్రహించినచో దశరథరాజు పుత్రుడగు రాము డెంతటి బుద్ధిహీనుడు! కాముకుడై ఏమియు చూడకయే భార్యను తిరిగి గ్రహించెనేయని యిట్లు మూడులోకమునున్న సజ్జనులు నన్ను పల్కరా? అందులకే జనకరాజపుత్రి భక్తురాలనియు, సాధ్వియనియు, ఇతరుల యందు మనస్సు లేని దనియు, నా మనస్స నెరిగి ప్రవర్తించు మంచినడవడి గలదనియు తెలిసి యుండియు జనులకు నమ్మకము గలిగించుటకై భార్యను సత్యరతుడనై ఉపేక్షించితిని. స్త్రీలలో ఉత్తమురాలగు సీత తన్నెప్పుడును పాతివ్రత్యమహత్వము చేత కాపాడుకొనగలదనియు, ఆ రావణుడ సముద్రము చెలియలి కట్టను దాటలేని విధముగా దాటజాలడనియు, ఆ పాపాత్ముడు మండుచున్న మంటను వలె ఈ పతివ్రతను మనస్సునందైనను అపకారము చేయలేడనియు నేనెఱుగుదును. ఈ ఉత్తమ శీలవతి రావణుని అంతఃపురమున సుఖమును సంపదలను అనుభవింప దగినది కాదు. సూర్యునకు ఎండవలె ఈ సుందరి నన్ను విడచి ఎన్నడును ఉండజాలదు. ఈ జనకపుత్రిక పవిత్ర చరిత పరిశుద్ధురాలు. ముల్లోకములందును మంచికీర్తిని సజ్జనుడు విడువజాలని విధముగా నేనెట్లు భూపుత్రిని విడువగలను? దేవతా శ్రేష్ఠులారా! మూడు లోకములందును పూజింపదగిన వారలును, ఖ్యాతి చెందిన వారలును, ప్రేమగలవారును అగు మీరలు ఈ విధముగా ఔ–ననగా నేను చేయకుందునా? ఇట్లు తనకు తెలిసిన విషయమును స్పష్టముగా జెప్పి సర్వ దేవతలచేతను స్తుతింపబడినవాడై వంకరలైన ముంగురులు గల సీతను గ్రహించి రామభద్రుడు అధికమైన సౌఖ్యమును బొందెను. (జీవునికి సాయుజ్యప్రాప్తి యిట్టి యైక్యమే కాని స్వరూప స్వభావ నాశముచే నగునది కాదు. ఆకారత్రయ సంపన్నతచే గాని యిది లభింపదు.)

★★★

# నూట యిరువది రెండవ సర్గము

## సీతా శ్రీరామ లక్ష్మణుల దశరథుని సందర్శించుట:

సూర్యవంశజ్ఞుడైన రామచంద్రుని శుభవాక్యములను విని శుభతరములైన సూక్తులతో శివుడిట్లనెను. ఓ గొప్ప భుజములు గల రామచంద్రా! వికసించిన పద్మములవంటి నేత్రములు గలవాడా! బలిసిన యురము గలవాడా! శస్త్రధారులలో శ్రేష్ఠుడా! శత్రువులను మర్దించువాడా! మా భాగ్యము చేత ఈ మహాకార్యమును చేసితివి. కౌసల్యా కుమారా! మా యదృష్టముచే రాక్షసరాజు వలన సర్వ లోకములకు కలిగిన మహాదారుణమైన భయమును తొలగించితివి. ఇక దీనుడైయున్న భరతుని, నీ తల్లియైన కౌసల్యను, ప్రఖ్యాత చరిత్రగల కైకేయిని, లక్ష్మణుని తల్లియైన మణి వంటి సుమిత్రను ఊరడింపుము. ఆయయోధ్యా పట్టణము నందు పట్టము గట్టు కొనుము. స్నేహితులను సంతోషపరచుము. ఇక్ష్వాకుకులము నిలుపుము సాటిలేని కీర్తితో వెలయును. అశ్వమేధ యాగము చేయుము. గొప్ప వదాన్యుడను కీర్తిని జగములందు నిలుపుము. తరువాత వైకుంఠమునకు వెళ్లుము. అదిగో చూడుము. భూమి యందు నీకు జనకుడై గొప్పకీర్తిని పొందిన వాడై గురువై ప్రఖ్యాతి నొందిన దశరథుడాకాశమార్గమున పుత్రులలో రత్నమువంటి వాడవగు నీయొక్క గొప్ప మహిమచే తరింపజేయబడి ఇంద్రపురము నందు గొప్ప సౌఖ్యసంపదలనందుచు విమానమందు నిలిచియున్నాడు. మహానుభావా! సౌమిత్రితో కలిసి నీవును, మహాబుద్ధిశాలీ! నమస్కరింపుము అని చెప్పుచున్న శంకరుని మాటననుసరించి రాముడు తమ్మునితో గూడి ఆకాశరథము నందు ప్రకాశమానమైన కాంతితో నున్న వాడును, నిర్మలమైన వస్త్రములు దాల్చినవాడును, అగు తమ తండ్రిని చూచి చేతులు జోడించి నమస్కరించెను. ఆ దశరథమహారాజు సంతోషభారముతో ప్రాణముల కంటే ప్రియుడైన పుత్రశ్రేష్ఠుని సందిట జేర్చి కౌగిలించుకొనెను.

## దశరథుడు శ్రీరాముని ప్రశంసించుట:

ఈ విధముగా దశరథుడు రామచంద్రుని కౌగిలించుకొని ఎంతో ప్రేమతో ఇట్లనెను. రామా! నిజము చెప్పుచున్నాను. దేవలోకమున మౌనులు, దేవతల సమూహములచేత

ఎన్నో మహనీయమైన సత్కారములనందుచు గౌరవమును పొందుచున్నను నాయనా! నిన్నెడబాసి యుండుటచే నా మనస్సునందు సంతోషము లేదు. దుర్మార్గులను సంహరించి సంపూర్ణమైన మనస్సుగలవాడవును, వనవాసము పూర్తిచేసిన వాడవును అయిన నిన్ను చూచుటచే ఇప్పుడు పూర్ణమైన మనస్సు గల వాడనైతిని. ఓ పుణ్యచరిత్రా! నిన్నడవులందు ద్రోయుమని కైకేయి పలికిన కఠినమైన మాటలు ఈ మనస్సునందు నాటినవి. ఇప్పుడు సజ్జనులచే గౌరవింపబడిన నిన్నును లక్ష్మణుని కౌగిలించుకొని దుఃఖమును మానితిని. ఓ పుత్రా! మంచు తొలగుటచే సూర్యుడు ప్రకాశించు విధముగా నేను తిరిగి ప్రకాశింపగలిగితిని గదయ్యా. శిష్టుడును ధర్మాత్ముడునైన అష్టావక్రుడు కహోళుమౌనిని వలె నీవును నా కిష్టడైన పుత్రుడవై దైవవశమున నన్ను తరింపజేసితివి. వత్సా! తండ్రీ! రావణుని సంహారమును కోరినవారగు దేవతలందఱును నా చేయు పనిని విఘ్నము చేసిరి. పురుషులలో శ్రేష్ఠుడా! ఈ సంగతిని నేనిప్పుడే తెలిసికొంటిని. యుద్ధమునందు విరోధులను సంహరించి అడవుల నుండి తిరిగి వచ్చిన నిన్ను దుఃఖమును వీడిన మనస్సుతో కౌసల్య చూడగలదు. నిన్ను గన్నతల్లి ధన్యురాలు గదా కుమారా! ఓ ధర్మవిచారా! సౌజన్యమే ధనముగా గలవాడా! వనములనుండి మరలివచ్చిన వాడవును, సౌఖ్యవంతుడవును, అభిషేక జలముచే తడిసినవాడవును, గౌరవింప దగినవాడవును అగు నిన్ను రాజుగా పొందెదరు. పురజనులు ధన్యులు గదయ్యా! నీయందు ప్రేమగలవాడును, భక్తుడును, నియమవంతుడును, శుచియు, విక్రమము గలవాడును అగు తమ్ముడైన భరతుడును నీవును కలిసి మెలిసి గొప్పదనముతో చరింపగా చూడవలెనని కోరుచున్నాను. పదునాల్గు సంవత్సరములు సీతతోను బుద్ధిశాలియగు తమ్మునితోను వనములందు గడిపితివి. ప్రతిజ్ఞయు నేరవేరినది. రావణుని జంపుటచే సురలును మునులును సంతోషమును బొందిరి. పనులు నెరవేర్చితివి. గొప్పకీర్తిని పొందితివి. ఇక పట్టాభిషిక్తుడవై తమ్ములతో సుఖముగా దీర్ఘఆయుష్మంతుడవై ప్రకాశింపుమా! అన్నా! అని చెప్పుచున్న జనకుని జూచి రామచంద్రుడిట్లనెను. తండ్రీ! కైకయందును, భరతుని యందును దయ వహింపుము. ఆమెను కొడుకుతో గూడ నిను విడిచితినంటివి గదా పూర్వము. ఆ శాపము తొలగిపోవునట్లను గ్రహింపుము.

## దశరథుడు లక్ష్మణునకు శ్రీరామ సేవ కర్తవ్యమని బోధించుట:

శ్రీరామచంద్రుడట్లు కోరగా దశరథుడట్లే జరుగును గాక యని చెప్పి వినయముతో చేతులు జోడించి నిలిచియున్న సుమిత్రా తనయుని జూచి కుతూహలముతో ఆలింగనము

చేసికొని కరుణగలవాడై ఇట్లనెను. కుమారా! ఈ జానకీ రాముల చరణసేవ జేసి నీవు ధన్యుడవైతివి. (కైంకర్యమే మోక్షప్రదము) నీచరిత్రకు అత్యంత సంతుష్టుడనైతిని. నీకు ధర్మఫలమంతయు దక్కినది. నీకు భూమియందు ధర్మము మంచికీర్తి స్థిరమైనది. రాముని దయవలన మహిమ గలిగిన స్వర్గము సమకూరెను సుమా. అందుచే రామచంద్రుని భజింపుము. రాముడు మూడు లోకములకును క్షేమము కలుగజేయువాడు. ఓ పవిత్రమైన చరిత్ర గలవాడా! ఇంద్రునితో గూడ సిద్ధులందఱును, ఋషులును, మూడులోకములును కలిసివచ్చి ఈ మహానుభావుని, ఈ పురుషోత్తముని అర్చించు చుందురయ్యా! లక్ష్మణా! ఇతడు అవ్యక్తుడు. అక్షరుడు దేవతాబృందములనుండువాడు. వేదముల చేత నిరూపింపబడిన తత్వస్వరూపుడు. ఓ అనఘా! ఇతడు పరిశుద్ధుడు. విరోధులను సంహరించినవాడు. వేదములచే తెలియదగినవాడగు పరబ్రహ్మమనియు, భూమియందు రాముని ఆకృతిలో జన్మించెననియు ఇచ్చట నున్నవారందఱును చెప్పిరి సుమా. సీతా సహితుడైన రాముని ప్రీతిలో పరిచర్యలు సల్పి తృప్తి పొందించి సదలని భక్తితో పవిత్రమైన సత్కీర్తిని, గొప్పనైన ధర్మాచరణమును పొందితిని గదా కుమారా!

## దశరథుడు సీతాదేవి నూరార్చుట:

అని సుమిత్రపట్టికి చెప్పి దశరథ జనపాలుడు శ్రేష్ఠమైన చరితములో ప్రఖ్యాతి జెందిన జనకరాజపుత్రిని జూచి శుభప్రదములైన మాటలతో ఇట్లనెను. కోడలా! ఇట్లు చేసినందులకు నీపతిపై కోపగించుకొనకు మమ్మా! జగత్తులందు నీ పతివ్రతాత్వము స్థిరముగా ప్రకాశించును. నీ హితమును గోరినవాడై పాపరహితవని తెలియజేయగోరి రాముడీపనిని తల పెట్టినాడు గాని అపరాధి కాదు సుమా. పతివ్రతలలో మణివంటిదానా! ప్రేమతో సహింపవమ్మా! పతి శుశ్రూష యందనురక్తవై భూమియందు కీర్తి పొందుమని నేను చెప్పనేల? భూపుత్రీ! నీక పతికంటే వేరే దైవము లేదమ్మా అని కోడలినూరడించి జనులచే పొగడబడిన దశరథుడు తన విమానములన నెక్కి స్వర్గమునకు వెళ్లెను. మఱియు ఇన వంశమునకు మణివంటి రాముని జూచి దేవేంద్రుడిట్లనెను.

★★★

# నూట యిరువది మూడవ సర్గము

## ఇంద్రుని వరముచే మృతవానరులు పునర్జీవితులగుట:

శ్రీరామచంద్రా! నీ దర్శనము సేత (నిన్ను మేము దర్శించుట - మమ్ము నీవు చూచుట అను రెండర్థములు) సార్థకమయ్యెను. సంతోషము నందితిమి. ప్రఖ్యాతి గల చరిత్ర గలరామా! నీకేది యిష్టమైనదో తెలియజేయుము. అనగా జానకీ లక్ష్మణ సహితుడై నమస్కరించి శ్రీరాముడిట్లనెను. మహేంద్రా! నాపై నీకు దయగల దేని నా యిష్టమును చెప్పెదను. నా కోరికను తీర్పుము. నా కొఱకై యుద్ధమున చంపబడి యమపురమునకు వెళ్లిన వారెల్లరును తిరిగి ప్రాణములను పొందినవారై భార్యలతోడను, ముద్దుల కుమారుల తోడను ఉండవలెను. నాకు ఇష్టమైన వారును, నా యందనురాగము గలవారును మృత్యువు నుండి విడువబడుదురు గాక. ఇది సత్యము. బాధారహితులు, గాయములు లేనివారు పౌరుషము, బలము గలవారై ఓ పర్వత విరోధీ! ఎలుగుబంట్లు, వానరుల సమూహములు పూర్వము వలె విలసిల్లవలెనని కోరుచున్నాను. వాటి ఋతువులు కాకున్నను ఏ కాలము నందైనను వారున్నచోట్ల అనేకవిధములైన పండ్లును దుంపలును అమరవలెను. నదులందు జలములు సమృద్ధిగా నుండవలెను. ఇవి నేను కోరు వరములు. దేవపతీ! వీనిని నాకొసగుము అనగా దేవేంద్రుడిట్లనెను. రాజచంద్రా! ఆడి తప్పుట ఎఱుగను గాన నీవు కోరిన మహావరములనిచ్చితిని. యుద్ధమున రాక్షసులు చంపగా ప్రాణములు విడచిన భల్లూకములును, కోతులును, మొదలైన వారందఱును ప్రాణములు పొందిన వారై బాధారహితులై దెబ్బలు నఱకుట లేనివారై పూర్వమువలె శౌర్యము బలము గలవారై మేల్కొనిన వారివలె ఓ రాజా! తమ జ్ఞాతులతోను, పాతులతోను, మిత్రసంఘములతోను లేచెదరు గాక కాలము గాని వేళలలో నయినను వృక్షములందు పుష్పములు, ఫలములు, మూలములు వెలయుగాక. నదులందు సమృద్ధిగా మంచి నీళ్లుండును గాక. ఈ వానరాదులందఱు గాయములు మాని బలమైన శరీరములు గలవారై లేచెదరు గాక అని చెప్పగనే ఆశ్చర్యముగా నిద్రనుండి మేలుకొనిన వారివలె అందఱు ఆశ్చర్యపడునట్లుగా లేచిరి. ఇది యేమిటి ఇది యేమిటి అని ఎంతయో సంతోషమును ఆశ్చర్యమును

మనస్సులందు కలుగగా బ్రతికిన వానరులందఱు శ్రీరామచంద్రుని దగ్గఱకు వెళ్లి మిక్కిలి భక్తితో మ్రొక్కి నిలిచెను. అంతట దేవతలు ఆనందముతో నిండిన మనస్సుగల రాముని స్తోత్రము చేసి ఓ జానకీనాథా! ఇంక ఈ వానరులను విడచి వేగముగా అయోధ్యకు వెళ్లుము. పవిత్రమైన మనస్సు గలదియు, తపస్వినియు, నీకు ప్రియమైనదియు అగు సీతను ఓదార్చుము. దుఃఖముతో నిండిన మనస్సులు గల తల్లులను అందఱును గౌరవముతో ఓదార్పుము. నీకై దుఃఖించుచు నిష్ఠురమైన వ్రతము బూనియున్న శుభశీలుడైన కైకపుత్రుని చూడుము. మహిమ గలిగిన చిన్నతమ్ముని ప్రేమతో చూడుము. పట్టాభిషేకమును పొంది పురజనుల నానందింపజేయుము. మేము మా నివాసములకేగెదమని చెప్పి రాజు నాజ్ఞ పొంది దేవతలు స్వర్గమునకు వెళ్లిరి. దేవతలిట్లు వెళ్లగా రామలక్ష్మణులు సంతోషముతో నిండిన మనస్సులు గలవారై వానరశ్రేష్ఠులను తగిన విధముగా తగిన చోటుల నిలబెట్టగా ఆ గొప్ప సైన్యము ఇంతయని చెప్పరాని సంతోషముతో చంద్రునితో గూడియున్న రాత్రివలె మనోహరమై కాంతిమంతమై యొప్పెను.

★★★



# నూట యిరువది నాలుగవ సర్గము

## విభీషణుడు శ్రీరాముని సంస్కారాదులంగీకరింప ప్రార్థించుట:

ఈ విధముగా సుఖముగా ఆ రాత్రి గడిపి ప్రాతఃకాలమున లేచి ప్రకాశించుచున్న రామభూపాలుని జూచి మంచిమాటలతో విభీషణుడిట్లు పల్కెను. పద్మపత్రములవంటి నేత్రములు గల రామచంద్రా! సువాసనలతో మేలైన మెయిపూతలును, కుంకుమాది పరిమళ ద్రవ్యములును, క్రొత్తవైన బంగారుపట్టు వస్త్రములును సొమ్ములును చందనాది గంథములును, నందనవన వృక్షముల నున్న పుష్పముల మాల్యములును సిద్ధముగా నున్నవి. అనేక విధముల అలంకార కళలలో నేర్పరులీ పద్మముఖులు. నీకు సుఖముగా స్నానాదులు చేయించెదరు. నాపై దయయుంచి సమ్మతిని జూపింపుము. అనగా రామచంద్రుడిట్లనెను విభీషణా! ప్రేమతో ఈ సూర్యపుత్రుడు మొదలైనవారిని స్నానము చేయుడని వేడుము. ఎంతయో సుఖమును పొందదగినవాడును, పవిత్రుడును, సత్యమైన ప్రతిజ్ఞ గలవాడును, మిక్కిలి బలవంతుడును పిన్నవాడును అగు భరతుడు ఉగ్రమైన నిష్ఠతో కష్టపడుచుండగా ఇక్కడ సౌఖ్యమును పొందుటకు నాకు మనసెట్ల ఒప్పునయ్యా! జనులచే పొగడబడెడి ధర్మచరిత్ర గలవాడగు సోదరుడు దగ్గఱ లేకుండ నేను ఏ ఆభరణములను వస్త్రములను ధరింపను. ఓ అనఘా! అభ్యంగన స్నానమును ఆశింపనయ్యా! మా నగరమునకు వెళ్లు మార్గము అడవులతో దుర్గమమైనది కాన వెళ్లుట కష్టము. ఇప్పుడు నేను ఏ విధముగా పయనింపవలెననగా సద్గుణ శోభితుడైన విభీషణుడు శ్రీరాముని జూచి యిట్లనెను. రామచంద్రా! సూర్యసమానమైనదియు, సజ్జనులచే పూజింపదగినదియు పుష్పకమను పేరుగలదియు అగు ఒక విమానము గలదు. యుద్ధము నందు కుబేరుని జయించి రావణుడు దానిని హరించెను. అది కామగమనము గలది. రాజా! ఆ దివ్యమైన దానిని నీ కొఱకై యుంచితిని. మేఘసదృశమైన అది ఒక్క పగటిలోననే నిన్నయోధ్యకు చేర్చగలదు.నిశ్చింతగానుండుము.నామీదఏమాత్రమైనను ప్రేమయున్నచో,నాగుణములు నీకు జ్ఞాపకమున్నచో, నాయందు స్నేహభావమేమైన నిల్పియున్నచో రామచంద్రా!

నీవు భార్యతోను, సోదరునితోను ఇక్కడ నిలువవయ్యా! ఉత్తమ శీలము గలవాడా! మహానుభావులైన మిమ్ములను మేలైన సపర్యలతో తృప్తి పొందింపగోరుచున్నాను. ఇష్టముతో అందఱు మిత్రులును, సైన్యములను తగిన అర్చనలతోను సౌఖ్యముతోను తృప్తినందింప గోరుచున్నాను. మహాపురుషా! మిక్కిలి గౌరవము, భక్తి స్నేహములతో వేడుచున్నాను గాని ఇది ఆజ్ఞ కాదు సుమా. నేను నీ దాసుడను. అని చెప్పగా శుభచరిత్రుడగు సీతానాధుడు విభీషణునితో నయము ప్రియము చూపుచు సంతోషముతో నిట్లనెను. రాక్షసరాజా! నమ్మకముతోను, ఆసక్తితోను హెచ్చైన మెచ్చదగిన సాయము చేసితిరి. ఏమియు కొదువలేదు సుమా. నీ మాటలను వినలేదని నన్ను కఠినచిత్తుడని తలంపకుము ఓ పావనశీలా! నా మనసు సోదరుని మీదికి పోవుచున్నది. ఆ మహాభావుడైన భరతుడు చిత్రకూటమునందు నాకాళ్లమీద పడెను. చేతులు జోడించెను. నను మఱల అయోధ్యకు తీసికొని వెళ్లవలెనని ఎంతో అధికముగా బ్రతిమాలెను. నేను త్రోసిపుచ్చితిని.

## శ్రీరాముడు విభీషణుని పుష్పకమును దెమ్మనుట:

మిత్రమా! అంతియే కాక నా తల్లిని, సుమిత్రను, కైకను చూడవలెనని నా మనస్సు తొందరపడుచున్నది. పౌరులను, మిత్రులను, వారి బిడ్డలను, శాంతులైన నా ఉత్తములైన గురువులను సంతోషము కలుగునట్లు చూడగోరుచున్నాను. నీవు చింతనొందకుము వేగముగా పుష్పకము నిచ్చటికి దెచ్చుటకై ఆజ్ఞాపింపుము. వనవాసము పూర్తియగుటచే తనవారిని చూడవలెనను కోరికతో మనస్సు ఇచ్చట నిలుచుట కొప్పకున్నది. క్షమింపుము. పొగడబడిన శీలము గలవాడా! కోపగింపకుము. నాకు వెళ్లుటకు ఆజ్ఞనిమ్ము. నీ వొనర్చు నపర్యల నన్నిటిని నేను గ్రహించితిని. వేగముగా నేను అక్కడకు వెళ్లవలయును. విభీషణా! మంచి బుద్ధిమంతుడవు. పుష్పకమునిమ్ము. అదియే చాలును. అనగా ఆ రాజునాజ్ఞచే అతడు వేగముగా లంకకు వెళ్లి తిరిగివచ్చి సీతానాధుని ముందర అద్భుతమైన నిర్మాణము కల యా విమానము నిలిపెను. వైఢూర్యమణులు పొదిగిన వేదికలు గలదియు, బంగారుముచే నిర్మింపబడిన అంగములు గలదియు, రజిత కాంతులచే అందమైనదియు, అంతస్తులు గలదియు, బంగారు పద్మములచే అలంకరింపబడినదియు, బంగారు మేడలతో నొప్పుచున్నదియు, తెల్లని జెండాలు ధ్వజములు గలదియు, గజ్జెల సమూహములతో గూడినదియు అందమైన ముత్యాల కిటికీలతోను, శబ్దించు మధురమైన

గంటల ధ్వనులతోను బంగారు కొండతో సమానమైనదియు పూర్వము విశ్వకర్మచే నిర్మింపబడినదియు, స్ఫటికములతో చిత్రింపబడిన ఆకృతి గలదియు బంగారము వైఢూర్యములతో చేయబడిన శ్రేష్ఠమైన ఆసనములు గలదియు వాటియందు మంచి మంచి ఆస్తరణములు గలదియు ఎచ్చటను సాటిలేనిదియు, మనోవేగము గలదియు అయి అందమగు ఆ విమానమును

★★★



# నూట యిరువది యైదవ సర్గము

## శ్రీరాముడు విభీషణునిచే వానరులకు కానుక లిప్పించుట:

అందమైన విమానమును దెచ్చి రాముని ముందు నిల్పి రాక్షసరాజు రామా! ఇక ఏమియాజ్ఞ యని పల్కగా రామచంద్రుడు తన సోదరునితో ఆలోచించి స్నేహము తెలియజేయునట్లు ఇట్లనెను. ఓ విభీషణా! నా మాటనొకదానిని వినుము. పని గట్టుకొని నాకై సర్వవానరశ్రేష్ఠులు యుద్ధరంగమున శరీరముల మీద ఆశవదలి తెగించి దారుణమైన విధముగా పోరాడి ఎవ్వరికిని గెలువరానిదైన రాక్షసరాజు పట్టణమగు లంకను బలవంతముగా పడగొట్టిరి. కాన వీరందఱకును మేలు చేయవలెనను ఆశ కల్గుచున్నది. కాన నీవు వీరలకందఱును విరివిగా మణులను, రత్నములను, బంగారములను పేరుపేరున వారు చేసిన ఫలముగా బహుమతులుగా నొసంగుము. విభీషణా! వానరులు నాతో సమానముగా పూజింపతగిన అర్హత గలవారు. కృతజ్ఞులలో శ్రేష్ఠుడా! నీచేత సన్మానింపబడినవారై వీరందఱును సంతోషించిన మనస్సులు గలవారలై స్వస్థానములకు వెళ్లెదరు. నీవు దాతవనియు, అనేక సంపదలను తగువిధముగా ఆర్జించు వాడవనియు, దయావంతుడవనియు, మంచికీర్తి గలవాడవనియు వీరెల్లరు తలంచెదరు. ఆ కారణము చేతనే నేను నిన్ను హెచ్చరింపవలసి వచ్చినది. పెట్టుపోతలను దయయును ఏ వేళలందును లేక ఊరకే యుద్ధములందు ప్రాణములు పోవజేయు రాజును చూచి భయము కలుగగా బంటులు కష్టసమయములందు తమ యజమానిని విడచిపోయెదరు సుమా.

## శ్రీరాముడు పుష్పకమునెక్కి సుగ్రీవాదుల కనుజ్ఞనిచ్చుట:

అని రామచంద్రుడు చెప్పగా ధనమును, రత్నములను తెచ్చి తగిన విధముగా ఇచ్చి వారందఱు మనస్సులలో సంతోషించునట్లు వానరవీరులను గౌరవించెను. అది చూచి శ్రీరాముడానంద సాగరమున మునిగినవాడై ప్రీతితో పుష్పకమునెక్కి అందు సిగ్గుపడుచున్నదియు కీర్తిచే ప్రకాశించునదియునగు వైదేహిని తన అంకతలమున ప్రీతితో కూర్చుండబెట్టుకొని (సాయుజ్యము, దీనివలన ప్రపన్నులను భగవంతుడే గరుడ వాహనమున నెక్కించుకొని పోవును. అర్చిరాది మార్గము ప్రపన్నులకు లేదు. ప్రపన్నులకు కలుగుగతి వారిని సేవించు వారికిని కలుగును) వీరుడైన సౌమిత్రి విల్లు చేతబట్టి దగ్గఱ

నిలువగా సుఖాసీనుడై వానరరాజును, రాక్షసరాజును పిలిచి అనేక విధములుగా వారిని గౌరవించి వానరశ్రేష్ఠులారా! మీ వలన స్నేహితుని కార్యము కొదువలేకుండ నెరవేరినది. నా కొఱకై మీరెంతయో కష్టపడినారు. ఇంక సెలవిచ్చుచున్నాను. మీమీ నెలవులకు వెళ్లుడు. సుగ్రీవా! నీవు మంచి హృదయము గల మిత్రుడైనవాడవు చేయదగినదంతయు ధర్మభయముచే చేసితివి. ఇక వానరసేనలతో పురమునకు బొమ్ము. ఓ రాక్షసరాజా! స్నేహముతో నీకు నేనిచ్చిన రాజ్యమున లంకయందు సుఖముగా నివసింపుము. నిన్నా ఇంద్రుడు మొదలగు దేవతలకైనను ఇట జయింప తరము గాదు. నేను నా తండ్రి యేలిన ఆ రాజధానికి అయోధ్యకు ఇప్పుడే వెళ్లగోరుచున్నాను. ఓ స్నేహితులారా! నాకు కరుణతో సెలవొసంగుడని విన్నవించుచున్నాడను అని రాముడు చెప్పగా వానరరాజును రాక్షసరాజును ఓ దయానిలయా! మేము నీ పట్టణమును జూడవలెనని యెంతయో కోరుచున్నాము. ఆ పురమునందెవ్వరికి ఏమియు ఉపద్రవమును కలిగింపక యిష్ట ప్రకారముగా ఉద్యానవనములందును పట్టణము నందు సంచరించెదము. మేము నీతో వచ్చుటకు సమ్మతింపుము. నీవుండుచోటును, నీ పట్టాభిషేకమును జూచి నీ తల్లికి మ్రొక్కి తిరిగి మా యిండ్లకు పోయెదము సీతానాధా! మాయందు కరుణ జూపింపుము.

## శ్రీరాముడు సుగ్రీవ విభీషణాదులయోధ్యకు వచ్చుటకు సమ్మతించుట

అని వారు చెప్పగా ధర్మాత్ముడైన రాఘవుడు సూర్యపుత్రునకును రాక్షసరాజునకును నిట్లనెను. ప్రియముకంటెను మిక్కిలి ప్రియమైనదిది లభించినది. మిత్రశ్రేష్ఠులగు మిమ్ముగూడి మా పట్టణమునకు వెళ్లునట్టి గొప్ప భాగ్యము కలిగినది. సుగ్రీవా! నీవును, ఎల్లవానరులును, విభీషణా! నీవును, నీ మంత్రులు మొదలగువారును, ఇప్పుడే ఈ పుష్పకము నెక్కుడు. అని చెప్పగానే వారందఱు వెంటనే ఎక్కగా ఆ కుబేర విమానము రామచంద్రుని యాజ్ఞచే ఆకాశమార్గమున కెగిరి హంసలతో ఒప్పుచుండగా అందు రామవిభుడు కుబేరుడోయనునట్లు వెలుగొందెను.

దివ్యతరమైన యావిమానమునందు రాక్షసులును, వానరులును కనబడుచున్న చిత్రవిచిత్ర దృశ్యముల నెల్లను వర్ణించుకొనుచు ఇరుకులేక సుఖముగా ఎడమెడముగా కూర్చుండిరి. (ఆకాశమున విద్యయందు మనపూర్వులు పండితులు. ఆ విద్యయందిప్పటి వారు అకరాభ్యాసము చేసికొనుచున్నారు.)

★★★

# నూట ఇరువది యాఱవ సర్గము

## శ్రీరాముడు సీతాదేవికి పూర్వపరిచిత స్థలములను జూపుట:

రమ్యమైన ఆ విమానము రాముని అనుజ్ఞ పొందినదై గాలిచే గొట్టబడిన మేఘము వలె ఆకాశ మార్గమున వేగముగా వెళ్లుచున్న సమయమున దిక్కులను పరికించి చూచుచు చంద్రబింబము వంటి ముఖము గలదియగు సీతను జూచి ఎంతో సంతోషముతో పద్మముల వంటి నేత్రములు గల రాముడిట్లనెను. ఓ లేడి కన్నుల వంటి కన్నులు గలదానా! ఎంతయో సుందరమైన కైలాస శిఖరమును బోలియున్న ఈ త్రికూట పర్వత శిఖరమున విశ్వకర్మచే నిర్మింపబడిన లంకను జూచితివా? ఓ చంద్రముఖీ! రక్తమాంసములతో బురదగా నున్న ఈ ప్రదేశము రాక్షసులును, వానరులును యుద్ధము చేసిన రణరంగము. నేనిచ్చట నీ నిమిత్తముగా ఎన్నియో వరములు పొందినవాడును, దుష్టుడును అయిన రావణుని జంపితిని. నా బాహుశక్తిచే ఇచట కుంభకర్ణుడు సంహరింపబడెను. అక్కడ ప్రహస్తుడు యముని సన్నిధిని జేరెను. హనుమంతుడు ఇచ్చట ధూమ్రాక్షుని జంపెను. సుషేణుడిచ్చట బలవంతుడైన విద్యున్మాలిని భంగపరచెను. అచట కుటిలాత్ముడైన యింద్రజిత్తును సుమిత్రాసుతుడైన లక్ష్మణుడు గర్వమణచి సంహరించెను. వికటుడను రాక్షసుని ఇంద్రసమానబలుడైన వాలినందనుడైన అంగదుడు సంహరించెను. పాపాత్ములైన మహోదరుడును, విరూపాక్షుడును, తీక్ష్ణమైన బలముగల అకంపనుడును, అధికమైన కోపము గల మహారాశ్వుడును వానరవీరులచే ఇచ్చటనే ఆపద నొందిరి. ఓ సీతా! ఇచ్చటనే రావణుని పెద్ద భార్యయగు మండోదరి వేలకొలది సవతులను తానును కనుల వెంట కన్నీరు ధారలుగా కారుచుండగా వివిధ విధములుగా శోకముతో విలపించెను. చంద్రబింబము వంటి ముఖము గల సీతా! ఇచ్చటనే సుమా సముద్రమును దాటి నేను వానరులతో గూడి నిన్ను దలచుకొని కళవళపడుచు ఆ రాత్రి సుఖముగా గడిపితిని. లేత చిగురులవంటి మృదువైన అవయవములు గల సీతా! ప్రఖ్యాతిగా, శత్రువుల గుండెలు బ్రద్దలగునట్లు నీగురించియే సముద్రమును దాటుటకై సేతువును అసాధ్యవిధముగా నిర్మించితిని. అదియే ఆసేతువు చూడుము. ఓ సీతా! ఇది భూమియందు సేతువని ప్రసిద్ధిని పొందగలదు

సుమా. అందమైన వంకర ముంగురులు గలదానా! అలల వరుసలచే భయంకరమై యొప్పుచు పెద్దగా శబ్దించుచు శంఖులతో శుక్తులతో అందమైన సాగరమును ఓ చంద్రముఖీ! చూడుము. ఆ సాగర మధ్యమునందు అందమైన బంగారు శృంగములు గల మైనాకపర్వతమును జూచితివా? వాయుపుత్రుడు సముద్రమును దాటు సమయమున ఓ తన్వీ! అతని శ్రమను తీర్చుటకై సముద్రజలముల నుండి ఈ పర్వతమే బయటికి వచ్చి ఊరడించెను సుమా. సముద్రము మధ్యయందే నా సేనలు నిలిచినచోటు కనిపించుచున్నది చూచితివా! ఓ గజగమనా! చాలా అందముగా నున్న దాని విధమును జూచితివా? దొండ పండు వంటి అధరము గల సీతా! దేవతల చేతను పూజింపబడునదియు, తీర్థములలో శ్రేష్ఠమైనదియు, నరులచే పూజింపదగినదియు, పాపములను పోగొట్టునదియు, పవిత్రమును సముద్రతీరమున నున్న సేతుబంధమును జూచితివా? ఓ అబలా! సీతాదేవీ! పూర్వము ప్రభువగు మహాదేవుడు ఇచ్చట నాకు ప్రసన్నుడయ్యెను. ఓ పద్మనేత్రా! (మహాదేవుడు = సముద్రుడు. బ్రహ్మహత్యను బాపునొక శివలింగమును స్థాపించెనను మాటను మున్ను అనుపదము నిరాకరించుచున్నది. ఉద్యతాయుధుల హిరణ్యకశిప్వాదులను జంపినపుడు లేని, లక్ష్మణాదులకు లేని బ్రహ్మహత్య యిప్పుడెచ్చట నుండి వచ్చెనని యెదురువాదము. భగవంతునకు బ్రహ్మహత్య బాధగలదా? ఇంతకు రావణుడు బ్రాహ్మణుడు గాడు. యుద్ధమృతులకు పిశాచత్వము లేదు) ఓ వెలదీ! చిగురాకు వంటి పెదవి గలదానా! రాక్షసరాజగు విభీషణుడు వచ్చి నన్ను గలసిన స్థలమిదియే సుమా. దేవీ! అదిగో కిష్కింధానగరము. ఇది చిత్రమైన వనములతో గూడినది. సూర్యపుత్రుడైన సుగ్రీవుని పట్టణమిదే సుమా. జానకీ! నేనిందే వాలిని వధించితిని. అని చెప్పుచుండగా తామరల వంటి నేత్రములు గల సీతాదేవి భయవినయములతో రామునకిట్లనెను.

## సీతాదేవి తారాది కాంతల నయోధ్యకు తోడ్కొని పోగోరుట:

శ్రేష్ఠమైన మహిమచే మనోహరుడైన ఓ రామా! నేనొక విన్నపమును చేసెదను వినుము. తార మొదలైన వానర ముఖ్యుల భార్యలును, ఇంకను మిగిలిన వానర స్త్రీ జనులును కొలుచుండగా సంతసముతో అయోధ్యకు వెళ్లగోరుచున్నాను అని సీతాదేవి కోరగా సంతోషముతో సరే అని మేఘశ్యామల దేహుడైన రాముడు విమానమును నిల్పి సుగ్రీవునితో నిట్లనెను. సూర్యపుత్రా! వానరనాధులందఱకు తమ భార్యలతో జానకితో అయోధ్యకు వెడలవలెనని చెప్పవయ్యా! నీవును నీ స్త్రీ సంఘముతో రమ్ము. ఆలస్యము చేయవలదు

అని చెప్పగనే అతడెంతో త్వరగా అంతఃపురములోనికి వెళ్లి తన భార్యయైన తారను జూచి చంద్రుని వంటి ముఖము గల తారా! సకల వానర స్త్రీ సమూహములతో గలిసి నీవు తక్షణమే జానికీదేవి ప్రీతికై అయోధ్యకు రండని, ఎంతయో ప్రేమతో రామచంద్రుడే సెలవిచ్చెను రమ్ము. అయోధ్యను, దశరథుని భార్యలను చూడవచ్చును అని సుగ్రీవుడు, తన ప్రాణేశుడీవిధముగా చెప్పగా సర్వాంగ సుందరియైన తార సంభ్రమముతో వానరుల భార్యల నెల్ల నతివేగముగా పిలిపించి మనలనందఱను సూర్యపుత్రుడాయయోధ్యకు వెళ్లుటకై ఆజ్ఞనిచ్చెను గాన మీరందఱును నాతో చనుదెంచి రామచంద్రుని పట్టణమును, ఆపురమున నున్న జనులను, దశరథపత్నుల ఎక్కువ ఐశ్వర్యమును చూచు నాకు సంతోషమును గలిగింపుడని చెప్పగా అట్లేయని ఆస్త్రీలందఱును అధికమైన సంతసముతో అలంకరించుకొని మంచివస్త్రములను గట్టి మైపూతలు పూసికొని దేవ విమానమునకు చుట్టును ప్రదక్షిణము చేసి సీతాదేవిని దర్శింపవలెనను కాంక్షతో ప్రీతితో ఆ చంద్రాస్యలందఱును వేగముగా విమానమునెక్కగా అధికమైన వేగముగా పైకెగురగా సీతాసతితో రామచంద్రుడిట్లనెను. ఓ తీగవంటి మేను గలదానా! అదిగో ఋష్యమూకము. నేనచ్చటనే సూర్యపుత్రుని జూచి ఓ ప్రియురాలా! వాలిని చంపెదను సుమాయని ప్రతిజ్ఞ చేసితిని. చిగురాకుల వంటి హస్తములు గలదానా! విచిత్రములైన పద్మములతో నొప్పుచున్న పంపా సరోవర మదిగో. అందమైన వనములతో వింతవింతగా సంతోషమును గలిగించుచున్నది. నిన్నెడబాసిన కారణముగా విరహ తాప భారముచే ఇచ్చటనే నేను కన్నులనుండి అశ్రువులు కాలువలుగా ప్రవహించుచుండగా దుఃఖించితిని సుమా. పంపాతీరముననే ధర్మచారిణియైన శబరిని చూచితిని. ఓ మగమీల వంటి నేత్రములు గలదానా! ఓ పడతీ! యోజనము పొడవు గల్గిన చేతులు గల కబంధుని ఇచ్చటనే సంహరించితిని. లేడికన్నుల వంటి కన్నులు గలదానా! ఇదే జనస్థానము. ఇచ్చట జటాయువు నివాసమైన వృక్షరాజము కనిపించుచున్నది. ఓ కాటుక పిట్టల వంటి కనులు గల సీతా! ఇచ్చటనే పక్షిరాజునకును దుర్మార్గుడైన రాక్షసునకును నీ కొఱకై యుద్ధము జరిగెను. ఓ చకోరలోచనా! ఇచ్చటనే గదా ఖరదూషణ త్రిశురులు నా బాణములచే సంహరింపబడిరి. ఓ తామరల వంటి కన్నులు గలదానా! అల్లదిగో పూర్వము మనమున్న ఆశ్రమ ప్రదేశమును జూడుము. కలువల వంటి కన్నులు గలదానా! నిన్ను బలాత్కారముగా దశకంఠుడు దొంగిలించెను గదా. ఓ స్త్రీ శేషమా! అదే పర్ణశాల నిర్మలమైన మనస్సుతో సంతోషముగా దానిని జూడుము. ఓ సన్నని నడుము గల సీతా! నిర్మలమైన శుభప్రదమైన

నీటితో నిండియున్న గోదావరీ నది అదియే చూడుము. ఆదరముతో గూడిన మనస్సుతో లోపాముద్ర భర్తయైన అగస్త్యుని ఆశ్రమమును ఆసక్తితో జూడుము. అదియే సుతీక్ష్ణుని ఆశ్రమము చూడుము. పద్మముల వంటి కన్నులు గలదానా! అదియే శరభంగుని ఆశ్రమము. అందే కదా ఆనాడు ఇంద్రుడు వైభవముతో ఆ మహామునిని ఆదరించుటకు వచ్చెను. (ఈ వరుసను బట్టి చూడగా గోదావరికి దక్షిణము పర్ణశాల యని యేర్పడుచున్నది. కావుననే సీతాన్వేషణమున నదీ తరణము కవి చెప్పదయ్యెను.) సీతాసతీ! అచ్చటనే పెద్దశరీరము గల ఆ విరాధుడను పేరు గలవానిని సంహరించితిని. దేవీ! అల్లదిగో మునుల పర్ణశాలలు. సూర్యునితోను అగ్నితోను సమానమైన కాంతితో నున్న గొప్ప మాహాత్యము గల అత్రిమౌనిని, పద్మముల వంటి నేత్రములు గలదానా! తపస్వినియైన ఆ మునిపత్ని అనసూయను నీవు చూచుటిచ్చటనే సుమా. అదిగో సుందరమైన చిత్రకూటము చంద్రబింబము వంటి ముఖము గలదానా! మంచి నడవడి గల భరతుడు నన్ను చూచుటకు ఇష్టముతో నన్ను పురమునకు తీసికొనిపోవుటకై ఇచ్చటికే గదా వచ్చెను. చెలియా! అది యెట్లు మరవవచ్చును? అరటిబోదెల వంటి ఊరువులు గల సీతా! అదిగో దూరముగా మనోహరమైన వనములతో గూడిన యమునానది. అతివా! అదిగో మంచికాంతి గల భరద్వాజా శ్రమము. బాగుగా చూడుము. స్త్రీలలో శ్రేష్ఠురాలైన దానా! అనేక విధముల జలపక్షులు గలదియు, పుష్పములు గల చెట్ల వరుసలు గలదియునై అందముగా నున్న భాగీరథిని కన్నుల పండువుగా చూడుము దేవీ! అదిగో శృంగిబేరపురము. అది సంపదలకు నివాసము. మధురమైన వాక్కులు గల జానకీ! గుహుడందే మనల జూడవచ్చెను. హంసనడకలదానా! యూపముల వరుసలు గలదియు, పుష్పములు గల వనములతో గూడినదియు నగు సరయూనదిని చూచితివా! ఓ జనకరాజపుత్రీ! మా తండ్రి రాజధాని యగు అయోధ్యకు భక్తితో నమస్కారములను చేయుము. శుభప్రదమైన విధముగా తిరిగి మనము దీనిని జూడగంటిమి. అని చెప్పగ వానరసంఘములును, రాక్షసరాజును జనులచే నుతింపబడినదియు, తెల్లని అందమైన సౌధముల వరుసలు గలదియు, సువిశాలమైన వీధులు గలదియు ఘనమైన గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు వాని సమూహములతో నిండినదియు, ఇంద్రుని అమరావతిని బోలినదియు అగు ఆ అయోధ్యను సంతోషముతోను ఆశ్చర్యముతోను చూచిరి.

★★★

# నూట ఇరువది యేడవ సర్గము

## శ్రీరాముడు భరద్వాజాశ్రమమున పుష్పకము దిగుట:

శ్రీరామచంద్రుడు పదునాల్గు సంవత్సరములు పూర్తియైన వెంటనే పంచమీ తిథి యందు ఆ శ్రేష్ఠమైన విమానమును భరద్వాజాశ్రమమున దింపి ఆ మునిశ్రేష్ఠుని జూచి నమస్కరించి మునీంద్రా! అయోధ్యాపురము సుభిక్షముగనున్నదా? ఓ విశ్వవినుతా! ఆ వార్తయెప్పుడైన వింటిరా? మా తల్లులందఱు జీవించియున్నారు గదా! భరతుడు ప్రజలను జాగ్రత్తగా పోషించుచున్నాడా? అని తన్నడుగుచున్న తామరల వంటి నేత్రములు గల రాముని జూచి ముఖమున చిరునవ్వు కనిపించుచుండగా మునిచంద్రుడిట్లనెను. ఓ రాజనందనా! నీ యింటి యందెల్ల వారును సుఖులే. ధూళిగప్పినవాడై భరతుడు జడలు దాల్చి నీ పాదుకలను నిత్యము ఎదుట నుంచుకొని నీ రాకకై వీరవర్యా! విప్పారిన నేత్రములతో ఎదురుచూచుచున్నాడయ్యా! రామా! జనకుని సంతృప్తికై రాజ్యముతో సహా సర్వమును విడిచి నొక్క ధర్మమునే పూని భార్యతో సోదరునితో గలసి అడవులలో కందమూలములచే కడుపు నింపుకొని నీతి వీడక నారవస్త్రములను గట్టి స్వర్గము వీడిన దేవతవలె ఓ దేవా! నీవు కాలినడకతో దిరుగుచు బాధలు పడుచున్న నిన్ను చూడగా చూడగా అక్కటా! కైకమాట వలన గదా మహాత్ముడైన రాముడింత బాధచెందుచున్నాడని కడుపు భగ్గున మండుచుండగా విచారించుచుండెడివాడను సుమా. ఇప్పుడు హితులతో బంధువులతో గూడియున్న వాడవును, విరోధులను సంహరించినవాడవును, తీరిన కోరికలు గలవాడవును అగు నిన్ను జూచి కీర్తింపబడిన గుణములు గలవాడా! నీయందు అధికమైన ప్రీతి గలిగినది. సజ్జనులను రక్షించు దీక్షగలవాడా! అడవులలో జనస్థానము మొదలయిన చోటుల నీకు గలిగిన సుఖదుఃఖముల నన్నింటిని నేనెఱుగుదును. బ్రాహ్మణులను రక్షింపవలెనను నియమముతో దిరుగుచుండగా దండకాటవిలో మారీచ దర్శనమును, భవ్యశీలయైన సీతా రమణిని రావణుడు బలాత్కారముగా దొంగిలించుటయు, భయంకరమైన అడవిలో కబంధుని చూచుటయు, పంపా సరస్సును జేరుటయు, సూర్యపుత్రునితో స్నేహము చేయుటయు, ఇంద్రపుత్రుడైన వాలిని

జంపుటయు, సాహసముగల హనుమంతునిచే సీతను వెదకించుటయు నాకు తెలియును. నలునిచే సేతువును నిర్మింపజేయుటయు, బలములతోను మిత్రపుత్ర బంధువులతో గూడ రాక్షసులను, ఇంద్రవిరోధియైన రావణుని నీవును వానర సైన్యములును గలసి సంహరించుటయు, దేవతలు ప్రత్యక్షమై నీకు వరములనిచ్చుటయు శ్రేష్ఠగుణములు గల రామా! తపశ్శక్తిచే నేను సర్వమును దెలిసికొంటిని. శ్రేష్ఠమైన ధర్మబుద్ధి గల రామా! నేనును వరమిచ్చెదను కోరుకొనుము. గొప్ప గుణములు గలవాడా! ఈ దినమిక్కడ నిలువు అని ముని పల్కగా వల్లెయని ఆ మాటను శిరసావహించి సంతోషముతో ఇంద్రునిచే స్తుతింపబడినవాడగు రాముడిట్లు వరమును కోరెను. ఏ కాలమునందైనను అయోధ్యకు వెళ్లు మార్గమందెందైనను చెట్ల యందు అమృతముతో సమానమైన మధురమైన ఫలములు విరివిగా నుండుగాక ఓ దయామయమైన మనస్సు గలవాడా! అనగా సూర్యతేజుడైన ముని అట్లే యగుగాక యనగా పట్టణమునకు వెళ్లు మార్గములన్నియును సుందరములై చిగురులతో పూవులతో, పిందెలతో, మెరసెడి కాయలతో, పండ్లతో ఒప్పుచు వృక్షములన్నియు చూచుటకు కల్పవృక్షములవలె సర్వవిధములైన ఫలములతో ప్రకాశించెను. పుష్పములు లేని వృక్షములు పుష్పములతోను, పండ్లు లేని చెట్లు పండ్లతోను, పచ్చదనము లేనివి పచ్చదనముతోను, ఎండిన మోడులు పచ్చనియాకులుతోను విలసిల్లెను. ఈ విధముగా ఎటు చూచిన మూడామడల మేర వృక్షసమూహములు దేవతా వృక్షముల వలె వృద్ధి చెందగా వానరులు ఎంతో సంతోషముతో ఆ ఫల సమూహములను మెక్కిరి.

★★★



# నూట యిరువది యెనిమిదవ సర్గము

## శ్రీరాముడు హనుమంతుని భరతుని చెంతకు బంపుట:

అంత భూపుత్రి భర్తయైన శ్రీరాముడు చేయదగిన కార్యము నంతయు నాలోచించి ఆ హనుమంతునిజేరబిలిచి ఇట్లనెను. అతివేగముగలహనుమంతా! నీవు అయోధ్యాపురమున రాజగృహమున అందఱును క్షేమముగ నున్నారేమో తెలిసికొని రమ్ము. నీవు వెళ్లు మార్గమున నాకు మిక్కిలి స్నేహతుడైన గుహుడు శృంగిబేరపురమున నున్నాడు. అతనికి నా మాటగా నా క్షేమమునంతయును తెలుపుము. నాకు ఆత్మ సమానుడును, ప్రాణమిత్రుడును అగు అతడు నా కుశలమును, ఆరోగ్యమును విననంతనే ఎక్కువ సంతోషమును పొందును. నీకు అయోధ్యకు వెళ్లు మార్గము నతడే ప్రీతితో తెలియజేయును. అంత భరతుని యొద్దకు వెళ్లి నా మాటగా నా క్షేమ సమాచారమునంతయు చెప్పవయ్యా! తమ్మునితోడను, జనకరాజపుత్రి తోడను తండ్రి యాజ్ఞనంతయు దీర్చి కృతార్థుడనై వచ్చితినని మొట్టమొదట చెప్పుము. తరువాత రాక్షసుడడవి యందు సీతను హరించుటయు, సూర్యపుత్రునితో స్నేహము, వాలిని వధించుట, సీతను వెదకుట, నీవా జానికికై సముద్రమును దాటి అచ్చట ఆమెను చూచుట, యుద్ధమునకు వెడలుట, సముద్రమును జూచుట, దానిపై సేతువును గట్టుట రాక్షసరాజును వధించుట, ఇంద్రుడు, బ్రహ్మ, వరుణుడు వరములనిచ్చుట శివుని దయచే ఆకాశమున తండ్రిని చూచుట, సుగ్రీవునితోను, రాక్షసరాజుతోను నేను వచ్చుట నీవు తెలియజేయుము. భరతుడది యంతయు వినగా ఎటువంటి రూపమున నుండునో నీవు పరికింపుము. రాముడు విరోధుల నందఱను శౌర్యముతో సంహరించెను. జగత్తునందు సత్కీర్తిని నిలబెట్టెను. సాటిలేని తేజమును పొందెను. తాను చేయవలసిన పనులను పూర్తిచేసి ప్రకాశించెను. స్నేహితులను, గొప్పసైన్యమును గలిసి గౌరవముతో ప్రవర్తింపగా రాముడు వచ్చెను అని పల్కుము. అటు చెప్పుచున్నప్పుడు అతని మనోభావములు, ముఖవికాసమును, చూచు విధమును, మాట్లాడు విధమును తెలిసికొని వాని మనఃప్రవర్తన మంతయు స్పష్టముగా వేగముగా దెలిసికొని రమ్ము. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలైన వానితో నిండి శ్రేష్ఠమైన భోగములతో గూడి వంశపారంపర్యముగా అపూర్వమైన

ధరారాజ్యము ఎట్టి మానవుని మనస్సునకైనను ఆశ గలిగింపకుండునా? చిర పరిచయము చేత శ్రీమంతుడగు భరతుడు రాజ్యమును కోరియున్నచో ఈ భూమియంతయు స్వయముగా ఆ రఘునందనుడే యేలునుగాక (సుందరి, యువతి, సతియగు భార్యతో ఏకశయ్య యందు తరుణుడైన భర్త పరుండియు భోగింపకుండుట కసిధారావ్రతచర్యయని పేరు. అట్లే కరగతమైన రాజ్యలక్ష్మిని సమర్థుడయ్యు భరతుడొల్లడయ్యెను) సరసత్వముతో వాని బుద్ధి నిశ్చయమును తెలిసికొని అతడు రాజ్యాభిలాషియేని మేము ఎక్కువ దూరము వచ్చుటకు మునుముందే పరుగున రమ్ము అని చెప్పగనే హనుమంతుడు మనుష్య శరీరమును దాల్చి వేగముగా సర్పమును పట్టుటకు ఆకాశమున పరుగెత్తు గరుత్మంతుని వలె శుభమైన ఆకాశమార్గమున వెళ్లి గంగాయమునా ప్రవాహ సంగమమున శృంగిభేర పురమున సంతోషముతో గుహుని జూచి మధురమైన మాటలతో సంతోషముతో ఇట్లనెను. అయ్యా! గుహా! నీ స్నేహితుడైన రాముడు తాను చేయవలసిన కార్యములను పూర్తిచేసి సీతతోను లక్ష్మణునితోను గలసి వచ్చి నన్ను వేగముగా ఇచ్చట నీ క్షేమమును తెలిసికొన బంపించెను. పంచమి రాత్రి యందు మౌనియైన భరద్వాజునితో గడపి ఆయన ఆజ్ఞను పొందివచ్చు ఆ తామరల వంటి నేత్రములు గల రామునిప్పుడే చూచెదవు గాక అని చెప్పి ఏ చింతయు లేక సంతోషముతో పొంగి పోవుచు హనుమ వెళ్లుచుండెను. రామతీర్థమును, అందమైన వాలుకినీ నదిని, గోమతీనదిని, భయంకరమైన సాలవనమును, వేనవేల ప్రజలను, ఊళ్లను, చూచుచు వేగముగా వెళ్లి హనుమంతుడు నందిగ్రామ సమీపమున పుత్రులతో నాడుచున్న స్త్రీలును, వృద్ధులును సంతసముతో నున్నదియు, చైత్రరథము (కుబేరుని ఉద్యానవనము) నందనోద్యానములతో సాటివచ్చునదియు అధికమైన పువ్వులు ఫలములు గలదియు, అయోధ్యకు ఒక క్రోసు దూరమున నున్నదియు నగు ఒక ఆశ్రమమును వాయుపుత్రుడు చూచెను.

### హనుమంతుడు భరతుని జూచుట:

ఆయాశ్రమము నందు నార చీరలును, లేడిచర్మమును గట్టి ముని వేషమున నున్న వాడును, అన్నగారి నెడబాసిన చింతచే ఖిన్నుడై దీనుడై మిక్కిలి శుష్కించిన శరీరము గలవాడును, దుమ్ము గొట్టుకొని యున్న శరీరమును, వ్రేలాడు జడలును గలిగి బ్రహ్మర్షి వలె తేజస్సుతో ప్రకాశించువాడును, ఫలములను, దుంపలను భుజించుచు ఆత్మభావనయందు నుగ్నుడై ఇంద్రియనిగ్రహము గలవాడై నియమములను దాల్చినవాడును, అన్నగారి

పాదుకలను ముందుంచుకొని సర్వరాజ్యమును నాలుగు వర్ణముల వారును తమ తమ ధర్మములను తప్పకుండ స్థిరముగా నిల్చియుండునట్లు పాలించుచున్నవాడును అగు రాజపుత్రుని హనుమ చూచెను. కాషాయ వస్త్రమును గట్టి సౌఖ్యములను విడచి (సన్యాసాశ్రమమును గైకొనకున్నను మనస్సున సన్యాసియగుటచే నిట్టి వేషము) మంత్రులును, సేనాధిపతులును, పరిశుద్ధులైన పురోహితులును, పరిశుద్ధబుద్ధులైన పౌరులును సేవించుచుండగా ఉన్న భరతుని హనుమ చూచెను. శరీరమును దాల్చిన ధర్మమో యనునట్లున్న ఆ ధర్మజ్ఞుని దర్శించి చేతులు జోడించి వినయాతిశయము కనిపించు విధముగా వాయుపుత్రుడు మంచిమాటలతో నిట్లు విన్నవించెను. ఓ కాకుత్థ్సవంశశ్రేష్ఠుడా! భరతా! ఏ రాముడు దండకాటవిలో నారవస్త్రములు మృగచర్మము ధరించియున్నాడని నీవు చింతించుచున్నావో ఆ రాముడు గారాబముతో నీ క్షేమమును విన గోరియున్నాడు. నీకు ప్రియము చెప్పెదను. దారుణమైన దుఃఖమును విడువుము. నీ ప్రియమైన తోడబుట్టినవాడగు రాముని ఈ ముహూర్తము నందే చూచెదవు గాక. రావణుని సంహరించి భార్యను పొంది సౌమిత్రితో గలసి శచీదేవితో నున్న దేవేంద్రుని విధముగా వైదేహితోను, మిక్కిలి ప్రియమైన మిత్రబృందముతోను సేనతో ఆనందముతో వచ్చుచున్నవాడు. అని చెప్పగనే ఆ మాట విన్న మాత్రముననే మిక్కిలి సంతోషముతో మూర్ఛనొంది నేల వ్రాలెను. అంత ఒక ముహూర్తము లోపల తెలివి పొంది రాజపుత్రుడు ఊరడిల్లి అనునయముతో ప్రియమును చెప్పుచున్న వాయుపుత్రుని ప్రేమతో కౌగిట గ్రుచ్చి అధికమైన కన్నీటి బిందువులచే అతని శరీరమును తడిపి కైకపుత్రుడైన భరతుడిట్లు పలికెను. ఓ అనఘా! నీవు మనుష్యుడవో! దేవతవో దయతో నాకు సందోషమును గలిగించు సంగతిని ఈ విధముగా జెప్పుటకు వచ్చితివి. ఈ మాటను చెప్పినందులకై నూరు గ్రామములను నూరువేల గోవులను, సర్వలక్షణ సంపన్నలై, సర్వాంగసుందరులై భూషణ భూషితలైన కులకన్యలను పదునార్వురను ఇచ్చెదను. అని అద్భుతముగా నున్న రాముని రాకను విని గొప్ప సంతోషముతో రఘురాముని జూచు కోరికతో కౌతూహలమతిశయించు చుండగా తిరిగి హనుమంతునితో నిట్లనెను.

★★★

# నూట యిరువది తొమ్మిదవ సర్గము

## హనుమంతుడు భరతునకు శ్రీరామ వృత్తాంత మంతయు దెలుపుట:

ఎన్నో యేండ్లకు ముందు రఘురాముడరణ్యములకు వెళ్లెను. మరల ఇన్నాళ్లకు చెవుల పండువుగా నా దైవమయొక్క పొగడ్తను వినగల్గితిని. శరీరమున ప్రాణములున్నచో మనుష్యుడు నూఱేండ్లకైనను గొప్ప సంతోషమును పొందునను సామెతను చెప్పు కొనుచుండగా మునుపు వినియుంటిని ఇప్పుడది యదార్థమైనది గదా. (భరతుడు శ్రీరాముడునున్నాడనుట చేతను, సీత హనుమంతునితో జెప్పిన యీ మాటలే చెప్పుటచేతను శ్రీరామ విషయమున సీతాభరతులు సమానభక్తి పారతంత్ర్యములు గలవారు) ఎట్లు? ఏ దేశమునందు? పర్వతములలో సంచరించువానరులతో రామచంద్రునకు స్నేహము లభించెను. ఉత్తమమైన చరిత్రగల హనుమా నాకు సర్వమును తెలియజెప్పుము. అని అడుగగా దర్భాసనమున గూర్చుండి హనుమంతుడు సుజనులకు సమ్మతముగా నడచునట్టి దశరథపుత్రునకు రామచంద్రుని చరిత్రనంతయును వినిపించెను. భరతా! మీ తల్లి కోరుటచే సీతానాధుడు మునివేషమును ధరించి అడవులకు వెళ్లగా, పుత్రశోకము చేత దశరథుడు మృతిచెందగా, దూతలను బంపి మిమ్ములనయోధ్యకు పిలువపంపగా ధర్మనిష్ఠుడవై రాజచంద్రా నీవు రాజ్యభారమును వహింపనిష్టపడక చిత్రకూటమునకు వెళ్లి రామచంద్రుని రాజ్యమును దీసికొమ్మని బ్రతిమాలుటయు, రాముడు రాజాజ్ఞను తప్పననుటయు, పిదప మీరలు అన్నపాదుకలను పుచ్చుకొని వచ్చుటయు, మీకందఱకు తెలిసియే యున్నది గదా. తరువాతి చరిత్రనంతను చెప్పెదను వినుము. మీ రాకపోకలచే మిక్కిలి భయముతో పక్షులు, మృగసంతతులును దిక్కుతోపక వలసపోవుటచే ఆ వనము నివాసమునకు సంచారమునకు అయోగ్యమగుటచే ఏనుగులు, ఖడ్గమృగాలు, సింహములు, పందులు మొదలగు జంతువులు సంచరించు భయంకరమైన దండకాటవిని భార్యతో తమ్మునితో గలసి రఘుసత్తముడు ప్రవేశించెను. వారు వెళ్లుచుండగా విరాధుడను రాక్షసుడు గొప్ప అరపులతో వచ్చి కలబడగా ఆ దైత్యును మొగముక్రిందికి చేతులుపైకి ఉండునట్లుగా భూమియందు శౌర్యవంతులగు అన్నదమ్ములు పాతిపెట్టిరి. వారా

సాయంసమయముందు ముక్తసంగుడైన శరభంగుని గాంచిరి. అంతట శరభంగముని స్వర్గమునకు వెళ్లగనే, శ్రేష్ఠమైన పరాక్రమము సత్త్వముగల రాముడు తాపసుల కందఱకును భక్తితో నమస్కారములు చేసి జనస్థానము నందు నివసించెను. చుప్పనాతి శూర్పణఖ యను రాక్షసి రాముని యొద్దకు రాగా రాముని యాజ్ఞచే శ్రీమహితుడైన లక్ష్మణుడు దాని ముక్కును చెవులును గోసివేసెను. అంత యుద్ధమునందు ఒక దినమందలి నాల్గవభాగముననే రఘూత్తముడు ఒక్కేడ పదునాల్గు వేలమంది రాక్షసులను నామరూపములు లేకుండ సంహరించెను. ఈ విధముగా మహాబలవంతులును, భయంకర కృత్యములు చేయువారును, హీనమైన చరిత్రగలవారును బాహాటముగా మునిశ్రేష్ఠులను బాధించువారును అయిన ఖరాది రాక్షససేనలను సంహరింపగనే దుష్టురాలగు శూర్పణఖ రావణుని యొద్దకు వెళ్లెను. వాడు సీతాదేవిని దొంగిలింపవలెనని మనస్సులో తలచి తన అనుచరుడైన మారీచుని, క్రూరుడును ఘోరాకారుడునైన వానిని రత్నమయమైన లేడియై సీతాదేవిని ఆశపొందింప జేయుటకు పంపించెను. ఆ సుందరమైన మృగమును జూచి భూపుత్రియు తన భర్తను జూచి ఈ లేడి మన ఆశ్రమ మృగమై యున్నచో అందముగా కనుల విందుగా నుండును గదా యనగా రాముడు ధనువు బట్టి ఆ లేడి వెంట వెళ్లి అది పరువెత్తుచుండగా మిక్కిలి వాడియైన బాణముతో దానిని జంపెను. రాముడు వెళ్లుటయు, లక్ష్మణుడును వెనుక వెళ్లుటయును జూచి (సీతా లక్ష్మణ సంవాదము వారు ముఫ్వురు దప్ప మఱియెవ్వరెఱుగరు) పది ముఖములు గల రావణుడు తొందరపడుచు క్రూరమైన దుష్టగ్రహము రోహిణిని చేరిన విధముగా జానకీదేవి యొద్దకు వెళ్లి ఆ దుష్టుడు ఆమెను భయపెట్టుచు బలాత్కారముగా దొంగిలించి ఆకాశమార్గమున వెళ్లుచుండగా జటాయువను పేరు గల గృధ్రరాజు వేగముగా వెంబడించి వీరత్వముతో గొప్ప యుద్ధము చేయగా వానిని సంహరించి రాక్షసుడు విపరీతమైన వేగముతో వెళ్లుచుండగా పర్వత శిఖరము మీద గూర్చున్న పర్వత సమానులైన వానర నాయకులాశ్చర్యముతో ఆ రావణుని జానకిని చూచిరి. ఆ విధముగా రావణుడు వెళ్లి వెళ్లి లంకారనగరమున తన బంగారు సౌధము నందు జానకీదేవి నుంచి ఎన్నియో అనునయవాక్యములు పల్కగా గడ్డి పరకలను వలెఅతని మాటలను వినక అశోకవనము నందు దుఃఖించుచు ప్రాణనాధునికై చింతించుచు పడియుండెను. అచ్చట రాముడు మాయామృగమును ద్రుంచి తిరిగి వచ్చి సీతను గానక వెదకుచు తిరిగి తిరిగి తన తండ్రి స్నేహితుడైన గృధ్రరాజు చంపబడి యుండుటను జూచి

అతనికి దహన సంస్కారము గావించి ఆ దశరథ పుత్రులు అడవి యందు సీతను వెదకుచు గోదావరి చెంతనున్న వనమున కబంధుడనువానిని సంహరించి అతని మాటలచే ఋష్యమూకము నందు సుగ్రీవుని జూచెను. అతడు తన అన్నయైన వాలి ప్రఖ్యాతి చెందిన బలము గలవాడు తనను తిరస్కరించుట మొదలగునవి విన్నవించెను. ఒకరితో నొకరు మాటాడుకొనుటచే వారి స్నేహము వృద్ధినొందెను. రాముడు భయంకరమైన యుద్ధమున ప్రఖ్యాత బలుడైన వాలిని సంహరించి సూర్యపుత్రుని వానర రాజ్యమునకు రాజుగా జేసెను. అతడు భూపుత్రిని వెదకుటకై భూమియందన్ని దిక్కులకును పదికోట్లమంది వానరులను బంపెను. ఆ పంపిన వారిలో మేము కొంతమందిమి దక్షిణ దిక్కున వెదకుచు బోయి వింధ్యపర్వతము నందు సంచరించుచుండగా రాజు చెప్పిన గడువంతయు తీరిపోయినదని మనస్సులందు గొప్ప దుఃఖమును బొంది జీవితము నందాశను విడచి దుఃఖించుచుండగా జటాయువు తమ్ముడైన సంపాతి యను నాతడు జానకీదేవి రావణుని యింట నుండుటను ప్రీతితో చెప్పెను. దుఃఖభారముతో నున్న మిత్రుల శోకమును దొలగించుటకై నేను నూరామడల వెడల్పుగల సాగరమును అధికమైన వేగముతో పరాక్రమముతో దాటి లంకయందసోకవనమున సంతోషము లైనిదై పరిశుద్ధమైన నియతిగలదై దుఃఖముతో తల్లడిల్లుచు మలిన వస్త్రము ధరించినదై ఒంటరిగా చింతించుచున్న జానకిని జూచితిని. ఆమె యొద్దకు వెళ్లి ఆమె వృత్తాంతము నంతయు దెలిసికొని రామచంద్రుడానవాలుగా నిచ్చిన ముద్రిక నామెకిచ్చి దానికి బదులుగా ఆమెయిచ్చిన చూడామణిని పుచ్చుకొని ధన్యుడనైతినది యెంచి రామచంద్రుని జేరి ఆనవాలుగా మణిభూషణము నిచ్చితిని. ప్రాణములు పోవుచున్న సమయమున వ్యాధితో నున్న మనుష్యుడు అమృతమును త్రాగి బ్రతికిన విధముగా రాజచంద్రుడు జానకి వార్త దెలుపగా భూమియందు బ్రదుకుటకు ఆశ పొందెను. ప్రళయ కాలమున జగములను భస్మము చేయబూను అగ్నియోయనునట్లు తామరల వంటి విశాలములైన కన్నులు గల రాముడు విరోధి సంఘములను వధింపదలంచి వానరసేనలతో వెళ్లి సాగరమున సేతువు గట్టుడని ఆజ్ఞాపింపగా నలుడు అట్లే చేయగా రామచంద్రుడనంతమైన బలములతో సముద్రమును దాటెను. నీలుడు ప్రహస్తుని జంపెను. రామచంద్రుడంతట కుంభకర్ణుని వధించెను. అద్భుతమైన విధముగా సుమిత్రా సుతుడు యుద్ధమున రావణపుత్రుడైన యింద్రజిత్తును చంపెను. రామచంద్రుడు రావణుని సంహరించెను. అంతట ఇంద్రుడును, వరుణుడును, యముడును, శివుడును,

బ్రహ్మదేవుడును, దశరథరాజును ప్రత్యక్షమైరి. శ్రీ మహితుడైన రామచంద్రుడు మౌనుల చేతను, దేవతల చేతను వరములను పొందినవాడై వారియనుగ్రహముచే బ్రదికిన వానరులతో గూడినవాడై పుష్పకవిమానమున వేగముగా గదలి కిష్కిందానగరము చేరి వానరపత్నులను దీసికొని గంగానదీ తీరమున మునియాశ్రమము నందు ఉత్తమమైన భక్తితో రామచంద్రుదున్నాడు. ఓ రాజా! రేపు పుష్యయోగమున నీవు రాముని జూచెదవు. ఇది నిజము సుమా యనగా సంతోషముచే పొంగి చేతులు జోడించి భరతుడు ఎన్నినాళ్లకు నా కోరిక తీరినదని చెవుల పండువుగా బలికెను.

★★★



# నూట ముప్పదవ సర్గము

## శత్రుఘ్నుడయోధ్యా నగరమును శృంగారింపించుట:

అంత భరతుడు తన తమ్ముడగు శతృఘ్నుని జూచి తమ్ముడా! అయోధ్యా నగరము నందలి అన్ని దేవాలయములందును దేవతలందఱిని (ఇవి అర్చావిగ్రహములు కాకుండిన నీ వర్ణనమనన్వయము) తగిన విధముగా చందనము పుష్పమాలికల సమూహములతో, మంగళవాద్యములతో పురాణ సమాహముల యందు నేర్పరులైన బ్రాహ్మణులను, స్తుతులు చేయువారలను, వాద్యముల నెరిగిన వారలను, వేశ్యలను, వైతాళికులను, భటులను అందఱను మంచి వేషములు ధరించి శ్రీ రామచంద్రుని చంద్ర తుల్య ముఖమును చూచుటకై వేగముగా ప్రయాణమగునట్లు చేయుము. తక్కిన అవసరమైన పనులనన్నింటినీ తగిన విధముగా నొనరింపుము. అని భరతుడు చెప్పగనే శత్రుఘ్నుడు సంతోషముతో వెట్టివారిని పనివాండ్రను వేనవేలమందిని పంపెను. ఒక్క ముహూర్తకాలములోనే వేగముగా నంది గ్రామము నుండి అయోధ్య వఱకు భూమియందు మెరకలు పల్లములు సమముగా చేసి నీరుపోసి మార్గమంతయును దట్టించి పన్నీరు జల్లించి పువ్వులను పేలాలను విరివిగా చల్లించి ప్రకాశమానమైన కాంతులతో ఒప్పుచున్న జెండాలనెత్తించిరి. సూర్యుడుదయించు వేళకు అన్ని ఇండ్లను, సుందరమైన విధముగా చిత్రముగా మంగళకరముగా అలంకరించి తోరణములు పుష్పసమూహములను గట్టిరి. పురము నందంతట, సువాసనలు గల పుష్పములతోను ఐదురంగుల ముగ్గులతోను అలంకరింపుడని గొప్ప సంతోషముతో అంతట చాటింప నియోగించెను.

## భరతాదులు శ్రీరామునెదుర్కొన బోవుట:

అట్లు పట్టణమంతయు నలంకరింపజేసి మఱునాడు తెల్లవారు ఝాముననే లేచి దశరథ మహారాజు భార్యలును, మంత్రులును, బ్రాహ్మణులును, రాజవంశీయులును, సైన్యములును, స్త్రీలును, అతి సంతోషముతో వరుసలు వరుసలుగా బయలుదేరిరి. మంత్రపాలుడు ధృష్టి, సుమంత్రుడు, అర్థసాధకుడు, జయంతుడు, విజయుడు,

అశోకమంత్రి, సిద్ధార్థుడు అనువారు గొప్ప బంగారు ఆభరణములతో అలంకరింపబడిన ఏనుగుల నెక్కి దర్పముతో పయనించిరి. బంగారు నడికట్టుగల ఏనుగులపై కొందఱు, ఆడేనుగలపై కొందఱు, గుఱ్ఱములు గట్టిన రథములపై కొందఱు రాజుగారి ఆంతరంగికులు ప్రయాణమై వెళ్లిరి. ప్రాసము, శక్తి, చంద్రహాసము, యష్టి మొదలైన ఆయుధములను, ధ్వజములను జెండాలను సంతోషముతో చేతులందు ధరించి గుఱ్ఱములనెక్కి భటులతో గూడి వీరుల సమూహము తరలి వెళ్లెను. కౌసల్యయు, సుమిత్రయు ముందు నడువగా దశరథుని భార్యలందఱు వారితో గలసి సంతోషముతో వాహనములనెక్కి అధికమైన భక్తితో నంది గ్రామం చేర వెళ్లిరి. కైకేయి కూడ వారలతో గలిసి అచ్చటకు వెళ్లెను. పట్టణమున నున్న వారందఱును కోరికతో సంతోషముతో నంది గ్రామమునకు వెళ్లిరి. గుఱ్ఱపుడెక్కల చప్పుడుల చేతను రథచక్రముల అంచుల చప్పుడుల చేతను, దుందుభుల మ్రోతల చేతను, శంఖముల ధ్వనులు చేతను జనుల మాటలు ఘోషల చేతను భూచక్రమంతయు సంచలించెను. పురజనులును, వర్తకులును, బ్రాహ్మణశ్రేష్ఠులును, పుష్పమాలలు, కుడుములు చేతుల ధరించినవారును మంత్రులును తన వెంటరాగా ధర్మాత్ముడైన రాముని సోదరుడు ఆ ఆర్యుని పాదుకలను శిరస్సున ధరించి మృదంగముల మ్రోతలును, శ్రేష్ఠులైన నంది జనుల స్తోత్రములును చెలంగుచుండ రామచంద్రుని జూడవలెననెడి కోరికతో బయలుదేరెను. తెల్లని పుష్పములచే అలంకరింపబడిన వెల్లగొడుగు బట్టి ప్రకాశమానములైన బంగారు చామరములను బూని మృగచర్మమును నారచీరలు ధరించి ఆర్తిచేత ఉపవాసములచేత కృశించిన వాడగు భరతుడు అన్న యొక్క రాకను విన్న సంతోషముతో ఆ రఘువంశజుని దర్శింపవెళ్లెను. అట్లు వెళ్లుచు నాల్గు దిక్కులను పరీక్షగా జూచి రఘురాముడు రాకుండుటచే హనుమంతుని జూచి ఇట్లనెను. సూర్యవంశమున కాభరణము వంటి అనఘుడైన రాముడు రాడాయెనే! కామరూపులగు వానరులలో నొక్కడైనను గనబడడే! నీకిప్పుడు కపి సహజమైన చపలబుద్ధి కలుగలేదు గదా!

## వానరుల రాక ఆలస్యమగుటకు కారణమును హనుమంతుడు భరతునకెరింగించుట:

అని యిట్లు భరతుడనగా వాయుపుత్రుడు సత్త్వము బలము ఐశ్వర్యము గల రాజశ్రేష్ఠునితో ఆలస్యమైన కారణము మనస్సు రంజిల్లునట్లుగా ఇట్లు విన్నవించెను.

రాజేంద్రా! భరద్వాజముని శ్రేష్ఠుని అనుగ్రహము చేత మనోహరములైన పుష్పములు ఫలములతో నిండి తుమ్మెదల మ్రోతలు గలవై స్వచ్ఛమైన తేనెల గురిపించుచున్నవి. వానరులు నివసించు స్థలములు వనములు ఆ విధముగా నుండునట్లు దేవపతియైన యింద్రుడు కూడ వరమిచ్చియున్నాడు. మునిశ్రేష్ఠుడగు భరద్వాజుడు శ్రేష్ఠగుణాన్వితమైన విందు చేసినాడు కాన. దానితో వానరులు ప్రొద్దుపుచ్చుచున్నారు. అదియును గాక అదే పర్వత నివాసులైన వానరుల కలకలములు వినవచ్చుచున్నవి. వానరసేన గోమతీ నదిని దాటుచున్నదని తలంచుచున్నాను. ఆ వాలుకీ నది వైపున ధూళులధికముగా ఆకాశము నంటుచున్నవి చూడుము. సాలి వనమున కోతులు చెట్లను సొంతముగా పడగొట్టుచున్న విధము తోచుచున్నది. అదిగో దూరమునందు స్వచ్ఛమైన చంద్రుని వలె నున్న విమానమును జూడుము. దానిని బ్రహ్మ మనస్సుచే నిర్మించెను. పుష్పకమను పేరు గలది. యుద్ధము నందు బంధువులతో గూడ రావణుని సంహరించి భూపుత్రి భర్త సూర్యునితో సమానమైనదియు, దివ్యమైనదియు, మనోవేగముగలదియు అగు ఆ విమానమును ఈ సమయమున తీసికొనెను. రామునకు వాహనమైన దీనిని తొలుత బ్రహ్మశివసఖుడైన కుబేరునకు ప్రేమతో ఇచ్చెను. అతనిని విరోధముచే గెలిచి రాక్షస రాజు హరించెను.

## విమానమున నున్న శ్రీరామాదులను భరతునకు హనుమంతుడు చూపుట:

ఓ భరతా! అదిగో మహానుభావుడైన రాముడు సీతతోను గారాబు తమ్మునితోను గూడి యున్నాడు. వానరశ్రేష్ఠుడదిగో. ప్రియము గోరు విభీషణుడు వాడే. రాముడు వాడే యని హనుమంతుడు చెప్పగనే ఆకాశము వంక జూచి స్త్రీల వృద్ధుల బాలుర సమూహములును యువకులును వాడే శ్రీరాముడు, వాడే రాముడు, అదిగో రాముడు అనుచు వ్రేలితో జూపుచు మెడలెత్తి చూచి సంతోషముతో గొప్ప శబ్దములను జేసిరి. ఆకాశమున అందముగా నున్న చంద్రుని జూచు విధముగా రథములను, ఏనుగులను, గుఱ్ఱములను దిగి నిలబడి విమానము నందు ప్రకాశించు రాముని లోకులు ప్రేమతో చూచి సంతోషము నందిరి. ఆ భరతుడును తన తామరల వంటి చేతులు జోడించి భూపుత్రీ పతికి అభిముఖుడై, తనమాట ప్రకారము వచ్చినవాడును, విశాలమైన కన్నులు గలవాడును, దేవేంద్ర సదృశుడును, విమానమునందున్నవాడును అగు రాముని బంగరు కొండపై నున్న సూర్యుని సేవించెడి విధముగా మ్రొక్కెను. అంత హంసలు బూన్చిన యా శ్రేష్ఠమైన విమానము తామరల

వంటి కనులు గలవాడగు రాముని యాజ్ఞచే భూమిపై వ్రాలెను. భరతుడా విమానము నెక్కి రాముని దగ్గఱకు వెళ్లి పాదముల వ్రాలి నమస్కరించెను.

## శ్రీరామ భరత సమాగమము:

వెంటనే రామచంద్రుడు కైకపుత్రుని లేవనెత్తి ఎన్నెన్ని దినములకో చూచిన మిక్కిలి గారాబు తమ్మునిని ఎంతో ప్రీతితో అంకమున నిల్పి కన్నుల నానంద బాష్పములు రాలుచుండగా మన్ననతో కౌగిట గ్రుచ్చి తండ్రీ! సుఖమా యని సోదరమైన మాటలు పల్కగా భరతుడు సంతోషముతో లక్ష్మణుని సమీపించి మ్రొక్కుచున్న అతనిని కౌగిలించుకొని (లక్ష్మణుని కంటెను వయస్సున పెద్దవాడు. పుష్యమి యందు భరతుడు ఆశ్లేషయందు లక్ష్మణుడు జన్మించిరి) తరువాత ప్రీతితో సీతకు తన పేరు దెలుపుకొనుచు నమస్కరించి సూర్యపుత్రుడైన వానర వీరుని, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుని, ఇంద్రపుత్రుని పుత్రుడైన అంగదుని ప్రేమతో కౌగిట జేర్చి తిరిగి మైందుని ద్వివిదుని, గంధమాదనుని, సేనానాయకుడైన శరభుని, పనసుని, నలుని, గవాక్షుని, సుషేణుని మొదలగు వారి నందఱను ప్రేమతో కౌగిలించుకొనగా అందఱుని కామరూపులుగాన మనుష్యరూపములతో మానవపతిని క్షేమమడుగగా మనస్సునందు పొంగిపోవుచు ఆ సత్యావాదియైన భరతుడు సుగ్రీవుని హృదయమున గ్రుచ్చిపట్టి అధికమైన ప్రీతితో ఇట్లనెను. సుగ్రీవా! పవిత్రమైన మైత్రిచే మిత్రుడు గలుగును. కీడుచేయుట శత్రువునకు గుర్తు. కావున ఓ నిర్మల చరితా! మేమిదివఱకు నలువురమే సోదరులము. ఇప్పుడు నీ వైదవవాడవయితివి. అని తరువాత విభీషణుని తగు విధముగా కౌగిలించి నెమ్మదైన మాటలతో ఓ అనఘా! నీ సహాయముచే సాటిలేని దుష్కరమైన కార్యము మాకు సాధ్యమయ్యెను గదా అనెను. అంత శత్రుఘ్నుడును రాముని పాదముల వ్రాలి లక్ష్మణునకు మ్రొక్కి భక్తితో సీతపాదపద్మములకు వందనము చేసి నిలువగా, అంత శ్రీరామచంద్రుడు దుఃఖభారముచే అలసియున్న తల్లిని సమీపించి పాదముల మీద సాష్టాంగపడి పట్టుకొని అమ్మా! అలనాడు నీ మాటను విననైతిని. నన్ను క్షమింపుము అని ప్రసన్నురాలినిగా జేసి సుమిత్రకు మ్రొక్కెను. కీర్తి కలిగిన కైకకు, తక్కిన తల్లుల కందఱకును నమస్కరించెను. భక్తితో పురోహితుడైన బ్రహ్మ సమానుడగు వసిష్ఠుని పాదముల వ్రాలెను. ఓ శ్రీరామభద్రదేవ! నీకు స్వాగతము. మా తండ్రీ! క్షేమమా నీకు రామచంద్రా! దీర్ఘమైన బాహువులు గలవాడా! కౌసల్యాపుత్రా! నీకు సౌఖ్యమా అని పౌరజనులందఱు దోసిళ్లు ఒగ్గి పలుకగా సంతోషించి సుందరమైన తామర మొగ్గలా

యనునట్లున్న వారి కైమోద్పులను సూర్యవంశజుడు కడు ప్రేమతో చూచెను. అంతట కైకపుత్రుడు రాముని పాదుకలను స్వయముగా పట్టుకొని రాముని పాదపద్మములకు ఎంతయో భక్తితో తొడిగి నిల్చి మంచిమనస్సు గల భరతుడు చేతులు జోడించి నీదైన రాజ్యమునంతయును నేనింత వఱకు కాపాడుచుండి ఇదిగో ఇప్పుడు తిరిగి నీకిచ్చితిని. (ఇట్లే భక్తుడును తన దేహములోనుగా తనది యనుకొను చేతనాచేతనాత్మకమైన సర్వస్వము భగవంతునిదే. ఆయన మనకు తరణోపాయ సాధనముగా ఇచ్చియున్నాడు. మనది పరతంత్ర కర్తృత్వమే యని తలచి ఇల్లడ సొమ్ముంచుకొన్నవాడు సొత్తు స్వామికి సొత్తును జేర్చినట్లు భగవంతునకు సమర్పించి భారము తొలగించుకొనును.) ఓ రాజచంద్రా! నిన్నయోధ్యకు రాజుగా జూచు పుణ్యముగలుగుటచే నా జన్మము సార్థకతనొందినది. నేడు నేను భూమియందు ధన్యుడనైతిని. రాజా! చూడుము కోశాగారము, ధనములు పట్టణము, సైన్యము నీ తేజస్సుచే పదిరెట్లుగా పెరిగినవి. (దీనివలన భరతుని రాజ్యమను లోకోక్తి నిరాకీరమని యేర్పదగచున్నది) గుణములచే పొగడబడినవాడా! ఈ సకలమును నీవు స్వీకరింపుము. అని చెప్పగనే సోదర వాత్సల్యము గల ఆ భరతుని జూచి తమ్ముడనగా ఇట్టివాడైయుండవలెను గదా యనుచు వానరులును, ఆ విభీషణుడును ఆనంద బాష్పములను నించిరి. అంత శ్రీరామ విభుడు.

## శ్రీరాముడు భరతు నాశ్రమమునకు పోవుట:

పరమానందముతో భరతుని తొడ యందుంచుకొని సైన్యముతో గూడినవాడై భరతుని ఆశ్రమభూమికి ఆ పుష్పక విమానముతో ప్రయాణమై వెళ్లెను. అట్లు వెళ్లి నంది గ్రామమున అందరితో పుష్పకము నుండి దిగి భూమి యందు నిలిచి ఆ దేవవిమానమునకు కుబేరుని సేవింప వెళ్లుటకై సెలవిచ్చి పంపెను. అదియును రామాజ్ఞను పొంది ఉత్తరదిక్కుగా వెళ్లి కుబేరుని సేవించెను. (విమానము నడపువాని కని యర్థము) అంతట శ్రీరాముడు సంతోషముతో దేవేంద్రుడు బృహస్పతిని సేవించువిధముగా ప్రఖ్యాతుడగు ఆ పురోహితుని పాదములను వేగముగా స్పృశింపగా ఆ యిద్దఱును స్వచ్ఛమైన పీఠములపై ఒక్కసారిగా గూర్చుండిరి.

★★★

# నూట ముప్పది యొకటవ సర్గము

## భరతుడు రాజ్యము శ్రీరామున కప్పగించుట:

కైకేయి ముద్దుల కుమారుడైన భరతుడు చేతులు జోడించి శిరము నందుంచుకొని సత్యవిక్రముడైన తన అన్నయగు రామభద్రునితో శ్రేష్ఠమైన బుద్ధితో ఇట్లనెను. అన్నా! నా జననియైన కైకయొక్క వాక్యములను పాటించి రాజ్యమును, ఐశ్వర్యమును విడచి శ్రేష్ఠమైన సద్గుణములు గలవాడా ఆమెను గౌరవించితివి. ఆ తరువాత ఓ సచ్చరితుడా! పూర్వము రాజ్యమును నీవు నా వశమున నుంచితివి. నీవిచ్చిన రాజ్యమును ఇప్పుడు నేనట్లే తిరిగి నీకిచ్చుచున్నాను. గ్రహింపుమయ్యా రామా! బలమైన ఆబోతు ఒంటరిగా నైనను ఎంతైనను బరువును మోయగలదు గాని లేగ దూడలు భరింపజాలని విధముగా నేనీ పెద్ద భారమును మోయనిష్టపడను సుమా. భయంకరమైన జలము యొక్క అతివేగముగా భిన్నభిన్నమైన సేతువును మహాప్రయత్నముచే రక్షించినను నిలువని విధముగా ఈ ఛిద్రరాజ్యమును గొప్పపరాక్రమముచే ఆవరించి గాని నిల్పశక్యమగునా? ఆలోచింపుము. మానవనాధా! కాకి హంసవలె పోగలదా? గాడిద గుఱ్ఱమువలె పరువెత్తునా? ఓ మహాత్మా! ఆ విధముగా నీ మార్గముననుసరింప నాయట్టి వాడు నేర్చునా? ఒకడు పండ్లమీద కోరికతో తాను నివసించునింటి తోటయందు చెట్టును పెంచుచుండగా అది ఎక్కుటకు శక్యముగానంతగా బెరిగి చాలా కొమ్మలు గలిగి పూచి ఒక్క ఫలమైనను ఈయకున్నచో ఆ చెట్టును పెంచిన వాని ప్రయత్నము వ్యర్థమైనట్లే గదా. ఓ రాజా! అట్లే నీవును ఈ భక్తులును, భృత్యజనులను, హితులను కాపాడుటకై ఈ రాజ్యము నేలకుంటివేని ఈ ఉపమానము నీకే సరిపడును సుమా. ఓ గొప్పగుణములు గలవాడా! నీ తండ్రి చెట్టు నింటి యందు నాటిన వాడగును సుమా. ఇది నిజము దేవా! రామా! మిట్ట మధ్యాహ్నమున ప్రకాశవంతుడైయున్న తీక్ష్ణకిరణుడైన సూర్యుని జూచు విధముగా ఈ భూమి యందలి ప్రజలు పట్టాభిషిక్తుడవై ప్రకాశించు నిన్ను చూచెదరయ్యా! అందమైన మంగళవాద్య ధ్వనులతోను, వడ్డాణముల అందెల ఘలఘల శబ్దములతోను శింజానములతోను మధురమైన గాన ధ్వనులతోను ఇంక నీవు నిద్రనుండి మెలుకువను పొందదగును. (ఇది వఱకు సౌశీల్య వాత్సల్య కారుణి

కత్యపరమోదారత్వ మధుల భావములు ప్రకటించితివి. ఇక నీశ్వరత్వమును ప్రకటింపుమని భావము) ఈ భూమి యెంతవఱకు నిలచియుండునో ఈ ఖగోళమెంతవఱకు స్థిరముగా నుండునో అంతవఱకు నీవు ప్రభుత్వమును పొంది ఈ జగత్తు నంతయు ప్రీతితో పాలింప దలంపుము. అని చెప్పుచున్న భరతుని వాక్యములను విని విరోధులను సంహరించిన వాడగు రామచంద్రుడు అట్లేయని చెప్పగా భరతుడు మనస్సునందు పొంగిపోవుచు తన పీఠము నొద్దకు వెళ్లి కూర్చుండెను.

## శ్రీరామాదులు జడలు విడుచుట:

అంత శత్రుఘ్నుని ఆజ్ఞతో సుఖముగా క్షురకర్మను జేయు నేర్పుగల మంగళ్లు వచ్చి (క్షత్రియులకు మీసముల కత్తిరింపే గాని శిరఃక్షారము లేదు) సూర్యవంశజుడైన రామునకు క్షురకర్మను పూర్తిచేసినంత భరతుడు మొదటను, తరువాత సుమిత్రా సుతుడును, పిమ్మట సుగ్రీవుడును ఆ వెనుక రాక్షసరాజును వరుసగా స్నానములు చేయగా జడలు చిక్కులు దీయించి స్నానముచేసి శ్రేష్ఠులు ధరింపదగిన వస్త్రములను చిత్రమైన మూల్యములను అనులేపనములను అలంకరించుకొని శోభిల్లుచున్నవాడును, మూడు లోకములను మోహింపజేయువాడును అగు రామునకును సుందరమైన లక్షణములు గల లక్ష్మణునకును శత్రుఘ్నుడు సంతోషముతో మణి భూషణములను తొడిగెను. ప్రకాశమానమగు విధముగా దశరథుని భార్యలు మిక్కిలి సంతోషముతో మణి భూషణములను తొడిగెను. ప్రకాశమానమగు విధముగా దశరథుని భార్యలు మిక్కిలి సంతోషముతో క్రొత్తక్రొత్తలైన అలంకారాములను తామే స్వయముగా సీతకు అలంకరించిరి. పుత్రుని యందు గల ప్రేమచే కౌసల్యాదేవి సంతోషముతో ప్రయత్న పూర్వకముగా సర్వవానర స్త్రీ సమూహములకు తగిన విధముగా భూషణముల నలంకరించెను.

## శ్రీరామాదులయోధ్యకు ప్రయాణమగుట:

అంతట శత్రుఘ్నుడు చెప్పగా సుమంత్రుడు సూర్యమండలసమానమై – సర్వాంగశోభితమె దివ్యమైన రథమును సిద్ధము చేసి త్వరితముగా తేగా ఆజానుబాహుడును, తామరల వంటి విశాలనేత్రములు గలవాడును పరాక్రమమవంతుడును అగు రాముడు ఆ రథము నెక్కి బయలుదేరెను. స్నానములు చేసి దివ్యమైన వస్త్రములను కుండలములు ధరించి దేవేంద్రునితో సమానమైన తేజస్సు గలవారై సుగ్రీవుడును, హనుమంతుడును

మహిమ వెలయరాముని రథము వెంట వెళ్లిరి. రత్నభూషణములను దివ్యములైన చెవి కమ్మలను ధరించి వానర స్త్రీలందఱును జనకరాజపుత్రితో గలిసి అయోధ్యా పట్టణమును జూచు కోరికతో మనస్సులందు సంతోషమును బొందుచు ఇంతింతనరాని క్రొత్త యుత్సాహము గలవారై వెళ్లిరి. మునుముందుగనే దశరథుని మంత్రులగు అశోకుడు సుమంత్రుడు, విజయుడు అనువారలు పురోహితునితో గూడి ఆలోచించుటకై అయోధ్యా పట్టణమునకు వెళ్లి రాముని పురోభివృద్ధిని, ప్రజల శ్రేయస్సును కోరినవారై ఇట్లనిరి. అయ్యా! పురోహితశ్రేష్ఠా! అర్థమైన విధముగా జయమును పొందిన మహానుభావుడైన శ్రీరామచంద్రుని మంగళప్రదమైన శ్రేష్ఠమైన పట్టాభిషేకార్థమై కావలసిన పనులెల్లను నిప్పుడే సమకూర్పుడు అని చెప్పి శ్రీరామచంద్రుని దర్శింపవలెనను తలంపుచో పురము నుండి బయలు వెడలి వచ్చిరి. పుడమి జనులచే పొగడబడిన ఆ రాముడు పచ్చని గుఱ్ఱములు గట్టిన రథము నందున్న ఇంద్రుని విధముగా రథముపై గూర్చున్న వాడై అతిశయించుచున్న సంతోషముతో ప్రకాశమానమైన తన శరీరకాంతులు ప్రజలకు మిరుమిట్లు గొలుపగా పురము నందు విశాలమైన నగర రాజమార్గముల వెంట ఊరేగెను. సంతోషముతో పగ్గములు చేత బట్టి భరతుడు నొగలపై కూర్చుండి సారధ్యము చేసెను. శత్రుఘ్నుడు శ్రేష్ఠమైన తెల్లగొడుగు బట్టెను. లక్ష్మణుడు రాముని శిరస్సుపై వీవన వీచుచు, మఱి యొక చేతితో తెల్లని చామరమునుబట్టి నిలిచి యుండెను. (అహం సర్వం కరిష్యామి యని చెప్పినవాడు గావున లక్ష్మణుడు రెండు చేతుల రెండింటిని ధరించెను.) గొప్ప కీర్తి గలిగిన విభీషణుడు చంద్ర సదృశమైన మఱియొక చామరమును బట్టెను. ఆకాశము నిండునట్లు నిలిచియున్న దేవతలు మునులు చేసిన మధురమైన స్తోత్రములు వినిపించెను. పర్వత సమానమైన శత్రుంజయమను గజమునెక్కి సూర్యపుత్రుడు సంతోషముతో వచ్చెను. మనుష్య రూపములు దాల్చి వానరులందఱును అనేక విధములైన ఆభరణములను ధరించి ఇంపుగా ఒక తొమ్మిది వేల యేనుగుల మీద సంతోషముతో వెళ్లిరి. దుందుభుల పెను మ్రోతలు సంఘములుగా శంఖములు పూరించుట వలని మ్రోతలును, ఇతరవిధములైన వాద్యముల ధ్వనులును సందడులు చేయగా పురుషులలో శ్రేష్ఠుడైన రాముడు మేడల వరుసలను చూచుచు వెళ్లెను. అతిరథుడైన వాడును, తన మనోహరమైన శరీరముతో ప్రకాశించుచున్నవాడును, కోటాను కోట్ల ప్రజలచే సేవింపబడుచున్నవాడును అయిన శ్రీరఘురాముని జూచి మంత్రులు తగిన విధముగా దగ్గఱకు వచ్చి దీవెనలతో

మనస్సునకు సంతోషమును గలిగింపగా ఆ రాముడు ఎంతయో గౌరవమయిన మాటలచే తన హితులైన మంత్రులను సంతసింపజేసెను. వారును తమ్ములతో గలసి వెంట వచ్చిరి. ఇట్లు మంత్రులు, పౌరులు, బ్రాహ్మణులు ప్రాభవముతో నున్న తనను సేవించుచుండగా సీతానాధుడు సాటిలేని అమితమైన కాంతితో చుక్కలతో ప్రకాశించు చంద్రునకు సరిసాటియై వెలుగొందెను. మంగళ వాద్యములందముగా మ్రోగుచుండగా, తాళములు వాయించువారు తమ నేర్పును కనిపింపజేయగా, స్వస్తిక వాద్యముల వారు సామర్థ్యమును జూపగా, సంతోషముతో కొందఱు గీతములను పాడుచుండగా, వాద్యవిశేషములన్నియు ఇంపుగా మ్రోగుచుండగా, వీరభటులు తమ ప్రతాపములను కనిపింపజేయగా, పచ్చని అక్షతలను బట్టుకొని బ్రాహ్మణులును, కన్యలును, గోవులును ముందు నడువగా, రామచంద్రుడు మంత్రులతో సుగ్రీవునితో తన స్నేహమును, ఆంజనేయును గొప్పదనమును, వానరుల గొప్పవైన కార్యములను, విభీషణుడు వచ్చి కలియుటయును విశదమైనవిధముగా చెప్పెను. ఆ రాజచంద్రుని వాక్యములను లోకులందఱును ఆశ్చర్య సముద్రమున మునిగి వినుచుండ సంతోషముతో నిండిన ప్రజలతో గూడినదియు, జెండాతో అలంకరింపబడిన గృహములతో నొప్పునదియు అగు అయోధ్యను ప్రవేశించెను. ఇక్ష్వాకు వంశీయులకు ప్రీతికరమైన తండ్రి మందిరమును రఘువంశీయులకు ప్రీతికరమైన తండ్రి మందిరమును రఘువంశశ్రేష్ఠుడు సంతోషముతో బ్రవేశించెను. వేగముగా సవినయముగా తల్లులకు ముగ్గురకును సాష్టాంగపడి నమస్కరించెను. అంతట అర్థయుక్తమైన హితములు మధురములైన మాటలతో భరతునితో నిట్లనెను. ఓ భరతా! గొప్ప విశాలమయినదియు, అశోకవనము గలదియు, విలువైన ముత్యములు, మణులు, వైడూర్యములు పొదిగినదియు అగు నా మందిరము నందు వానరరాజును ప్రవేశపెట్టుము అని చెప్పగనే సుగ్రీవుని చేతిని చేతితో బట్టుకొని తోడ్కొని వేగముగా పోయి సంపదతో మనోహరమైన ఆ భవనము నందు ప్రవేశపెట్టెను. అప్పుడు శత్రుఘ్నుని ఆజ్ఞతో సేవకులు ఆ మందిరమున తైల దీపములును, సుందరమైన మంచములును, ఆసనములును కేళీ తల్పములును మొదలగు చాలావస్తువులనుంచిరి. భరతుడు వానర రాజుతో మహాత్మా! రాముని పట్టాభిషేకము వేడుకగా జరిగించుటకై పుణ్యతీర్థములకు వెళ్లి తీర్థజలములను తెచ్చుటకు వేగముగా దూతలనాజ్ఞాపింపుమని చెప్పగా సూర్యపుత్రుడైన సుగ్రీవుడు శూరులైన వానరులను నల్వురను పిలిచి నాలుగు

బంగారు బిందెలనిచ్చి వీటిని తీసికొని వేగముగా వెళ్లి నాలుగు సముద్రముల జలములను తీసికొని ప్రభాత సమయమునకు ముందుగా రండు అతి వేగముగా వెళ్లుడు. వచ్చి ఇచ్చటనే మాకొఱకై యెదురుచూచుచుండుడు. అని చెప్పగా ఏనుగులతో సమానమైన వానరులు ఆకాశమున కెగిరి ఆ గరుత్మంతుని వలె అతివేగముగా వెళ్లిరి. అట్లు వెళ్లి వాయుపుత్రుడైన హనుమంతుడును, వేగదర్శియు, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుడును, ఋషభుడును, దివ్యతీర్థజలములతో నిండిన బంగారు బిందెలను ఒక్క ముహూర్తములో వేగముగా దెచ్చిరి. ఐదు వందల నదుల నుండి పుణ్యతీర్థములను బంగారు బిందెలలో నింపి తెచ్చి కొందఱు వానరులు ఆ మందిరము నిండ మనోహరముగా వరుసలుగా నిల్పిరి. సుందరముగా మణుల లంకరించిన కలశమును బట్టుకొని తూర్పుసముద్రమునకు వెళ్లి బలసంపన్నుడైన సుషేణుడు భక్తితో ఆ జలములను అందముగా తీసికొనివచ్చెను. వేఱొక ఋషభుడను వానరుడ దక్షిణ సముద్రమునకు వెళ్లి ఎఱ్ఱచందనపు చెట్టు కొమ్మలను గట్టిన పెద్ద బంగారు బిందెతో ఆ జలమును కడువేగముతో తెచ్చెను. గవయుడనువాడు పడమటి మొగముగా సముద్రమునకు వెళ్లి సుందరముగా రత్నములు పొదిగిన కలశముతో ఆపవిత్ర తీర్థమును వాయువేగముతో స్వల్పకాలములోనే శక్తితో తీసికొని వచ్చెను. ఉత్తమ గుణములు గలవాడును సజ్జనులలో శ్రేష్ఠుడునైన నలుడు వాయువేగము, గరుత్మంతుని వేగములతో ఉత్తర సముద్రమునకు వెళ్లి భక్తి నిండిన మనస్సుతో ఆ జలములను దెచ్చెను. ఇట్లు వానరశ్రేష్ఠులందఱును తెచ్చిన జలములన్నింటిని చూచి శత్రుఘ్నుడు సంతోషించి మంత్రులతోను, మిత్రులతోను, పురోహితులతోను రామచంద్రునకు పట్టాభిషేకమును జరిగింపుడని చెప్పెను.

## శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ ఘట్టము:

అంతట శాంతుడు వృద్ధుడునైన వశిష్ఠుడు బ్రాహ్మణశ్రేష్ఠుల గుంపులతో గలసి మణులతో ప్రకాశించుచున్న రత్న సింహాసమున భూపుత్రితో సీతానాధుని గూర్చుండబెట్టెను. తరువాత వసిష్ఠుడు, కాత్యాయనుడు, జాబాలి, కాశ్యపుడు, విజయుడు, గౌతముడు, వామదేవుడు, సుయజ్ఞుడు మొదలైన శ్రేష్ఠులందఱును వసువులు ఇంద్రుని నభిషిక్తుని జేయు విధముగా కమ్మనివాసనలతో ఘుమ్మను నిర్మలమైన జలములతో సంతోషముతో అభిషిక్తుని జేసిరి. తరువాత ఋత్విక్కులయిన బ్రాహ్మణుల సమూహమును, కన్యలును, మంత్రులును, యోధులును, పౌరముఖ్యులును దివ్యమైన ఓషధీరసముల చేత

ఆకాశమున మూగియున్న దేవతలతో దిశాధిపతులతోను అభిషేక కార్యమును పూర్తి చేసిరి. తరువాత, బ్రహ్మచే నిర్మింపబడి (ఇది మూలమున ప్రక్షిప్తము) బహురత్నములచే శోభిల్లుచున్నదియు, తేజస్సుచే ప్రకాశించు మనువు పూర్వము పట్టాభిషిక్తుడగు సమయమున తాల్చినదియునై తరతరములనుండి ఆ వంశపురాజులందఱు తప్పక పట్టాభిషేక సమయమున ధరించునదియు అగు కిరీటమును సకలమహాజనులతో నిండి శోభిల్లుచున్నదై బంగారముచే నిర్మితమయి, మనోహరమై అనేక విధములైన అమూల్యమైన మణిసమూహములతో ప్రకాశించుచున్న సభయందు దేదీప్యమానముగా నున్న రత్న పీఠమున శాస్త్రోక్తప్రకారముగా ఉంచి పూజించి తరువాత సంతోషముతో వేదములు తెలిసిన ఋత్విక్కులతో గూడి వసిష్ఠమౌని మనోహరమైన అలంకారములతో రామచంద్రుని సమ్మతితో మంగళవాద్యముల ధ్వనులు మ్రోగుచుండగా ధరింపజేసెను. ప్రశస్తము మంగళప్రదమునైన పాండవర్ణపు గొడుగును భక్తితో శత్రుఘ్నుడన్నకు బట్టెను. సుగ్రీవుడు తెల్లని చామరములను రాక్షసరాజగు విభీషణుడు పట్టెను. దేవేంద్రునిచే ప్రేరితుడై వాయుదేవుడు నూరు కమలములతో గూడినదియు దగద్ధగితమైన తేజస్సు గలదియు అయిన బంగారు మాలికను ఇచ్చెను. సర్వమణులచే గూర్పబడినదియు, దివ్యరత్నము నాయకమణిగా విరాజిల్లునదియు ముత్యముల సమూహములతో మనోహరమైనదియు అగు హారమును తీసికొని వచ్చి సంతోషముతో సమర్పించెను. ఆకాశమునందుండి గంధసిద్ధులందఱును గుంపులు గుంపులుగా గూడిరి. రాముని అభిషేక విధిని జూచి మౌనులు తమ భయమును వీడిరి. భూమి యంతయును పైరులతో పచ్చగా నిండియుండెను. అన్ని చెట్ల యందును ఫలములు నిండుగా నుండెను. ఆ పట్టాభిషేకమహోత్సవ సమయమున అన్ని ప్రదేశములందును పుష్పముల సువాసనలు నిండెను. ఎక్కువైన ఆనందముతో ఉదారముగా రాఘవుడు నూఱు వేల గుఱ్ఱములను లక్షగోవుల సమూహమును, సాటిలేని బలము గల నూఱు కోడెలను బ్రాహ్మణుల కిచ్చెను. ఇంకను ఆ ఇంద్ర సమానుడు గొప్ప విలువైన పట్టు వస్త్రములను, అనేకమైన విభూషణములను, ముప్పదికోట్ల దూడలను విలాసముగా దానము చేసి సూర్యకిరణ ప్రకాశము గల దివ్యరత్నములు పొదిగిన బంగారు హారమును రామభద్రుడు ప్రీతితో సుగ్రీవునికిచ్చెను. వజ్రమణులతో అలంకరిపంబడినదియు వైడూర్య మణులచే చిత్రింపబడినదియునై గొప్ప కాంతితో సుందరమైన బాహుపురులను రాముడు దయతో

అంగదునకిచ్చెను. శ్రేష్ఠమైన మణులతో నిండియుండి పరిపూర్ణ చంద్రమండలముతో సమానమైన కాంతులు గల్గి సుందరమై ఉత్తమోత్తమమై అందమైన ఆణిముత్తెములు గూర్చిన మేలైన హారమును జనకరాజపుత్రియైన భూపుత్రీ రత్నమునకు అత్యమితమైన ప్రేమతో రఘురాముడిచ్చెను.

## శ్రీ సీతాదేవి హనుమంతుని బహూకరించుట:

స్వచ్ఛమైన సుదుకూలములను బంగారు ఆభరణములను జానికీ దేవి తన భర్తయైన రామచంద్రుని చూచుచు సద్గుణమణులకు నిధివంటివాడైన గాలిముద్దు బిడ్డడగు హనుమంతునకు ప్రీతితో నిచ్చెను. అట్లిచ్చియు తృప్తిలేనిదై జనకరాజపుత్రి తన కంఠసీమ యందు ముచ్చట గలుగజేయుచు కాంతిపుంజములు వెదజల్లుచున్న హారమును హెచ్చైన ప్రీతితో చేతితో తీసికొని వానరుల నందఱను జూచుచు చనవుతో తన ప్రాణనాథుడైన రాముని ముఖమును మాటిమాటికిని జూచెను. శ్రేష్ఠమైన ముత్యాలహారమును చేత బట్టుకొని తన్ను జూచుచున్న సీతాదేవి ఆలోచన తెలిసికొన్నవాడై రఘురాముడిట్లనెను. ఓ అలివేణీ! నీకు సుగుణ సమూహముచే నెవ్వడు మెప్పుగలిగించెనో, కల్యాణీ! యెవ్వడు తన బుద్ధి బలపరాక్రమములతో నెప్పుడును ఒప్పుచుండునో వానికీ హారమునిమ్ము అని చెప్పగనే కలువలవంటి కన్నులు గల సీతాదేవి దానిని వాయుపుత్రుడైన హనుమంతున కొసంగెను. ఆ హారమును ధరించి హనుమంతుడు చంద్రకిరణములచే తెల్లనైనదియు, తెల్లని మేఘములతో గూడినదియు అయిన కొండవలె ప్రకాశించెను. తరువాత మైందునకును, ద్వివిదునకును, నీలునకును వారు వారు ప్రీతితో కోరిన శ్రేష్ఠమైన తగిన వస్తుతతులను అన్నింటిని వేరువేరుగా రామవిభు డొసంగెను. వానర వృద్ధులకును, వానరనాథులకందఱకును యోగ్యముగాను తగినవిధముగాను గౌరవించి వస్త్రములును, బంగారు భూషణములును ఇచ్చి వారికందఱకు తృప్తి గలిగించెను. ఈ విధముగా రాక్షసులు కోతులు, ఎలుగుబంట్లు హనుమంతుడు, ఎల్లవానరులును మణులు, భూషణములు మొదలగు కోరిన వస్తువుల నన్నింటి సంతోషముగా పొంది భూపుత్రి భర్తయైన రామచంద్రుడిచే ఆజ్ఞను పొంది తమతమ ప్రదేశములను చేరబోయిరి. వానరశ్రేష్ఠులు సీతానాధుని పాదములకు నమస్కరించి ఆతని అనుమతితో కిష్కింధాపురమునకేగిరి. అట్లే సూర్యపుత్రుడైన సుగ్రీవుడును రామరాజు అనుమతి పొంది వెళ్లెను. (ఇది యుత్తర కథ సూచించుటేకాని గ్రంథసమాప్తిగా జెప్పినది కాదు. తరువాతి సర్గకథను పూర్వసర్గాంతమున

బెక్కుచోట్ల సూచించినట్లే యిదియు. ఇట్టి సంగ్రహవాక్యములు వ్యాసవాక్యములకు ముందు కావ్యముల మధ్యముననను కానవగును. చూడుడు 2956-2960 వఱకు పద్యములు) కులధనమును గ్రహించి రఘురామునిచే అనుజ్ఞ పొంది చాలా నెమ్మదిగా విభీషణుడు లంకకు వెళ్లెను. (కులధనము = ఇక్ష్వాకువంశజ్ఞుల కుల ధనమును శ్రీరంగనాధమూర్తి నని పురాణాంతరముల గలదు) అంతట గొప్ప యశస్సు గలవాడును, విరోధుల నందఱను సంహరించినవాడును, దాతలలో శ్రేష్ఠుడును, అయిన రాఘవుడు తృప్తినొందినవాడును, హర్షమునొందినవాడును అయి ఈ భూమి నంతను నీతితో పరిపాలించెను. ధర్మము నందు వాత్సల్యము గల భూపుత్రి భర్త చనవుతో సుమిత్రానందనునితో నిట్లనెను. ధర్మజ్ఞా! పూర్వరాజుల చేత పాలింపబడిన యీ ధరారాజ్యమును నీవు బల శౌర్యములతో నాతో సమానముగా ప్రీతితో పాలింపుము. ఇది కుల క్రమాగతమై యిట్లు వచ్చినది. యౌవ రాజ్యభారమును నీవు వహింపుమని రాముడెన్నెన్ని విధములుగా చెప్పినను లక్ష్మణుడు దాని నంగీకరింపడయ్యెను. (రాజ్యము కైంకర్య విఘ్నకారి కనుక) ఆ యయోధ్యారాజ్యమునకు భరతుని యువరాజుగా నిల్పి రాముడు అశ్వమేధము, పౌండరీకము మఱియు వాజపేయము మొదలైన చాలాయజ్ఞములను చేసెను. మోకాళ్ల వఱకు నున్న పొడవైన గడియమ్రానుల వంటి బాహువులు గలవాడును, సాటిలేని పరాక్రమము గలవాడును, కీర్తింపబడు గుణములు గలవాడును, దృఢమైన భుజాగ్రములు గలవాడును, దివ్యమైన తేజస్సు గలవాడును, లక్ష్మణుడు సేవకుడుగా గలవాడును, లోకముచే పొగడబడిన వాడును అయిన శ్రీరామవిభుడు మేలైన విధముగా శ్రేష్ఠమైన రాజ్యమును పొంది ధర్మాత్ముడై పదివేలయేండ్లు రాజ్యపాలనము చేసి ఉత్తమమైన గుఱ్ఱములను విడిచిపెట్టియు, మిక్కిలి హెచ్చైన దక్షిణలనిచ్చియు జ్ఞాతులతోను బంధువులతోను, స్నేహితులతోను, హితులతోను గలసి ప్రఖ్యాతి గలుగునట్లుగా నూఱశ్వమేధములను జేసి యింకను అనేక విధములైన యజ్ఞములను జేసెను. ఆ రాముడు రాజ్యమును పాలించుచుండగా మనోవ్యథలు లేకుండెను. జనులు సర్పభయము నెఱుగరు. స్త్రీలెప్పుడును వైధవ్య దుఃఖమును పొంది యెఱుగరు. ఎచ్చటను వ్యాధులు లేకుండెను. (కౌసల్యాదులకు వైధవ్య ప్రాప్తి శ్రీరామరాజ్యమున గాదని యెఱుంగునది). శ్రీరాముడు రాజ్యమేలు నపుడు దొంగలను పేరు జనులు విని యెఱుగరు. ఆ రాజ్యమున నున్నవారి కొక్క యనర్థమైనను కలుగలేదు. ఆ రాజ్యమున పెద్దలు చిన్నవారికి ప్రేతకార్యములను చేసి యెఱుగరు. సర్వరాజ్యము

రామునే ఎల్లప్పుడు స్మరించుచు ధర్మబుద్ధితో గూడినదై సంతోషభరితముగా నుండెను. ప్రజలు ఒకరినొకరు హింసించు బుద్ధిలేనివారై కలిసియుండిరి. చాలామంది పుత్రులు గలవారై రోగములు లేనివారై క్షేమము సంతోషము నిండుగా గల్గి ఆ పట్టణము నందు ఏండ్లు పూండ్లుగా నివసించిరి. రాముడు సమస్తమైన ధరణీరాజ్యము నేలుచుండగా ప్రజలు రాముడు, రాముడు, రాముడు, రాముడు అని అనుచు అతని కథలు వర్ణించుచుండగా భూమియంతయును రామమయమయ్యెను. రాముని పరిపాలన యందు వృక్షములు ఎల్లప్పుడును పుష్పములు గలవై ఎల్లప్పుడును ఫలములు గలవై కొమ్మలు రెమ్మలు గలిగియుండెను. అప్పుడు కఱవుల భయము తొలగునట్లు కాలము తప్పకుండగా మేఘములు వర్షములు కురిసెను. అందముగాను భూప్రజలకానందకరముగాను నెమ్మదిగా మలయ మారుత మెప్పుడును వీచుచుండెను. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు లోభగుణము విడచినవారై శోభించుచు వారివారికి నియమింపబడిన వృత్తులచే తృప్తి జెందుచు, వారు వారు చేయదగిన కర్మలయందాసక్తి గలవారై బహుశుభ చిహ్నములు గలవారై భూమియందు వర్తిల్లిరి. పదివేల సంవత్సరములు మఱియు పది నూర్ల సంవత్సరములు (మొత్తము పదునొకండు వేల సంవత్సరములు) తన సోదరులతో గలసి సంతోషముతో శ్రీమంతుడును, భూమియందు ప్రఖ్యాతి చెందినవాడును అయిన శ్రీరామ విభుడీ విశ్వమును పరిపాలించెను.

**ఫలశ్రుతి:**

ఇది ఆది కావ్యము. ఋషిప్రోక్తమయినది. పూర్వము వాల్మీకి వ్రాసి ప్రకటపరచెను. (ఇది సీత వాల్మీకి ఆశ్రమమున నుండగా జెప్పబడినది గనుక పూర్వమనబడెను) ఇది ధన్యమైనది. ఆయుష్యము. గొప్ప కీర్తిని గలిగించునది. రాజులకు విజయము కలిగించునది. దీనిని పఠించినచో పాపములు తొలగును. పుత్రులు కావలెనని కోరువారికి పుత్రలాభమును, ధనము కావలెనని కోరువారికి చాల ధనములు లభించును. రామపట్టాభిషేక వృత్తాంతమును విన్నచో రాజులు విరోధి రాజులను గెలిచి రాజ్యపాలనము చేయుదురు. రామాయణమును రాముని విజయమును ప్రజలు విన్నచో ఆయువు వృద్ధి చెందును. రాముని చేత కౌసల్యయు, లక్ష్మణ శత్రుఘ్నులచే సుమిత్రాసతియు, భరతుని చేత శ్రీమతి యగు కైకేయియు ఒప్పినట్లు స్త్రీలు దీర్ఘాయువులగు పుత్రులచే వృద్ధినందెదరు. ఎవ్వడైనను

రోషమును విడచిపెట్టినవాడై శ్రద్ధ గలవాడగుచు మనస్సు నేకాగ్రముగా నిలిపి అర్షమైన పుట్టయందు బుట్టిన వాల్మీకి మహర్షి కృతమైన సత్కావ్యమును భక్తితో పఠించునో వాడు దుఃఖములను దాటగలడు రాముని శ్రీకటాక్షము చేత మనస్సునందు తలంచిన కోరికలను పొందగలడు. ఈ కావ్యమును విను ప్రజలయందు ఎల్లదేవతలును సంతోషము నందెదరు. భయంకరమైన భూతములు గ్రహములు భయపడి వారి యిండ్లనుండి పారిపోవును. రాజు పఠించినచో భూమిని జయించును. పరదేశమున కేగువాడు చదివినచో సుఖముగా ప్రయాణము చేయును. రజస్వలయయిన యువతి విన్నచో (ముట్టు స్నానమైన తరువాత పదమూడు దినముల వఱకు) శ్రేష్ఠగుణములు గల పుత్రులను గూడ పొందగలదు. పురాతనమైన ఈ యితిహాసమును మానవుడెవడైనను ఇష్టముతో పూజించి భక్తితో చదివినచో వాడు పాపముల పోనడచి దీర్ఘాయువును పొందును. శిరసా నమస్కరించచు దీనిని బ్రాహ్మణునిచే చదివించుకొని రాజు వినినచో ధనమును పుత్రలాభమును ముమ్మాటికి నిస్సంశయముగా పొందును. విడువని భక్తితో రామాయణము నంతను వినినను చదివినను అట్టివానిని నారాయణుడును ప్రభువు హరి ఆదిమదేవుడు పొడవైన బాహువుల గలవాడు లక్ష్మీనాధుడు విష్ణుడు సనాతనుడు తానే యగుటచే రాముడెప్పుడును కరుణాకటాక్షముతో జూచును. ఈ శుభప్రదమైన కావ్యమును సంతోషముతో విన్నచో ధనధాన్య వృద్ధి సంతానవృద్ధి శ్రేష్ఠగుణములు గల కులస్త్రీలతో సంబందము ఉత్తమములైన సౌఖ్యములు, అన్ని కోరికలు నెరవేరుట, అధికమైన ఐశ్వర్యమును పొందుటయు నరులకు ప్రాప్తించును. వారికి ఆయువును, కీర్తియు, ఆరోగ్యమును కలుగజేయును. సోదరులు గలిగియుండుట, సౌఖ్యము కలుగును. ఇది మంచి బుద్ధి నిచ్చును. ఓజస్సును కలిగించును. అట్టి ఈ పుణ్యకావ్యమును అభ్యుదయమును గోరి వినునట్టి సజ్జనులు నియమవంతులై నిశ్చలమైన మనస్సులతో వినవలెను. ఈ విధముగా హెచ్చు మహత్వము గల్గిన మణివంటి ఇట్టి పురాతనమైన కథను సంశయములను విడచి నిండు మనస్సుతో నమ్మి జనులారా! మీరు పఠింపుడు. దోషము లన్నియు దూరముగా తొలగిపోవును. మీకు అధికములైన శుభములు కలుగును. విడువకుండగా విష్ణుని మహామహిమోన్నతి వర్ధిల్లుగాక హెచ్చుగా వర్ధిల్లుగాక. రామాయణమును పఠించుట చేతను, రామకథను వినుటచేతను దేవతా సమూహములును, పితృదేవతలెల్లరును, తృప్తి నంది ఎల్లప్పుడును

సంతోషమును పొందెదరు. శ్రేష్ఠమగు విధముగా ఋషిచే రచింపబడిన ఈసంహితను రామచంద్రునియందు మిక్కిలి భక్తితో ఎవ్వడు వ్రాసినను వ్రాయించినను ( ఈ వాక్యము చేతను, శ్రీరామముద్రిక యందును, శ్రీరామబాణంబుల మీదను, శ్రీరామనామమును చెక్కినట్లు చెప్పియుండుట చేతను, లిపి లేఖనము పూర్వమున లేదను వాదము నిరాధారము) ఆ మానవునకు స్వర్గలోకనివాసము శాశ్వతముగా గలుగును. అని యిట్లు ఆర్షమును, ఆదికావ్యమును అయిన రామాయణమును పుట్టయందు పుట్టిన వాల్మీకి మహర్షి భూమి యందలి ప్రజలకుపకారము చేయు తలంపుతో సంహితగా రచించెను.

## యుద్ధ కాండాంత వాక్యములు:

సూర్యచంద్రులును కన్నులుగా ధరించినవాడా! సాగరమునే నివాసముగా జేసికొన్నవాడా! దేవేంద్రుని రక్షించినవాడా! భుజగేంద్రుని శయ్యగా జేసికొన్నవాడా! జానకీదేవి హృదయమే నివాసముగా గలవాడా! శ్రీరామా! నీకు జయము – జయము. మంచి స్వభావము గలవాడా! దుర్మార్గులను శిక్షించుట యందాసక్తి గలవాడా! దయకు ఆలవాలమైనవాడా! సాగరుని గర్వమణచినవాడా! పాపములను చెదరగొట్టినవాడా! దేనియందును తగుల్కొననివాడా! భక్తులను సంతోషపెట్టువాడా! ప్రఖ్యాతమైన కీర్తిగలవాడా! ముక్తి ప్రథమైన నామము గలవాడా! మేలునే కోరువాడా! ప్రఖ్యాతి గలిగిన ఒంటిమిట్టయందు విహరించువాడా! జానకీదేవి యొక్క హృదయకమలమును వికసింపజేయు సూర్యుని వంటివాడా!

ధైర్యము గలవాడా! మూడవేల ఆరు పద్యములచే స్తుతింపబడినవాడా! (రసఖాభ్రశుచి దృష్టిగత పద్యనుత!) దేవతా రక్షణకై గొప్ప యుద్ధములను చేసినవాడా! సూర్యవంశమున బుట్టినవాడా! దశరథ పుత్రుడా! పండితులకు మేలుచేయు గుణసముద్రుడా! శౌర్యవంతుడా! శ్రేష్ఠమైన బుద్ధిగలవాడా! విశిష్టమైన రథికుడా! విదేహరాజపుత్రికి భర్త యైనవాడా! వజ్రములు మణులు బంగారముతో రమణీయమైన శ్రేష్ఠమైన వజ్రశము గలవాడా! పాలసముద్రమున పవళించి యున్నవాడా! రాజశ్రేష్ఠుడా! గుణములచే పవిత్రమైన మంగళకరమైన ఆచరణలు గలవాడా! భూమిని రథముగా జేసి కొన్న పరమశివునిచే నమస్కరింపబడినవాడా! ఓ శ్రీరామచంద్రా నీకివే నా నమస్కారములు.

## మంగళం మహత్

ఇది
శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానసయు
శ్రీమొలుగు వెంకట నృసింహాచార్య తనూజయు
శ్రీమత్పండిత మంత్ర రత్న బిరుదాంచిత శ్రీమత్తిరుమల
పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లంగారి ధర్మపత్నియు
అగు వెంకటసీతమ్మచే
శ్రీవావిలికొలను సుబ్బారాయప్రణీత శ్రీమదాంధ్రవాల్మీకి
రామాయణమునకు వ్రాయబడిన వచనానువాదము నందు యుద్ధకాండము

శ్రీసకల భువన సామ్రాజ్య లక్ష్మీకటాక్ష సిద్ధిగా శ్రీరామచంద్రార్పణమస్తు.

శ్రీజగన్మాత్రార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

నమోస్తు రామాయసలక్ష్మణాయ
నమోస్తుదేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభురేవరాయ
నమోస్తు వల్మీక భవాయ సత్మై

శుభం భవతు.